జి. ఓ. నెం 1636 ఎల్. ఎ తేదీ 11-జూలై 1958లో ఈ పుస్తకము పంచాయతీలు కొనుటకుగాను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము సిఫారసు చేసియున్నారు

# Government of Andhra Pradesh

## G. O. No 1636, L. A , dated 11th July, 1958.

---

**ORDER .**

The Government commend the purchase by all the Panchayats in the Andhra Region the book entitled "The Andhra Panchayat Law" compiled by Sri E L. Janardhana Rao, M A , Special Officer, Integration of Laws, Health and Local Administration Department, Government of Andhra Pradesh

2 The Inspector-General of Local Administration is requested to communicate the orders in paragraph 1 above to all the Panchayats in Andhra Region.

(By order and in the name of the Governor )

L. N GUPTA,
*Secretary to Government.*

(True Copy)

*Forwarded to*

The Inspector-General of Local Administration Hyderabad
The Regional Inspectors of Local Administration, Vijayawada, Rajahmundry and Cuddapah
All the District Panchayat Officers and Additional District Panchayat Officers in Andhra Region
The Examiner of Local Fund Accounts, Hyderabad-Dn
Copy to the Education Department
Copy to the General Administration Department
Sri E L Janardhana Rao, M A , Special Officer (for Integration of Laws), Health and Local Administration Department, Hyderabad

(By Order)

Y RANGANAYAKULU,
*Superintendent*

# ఆంధ్ర పంచాయతీ లా

(మద్రాసు విలేజి పంచాయతీ ఆక్టు, 1950, దాని క్రింద
జారీచేయబడిన విధులు, ప్రభుత్వపు ఉత్తరువులు-
1-10-60 వఱకు సవరణ చేయబడినది )


సంపాదకుడు

ఇ. యల్. జనార్దనరావు, ఎమ్ ఏ,
స్పెషల్ ఆఫీసరు (ఇంటెగ్రేషన్ ఆఫ్ లాస్)
హెల్తు అండ్ లోకల్ ఎడ్మినిస్ట్రేషన్
డిపార్టుమెంటు
గవర్నమెంటు ఆఫ్ ఆంధ్ర ప్రదేశ్.


PRICE Rs **10-00**

---


Published by E L Janardana Rao, 211/3 R. T
Vijayanagar Colony, Hyderabad - 4
Printed by Sri Anjaneya Power Press, Eluru.

## సంపాదకుని పీఠిక

ఆంధ్ర స్టేటులో 11 జిల్లాలకు మాత్రమే యీ పుస్తకము సంబంధించినది ఈ 11 జిల్లాలలోను యిట్టి పుస్తకముయొక్క ఆవశ్యకత చాలాకాలమునుండి గోచరమగుచున్నది ఈ జిల్లాలలో సుమారు 10,000 పంచాయతీలున్నవి వాటిలో సుమారు రెండు వంతులు క్రొత్తగా నిర్మింపబడినవి అన్ని పంచాయతీలు కూడ మొట్టమొదట, మద్రాసు గ్రామ పంచాయతీల ఆక్టు 1950 ను, మరియు దానియొక్క సవరణలను, దానిక్రింద చేయబడిన విధులను, ఆర్డర్లను, సూచనలను, అప్పుడప్పుడు జారీచేయబడిన ప్రకటనల నకళ్ళను సంపాదించవలెను

2 ఈ యాక్టు విశేషమైనది సాధారణముగ, ఏ చట్టములోనైనా, చట్టపరిపాలనార్థము, విధులు, ఉపవిధులు మొదలగు ఉపశాసనములు చేయవలసి యుండును కాని మద్రాసు పంచాయతీ చట్టముక్రింద, ఉపశాసనములవసరమైన విషయములు, అసాధారణముగ హెచ్చు, చట్టము అచ్చున 63 పుటలు, కాని దానిక్రింద జారీ చేయబడిన ఉపశాసనములు అచ్చులో, 300 కు మించినపుటలు నిండును ఈ ఉపశాసనములు లేకుండ, చట్టము మిక్కిలి అసంపూర్ణము అర్థము కాదు

3 ఈ విధులు కొన్ని కొన్ని వరుసలుగా జారీచేయబడి ప్రచురింప బడినవి ఆయాసెక్షనుల క్రింద జారీచేయబడిన విధులను వెదకి, కనుగొనుట, అనుభవమున్న సంపాదకునకు కూడ మిక్కిలి కష్టసాధ్య మయ్యెను అనేకములైన ప్రకటనల గందర గోళములో, సరియైన విధులను వెదకి, అన్వయించుట పంచాయతీలకు యింకా యెంత కష్టతరముగా నుండును సరియైన విధులయొక్క జ్ఞానము పంచాయతీలకు లేక పోవుటకు యీ చికాకే కారణముగా కన్పట్టు చున్నది. అందువలన సంపాదకుడు, పంచాయతీ యాక్టును, ఆయా

సెక్షనుల క్రింద జారీచేయబడిన విధులను, ప్రభుత్వముయొక్క ఆర్డర్లను, వేరువేరుగా ముద్రించి, యీపుస్తకమును తయారుచేసెను ఈ చట్టమును సరిగా అర్థము చేసుకొని, అన్వయించుకొనుట కనుకూలముగా నుండునట్లు, అక్కడక్కడ ప్రత్యేక సూచనలను యిమిడ్చెను.

4 చాలకాలమునుండి యున్న యీ కొరతను తీర్చుటకుగాను, యీ పుస్తకమును సంపాదకుడు పంచాయతీలకు సగౌరవముగ అర్పించుచున్నాడు ఏవైన లోపములున్నయెడల వాటినిసవరించుటకు సంసిద్ధముగ నున్నాను.

హైదరాబాద్.
1—3—1958.

ఇ. ఎల్. జనార్దనరావు.

# ఆంధ్ర పంచాయతీల చట్టము

ప్రథమ చట్టము, మరియు దానిని సవరణచేసిన చట్టములపట్టీ

1. మద్రాసు గ్రామ పంచాయతీల యాక్టు, 1950 (మద్రాసు యాక్టు x ఆఫ్ 1950) ఆంధ్ర రాష్ట్రమునకు అన్వయించ బడినది.

2. మద్రాసు జిల్లా మ్యునిసిపాలిటీల, జిల్లాబోర్డుల, మరియు గ్రామపంచాయతీల (సవరణ) యాక్టు, 1951, (మద్రాసు యాక్టు, XXIV ఆఫ్ 1951 ,

3 మద్రాసు గ్రామపంచాయతీల (ఆంధ్ర సవరణ) యాక్టు 1954, (ఆంధ్ర ఆక్టు ఆఫ్ 1954)

4 మద్రాసు గ్రామపంచాయతీల (ఆంధ్ర సవరణ యాక్టు, 1955.)

(ఆంధ్రయాక్టు XV ఆఫ్ 1955)

5. మద్రాసు గ్రామపంచాయతీల (ఆంధ్ర రెండవ సవరణ) యాక్టు, 1955.

(ఆంధ ఆక్టు XXII, 1955)

6. మద్రాసు గ్రామపంచాయతీల (ఆంధ్ర సవరణ) యాక్టు, 1956 (ఆంధ్ర ఆక్టు XXVI , 1956)

---

*ఈ యాక్టు, ఆంధ్ర యాక్టు, XXII ఆఫ్ 1955 యొక్క 11 వ సెక్షనుచే అతిక్రమించ బడినది.

# ఆంధ్ర పంచాయతీ చట్టము



## వి ష య సూ చి క

## 1 వ అధ్యాయము

## III వ అధ్యాయము

### పంచాయతీల విధ్యుక్త కార్యములు, అధికారములు

# IV వ అధ్యాయము

## పన్నులు - ధనము

## V వ అధ్యాయము

### పబ్లికు నీటి పారుదలలు (నీటివసతులు)

ఆంధ్ర పంచాయతీల క్రమ నిర్వహణచట్టము

# 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టు

## 1950 వ సం॥పు నె 10 రు మదరాసు ఆక్టు

[1950 వ సం॥ జూలై 15 వ తేదీన రాష్ట్రపతి అంగీకారమును పొందినదై, 1950 వ సం॥ ఆగష్టు 1 వ తేదీన "ఫోర్టుసెంటు జార్జి గెజెటు"లో మొదటిసారిగా ప్రకటింపబడినది]

గ్రామ వ్యవహారములయొక్క పరిపాలనను పంచాయతీలు జరుపుటకొరకు ఇప్పటికంటెను మంచి యేర్పాటు చేయుటకైన ఆక్టు.

గ్రామ వ్యవహారములయొక్క పరిపాలనను పంచాయతీలు జరుపుటకొరకు యిప్పటికంటెను మంచి యేర్పాటు ఒక ప్రత్యేక శాసనములో చేయుట యుక్తముగానున్నందున, ఇందుమూలమున ఈ క్రింది విధముగా శాసించడమైనది —

సంపాదకుని సూచిక

గ్రామ పంచాయతీ "గ్రామములోని వ్యవహారము" లను పరిపాలించవలెనను ఉద్దేశము పై ఉపోద్ఘాతములోనున్నది ఇది మిక్కిలి విరివిగల పదము ఈ గ్రామ వ్యవహారములు ఏవియో ఆక్టుయొక్క 51 మొదలు 61 వ సెక్షనులలో నిర్వచింపబడినవి

### 1-వ అధ్యాయము

1 (1) ఈ యాక్టును 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టు అని చెప్పవచ్చును

(2) ఇది మదరాసు పహరుకును, 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టుచే పరిపాలించబడు మునిసిపాలిటీలకును, 1924 వ సం॥పు కంటోన్మెంట్ల ఆక్టుచే పరిపాలించబడు కంటోన్మెంట్లకును తప్ప మదరాసు రాజ్యమంతటికిని వ్యాపించును

(3) ఇది గవర్నమెంటువారు ఫోర్టుసెంటుజార్జి గెజెటులో ప్రకటన మూలముగా నిర్ణయించగల తేదీన అమలులోనికి రావలెను.

సంపాదకుని సూచిక

ఈ ఆక్టు 1-4-51 వ తేదీని అమలులోకి తేబడినది

(జి. ఓ నెం 2330 ఎల్ ఎ, తేదీ 5-12-50)

2 ఈ ఆక్టులో విషయమునందుగాని, పూర్వోత్తర సందర్భము నందుగాని విరుద్ధమైన దేదైన నుండిననే తప్ప-

(1) 'కట్టడము' అను మాటలో ఒక ఇల్లు, విడిగానుండు ఇల్లు, గుర్రపుసాల, పాయిఖానా, పాక, గుడిసె (ఎనిమిది అడుగులకు మించని ఎత్తులో ప్రహరీ గోడకానట్టి ఇతర) గోడ మరియు తాపీపని ఇటుకలు, ప్రూను, బురద, లోహము లేక ఏ యితర పదార్థముతోనైన చేయబడిన అట్టి ఏ యితర నిర్మాణమైనను చేరును.

(2) 'ఆకస్మిక ఖాళీ' అనగా కాలము చెల్లిపోవుటవలనగాక యితర విధమున సంభవించు ఖాళీయనియు, 'ఆకస్మిక యెన్నిక' అనగా ఆకస్మికముగ కలిగిన ఖాళీని భర్తీచేయుటకు జరుపబడు యెన్నిక యనియు అర్థము,

(3) 'కలెక్టరు' అనగా రెవిన్యూజిల్లాయొక్క కలెక్టరు అని అర్థము,

(4) 'కంపెనీ' అనగా 1913 వ సం॥పు ఇండియా దేశపు కంపెనీల ఆక్టులో నిర్వచించబడినట్లుండు లేదా యునైటెడ్ కింగ్‌డముయొక్క పార్లమెంటు తాలూకు ఆక్టునుబట్టి లేదా రాయలు చార్టరునుబట్టి లేదా లెటర్సు పేటెంటునుబట్టి లేదా బ్రిటిషువారి స్వాధీనమందున్న దేశముయొక్క చట్టనిర్మాణసభయొక్క ఆక్టును

బట్టి నిర్మింపబడినట్లుండు కంపెనీ అని అర్థము. మరియిన్ని సంఘీభూతము చేయబడియున్నను లేకపోయినను, దాని ప్రధాన వ్యాపారస్థానము మదరాసు రాజ్యములోనున్నను లేకపోయినను, సదరు రాజ్యములో వ్యాపారమును చేయునట్టి యే ఫరమైనను లేదా అసోసియేషన్ (సంఘము) అయినను అందులో చేరియుండును ,

(5) 'జిల్లాబోర్డు' అనగా 1920 వ సం॥పు మదరాసు జిల్లా బోర్డుల ఆక్టుయొక్క 6 వ సెక్షను 1 వ సబు సెక్షనుక్రింద ఒక జిల్లాయొక్క స్థానిక పరిపాలన నిమిత్తము నిర్మింపబడిన సంస్థ అని అర్థము ,

(6) "ఎలక్షను అథారిటి" ఎన్నిక అధికారి అనగా పంచాయతీయొక్క ప్రెసిడెంటు లేదా వైస్-ప్రెసిడెంటు లేదా మెంబరు కానట్టి నిర్ణయింపబడగలట్టి అధికారి అని అర్థము ,

## విధి

4-6-1951 తేదీగల జి. ఓ నెం 1116, ఎల్ ఎ కు అనుబంధముగా ప్రకటింపబడిన 1 వ ప్రకటనక్రింద జారీచేయబడినవిధి :

## ఎన్నిక అధికారి

ఈ యాక్టుక్రింద నిర్మింపబడిన ప్రతి పంచాయతీ సందర్భములో, 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టుయొక్క అన్ని కార్యముల నిమిత్తము ఇన్‌స్పెక్టరు, ఎన్నిక అధికారిగా నుండవలెను

అయితే ప్రభుత్వమువారు, ఏ పంచాయితీ లేక పంచాయతీల తరగతి సందర్భములోగాని ఇన్‌స్పెక్టరునకు అదనముగా, సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువుద్వారా ఏ ఉద్యోగి లేక వ్యక్తినైన, ఈయాక్టుయొక్క అన్ని లేక ఏదైన కార్యము నిమిత్తము, ఎన్నిక అధికారిగా నియమించవచ్చును

సంపాదకుని సూచిక :

జిల్లా పంచాయతీ ఆఫీసర్లను, అడిషనల్ జిల్లా పంచాయతీ ఆఫీసర్లను, వారి వారియొక్క అధికారములోగల ప్రదేశములలో జరుపబడెడు, సాధారణ లేక తాత్కాలిక ఎన్నికలకు "ఎన్నిక అధికార్లుగా" ప్రభుత్వమువారు 10-3-1956 తేదిగల జి ఓ నెం 374 ఎల్ ఎ మూలముగా నియమించిరి (ఈ జి ఓ. 1-9-1951 తేదిగల జి ఓ నెం. 1732, ఎల్ ఏ ను రద్దు చేయుచున్నది) పంచాయతీ ఆఫీసర్లు ఎన్నికలకు నిర్ణయించబడినట్టి, ప్రకటింపబడినట్టి తేదీలను మార్చరాదని యీ జి ఓ. శాసించినది అట్టి మార్పులు న్యాయబద్ధములునుకావు కాని, ప్రకృతి మూలముగా, వరదలు, అగ్ని ప్రమాదములు మొదలయిన వాటివల్ల ఎన్నికలు జరుపుట దుస్సాధ్యమయిన ఎడల, అట్టి మార్పులు చేయవచ్చును నిర్ణయింపబడిన, ఎన్నికల తేదీలు ప్రకటింపబడుటకు పూర్వము, మార్చవచ్చును కాని అట్టి మార్పులను, పంచాయతీ ఆఫీసర్లు, రీజినల్ ఇనస్పెక్టరు ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్ వారికి తెలుపవలసినదిగా యీ జి ఓ. సూచించినది.

(7) "ఎగ్జిక్యూటివ్ అథారిటీ (కార్యనిర్వాహక అధికారి) –

(i) "ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు" (కార్యనిర్వాహకోద్యోగిని) కలిగిన పంచాయతీ సందర్భములో ఎక్జిక్యూటివు ఆఫీసరు మరియు ఎట్టి కార్యనిర్వాహకోద్యోగినిగాని ఛార్జి కలిగియుండని పక్షమున, పంచాయతీయొక్క ప్రెసిడెంటు అని అర్థము

(ii) ఏ ఇతర పంచాయతీ విషయములోగాని, దాని ప్రెసిడెంటు అని అర్థము ,

(8) (కార్యనిర్వాహకోద్యోగి) అనగా ఒక పంచాయతీయొక్క కార్యనిర్వాహకోద్యోగి అని అర్థము ,

(9) 'గవర్నమెంటు' అనగా రాష్ట్ర ప్రభుత్వము అని అర్థము ;

(10) 'ఇల్లు' అనగా ఉమ్మడి మార్గమునుండి ప్రత్యేకమైన ప్రధాన మార్గమునుకలిగి, కాపురముండునట్టిదిగానో మరియొక విధముగానో మనుష్యులు ఉండుటకు తగియుండు కట్టడము లేదా గుడిసె అని అర్థము, మరియు ఆ మాటలో యేదేని అంగడి వర్కుషాపు లేక గిడ్డంగి, లేక బస్సులను ఉంచుటకు లేక నిలిపియుంచు కట్టడము లేక ఒక బస్సుస్టాండు అని అర్థము ;

(11) 'గుడిసె అనగా ముఖ్యముగా కర్ర, తాటీఆకులు గడ్డి లేక పూరితో నిర్మింపబడిన ఏ కట్టడమైనను అని అర్థము. మరియు సదరు మాటలో ఏ పరిమాణమునైన కలిగియున్న ఏ తాత్కాలికపు నిర్మాణమైనను లేక పంచాయతీ ఈ యాక్టుయొక్క కార్యముల నిమిత్తము గుడిసెగా ప్రశిద్ధపరుపగల బాపతు ఏ పదార్థ ముతోనైనను నిర్మింపబడిన ఏ చిన్న కట్టడమైనను చేరును

సంపాదకుని సూచిక

'ఇల్లు' అను పదము 'గుడిసె'ను కూడ సూచించుచున్నది కాని, ముఖ్య విషయమేమనగా, "ఇల్లు"నకు, రోడ్డునుండి ప్రత్యేకమయిన ముఖ్య ద్వారముండ వలెను

"గుడిసెలు" యింటిపన్నునుండి తప్పించబడినవి కనుక "గుడిసె" అను యీ పదమునకు ప్రత్యేక నిర్వచనమున్నది. ఆక్టుయొక్క 64 వ సెక్షను చూడుము. ఏ నిర్వచనము గుడిసెయొక్క వైశాల్యమునకు, కట్టుటకు ఉపయోగించిన వస్తువులకు చెందియున్నది కాని యిందలి ముఖ్యవిషయ మేమనగా గుడిసెయొక్క వైశాల్యము, దాని నిర్మించిన వస్తువుల మాత్రముననే ఒక కట్టడము గుడిసె' అనరాదు పంచాయతీ దానిని "గుడిసె" అని ప్రకటన చేయవలెను ఇంటిపన్నులనుండి తప్పింపబడిన ప్రతి కట్టడముకూడ, పంచాయితీయొక్క తీర్మానముచేత, ప్రకటనచేత నిర్ణీతము చేయబడ వలెను.

(12) 'ఇన్‌స్పెక్టరు' అనగా మునిసిపల్ కౌన్సిల్సు యొక్కయు, లోకల్ బోర్డులయొక్కయు ఇన్‌స్పెక్టరు అని అర్థము, మరియు సదరు మాటలో ఈ ఆక్టు క్రింద ఇన్‌స్పెక్టరుయొక్క అధికారములను చెలాయించుటకు లేక విధులను నెరవేర్చుటకు, గవర్నమెంటు వారిచే అధికార మియ్యబడిన ఏ ఉద్యోగియైనను చేరును

సంపాదకుని సూచిక

"ఇన్‌స్పెక్టరు" అను పేరు "ఇన్‌స్పెక్టరుజనరల్ ఆఫ్ లోకల్ అడ్మిని స్ట్రేషన్" అని మార్చబడినది (చూడుము జి ఓ నెం 421, ఎల్, ఎ, తేదీ 20—4—1955)

(13) 'పాయిఖానా' అను మాటలో మరుగు దొడ్డియును, వాటర్ కాజెటును, మూత్రవిసర్జనస్థలమును చేరును,

(14) 'మెంబరు' అనగా ఒక పంచాయతీయొక్క మెంబరు అని అర్థము,

(15) 'సాధారణ ఖాళీ' అనగా నియమితకాలము గడచుట మూలముగా కలిగిన ఖాళీయనియు, 'సాధారణ యెన్నిక' అనగా ఒక సాధారణ ఖాళీని భర్తీచేయుటకు జరుపబడు యెన్నికయనియు అర్థము ,

(16) "పంచాయతీ" అనగా ఈ ఆక్టు ననుసరించి గ్రామము యొక్క స్థానికపరిపాలన నిమిత్తము యేర్పరచబడిన సంస్థ అని అర్థము,

(17) 'నిర్ణయింపబడిన' అనగా ఈ ఆక్టు ననుసరించి చేయబడిన విధులచే గవర్నమెంటువారివలన నిర్ణయింపబడిన అని అర్థము,

(18) 'ప్రెసిడెంటు' అనగా పంచాయతీయొక్క ప్రెసిడెంటు అని అర్థము,

(19) 'ప్రైవేటు రోడ్డు' అనగా 'పబ్లికురోడ్డు' కానట్టి యేదైన వీధి, రోడ్డు, చదరము, ముంగిటిబయలు, సందు, బాట, బండిబాట, కాలిబాట, లేదా సవారిబాట అని అర్థము కాని కట్టడము వగైరాయొక్క ఖామందు, అట్టి తన కట్టడము వగైరాకు పోవుటకుగాని లేదా దానిని అనుకూలముగా ఉపయోగించుకొనుటకు గాని తన స్వంత నేలమీద ఏర్పాటుచేసికొన్న బాట ఈ మాటలో చేరదు ,

(20) 'పబ్లిక్ రోడ్డు' అనగా ప్రజలచే సర్వసాధారణముగా నుపయోగింపబడునదైనను కాకున్నను, నడచిపోవుటకు వారికి హక్కుయున్నట్టిబాపతు యేదైన వీధి, రోడ్డు, చదరము, ముంగిటి బయలు, సందు, బాట, బండిబాట, కాలిబాట లేక సవారిబాట యని యర్థము, మరియు ఆ మాటలో –

(a) ఏదేని పబ్లికు వంతెనమీదనైనను గట్టుబాటమీద నైనను ఉండు రోడ్డు త్రోవయును

(b) అట్టి యేదేని రోడ్డుతో పబ్లిక్ వంతెనతో లేక గట్టు బాటుతో చేరియుండు కాలిబాటయును, మరిన్ని

(c) అట్టి యే రోడ్డుతో, పబ్లిక్ వంతెనతో లేక గట్టుబాటుతో నైనను చేరియుండు జలధారులును రోడ్డు త్రోవకు యే వైపుననైన ఉన్న భూమి పేవుమెంటుచేనైనను, వసారాచేనైనను, లేక ఇతర నిర్మాణముచేనైన కప్పబడియున్నను లేకున్నను, దాని ప్రక్కన నుండు సొత్తుఖానిగీ సొత్తయినను రాష్ట్ర ప్రభుత్వమునకుగాని, కేంద్ర ప్రభుత్వమునకుగాని చెందిన సొత్తయినను దానియొక్క సరిహద్దుల వరకు వ్యాపించియున్న అట్టి భూమియును చేరును ,

(21) "నివాసము," ఒక మనిషి యేదేని గృహముయొక్క యే భాగమునైనను నిద్రించుగదిగా కొన్నిసమయములందు ఉపయోగించు నెడల అతడు దానిలో "నివాసము" కలిగియున్నట్లు లేదా "నివసించు"నట్లు భావింపబడును మరిన్ని ఒక మనిషి యే కాలమందైనను అట్టి యేదేనిగృహమునకు తిరిగివచ్చుటకు స్వేచ్ఛకలిగియుండి అట్లు తిరిగివచ్చు నుద్దేశమును అతడు విడిచిపెట్టియుండనియెడల అందుండి అతడు గైరుహాజరైనంత మాత్రముననే లేదా మరియొక చోట మరియొక నివాసముగలవాడై అందు నివసించు మాత్రముననే, దానిలో నివసించడమును మానివేసినట్లు భావించబడకూడదు.

(22) 'రెవిన్యూ గ్రామము' అనగా గవర్నమెంటువారి రెవిన్యూ లెక్కలలో ఒక గ్రామముగా అంగీకరింపబడిన యెట్టి స్థానిక విస్తీర్ణములోనుండియైన -

(a) (యీ సబ్ క్లాజు అడాప్టేషనుతో తీసివేయబడినది )

(b) 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టు ననుసరించి యేర్పాటుచేయబడిన మునిసిపాలిటీలలో, మరిన్ని

(c) 1924 వ సం॥పు కంటోన్మెంట్ల ఆక్టు ననుసరించి ఏర్పాటు చేయబడిన కంటోన్మెంట్లలో చేరియున్న విస్తీర్ణములు, యేవేనియున్న యెడల వాటిని మినహాయించగా మిగిలిన విస్తీర్ణమని అర్థము, మరియు

ఈ మాటలో, ఈ యాక్టు ప్రారంభమునందుండి ఈ యాక్టు యొక్క కార్యముల నిమిత్తము ఒక రెవిన్యూ గ్రామముగా ఇన్స్పెక్టరుచే ప్రకటింపబడిన ఒక మజరా చేరును.

సంపాదకుని సూచిక

ఒక కుగ్రామమును ఒక "గ్రామము"గా గాని (అనగా పంచాయతీగా) లేక "రివిన్యూగ్రామముగా" గాని ప్రకటించునపుడు, ఆ కుగ్రామముయొక్క విస్తీర్ణము, సరిహద్దులు, అందులోని పైరుభూములు, సరిగా నిర్ణీతము చేయవలెను అట్టి సరిహద్దులు వర్ణన లేనియెడల అట్టి ప్రకటన నిష్ఫలము, నిరాధారమగును కుగ్రామము అనగా సరిగా నిర్ణయింపబడిన ప్రదేశము కాదు.

(23) 'షెడ్యూలు దాఖాలా కులములు' అను మాటలకు, ఇండియా రాజ్యాంగములో అది ఎట్టి అర్థమును కలిగియుండునో అట్టి అర్థమునే కలిగియుండవలెను ,

(24) 'రిజర్వుచేయని అడవి' అనగా 1882 వ సం॥పు మదరాసు అడవి ఆక్టుయొక్క 4 వ సెక్షను క్రింద ప్రకటించబడని ఒక అడవి అని అర్థము. మరియు దానిలో ప్రభుత్వమువారి స్వాధీనములో నుండు రిజర్వుచేయని భూమి చేరును,

(25) 'గ్రామము' అనగా ఈ ఆక్టు ననుసరించి ఒక గ్రామముగా ప్రకటింపబడిన స్థానిక ప్రదేశము (అనగా పంచాయతీ గ్రామము) అని అర్థము.

(26) 'నీరు ప్రవహించు మార్గము' లో స్వతస్సిద్ధమైనదైనను సరే లేక కృత్రిమమైనదైనను సరే ఏ నదిగాని, వాగుగాని లేక కాలువగాని చేరును.

(27) 'సంవత్సరము' అను మాటకు ఆర్థిక సంవత్సరము అని అర్థము

## 2-వ అధ్యాయము

### పంచాయతీల నిర్మాణము, పరిపాలనము మరియు పై అధికారమును

3. (1) ఇన్‌స్పెక్టరు, ఒక రెవిన్యూ తాలూకాలోని ఏ భాగమునైనను ఈ ఆక్టు వర్తించునట్లు ఒక గ్రామముగా ప్రకటించి, ఆ గ్రామముయొక్క పేరును ప్రకటించవచ్చును.

(2) ఇన్‌స్పెక్టరు ప్రకటన మూలముగా

(a) ఒక గ్రామములోని ఏ భాగమునైనను గ్రామమునుండి విడతీయవచ్చును

(b) ఒక గ్రామములో చేరియున్నట్టి, ఆ రెవిన్యూ తాలూకా లోని ఏ ప్రదేశమునైనను ఆ గ్రామములో చేర్చవచ్చును.

(c) 1 వ సబ్‌సెక్షను క్రింద జారీచేయబడిన ప్రకటనను రద్దు చేయవచ్చును లేదా

(d) గ్రామముయొక్క పేరును మార్చవచ్చును

ఈ ప్రకటన ఏ గ్రామమునకు వర్తించునో, ఆ గ్రామపంచాయతీకి, ఈ ప్రకటనకు ఎట్టి అభ్యంతరములు లేక ఆక్షేపణలేమైన ఉన్నయెడల తెలుపుటకు ప్రకటన చేయుటకు ముందు అవకాశము యిచ్చి, ఇన్‌స్పెక్టరు అట్టి అభ్యంతరములను, ఏవైన ఉన్నయెడల, సమగ్రముముగ ఆలోచించవలెను.

ఎక్‌స్ప్లనేషను (వివరణము -)

(1) (2) వ సబ్‌సెక్షనులలో, రెవిన్యూ తాలూకా అనగా ప్రభుత్వమువారి రెవిన్యూ అకౌంట్లలో ఏదైన తాలూకా అని అర్థము. కాని ఆ తాలూకానుండి ఈ క్రింది ప్రదేశములు విడదీయ బడవలెను

(a) మద్రాసు డిస్ట్రిక్టు మ్యునిసిపాలిటీ ఆక్టు 1920 ని అనుస రించి మ్యునిసిపాలిటిలో చేర్చబడిన ప్రదేశము.

(b) కంటోన్‌మెంట్సు ఆక్టు, 1924 (సెంట్రల్ ఆక్టు)

(II ఆఫ్ 1924) క్రింద కంటోన్మెంటులో చేర్చబడిన ప్రదేశము.

(3) ఇన్స్పెక్టరు

(a) అంతరించిపోయిన ఒక పంచాయతీ వశమందుండిన ఆస్తిని పరిష్కరించుటను గురించియు, దాని ఋణములను తీర్చుటను గురించియు,

(b) ఎట్టి స్థానిక విస్తీర్ణముమీదగాని విచారణాధికారమును చెలాయించుటకును మానివేసిన ఒక పంచాయతీ వశమందుండిన ఆస్తిలో యెట్టి భాగమునైన పరిష్కరించుటకును గురించి, మరియు అట్టి ఆస్తికి సంబంధించిన లేక అట్టి స్థానిక విస్తీర్ణమునుండి ఏర్పడిన పంచాయతీ ఋణములను తీర్చుటను గురించి,

తనకు యుక్తమని తోచు ఉత్తరువును జారీచేయవచ్చును

ఈ సబ్ సెక్షను క్రింద చేయబడిన ఒక ఉత్తరువులో ఇన్స్పెక్టరు అవసరమని తలంచగల అదనపు ఆకస్మికమైన పర్యవసానరూపమైన నిబంధనలు ఉండవచ్చును మరియు ముఖ్యముగా -

(1) పంచాయతీకి బాకీగానుండు ఏ పన్ను, రుసుము లేక ఇతర మొత్తమునైన లేక పంచాయతీ ఏ స్థానిక ప్రదేశము మీదనైన అధికారమును చలాయించని విషయములో, ఆ ప్రదేశమునకు సంబంధించినట్లుండు పంచాయతీకి బాకీగా రావలసినట్లుండు పన్ను, రుసుము లేక ఇతర మొత్తము, ఉత్తరువులో నిర్దేశింపబడగల అధికారులకు చెల్లించబడవలనని ఆజ్ఞాపించవచ్చును

(11) ఆయా సందర్భమునకు తగినట్లు పంచాయతీ ఆ స్థానిక విస్తీర్ణముమీద విచారణాధికారమును చెలాయించుటకు నిలిచిపోయిన తేదీన లేక పంచాయతీ రద్దుచేయబడిన తేదిని విచారణకాక నిలిచియుండు ఏదైన పన్ను, రుసుము లేక మొత్తమునకు సంబంధించిన అప్పీళ్లు, అర్జీలు లేక ఇతర దరఖాస్తులు, ఉత్తరువులో నిర్దేశింపబడగల అధికారులచే పరిష్కరింపబడవలెనని ఆజ్ఞాపించవచ్చును.

## ఈ ఆక్టు క్రింద ప్రకటనలు ప్రకటింపబడుటను గూర్చి విధులు (రూల్సు)

(జి. ఓ. నెం 520, ఎల్ ఎ. తేదీ 24-3-1951 మరియు
జి ఓ నెం 569, ఎల్ ఎ. తేదీ 25-3-1952)

1. ఈ ఆక్టుక్రింద ప్రభుత్వముగాని, ఇన్‌స్పెక్టరుగాని ప్రకటించు ప్రతి ప్రకటనము ఆంధ్ర గెజెటులో ప్రకటింపబడవలెను

2 ఈ ఆక్టు క్రిందగాని, ఆక్టు ననుసరించిన విధులలోగాని, ప్రత్యేకముగా చెప్పబడినట్లు తప్ప, ప్రభుత్వముగాని, ఇన్‌స్పెక్టరుగాని జారీచేసిన ప్రకటనలుగాక, ఇతరమైన ఈ అక్టు క్రింద ప్రచురింపబడిన ప్రతి ప్రకటనముకూడ, ఆ జిల్లాకు చెందిన, అధికార జిల్లాగెజెటులో యింగ్లీషులోను, ఆ జిల్లాయొక్క భాషలోనుకూడ ప్రచురింపబడవలెను

పై విధుల విషయమై ప్రభుత్వము యీక్రింది విధముగ అదేశించవచ్చును –

(1) అట్టి ప్రకటనలు పై చెప్పబడిన గెజెటులో యింగ్లీషులోగాని, లేక ఆ జిల్లా ముఖ్యభాషలోగాని ప్రచురింపబడవలెను, లేక,

(11)' అట్టి ప్రకటనలు, గెజెటులోగాక ప్రభుత్వము ఆదేశించిన యితర విధములలో ప్రచురింపబడవలెను, లేక,

(111) అట్టి ప్రకటనలు, గెజెటులో మాత్రమేకాక, ప్రభుత్వము నిర్దేశించిన యితర విధములుగాకూడ ప్రచురింపబడవలెను.

జి ఓ నెం. 1381, ఎల్ ఎ. తేదీ 8-10-1956 లో
2 వ విధి క్రింద జారీచేసిన ఉత్తరువు (ఆర్డరు)

పైని చెప్పబడిన రెండవ విధిలోని (11) వ పేరా క్రింద ప్రభుత్వము యీక్రింది విధముగా ఆజ్ఞాపిస్తున్నారు. మద్రాసు గ్రామ

పంచాయతీ ఆక్టు 1950 యొక్క 3 వ సెక్షను క్రిందగాని 9 వ సెక్షను క్రిందగాని చేయబడు ప్రకటనలు (నోటిఫికేషనులు) ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషనుచేత అధికారము పొందబడిన ప్రతి ఆఫీసరును, ఆంధ్ర గెజెటులోను, మరియు ఈక్రింది విధముగా ప్రచురించవలెను –

(i) గ్రామములోగాని, లేక గ్రామములలోగాని మూడు ప్రాముఖ్యముగల ప్రదేశములలోను,

(ii) గ్రామములో డప్పులమూలముగాను ప్రచురించవలెను

4. (1) ప్రతి గ్రామమునకును, 3 వ సెక్షను, (1) వ సబ్‌సెక్షనుక్రింద జారీచేయబడిన ప్రకటనలో ఆ విషయమై నిర్దిష్టముచేయబడిన తేదీ నుండి ఒక పంచాయతీ నిర్మింపబడవలెను

(2) ఈ ఆక్టుయొక్క నిబంధనలకు లోబడి గ్రామపరిపాలన, పంచాయతీ వశమందుండవలెను. కాని పంచాయతీ, ఈ ఆక్టుచే లేదా ఏ యితర చట్టముచే లేదా దాని ననుసరించిగాని దాని ప్రెసిడెంటుకు లేదా కార్య నిర్వాహకోద్యోగికి లేదా డిస్ట్రిక్టుబోర్డుకు లేదా యే యితర అధికారవర్గమునకు గాని స్పష్టముగా ప్రత్యేకింపబడిన పనులను నెరవేర్చుటకు హక్కును కలిగియుండకూడదు

(3) ప్రతి పంచాయతీయును, 3 వ సెక్షను క్రింద జారీచేయ బడిన ప్రకటనలో నిర్దేశింపబడిన గ్రామముయొక్క పేరుతో సంఘీ భూతమైన సభగా ఉండవలెను శాశ్వత వారసత్వమును, సముదాయ ముద్రను (సీలు) కలిగియుండవలెను. ఈ ఆక్టుచేగాని దాని ననుసరించి లేదా యేదైన యితరచట్టముచేగాని దాని ననుసరించిగాని విధింపబడు ఏదేని నిర్బంధమునకో, లేక అర్హతకులోబడి, దాని సంఘీభూతమైన పేరిట వ్యాజ్యము చేయునట్టియు, వ్యాజ్యము చేయబడునట్టియు, స్థిర లేదా చరరూపకమైన సొత్తులను సంపాదించి, వహించి, పరివర్తన చేయునట్టియు, కంట్రాక్టులను చేసికొనునట్టియు, అదియెందుకు నిర్మా

ణము చేయబడినదో ఆ కార్యములకు గాను అగత్యమైన, సరియైన లేదా యుక్తమైన యావత్తు కార్యములు చేయునట్టియు అధికారము ఈయబడి యుండవలెను.

సంపాదకుని సూచిక

ప్రతి పంచాయతీయు తనయొక్క స్వంతసీలు కలిగియుండవలెను. ఈ సీలు బాధ్యతగల వ్యక్తివద్ద జాగ్రత్తగా వుంచబడవలెను. ముఖ్యముగా ఎగ్జిక్యూటివు అధికారివద్ద వుండుట శ్రేయస్కరము.

పంచాయతీలను తరగతి వారిగా విభజించుట

5. (1) (a) ఐదువేలమంది కంటె తక్కువ కానట్లు అంచనా వేయబడిన జనసంఖ్యమీద విచారణాధికారముగల, రూ 10,000 ల కంటె తక్కువ కాని అంచనావేయబడిన సంవత్సర వారీ ఆదాయముగల పంచాయతీలను, 1వ తరగతి పంచాయతీలుగా, విభజింపవలెను

(b) ఇతర పంచాయతీలు, రెండవ తరగతి పంచాయతీలుగా పేర్కొన బడవలెను

(2) గవర్నమెంటువారి అభిప్రాయములో, పంచాయతీ (1) వ సబుసెక్షను (a) క్లాజులో చెప్పబడిన షరతులను, తృప్తి పరచినయెడల లేక తృప్తిపరచనియెడల ఒక పంచాయతీ విషయములో చేయబడిన తరగతివారీ విభజనను మార్చవచ్చును

(3) ఈ సెక్షనుక్రింద గవర్నమెంటువారిచే చేయబడిన ఏ నిర్ణయముగాని ఏ న్యాయస్థానములోనైన ప్రశ్నింపకూడదు.

సంపాదకుని సూచిక

5 వ సెక్షను క్రింది అధికారములు ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషనుకు దత్తత చేయబడెను. (జి. ఓ నెం 1118, ఎల్ ఎ తేదీ 4-6-1951)

6 (1) ఒక పంచాయతీ మెంబర్ల మొత్తపు సంఖ్యను, 10-A సెక్షనుక్రింద ఎన్నికకాబడు స్త్రీమెంబరు మినహాయించి, జనసంఖ్యను బట్టి నిర్ణయింపబడగల స్కేలు ప్రకారము ఇన్‌స్పెక్టరు ప్రకటించవలెను

(2) ఇన్‌స్పెక్టరు అప్పుడప్పుడు ప్రకటనద్వారా (1) వ సబ్ సెక్షనుక్రింద ప్రకటించబడిన ఒక పంచాయతీ మెంబర్ల మొత్తము సంఖ్యను మార్చవచ్చును.

(3) 1 వ సబ్‌సెక్షనుక్రింద ప్రకటింపబడిన సంఖ్య లేక (2) వ సబు సెక్షనుక్రింది ప్రకటనచే సవరింపబడునట్లుండు సంఖ్య, ఆరుకంటె తక్కువగాను, పదునారుకంటె ఎక్కువగాను ఉండ కూడదు.

జి ఓ నెం 40 ఎల్ ఎ తేదీ 9–1–1957 లో సెక్షను 6 (1) క్రింద జారీ చేయబడిన విధి

## వి ధి

### పంచాయతీ సంఖ్య

సెక్షను 10-A క్రింద ఎన్నుకోబడవలసిన స్త్రీ సభ్యురాలు కాక, ఒక పంచాయతీలోని సభ్యుల మొత్తం సంఖ్య, యీ క్రింద వివరించిన ప్రకారం, పంచాయతీయొక్క జనాభాను అనుసరించి, నిర్ణయింపబడవలెను

| జనాభా | స్త్రీ సభ్యురాలుకాక మిగిలిన సభ్యుల సంఖ్య |
|---|---|
| 20,000 అంతకుపైగా | 16 |
| 20,000 లోపల, 15,000 పైన | 15 |
| 15,000 లోపల, 12,000 పైన | 14 |
| 12,000 లోపల, 10,000 పైన | 13 |
| 10,000 లోపల, 7,500 పైన | 11 |
| 7,500 లోపల, 5,000 పైన | 9 |
| 5,000 లోపల, 2,500 పైన | 8 |
| 2,500 లోపల, 1,000 పైన | 7 |
| 1,000 లోపల | 6 |

సె 7 సెక్షను 10-A లో చెప్పబడిన విధమునకు లోబడి, పంచాయతీ సభ్యులు నిర్ణయింపబడిన పద్ధతి ప్రకారము ఎన్నుకోబడవలెను.

## పంచాయతీ సభ్యుల ఎన్నికల విధులు

### 1 వ భాగము

సెక్షనులు 7, 10 (3) (a) మరియు 112 (2) (b) క్రింద జారీ చేయబడిన విధులు (రూల్సు)

జి ఓ నెం 1547, తేదీ 6-8-1951,

జి. ఓ. నెం. 1799, ఎల్. ఎ తేదీ 8-9-1952,

జి ఓ నెం. 940, ఎల్ ఎ. తేదీ 28-4-1953, మరియు

జి ఓ. నెం. 179, ఎల్. ఎ. తేదీ 8-2-1956

1 (1) ఈ విధులు, ఒకటవ తరగతి పంచాయతీలకున్ను, ఎన్నిక అధికారి ఈ సందర్భములో ప్రకటించిన యితర పంచాయితీలకున్న అన్వయించును

1. (2) ఈ విధులలో 'ఎన్నిక ఉద్యోగి' (ఎలక్షను ఆఫీసరు) అనగా ఈ విధుల క్రింద ఎన్నికలను జరుపుటకు సంబంధించిన ఎట్టి పనినైనను చేయుటకు లేక ఎట్టి కృత్యమునైనను నిర్వహించుటకు గాను ఎన్నిక అధికారిచే అధికారమియ్యబడిన లేక నియమింపబడిన వ్యక్తి లేక ఉద్యోగి అని అర్థము

(3) సభ్యులయొక్క ఎన్నిక రహస్యపు బ్యాలెటు పద్ధతి ద్వారా జరుగవలెను

2 (1) సాధారణ లేక ఆకస్మిక ఖాళీలను భర్తీచేయుటకు గాను సభ్యుల ఎన్నికలను జరుపుటకు ఎన్నిక అధికారి ఏర్పాటు చేయవలెను

(2) ఎన్నుకొనబడిన సభ్యుని పదవిలో ఆకస్మికముగ ఏర్పడు ప్రతి ఖాళీ సందర్భమునను, అట్టి ఖాళీ ఏర్పడిన తేదీనుండి మూడు దినముల లోపల, ఆ ఖాళీని గూర్చి కార్యనిర్వాహక అధికారి ఎన్నికఅధికారికి తెలుపవలెను.

3. (1) ఎన్నిక ఉద్యోగి 10 వ సెక్షను క్రింద లేక 11 (1) వ సెక్షను క్రింద ఒక పంచాయతీ సభ్యునియొక్క ఎన్నికకు నిర్ణయింపబడిన తేదీకి పూర్వము 21 దినములకు తక్కువగాకుండ ఇంగ్లీషులోను, ఆ ప్రదేశముయొక్క ముఖ్య భాషలలోను ఈ క్రింది వివరములుగల నోటీసును తయారుచేసి ప్రచురించవలెను

(a) ఎన్నుకొనబడవలసిన వ్యక్తులు సంఖ్య;

(b) వారు ఏ ఏ వార్డులకు ఎన్నుకొనబడవలెనో ఆయా వార్డులు,

(c) ఎన్నిక జరుపవలసిన స్థానములలో అనుసూచిత (షెడ్యూలు) జాతులవారికి ప్రతి వార్డులోను ప్రత్యేకించిన స్థానములేవైనను న్న యెడల అట్టివారికై ప్రత్యేకించిన స్థానములు,

(d) నామనిర్దేశపత్రములు (నామినేషనులు) ఏ తేదీన ఏ స్థలమువద్ద మరియు ఏఏ గంటల మధ్య అర్పింపబడవలెనో ఆ తేదీ, స్థలము మరియు ఆ గంటలు, నోటీసు ప్రకటింపబడిన తేదీకిని, నామనిర్దేశ పత్రము అర్పింపబడవలసిన తేదీకిని మధ్య పూర్తిగ ఏడు దినముల వ్యవధి యుండవలెను,

(e) నామ నిర్దేశపత్రములు పరిశీలింపబడు తేదీ ఈ తేదీ నామనిర్దేశ పత్రములను అర్పించవలసిన తేదికి మరుసటిదై యుండవలెను మరియు ఇది ఎన్నిక తేదికి పూర్వము పదునొకండు దినములకు తక్కువగాకుండగ నుండవలెను

(f) పోలు ఉన్న సందర్భములో ఎన్నిక దార్లనుండి ఓట్లు ఏ తేదీన, ఏ స్థలమువద్ద లేక ఏఏ స్థలములవద్ద తీసికొనబడునో ఆ తేదీ ఆ స్థలము లేక స్థలములు, పోలు ఏఏ గంటల మధ్య తెరచియుంచబడునో ఆయా గంటలు, ఈ గంటలు ఉదయము 7 గంటలనుండి

సాయంత్రము 6 గంటల మధ్య పదిగంటల కాలపరిమితికి తక్కువ గాకుండ నుండవలెను, మరియు

(g) ఎన్నిక ఉద్యోగి ఏ తేదిన, ఏస్థలమున మరియు ఏ గంట లకు ఓట్లు లెక్కింప ప్రారంభించునో ఆ తేదీ, స్థలము మరియు గంట

(2) సంబంధించిన పంచాయతీకి ఒక కార్యాలయము యుండిన పక్షమున, అచ్చటను మరియు ఎన్నిక జరుగవలసినవార్డులో మూడింటికంటె తక్కువకాని ప్రధానమైన స్థలములవద్దను నోటీసును ప్రచురించవలెను.

## అభ్యర్థుల నామనిర్దేశము.

4 (1) ప్రతి అభ్యర్థియొక్క నామనిర్దేశము (నామినేషను) 1వ నమూనాలో నుండు నామనిర్దేశ పత్రముద్వారా జరుగవలెను. కోరిన మీదట పంచాయతీ ఓటర్ల జాబితాలో పేరు చేర్చబడియుండు ఏ ఎన్నిక దారునకుగాని ఉచితముగా సంబంధించిన ఎన్నిక ఉద్యోగిచే లేక పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారిచే సరఫరా చేయ బడును

(2) ప్రతి నామనిర్దేశ పత్రముపై అట్టి ఇరువురు ఎన్నిక దార్లు ప్రతిపాదకుడుగా బలపరచు వ్యక్తిగా సంతకము చేయవలెను. అభ్యర్థి ఎన్నికకు నిలబడుటకు తన సమ్మతమును తెలుపు ప్రకటనను చేసి సంతకము చేయవలెను.

(3) ఒకే ఎన్నికదారు, వార్డులో భర్తీచేయబడవలసిన ఖాళీ స్థానము లెన్నిగలవో అన్ని నామనిర్దేశపత్రములపై సంతకము చేయవచ్చును కాని అంతకు మించినవాటిపై చేయకూడదు. ప్రతి అభ్యర్థియు ప్రత్యేక నామనిర్దేశ పత్రముద్వారా నామనిర్దేశము చేయబడవలెను

(4) ప్రతి నామనిర్దేశ పత్రమును అభ్యర్థిచే ఖుద్దున లేక ప్రతిపాదకుడు బలపరచు వ్యక్తి ఇరువురు సమిష్టిగా కూడి వారిచే, నిర్ణ

యింపబడిన తేదీన ఆ స్థలమువద్ద మరియు ఆగంటయందు ఎన్నిక ఉద్యోగికి లేక ఇందు నిమిత్తము ఆయనచే అధికారమియ్యబడిన ఇతర వ్యక్తికి అర్పింపబడవలెను ఎన్నిక ఉద్యోగి లేక అధికారమియ్య బడిన యితర వ్యక్తి, నామనిర్దేశ పత్రములకు అవి అర్పింపబడిన క్రమ ములో వరుస సంఖ్యను వెంటనేవేసి ప్రతి నామనిర్దేశపత్రము అర్పింప బడిన కాలమును దానిపై నమూదుచేయవలెను

(5) భర్తీచేయబడవలసిన ఖాళీస్థానముల సంఖ్యకంటె ఎక్కువగ నుండు నామనిర్దేశ పత్రములపై ఒక వ్యక్తి ప్రతిపాదకుడుగ లేక బలపరచు వ్యక్తిగ సంతకముచేసిన యెడల అట్లు సంతకము చేయ బడిన పత్రములలో భర్తీచేయవలసిన ఖాళీల సంఖ్యవరకు ప్రథ మముగా అందిన సంఖ్యగల పత్రములు చెల్లునట్లు భావింపబడవలెను.

(6) ఏ అభ్యర్థియొక్క నామనిర్దేశ పత్రమైనను, దాని లోని ఏక్రమరాహిత్యమునుబట్టియైనను నిరాకరింపబడినప్పుడు, క్రమ రాహిత్యము లేనట్టి మరియొక నామనిర్దేశపత్రముద్వారా ఆ అభ్యర్థి క్రమముగా నామనిర్దేశము చేయబడిన పక్షమున అభ్యర్థియొక్క నామనిర్దేశము చెల్లుటకు ఏ లోపముండదు

(7) ఏ నామనిర్దేశ పత్రముగాని, నామనిర్దేశ పత్రములను అర్పించుకొనుటకై నిర్ణయింపబడిన తేదీని నియమింపబడిన కాలము పిమ్మట, తీసుకొనబడకూడదు

5. 4వ విధియొక్క (4) వ ఉపవిధిలో నిర్దేశింపబడిన ఎన్నిక ఉద్యోగి లేక అధికారమియ్యబడిన ఇతర వ్యక్తి, నామనిర్దేశ పత్ర మును అర్పించిన పిమ్మట అభ్యర్థియు, ఆయనను ప్రతిపాదించు వ్యక్తియు మరియు బలపరచు వ్యక్తియు రిజిష్టరుచేయబడిన ఓటర్ల జాబితాయొక్క నకలును లేక అందలి సంబంధించిన నమూదుల నక ళ్ళను హాజరుపరచవలెనని దానిని అర్పించు వ్యక్తిని లేక వ్యక్తులను కోరవచ్చును నామినిర్దేశ పత్రములో నమూదుచేయబడిన అభ్యర్థి యొక్క, ఆయన ప్రతిపాదకునియొక్క మరియు బలపరచు వ్యక్తి యొక్క పేరు మరియు సంఖ్య ఓటర్ల జాబితాలో నున్నట్లే ఉన్నవా

యని చూడవలెను. అవసరమగునప్పుడు నామనిర్దేశ పత్రములోని నమూనాదులను ఓటర్ల జాబితాలోవలె నుండునట్లు సవరణచేయుటకు ఆయన ఆజ్ఞాపించవలెను

ఎన్నిక ఉద్యోగి, ఓటర్ల జాబితాలోని ముసద్దీ లేక ముద్రణా దోషములను వదలిపెట్టునట్లుగా దానిని వ్యాఖ్యానించవచ్చును. అయితే తాను స్వీకరించిన వ్యాఖ్యానమును అందుకు గల కారణములతో సహా రికార్డు చేయవలెను

6 (1) పంచాయతీ ఎన్నికకు నిలబడగోరు ప్రతి అభ్యర్థియు తన నామనిర్దేశ పత్రమును లేక పత్రములను అర్పించునప్పుడు లేక అర్పించుటకు పూర్వము, ఎన్నిక ఆఫీసరువద్ద రొక్కముగా లేక అప్పటి బజారుధర ప్రకారము సమానమైన విలువగల గవర్నమెంటు ప్రామిసరీ నోట్ల రూపముగా సదరు అభ్యర్థి అనుసూచిత (షెడ్యూలు) జాతికి చెందినవాడైన సందర్భమున ఐదు రూపాయల మొత్తమును లేక ఆ అభ్యర్థి అనుసూచిత జాతికి చెందనవాడైన సందర్భమున ఇరువది రూపాయల మొత్తమును డిపాజిటుచేయవలెను, లేక డిపాజిటు చేయించవలెను ఏ అభ్యర్థియైనను అట్లు డిపాజిటుచేయని పక్షమున ఏ వార్డునకుగాని క్రమముగా నామనిర్దేశము చేయబడినట్లు భావింపబడకూడదు అభ్యర్థి తాను నిలబడగోరు ప్రతి వార్డు విషయములోను ప్రత్యేకముగ డిపాజిటుచేయుట అవసరమైయున్నది.

వివరణము .

జిల్లాలోని గవర్నమెంటు ట్రెజరీనుండి లేక జిల్లాలో గల స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా మదరాసు, శాఖలలో ఒకదాని నుండి లేక పంచాయతీకి అకౌంటు గల బ్యాంక్‌నుండి పొందిన ఒక అభ్యర్థిచే లేక ఆయన తరఫున పంచాయతీ పేరిట ఈ ఉపవిధి క్రింద డిపాజిటుచేయబడవలసిన మొత్తమును చెల్లించినట్లు రుజువు చేయు రసీదును, ఎన్నిక ఉద్యోగికి అందజేయుట, ఈ ఉపవిధి యొక్క అర్థములో అట్లు అందచేయు సమయమందు ఆ అభ్యర్థిచే లేక ఆయన తరఫున అట్టి మొత్తమును డిపాజిటు చేసినట్లు భావింపబడవలెను.

(2) (1) వ ఉపవిధిలో నిర్దేశింపబడిన డిపాజిటు ఏ వ్యక్తిచే లేక ఎవరి తరఫున చేయబడినదో అట్టి ఏ వ్యక్తి విషయములోనైనను నామ నిర్దేశపత్రమేదిగాని అందు నిమిత్తమై నిర్ణయింపబడిన కాలము లోపుగ, అందనియెడల లేక అట్టి ఏ వ్యక్తియొక్కనైన నామనిర్దేశము నిరాకరింపబడినయెడల లేక ఆయన తన నామనిర్దేశనమును 11 వ విధి యొక్క (1) వ ఉపవిధిలో నిర్దిష్టముచేయబడిన రీతిని మరియు అట్టి కాలము లోపుగను ఉపసంహరించుకొనినయెడల సదరు డిపాజిటు ఎవరిచే చేయబడినదో ఆ వ్యక్తికి వాపసు చేయబడవలెను ఏ అభ్యర్థి యైనను పోలు ప్రారంభమగుటకు పూర్వము మరణించునెడల, అట్టి ఏ డిపాజిటైనను, ఆయనచే చేయబడినయెడల, ఆయనయొక్క చట్ట సంబంధమైన ప్రతినిధికి లేక ఆ అభ్యర్థిచే చేయబడని పక్షమున అది, ఎవరిచే చేయబడినదో ఆ వ్యక్తికి వాపసుచేయబడవలెను

(3) 1వ ఉపవిధియందు నిర్దేశింపబడిన డిపాజిటు ఎవరిచే లేక ఎవరి తరఫున చేయబడినదో ఆ అభ్యర్థి 11 వ విధియొక్క (2) వ ఉపవిధి క్రింద తన అభ్యర్థిత్వమును ఉపసంహరించుకొనునెడల లేక ఆయన ఎన్నుకొనబడక మరియు మొత్తము పోలుచేయబడిన ఓట్ల సంఖ్యలో 8వ భాగమున పోలుచేయబడిన మొత్తము ఓట్లను ఎన్నుకొనబడవలసిన సభ్యుల సంఖ్యచే భాగించగా వచ్చు సంఖ్యను మించని యెడల సదరు డిపాజిటు పంచాయతీకి దండుగక్రింద చెందవలెను.

(4) (3) వ ఉపవిధియొక్క కార్యముల నిమిత్తము పోలుచేయబడిన ఓట్లసంఖ్య, చెల్లనివికాక లెక్కింపబడిన బ్యాలెటు పేపర్ల సంఖ్యగా భావింపబడవలెను

(5) ఎన్నుకొనబడని అభ్యర్థి విషయములో చేయబడిన డిపాజిటు, (3) వ ఉపవిధిక్రింద దండుగక్రింద తీసికొనబడినచో, 40 వ విధి ప్రకారము ఎన్నిక ఫలితము ప్రకటింపబడినతర్వాత, సాధ్యమైనంతత్వరలో, ఆయా సందర్భమునకు తగినట్లు అభ్యర్థికి లేక అతని తరఫున డిపాజిటుచేసిన వ్యక్తికి వాపసుచేయబడవలెను ఎన్నుకొనబడిన వ్యక్తి సందర్భములో చేయబడిన డిపాజిటు, పంచాయ

తీలో అభ్యర్థి తన స్థానములో కూర్చొనిన తర్వాత సాధ్యమైనంత త్వరలో, లేక అభ్యర్థిచే ఆ విధముగా అతని స్థానము ఆక్రమింపబడ లేదని తెలిసియుండియు, ప్రభుత్వమువారు డిపాజిటును వాపసు చేయ వలెనని కోరుచు చేసిన ఆజ్ఞానుసారము వాపసు చేయబడవలెను.

(6) రెండు లేక అంతకు ఎక్కువ వార్డుల విషయములో, ఒక అభ్యర్థిచే లేక ఆయన తరఫున డిపాజిటులు చేయబడినపుడు, (2) వ మరియు (5) వ ఉప విధులలో ఏది చెప్పబడియున్నను దానితో నిమిత్తము లేకుండ, డిపాజిట్లలో ఒకటికంటె ఎక్కువైనవి వాపసు చేయబడగూడదు శేషించినవి పంచాయతీకి దండుగక్రింద చెందవలెను

(7) (2) వ ఉపవిధి లేక (5) వ ఉపవిధి ననుసరించి ఏ మనిషికైనను వాపసు చేయబడవలసినదిగా కోరబడు డిపాజిటు, అట్టి మనిషి చనిపోయినచో అతని చట్ట సమ్మతమైన ప్రతినిధికి వాపసు చేయబడవలెను

(8) ఈ విధిలో ఏమి చెప్పబడియున్నను దానితో నిమిత్తము లేకుండ, (1) వ ఉపవిధిక్రింద చేయబడిన డిపాజిటు, అందులకైన హక్కు, ఆయా సందర్భమునకు తగినట్లు, డిపాజిటును చేసినమనిషిచే లేక అతని చట్టసమ్మతమైన ప్రతినిధిచే, ఎన్నిక ఫలితములు ఎన్నికో ద్యోగిచే ప్రసిద్ధపరచబడిన తేదీనుండి ఆరు నెలలలోపల లేక అట్లు ప్రసిద్ధపరుచుట రెండు వేర్వేరు తేదీలలో చేయుబడినపుడు, అట్టి తేదీలలో కడపటిదగు తేదీనుండి ఆరు నెలలలోపల ఎన్నికోద్యోగికి అందజేయబడవలెను లేక పోస్టు ద్వారా పంపబడవలెను

7 నామ నిర్దేశపత్రములను అందుకొనుటకై పుచ్చుకొనుటకై దినమునను, వాటిని పుచ్చుకొనవలసిన కాలము గడచిపోయిన వెను వెంటనే, ఎన్నికోద్యోగి లేక 4 వ విధియొక్క (4) వ ఉపవిధిలో చెప్పబడిన అధికారమీయబడిన ఇతర మనిషి, సంబంధించిన పంచా యతీలో ఒక ఆఫీసు ఉండినచో అందులో, అట్లు లేనిచో, పంచాయతీ లోని ఏ ప్రధాన స్థలమునందైన IIవ నమూనాలోని అందజేయబడిన

నామ నిర్దేశపత్రము లన్నింటియొక్క జాబితాను, ఆ స్థానిక ప్రదేశ మందలి ప్రధాన భాషలో ప్రకటించవలెను మరియు దానితోబాటు, పంచాయతీ ఆఫీసులో లేక నిర్దిష్టము చేయబడిన ప్రదేశములో 3 వ విధి క్రింది నిర్ణయింపబడిన తేదీనను నిర్దిష్టముచేయబడిన కాలమం దును పరిశీలన నిమిత్తము నామనిర్దేశ పత్రములన్నియు ఎన్నికో ద్యోగిచే తీసికొనబడుననియు, ఒక నోటీసును ప్రకటించవలెను

## నామనిర్దేశ పత్రముల పరిశీలన

8 (1) నామనిర్దేశ పత్రముల పరిశీలనకై నిర్ణయింపబడిన తేదీన, అభ్యర్థులు, ప్రతి అభ్యర్థియొక్క ఒక ఉపపాదకుడు, ఒకబల పఱచు వ్యక్తి మరియు ప్రతి అభ్యర్థిచే లిఖిత పూర్వకముగా క్రమ ముగా అధికార మీయబడిన, మరియొక ఇతర మనిషి, మఱియుఎన్ని కోద్యోగికి సహాయపడు నిమిత్తముతప్ప ఏ ఇతర మనిషిగాని, 7 వ విధిక్రింది నిర్దేశింపబడగలట్టి కాలమందును, స్థలమునందును హాజరు కాకూడదు ఎన్నికోద్యోగి అట్టి మనుష్యులందరికిని, పైన చెప్పబడిన విధముగా అందజేయబడిన, అభ్యర్థులందరి నామనిర్దేశ పత్రములను పరీక్షించుటకు న్యాయమైనట్టి సదుపాయములనన్నింటిని గల్పించ వలెను.

(2) ఎన్నికోద్యోగి అటుతర్వాత నామ నిర్దేశ పత్రములను పరిశీలించి, ఏనామ నిర్దేశమునకైన అప్పటిలో చేయబడగలట్టి ఆక్షే పణలనన్నింటిని తీర్మానించవలెను మరియు అట్టి ఆక్షేపణమీదగాని, తాను స్వయముగాచేసిన ప్రతిపాదనమీద గాని, అట్లు వెను వెంటనే తాను యుక్తమని తలంచగల విచారణ ఏదైననున్నయెడల దానిని చేసిన తర్వాత ఏనామ నిర్దేశ పత్రమునుగాని, ఈ క్రింది ఆధారము లలో దేనిమీదనైన త్రోసివేయవచ్చును

(1) చట్టముయొక్క 13, 14, 15, 16వ సెక్షను క్రిందనైన లేక 21 (1) వ సెక్షనుకైన రెండవ మినహాయింపు (ప్రోవైసో) నిబంధన క్రిందనైన ఎన్నికలో పోటీచేయుటకు అభ్యర్థి అనర్హుడు గా నుండుట

(II) ఉపపాదకుడుగాని, బలపఱచువ్యక్తిగాని పంచాయతీకైన ఓటర్ల జాబితాలో తన పేరు రిజిష్టరు చేయబడని మనిషిగా నుండుట ,

(III) అభ్యర్థిగాని, అతని ఉపపాదకుడుగాని లేక బలపఱచు వ్యక్తిగాని, 4 వ లేక 6 వ విధియొక్క నిబంధనల ననుసరించి నడచుకొనుటలో వారు ఏ విధముగానైన తప్పిపోవుట , లేక

(IV) ఎన్నిక, అనుసూచిత జాతుల సభ్యులకు ప్రత్యేకించి యుంచబడిన స్థానమునకు లేక స్థానములకు మాత్రమే జరుపబడునప్పుడు, అభ్యర్థి అనుసూచిత జాతులలో దేనికైనను చెందకుండుట

ఐతే, అభ్యర్థియొక్క నామనిర్దేశము, ఆయా సందర్భమునకు తగినట్లు అభ్యర్థి, అతని ఉపపాదకుడు లేక అతనిని బలపఱచువ్యక్తి వారేమని నిస్సందేహముగ ఋజువు చేయబడిన తర్వాత, అభ్యర్థి యొక్క పేరు, లేక అతని ఉపపాదకుని లేక అతనిని బలపఱచు మనిషి యొక్క పేరు మరియు ఓటర్ల జాబితాలో నమూదు చేయబడినట్లుండు అభ్యర్థికి, అతని ఉపపాదకునికి లేక అతనిని బలపఱచువ్యక్తికి సంబంధించిన ఏ ఇతర తప్పిదమైనను తప్పుగా వివరింపబడియున్నవను కారణముమీద మాత్రము నిరాకరించబడకూడదు

(3) ఎన్నికోద్యోగి, ప్రతి నామ నిర్దేశపత్రముమీద, దానిని అంగీకరించుచు లేక నిరాకరించుచు చేసిన తీర్మానమును ఎండార్సు చేయవలెను నామ నిర్దేశపత్రము నిరాకరించబడినచో, అట్లు నిరాకరించినందులకైన తన కారణములయొక్క సంక్షిప్త వివరణను లిఖిత పూర్వకముగా రికార్డుచేయవలెను 8 వ విధిక్రింద ఈ విషయమున నిర్ణయింపబడిన తేదీన పరిశీలన అంత్యము కావలెను మరియు చర్యాక్రమముల వాయిదా అనుమతింప బడకూడదు

9 (1) అభ్యర్థియొక్క నామనిర్దేశము నిరాకరించబడినచో ఎన్నికోద్యోగి అభ్యర్థిచే లేక అతనిచే అధికారమీయబడిన ఏజెంటుచే లిఖిత పూర్వకమైన దరఖాస్తు పెట్టుకొనబడిన మీదట, అట్టి నామ

నిర్దేశమును నిరాకరించుచు చేసిన ఉత్తరువుయొక్క నకలును వెంటనే అతని కియ్యవలెను

(2) అభ్యర్థియొక్క నామ నిర్దేశమును నిరాకరించుచుచేసిన ఏ ఉత్తరువుమీాదగాని, రెవిన్యూడివిజనల్ ఆఫీసరుకు అపీలు చేయుటకు వీలుగానుండవలెను అపీలుయొక్క యాదాస్తు రెవిన్యూడివిజనల్ ఆఫీసరుకు అందజేయబడవలెను లేక ఉత్తరువు చేయబడిన తేదీ నుండి మూడు దినములలోపల అతనికి చేరవలెను.

(3) పైన జెప్పిన మూడు దినములు గతించిన మీాదట, రెవిన్యూడివిజనల్ ఆఫీసరు (2) వ ఉపనిధి ననుసరించి తనకు అపీలు పెట్టుకొనబడినదా లేదా అను విషయమునుగూర్చి ఎన్నికోద్యోగికి వెంటనే తెలియుచేయవలెను అట్టి ఏ అపీలు లేక అపీళ్లు పెట్టుకొన బడినచో, రెవిన్యూడివిజనల్ ఆఫీసరు అట్టి అపీలు లేక అపీళ్ళమీాద తనచే చేయబడిన ఉత్తరువులను అట్లు గతించి పోవుటనుండి నాలుగు దినములలోపల అనగా నామ నిర్దేశముల పరిశీలనకై నిర్ణయించిన తేదీ నుండి ఏడుదినములలోపల ఎన్నికోద్యోగికి తెలియు జేయవలెను

10 (1) నామ నిర్దేశముల పరిశీలన తేదీనుండి మూడు దినములు గతించినమీాదట లేక 9 వ విధియొక్క (2) వ విధి ననుసరించి ఏ అపీలు లేక అపీళ్లుగాని పెట్టుకొనబడినపక్షమున అట్టి పరిశీలన తేదీనుండి ఏడు దినములు గతించినమీాదట, ఎన్నికోద్యోగి ఆ ప్రదేశములోని ప్రధాన భాషతో నామనిర్దేశములు నిరాకరించబడని మరియు అభ్యర్థిత్వమును ఉపసంహరించుకొనని మనుష్యుల పేర్లుగల పట్టీని III వ నమూనాలో తయారు చేయవలెను మరియు, దానిని సంబంధించిన పంచాయితీ ఆఫీసులో నోటీసుబోర్డు ఉన్నచో దానిలో, అట్లులేనిచో పంచాయితీలోని ఏ ప్రాముఖ్యమైన స్థలమునందైనను, ఎన్నికకు నిర్ణయింపబడిన తేదీకి కనీసము నాలుగు దినములకు పూర్వమైనను ప్రకటించవలెను

(2) ఆ పట్టీలో అభ్యర్థుల పేర్లన్నియు అక్షర క్రమములో నుండవలెను మరియు అది వారిని గూర్చి వారి నామ నిర్దేశపత్రము

లలో నుండునట్లుగా వివరించవలెను పోలు అవసరమైనచో, (3) వ ఉపవిధి ననుసరించి వారికి ఇయ్యబడిన ప్రత్యేక చిహ్నములతో నిర్దేశించవలెను

(3) పోలు చేయుట అవసరమైనచో, ఆ విషయములో ప్రభుత్వమువారు జారీ చేయగల ఆజ్ఞలకు లోబడి ఎలక్షను ఆఫీసరు ప్రతి అభ్యర్థికి ఒక ప్రత్యేక చిహ్నము నిర్ణయించవలెను.

11 (1) ఏ అభ్యర్థిగాని తనచే సంతకము చేయబడిన లిఖిత పూర్వకమైన నోటీసునిచ్చి, తన నామ నిర్దేశ పత్రము లేక పత్రములను హాజరుపెట్టిన తర్వాత ఏ కాలమందైనను మరియు నామ నిర్దేశముల పరిశీలనకు నియమింపబడిన దినమునకు తర్వాత రెండవ దినము మధ్యాహ్నము 3 గంటలకు మించక తన అభ్యర్థిత్వమును ఉపసంహరించుకొనవచ్చును

నోటీసు అభ్యర్థిచే స్వయముగా ఎన్నికోద్యోగికి అందజేయబడిననేతప్ప, నోటీసుమీద అభ్యర్థి సంతకము, వకాలతులమీద సాక్షి సంతకముచేయుటకు అధికార మీయబడిన వ్యక్తిచే సాక్షి సంతకము చేయబడవలెను

(2) పోలు చేయుట అవసరమని తలంచగల సందర్భములలో, అభ్యర్థిచే సంతకము చేయబడి లిఖిత పూర్వకమైన నోటీసును, (1) వ ఉప విధిలో నిర్దేశింపబడిన ఉప సంహరణకైన కడపటి గంట తర్వాత, అయితే పోలుకు నిర్ణయింపబడిన తేదీకి, కనీసము మూడు పూర్ణదినములకు పూర్వము ఎన్నికోద్యోగికి స్వయముగా అందజేయుచూ అభ్యర్థి తన అభ్యర్థిత్వమును వుపసంహరించు కొనవచ్చును

ఈ ఉపవిధికింద చేయబడిన ఉపసంహరణ, అట్టి ఉప సంహారణకైన కడపటి దినము మధ్యాహ్నము 5 గంటలను మించక చేయబడవచ్చును

వివరణము—ఈ ఉపవిధి క్రిందిఉపసంహారణ, అభ్యర్థిచే లేక అతని తరఫున చేయబడిన డిపాజిటు, దండుగక్రింద చెందును

(3) ఎన్నికోద్యోగి, (1) వ ఉపవిధిననుసరించి లేక (2) వ ఉపవిధి ననుసరించి ఉపసంహరణ నోటీసు తనకు అందినమీదట, సాధ్యమైనంత త్వరలో ఉపసంహరణ నోటీసు, 10 వ విధి,- (1) వ ఉపవిధిలో నిర్దేశింపబడినవిధముగా ప్రకటింపబడునట్లు చేయవలెను ఉపసంహరణ (2) వ ఉపవిధి ననుసరించి చేయబడినచో, ఎన్నికోద్యోగి, అట్టి ఉపసంహరణనుగూర్చి వెంటనే, తమ అభ్యర్థిత్వములను ఉపసంహరించుకొనని తదితర అభ్యర్థులందరికి తెలియజేయవలెను

(4) (1) వ ఉపవిధి లేక (2) వ ఉపవిధిక్రింద తన అభ్యర్థిత్వమును ఉపసంహరించుకొనిన అభ్యర్థి, ఉప సంహరణను రద్దుచేసికొనుటకుగాని, అదే ఎన్నికకు ఒక అభ్యర్థిగా తిరిగి నామనిర్దేశము చేయబడుటకుగాని అనుమతింపబడకూడదు.

12 ఈ క్రింది నిబంధనలు, 10 వ విధిననుసరించి ప్రకటింపబడిన చెల్లదగిన నామనిర్దేశముల పట్టీలోవచ్చు పేర్లుగల అభ్యర్థుల విషయములో వర్తించవలెను

1 వ కేసు-ప్రత్యేకించబడని స్థానములను మాత్రము భర్తీ చేయుటకైగాని ప్రత్యేకించబడిన స్థానములను మాత్రము భర్తీచేయుటకైగాని ఎన్నిక జరుపబడినపుడు-

(a) ఆయా సందర్భమునకు తగినట్లు, అభ్యర్థుల లేక అర్హులైన అభ్యర్థులసంఖ్య ఖాళీస్థానముల సంఖ్యకు సమానముగానున్నప్పుడు, ఎన్నికోద్యోగి అట్టి అభ్యర్థిని లేక అట్టి అభ్యర్థులందరిని క్రమముగా ఎన్నుకొనబడినట్లు ప్రసిద్ధపరుచవలెను

(b) ఆయా సందర్భమునకుతగినట్లు, అభ్యర్థుల లేక అర్హులైన అభ్యర్థుల సంఖ్య, ఖాళీస్థానముల సంఖ్యకంటె తక్కువగా నున్నప్పుడు, ఎన్నికోద్యోగి అట్టి అభ్యర్థిని లేక అట్టి అభ్యర్థులందరిని క్రమముగా ఎన్నుకొనబడినట్లు ప్రసిద్ధపరుచవలెను మరియు ఎన్నిక సంబంధమైన వ్యవహారములు, మిగిలియున్న ఖాళీని లేక ఖాళీలను భర్తీచేయు నిమిత్తము, క్రొత్త ఎన్నికకైనట్లో, అట్లే అన్నివిధముల సరిక్రొత్తగా ప్రారంభింపబడవలెను

(c) ఆయా సందర్భమునకు తగినట్లు ఏ అభ్యర్థిగాని లేక అర్హత గల అభ్యర్థిగాని లేనప్పుడు, ఖాళీని లేక ఖాళీలను భర్తీచేయు నిమిత్తము, క్రొత్త ఎన్నికకైన నెట్లో అట్లే అన్నివిధముల ఎన్నిక సంబంధమైన వ్యవహారములు సరి క్రొత్తగా ప్రారంభింపబడవలెను. మరియు

(d) ఆయా సందర్భమునకు తగినట్లు, అభ్యర్థుల లేక అర్హత గల అభ్యర్థుల సంఖ్య, ఖాళీ స్థానముల సంఖ్యను మించునెడల పోలును జరుపవలెను.

2 వ కేసు-(i) ఒకటి లేక ఎక్కువ రిజర్వు చేయబడిన ఖాళీ స్థానములను, మరియు

(ii) ఒకటి లేక ఎక్కువ రిజర్వుచేయబడని ఖాళీస్థానములను భర్తీచేయుటకు జరుపబడు ఎన్నిక సందర్భములో-

(a) రిజర్వుచేయబడిన స్థానములకు యోగ్యతగల అభ్యర్థుల సంఖ్య ఖాళీస్థానముల సంఖ్యకు సమానమైనయెడల ఎన్నిక ఉద్యోగి అట్టి అభ్యర్థిని లేక అట్టి అభ్యర్థులనందరిని సదరు రిజర్వుచేయబడిన స్థానమునకు లేక స్థానములకు సక్రమముగా ఎన్నుకొనబడినట్లు ప్రకటించవలెను ,

(b) రిజర్వుచేయబడిన స్థానములకు యోగ్యతగల అభ్యర్థుల సంఖ్య ఖాళీస్థానముల సంఖ్యకంటె తగ్గినయెడల ఎన్నిక ఉద్యోగి అట్టి అభ్యర్థిని లేక అభ్యర్థులనందరిని రిజర్వుచేయబడిన స్థానమునకు లేక స్థానములకు సక్రమముగా ఎన్నుకొనబడినట్లు ప్రకటించవలెను. మరియు శేషించియుండు ఖాళీ స్థానమును లేక ఖాళీ స్థానములను భర్తీచేయుటకు అన్నిసందర్భములలోను క్రొత్త ఎన్నికకువలె ఎన్నిక చర్యలు క్రొత్తగా ప్రారంభింపబడవలెను ,

(c) ప్రత్యేకించబడిన (రిజర్వు) స్థానములకు యోగ్యతగల అభ్యర్థి లేనప్పుడు అన్నిసందర్భములలోను క్రొత్త ఎన్నిక సందర్భములోవలె మిగిలియుండు సదరు ఖాళీస్థానమును లేక ఖాళీ స్థానములను భర్తీచేయుటకు ఎన్నిక చర్యలు క్రొత్తగా ప్రారంభింపబడవలెను ,

(డి) (a) లేక (b) క్లాజు క్రింద సక్రమముగా ఎన్నుకొనబడి నట్లు ప్రకటింపబడిన అభ్యర్థులు ఎవరైనను ఉన్నయెడల వారిని వారు అట్లు ఎన్నుకొనబడునట్లు ప్రకటింపబడిన స్థానములు ఏవైనను ఉన్నయెడల వాటిని, మరియు (b) లేక (c) క్లాజు క్రింద క్రొత్త ఎన్నిక చర్యలు అవసరమగుస్థానము లేవైన యున్నయెడల వాటిని శేషించియుండు ఎన్నిక చర్యలనుండి మినహాయించవలెను,

(e) (d) క్లాజునుబట్టి అభ్యర్థునకు స్థానముమినహాయింపు చేయవలసినపక్షమున మినహాయించిన మీదట-

(i) శేషించిన అభ్యర్థులసంఖ్య శేషించిన ఖాళీస్థానముల సంఖ్యకు సమానమైయుండినయెడల, ఎలక్షను ఆఫీసరు సదరు అభ్యర్థులను సదరు ఖాళీస్థానములకు సక్రమముగా ఎన్నుకొనబడినట్లు ప్రకటించవలెను,

(ii) శేషించిన అభ్యర్థులసంఖ్య శేషించిన ఖాళీస్థానముల సంఖ్యకంటె తక్కువైనయెడల, ఎలక్షను ఆఫీసరు సదరు అభ్యర్థులను సదరు ఖాళీస్థానములకు సక్రమముగా ఎన్నుకొనబడినట్లు ప్రకటించవలెను మరియు అన్నిసందర్భములలోను క్రొత్త ఎన్నిక సందర్భము లోవలెనే ఖాళీస్థానము లేక ఖాళీ స్థానములను భర్తీచేయుటకు ఎన్నిక చర్యలు క్రొత్తగా ప్రారంభింపవలెను,

(iii) అభ్యర్థులు శేషించనియెడల, అన్నిసందర్భములలోను క్రొత్త ఎన్నికసందర్భములోవలెనే శేషించిన ఖాళీస్థానములను భర్తీ చేయుటకు ఎన్నికచర్యలు క్రొత్తగా ప్రారంభింపవలెను, మరియు

(iv) శేషించిన అభ్యర్థులసంఖ్య శేషించిన ఖాళీస్థానముల సంఖ్యకంటె ఎక్కువగానున్న పక్షమున పోలు జరుపవలెను,

(f) (a) మొదలు (d) వరకుగల క్లాజులు వర్తించని సందర్భములలో-

(i) యెన్నికకు నిలుచు అభ్యర్థులసంఖ్య ఖాళీస్థానముల సంఖ్యకు సమానమైనయెడల, యెలక్షను ఆఫీసరు సదరు అభ్యర్థులను వారి జాతివిషయమును పాటించకుండ సదరు రిజర్వు స్థానములకును

రిజర్వుచేయని స్థానములకును (g) క్లాజులో వివరింపబడిన విధమున సక్రమముగా యెన్నుకొనబడినట్లు ప్రకటించవలెను

(ii) అభ్యర్థుల సంఖ్య ఖాళీస్థానముల సంఖ్యకంటె తగ్గిన యెడల యెలక్షను ఆఫీసరు సదరు అభ్యర్థులను వారి జాతిని పాటింప కుండ సదరు రిజర్వుస్థానములకును రిజర్వుచేయని స్థానములకును (g) క్లాజులో వివరింపబడిన విధమున సక్రమముగా యెన్నుకొనబడినట్లు ప్రకటించవలెను మరియు అన్ని సందర్భములలోను క్రొత్త యెన్నిక సందర్భములోవలె ఇంకను శేషించియుండు ఖాళీస్థానమును లేక ఖాళీ స్థానములను భర్తీచేయుటకు యెన్నికచర్యలు క్రొత్తగా ప్రారంభింప వలెను, మరియు

(iii) అభ్యర్థులసంఖ్య ఖాళీస్థానముల సంఖ్యకంటె మించి యున్నయెడల పోలు జరుపవలెను

(g) (i) (f) క్లాజుయొక్క (i) లేక (ii) వ సబుక్లాజు క్రింద వచ్చు సందర్భములో, ఈ క్రింది సబుక్లాజుక్రింద రిజర్వు స్థానములకు యెన్నుకొనబడినట్లు ప్రకటింపబడిన అభ్యర్థులుతప్ప మిగిలిన అభ్యర్థు లందరు రిజర్వుచేయబడని స్థానమునకు లేక స్థానములకు యెన్నుకొన బడినట్లు ప్రకటింపవలెను, మరియు

(iv) ఎలక్షను ఆఫీసరు, రిజర్వుస్థానములకు యోగ్యతగల అభ్యర్థులకు నోటీసునిచ్చిన పిమ్మట సదరు అభ్యర్థులలో యెవరు సదరు రిజర్వుస్థానమునకు లేక స్థానములకు యెన్నుకొనబడినట్లు ప్రక టించవలెనో వారి విషయమును చీటీలువేసి తీర్మానించవలెను,

అయితే సదరు అభ్యర్థులు తమలోతాము యెవరిని సదరు రిజర్వు స్థానమునకు లేక స్థానములకు యెన్నుకొనబడినట్లుగా ప్రకటింప వలెనని సమ్మతించి వారందరును తమ సమ్మతమును తెలియజేయు నివేదికలో చేవ్రాలుచేసి దానిని యెలక్షను ఆఫీసరుకు 11 వ విధి యొక్క (1) వ ఉపవిధిక్రింద అభ్యర్థిత్వ ఉపసంహారణకు నిర్ణ యించిన కాలవ్యవధి అంతరించిన 24 గంటలలోపల దాఖలుచేసిన పక్షమున యెలక్షను ఆఫీసరు తదనుసారముగ ప్రకటించవలెను.

వివరణము - ఈ విధిలో-

(i) 'అభ్యర్థి' అనగా సక్రమముగా నామనిర్దేశము చేయబడి 11 వ విధి (1) వ ఉపవిధిలో నిర్దిష్టము చేసియుండు విధమునను కాలవ్యవధిలోను తన అభ్యర్థిత్వమును ఉపసంహరించుకోనట్టి అభ్యర్థి అని అర్థము,

(ii) రిజర్వుస్థానము విషయములో 'యోగ్యతగల అభ్యర్థి' అనగా అనుసూచిత జాతులకు చెందిన వ్యక్తియైన అభ్యర్థియని అర్థము,

(iii) 'రిజర్వు స్థానము' లేక 'రిజర్వు ఖాళీస్థానము' అనగా అనుసూచిత జాతులకు చెందినవ్యక్తికి రిజర్వుచేయబడిన స్థానము లేక ఖాళీస్థానము అని అర్థము, మరియు

(iv) 'రిజర్వుచేయని స్థానము' లేక 'రిజర్వుచేయని ఖాళీస్థానము' అనగా అనుసూచితజాతులకుచెందిన వ్యక్తికి రిజర్వు చేయని స్థానము లేక ఖాళీస్థానము అని అర్థము

13 నామనిర్దేశముల పరిశీలన పూర్తియై పోలు జరుగుటకు ముందుగా 10 వ విధిక్రింద ప్రకటింపబడిన చెల్లతగిన నామనిర్దేశముల పట్టీలో పేరు నమూదైయుండు అభ్యర్థి, 11 వ విధియొక్క (2) వ ఉపవిధిక్రింద తన అభ్యర్థిత్వమును వుపసంహరించు కొనినను లేక ఈ ఆక్టుయొక్క 16 వ సెక్షనులోని (2) వ సబు సెక్షను యొక్క (f) క్లాజుక్రింద యెన్నికకు అనర్హుడైనను, యెలక్షను ఆఫీసరు సందర్భమునకు తగినట్లు సదరు వుపసంహారణ తమకు అందినమీదట గాని, సదరు అనర్హతకలదని తనకు నచ్చినమీదటగాని సదరు అభ్యర్థి నామనిర్దేశమును త్రోసివేయవలెను మరియు 12 వ విధియొక్క ఉపబంధనలు అందుమీద (అవసరమైనయెడల) శేషించిన అభ్యర్థి లేక అభ్యర్థుల విషయమున క్రొత్తగా వర్తింపచేయవలెను

అయితే ఈ విధిలో చెప్పినదేదియు సదరు అభ్యర్థి, 12 వ విధి క్రింద సక్రమముగా యెన్నుకొనబడినట్లు అంతకుపూర్వమే ప్రకటింప బడియున్నయెడల వర్తించకూడదు.

14 పోలును జరుపుట అవసరమైన తర్వాతనున్ను పోలు జరుగుటకు పూర్వమునున్ను, సక్రమముగా నామ నిర్దేశము కాబడిన అభ్యర్థి చనిపోయినచో, యెన్నికోద్యోగి, అభ్యర్థి చనిపోయిన విషయమును గూర్చి విచారణచేసి తృప్తిపడినమీాదట, పోలును రద్దుచేయవచ్చును. మరియు వొక క్రొత్త యెన్నికకువలె, యెన్నిక వ్యవహారములు అన్ని సందర్భములలో నూతనముగా ప్రారంభించబడవలెను

అయితే, ఏ క్రొత్త నామనిర్దేశముగాని, పోలును రద్దుచేయు సమయమందు నామనిర్దేశము చేయబడియుండు అభ్యర్థి విషయములో, అవసరములేదు.

## ఓటుచేయుట

15 (1) పోలు జరుపబడవలసినప్పుడు, యెన్నికోద్యోగి ప్రతి పోలింగు స్టేషనుకు, వొక పోలింగుఅఫీసరును లేక అంతకు యెక్కువ ఆఫీసర్లను వెంటనే నియమించవలెను మరియు వారు చేయు సేవలకుగాను న్యాయమైన వేతనమును చెల్లించవచ్చును. ఎన్నికోద్యోగి, ప్రతి పోలింగు ఆఫీసరునకు అవసరమైనంతమంది గుమస్తాలను ఏర్పాటుచేయవలెను మరియు, అవసరమైనచో, యెన్నికదారులను గుర్తించుటలో పోలింగు ఆఫీసరుకు సహాయపడు నిమిత్తము, వొక గుర్తించు ఉద్యోగిని లేక ఉద్యోగులనుకూడ నియమించవచ్చును పోలింగు ఆఫీసర్లు, పోలు జరుగబోవు నిర్వాచనక్షేత్రముకైన సంబంధించిన పంచాయతీయొక్క సభ్యులుగాగాని, అందులో రిజిస్టరు చేయబడిన యెన్నికదారులుగా గాని, పంచాయతీయొక్క ఉద్యోగిగాగాని లేక ఇతర నౌకరుగాగాని నుండకూడదు

(2) పోలింగు ఆఫీసరు, పోలింగు స్టేషనులో అల్లరులు జరుగకుండునట్లును, యెన్నిక న్యాయముగా జరుపబడునట్లును చూచుకొనవలెను ఒకే సమయమందు ప్రవేశించవలసిన యెన్నికదారుల సంఖ్యను క్రమపరుచవలెను, మరియు,

(ఎ) అభ్యర్థులు, మరియు అభ్యర్థిచే లిఖితపూర్వకముగా నియమింపబడిన ఒక సమయమందు ప్రతి బూతువద్ద ప్రతి అభ్యర్థి యొక్క (ఇటుతర్వాత పోలింగు ఏజెంటని నిర్దేశించబడు) ఏజెంటు

(బి) డ్యూటీమీాదనుండు పోలీసు లేక ఇతర పబ్లిక్ నౌకరులు, మరియు

(సి) తన స్వంతగుమస్తాలు మరియు యెన్నికదార్లను గుర్తించు నిమిత్తము పోలింగు ఆఫీసరు అప్పుడప్పుడు ప్రవేశపెట్ట గలట్టి మనుష్యులు

తప్ప, తదితర మనుష్యులందరిని మినహాయించవలెను

(3) 'పర్దా' పద్ధతిని అవలంబించియుండు కారణమువలన, (1) వ ఉపవిధి ననుసరించి నియమింపబడిన గుర్తించు వుద్యోగులచే, గుర్తించుటకు వీలులేని స్త్రీ యెన్నికదారు విషయములో, ఆమె తన ఆనవాలునుగూర్చి పోలింగు ఆఫీసరును ఇతరవిధముగా తృప్తిపరచిననే తప్ప, ఆమె తన సమీాప బంధువులలో యెవరిచేనైన గుర్తింపబడునట్లు కోరబడవచ్చును

ఈ ఉపవిధి క్రిందిఅర్థములో ఏ మనిషియైనను సమీాప బంధువా, కాడా యను ప్రశ్న ఏర్పడినప్పుడు అది పోలింగు ఆఫీసరుచే నిర్ణయింపబడవలెను ఆయన నిర్ణయమునకు అపీలులేదు

16 ప్రతి పోలింగు స్టేషనులో మరియు ఒకటికంటె యెక్కువ బూతులను కలిగిన పోలింగు స్టేషనులో, అట్టి ప్రతి బూతులో యెన్నికదారులు, ఇతరులు చూడకుండ ఓట్లను రికార్డు చేయుట కనువైన ప్రత్యేకగది యుండవలెను సాధ్యమైనంతవరకు, 17 వ విధి ననుసరించి చర్య తీసికొనబడని సందర్భములో స్త్రీ ఎన్నికదారులకు ప్రత్యేకగదులు, మరియు ప్రత్యేకముగా లోపలికి పోవు ద్వారములును, బయటికివచ్చుటకైన ద్వారములును ఏర్పాటు చేయబడవలెను.

17 ఇందు ఇంతకు పూర్వము ఏమియున్నను దానితో నిమిత్తము లేకుండా, ఎన్నికోద్యోగి, తన ఇష్టానుసారము, పోలింగు ఆఫీసర్లుగా పనిచేయుటకు తగినట్టియు, అంగీకరించినట్టియు చాలినంత మంది స్త్రీలు ఉన్నయెడల, ఏ పోలింగు ప్రదేశమునకైనటువంటి స్త్రీ యెన్నికదార్ల ఓట్లను తీసికొను నిమిత్తము, ఒక ప్రత్యేక పోలింగు స్టేషనును ఏర్పాటు చేయవచ్చును, లేక అట్టి ఎన్నికదార్లు ఏకాంతముగా నుండునట్లు చేయుటకు అవసరమైనట్టి ఇతర ఏర్పాట్లను చేయవచ్చును అట్టి సందర్భములలో, సంబంధించిన స్త్రీ యెన్నికదార్ల ఓట్ల విషయములో, స్త్రీలు మాత్రమే పోలింగు ఆఫీసర్లుగా పనిచేయుటకు నియమింపబడవలెను. పోలీసువారు లేక డ్యూటీమీద నుండు ఇతర సర్కారు నౌకర్లు తప్ప, స్త్రీకానట్టి ఏ అభ్యర్థి, అభ్యర్థి ఏజెంటు లేక ఇతర మనిషి, ఆయా సందర్భమునకు తగినట్లు, అట్టి పోలింగు స్టేషనువద్ద లేక అట్టి స్త్రీ యెన్నికదార్ల ఓట్లు తీసికొనబడుచుండునట్టి స్థలమువద్ద ప్రవేశింప నియ్యకూడదు లేక హాజరైయుండకూడదు.

18 (1) ఎన్నికోద్యోగి, ప్రతి పోలింగు స్టేషనువద్దనుండు ప్రతిపోలింగు గదిలో ఎందరు అభ్యర్థులున్నారో అన్ని బ్యాలటు పెట్టెలను ఏర్పాటుచేయవలెను ప్రతి అభ్యర్థిపెట్టెమీద, అభ్యర్థికిచ్చిన వరుస సంఖ్యయు, ప్రత్యేకచిహ్నమును యుండవలెను. ఆయన అభ్యర్థులందరికి ప్రత్యేకించిన విస్పష్టమైన, 28 వ విధి (2) వ ఉపవిధియొక్క (11) క్లాజు అమలు జరుపుటకు వీలగునట్లు అవసరమైనన్ని పలువిధ చిహ్నములు గలిగిన, చాలినన్ని యెన్వలప్పులు (కవర్లు) అవసరమైనట్టి వెలుపలికవర్లు, ఓటర్ల జాబితాలు లేక స్టేషనులో ఓటుచేయుటకు హక్కుగల యెన్నికదార్ల పేర్లను కలిగియుండునట్టి భాగము, మరియు అవసరమైయుండగలట్టి ఇతర కాగితములు, స్టేషనరీ (కాగితము, కలము వగైరా వస్తువులు) మరియు నమూనాలు-వీటితో సహా ఏర్పాటు చేయవలెను ఇంకను ఆయన ప్రతి అభ్యర్థియొక్క పేరును, అతని కివ్వబడిన వరుస సంఖ్యను చిహ్నమును ఎన్నిక ఎన్ని ఖాళీలనిమిత్తము జరుపబడినదో వాటి

సంఖ్యను పెద్ద అక్షరములలోను, స్పష్టమైన అచ్చులోను ప్రదర్శించు నట్టి ఒక బోర్డును (పలకను) ఏర్పాటుచేయవలెను

(2) ప్రతి బ్యాలటు పెట్టెయు, దానిని తెరువకయే బ్యాలటు కాగితములను లోపలికి పడవేయుటకును, అయితే దానినుండి వాటిని బయటికి తీయుటకు వీలులేనట్టి విధముగాను నుండునట్లు తయారు చేయబడవలెను

19 ఏ పోలింగు స్టేషనువద్దనుండు పోలింగు ఆఫీసరుగాని, పోలును ప్రారంభించుటకు అవ్యవహితముగా పూర్వము, అట్టి స్టేషను వద్ద హాజరైయుండగలట్టి మనుష్యులకు, ప్రతి బ్యాలటు పెట్టెయు ఖాళీగానున్నదని వారు చూచు నిమిత్తము, బ్యాలటు పెట్టెలలో ప్రతిదానిని ఖాళీగానున్నదని చూపవలెను. అటు తర్వాత దానికి తాళమువేసి, సీలును పగులకొట్టక దానిని తెరువ వీలులేని విధము గా దానిమీాద తనముద్రను వేయవలెను అందుమీాదట, అతడు అట్లు తాళమువేసి సీలుజేసిన పెట్టెను, బ్యాలటు పేపర్లను వేయునిమిత్తము అయితే బయటివారు చూడ వీలులేని విధముగా పోలింగ గదిలో నుంచవలెను

బ్యాలటు పెట్టెలను ఎడమవైపునుండి కుడివైపుగా తత్కార్యము నిమిత్తము కేటాయించియుండు స్థలములో 3 వ నమూనాలో పేరులు ప్రచురించబడియుండిన వరుసలో వుంచవలెను

20 (1) బ్యాలటు కాగితములు IV వ నమూనాలో నుండ వలెను వాటికి ఎదురుప్రతులు (కౌంటరు ఫాయిలు) జతచేసియుండ వలెను ఆ ఎదురుప్రతులు IV A నమూనాలో నుండవలెను రెండు లేక మించిన స్థానములకు పోటీజరుప వలసిన యెడల, ఒక్కొక్క ఎదురు ప్రతికి, స్థానములెన్ని కలవో, అన్ని ప్రతులు అంటించి యుండవలెను

(2) బ్యాలటు కాగితములపై సంఖ్యలు వరుసగా వేయబడియుండ వలెను ఈ సంఖ్యలు, ప్రతుల మీాదను, ఎదురుప్రతుల మీాదను, వేయబడియుండ వలెను రెండుస్థానములకు లేక అంతకు పైబడిన స్థానములకు పోలు జరుపు సందర్భములో వరుస నెంబర్లలో ప్రతి నెంబరును ఎన్ని స్థానములుండునో అన్ని బ్యాలటు పేపర్లపై ముద్రించ

వలెను ఆ బ్యాలటు పేపర్లలో మొదటి దానిలో నెంబరు మాత్రమే యుండవలెను శేషించిన బ్యాలటు పేపర్లలో నెంబరును దాని ప్రక్కన ఇంగ్లీషు అక్షరములలో పెద్ద అక్షరములను వరుసక్రమములో నుండవలెను

ఉదాహరణము — 3 స్థానములకు పోలు జరుగవలసినదని అనుకొనుము ఈ సందర్భములో వరుసగా నెంబరు వేయుట 1, 1-A మరియు 1-B , 2, 2A మరియు 2-B , 3, 3-A మరియు 3-B ఈ క్రమములో నుండవలెను

(3) ప్రతిబ్యాలటు కాగితము మీాదను, ఎలక్షను అధికారి విధించిన సూచనల మేరకు మార్కు లేక మార్కులను ముద్రింపబడవలెను

21 (1) ఒక స్థానముకంటె ఎక్కువ స్థానములు భర్తీచేయనవసరములేని నిర్వాచనక్షేత్రములకు (వార్డులకు) జరుగు ఎన్నికలలో ఒక ఎన్నికదారునకు ఒకటే ఒక బ్యాలటు పేపరు నియ్యవలెను ఆ బ్యాలటు పేపరును సదరు ఎన్నికదారు ఏ అభ్యర్థికి తాను ఓటిచ్చుటకు విన్యస్త్రించునో ఆ అభ్యర్థికి కేటాయించిన వరుస నెంబరును చిహ్నము బ్యాలటు పెట్టెలో వేయవలెను

(2) ఒకటికంటె ఎక్కువ స్థానముల పూర్తి చేయవలసిన నిర్వాచనక్షేత్రములకు జరుగు ఎన్నికలలో, ప్రతి ఎన్నికదారునకు ఎన్ని స్థానములు భర్తీచేయవలసియుండునో అన్ని బ్యాలటు పేపరులను ఇయ్యవలెను మరియు పోలింగు ఆఫీసరు ఆ ఎన్నికదారుకు—

(i) ఆయన ఓటు చేయతగిన అభ్యర్థుల సంఖ్యను ,

(ii) తాను ఏయే అభ్యర్థులకు ఓటుచేయతలచునో ఆ అభ్యర్థులలో ప్రతి—ఒక్కనియొక్క బ్యాలటు పెట్టెలో ఒక బ్యాలటు పేపరు వేయవచ్చునని ,

(iii) ఒకటే బ్యాలటు పెట్టెలో రెండు గాని అంతకుమించి గాని బ్యాలటు పేపర్లను వేయకూడదని , మరియు

(iv) తనకుగల ఓట్ల సంఖ్యకంటె తక్కువ సంఖ్యగల అభ్యర్థులకు తాను ఓటు చేయ నెంచినచో అదనముగా తనవద్దనుండు బ్యాలటు పేపరు లేక పేపర్లను పోలింగు ఆఫీసరుకు వాపసు చేయవలయునని విశదీకరించవలెను , మరియు

(3) (2) ఉపవిధియొక్క (IV) వ క్లాజులో చెప్పబడియుండు అదనపు బ్యాలటు పేపరు లేక పేపర్లు వాపసుకాబడిన సందర్భములో, వాటికి సరియగు ఎదురుప్రతిలో లేక ఎదురుప్రతులలో అవి రద్దుచేసి నట్లుగా గుర్తు వేయవలెను

(4) బ్యాలటు పేపరును లేక బ్యాలటు పేపర్లను ఎన్నికదారునకు ఇచ్చుటకు అవ్యవహితముగా పూర్వము—

(a) ఎన్నికదారు సంఖ్య పేరు వివరణ ఎన్నిక పట్టీలో నమూదైన విధముగా పిలువవలెను, మరియు

(b) పోలింగు ఆఫీసరు ఎదురు ప్రతిలో ఎన్నిక పట్టీలో నమూదైన ఎన్నికదారుని పేరును సంఖ్యను నమూదు చేయవలెను

తరువాత పోలింగు ఆఫీసరు బ్యాలటు పేపరును లేక పేపర్లను ఎదురుప్రతినుండి విడదీసి వాటిని ఎన్నికదారునకు యీయవలెను ఇంకను పోలింగు ఆఫీసరు ఎన్నిక పట్టీ నకలులో ఎన్నికదారుని సంఖ్యకు ఎదురుగా, ఆయనకు బ్యాలటు పేపరు లేక బ్యాలటు పేపర్లు అందినవని తెలియజేయుటకై గుర్తు పెట్టవలెను అయితే ఫలాని బ్యాలటు పేపరు లేక బ్యాలటు పేపర్లు ఆయనకు అందినవని సూచించునట్లు ఏలాటి గుర్తుకాని వేయకూడదు

22 ఎన్నికదారు, బ్యాలటు పేపరును లేక పేపర్లను పుచ్చుకొన్న వెంటనే, పోలింగు గదిలోనికి పోయి, తన యిచ్ఛకు వచ్చిన బ్యాలటు పెట్టెలో లేక బ్యాలటు పెట్టెలలో, బ్యాలటు పేపరును లేక బ్యాలటు పేపర్లను వేయవలెను ప్రతి ఎన్నికదారు అనవసరముగ ఆలస్యము చేయక ఓటు చేయవలెను ఓటు వేసినవెంటనే పోలింగు స్టేషనునుండి వెళ్ళిపోవలెను ఏ పెట్టెలోగాని, బ్యాలటు పేపరు తప్ప మరి యేమిగాని వేయకూడదు బ్యాలటు పేపర్లు కాకుండ ఏ వస్తువైనను ఏ బ్యాలటు పెట్టెలోనైనను వున్నయెడల, ఆ వస్తువు సంబంధించిన పంచాయతీకి చెందబడును

23. (1) పోలింగు ఆఫీసరుకు, ఎన్నికదారు గ్రుడ్డివాడై యుండుట వలన 22 వ విధియందు నిర్ణయించియుండు విధముగ, ఓటుచేయుటకు అశక్తుడై యున్నట్లు, నచ్చినయెడల, సదరు పోలింగు ఆఫీసరు

ఎన్నికదారును ఆయన ఏ అభ్యర్థికి లేక అభ్యర్థులకు ఓటుచేయుటకు ఇష్టపడుచున్నాడో అడిగి కనుగొని హాజరైయుండు ఎవరైన అభ్యర్థులు లేక పోలింగు ఏజెంట్లు వుండినయెడల వారియెదుట సదరు బ్యాలటు కాగితమును లేక కాగితములను ఎన్నికదారు ఏ అభ్యర్థికి లేక అభ్యర్థులకు ఓటుచేయుటకు ఇష్టపడునో అట్టి అభ్యర్థికి లేక అట్టి అభ్యర్థులలో ప్రతివారికి కేటాయించబడిన వరుస సంఖ్యను చిహ్నము లేక చిహ్నములుగల పెట్టెలలోగాని పెట్టెలలో నొక్కొక్కదానినిగాని వేయవలెను ఎన్నికదారు తనకుగల ఓట్ల సంఖ్యకంటె తక్కువ సంఖ్యగల అభ్యర్థులకు ఓటుచేయుటకు ఇష్టపడినయెడల అదనపు బ్యాలటు పేపరులోను లేక బ్యాలటు పేపర్లలోను వాటికి సరియైన ఎదురుప్రతులలోను అవి రద్దుచేయబడినట్లుగా గుర్తు వేయవలెను.

(2) (1) వ ఉపవిధిలో వివరించియుండు విధమున ఎన్నికదారుయొక్క బ్యాలటు పేరు లేక బ్యాలటు పేపర్లు వుపయోగింపబడినవో అట్టి ప్రతిఎన్నికదారు విషయములోను పోలింగు ఆఫీసరు ఎదురుప్రతిలో సదరు పేపరు లేక పేపర్లు ఏ కారణమువలన అట్లు పరిష్కరింపబడినవో ఆ కారణమును తెలియజేయవలెను

24 ఎన్నిక అధికారులు ప్రత్యేకముగా కలుగజేయవలసిన సౌకర్యములనుగురించి వుత్తరువు లేమైనను జారీచేసియుండినయెడల సదరు వుత్తరువుల ప్రకారము స్త్రీలైన ఎన్నికదారులకు అట్టి ప్రత్యేక సౌకర్యములను కలుగజేయవచ్చును

25 ఒక వ్యక్తి తనకు బ్యాలటు పేపరు ఇయ్యబడుటకు పూర్వము ఏకాలమందైనను ఓటుచేయుటకు హాజరగునెడల, పోలింగు ఆఫీసరు తన యిష్టానుసారము లేక ఒక అభ్యర్థిచేగాని పోలింగు ఏజెంటుచేగాని కోరబడునెడల, ఈ క్రింది రెండు ప్రశ్నలలో దేనినిగాని లేక ఆరెండింటినిగాని వేయవచ్చును—

(1) ఈ క్రింది విధముగా జాబితాలో చేర్చబడినవారు మీరేనా ? (జాబితానుండి ఆ పద్దునంతను చదువవలెను)

(11) మీరు ప్రస్తుతము ఎన్నికలో ఈ పోలింగు స్టేషనులోగాని ఏ ఇతర పోలింగు స్టేషనులోగాని ఇదివరకు ఓటుచేసియున్నారా ?

మరియు సదరు వ్యక్తికి వేసిన ప్రశ్నకు లేక ప్రశ్నలకు కచ్చితముగను మరియు మొదటి ప్రశ్నకు ఔననియు రెండవ ప్రశ్నకు కాదనియు జవాబిచ్చిననేతప్ప ఆయనకు బ్యాలటు కాగితమును ఇయ్య కూడదు ఇందులో పేర్కొనబడినట్లు తప్ప, మరియు చట్టము యొక్క 12 వ సెక్షను (6) సబు సెక్షను (ప్రొవిసోక్) లోబడి, ఓటర్ల జాబితాలో పేరుగల ప్రతి వ్యక్తియు ఒక బ్యాలటు పేపరును పొందుటకు హక్కు కలిగియుండవలెను

26 ఒక వ్యక్తి ఓటర్ల జాబితాలో పేరు చేర్చబడిన ఒక ప్రత్యేక ఎన్నికదారు తానేనని తెలియబరచుచు, అట్టి ఎన్నికదారుగ మరియొక వ్యక్తి ఓటుచేసినతరువాత, బ్యాలటు పేపరును కోరు నెడల, పోలింగు ఆఫీసరు అడుగు ప్రశ్నలకు సక్రమముగా సమాధాన మిచ్చిన తరువాత, సదరు వ్యక్తి ఏ ఇతర ఎన్నికదారునకువలెనే బ్యాలటు పేపరును లేక పేపర్లును పొందుటకు హక్కు కలిగియుండవలెను

పోలింగు ఆఫీసరు అట్టి వ్యక్తికి బ్యాలటు పేపరును లేక బ్యాలటు పేపర్లలో నొక్కొక్కదానిని ఇచ్చుటకు పూర్వమువాటిపై పెద్ద అక్షరములతో "టెండరు చేయబడినది" అని వ్రాయవలెను (ఇందు నిటు తరువాత టెండరుచేయబడిన బ్యాలటు పేపర్లు అని చెప్పబడు) బ్యాలటు పేపరు లేక పేపర్లు అందినమీాదట ఎన్నికదారు పోలింగు గదిలోనికి వెళ్ళి అచ్చట బ్యాలటుపేపరును బ్యాలటు పేపర్లలోని ప్రతి పేపరును, అభ్యర్థికి లేక దరఖాస్తుదారు ఓటు నియ్యగోరు అభ్యర్థులలో ప్రతియొకనికి ఇయ్యబడియుండు చిహ్నము గల మెన్వలపులో వుంచవలెను ఆయన అందుమీాదట సదరు మెన్వలపును లేక మెన్వలపులను అంటించి దానినొక కవరులోపెట్టి పోలింగు ఆఫీసరునకు అప్పగించవలెను పోలింగు ఆఫీసరు దానిపై, ఎన్నికదారుని పేరు ఓటర్లజాబితాలోని సంఖ్య, ఎన్నిక ఏ వార్డునకు జరుపబడునో ఆ వార్డుయొక్క పేరు, సంఖ్య తెల్పుచు ఎండార్సు చేయవలెను మరియు ఆయన సదరు కవరును ప్రత్యేక ప్యాకెట్టులలో ఉంచవలెను ఈ ప్యాకెట్టులోని బ్యాలటు పేపర్లను యెన్నిక వుద్యోగి లెక్కించకూడదు. ఎన్నికదారుని పేరు, ఓటర్ల జాబితా

లోని ఆయన సంఖ్య జాబితా ఏ పోలింగు స్టేషనుకు సంబంధించినదో ఆ పోలింగు స్టేషనుయొక్క పేరు లేక ప్రత్యేకమైన సంఖ్య V వ నమూనాలో నమూదు చేయబడవలెను దీనికి "టెండరు చేయబడిన ఓట్లజాబితా" యను శీర్షిక ఉండవలెను అట్టి బ్యాలెటు పేపరును లేక పేపర్లను టెండరుచేయు వ్యక్తి ఆ జాబితాపై తన పేరు సంతకముచేసి పైవిలాసము వ్రాయవలెను లేక అతని బొటన వ్రేలి ముద్రను వేయవలెను

వివరణము – ఈ విధి క్రిందికి వచ్చునట్టి మరియు 27 వ విధి వర్తించునట్టి విషయములకు ఈ విధియొక్కయు వుపబంధనలు వర్తించును

27 (1) ఏ అభ్యర్థిగాని, పోలింగు ఏజెంటుగాని, ఏ వ్యక్తియైనను బ్యాలెటు కాగితమును కోరుట మూలముగ మరియొకరినని చెప్పి మాయోపాయముగ ప్రవర్తించినందునకైన నేరమును చేసినని ప్రకటించు నెడల లేక ఋజువుచేయుటకు పూనుకొను నెడల, సదరు మరియొకరినని చెప్పి మాయోపాయముగ ప్రవర్తించినందుకైన నేరము ఆరోపించు అభ్యర్థిని లేక ఏజెంటును అయిదు రూపాయల రొక్కమును తదవద్ద డిపాజిటు చేయవలెనని పోలింగు ఆఫీసరు కోరవలెను మరియొకరినని చెప్పి మాయోపాయముగ ప్రవర్తించినందుకైన ప్రతి నేరారోపణముగూర్చి చర్యగైకొను సందర్భములో ప్రత్యేక డిపాజిటు అవసరమైయున్నది అట్టి డిపాజిటు చేయబడనియెడల పోలింగు ఆఫీసరు సదరు ఆరోపణను లెక్కలోనికి తీసికొనకూడదు

(2) (1) వ ఉపవిధిచే కోరబడు డిపాజిటు చేయబడిన వెంటనే పోలింగు ఆఫీసరు VI వ నమూనాలో లిఖిత పూర్వకమైన ఒక వివరణమును పొందవలెను దీనిపై ఆయా సందర్భమునుబట్టి అభ్యర్థి లేక ఏజెంటు చేవ్రాలు చేయవలెను మరియు అందు పోలింగు ఆఫీసరు సమక్షమున విశ్వాసనీయులైన ఇరువురు వ్యక్తులు సాక్షి సంతకము చేయవలెను

(3) అందుమీాదట పోలింగు ఆఫీసరు, బ్యాలెటు పేపరును కోరు వ్యక్తిని (VI-A) నమూనాలో నుండు) ఆక్షేపించబడిన ఓట్ల జాబితాలో తన పేరును, పై విలాసమును నమూదు చేయవలెనని లేక ఆయన వ్రాయలేని పక్షములో దానిపై బొటనవ్రేలి ముద్రను వేయవలెనని కోరవలెను మరియు గుర్తించుటకు తగిన సాక్ష్యమును హాజరు పెట్టవలెననికూడ అట్టి మనిషిని కోరవచ్చును

(4) బ్యాలెటు పేపరును కోరు వ్యక్తిని 25 వ విధిలో నిర్దిష్టము చేయబడిన విధముగ ప్రశ్నించినమీాదట మొదటప్రశ్నకు ఔననియు రెండవ దానికి కాదనియు కచ్చితముగా జవాబు నిచ్చునెడల, మరి యొకరిననిచెప్పి మూయోపాయముగ ప్రవర్తించినందుకైన జరిమా నానుగూర్చి తెలియజేసినమీాదట ఆయనను ఓటు చేయుటకు అంగీక రించవలెను పోలింగు ఆఫీసరు పరిస్థితులను, ఆక్షేపింపబడిన ఓట్ల జాబితా విషయములో తన తీర్పునుగూర్చి షరాను వ్రాయవలెను.

(5) పోలింగు ఆఫీసరు పోలు పూర్తియైనప్పుడు, (2) వ ఉప విధిలో వివరింపబడిన వివరణమును ఆక్షేపింపబడిన ఓట్లజాబితాగల ప్యాకటులో వుంచి యెన్నిక వుద్యోగికి పంపవలెను

(6) వెంటనే యెన్నిక వుద్యోగి అవసరమగు పరిశోధనను జరిపి మరియొకరిననిచెప్పి మూయోపాయముగా ప్రవర్తించినందుకైన నేరమును చేసెనని ఆయన నమ్ము వ్యక్తిని లేక వ్యక్తులను, 1898 వ సం॥పు క్రిమినల్ ప్రొసీజరుకోడుయొక్క 196 వ విభాగముచే కోర బడిన ప్రకారము పూర్వానుమతిని పొందినమీాదట ప్రాసిక్యూటు చేయుటకు చర్యలు తీసికొనవలెను అట్టి అనుమతిని సంబంధించిన జిల్లామేజస్ట్రేటు వద్దనుండి పొందవలెను యెన్నిక కమీషనరుకు యెన్నిక అర్జినిగూర్చి నోటీసు దాఖలు చేయబడిన యెడల మరియు పరిశోధనయందున్న కేసునుగూర్చి నోటిసు అందినయెడల సదరు పరిశోధనను ఆపుచేయవలెను సదరు అర్జీని పరిష్కరించిన పిమ్మట పరిశోధనను తిరిగి ప్రారంభించవలెను ప్రాసిక్యూషనుకు సంబంధించిన న్యాయసంబంధమైన విచారణ జరిపినమీాదట మరియొకరిననిచెప్పి

మాయోపాయముగ ప్రవర్తించినందుకైన నేరము రుజువు కానట్లు కనుగొనబడినయెడల యెన్నిక వుద్యోగి, డిపాజిటుయొక్క పూర్తి భాగము పంచాయతీకి దండుగక్రింద చెందవలెనా లేక కొంతభాగమే చెందవలెనాయని తీర్మానించవలెను ఈ విషయముపై తీర్మానము చేయునప్పుడు యెన్నిక అధికారి విచారణయందు రికార్డు చేయబడిన యదార్థ విషయములను మరియు తీర్మానములనుబట్టి వ్యవహరించవలెను అట్టి న్యాయ సంబంధమైన విచారణ జరుగని పక్షమున యెన్నిక వుద్యోగి సంబంధించిన పరిస్థితులనుబట్టి తన యిష్టానుసారము, పంచాయతీకి డిపాజిటుయొక్క పూర్తిభాగము లేక ఏదైన భాగము నష్టముక్రింద యియ్యవలెనాయని తీర్మానించవలెను దండుగ క్రింద తీసికొనబడని డిపాజిటు లేక అందలి భాగమును సదరు డిపాజిటు చేసిన వ్యక్తికి వాపసు చేయవలెను.

28 ఒక వార్డులో ఓటుచేయుటకు హక్కుగల పోలింగు ఆఫీసరు, ప్రభుత్వోద్యోగి, లేక పోలింగు ఏజెంటు సాధారణముగా తాను ఓటుచేయుటకు హక్కులేని పోలింగుస్టేషనులో సేవచేయుటకు సక్రమముగా నియమితుడైనను లేక అధికారము పొందియుండినను సంబంధించిన యెలక్షను ఆఫీసరుకు తాను నియమితుడైయుండు పోలింగు స్టేషనులో ఓటుచేయుటకు తనకు హక్కు కలుగజేయు సర్టిఫికేటు నొకటి ఈయవలసినదిగా దరఖాస్తు చేసికొనవచ్చును. సదరు సర్టిఫికేటు VII వ నమూనాలో నుండవలెను.

ఒక పోలింగు ఆఫీసరు, ప్రభుత్వోద్యోగి లేక పోలింగు ఏజెంటు తాను ఓటుచేయుటకు హక్కు కలిగియుండు వార్డుకు సంబంధించని పోలింగు స్టేషనులో సేవచేయుచున్నయెడల, యెలెక్షను ఆఫీసరు పైనచెప్పిన సర్టిఫికేటుతోపాటు సంబంధించిన సదరుపోలింగు ఆఫీసరుకు యెన్నికదారు యెన్ని ఓట్లు ఇచ్చుటకు హక్కు కలిగియుండునో ఆఓట్ల సంఖ్యను, సదరువార్డులో ఈ యెన్నికకు నిలబడు అభ్యర్థులపేర్లను వారికి కేటాయించిన వరుస సంఖ్యను చిహ్నములను గురించి వివరములను తెలియజేయవలెను దీనితోపాటు ఆయనకు అట్టి వార్డుకు సంబంధించిన బ్యాలెటు పేపరును లేక పేపర్లను సదరు

అభ్యర్థులకు కేటాయించిన చిహ్నముగల ప్రతి చిహ్నములుగల ఒక యెన్వలపు నీయవలెను.

ఎలెక్షను ఆఫీసరు ఈ రెండు సందర్భములలో దేనిలోగాని సదరు సర్టిఫికేటు నకలును వెంటనే ఏ పోలింగు స్టేషనులో వొక వ్యక్తికి తాను సాధారణముగా ఓటుచేయుటకు హక్కు కలిగియున్నా డని సర్టిఫికేటు జారీచేయబడినదో ఆ పోలింగుస్టేషనుయొక్క పోలింగు ఆఫీసరుకు పంపవలెను.

(2) (1) వ వుప విధిలో నిర్ణయింపబడిన నమూనాలో ఈయ బడిన సర్టిఫికేటును స్వాధీనములోగల వ్యక్తి ఆసర్టిఫికేటును పోలింగు ఆఫీసరునకు నీయవలెను అందుమీద ఆ పోలింగు ఆఫీసరు సదరు వ్యక్తికి వొక బ్యాలెటు పేపరును లేక (1) వ వుపవిధిలో నిర్దేశింప బడియుండు నిర్వాచనక్షేత్రములో యెన్ని స్థానములు భర్తీచేయ వలసియున్నవో అన్ని వరుససంఖ్యగల బ్యాలెటు పేపర్లను ఈయ వలెను అట్టి బ్యాలటు పేపరులను ఈ క్రిందచెప్పిన విధమున వుప యోగించవలెను

(1) సదరువ్యక్తి సేవచేయుచుండు పోలింగు స్టేషను ఆయన ఓటుచేయుటకు హక్కు కలిగియున్న వార్డుకు చెందియున్న యెడల 21 వ మరియు 22 వ విధులలోని వుపబంధనలు వర్తించవలెను పోలింగు ఆఫీసరు పోలు అయిన పిమ్మట సదరు సర్టిఫికేటును 32 వ విధిలో చెప్పియుండు వివరణముతో సహా యెలెక్షను ఆఫీసరుకు పంప వలెను

(11) సదరు ఏవ్యక్తి సేవచేయుచుండు పోలింగు స్టేషను ఆయన ఓటుచేయుటకు హక్కుకలిగియుండు వార్డులో లేనియెడల, పోలింగు ఆఫీసరు బ్యాలటు పేపరును లేక బ్యాలటు పేపర్లను 21 వ విధి యొక్క (2) వ వుపవిధిలోగల సలహాలతో జారీ చేయవలెను ఆ వ్యక్తి పోలింగుగదిలోనికి పోయి బ్యాలటు పేపరును లేక బ్యాలటు పేపరులలో ప్రతిదానిని సదరు అభ్యర్థికి కేటాయించిన చిహ్నముగల యెన్వలపులో లేక అభ్యర్థులలో యెవరికి తాను ఓటు ఇచ్చుటకు ఇష్టపడునో వారిలో ప్రతి వొకరికి కేటాయించిన చిహ్నముగల యెన్వ లపులో పెట్టవలెను ఆ యెన్వలపును లేక యెన్వలపులను అతికించి

వాటిని వొక కవరులోనుంచి ఆ కవరును మూసి దానిని పోలింగు ఆఫీసరు చేతపెట్టవలెను పోలింగు ఆఫీసరు ఓట్లు ఈయబడిన ఓట్లుకవర్లను ఆయా వార్డుకు ప్రత్యేకంగా ప్యాకెట్లుగా కట్టి సంబంధించిన సర్టిఫికెటును ఆ కవర్లకు బంధించి 21 వ విధిలో నిర్దేశించియుండు విధముగా అట్టి ప్రతిప్యాకెటును శీలుచేసి దానిని యెలక్షను ఆఫీసరునకు పంపవలెను

29 (1) ఏ పోలింగు స్టేషనులోగాని జరుగు వ్యవహారములకు అల్లరివలన లేక బహిరంగ దౌర్జన్యమువలన లేక ఇతర కారణముల మూలముగా ఉద్ధృతంగా భంగము లేక ఆటంకము కలిగినయెడల లేక అగ్ని ప్రమాదము లేక వరదలువంటి ఏదేని దైవసంఘటనల కారణమువలన ఒక పోలింగు స్టేషనుకువెళ్ళి పోలుచేయుటకు చాలమంది ఎన్నికదార్లకు వీలులేనియెడల పోలింగు ఆఫీసరు ఎలక్షను అధికారుల ఉత్తరువులు వచ్చువరకు పోలును ఆపుచేయవలెను పోలింగు ఆఫీసరు పోలింగు స్టేషనులో హాజరుగానుండు వ్యక్తులకు పోలు ఆపుచేయబడినదని వెంటనే ప్రకటించవలెను

(2) (1) వ ఉపవిధి ననుసరించి ఒక పోలింగు ఆఫెసరు పోలును ఆపుచేసినయెడల ఆయన 31 వ మరియు 32 వ విధులలో నిర్ణయించియుండు చర్యాక్రమమును అనుసరించవలెను మరియు వెంటనే పరిస్థితులను గురించి ఒక సమగ్రమైన నివేదికను ఎలక్షను ఆఫీసరుకు పంపవలెను ఆయన దానిపై ఏదైన తన అభిప్రాయములను తెలియజేయుచు, దానిని ఎలక్షను అధికారికి పంపవలెను.

(3) ఎలక్షను అధికార్లు అందుమీాద

(ఎ) జరిపోయిన పోలు సమయమున ఎన్ని గంటలకాలము పోలు ఆపుచేయుబడినదో అన్ని గంటలసేపు సదరు పోలింగు స్టేషనులో పోలు సాగించవలెనని ఉత్తర్వు చేయువలెను, లేక

(డి) జరిగిపోయిన పోలు సమయమున సదరు పోలింగు స్టేషనులో జరిగిన పోలుకు సంబంధించిన వ్యవహారములను త్రోసిపుచ్చి జరిగిపోయిన పోలు సమయమున పూర్తిగ ఎన్ని గంటల కాలము పోలు జరుగవలసియుండెడినో అన్ని పూర్తి గంటల కాలము

సదరు పోలింగు స్టేషనులో క్రొత్తగా పోలు జరుపవలెనని ఉత్తర్వు చేయవలెను

ఈ ఉపవిధి ననుసరించి ఎన్నికల అధికారి చేయు ఉత్తర్వు ఏదికాని అంత్యమైనదై యుండవలెను

(4) (3) వ ఉపవిధి క్రింద చేయబడిన ఏ ఉత్తరువులోనైనను

(a) ఈ క్రింది విషయములను పొందుపర్చవలెను–

(i) సందర్భానుసారముగా సాగింపు పోలు లేక క్రొత్త పోలు జరుపవలసిన తేదీని, అది ఏ గంట మొదలు ఏ గంటవరకు జరుగునదియును, మరియు

(ii) ఎలక్షను ఆఫీసరు 33 వ విధి ననుసరించి ఓట్లు లెక్కించుటకు ప్రారంభించు తేదీని, స్థలమును గంటను, మరియు చెప్పవలెను.

(b) ఆ ఉత్తరువును 3 వ విధియొక్క (2) వ ఉప విధిలో నిర్ణయించియుండు విధమున సందర్భమునకు తగినట్లు సాగింపు పోలు జరుపుటకు లేక క్రొత్తపోలు జరుపుటకు నిర్ణయింపబడిన తేదీకి ముందు ఏడు దినములకు తక్కువకాకుండ ప్రచురించవలెను

(5) (a) (3) వ ఉప విధియొక్క (a) క్లాజు క్రింద పోలు సాగించుటకు ఉత్తరవు చేయబడినయెడల, ఎలక్షను ఆఫీసరు 15 వ విధిలోని (1) వ ఉప విధిక్రింద క్రొత్తగా వ్యవహరించి సదరు ఉప విధిక్రింద నియమితుడైన పోలింగు ఆఫీసరుకు ఈ విధియొక్క (2) వ ఉపవిధిక్రింద తనకు అందిన ప్యాకెట్లు నన్నింటిని వాపసుచేయవలెను.

(బి) పోలింగు ఆఫీసరు, ప్యాకెట్లను, సాగింపు పోలు ప్రారంభము కాబోవుచున్నదనగా అప్పుడు పోలింగు స్టేషనులో హాజరుగా నుండు వ్యక్తుల ఎదుట తెరువవలెను, మరియు సదరు పోలును, అందు నిమిత్తము (3) వ వుపవిధి (a) క్లాజు కింద ఎలక్షను అధికారి చేయు వుత్తరువులో నిర్ణయించబడిన గంటకు సరిగా ప్రారంభించ వలెను

(c) సాగింపు పోలు జరుగునపుడు పోలింగు ఆఫీసరు జరిగి పోయిన పోలు సమయమున ఓటుచేయని ఎన్నికదార్లను మాత్రమే ఓటు చేయనీయవలెను

(6) క్రొత్త పోలు జరుపవలెనని (3) వ వుపవిధి (b) క్లాజు కింద వుత్తరవు చేయబడినపుడు ఎలక్షను ఆఫీసరు 15 వ విధి లోని (1) వ వుప విధి క్రింద కొత్తగా వ్యవహరించవలెను మరియు సంబంధిచిన పోలింగు స్టేషనులో అన్ని సందర్భములలోను ఈవిధుల యొక్క వుపబంధనలననుసరించి సదరు పోలింగు స్టేషములో సదరు పోలు మొదటిసారి ఎట్లు జరిగియుండెడివో అట్లే జరుపవలెను

వివరణము — ఈ వుపవిధి క్రింద వచ్చు విషయములలో క్రొత్తనామ నిర్దేశములేవియు జరుగకూడదు

(7) ఈ విధిలో ఏమి చెప్పియున్నప్పటికిని దానితో సంబంధము లేకుండా ఒక అభ్యర్థి (3) వ వుపవిధి క్రింద ఎలక్షను అధికారి వుత్తరువులు జారీచేయుటకు ముందుగా ఎప్పుడైనను లేక సదరు వుత్తరువులు జారీచేసిన తరువాత సందర్భమునకు తగినట్లు సాగింపు పోలు లేక క్రొత్త పోలు పారంభమగుటకు ముందు చనిపోయిన యెడల, ఎలక్షను ఆఫీసరు సదరు అభ్యర్థికి మరణించిన విషయమును చక్కగా తెలిసికొని ఎలక్షను అధికారికి ఆ విషయమును తెలియజేసి సదరు ఎన్నికకు సంబంధించి అటుపై జరుగవలసిన చర్యక్రమ మంతటిని ఆపుజేసి, సదరు వార్డులో క్రొత్తగా ఎన్నిక జరుగవలసి యుండిన నెట్లో అట్లే ఎన్నిక చర్యక్రమము అన్ని సందర్భముల లోను కొత్తగా ప్రారంభించవలెను

అయితే పోలు ఆపుచేయబడినపుడు నామనిర్దేశము చేయబడిన అభ్యర్థులలో శేషించియుండువారి విషయమున క్రొత్త నామ నిర్దేశములు అవుసరములేదు

30 ఎన్నికదారెవరైన ఏమరుపాటున తన బ్యాలటు పేపరును అది బ్యాలటు పేపరుగా వుపయోగించుటకు వీలులేనట్లుచేసి ఆయన పోలింగు ఆఫీసరుకు దానిని ఇచ్చి, ఏమరుపాటున తాను చేసినపనిని ఆయనకు నచ్చచెప్పి చెడిపోయిన బ్యాలటు పేపరుకు బదులు ఇంకొక బ్యాలటు పేపరును పుచ్చుకొనవచ్చును చెడిపోయిన బ్యాలటు పేపరులోను దాని ఎదురు ప్రతిలోను అవి రద్దుచేయబడినట్లుగా గుర్తు వేయబడవలెను.

అట్టి ఎన్నికదారు ప్రథమములోనే ఒకటికంటె ఎక్కువ బ్యాలటు పేపర్లను పుచ్చుకొనియున్న యెడల ఆయన తాను ప్రథమమున పుచ్చు కొనియున్న బ్యాలటు పేపర్ల నన్నింటిని పోలింగు ఆఫీసరుకు ఇచ్చిననే తప్ప క్రొత్త బ్యాలటు పేపర్లు ఆయన కియ్యకూడదు ప్రథమములో పుచ్చుకొన్న బ్యాలటు పేపర్లలోను వాటి ఎదురు ప్రతులలోను అవిరద్దు చేయబడినట్లు గుర్తు వేయబడవలెను.

31 (1) పోలింగు ఆఫీసరు సందర్భమునకు తగినట్లు 3 వ విధి క్రిందగాని 29 వ విధియొక్క (4) వ ఉపవిధి క్రిందిగాని పోలింగుస్టేషనుకు మూసివేయుటకు నియమింపబడిన గంటకు సదరు పోలింగు స్టేషను లోనికి, సదరు గంటకు తరువాత ఎన్నికదారులు ఎవరుగాని ప్రవేశించకుండా నివారించుటకు సదరు పోలింగుస్టేషనును మూసి వేయవలెను మరియు అటుతరువాత బ్యాలటు పేపర్లు జారీ చేయబడకూడదు

(2) ప్రతిపోలింగు స్టేషనుయొక్క పోలింగు ఆఫీసరు, పోలు అంతమైన తరువాత వీలైనంత శీఘ్రముగా ఎవరైన అభ్యర్థి లేక పోలింగు ఏజెంట్లు హాజరుగా ఉన్నయెడల వారి ఎదుట ఈ క్రింది వాటిని వేరువేరు ప్యాకెట్లుగా కట్టి వాటికి తన స్వంత సీలుతోను తమ తమ సీళ్ళను వేయుటకు తీర్మానించుకొను అభ్యర్థులయొక్క లేక ఏజెంట్లయొక్క సీళ్ళ తోను సీలు చేయవలెను

(i) తెరువకుండా సదరు పోలింగు స్టేషనులో ఉపయోగించిన ప్రతి బ్యాలటుపెట్టె తాళపుచెవితోసహా (బ్యాలటు పెట్టె వలెనే సీలుచేసి) బ్యాలెటుపెట్టెకు జతచేసి,

(ii) రెండరుచేయబడిన బ్యాలటు పేపర్లు

(iii) ఉపయోగించని బ్యాలటు పేపర్లు,

(iv) చెడిపోయిన బ్యాలటు పేపర్లు,

(v) గుర్తువేయబడిన ఓటర్ల జాబితా నకలు,

(vi) బ్యాలటు పేపర్ల ఎదురు ప్రతులు,

(vii) రెండరు చేయబడిన ఓట్ల పట్టీ,

(viii) ఆక్షేపించబడిన ఓట్ల పట్టీ, 27 వ విధియొక్క (2)

మరియు (5) ఉపవిధులలో చెప్పియుండు వివరణ లేక వివరణలతో సహా, మరియు

(ix) 28 వ విధియొక్క (2) ఉపవిధిలోని (ii) క్లాజులో నిర్దేశింపబడిన కవరులు, మరియు అట్టి ప్యాకెట్లను ఎలక్షను ఆఫీసరు పంపవలెను.

(3) ప్రతి ప్యాకెట్టుకు సంఖ్య వేయవలెను దానిలో ఏమి ఉండునది ఆ విషయము, పోలింగు స్టేషను పేరు, వార్డు పేరు, నంబరు దానిపై తెలియజేయవలెను ఏ పోలింగు స్టేషనులోనైనను, అట్లే వేయబడనియెడల పోలింగు ఆఫీసరు శూన్యము (nil) నివేదికను, 32 వ విధిలో నిర్దేశింపబడిన 8 వ నమూనాలో వివరణను పొందు పరచి దానిని పంపవలెను

32 ప్యాకెట్లతోకూడ పోలింగు ఆఫీసరు 8 వ నమూనాలో వివరణము తయారుచేసి ప్రత్యేక కవరులో పంపవలెను ఆ వివరణ ములో తనకు అప్పగించిన బ్యాలటు పేపర్ల సంఖ్యను తెలియజేసి బ్యాలటు పెట్టెలలోని బ్యాలటు పేపర్లు ఉపయోగించని బ్యాలటు పేపర్లు, చెడిపోయిన బ్యాటు పేపర్లు, రెండరు చేయబడిన బ్యాలటు పేపరు అను శీర్షికల క్రింద వాటికి లెక్క చెప్పవలెను

33 (1) ఓట్ల లెక్కింపు అందు నిమిత్తము ఏర్పాటు చేయ బడిన దినమునను స్థలములోను, గంటలోను ప్రారంభము కావలెను. ఓట్లు ఎలక్షను ఆఫీసరుచేగాని ఆయన తనిఖీక్రిందగాని లెక్కింపబడ వలెను ప్రతి అభ్యర్థి, ప్రతి అభ్యర్థియొక్క ఎలక్షను ఏజంటు, ప్రతి అభ్యర్థియొక్క ఎదరు అభ్యర్థిచే లిఖితపూర్వకముగా అధికారము పొందిన ఒక ప్రతినిధి ఓట్లు లెక్కించునపుడు హాజరై యుండుటకు హక్కు కలిగియుండవలెను ఇతరు లెవరుగాని హాజరైయుండుటకు ఒప్పుకొన కూడదు. అయితే ఎలక్షను ఆఫీసరు ఓట్లు లెక్కించుటలో తనకు సహాయపడుటకు నియమించు వ్యక్తులను మాత్రమే ఉండనియ వచ్చును ఓట్లు లెక్కించుటలో సహాయపడుటకు ఏ అభ్యర్థిచేగాని ఆయన తరఫునగాని ఎన్నికకు సంబంధించిన ఏకార్యము నిమిత్తమైనను నియమింపబడిన వారిని ఎవరుగాని నియుక్తిచేయబడకూడదు

(2) ఎలక్షను ఆఫీసరు ఈ క్రింద వివరించినట్లు వ్యవహరించవలెను —

(a) సదరువార్డులో అన్ని పోలింగు స్టేషనులకు సంబంధించి ఒకే వరుససంఖ్యను, చిహ్నమును, కలిగియుండు బ్యాలటు పెట్టెను లేక పెట్టెలను, ఆ పెట్టెల చిహ్నమునే కలిగి, కవర్లలో ఉంచబడి 28 వ విధి క్రింద అందిన అన్ని ఎన్వలపులను ఒకటివెంబడి నొకటి తెరువవలెను ఎలక్షను ఆఫీసరు వాటిలోగల బ్యాలటు పేపర్లను బయటికితీసి వాటిని ఎంచి సదరు అభ్యర్థికి చేకూరిన మొత్తము ఓట్ల సంఖ్యను ఒక వివరణములో రికార్డుచేయవలెను పిమ్మట ఆయన ఇదేవిధముగా ఆ వార్డులో నిర్ణయింపబడిన ప్రతి చిహ్నముగలపెట్టెల విషయమునను ఎన్వలపుల విషయమునను వ్యవహరించవలెను

(b) ఎలక్షను ఆఫీసరు అభ్యర్థులకు, వారి యేజెంట్లకు త్రోసివేయబడ తగిన బ్యాలటు పేపర్లనన్నింటిని తాకకుండా పరీక్షచేయుటకును న్యాయమైన అవకాశముల్ను కలుగచేయవలెను ఆయన త్రోసివేసిన ప్రతి బ్యాలటుపేపరు మీద త్రోసివేయబడినది, అను మాటను వ్రాయవలెను త్రోసివేయుట సక్రమము కాదని హాజరైయున్న ఏ అభ్యర్థిగాని ఏజెంటుగాని ఆక్షేపించునెడల ఆయన బ్యాలటు పేపరు మీద త్రోసివేయుటకుగల కారణములుకూడ రికార్డు చేయవలెను

(c) ఎలక్షను ఆఫీసరు వీలైనంతవరకు ఓట్ల లెక్కింపును ఎడతెరిపి లేకుండా సాగించవలెను అవసరమైన యేదైన వ్యవధులలో లెక్కింపు నిలుపవలసి వచ్చినయెడల బ్యాలెటు పేపర్లను, ప్యాకెట్లను, ఎన్నికకు సంబంధించిన ఇతరపత్రములను, తన స్వంతసీలును తమ సీళ్ళను వేయుటకు ఇష్టపడు అభ్యర్థులయొక్క లేక యేజెంట్లయొక్క సీళ్ళనువేసి వాటి భద్రమునకై తగినంత ముందుజాగ్రతకు యేర్పాట్లు చేయించవలెను

33 (1) బ్యాలటు పేపరు-

(a) ఎన్నికదారుని గుర్తించుటకు వీలుకలుగజేయు గుర్తు యేదైనా దానిపైన ఉండినయెడల, లేక

(b) 20 వ విధిలో నిర్ణయింపబడిన ప్రభుత్వముద్ర దాని పైన లేని యెడల, లేక

(c) యే బ్యాలటు బాక్సులో అది వున్నదో ఆ బ్యాలటు బాక్సుకుచెందిన వార్డుకాకుండా ఇతరవార్డుకు సంబంధించినగుర్తు దానిపై యున్నయెడల,

నిరాకరింపబడవలెను.

అయితే 28 వ విధి (2) ఉపవిధిలోని (ii) క్లాజు క్రింద వ్యవహరింపబడిన బ్యాలటుపేపరును, ఎన్నికదారు యేవార్డులో ఓటుచేయుటకు హక్కుగలిగి యున్నాడో ఆవార్డుకాకుండా ఇతరవార్డుయొక్క గుర్తు దానిపైయున్నదను కారణమునుబట్టి మాత్రమే త్రోసివేయ కూడదు,

ఇంతేకాకుండా ఎలక్షను ఆఫీసరు, ఒక బ్యాలటు పేపరు పోలింగు ఆఫీసరు జారీచేసినదని న్యాయమైన సందేహమేమి లేకుండ తృప్తిపడినయెడల సదరు బ్యాలటు పేపరును (b) క్లాజుక్రింద త్రోసివేయకూడదు

(2) ఒకటే వరుస సంఖ్యగల బ్యాలటు పేపర్లు రెండుగాని అంతకు మించిగాని ఒక బ్యాలటు పెట్టెలో ఉన్నయెడల యే అభ్యర్థికి ఆ పెట్టె కేటాయించబడినదో ఆ అభ్యర్థికి అవి ఒకటే ఒక ఓటుగా లెక్కకావలెను

(3) (1) మరియు (2) వ ఉపవిధులలో చెప్పియుండు కారణములనుబట్టితప్ప బ్యాలటు పేపరును త్రోసివేయకూడదు

(4) బ్యాలటు పేపరుయొక్క చెల్లుబడినిగూర్చి ఎలక్షను ఆఫీసరుచేయు తీర్మానము ఎన్నికఅర్జీ దాఖలు చేసికొనినయెడల మార్చివేయబడుటకు మాత్రమే లోబడి అంత్యమైనదై యుండవలెను

35 (1) ఓట్ల పరిశీలనను లెక్కింపును ఎలక్షను ఆఫీసరు పూర్తిచేసిన పిమ్మట, IX వ నమూనాలో పోలింగు ఫలితముల రిటరను తయారు చేయవలెను 39 వ విధియొక్క ఉపబంధనలకు లోబడి యే అభ్యర్థికి లేక అభ్యర్థులకు చెల్లునట్టి అత్యధిక సంఖ్యగల వోట్లు వొచ్చునో ఆ అభ్యర్థి లేక అభ్యర్థులు క్రమముగ ఎన్నుకొనబడినట్లు ప్రకటించవలెను

అయితే ఒకటి లేక అంతకు మించిన స్థానములు అనుసూచిత జాతులవారికి ప్రత్యేకింపబడినయెడల, ఎలక్షను ఆఫీసరు ప్రథమముగా ఆ జాతికిచెందిన యే అభ్యర్థి లేక అభ్యర్థులలో అత్యధిక సంఖ్యాగల వోట్లు ఈయబడెనో ఆ అభ్యర్థి లేక అభ్యర్థులు అట్లు రిజర్వు చేయ బడిన స్థానము లేక స్థానములకు ఎన్నుకొనబడెనని ప్రకటించవలెను

(2) ఏ అభ్యర్థి లేక ఆయన యేజెంటు అయినను, దరఖాస్తు పెట్టుకొన్న మీాదట IX వ నమూనాలో రిటర్ను యొక్క నకళ్లనుగాని దాని ఎక్స్ట్రాక్టునుగాని తీసుకొనుటకు అనుమతించవలెను

36 (1) ఎలక్షను ఆఫీసరు, టెండరుచేయబడిన బ్యాలెటు, పేపర్లు, గుర్తువేయబడిన ఓటర్ల జాబితా లేక బ్యాలెటు పేపర్ల యొక్క ఎదురు ప్రతులుగల సీలువేయబడిన ప్యాకెట్లను తెరువ కూడదు 32 వ విధిక్రింద పోలింగు ఆఫీసరుచే తనకు దాఖలుచేయ బడిన వివరణమును, అతనివద్దనున్న అంగీకరింపబడిన బ్యాలెటు పేపర్లు, నిరాకరింపబడిన బ్యాలెటు పేపర్లు మరియు ఉపయోగింప బడిని బ్యాలెటుపేపర్ల సంఖ్యతో పోల్చిచూచుట మూలముగా సరి చూడవలెను

(2) అందుమీాదట ఎలక్షను ఆఫీసరు ప్రతి అభ్యర్థి విషయము లోను-

(i) చెల్లదగినవిగా అంగీకరింపబడినట్టి బ్యాలెటుపేపర్లను, మరియు

(ii) చెల్లదగనివిగా నిరాకరింపబడిన మిగిలిన బ్యాలెటు పేపర్లను

ప్రత్యేక కట్టలుగా కట్టవలెను.

అందుమీాదట ఆయన ఆ రెండుకట్టలను ఒక ప్యాకెట్టుగా కట్టి, ఆ ప్యాకెటుపై తన సీలును వేయవలెను మరియు ఆయన తాను తెరచిన ప్యాకెట్లలో ప్రతిదానిని తిరిగి మూసివేసి తిరిగి సీలు వేయవలెను అట్టి ప్రతి ప్యాకెటుపైనను దానిలోగల వస్తువుల వివర ములను గూర్చి వ్రాయవలెను

## బ్యాలటు పేపర్లయొక్క పరిష్కారము

37 (1) ఎలక్షను ఆఫీసరు ఎన్నిక ఫలితములను ప్రకటించిన పిమ్మట, రిటరను యొక్క నకలును సంబంధించిన పంచాయతీ కార్య నిర్వాహక అధికారికి పంపవలెను లెక్కింపబడినట్టిగాని, నిరాకరింప బడినట్టిగాని లేక టెండరు చేయబడినట్టిగాని బ్యాలటు పేపర్ల యొక్కయు వాటి ఎదురు ప్రతులయొక్కయు ప్యాకెట్లను తనవద్ద భద్రముగా నుంచవలెను ఈ ప్యాకెట్లను, ఎన్నిక లేక ఇతరత్రా అధి కారముగల కోర్టుయొక్క ఉత్తరవుల ప్రకారము తప్ప తెరువ కూడదు. మరియు అందలి వస్తువులను తనిఖీ చేయకూడదు లేక హాజరు పెట్టకూడదు

(2) ఎలక్షను ఆఫీసరు సదరు ప్యాకెట్లను గుర్తువేయబడిన ఓటర్ల జాబితా నకళ్ళను ఒక సంవత్సరమువరకు ఉంచవలెను అటు పిమ్మట ఎన్నిక లేక ఇతర అధికారముగల కోర్టు ఇతర విధముగా ఆజ్ఞాపించిననే తప్ప వాటిని నాశనము కావించవలెను

### సాధారణ విషయములు

38 (1) ఏ వ్యక్తియైనను, ఒక వార్డునకంటె ఎక్కువవాటికి ఎన్నుకొనబడినయెడల ఆయన తన సంతకముగల లిఖిత పూర్వక మైన నోటీసు ద్వారా తాను ఏ వార్డునకు సేవచేయుటకు కోరునో దానిని గూర్చి ఎలక్షను ఆఫీసరునకు తెలియజేయవలెను అయన ఏ వార్డులకు అభ్యర్థిగా నిలబడెనో ఆ వార్డులయొక్క ఎన్నికల ఫలిత ములు కడపటిగా ప్రకటింపబడినప్పటినుండి ఇరువది నాలుగు గంటల లోపల అట్టి సమాచారము ఎలక్షను ఆఫీసరుకు అందవలెను

(2) సదరు సమాచారము అందినమీదట ఎలక్షను ఆఫీసరు పైన చెప్పబడిన వ్యక్తి ఆయన కోరు వార్డునకు ఎన్నుకొనబడినట్లు ప్రకటించవలెను. అట్టి సమాచారము లేనప్పుడు ఎలక్షను ఆఫీసరు సదరు వ్యక్తి ఏదైన ఒకవార్డునకు ఎన్నుకొనబడినట్లు ప్రకటన చేయవలెను ఆ రెండు సందర్భములలో దేనిలోనైన అట్టి వ్యక్తి ఎన్నుకొనబడిన ఆయా సందర్భమునకు తగినట్లు వార్డు లేక వార్డులు

లోని ఖాళీని పూర్తిచేయుటకు ఎన్నిక కార్యక్రమములు క్రొత్తగా ప్రారంభింపబడవలెను

39 ఇరువురు లేక అంతకు ఎక్కువమంది అభ్యర్థులకు ఓట్లు సమానముగా వచ్చినయెడల ఎలక్షను ఆఫీసరు సంబంధించిన అభ్యర్థులకు నోటీసునిచ్చిన పిమ్మట లాట్లువేయుట మూలముగా ఏ అభ్యర్థి లేక అభ్యర్థులు ఎన్నుకొనబడినట్లు ప్రకటించవలెనో దానిని నిశ్చయించవలెను

40 ఎలక్షను ఆఫీసరు సంబంధించిన పంచాయతీ కార్యాలయము నందు నోటీసుబోర్డు ఉన్నయెడల అందు లేని పక్షమున పంచాయతీలో యేదైన ప్రధాన స్థలమువద్ద క్రమముగా ఎన్నుకొనబడిన అభ్యర్థి లేక అభ్యర్థులయొక్క పేరు లేక పేర్లుకలిగి తన సంతకముగల అధిసూచనను ప్రకటించవలెను

41 (1) ఈ విధులయొక్క వ్యాఖ్యానుగురించి ఒక ఎన్నికయొక్క చెల్లుబడి విషయమై వివాదము నిశ్చయించుటకై జారీచేయబడిన విధుల క్రింద జరుపబడిన విచారణ సందర్భములో తప్ప ఏ సందేహము కాని కలుగునెడల దానిని ప్రభుత్వమువారికి తెలుపవలెను వారియొక్క తీర్మానము అంత్యమైనదగును.

(2) ప్రభుత్వమువారికి తెలుపబడిన దానిపై తీర్మానము చేయుటకు పూర్వము లేక ఈ విధులకు విరుద్ధముగా ఒక ఎన్నిక జరుగుచున్నదను లేక జరుగునను సమాచారము అందినమీాదట ప్రభుత్వమువారు జరిపిన విచారణమీాద కడపటి ఉత్తరువులను జారీచేయుటకు పూర్వము ఎన్నిక ఫలితములను ప్రకటించుటకు పూర్వము ఎన్నిక కార్యక్రమములను ఏ దశయందైనను ఆపుచేయవలెనని ఆజ్ఞాపించుట ప్రభుత్వమువారికి న్యాయసమ్మతమై యుండవలెను ఈ విధిక్రింద ప్రభుత్వమువారి ఉత్తరువులకు వ్యతిరేకముగా జరుపబడిన లేక సాగింపబడిన ఏ యెన్నికైనను చెల్లకూడదు, మరియు యేవిధమైనట్టి ఫలితమునుగాని కలిగియుండకూడదు

(3) ప్రభుత్వపువారిచే ఇతర విధముగా ఉత్తరువు చేయబడిననే తప్ప ఈ విధి ననుసరించి ఆపుచేయుబడిన ఎన్నిక కార్యక్రమ

ములు, సదరు ఆపుదల ఉత్తరువు రద్దుచేయబడిన మీదట ఏ దశ యందు ఆపుచేయబడినదో ఆ దశనుండి నిర్ణయింపబడు క్రొత్త తేదీ నుండి ప్రారంభము కావలెను

(4) ఈ విధుల ననుసరించి ఏ ఎన్నికనైనను జరుపు విషయమున ఏదైన ఆటంకము కలిగినయెడల, ప్రభుత్వమువారు ఉత్తరువు ద్వారా, ఎన్నికను సక్రమముగా జరుపుటకు అవసరమని వారు తలంచునట్టియు యీ విధులకు వ్యతిరేకము కానట్టియు దేనినైనను చేయవచ్చును

42 పై విధులలో ఏమియున్నను దానితో నిమిత్తము లేకుండా, ప్రభుత్వమువారు లేక ఎన్నిక అధికారి, సాధారణముగా పంచాయతీల విషయములో లేక ప్రత్యేకముగా యేదైన పంచాయతీ విషయములో ఈ విధుల ననుసరించి అందుకు సంబంధించిన ఎన్నిక వ్యవహారములలో అన్నింటికి లేక అందు దేనికైనను నిర్దిష్టము చేయబడిన లేక నిర్ణయింపబడిన తేదీలు లేక కాలపరిమితులుకాక ఇతర తేదీలను లేక కాలపరిమితులను నిర్ణయించుటకు ఎలక్షను ఆఫీసరుకు అధికారమీయవచ్చును

## I వ నమూనా.

[ 4 (1) వ విధిని చూడుడు ]

### నామనిర్దేశపత్రము

1 గ్రామము/వార్డు యొక్క పేరు మరియు సంఖ్య
2 అభ్యర్థియొక్క పూర్తి పేరు
3 ఓటర్ల జాబితాలో అభ్యర్థియొక్క సంఖ్య
4 తండ్రి, కార్నవాను లేక భర్తపేరు
5 వయస్సు
6 స్త్రీయా, పురుషుడా.
7 జాతి
8 వృత్తి మరియు పై విలాసము

9 ప్రతిపాదకుని పూర్తిపేరు
10 ఓటర్ల జాబితాలో ప్రతిపాదకుని సంఖ్య
11. ప్రతిపాదకుని సంతకము
12 బలపరచు మనిషి పూర్తిపేరు.
13 ఓటర్ల జాబితాలో బలపఱచు మనిషి సంఖ్య.
14 బలపరచు మనిషి సంతకము

అభ్యర్థియొక్క రూఢివచనము

ఎన్నికలో పోటీచేయుటకు నేను అంగీకరించుచున్నానని ప్రసిద్ధపరచుచున్నాను

అభ్యర్థి సంతకము

ఎన్నికోద్యోగి లేక అధికారమీయబడిన ఇతర మనిషి యొక్క ఎన్డార్సుమెంటు

వరుస సంఖ్య
(తేదీన మరియు గంటలప్పుడు). వద్ద ..... (మనిషి) చే నాకు ఈ నామ నిర్దేశపత్రము ఇవ్వబడినది

ఎన్నికోద్యోగి లేక అధికారమీయబడిన
ఇతర మనిషి సంతకము

196... .. నెల .... . తేదీన ... (గంటకు) పూర్వము ఎన్నికోద్యోగికిగాని, అధికారమీయబడిన ఇతర మనిషికిగాని ఇవ్వబడని నామనిర్దేశపత్రములు తీసికొనబడవు

II వ నమూనా

[ 7 వ విధిని చూడుడు ]

.. వార్డుకై. (తేదీన) తీసికొనబడిన నామనిర్దేశముల జాబితా

1 వరుస సంఖ్య
2. అభ్యర్థి పేరు

3. తండ్రి, కార్న్నవాను లేక భర్తపేరు
4 స్త్రీయా, పురుషుడా.
5. కులము.
6 వృత్తి మరియు పైవిలాసము
7 ప్రతిపాదకుని పేరు
8 బలపరచు మనిషి పేరు

షరా.

(స్థలము) వద్ద. నెల. దినమున, ప్రాతఃకాలమున / సాయంకాలమున ... గంటలకు, నామ నిర్దేశపత్రములు పరిశీలనకు తీసికొనబడును

ఎన్నికోద్యోగి లేక అధికారమీయబడిన
ఇతర మనిషి సంతకము

## III వ నమూనా.

[10 (1) వ విధిని చూడుడు ]

చెల్లదగిన నామనిర్దేశపత్రముల జాబితా

.....పంచాయతీ ...వార్డు.

| వరుస సంఖ్య. | అభ్యర్థుల పేర్లు | అభ్యర్థులు స్త్రీలా, లేక పురుషులా. | అభ్యర్థులు ఏ జాతులకు చెందిన వారు. | అభ్యర్థుల పై విలాసము | అభ్యర్థుల కివ్వబడిన నిర్దిష్టమైన చిహ్నము |
|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |

షరా – పోలు, ఇంతకు పూర్వమే ప్రకటింపబడిన పోలింగు స్టేషనులవద్ద గంటలనుండి... గంటలవరకు జరుపబడును

ఎన్నికోద్యోగి

IV A–నమూనా.

(20 వ విధిని చూడుడు)

... పంచాయతీ .. వార్డు
వరుస సంఖ్య.

ఓటర్ల జాబితాలోనుండు ఎన్నికదారుని పేరు, సంఖ్యయును.

IV–వ నమూనా.

(20 వ విధిని చూడుడు)

పంచాయతీ ... వార్డు
వరుస సంఖ్య

## V వ నమూనా

[26 వ విధిని చూడుడు]

టెండరు చేయబడిన ఓట్ల జాబితా

పోలింగు స్టేషను పేరును, సంఖ్యయు,

| వార్డు పేరు, సంఖ్య. | ఎన్నికదారుని పేరు | ఓటర్ల జాబితాలోని | సంఖ్య | ఎన్నికదారు చదువను వ్రాయను నేర్చినవాడైనచో అతని సంతకము, అట్లు కానిచో అతని బొటన వ్రేలి గుర్తు మరియు అతనిపై విలాసము |
|---|---|---|---|---|

## VI వ నమూనా.

[27 వ విధిని చూడుడు]

మఱియొకరని మోసముగా ప్రవర్తించినందుకు రూఢివచనము

. .. (పేరు) గల నేను, క్రింద వివరింపబడిన మనిషి ఈ పోలింగు స్టేషనువద్ద బ్యాలెటు కాగితమును కోరుటమూలముగా మరియొకరని మోసముగా వర్తించెనను నేరముచేసెనని ప్రసిద్ధపరచుటకును ఋజువు చేయుటకు ఇందుమూలముగ పూనుకొనుచున్నాను

మనిషియొక్క వివరము

| పేరు | పై విలాసము | సంతకము లేక బొటనవ్రేలి గుర్తు. |
|---|---|---|

సాక్షులు -

1. (పేరు, పై విలాసము) అభ్యర్థి లేక ఏజెంటు సంతకము.

2 (పేరు, పై విలాసము) (నా ఎదుట చేయబడినది.)

పోలింగు ఆఫీసరు సంతకము.

## VI-A నమూనా.

[27 వ విధిని చూడుడు]

ఛాలెంజిచేయబడిన (ఆక్షేపింపబడిన) ఓట్లజాబితా.

పోలింగుస్టేషను పేరు
సంతకము చేసిన షీటు సంఖ్య

| ఓటర్ల జాబితాలో ఎన్నికదారుని సంఖ్య | ఎన్నికదారుని పేరు | ఎన్నికదారు చదువను వ్రాయను నేర్చినచో అతని సంతకము, అట్లు కానిచో అతని బొటన వ్రేలి గుర్తు | గుర్తించు మనిషి ఎవరైన యున్నచో అతని పేరు పై విలాసము |
|---|---|---|---|

(ప్రతి సందర్భములో) పోలింగు ఆఫీసరు ఉత్తరువు

స్థలము
తేది.

పోలింగు ఆఫీసరు సంతకము.

## VII వ నమూనా.

[28 వ విధిని చూడుడు.]

### పోలింగు వి_స్తీర్ణమునకు వెలుపల ఒక మనిషి ఓటుచేయుటకు హక్కు నిచ్చు సర్టిఫికేటు నమూనా

. .. వార్డుకై ... . వద్ద ఓటుచేయుటకు హక్కు కలిగి యుండు... . . వార్డుకైన ఎన్నిక సందర్భములో. . నియమింపబడెననియు, సదరు స్టేషను ఓటుచేయుటకు ఆటంకపరుప బడెననియు, అందువలన నేను ... . వద్ద ఓటుచేయుటకు అతనికి అధికారము నిచ్చితిననియు సర్టిఫై చేయడమైనది.

స్థలము
తేదీ

ఎన్నికోద్యోగి సంతకము.

## VIII వ నమూనా

[32 వ విధిని చూడుడు.]

.... . వార్డుకై నిమి_త్తము 19 వ సం॥. నెల. తేదీన జరిగిన పోలింగుతర్వాత

పంచాయతీ వి_స్తీర్ణములో, వద్ద పోలింగు ఆఫీసరుచే పంపబడిన స్టేటుమెంటు

| (1) వివరములు | (2) పొందబడిన సంఖ్య | (3) పెట్టెలలోని బ్యాలెట్ పేపర్ల సంఖ్య- | (4) ప్యాకెట్లలోని బ్యాలటు పేపర్ల సంఖ్య-28 (2) (11) వ విధి | (5) టెండరు చేయబడిన బ్యాలటు పేపర్ల సంఖ్య-26 వ విధి | (6) ఉపయోగింపబడని సంఖ్య | (7) చెడగొట్టబడిన వాటి సంఖ్య | (8) 28 (2) (1) వ విధి ననుసరించి పరిష్కరింపబడిన బ్యాలటు పేపర్లు [ (3) వ కలముక్రింద చేర్చబడినది | (9) షరాలు. |
|---|---|---|---|---|---|---|---|---|

## IX వ నమూనా.

[35 వ విధిని చూడుడు]

జిల్లాయొక్క, గ్రామమునకు చెందిన వార్డుకైన స్థానముల కొఱకైన ఎన్నిక ఫలితములను చూపు రిటరును

| అభ్యర్థి పేరు, (1) | చెల్లదగిన ఓట్ల సంఖ్య. (2) |
|---|---|
| A | |
| B | |
| C | |
| D | |
| E | |
| F | |

చెల్లదగిన ఓట్ల మొత్తము సంఖ్య...
చెల్లదగని ఓట్ల మొత్తము సంఖ్య...

వార్డుకు, దిగువ చెప్పిన అభ్యర్థులు సక్రమముగా ఎన్నుకొనబడిరని నేను ఇందుమూలముగ ప్రసిద్ధపరచుచున్నాను

అనుసూచిత జాతులకు చెందినవారికి. } A B C

ప్రత్యేకించబడని స్థానములకు ... } D E F

ఎన్నికోద్యోగి సంతకము.

సె-8-రూల్సు

### పంచాయతీ ఎలక్షను విధులు

### I వ భాగముక్రింద జారీచేయబడిన సూచనలు

### జి. ఓ నెం. 49, తేదీ 10-1-1956.

ఎన్నికలు - పంచాయతీలు - నిర్వహించుట - 1 వ భాగము కింద విధులు-అభ్యర్థులకు చిహ్నములు నిర్దేశించుట - సూచనలు

ఆర్డరు-నెం 49 లోకల్ అడ్మినిస్ట్రేషన్ - తేదీ 10-1-1956

ఎన్నికలకు సంబంధించిన 1 వ భాగములోని, పంచాయతీ సభ్యుల ఎన్నికలకు చెందిన 10(3) వ విధిక్రింద, పంచాయతీ ఎన్నికలలో పోటీచేయు అభ్యర్థులకు, చిహ్నముల నిర్దేశించుటకు గాను, ఆంధ్రగవర్నరుగారు యీక్రింది సూచనలను జారీచేయుచున్నారు

1 యీ సూచనలలో —

(a) "ఎలక్షను ఆఫీసరు" అంటే పంచాయతీయొక్క కార్య నిర్వాహక అధికారి (ఎగ్జిక్యూటివ్ అధికారి) అని అర్థము

(b) "ఇన్‌స్పెక్టర్ - జనరల్" అంటే ఇన్‌స్పెక్టర్ - జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషను అని అర్థము (స్థానిక స్వపరిపాలనాశాఖ యొక్క ఇన్‌స్పెక్టర్-జనరల్)

2 ఆంధ్రస్టేట్ లెజిస్లేటివ్ అసెంబ్లీకి క్రిందటిమారు జరిగిన సామాన్య ఎన్నికల సందర్భములో ఇండియా ఎలెక్షన్ కమీషనర్ చేత అనుమతింపబడిన చిహ్నములనుండి, అభ్యర్థులకు చిహ్నములు నిర్దేశింప బడవలెను ఆంధ్రస్టేట్ లెజిస్లేటివ్ అసెంబ్లీకి క్రిందటిమారు జరిగిన సామాన్య ఎన్నికల సందర్భములో, ఎలక్షన్‌కమిషనర్ అనుమతించిన ఇరువది అయిదు చిహ్నములు, యీ ఆర్డరు చివర పొందుపరచిన పట్టీ (ఎనెక్సరులో) చూపబడినవి ఈ చిహ్నములుకాక, యింకా ఎక్కువ చిహ్నములు అవసరమని తోచినయెడల, రాష్ట్ర ప్రభుత్వము అనుమతిపై, ఇన్‌స్పెక్టర్, జనరల్ ఎన్నికలలో ప్రయోగించుటకు, యితర చిహ్నములను పేర్కొనవచ్చును

3 సాధారణముగా, అభ్యర్థుల కందరకు చిహ్నములు ఎలక్షన్ ఆఫీసర్ చేత నిర్దేశింప బడును అట్లుచేయుటలో, ఎలెక్షన్ కమీషనర్ గాని, లేక ఆంధ్ర ఛీఫ్ ఎలెక్టోరల్ ఆఫీసర్‌గాని, దేశము మొత్తములోని పార్టీకిగాని, రాష్ట్రములోని పార్టీకిగాని నిర్దేశించిన చిహ్నములనే, ఆయా పార్టీలయొక్క నియమిత అభ్యర్థులకు, ఎలెక్షన్ ఆఫీసర్ నిర్దేశింపవలెను

4 చివర పొందుపరచిన పట్టీలోని (ఎనెక్సరులోని) I మరియు II వ భాగములలో పేర్కొన్న పార్టీలుకాక, మరియే

యితర దేశ, లేక రాష్ట్ర పార్టీ ఎన్నికలలో పోటీచేయుచున్న యెడల 6 మరియు 8 పేరాలలో వివరించిన పద్ధతి ప్రకారముగా, ఇన్‌స్పెక్టర్ జనరల్ (ఎనెక్సర్) పట్టీలోని III వ భాగములో పేర్కొన్న చిహ్నములలోని యొక చిహ్నమును, ఆపార్టీకి నిర్దేశించవలెను

5 గ్రామముయొక్క సరిహద్దులలో వ్యవహరించుచున్న పార్టీలయొక్క నియమిత అభ్యర్థులకును (అఫీషియల్ అభ్యర్థి,) స్వతంత్ర అభ్యర్థులకును, 4 వ పేరాలో చెప్పబడినట్లు పార్టీలకు చివర పట్టీ ఎనెక్సర్‌లోని III వ భాగములో నిర్దేశింప బడకుండా మిగిలిన చిహ్నములలోని చిహ్నములను, 7, 8 పేరాలలో చెప్పబడిన పద్ధతి ప్రకారముగా, ఎలక్షన్ ఆఫీసర్ తనంతటతానే ప్రత్యేకముగా నిర్దేశింప వలెను ఒక చిహ్నము, ఒక పార్టీకి సంబంధించిన లేక స్వతంత్ర అభ్యర్థికి, ఒక పంచాయతీ గ్రామములో నివ్వబడిన అదే చిహ్నము నదేవిధముగ మరియొక పంచాయతీ గ్రామములో, మరి యొకపార్టీ లేక మరియొక స్వతంత్ర అభ్యర్థి కిచ్చుటకు ఎట్టి ఆటం కము లేదు.

6 నాలుగవపేరాలో నుదహరింపబడిన దేశ లేక రాష్ట్ర పార్టీలు, చివరపట్టీలోని (ఎనెక్సర్) III వ భాగములోని చిహ్నము లలో మూడింటిని వారి యిష్టానుసారము వరుసగా ఎంచుకొని, నామినేషను పత్రములు దాఖలుచేయుటకు నిర్ణయించిన తేదీకి ముందు మూడు రోజులకు తక్కువ కాకుండా, వ్రాతమూలకంగా ఇన్‌స్పెక్టర్ జనరల్‌కు ఆ చిహ్నములను తెలుపవలెను పార్టీలు ఎంచుకున్న ప్రథమ చిహ్నములలో పరస్పర వైరుధ్యము లేని యెడల, ఆయా పార్టీలకు వారి వాంఛితము ప్రకారముగా ప్రథమ చిహ్నము ఇన్‌స్పెక్టర్ జనరల్ నిర్దేశించును ఈ విధముగా ప్రథమమున ఎంచుకున్న చిహ్నములు నిర్దేశింపబడిన తర్వాత, మిగిలిన పార్టీల యొక్క కోర్కెలను పరిశీలించి, ఇన్‌స్పెక్టర్, జనరల్ ఆ పార్టీలకు, చిహ్నములను నిర్దేశించును ఒక చిహ్నమునకు పార్టీలమధ్య వివాదము సంభవించిన యెడల, ఆ విషయమును ఇన్‌స్పెక్టర్ జనరల్ 'లాట్' మూలంగా నిశ్చయించవలెను.

7. అయిదవ పేరాలో చెప్పబడిన గ్రామ సరిహద్దులలో వ్యవహరించుచున్న పార్టీలయొక్క, అభ్యర్థులుగాని, స్వతంత్ర అభ్యర్థులుగాని, ఎనెక్సర్ లోని III వ భాగములోని చిహ్నములలోని ఏ మూడు చిహ్నములైనా వారి ఇష్టానుసారముగా వరుసగా ఎంచుకో వచ్చును కాని అట్లు ఎంచుకొనబడిన చిహ్నములు, ఆరవ పేరాలో చెప్పబడిన రీతిగా, ఇన్ స్పెక్టర్ జనరల్ చేత దేశ లేక రాష్ట్రపార్టీలకు నిర్దేశింపబడినవి కాకుండ వుండవలెను పై విధముగా అభ్యర్థులు ఎంచుకున్న చిహ్నములను, నామినేషనులను పరిశీలించు తేదీకి ముందుగా ఎలెక్షను ఆఫీసరుకు తెలియపరచవలెను ఒక పార్టీ అభ్యర్థి యొక్క ప్రథమమని కోరిన చిహ్నమునకు, మరియొక పార్టీయొక్క ప్రథమమని వాంఛించిన చిహ్నమునకు వ్యతిరేకత లేనియెడల, ఆయా చిహ్నములను ఎలక్షన్ ఆఫీసరు ఆయా అభ్యర్థులకు నిర్దేశించును. ఇట్లు మొదటకోరిన చిహ్నములు నిర్దేశింపబడిన తర్వాత, మిగిలిన పార్టీలకు, అభ్యర్థులకు, వారి వారి కోర్కెలను గమనించి, ఎలక్షన్ ఆఫీసర్, మిగిలిన చిహ్నములను నిర్దేశించును ఒక చిహ్నము విషయములో వివాదములున్నయెడల, ఎలెక్షన్ ఆఫీసర్ "లాట్" ద్వారా సదరు చిహ్నమును పరిష్కారము చేయును

8 ఒకవేళ, ఆరు లేక ఏడవ పేరాలలో చెప్పినరీతిగా, ఒక పార్టీగాని ఒక అభ్యర్థిగాని తాము కోరిన చిహ్నము పొందలేకపోయిన యెడల, ఎలక్షన్ ఆఫీసర్ గాని, ఇన్ స్పెక్టర్ జనరల్ గాని వారికి నిర్దేశించిన చిహ్నములను వారు అంగీకరించవలెను ఈ విషయములో ఇన్ స్పెక్టర్ జనరల్ యొక్కగాని ఎలక్షన్ ఆఫీసరుయొక్కగాని నిర్ణయము అనివార్యముగా నుండును

9 నాలుగు, ఆరవ పేరాలరీతిగా దేశ, లేక రాష్ట్రపార్టీలకు తాను నిర్దేశించిన చిహ్నములను, ఇన్ స్పెక్టర్ జనరల్ ఎలెక్షన్ ఆఫీసరుకు తెలియజేయవలెను ఈ విషయము, ఎలెక్షన్ ఆఫీసర్ అభ్యర్థులకు చిహ్నములను నిర్దేశించుటకు పూర్వము జరుగవలెను

10 ఒక వార్డులో, ఒకటిగాని అంతకుమించిగాని ప్రత్యేకింపబడని (జనరలు) స్థానములు, ఒకటిగాని అంతకుమించిగాని ప్రత్యే

కింపబడిన స్థానములు కేటాయింపబడియున్నయెడల, ప్రతిపార్టీయు, మొత్తము ఎన్ని స్థానములున్నవో, అంతమంది అభ్యర్థులను నిలబెట్ట వచ్చును వారిలో నొకరుగాని, అంతకు ఎక్కువమందిగాని, ప్రత్యే కింపబడిన స్థానములకు అర్హులుగా నుండవచ్చును ఇదివరలోనే, ఏ పార్టీకైన నొక చిహ్నము నిర్దేశింపబడియున్నయెడల, ఆ పార్టీ యొక్క అభ్యర్థులకు అదేచిహ్నము నిర్దేశింపబడును కాని, అట్టి చిహ్నములను అభ్యర్థుల ఆనవాలు తెలియుటకు వేరు వేరు రంగుల కాగితములపై (నలుపురంగు కాకుండా తెలుపులేక మరియే యితర రంగుగల కాగితముమీద) ముద్రింపించవలెను ఏయే అభ్యర్థికి ఏయే రంగు కాగితముపై చిహ్నము ముద్రించవలెనో, ఎలక్షన్ ఆఫీసర్ నిశ్చయము చేయును,

11 ఎన్నికలలో పోటీచేయు ప్రతి పార్టీయున్ను, ప్రతి వార్డులో తమ పార్టీతరఫున పోటీచేయు అభ్యర్థుల నెంచుకొను విష యములో, పార్టీయొక్క నిర్ణయమును తెలుపుటకు అధికారము పొందిన వ్యక్తులపేర్లను, వారియొక్క నమూనా సంతకములతోకూడ, నామినేషనుల పరిశీలన తేదీకిముందుగా, వ్రాతమూలకంగా ఎలక్షన్ ఆఫీసరుకు (దేశపార్టీ అయినయెడల ఇన్‌స్పెక్టర్ జనరల్‌కుకూడ) తెలుపవలెను

నామినేషను పత్రముల పరిశీలన తేదీకిముందుగా, ప్రతివార్డుకు తమ పార్టీతరఫున నియమింపబడిన అభ్యర్థుల జాబితాను ఆ పార్టీ తత్సంబంధమైన ఎలక్షన్ ఆఫీసర్‌కు పంపవలెను నామినేషనుల పరి శీలన తేదీకిముందుగా, దేశ లేక రాష్ట్రపార్టీ పంచాయితీలోని అన్ని వార్డులకు తమచేత నియమింపబడిన మొత్తం అభ్యర్థులందరి జాబితాను కూడ తత్సంబంధమైన రీజనల్ ఇన్‌స్పెక్టర్‌కు పంపవలెను అభ్యర్థు లకు పార్టీయొక్క సహాయ ముపసంహరించినయెడల, అట్టి యుపసం హరణ ఎలెక్షన్ ఆఫీసర్‌కు వ్రాతమూలముగా సకాలములో తెలుప వలెను ఎలెక్షన్‌విధుల 1 వ భాగముక్రింద, అభ్యర్థిత్వము నుపసంహ రించుకొనుటకు నిర్ణయింపబడిన తేదీలోగా, పార్టీయొక్క అధికారము పొందిన వ్యక్తి లేక వ్యక్తులనుండి తనకువచ్చిన సందేశములను

మాత్రమే, ఎలక్షన్ ఆఫీసర్ పార్టీలకు చిహ్నములను నిర్దేశించు సందర్భములో గణించును

12 ఒక వార్డులో ఒక స్థానమునకు, ఒక పార్టీ తరఫున ఇద్దరుగాని, అంతకు ఎక్కువగాని వ్యక్తులు పోటీచేయుచున్నయెడల, ఆ వ్యక్తులందరు సమ్మతించినయెడల, వారిలో నొకరిని పార్టీ అభ్యర్థిగాను, మిగిలినవారిని స్వతంత్ర అభ్యర్థులుగాను, ఎలెక్షన్ ఆఫీసర్ పరిగణించవచ్చును. వ్యక్తులలో నొప్పందములేనియెడల ఎలెక్షన్ ఆఫీసరు "లాట్" ద్వారా నిశ్చయించును

13 మూడు, నాలుగు, లేక అయిదవ పేరాలక్రిందనే పార్టీ యభ్యర్థికైన చిహ్నము కేటాయింపబడనియెడల, అట్టి అభ్యర్థిని ఎలెక్షన్ ఆఫీసర్ స్వతంత్రుడుగా నెంచును

## ఎనెక్సర్

### I వ భాగము

ఎలెక్షన్ కమిషన్‌చేత తనచేత సమ్మతింపబడిన జాతీయపార్టీలకు నిర్దేశింపబడిన చిహ్నములు

| | | |
|---|---|---|
| 1 | ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ | కాడితోకూడిన రెండు ఎడ్లు |
| 2 | ప్రజాసోషలిస్టు పార్టీ | గుడిసె |
| 3 | ఇండియాయొక్క కమ్యూనిష్టు పార్టీ | గింజలతో కూడిన వెన్ను, కొడవలి |
| 4 | ఆల్ ఇండియా భారతీయ జన సంఘ్ | లాంపు (దీపము) |

### II వ భాగము

తనచేత సమ్మతింపబడిన, రాష్ట్రపార్టీలకు ఎలెక్షన్ కమిషన్ నిర్దేశించిన చిహ్నము

| | | |
|---|---|---|
| 1. | కృషికార్ లోక్‌పార్టీ | గింజలను గాలి ఆరబెట్టుచున్న కృషికుడు |
| 2. | ప్రజాపార్టీ | ఉదయించుచున్న సూర్యుడు. |

## III భా గ ము.

ఇతర పార్టీలకు, స్వతంత్ర అభ్యర్థులకు నియమింపవలసిన చిహ్నములు—

1 చెట్టు
2 నిలబడిన సింహము
3 మనుష్యుని చెయ్యి
4 గుఱ్ఱము, రౌతు
5. కోడిపుంజు
6 ఏనుగు.
7. పార మరియు స్టోకరు.
8 మండుచున్న కాగడా (మాషాలు)
9 బైసికిల్
10 బండి
11 కుండ
12 నిచ్చెన
13. విల్లు, అమ్ము.
14 నక్షత్రము
15 పడవ లేక బోటు
16. పువ్వు
17 త్రాసు,
18 ఒంటె
19 రెండు ఆకులతోకూడిన రెమ్మ

## పంచాయతీ సభ్యుల ఎన్నికల విధులు

## II వ భా గ ము

పంచాయతీ సభ్యుల ఎన్నికల నిర్వాహణ జి ఓ నెం 276 ఎల్. ఎ తేదీ 24-2-1956

1 విధులను, నిర్వచనముల అన్వాయము.—

1  (1) మద్రాసు ప్రభుత్వపు మాజీ లోకల్ అడ్మినిస్ట్రేషను డిపార్టుమెంటుయొక్క ప్రకటన నెం 1, తేదీ 6-8-1951 లో ఫోర్టుసెంటు జార్జిగెజెటు, తేదీ 21-8-1951 1 వ భాగముయొక్క సప్లిమెంటులో 154 నుండి 168 పేజీలవరకు ప్రచురింపబడినట్టిన్ని, దరిమిలా I వ భాగము విధులకు సంబంధించి నంతవరకు సవరణ చేయబడినట్టిన్ని విధులకు లోబడనట్టి పంచాయతీలకు, యీ విధులు అన్వయించును.

(సంపాదకుని సూచిక I వ భాగముక్రిందనున్న విధుల చేత ఎన్నికలు జరుప బడవలసినట్లు ప్రచురింపబడిన II వ తరగతి పంచాయతీలు కాక, యితర II వ తర గతి పంచాయతీలకు యీ విధులు (II వ భాగము) వర్తించునని దీని యర్థము)

(2) ఈ విధులలో

(a) "ఎలెక్షను ఆఫీసరు" అనగా ఎన్నిక అధికారి అనిగాని, లేక ఎన్నికలలో యీ విధులక్రింద ఏపని అయిన చేయుటకుగాని, ఏ విధినయిన నిర్వహించుటకుగాని, ఎన్నిక అధికారి చేత నియమింప బడిన, లేక అధికారమీయబడిన వ్యక్తి అని అర్థము

(b) "అర్హతగల అభ్యర్థి" అనగా, షెడ్యూల్డు జాతికిచెంది సక్రమముగా ప్రతిపాదింపబడిన (నామినేటు చేయబడిన) అభ్యర్థి అని అర్థము

(c) "ప్రత్యేకింపబడని ఖాళీ" అనగా షెడ్యూల్డు తరగతి లోని వ్యక్తికి ప్రత్యేకింపబడని ఖాళీ అని అర్థము

(d) "అధ్యక్షోద్యోగి" (ప్రిసైడింగ్ ఆఫీసర్), అనగా, ఎలెక్షన్ ఆఫీసరు అనిగాని, లేక యీవిధులక్రింద ఎన్నికలు నిర్వ హించు సందర్భములో ఏ పనినైన చేయుటకుగాని, యే విధినయిన నిర్వర్తించుటకుగాని ఎలెక్షను ఆఫీసరువల్ల నియమింప బడిన వ్యక్తి అని అర్థము.

(e) "ప్రత్యేకింపబడిన ఖాళీ" అనగా, షెడ్యూల్డు తరగతి లోని మనుష్యునికి ప్రత్యేకింపబడిన ఖాళీ అని అర్థము.

2 నోటీసు ప్రకటించుట — (1) సాధారణ, మరియు ఆకస్మిక ఖాళీలకు సభ్యుల ఎన్నికలకు ఏర్పాట్లు ఎన్నికల వుద్యోగి (ఎలక్షను ఆఫీసరు) చేయవలెను

(2) పంచాయితీకి సభ్యుల ఎన్నికల తేదీకి ముందు ఏడుదినములకు తక్కువకాకుండా, ఎన్నికల ఉద్యోగుల (ఎలెక్షన్ ఆఫీసర్లు) యీ క్రింది (4) వ ఉపవిధిలో చెప్పిన విధముగా యీ క్రింది విషయములు తెలుపుతూ, ఒక నోటీసు తయారుచేసి, ఆ ప్రదేశముయొక్క ముఖ్యభాషలో ప్రచురించవలెను-

(a) ఎంతమంది సభ్యులు ఎన్నుకొనబడవలెనో, ఏయేవార్డులకు వారు ఎన్నుకోబడవలెనో, ప్రతివార్డులోను షెడ్యూల్డు తరగతులకు ప్రత్యేకింపబడిన ఖాళీలు ఏవయిన వున్నయెడల వాటిని, తెలుపవలెను

(b) ఏ తేదీలలో, ఏయే స్థలములలో, ఉదయం 9 గంటలు లగాయతు సాయంత్రం 6 గంటలలోగా నాలుగుగంటల కాలమునకు తక్కువ కాకుండా, ఏయే గంటలమధ్య ఎట్లు తీసుకొనబడునో తెలుపవలెను

(c) సభ్యులుగా ఎన్నుకొనుటకు అభ్యర్థుల నామినేషనలను పిలువవలెను

(3) అభ్యర్థుల నామినేషనలను, ఓట్లు వేయుటకు (పోలింగు)కు నిర్ణయించిన కాలమునకు ఒక గంట ముందుగా, ఎన్నికల ఉద్యోగికిగాని, అతను లేనియెడల, ఈ పనులకు అతనిచేత నియమింపబడిన వ్యక్తికి, పంచాయతీకి ఆఫీసువున్నయెడల అక్కడగాని, లేక (2) వ ఉపవిధిలో ప్రకటింపబడిన గ్రామములోని ముఖ్య ప్రదేశమునందుగాని, తెలుపవలెను

(4) (2) వ యుపవిధిలో (సబ్ రూల్) చెప్పబడిన నోటీసు, దానియొక్క నకళ్లు పంచాయతీకి ఆఫీసువున్నయెడల అక్కడను, ఎన్నిక జరుగవలసిన వార్డులో మూడింటికి తక్కువకాని ప్రాముఖ్యమయిన ప్రదేశములలోను అంటించి ప్రకటించవలెను ప్రతివార్డులోను డప్పుల వాయింపు (దండోరా) మూలంగాకూడ ప్రకటన చేయవలెను.

(5) అట్టి నోటీసు, ఎన్నికలరోజున, వోట్లు వేయుటకు (పోలుకు) కనీసము రెండుగంటలు ముందుగా, ప్రతివార్డులోను మరల డప్పువాయింపు (దండోరా) ద్వారా ప్రకటింపబడవలెను.

## 3. నామినేషను (ప్రతిపాదన)

(1) ప్రతి అభ్యర్థియొక్క నామినేషను వార్డులోని ఒక ఎన్నిక దారు (ఎలెక్టరు) వల్ల ప్రతిపాదించబడి ఆ వార్డులో మరియొక ఎన్నికదారుచేత బలపరుపబడ (సెకండు చేయింప) వలెను అధ్యక్షో ద్యోగి, అట్లు ప్రతిపాదించబడినట్టి బలపరుపబడినట్టి పేర్లను రికార్డు చేయవలెను

(2) ఒక వార్డులోని అభ్యర్థి ఆ వార్డులోని ఎన్నికదారుగా నుండ నవసరములేదు

(3) షెడ్యూల్డు తరగతులకు చెందిన ప్రతిఅభ్యర్థియు, తన పేరు ప్రతిపాదింపబడినపుడు, ఆంధ్రరాష్ట్రమంతటా ప్రకటితమయిన షెడ్యూల్డు తరగతికి (తరగతిపేరు చెప్పవలెను) తాను చెందినట్లుగా రూఢిచేసి, తాను సంతకముచేసిన ఒక రూఢి పత్రమును యివ్వ వలెను

## 4. నామినేషనుల చట్ట సమ్మతము

అధ్యక్షోద్యోగి, తనయొక్క స్వేచ్ఛానుసారముగాని, లేక అక్కడ హాజరయిన ఎన్నికదారులలో ఎవరైన చెప్పిన అభ్యంత రముపైగాని, యీ క్రింద నుదహరించిన యే కారణములచేనయిన, ఏ అభ్యర్థియొక్క నామినేషను నయినను తిరస్కరింపవచ్చును —

(ఎ) మద్రాసు గ్రామపంచాయతీల యాక్టు 1950, యొక్క 13, 14, 15 మరియు 16 సెక్షనులక్రింద అభ్యర్థి అనర్హుడు అయి నపుడు

(బి) ప్రతిపాదించిన వానిపేరుగాని, బలపరచిన వానిపేరుగాని, ఆ వార్డుయొక్క ఎన్నికదార్ల పట్టిలో నమోదు కానియెడల ,

(సి) షెడ్యూల్డు తరగతుల అభ్యర్థుల నిమిత్తం ప్రత్యేకింప బడిన ఖాళీలను నింపుటకు జరిపే ఎన్నికలు మాత్రమే అయినప్పుడు,

అభ్యర్థి షెడ్యూల్డు తరగతికి చెందని యెడల

5. ఎన్నికల క్రమము —

తాను అంగీకరించిన నామినేషనులు గల అభ్యర్థుల పేర్లను అధ్యక్షోద్యోగి పైకి చదువును మరియు అట్టి అభ్యర్థులకు యీ క్రింది ప్రత్యేక నిబంధనలు వర్తించును,—

(1) ఎన్నికలు కేవలము ప్రత్యేకింప బడని స్థానములకు గాని, లేక కేవలము ప్రత్యేకింపబడిన స్థానములకు గాని జరుపబడు చున్న యెడల—

(a) అభ్యర్థులుగాని, లేక అర్హులైన అభ్యర్థులుగాని, ఖాళీల సంఖ్యకు సమముగాను నున్న యెడల, లేక అంతకు తక్కువగా నున్న యెడల, అట్టి అభ్యర్థులు సక్రమముగా ఎన్నిక అయినట్లు అధ్యక్షోద్యోగి ప్రకటించవలెను ఇంకా యేవైన ఖాళీలు మిగిలిన యెడల, వాటిని నింపుటకు, క్రొత్త ఎన్నికలకు తిరిగి అన్నివిధముల చర్యలు మరల ప్రారంభించవలెను.

(b) అభ్యర్థులుగాని, లేక అర్హులైన అభ్యర్థులుగాని లేని యెడల అన్నివిషయములలోను క్రొత్త ఎన్నికలకు వలెనే ఖాళీలను పూర్తి చేయుటకు మరల ఎన్నికల క్రమము ప్రారంభించవలెను

(c) అభ్యర్థుల సంఖ్యగాని, అర్హులైన అభ్యర్థుల సంఖ్యగాని, ఖాళీలకు మించియున్న యెడల, ఓట్లు తీసుకొనబడ వలెను.

(2) ఒకప్పుడు, ఒకటిగాని, అంతకు ఎక్కువగాని ప్రత్యేకింప బడిన ఖాళీలనుగాని, మరియు ఒకటిగాని అంతకు ఎక్కువగాని ప్రత్యేకింప బడని ఖాళిలనుగాని, పూర్తి చేయవలసిన యెడల—

(a) ప్రత్యేకింపబడినఖాళీసంఖ్యకు సరిగాగాని,అంతకు తక్కువగా గాని అర్హులైన అభ్యర్థులు వున్నయెడల, అధ్యక్షోద్యోగి అట్టి యభ్యర్థులను, ప్రత్యేకింపబడిన ఖాళీలకు సక్రమముగా యెన్నికైనట్లు ప్రకటింప వలెను మరియు, యింకా ప్రత్యేకింప బడిన ఖాళీలు మిగిలియున్నయెడల నన్నివిధముల క్రొత్త ఎన్నికల ద్వారా వాటిని భర్తీ చేయుటకు ఎన్నిక క్రమము ప్రారంభించ వలెను

(b) ప్రత్యేకింపబడిన ఖాళీలకు అర్హులైన అభ్యర్థులు లేనిచో నట్టి ఖాళీలను నింపుటకు మరల సన్నివిధముల క్రొత్త ఎన్నికలకు యెన్నిక క్రమము ప్రారంభించ వలెను

(c) ప్రత్యేకింపబడిన ఖాళీల కంటె నర్హులైన యభ్యర్థు లెక్కువగానున్న యెడల, అధ్యక్షోద్యోగి యుపవిధి (e) లో చెప్పిన ప్రకారం చేయవలెను

(d) ఉపనిధి (a) క్రింద సక్రమముగా ఎన్నికయినట్లు ప్రకటింపబడిన అభ్యర్థు లెవరయిన వున్న యెడల, మరియు యే ప్రత్యే కింపబడిన ఖాళీలకు వారు యెన్నికయినారో వాటిని, మరియు, ఉపనిధి (b) క్రింద ప్రత్యేకింపబడిన యే ఖాళీలకు మరల క్రొత్త ఎన్నికలకు వలె యెన్నిక కార్యక్రమము జరుపబడునో వాటిని జరుగుచున్న, ఎన్నికల కార్యక్రమమునుండి తొలగింప బడవలెను యెన్నికోద్యోగి, (1) వ క్లాజు ననుసరించి, మిగిలిన యభ్యర్థుల విషయములోను, ఖాళీల విషయములోను చర్య తీసుకోవలెను.

(e) ఉపనిధి (c) అన్వయించినపుడు—

(1) అభ్యర్థుల సంఖ్య ఖాళీలసంఖ్యతో సమముగానుండిన గాని, లేక తక్కువగా నుండిన గాని, అధ్యక్షోద్యోగి, అర్హులైన యభ్యర్థులకు నోటీసు యిచ్చిన తర్వాత, "లాటు" ద్వారా ప్రత్యే కింప బడిన ఖాళీలకు ఏ అభ్యర్థుల ఎన్నికయినారో నిర్ణయించి, అట్లు ఎన్నుకోబడిన అభ్యర్థులు సక్రమముగా నెన్నుకోబడినట్లు మిగిలిన యభ్యర్థులు యితర ఖాళీలకు ఎన్నికయినట్లును ప్రకటించ వలెను.

అయితే, అర్హులైన అభ్యర్థులందరు తమలో నెవరు ప్రత్యేకింప బడిన ఖాళీలకు ఎన్నికయినట్లు ప్రకటింపబడవలెనో తమలో తాము అంగీకరించి, అట్టి అంగీకారమును వ్రాతమూలకముగ నధ్యక్షోద్యోగికి అక్కడనే యిచ్చినయెడల, అధ్యక్షోద్యోగి ఆ ప్రకారమే ప్రకటన చేయవలెను

(ii) అభ్యర్థుల మొత్తం సంఖ్య ఖాళీలసంఖ్యకు మించిన యెడల ఓట్లు తీసుకొనవలెను.

## 6 ఓట్లు తీసుకొనుటకు ఏర్పాట్లు

(పోల్) ఓట్లు తీసుకొనవలసినయెడల, పోల్ జరుగు ప్రదేశములో, నిరూఢముగా నామినేటు చేయబడిన (ప్రతిపాదింపబడిన) అభ్యర్థులను, ప్రతి అభ్యర్థికి ఒక ఏజెంటువంతునను, ఓట్లువేయువారిని ఆనవాలు చేయుటకు (గుర్తించుటకు) తనకు సహాయముచేయుటకు, కావలసినవారిని, మరియు ఎన్నికలలో తనకు కావలసిన సహాయము చేయుటకు, అల్లరులు మొదలగునవి రాకుండ కాపాడుటకు కావలసిన వారిని, అధ్యక్షోద్యోగి ప్రవేశపెట్టవలెను ఓట్లు వేయువారియొక్క స్వేచ్ఛకు భంగముకలిగిస్తున్నాడని అధ్యక్షోద్యోగి అభిప్రాయము కలిగినపుడు, అట్టి వ్యక్తికి (అభ్యర్థినయినా,ఏజెంటునయినా) ఆ ప్రదేశము నుండి తొలగించవచ్చును అట్లు వ్యక్తులను ప్రవేశపెట్టు సందర్భములోగాని, బహిష్కరించు సందర్భములోగాని, యేమయిన అభ్యంతరములు వున్నయెడల, అక్కడనే, వెంటనే, అతను దానిని పరిష్కరించవలెను అతని నిర్ణయము నిర్వివాదము. వార్డులోని ఎన్నికదార్లను ఒకరితర్వాత నొకరిని అతను ప్రవేశపెట్టవలెను

## 7. ఓట్లు రికార్డు చేయుట

చట్టము మేరకు ప్రతిపాదించబడిన అభ్యర్థుల పేర్లను అధ్యక్షోద్యోగి ఎన్నికదారునకు చదివి వినిపించి, ఎన్నికదారు ఏ అభ్యర్థికి తాను ఓటుచేయదలచెనో తెలుసుకొని, తనదగ్గరనున్న పట్టీలో, అభ్యర్థులయొక్కగాని, ఏజెంట్లుయొక్కగాని యెవరయిన వున్నయెడల వారి సమక్షమున అట్టి ఓటును రికార్డు చేయవలెను

ఓట్లు యీక్రింద చెప్పిన రీతిని రికార్డు చేయవలెను పట్టీలో అభ్యర్థులపేర్లుండును ప్రతి అభ్యర్థి పేరునకెదురుగా అతనికి ఓటునిచ్చినట్టు చెప్పిన ఓటర్లసంఖ్యను వ్రాస్తూరావలెను అనగా, ఆసంఖ్యలను బట్టి, ఒక్కొక్క అభ్యర్థి కెన్నెన్ని వోట్లు వచ్చినవో చెప్పనగును

### వివరణము (ఎక్స్‌ప్లనేషన్)

రెండుగాని, అంతకు ఎక్కువగాని ఖాళీలు పూర్తిచేయవలసి వున్నయెడల, ప్రతి ఎన్నికదారునకు, భర్తీచేయవలసిన ఎన్నిఖాళీ

లున్న, అన్నిఓట్లు సూచించవచ్చును కాని, ప్రతి యభ్యర్థికి ఒక ఓటు కన్న ఎక్కువ సూచించకూడదు

## 8. ఎలక్షను పలితమును వెల్లడిచేయుట

(1) ఓట్లు వేయుట ముగిసిన తర్వాత, అధ్యక్షోద్యోగి రికార్డు సరిచూచి, క్రమముగా ప్రతిపాదింపబడిన అభ్యర్థులలో నెవరికి ఎక్కువ ఓట్లువచ్చినవో వారిని ప్రత్యేకింపబడిన స్థానములున్న యెడల సదరు స్థానములకు సక్రమముగా నెన్నికయినట్లు ప్రథమమున ప్రకటించి, తరువాత మిగిలిన యభ్యర్థులలో నెవరికి యెక్కువ ఓట్లువచ్చినవో వారిని ప్రత్యేకింపబడని స్థానములకు సక్రమముగా యెన్నికయినట్లు ప్రకటించవలెను.

(2) ఇద్దరు లేక రెండుకుమించిన అభ్యర్థులకు ఓట్లు సమానముగా వచ్చినయెడల, అధ్యక్షోద్యోగి అట్టి యభ్యర్థులకు నోటీసు యిచ్చి, "లాట్" ద్వారానే యభ్యర్థులు సక్రమముగా యెన్నికయినారో నిర్ణయించి ప్రకటింపవలెను

## 9 ఎలక్షను గెలుపుల ప్రచురణ.

8 వ విధి ననుసరించిన ఎలక్షనులో గెలుపొందిన అభ్యర్థి లేక అభ్యర్థుల పేర్లు వెల్లడిచేసిన వెంటనే, సక్రమముగా యెన్నికయిన అభ్యర్థులపేర్లను, అధ్యక్షోద్యోగి, పంచాయతీకి ఆఫీసువున్న యెడల నక్కడ నోటీసు బోర్డుమీదను, లేదా గ్రామములో ముఖ్య ప్రదేశములలోను ప్రచురణ చేయవలెను

సంపాదకుని సూచిక

ఎన్నికలలు తగాదాల విధులకు తర్వాయి 98 పేజీ చూడుము

8 (1) ప్రతి పంచాయతీలో ఇన్‌స్పెక్టరు, నిర్ణయింపబడగల విధులకు లోబడి గ్రామములో షెడ్యూలు దాఖలా జాతులకు చెందినవారి జనసంఖ్యకు తగినట్లు ఆయన యుక్తమని తలంచు విధమున వారికి స్థానములు ఏదైన నున్న యెడల వాటిని ప్రకటనద్వారా ప్రత్యేకించవచ్చును

(2) (1) వ సబ్ సెక్షనుక్రింద చేయబడిన ఏ ప్రత్యేకింపు గాని, యీ యాక్టు ప్రారంభమైనప్పటినుండి పది సంవత్సరముల కాలపరిమితి గడచిపోయిన తర్వాత పంచాయతీకి మొదటి సాధారణ ఎన్నికలు జరుగునంతవరకు మాత్రము అమలు కలిగియుండవలెను

(3) (1) వ సబ్ సెక్షనులో నున్న దేదియు ఏ పంచాయతీలోనైన స్థానములు ప్రత్యేకింపబడిన బాపతు షెడ్యూలు దాఖలా జాతులకు చెందిన మనుష్యులను పంచాయతీలోని ప్రత్యేకింపబడని స్థానములకు ఎన్నిక నిమిత్తము పోటీ చేయుటనుండి ఆటంకము కలుగ జేసినట్లు భావింపబడకూడదు

సంపాదకుని సూచిక — షెడ్యూలు దాఖలా కులములకు ప్రత్యేకించబడిన స్థానములు నిర్ణయించే ప్రకటనలు 1-4-1961 తేదీనుండి అమలులో నుండవని దీని యర్థము సెక్షను 8 (1) క్రింద జారీచేయబడిన విధులు జి ఓ. నెం 520, ఎల్ ఎ. తేదీ 24-3-1951

విధులు

## షెడ్యూలు దాఖలా కులములకు చెందినవారికి స్థానములను ప్రత్యేకించుట

1 షెడ్యూలు దాఖలా కులములకు చెందిన సభ్యులకు ఒక పంచాయతీలో ప్రత్యేకించబడిన స్థానముల మొత్తము సంఖ్య, పంచాయతీ ప్రెసిడెంటును మినహాయించి దానియొక్క మొత్తము సభ్యుల సంఖ్యలో ఐదింట ఒక వంతును మించకూడదు

2 గడచిన జనాభా గణితీలో గ్రామముయొక్క మొత్తము జనాభాలో షెడ్యూలు దాఖలా కులములకు చెందినవారి సంఖ్య సగముకంటె ఎక్కువగానుండిన పక్షమున వారికై ఏ పంచాయితీలో గాని ఎట్టి స్థానమునైన ప్రత్యేకించకూడదు

సె 9. (1) ఒక పంచాయతీకి సభ్యులను ఎన్నుకొనుటను, ఇన్‌స్పెక్టరు పంచాయతీతో ఆలోచించిన మీదట ప్రకటనద్వారా

గ్రామమును వార్డులుగా విభజించి ప్రతి వార్డు పంపవలసిన సభ్యుల సంఖ్యను నిర్ణయింపవలెను.

(2) 1 వ తరగతి పంచాయతీ గ్రామమును ఐదు వార్డుల కంటె తక్కువ కాకుండా విభజించవలెను 2 వ తరగతి పంచాయతీ గ్రామము 1000 లేక అంతకు తక్కువమంది జనసంఖ్య గలిగి యున్న పక్షమున రెండు వార్డులుగా విభజించవలెను 1000 కంటె ఎక్కువ జనసంఖ్యను అది గలిగియున్న పక్షమున ఐదు వార్డులకంటె ఎక్కువకాకుండా విభజింపవలెను

10 (1) సామాన్య ఎన్నికలలో ఎన్నుకొనబడిన ప్రతి పంచాయతీయొక్క మెంబర్ల ఉద్యోగకాలము యీ ఆక్టులో యితర విధముగా స్పష్టముగా నిబంధింపబడిన విధముగా తప్ప లేదా ఈ ఆక్టు ననుసరించి నిర్ణయింపబడగల విధముగా తప్ప, ఖాళీలు ఏ దినమున కలుగునో ఆ దినము మధ్యాహ్నమున ప్రారంభమై మూడు సంవత్సరముల వరకు వుండును

అయితే ఇన్‌స్పెక్టరు ప్రకటన మూలముగా దానిలో తెలియ జేయవలసిన చాలినంత కారణమును బట్టి మొత్తముగా ఏ పంచాయతీయొక్క మెంబర్ల వుద్యోగకాలమునుగాని ప్రకటలో నిర్దేశింప బడగల విధముగా మూడు నెలలకు మించని కాలపరిమితి వరకు పొడిగించబడినట్లు లేదా తగ్గింపబడినట్లు ఆజ్ఞాపించవచ్చును

(2) ఒక పంచాయతీయొక్క ఎన్నుకొనబడిన మెంబరుయొక్క వుద్యోగములో గలుగు సామాన్య ఖాళీలు, సామాన్య ఎన్నిక జరిపి భర్తీచేయబడవలెను అవి ఎన్నిక అధికారిచే, ఖాళీలు యేర్పడుటకు పూర్వము మూడు నెలలలోపల ఆయన యుక్తమని తలచు తేదీన లేక తేదీలలో జరుగునట్లు నిర్ణయించవలెను.

అయితే చాలినంత కారణమునుబట్టి గవర్నమెంటువారు ఏ సామాన్య ఎన్నికగాని ఖాళీ యేర్పడినతరువాత జరుపబడునట్లు ఆజ్ఞాపింపవచ్చును లేక జరుపబడుటను అనుమతించవచ్చును

(3) (a) ఒక పంచాయతీయొక్క ఎన్నుకొనబడిన మెంబరు యొక్క వుద్యోగములో గలుగు ప్రతి ఆకస్మిక ఖాళీనిగురించి దాని

కార్యనిర్వాహక అధికారి ఎన్నిక అధికారికి నిర్ణయింపబడగల కాలములోపుగా రిపోర్టు చేయవలెను

(b) ఒక ఆకస్మిక ఖాళీలో ఎన్నుకొనబడిన మెంబరు వెంటనే ఉద్యోగమునందు ప్రవేశింపవలెను కాని సదరు ఖాళీ కలుగక యుండినయెడల ఆయన యే మెంబరుయొక్క స్థానమునకు యెన్నుకొనబడెనో ఆ మెంబరు యెంతకాలమువరకు ఉద్యోగమును కలిగి యుండుటకు హక్కు కలిగియుండునో అంతకాలమువరకు మాత్రమే ఉద్యోగమును కలిగియుండవలెను

(c) ఇన్‌స్పెక్టరు ఇతరవిధముగా ఆజ్ఞాపించిననే తప్ప, ఒక పంచాయతీకి ఎట్టి ఆకస్మిక ఎన్నికగాని నియమితకాలము గడచుట మూలముగా సదరు పంచాయతీ మెంబర్లు ఉద్యోగమునుండి విరమించు తేదీకి పూర్వము మూడు నెలలలోపుగా జరుపబడకూడదు

(4) ఒక పంచాయతీయొక్క మెంబర్లసంఖ్య హెచ్చింపబడిన సందర్భములో అదనపు స్థానములకు ఎన్నుకొనబడిన మెంబర్లు లేదా ఆకస్మిక ఖాళీలవలన వారి స్థానములకు ఎన్నుకొనబడిన మెంబర్లు, అంతకు అవ్యవహితముగా పూర్వము సామాన్య ఎన్నికలలో అసలు స్థానములకు ఎన్నుకొనబడిన మెంబర్లు ఏ తేదీన ఉద్యోగమును ఖాళీ చేయుదురో ఆ తేదీ వరకు ఉద్యోగమును కలిగియుండవలెను

సెక్షను 10-A

స్త్రీ సభ్యురాలిని పంచాయితీకి ఎన్నుకొనుట (కో-ఆప్టుచేసికొనుట) ఆమెయొక్క ఉద్యోగ కాలపరిమితి.

(1) (a) పంచాయతీ సభ్యులు, ఆ గ్రామములో నివసిస్తున్న ఒక స్త్రీని, పంచాయతీ సభ్యురాలిగా, నిర్ణయింపబడిన రీతిగా ఎన్నుకోవలెను

(b) 7 వ సెక్షనుక్రింద ఎన్నుకోబడిన సభ్యునికి 14, 15, 16, 17, 18 మరియు 19 సెక్షనులలోని విధులు ఎట్లు వర్తించునో, అట్లే క్లాజు (a) క్రింద కొనబడిన సభ్యురాలికి వర్తించును.

(2) (1) వ సబ్‌సెక్షనుక్రింద జరుపబడిన ఎన్నికలలో స్త్రీ ఎన్నుకోబడని యెడల క్రొత్త యెన్నిక జరుపబడవలెను.

(3) (a) (1) వ సబ్ సెక్షను క్రింద యెన్నుకోబడిన స్త్రీయొక్క వుద్యోగ కాలపరిమితి, ఆ పంచాయతీకి సాధారణ యెన్నికలలో ఎన్నుకోబడిన సభ్యుల వుద్యోగ కాలపరిమితి అంతేవుండును

(b) ఒకసభ్యుని వుద్యోగకాలపరిమితి ఎక్కువ చేయుటకుగాని, తగ్గించుటకుగాని, మరియు సాధారణ లేక ఆకస్మిక ఖాళీలను నింపు విషయములోగాని, 10 వ సెక్షనులో చెప్పబడిన విధులు, అట్టి స్త్రీ సభ్యురాలికి వర్తించును

(4) 7 వ సెక్షనుక్రింద పంచాయతీ యెన్నికలలో స్త్రీలు పోటీచేయుటకు యీ సెక్షనులోని విధులు అడ్డురావు

సంపాదకుని సూచిక

"పంచాయతీలో కో-ఆప్టు చేయబడు స్త్రీ అభ్యర్థి, ఆ పంచాయతీలో ఓటరుగా నుండనక్కరలేదు" అని ప్రభుత్వము జి. ఓ నెం 1364 ఎల్ ఎ, తేదీ 29-9-1956 లో విశదపరచినారు

స్త్రీ సభ్యురాలిని ఎన్నుకొనుటకు విధులు

జి. ఓ. నెం 461, ఎల్ ఎ, తేదీ 23-3-1956 జి ఓ నెం 1090 ఎల్ ఎ తేదీ 4-8-1956.

## విధులు

1 ఈ విధులలో—

(1) "యాక్టు" అనగా మద్రాసు గ్రామ పంచాయతీల యాక్టు 1950 అని అర్థము, మరియు (1) "ఇన్‌స్పెక్టర్" అనగా ఇన్‌స్పెక్టరు-జనరల్ ఆఫీసులోగల అడ్మినిస్ట్రేషన్ అని అర్థము

2 (1) పంచాయతీ సభ్యురాలిగా ఒక స్త్రీయొక్క ఎన్నిక, పంచాయతీ ఆఫీసులో ప్రత్యేకము యిందుకొరకు ఏర్పరుపబడిన సమావేశములో, సభ్యులచేత జరుపబడవలెను

అయితే యీ విషయములో, జిల్లాపంచాయతీ ఆఫీసరు పై చెప్పబడిన సభ పంచాయతీ ఆఫీసులో కాక మరి యేయితర ప్రదేశములోనైన, తాను చెప్పినట్లు జరిపించమని ఆదేశించినయెడల, సదరు సమావేశము అట్టిచోట జరుపబడవలెను

(2) (1) వ ఉపవిధిలో చెప్పబడిన సమావేశము పంచాయతీలో (స్త్రీ సభ్యురాలి స్థానము) ఖాళీ ఏర్పడిన తర్వాత సాధ్యమయినంత సత్వరముగా—

(a) పంచాయతీకి స్పెషల్ ఆఫీసరు నియామకమయినయెడల అట్టి స్పెషల్ ఆఫీసరుచేత ఏర్పరుప బడవలెను

(b) పంచాయతీలో స్పెషల్ ఆఫీసరు నియామకము కానియెడల, జిల్లా పంచాయతీ ఆఫీసరుచేత ఏర్పరుప బడవలెను.

(3) సదరు సమావేశము లేక మీటింగు నిర్ణయింపబడిన రోజు గంటలు తెలుపు నోటీసుకు, ఆ రోజుకు అధమము అయిదు పూర్తి రోజులు ముందుగా మెంబర్లకు యివ్వవలెను

(4) (1) వ ఉపవిధి క్రిందనేర్పరుపబడ్డ మీటింగుకు—

(a) ఆక్టుయొక్క 122 వ సెక్షను క్రింద స్పెషల్ ఆఫీసరు అధ్యక్షుని హక్కులు చెలాయించుచున్న సందర్భములలో, సదరు స్పెషలాఫీసరు అధ్యక్షత వహించవలెను

(b) అట్టి స్పెషలాఫీసరు లేకుండాయున్న సందర్భములలో జిల్లా పంచాయతీ ఆఫీసరుగాని, లేక అతనిచేత ఆపనికి నియమితుడైన అధికారిగాని, అధ్యక్షుడుగా నుండవలెను

(5) స్త్రీ సభ్యురాలిని ఎన్నుకొనుటకు ఏర్పరుప బడిన మీటింగులో ఆ పంచాయతీ గ్రామమునకు సంబంధించిన రెవిన్యూ ఇన్‌స్పెక్టరు హోదాకు తక్కువకాని ప్రభుత్వోద్యోగి హాజరయి సభాకార్య క్రమమును గమనించుటకు హక్కు వున్నది

(6) జిల్లా పంచాయతీ ఆఫీసరుగాని, లేక స్త్రీ సభ్యురాలి ఎన్నికకు ఏర్పరచిన సభలో అధ్యక్షత వహించమని, అతనిచేత నియమింపబడిన ఉద్యోగిగాని, లేక 122 వ సెక్షను క్రింద నియమితుడైన స్పెషల్ ఆఫీసరుగాని, లేక (5) వ యుపవిధిలో చెప్పబడిన ఉద్యోగిగాని, అట్టి ఎన్నికలలో ఓటుచేయుటకు హక్కు కలిగియుండడు.

3 పంచాయతీ స్త్రీ సభ్యత్వపదవికి ప్రతి అభ్యర్థియు, ఒక సభ్యునిచేత ప్రతిపాదింపబడి, మరియొక సభ్యునిచేత బలపరుపబడవలెను ప్రతిపాదింపబడి, బలపరుపబడిన అభ్యర్థుల పేర్లన్నియు సభాధ్యక్షునిచేత చదువ అనగా వెల్లడి చేయుబడవలెను.

4. (1) సక్రమముగా నామినేటు చేయుబడిన ప్రతిపాదింపబడిన అభ్యర్థి ఒక్కరే అయిన యెడల, ఓట్లు తీసుకొన నక్కరలేకయే నామె సక్రమముగా ఎన్నికైనట్లు ప్రకటింపవలెను

(2) ఇరువురు అంతకు ఎక్కువ అభ్యర్థులున్న యెడల, చేతు లెత్తుట మూలముగా ఎన్నిక జరుపబడి, సభలో హాజరయిన సభ్యుల ఓట్లు తీసుకొనవలెను

(3) ఇరువురు అభ్యర్థులు మాత్రమే యున్న యెడల, ఎవరికి అధికవోట్లు వచ్చినవో, వారు సక్రమముగా ఎన్నికయినట్లు ప్రకటింపవలెను ఇద్దరకు సమానముగా వోట్లు వచ్చిన యెడల, సభ్యుల సమక్షమున అధ్యక్షుడు లాటరీ వేసి, ముందుగా తీసిన పేరుగల అభ్యర్థి సక్రమముగా యెన్నికైనట్లు ప్రకటింపవలెను

(4) ఇరువురు కంటె యెక్కువ అభ్యర్థులున్న యెడల కనీస ఓట్లువచ్చినామెను తొలగించి, మరల మిగిలిన అభ్యర్థులకు ఓట్లు తీసుకోవలెను అభ్యర్థులందరికి సమమైన ఓట్లు వచ్చినయెడలగాని లేక కనీసవోట్లు వచ్చినవారు యిద్దరుగాని, అంతకు యెక్కువగావుండి, వారికి సమానమయిన వోట్లు వచ్చినయెడలగాని, సభ్యుల సమక్షమున అధ్యక్షుడు లాటరీతీసి, వారిలో నేయభ్యర్థిని తొలగించవలెనో నిర్ణయించును ఈ ప్రకారముగా నిరువురు అభ్యర్థులు మాత్రమే మిగులువరకు ఓట్లువేయుచు తొలగించుచుండవలెను అప్పుడు తుది పర్యాయము ఓట్లు తీసుకొని, ఎక్కువ వోట్లు వచ్చిన అభ్యర్థి సక్రమముగా నెన్నికయినట్లు ప్రకటించవలెను కడపటి స్థితిలోకూడ, ఇద్దరు అభ్యర్థులకు వోట్లు సమముగా నున్నయెడల, సభ్యుల సమక్షములో, అధ్యక్షుడు లాటరీతీసి, ముందుగా తీయబడిన పేరుగల అభ్యర్థి సక్రమముగా యెన్నికయినట్లు ప్రకటింపవలెను

(5) తుది పర్యవసానము ప్రకటితము కాకముందు, యెప్పుడయిన అభ్యర్థి తన అభ్యర్థిత్వము నుపసంహరించు లేక వదులుకొన వచ్చును

5 మీటింగు ముగిసిన తక్షణమే అధ్యక్షుడు—

(a) సభా కార్యక్రమమంతయు రికార్డు తయారుచేసి, తప్పులు దిద్దినచోట్ల సంతకములుచేసి, ఎవరయిన సభ్యుడు ఆ రికార్డుపై

సంతకము చేసెదనని తెలిపినయెడల, అతనుచేకూడ సంతకము చేయుటకు అనుమతింపవలెను

(బి) మరియు, యెన్నిక అయిన సభ్యురాలియొక్క పేరుతో నొక నోటీసు తాను సంతకముచేసి, పంచాయతీ నోటీసుబోర్డుమీఁద ప్రకటించవలెను మరియు యీ నోటీసు నకళ్ళను, యిందుకొరకు ఇన్‌స్పెక్టరుచేత నియమింపబడిన వ్యక్తికిగాని, వ్యక్తులకుగాని పంపవలెను.

సూచిక ఎన్నిక తగాదాల విధులకు క్రింద 98 పేజీలను చూడుము.

సె 11 (1) ఒక సామాన్య లేక ఆకస్మికపు ఎన్నికలో ఆయా సందర్భమునకు తగినట్లు సదరు ఖాళీని లేక ఒకటి లేక యెక్కువ ఖాళీలను భర్తీచేయుటకు ఏ మనిషిగాని యెన్నుకొనబడని యెడల ఇన్‌స్పెక్టరు నిర్ణయించగల తేదీన క్రొత్త యెన్నికలు జరుపవలెను.

(2) అట్టి క్రొత్త యెన్నికలలో ఆయా సందర్భమునకు తగినట్లు ఆ ఖాళీని లేక ఖాళీలలో దేనినైన భర్తీచేయుటకు యెట్టి మనిషిగాని యెన్నుకొనబడనియెడల, పంచాయతీ నిర్ణయింపబడిన విధముగా ఖాళీని భర్తీచేయుటకు ఒక అర్హతగల మనిషిని ఎన్నుకొనవలెను

(3) యీ సెక్షను ననుసరించి యెన్నుకొనబడిన ఒక పంచాయతీ మెంబరుయొక్క వుద్యోగకాలము ఆయా సంగతికి తగినట్లు సాధారణ లేక ఆకస్మిక ఎన్నికలో అతను ఎన్నుకొనబడియుండిన యెడల అది యే కాలములో అంత్యమగునో ఆ కాలములోనే అంత్యము కావలెను

సె॥ 11 (2) క్రింద జారీచేయబడిన రూలు

(నోటిఫికేషన్ 1 – ఫో సెం జా గెజెటు డే॥ 24–3–51)

(జి ఓ నెం 520 ఎల్ ఎ తేదీ 24–3–51)

కొన్ని సందర్భములలో పంచాయతీలు సభ్యులను ఎన్నుకొనుట

చట్టములోని 11 (2) సెక్షను క్రింద ఒక పంచాయతీ ఒక సభ్యుని ఎన్నుకొనవలసినచో, వుపాధ్యక్షుని ఎన్నిక నిబంధనల ననుసరించవలెను.

సె. 12.

(1) అసెంబ్లీ ఎన్నికవర్గమునకు చెందిన ఏ గ్రామముయొక్క గాని, ఆ గ్రామముయొక్క భాగముయొక్కగాని ఎన్నికదార్ల పట్టీలో చేర్చబడియున్న ప్రతివ్యక్తియొక్క పేరున్ను, ఆ పంచాయతీయొక్క ఎన్నికపట్టీలో చేర్చబడవలెను మరి యేయితర వ్యక్తి పేరు అందులో చేర్చబడకూడదు

వివరణము (ఎక్స్‌ప్లనేషను)

(1) అసెంబ్లీ ఎన్నికవర్గమునకు చెందిన ఎన్నికపట్టీలో, ఆగ్రామమునకు ప్రత్యేకమైన ఎన్నికదార్ల జాబితా లేనియెడల ఆ గ్రామము ఏ రిజిస్ట్రేషను ఏరియా (ప్రదేశము)లో చేర్చబడియున్నదో అట్టి యేరియా లేక ప్రదేశమునకు సంబంధించిన ఎన్నికదార్ల జాబితాలో నున్న ఓటర్లలో నెవరి విలాసములు ఆ గ్రామములో నున్నవో, అట్టి వ్యక్తులపేర్లు, యీ యాక్టుకొరకు తయారుచేయబడిన పంచాయతీ ఎన్నిక పట్టీలో చేర్చవలెను

(2) పంచాయతీయొక్క ఎన్నిక జాబితాలో ఏ వ్యక్తిపేరైనా నొకచోటున మాత్రమే చేర్చబడియుండవలెను

(3) అసెంబ్లీ ఎన్నికవర్గములు, రిప్రజెంటేషన్ ఆఫ్ పీపుల్స్ ఆక్టు, 1950, ననుసరించి, ఆ గ్రామమునకుగాని, ఆ గ్రామముయొక్క భాగమునకుగాని చెందినంతవరకు సవరణ చేయబడిగాని, లేక మరల తయారు చేయబడిగాని ప్రకటితమైన తర్వాత, సాధ్యమయినంత త్వరలో, యీ సందర్భములో నిర్ణయింపబడిన అధికారిచే యిందుకుగాను నియమింపబడిన యేవ్యక్తికిగాని, రాష్ట్రప్రభుత్వము శాసించిన ప్రకారముగా, గ్రామమునకు చెందిన ఎన్నికపట్టీలను పంచాయతీ ఎన్నికపట్టీలుగాను, లేక పట్టీలోని సవరణలను పంచాయతీ ఎన్నిక పట్టీయొక్క సవరణలుగాను (సందర్భానుసారముగా) ప్రకటింపవలెను.

(4) పంచాయతీయొక్క ఎన్నికపట్టీ, ప్రతి వార్డునకు వేర్వేరుగా విభజింపవలెను

(5) (3) వ సబ్ సెక్షనుక్రింద పంచాయతీయొక్క ఎన్నిక పట్టీగాని, లేక అందలి సవరణలుగాని ప్రకటింపబడిన తర్వాత,

గ్రామము వార్డులుగా విభజింపబడినగాని, లేక యిదివరకున్న వార్డులలో మార్పులు చేయబడినగాని, లేక గ్రామ సరిహద్దులు మార్చబడినగాని, పై చెప్పబడిన వార్డులుగా గ్రామ విభజనుగాని, లేక వార్డులలో మార్పులుగాని, లేక గ్రామసరిహద్దుల మార్పునుగాని అమలులో పెట్టుటకుగాను, నిర్ణయింపబడిన అధికారి, సందర్భానుసారముగా, ప్రభుత్వము నిర్దేశించిన ప్రకారముగాను, పద్ధతిలోను, ఎన్నికపట్టీని సరిదిద్ది తిరిగి ప్రకటింపవలెను.

(6) పంచాయతీ ఎన్నికపట్టీలో ఏ వ్యక్తి పేరున్నదో, అట్టి వ్యక్తిమాత్రమే ఆ పట్టీ అమలులో నున్నంతకాలము, అందులోని సవరణలకు, యీ యాక్టులోని యితర నిబంధనలకు లోబడి ఎన్నికలలో ఓటుచేయుటకు హక్కు కలిగియుండును మరియు ఆ పట్టీలోలేని పేరుగల నేవ్యక్తియుగూడ ఎన్నికలలో ఓటుచేయరాదు

అయితే, మతిభ్రమ (పిచ్చి), లేక మూగ-చెవుడు, లేక కుష్టురోగముగల నే వ్యక్తియు ఎన్నికలలో ఓటుచేయుటకు హక్కు కలిగియుండడు

వివరణము (ఎక్స్‌ప్లనేషన్)

ఈ సెక్షనులోను, సెక్షను 12-A లోను పేర్కొనబడ్డ "అసెంబ్లీ ఎన్నికవర్గము" అనగా, ఆంధ్ర లెజిస్లేటివ్ అసెంబ్లీకి, రిప్రజెంటేషన్ ఆఫ్ పీపుల్స్ యాక్టు, 1950, యొక్క 9 వ సెక్షనుక్రింద ఆజ్ఞాపించి ఏర్పరుపబడిన ఎన్నికవర్గము అని అర్థము

సెక్షను—12-A

12 వ సెక్షనులో నేమిచెప్పబడినప్పటికి, తత్సంబంధమయిన అసెంబ్లీ ఎన్నికవర్గముయొక్క ఎన్నికపట్టీతో సమముచేయుటకుగాను, నియమింపబడిన అధికారి, తనకు యుక్తమని తోచిన విచారణజరిపి, పంచాయతీ ఎన్నికపట్టీకి అవసరమయిన సవరణలను, రాష్ట్రప్రభుత్వము ఆదేశించిన ప్రకారముగా ప్రకటించవలెను

ఎన్నికల పట్టీలు ప్రకటించుట, మున్నగు విషయముల నిర్ణయించు అధికారి.

జి. ఓ. నెం. 677, ఎల్. ఎ తేదీ 2-4-1952

12 వ సెక్షనులో (3) మరియు (5) సబ్ సెక్షనులలోని, సె॥ 12–ఎ లోని విషయములలో నిర్ణయింపబడిన అధికారి ఆ ప్రాంతపు జిల్లా పంచాయతీ ఆఫీసరు

పంచాయతీల ఎన్నిక పట్టీలు ప్రకటించు విధానములగూర్చి ప్రభుత్వము యిచ్చిన ఆదేశములు

జి ఓ నెం 412, ఎల్ ఎ. తేదీ 15–3–1956

మద్రాసు గ్రామపంచాయతీల యాక్టు 1950 (మదరాసు యాక్టు X ఆఫ్ 1950) యొక్క సెక్షను 12 (3) మరియు (5) మరియు సెక్షను 12–A క్రింద, మాజీ సంయుక్త మద్రాసు రాష్ట్ర ప్రభుత్వపు స్థానిక స్వపరిపాలనాశాఖ (లోకల్ అడ్మిని స్ట్రేషన్ డిపార్టుమెంటు) యొక్క జి ఓ నెం 426, తేదీ 12–3–1952 లో జారీ చేయబడిన ఆదేశములను తీసివేయుచు, పంచాయతీల ఎన్నికల పట్టీలు (ఓటర్ల లిస్టులు) ప్రకటించు విధానముగూర్చి ప్రభుత్వము యీ దిగువ ఆదేశములను జారీచేయుచున్నది

1 ప్రతిగ్రామమునకు చెందినంతవరకు ఆంధ్ర లెజిస్లేటివ్ అసెంబ్లీ ఎన్నికవర్గములను, వార్డుల ప్రకారము తయారుచేసి, ఆ గ్రామముయొక్క ఎన్నికపట్టీగా, నియమింపబడిన అధికారిచేత, అనగా, జిల్లాపంచాయతీ ఆఫీసర్ చేత నియమింపబడిన వ్యక్తి, జిల్లాపంచాయతీ ఆఫీసరు నిర్ణయించిన తేదీలోగా, యీ క్రింది ప్రదేశములలో ప్రకటింపవలెను —

(i) నియమితుడైన అధికారిచేత నియమింపబడిన వ్యక్తి యొక్క ఆఫసు (కార్యాలయము) లోను

(ii) పంచాయతీకి ఆఫీసువున్న యెడల, అక్కడను

(iii) ప్రతివార్డులో ఒక ముఖ్యప్రదేశములోను

2. ఏ గ్రామమునకుగాని, గ్రామముయొక్క భాగమునకుగాని చెందినంతవరకు, అసెంబ్లీ ఎన్నికవర్గములు, రిప్రజెంటేషన్ ఆఫ్ పీపుల్సుయాక్టు, 1950 (సెంట్రల్ యాక్టు XII ఆఫ్ 1950) ననుసరించి, సవరణ చేయబడినను, లేక తిరుగ తయారుచేసినను, ఆ గ్రామమునకు సంబంధించిన మార్పులను, పంచాయతీ ఎన్నికపట్టీకి మార్పులుగా,

నియమితుడైన అధికారి, అనగా జిల్లా పంచాయతీ ఆఫీసరుచేత అధికార మీయబడిన వ్యక్తి, జిల్లాపంచాయతీ ఆఫీసరు నిర్ణయించిన తేదీకి మించకుండా 1 వ పేరాలో చెప్పిన ప్రదేశములలో ప్రకటింప వలెను

3 ఒకటవ పేరా క్రింద ఎన్నికపట్టీలు ప్రకటింపబడిన తర్వాతగాని, లేక రెండవపేరా క్రింద ఎన్నికపట్టీల సవరణలు ప్రకటింపబడిన తర్వాతగాని, జిల్లాపంచాయతీ ఆఫీసరు, వాటిలోని వ్రాత తప్పులనుగాని, పొరపాట్లనుగాని, అచ్చు తప్పులనుగాని సరిచేసి, పొర పాట్లవల్లవచ్చిన లోపములను పూర్తిచేసి, ఒకభాగములోని పేర్లను మరియొక భాగములోనికిమార్చి, అనవసరమయిన యితర సవరణలను చేసి, తత్సంబంధమయిన అసెంబ్లీపట్టి భాగముతో సరిసమముగా చేయవలెను

జిల్లా పంచాయతీ ఆఫీసరు యిట్టి సవరణల పట్టీ ఒకటి తయారు చేసి, తాను నిర్ణయించిన తేదీ మించకుండ, యీ చివరి ఎనెక్సరు మాదిరిగా యీ క్రింది ప్రదేశములలో ప్రకటింపవలెను -

(i) నియమింపబడిన అధికారి ఆఫీసులోను,

(ii) పంచాయతీకి ఆఫీసువున్నయెడల ఆ యాఫీసులోను,

(iii) తత్సంబంధమయిన వార్డు లేక వార్డులలో నొక ముఖ్య ప్రదేశమందును

మరియు నట్టిప్రకటనకాగానే, పంచాయతీ ఎన్నికపట్టీలో నా సవరణలు చేయబడినట్లే భావింపబడును

4 గ్రామమును మొదటిసారి వార్డులుగా విభజించినపుడు గాని, లేక యిదివరలోనున్న వార్డులను మార్చినపుడుగాని, లేక గ్రామ సరిహద్దులను మార్చినపుడుగాని, పై వార్డుల విభజననుగాని, లేక వార్డుల మార్పునుగాని, లేక గ్రామసరిహద్దుల మార్పునుగాని అమలుచేయుటకు, జిల్లాపంచాయతీ ఆఫీసరు ఆ గ్రామ ఎన్నికపట్టీగాని, ఎన్నిక పట్టీలోని భాగముగాని తగురీతిని సర్దుబాటుచేసి, ఆ సర్దుబాట్లను 3 వ పేరాలో చెప్పిన ప్రదేశములలో, జిల్లాపంచాయతీ ఆఫీసరు నిర్ణయించిన తేదీ మించకుండ ప్రకటించవలెను.

౫. పై 2 వ పేరాలో చెప్పిన మార్పులతోను, 3 వ పేరాలో చెప్పిన సవరణలతోను, నాల్గవ పేరాలో చెప్పినరీతిగా సరిదిద్దుట చేయబడిన ఎన్నికలపట్టీనకళ్లు జిల్లాపంచాయతీ ఆఫీసులోను, పంచాయతీ ఆఫీసులోను వుంచవలెను

ఎనెక్సర్

ఫారం

( 3 వ పేరా చూడుము )

...... . . . . పంచాయతీ

(a) యీ క్రింది సవరణలు పంచాయతీ ఎన్నిక షట్టీలో చేయబడినవి —

| వార్డు | పట్టీలో నెం | సవరణయొక్క రూపము |
|---|---|---|
| (1) | (2) | (3) |

(B) పంచాయతీ ఎన్నికపట్టీలో, యీ క్రింద సంతకముచేసిన వారిచేత, యీ క్రింది పేర్లు కలుపబడినవి —

| వార్డు | పేరు | తండ్రి, లేక కర్ణ వాని లేక భర్తపేరు | విలాసము |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |

సె 13 ఏమనిషిగాని అతనిపేరు ఒక పంచాయతీయొక్క ఎన్నికదారుల పట్టీలోనున్ననే తప్ప, పంచాయతీ మెంబరుగా ఎన్నుకొనబడుటకు అర్హుడుగా నుండకూడదు

సె 14 (1) ఏ గ్రామ మునసబు, కరణము లేక గ్రామ నౌకరుగాని, రాజ్యము లేక కేంద్ర ప్రభుత్వముయొక్క లేక ఒక పంచాయతీ, జిల్లాబోర్డు, మునిసిపలు కౌన్సిలు ఉద్యోగి లేక నౌకరైనను మెంబరుగా ఎన్నుకొనబడుటకు, లేక ఎన్నుకొనబడిన మెంబరుగా ఉద్యోగమును కలిగియుండుటకు అర్హుడుగా నుండకూడదు

(2) ఒక ఎన్నిక జరుగుటకు పూర్వముగాని, తరువాతగాని ఏ మనిషియైన ఈ సెక్షను ననుసరించి అనర్హుడా అనర్హుడుకాడా అను

నట్టి ప్రశ్న బయలు దేరినయెడల ఆ ప్రశ్నను గవర్న మెంటువారికి తెలియ జేయవలెను మరిన్నీ వారి తీర్పునకు అపీలులేదు

సె 15 ఇండియన్ పీనల్ కోడు (శిక్షాస్మృతి) యొక్క IX-A అధ్యాయము ననుసరించి లేదా ఎన్నిక రహస్యమును వుల్లంఘించుటకు సంబంధించిన ఎట్టి చట్టమునుగాని విధినిగాని, అనుసరించి శిక్షింపబడ తగిన నేరముచేసెనని నేరస్థాపన చేయబడిన ప్రతి మనిషి అతనిమీాద నేరస్థాపన చేయబడిన తేదీనుండి 5 సంవత్సరముల కాలమువరకు లేదా కోర్టువారు ఉత్తరువు మూలముగా నిర్ణయించగల అంతకంటె తక్కువ కాలమువరకు ఈ ఆక్టు వర్తించు ఎట్టి ఎన్నికల్లోగాని ఓటుచేయుటకు లేదా యెన్నుకొనబడుటకు లేదా ఒక పంచాయతీయొక్క మెంబరుగా వుద్యోగమును కలిగియుండుటకు అనర్హుడై యుండవలెను.

15 వ సెక్షనుక్రింద విధి (జి ఓ నెం 520, ఎల్ ఎ తేదీ 24-3-1951).

ఎన్నిక విషయమున పాటించవలసిన రహస్యమును అతిక్రమించుట.

చట్టముచే అధికారమియ్యబడిన కార్యమును మినహాయించి, ఏఓటరైనను ఏ అభ్యర్థికి ఓటుచేసెనని ప్రత్యక్షముగాగాని, పరోక్షముగాగాని తెలుపుచు ఏ సమాచారమునైన తెలుపు పోలింగు గదిలో నుండు ప్రతి పోలింగు వుద్యోగి, గుమాస్తా లేక ఇతర మనిషి అక్రమముగా అట్టి ఏ విషయమునైన సంపాదించు ప్రతి మనిషి వంద రూపాయలవరకు వ్యాపించగల జుల్మానాతో శిక్షింపబడతగియుండవలెను

సె 16 (1) ఒకమనిషి ద్వీపాంతర వాసమునకు లేదా అవినీతి యిమిడియుండని నేరము కానట్టి యే యితర నేరమునకైన ఆరు నెలల కంటె యెక్కువ కాలమునకు ఖైదుకు ఒక క్రిమినలు కోర్టువారిచే శిక్ష విధింపబడి (అట్టి తీర్పు తదనంతరము రద్దుచేయబడియుండని లేదా సదరు నేరము క్షమింపబడియుండనియెడల) ఆ శిక్షను అనుభవించుచుండునపుడును, ఆ శిక్ష అయిపోయిన తేదీనుండి ఐదు సంవత్సరములవరకును ఒక మెంబరుగా యెన్నుకొనబడుటకు అనర్హుడై యుండవలెను

అభ్యర్థుల అనర్హతలు

అయితే గవర్నమెంటువారు అట్టి శిక్ష ఒక అనర్హతగా వర్తించకూడదని ఆజ్ఞాపించవచ్చును

(2) నామినేషను లేక యెన్నిక తేదీన ఒక మనిషి—

(a) మనోస్వస్థత లేనివాడుగా చెవిటి, మూగగాం లేగా కుష్ఠు రోగిగా యున్నయెడల,

(b) దివాలాదారుగా తీర్పు చేయబడుటను దరఖాస్తు పెట్టుకొన్న మనిషిగా లేదా డిశ్చార్జి పొందని దివాలాదారుగా నున్న యెడల,

(c) ఒక కంపెనీలో (డైరెక్టరు కానట్టి) షేరు హోల్డరుగా తప్ప లేదా ఈ ఆక్టు ననుసరించి చేయబడిన విధులచే అనుమతింపబడి నట్లు తప్ప పంచాయతీతో చేసుకొని అమలులోనున్న ఒక కంట్రాక్టులో లేదా పంచాయితీకొరకు చేయబడు ఏ పనిలోనైనను భాగము కలిగియున్న యెడల,

(d) పంచాయతీ తరఫున నియమింపబడిన న్యాయవాదిగా లేదా పంచాయతీకి వ్యతిరేకముగా న్యాయవాదిగా నియమింపబడిన యెడల,

(e) గ్రామములో ఏ భాగముమీదనైన విచారణాధికారము గల 1898 వ సం॥పు క్రిమినల్ ప్రొసీజరు కోడుక్రింద ఆనరరీ మేజిస్ట్రేటుగా నున్నయెడల,

(f) అతని క్రొత్త ఎన్నిక, అమలులోనికి వచ్చుటకు పూర్వము అంత్యము కానట్టి పంచాయతీ మెంబరుగా అదివరకే వున్నయెడల లేదా తన వుద్యోగకాలము యింకను ప్రారంభము కానట్టి పంచాయతీ మెంబరుగా అదివరకే యెన్నుకొనబడినయెడల,

(g) సదరు శేగిన వుద్యోగమును కలిగియున్న మెంబరు యొక్క నౌకరుగా లేదా యజమానిగా లేదా వుద్యోగరీత్యా తాబేదారుగా లేదా వుద్యోగరీత్యా పై అధికారిగానున్నయెడల, లేదా

(h) అంతకు పూర్వపు సంవత్సరము వరకున్ను దానితో చేరియు పంచాయితీకి (ట్రస్టీగా తప్ప ఇతర విధముగా) ఆయనకు ఒక బిల్లు లేదా నోటీసు క్రమముగా అందజేయబడియుండి చెల్లించు

టకు అందులో, ఏదైన కాలము నిర్ణయింపబడియుండి ఆ కాలము గడచిపోయిన బాపతు ఏ విధమైన, బాకీగాని ఉన్న యెడల,
అతడు ఒక మెంబరుగా ఎన్నుకొనబడుటకు అనర్హుడైయుండవలెను

ఆక్టుయొక్క 16 (2) (c), 17 (d), సెక్షనుల జారీచేయ బడిన విధులు

(జి ఓ నెం 520 ఎల్ ఎ తేదీ 24-3-1951)

## ఎన్నికకు నిలుచు అభ్యర్థులయొక్కయు, పంచాయతీ మెంబర్ల యొక్కయు అనర్హతలు.

ఒక మనిషి నామినేషను లేక ఎన్నిక తేదీన ఒక పంచాయతీతో చేసికొన్న ఆ సమయమందు అమలులోనున్న ఒక ఒడంబడికలో లేక పంచాయతీకి చేయబడుచున్న ఏ పనియందైన భాగమును కలదను కారణమునుబట్టి, ఎట్టి మనిషిగాని ఒక పంచాయతీ సభ్యుడుగా ఎన్నుకొనబడుటకు అనర్హుడుగా చేయబడకూడదు మరియు ఒక పంచాయతీ యొక్క ఎట్టి సభ్యుడుగాని—

(I) స్థిరాస్తియొక్క ఏదైన గుత్త, విక్రయము లేక కొనుగోలునందు లేక వాటి నిమిత్తము ఏ ఒడంబడికలోనైన, లేక

(II) పైకపు ఋణము నిమిత్తము ఏ ఒడంబడికలోనైన లేక పైకమును మాత్రము చెల్లించుటకైన ఏ హామీలోగాని, లేక

(III) పంచాయతీ సమాచారములకు సంబంధించిన ఏ ప్రకటనగాని ముద్రింపబడియుండు ఏ వార్తాపత్రికలోనైన, లేక

(IV) ఒడంబడిక లేక పనియొక్క కాలపరిమితిలో ఏ సంవత్సరమునందైన మొత్తముమీద పదునైదు వందల రూపాయలకు విలువకు మించకుండ తన సాధారణ వర్తకవస్తువులను వేటినిగాని సదరు పంచాయతీకి అమ్మకముచేయుటలో లేక సదరు పంచాయతీవద్ద ఏ వస్తువులనైనను కొనుగోలు చేయుటలో,

అట్టిమనిషి లేక సభ్యునికి, ఒక వాటా లేక బాధ్యతకలదను కారణమునుబట్టి, అట్టి ఏదైన ఒడంబడిక లేక పనిలోనైన ఆయన ఏ బాధ్యతగాని సంపాదించెనను కారణమునుబట్టి, సభ్యత్వమున కనర్హత గలుగదు.

సె 17. 19 వ సెక్షనుయొక్క నిబంధనలకు లోబడి ఒక మెంబరు, ఆయన—

(a) ఒక క్రిమినలు కోర్టుచే, 16 వ సెక్షను, (1) వ సబు సెక్షనులో వివరింపబడినట్టి శిక్షతోను, అట్టి నేరమునకును శిక్షింపబడినయెడల

అయితే ప్రభుత్వమువారు అట్టి శిక్ష ఒక అనర్హతగా వర్తించకూడదని ఆజ్ఞాపించవచ్చును ,

(b) మనస్థిమితము లేనివాడు అయినయెడల చెవిటి మూగ లేదా కుష్టురోగిగా నున్నయెడల ,

(c) దివాలాదారుగా తీర్పు చెప్పబడుటకు దరఖాస్తు పెట్టుకొనునెడల లేదా తీర్పు చెప్పబడినయెడల ,

(d) ఒక కంపెనీలో (డైరెక్టరు కానట్టి ఇతర) షేరు హోల్డరుగా తప్ప లేదా ఈ ఆక్టు ననుసరించి చేయబడిన విధులచే, అనుమతించబడినట్లు తప్ప పంచాయితీతో చేసుకొని అమలులోనున్న ఏ కంట్రాక్టులోనైనను లేదా దానికొరకు చేయబడు ఏ పనిలోనైనను బాధ్యతను సంపాదించునెడల ,

(e) పంచాయితీ తరఫున జీతమియ్యబడు న్యాయవాదిగా పనికి నియమింపబడియుండు నెడల లేదా పంచాయతీకి వ్యతిరేకముగా న్యాయవాదిగా ఉద్యోగమును అంగీకరించునెడల ,

(f) ఈ ఆక్టు ననుసరించి ఒక ఉద్యోగిగా లేదా నౌకరుగా నియమింపబడినయెడల ,

(g) గ్రామములో ఏ భాగముమీదనైన విచారణాధికారముతో 1898 వ సం॥పు క్రిమినల్ ప్రొసీజరుకోడు క్రింద ఆనరరీ మేజిస్ట్రేటుగా నియమింపబడినయెడల ,

(h) ఏ ఇతర మెంబరుక్రిందనైనా నౌఖరీని అంగీకరించునెడల లేదా అతనియొక్క ఉద్యోగరీత్యా తాబేదారుగా నున్నయెడల ,

(i) గ్రామములో కాపురముండకుండ పోయినయెడల ,

(j) ఈ ఆక్టు ననుసరించి చేయబడిన విధులప్రకారము అతనికి ఒక బిల్లు లేదా నోటీసు అందచేసిన తర్వాత మూడు నెలలలోపల,

* ఈవిధులను 87 వ పుటలో ముద్రింపబడినవి.

లేదా ఏదైన బిల్లునుగాని నోటీసునుగాని అందజేయుటను అట్టి విధులు కోరని ఎట్టి బాకీ విషయములోగాని, అతనికి బాకీని చెల్లించమని కోరు ఒక నోటీసును ఈ నోటీసును సాధ్యమైనంత శీఘ్రముగా అందజేయుట పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారియొక్క విధియై యుండవలెను క్రమముగా కార్యనిర్వాహక అధికారి అందజేసిన తర్వాత మూడు నెలలలోపల, పంచాయతీకి (ట్రస్టీహోదాలో కాకుండ ఇతర విధముగా) ఆయన ఏ విధమైన బాకీనైనను చెల్లించుటకు తప్పిపోయినయెడల,

(k) ఆయా సంగతికి తగినట్లు అతని ఉద్యోగకాలము ప్రారంభమైన తేదీనుండి లేదా అతను హాజరైన కడపటి మీటింగుయొక్క తేదీనుండి లేదా 18 వ సెక్షను (1) వ సబు సెక్షను ననుసరించి తిరిగి మెంబరుగా తీర్మానించేయబడిన తేదీనుండి లెక్కపెట్టబడిన వరుసగా మూడు నెలల కాలములో పంచాయతీయొక్క మీటింగులకు హాజరు కానియెడల లేదా సదరు కాలములోపల మూడింటికంటె తక్కువ మీటింగులు జరిగియున్నయెడల, సదరు తేదీ తరువాత జరిగిన వరుసగా మూడు మీటింగులకు అతడు హాజరు కానియెడల

అయితే (i) ఆ మీటింగును గురించి క్రమమైన నోటీసు ఆయనకు ఇయ్యనియెడల, లేక

(ii) ఒక సాధారణ మీటింగుకు నిర్ణయించబడిన నోటీసు కంటె తక్కువకాలపు నోటీసును యిచ్చినతరువాత సమావేశము జరిగినయెడల, లేక

(iii) మెంబర్లు కోరినమీదట సమావేశము జరిగినయెడల,

ఒక సభ్యుడు హాజరుకాని ఎట్టి సమావేశమునైనను ఈ క్లాజు క్రింద ఆయన విషయమున లెక్కపెట్టకూడదు, లేక

(l) 132 వ సెక్షను (4) వ సబు సెక్షనుక్రింద ఉద్యోగము నుండి తొలగింపబడినయెడల,

ఉద్యోగమును కలిగియుండకూడదు

సంపాదకుని సూచిక —

17 వ సెక్షనులోని (1) వ క్లాజును అన్వయించునపుడు, 2 వ సెక్షనులోని (21) వ క్లాజులోని "నివసించు" అను పదమునకు నిర్వచనము గుర్తించవలెను.

పంచాయతీ కోర్టు ప్రెసిడెంటుగాగాని లేక సభ్యునుగాగాని తొలగింప బడిన, సదరు వ్యక్తి 17 వ సెక్షను, (e) క్లాజు క్రింద పంచాయతీ ప్రెసిడెంటుగా గాని, సభ్యుడుగాగాని వుండుటకు అనర్హుడగును

సె 18 (1) ఒక మనిషి 15 వ సెక్షను ననుసరించి లేదా 17 వ సెక్షనుయొక్క (ఎ) వ క్లాజు ననుసరించి మెంబరుగానుండక నిలిచిపోయినప్పుడు శిక్ష అపీలుమీదనో రివిజనులోనో రద్దుపరుపబడు నెడల మరిన్ని అట్లు రద్దుపరుపబడినపుడు లేదా శిక్షచే కలుగచేయ బడిన అనర్హత గవర్నమెంటువారి ఉత్తరువుమూలమున తీసివేయ బడినయెడల మరియు అట్లు తీసివేయబడునపుడు, తాను యెంతకాలము నకు యెన్నుకొనబడెనో, దానిలో ఉద్యోగము తిరిగిఇయ్యబడు తేదీన ఇంకను గడచిపోక నిలచియున్న భాగమువరకు అతడు తిరిగి ఉద్యో గములో ఉంచబడవలెను మధ్యకాలములో వాని ఖాళీ భర్తీచేయు టకు యెన్నుకొనబడిన ఏ మనిషియైనను, అట్లు ఉద్యోగము తిరిగి యీయబడినమీదట ఉద్యోగమును ఖాళీచేయవలెను.

(2) 17 వ సెక్షనులోని (k) క్లాజు ననుసరించి ఒక మనిషి మెంబరుగా నుండుటకు నిలిచిపోయిన విషయములో కార్యనిర్వాహక అధికారి వెంటనే ఆ విషయమును అట్టి మనిషికి వ్రాతమూలకముగా తెలియజేయుచు దానినిగురించి దాని మరుసటి సమావేశములో పంచాయితీకి తెలియజేయవలెను

అట్టి మనిషి, పంచాయితీ మరుసటిసారి సమావేశమగు తేదీన లేక అంతకు పూర్వము లేక ఆయనకు అట్టి సమాచారము అందిన తేదీనుండి పదునైదు దినములలోపల ఉద్యోగములో తిరిగి ఉంచ మని తనంతట తాను పంచాయితీకి దరఖాస్తు పెట్టుకొన్న పక్ష మున అట్టి దరఖాస్తు అందిన తరువాత మరుసటి సమావేశమందు పంచాయితీ అతనిని మెంబరుగా తిరిగి నియమించవచ్చును

అయితే ఒక మెంబరు అతని ఉద్యోగ కాలపరిమితిలో, రెండు పర్యాయములకంటె యెక్కువ అట్లు తిరిగి చేర్చుకొనబడకూడదు

సంపాదకుని సూచిక

ప్రెసిడెంటుగాని, వైస్‌ప్రెసిడెంటుగాని అనర్హులైనపుడు, అతను అధ్యక్ష పదవికిగాని, ఉపాధ్యక్ష పదవికిగాని మాత్రమేగాక సభ్యుడుగా నుండుటకుకూడ

అనర్హుడగును పంచాయితీచేత 18 వ సెక్షన క్రింద సభ్యుడుగ తిరిగి ప్రవేశము కలిగింప బడినయెడల, అట్టి తిరిగి ప్రవేశము, అధ్యక్షపదవికిగాని, ఉపాధ్యక్ష పదవికిగాని కానేరదు

సె 19 (1) పంచాయితీ మెంబరుగ ఎన్నుకొనబడిన ఏ మనిషి గాని, అర్హత పొందియుండనట్లు లేదా 13, 15, 16 లేదా 17 వ సెక్షనుల ననుసరించి అనర్హుడైనట్లు చెప్పబడి, ఆ మనిషి అట్టి ఆరోపణను ఒప్పుకొననప్పుడెల్లను లేదా ఏ మెంబరైన తాను 15, 16 లేదా 17 వ సెక్షను ననుసరించి ఆయనకు అర్హత నున్నదా లేదా లేక ఆయన అనర్హుడయ్యెనా లేదా అని సందేహపడునప్పుడెల్లను అట్టి మెంబరు లేదా ఏ ఇతర మెంబరుగాని నిర్ణయింపబడిన జూడీషియల్ అధికారికి ధరఖాస్తు పెట్టుకొనవచ్చును పంచాయతీ లేక ఇన్‌స్పెక్టరు ఆజ్ఞాపించినమీదట కార్యనిర్వాహక అధికారి దరఖాస్తును పెట్టుకొనవలెను ఆ జూడీషియల్ అధికారియొక్క తీర్పు కడపటిదిగా నుండవలెను

(2) అట్టి తీర్పు చెప్పబడునంతవరకు, మెంబరు అర్హుడైన నెట్లో అట్లే లేక అనర్హుడు కాకుండయుండిన నెట్లో అట్లే వ్యవహరించుటకు హక్కును కలిగియుండవలెను

(జి ఓ నెం 520 ఎల్ ఎ తేదీ 24-3-1951)

విధి

## సభ్యుల అనర్హతలకు సంబంధించిన విషయములను తీర్మానించుటకు న్యాయవిచారణ సంబంధమైన అధికారి

సంబంధించిన పంచాయతీ ఆఫీసు ఏ స్థలములో నున్నదో దానిమీద ప్రాంతీయ విచారణాధికారములోనున్న జిల్లా మునసబు సదరు ఆక్టుయొక్క 19 (1) సెక్షను క్రింద దరఖాస్తులు పెట్టుకోగల న్యాయ విచారణ సంబంధమైన అధికారిగా నుండవలెను లేక అట్టి ఒక జిల్లా మునసబుకంటె యెక్కువమంది వున్న పక్షమున, ప్రధాన జిల్లా మునసబు అట్టి అధికారిగా నుండవలెను

అయితే అట్టి ఏ దరఖాస్తునైన, జిల్లాలోని ఏ యితర జిల్లా మునసబునైన పరివర్తన చేయగల అధికారము జిల్లాజడ్జి కుండవలెను.

20 ప్రతి పంచాయతీకి ఒక ప్రెసిడెంటును, ఒక వైసు-ప్రెసిడెంటును వుండవలెను

## ప్రెసిడెంటు ఎన్నిక

సె 21 ప్రెసిడెంటు పంచాయతీ మెంబర్లనుండి ఎన్నుకొనబడవలెను

సె 22 వైసు ప్రెసిడెంటును, పంచాయతీలో దాని మెంబర్లనుండి యెన్నుకొనవలెను

ఈ సెక్షను క్రింద జరిగిన యెన్నికలలో ఏ వైసు ప్రెసిడెంటును గాని యెన్నుకొనబడని పక్షమున క్రొత్త యెన్నిక జరుపబడవలెను

పంచాయతీయొక్క అధ్యక్షుని, ఉపాధ్యక్షుని యెన్నికకు విధులు.

(జి ఓ నెం 717 ఎల్ ఎ తేదీ 15-5-1956)
(జి ఓ నెం 1089 ఎల్ ల్ తేదీ 4-8-1956)
(జి ఓ నెం 1054 ఎల్ ఎ తేదీ 28-4-1958)

1 ఈ విధులలో—

(i) "ఆక్టు" అనగా మద్రాసు గ్రామపంచాయతీల యాక్టు 1950 అని అర్థము

(ii) "ఇన్‌స్పెక్టరు" అనగా లోకల్ అడ్మినిస్ట్రేషన్‌యొక్క ఇన్‌స్పెక్టర్ జనరల్ అని అర్థము

2 (1) పంచాయతీ అధ్యక్షునియొక్క లేక వుపాధ్యక్షునియొక్క యెన్నిక, పంచాయతీ ఆఫీసులో అందుకొరకు ప్రత్యేకముగా జరుపబడిన సభలో జరుపబడవలెను

అయితే అధ్యక్షుని ఎన్నిక, పంచాయతీ ఆఫీసులో కాక యితర ప్రదేశములో జరుపవలెనని జిల్లా పంచాయతీ ఆఫీసరు ఆదేశించవచ్చును అట్లు ప్రత్యేకముగా జల్లా పంచాయతీ ఆఫీసరుచేత నియమితమైన ప్రదేశములో ఆ సభ జరుపబడవలెను

(2) (1) వ యుప విధిలో చెప్పబడిన సభ, ఖాళీ యేర్పడిన తర్వాత, సాధ్యమయినంత త్వరలో నీ క్రింద వారిచేత ఏర్పరుపబడవలెను

(a) అధ్యక్షుని ఎన్నిక విషయములో—

(i) పంచాయతీకి స్పెషల్ ఆఫీసరు నియమింపబడియున్న యెడల నట్టి స్పెషల్ ఆఫీసరుచేత,

(ii) స్పెషల్ ఆఫీసరు నియమింపబడని పంచాయతీ విషయములో, జిల్లా పంచాయతీ ఆఫీసరుచేత, మరియు

(b) ఉపాధ్యక్షుని ఎన్నిక విషయములో, అధ్యక్షునిచేత

అట్టి సభయొక్క తేదీ నోటీసు, ఆ తేదీకి కనీసము ఐదు పూర్ణ రోజులు ముందుగా నీయబడవలెను

(3) (1) వ యుపవిధిలో చెప్పబడిన సభలో యీ క్రింద వారు అధ్యక్షత వహించవలెను,—

(ఎ) అధ్యక్షుని ఎన్నికకు సభ జరుపబడిన యెడల—

(i) యాక్టుయొక్క 122వ సెక్షను వర్తించు సందర్భములలో, స్పెషల్ ఆఫీసరు,

(ii) యితర సందర్భములలో, జిల్లాపంచాయతీ ఆఫీసరుగాని, ఆ పనికొరకు అతనిచే నియుక్తుడైన ఉద్యోగిగాని, మరియు

(బి) ఉపాధ్యక్షుని ఎన్నికకొరకు సభ జరుపబడినయెడల, అధ్యక్షుడు, లేదా, అధ్యక్షుడు హాజరుకానియెడల, సభ్యులు అంగీకరించినట్టి, యెన్నికకు పోటీచేయు అభ్యర్థికాని సభ్యుడు

(4) రివిన్యూ ఇన్‌స్పెక్టరు హోదాకు తక్కువకాని. ఆ పంచాయతీ గ్రామమునకు సంబంధముగలిగిన, ప్రభుత్వోద్యోగి అట్టి సభలో హాజరయి, కార్యక్రమమును కనిపెట్టుటకు (పర్యవేక్షించుటకు) హక్కుగలిగియుండును

(5) జిల్లా పంచాయతీ ఆఫీసరుకుగాని, లేక అతనిచే అధ్యక్షుని యెన్నికకు జరుపబడిన సభలో నధ్యక్షతవహించుటకు నియుక్తుడైన ఆఫీసరుకుగాని, 122 వ సెక్షనుక్రింద నియమింపబడిన స్పెషల్ ఆఫీసరుకుగాని, లేక (4) వ యుపవిధిలో చెప్పబడిన ఆఫీసరుకుగాని, అట్టి ఎన్నికలలో ఓటుచేయుటకు హక్కులేదు

3 అధ్యక్ష లేక ఉపాధ్యక్షపదవికి అభ్యర్థిని ఒకసభ్యుడు ప్రతిపాదించి, మరియొక సభ్యుడు బలపరచవలెను ప్రతిపాదింపబడి, బలపరుపబడిన అభ్యర్థులపేర్లు నన్నిటిని ఆ సభాధ్యక్షుడు చదువును.

4 (1) ప్రతిపాదింపబడిన అభ్యర్థి ఒక్కడే అయినయెడల, ఓట్లువుండవు అతను సక్రమముగా యెన్నిక అయినట్లు ప్రకటింపబడవలెను

(2) ఇరువురుగాని, అంతకెక్కువగాని అభ్యర్థు లున్నయెడల, రహస్యవోట్లతో ఎన్నిక జరుపబడి, అక్కడ హాజరయిన సభ్యుల ఓట్లు తీసికొనబడును

(3) (2)వ యుపవిధిక్రింద సభ్యుల ఓట్లు తీసికొనవలసినయెడల, అభ్యర్థులతో సంప్రతించి, ప్రతి అభ్యర్థికి ఒక ప్రత్యేక చిహ్నము (ఆనవాలు) ఆ సభాధ్యక్షుడు యిచ్చును వారిపేర్లకు అకారాదివరుసలో, అభ్యర్థులకు వరుససంఖ్యలు (నెంబర్లు) కూడ యివ్వబడును. అప్పుడు, ఆ సభాధ్యక్షుడు, ప్రతి అభ్యర్థికి ప్రత్యేకించిన ఆనవాలును, నెంబరును సభకు తెలియజేయును

5 (1) ఓట్లు వేయుటకు ప్రత్యేకింపబడిన స్థలములో, అభ్యర్థు లెందరున్నారో అన్ని బ్యాలటు పెట్టెలు, అధ్యక్షుడు పెట్టించును ప్రతి పెట్టెమీద, బాగుగా కనుపడునట్లు అభ్యర్థియొక్క పేరు యింగ్లీషులోను, స్థానిక భాష లేక భాషలోను, వరుస సంఖ్యను, ఆనవాలును వ్రాయవలెను ఓట్లు పెట్టెలో ఓట్లు వేయుటకు వీలుండునట్లుగాను, మరియు పెట్టె తెరువకుండా లోపలి ఓట్లను తీయుటకు సాధ్యముకాకుండగాను, బ్యాలటు పెట్టెలు తయారుచేయవలెను

(2) ఓట్లు తీసుకొనుటకు ముందుగా, ఆ సభాధ్యక్షుడు అక్కడనున్న సభ్యులకు ఖాళీపెట్టెలను చూపించి, అవి ఖాళీగానున్నట్లు వారుచూచిన తర్వాత వాటికి తాళములు వేయవలెను అటుపిమ్మట, ఆ పెట్టెపై తన సీలు వేయవలెను ఏ సభ్యుడైన, తన సీలు వేస్తానంటే అట్లు చేయుటకు, సభాధ్యక్షు డనుమతించవలెను ఆ సీలు లేక సీళ్ళను పగులగొట్టకుండ పెట్టెను తెరచుట అసాధ్యమగు రీతిని ఆ సీళ్లను వేయవలెను ఓట్లు వేయుగదిలోనా పెట్టెలను, 4 వ విధి క్రింది (3) వ యుపవిధిలో చెప్పిన వరుస ప్రకారము యెడమవైపునుండి కుడివైపుకు వరుసగా పెట్టవలెను

(3) ఓటు చేయదలచుకొన్న ప్రతి సభ్యునికి ఒక బ్యాలట్ పేపరు (ఓటు కాగితము) యివ్వబడును ఈ ఓటు కాగితము ఒక తెల్లని కాగితము. దానిమీాద నది అసకార పూర్వకమయినదని నిర్ధారణ చేయుటకు ఆ సభాధ్యక్షుడు ఒక ముద్రవేయును తరువాత ఓటు వేయు నతడు, ఓట్లు వేయుటకు ప్రత్యేకింపబడిన స్థలమునకు వెళ్ళి, ఆ బ్యాలట్ పేపరును యే యభ్యర్థికి తాను ఓటు యివ్వదలచెనో, యతని పెట్టెలో వేయవలెను ఓటింగుయొక్క రహస్యము భద్రముగా నుండునట్లు ఓటువేసిన సభ్యులును ఓటువేయని సభ్యులును కలియకుండా వేర్వేరుగా నుంచుటకున్ను, తగిన ఏర్పాట్లు ఆ సభాధ్యక్షుడు చేయించును

(4) అటు తర్వాత నా సభాధ్యక్షుడు, అచ్చటి సభ్యుల సమక్షములో ఓట్లు పెట్టెలను ఒకదాని తర్వాత ఒకటి తెరచి అందులోని ఓట్లు పైకితీసి, లెక్కపెట్టి ఆ సంఖ్యను ఒక స్టేటుమెంటు రూపేణ వ్రాసియుంచవలెను (రికార్డు చేయవలెను) ఈ క్రింది సందర్భములలో బ్యాలట్ కాగితము తిరస్కరింపబడును –

(a) ఓటువేయు నాతనిని గుర్తుపెట్టగలిగిన ఏదైన ఒక ఆనవాలు (మార్కు) ఆ కాగితముమీాద నున్న యెడల,

(b) (3) వ యుపవిధిలో చెప్పబడిన సక్రమమైనముద్ర దానిమీాద లేనియెడల

(5) ఈ క్రింద వివరించిన ఆదేశముల ప్రకారముగా నా సభాధ్యక్షుడు ఫలితములను ప్రకటింపవలెను –

(1) ఇరువురు అభ్యర్థులు మాత్రమే యుండిన యెడల, నెవరికి యెక్కువ ఓట్లు వచ్చినవో వారు సక్రమముగా నెన్నికయినట్లు ప్రకటింపవలెను ఇరువురకు ఓట్లు సమముగావచ్చిన యెడల, సభ్యుల సమక్షములో నా సభాధ్యక్షుడు లాటరీతీసి, ముందుగా నెవరిపేరు తీయబడినదో ఆ యభ్యర్థి సక్రమముగా నెన్నుకొనబడినట్లు ప్రకటింపవలెను

(11) యిరువురి కంటె నెక్కువ అభ్యర్థులున్న యెడల, కనీస ఓట్లు వచ్చిన వానిని తొలగించి, మరల ఓట్లు తీసుకొనవలెను. అందరు అభ్యర్థులకు ఓట్లు సమముగావచ్చినట్లైనగాని, లేక కనీస

ఓట్లు యిరువురికిగాని, అంతకు ఎక్కువ మందికిగాని సమముగా వచ్చి నట్లయినగాని, సభ్యుల సమక్షములో నా సభాధ్యక్షుడు లాటరీతీసి ఏ యభ్యర్థిని తొలగించవలెనో నిర్ణయించవలెను ఈ విధముగా చివరకు యిరువురు అభ్యర్థులు మాత్రమే మిగులువరకు తొలగింపు చేయబడి, అప్పుడు తుదిపర్యాయము ఓట్లు తీసుకొనబడి, యెవరికి యెక్కువ ఓట్లు వచ్చినవారు సక్రమముగా నెన్నికయినట్లు ప్రకటింప వలెను. తుది పరిస్థితిలో యిరువురు అభ్యర్థులకు సమానముగా ఓట్లు వచ్చినయెడల, సభ్యుల సమక్షములో నా సభాధ్యక్షుడు లాటరీతీసి ముందు తీయబడిన పేరుగల అభ్యర్థి సక్రమముగా నెన్నికయినట్లు ప్రకటింపవలెను

6. ఏ యభ్యర్థియు ఓట్లు వేయుటలో పాల్గొనరాదు కాని ఒక అభ్యర్థి ఏ పరిస్థితిలోనైన నుపసంహరించుకొనవచ్చును అట్లుపసంహ రించుకొనిన తర్వాత ఓట్లలో పాల్గొనవచ్చును ఇదే ప్రకారముగా

5 వ విధియొక్క (5) వ యుపవిధిలోని (11) వ క్లాజు క్రింద నే స్థితిలోనైన తొలగింపబడిన యభ్యర్థి తరువాత ఓట్లు వేయుటలో పాల్గొనవచ్చును.

7 సభముగిసిన వెనువెంటనే, ఆసభాధ్యక్షుడు —

(a) ఆసభయొక్క కార్యక్రమ మంతయు నివేదికగా వ్రాసి సంతకముచేసి, అందలి ప్రతిదిద్దుబాటువద్దకూడసంతకముచేసి, ఎవరైన సభ్యులు హాజరయినవారు కూడ నానివేదికలో సంతకము చేసెదమని తెలిపిన యెడల వారికి కూడ సంతకముచేయుటకు అనుజ్ఞనొసంగ వలెను, మరియు

(b) ఏవ్యక్తి అధ్యక్షుడు ఉపాధ్యక్షుడుగా నెన్నిక అయినా తెలుపుతూ ఒక ప్రకటనను తానుసంతకముచేసి, పంచాయతీ నోటీసుబోర్డుపై ప్రకటించి, అట్టి ప్రకటనయొక్క నకళ్లను యీ సందర్భములో యిన్‌స్పెక్టరుచేత నియుక్తుడైన వ్యక్తికిగాని, వ్యక్తు లకుగాని పంపవలెను

8 (1) అటుతర్వాత సభాధ్యక్షుడు, ప్రతి అభ్యర్థియొక్క ఓట్లను(బ్యాలట్ పేపర్లు), లెక్కించినవిగాని, తిరస్కరింప బడినవిగాని, వేరువేరుగా కట్టలుకట్టి, ప్రతి కట్టమీాద సీలు (ముద్ర) వేసి, దానిపై

సందులోని కాగితముల వివరములు, అవి ఏ ఎన్నికకు సంబంధించినవి, దానియొక్క తారీకు వ్రాయవలెను

(2) ఎన్నికలకోర్టు యొక్కగాని, లేక అధికారముగల యితర కోర్టువల్ల గాని ఉత్తరువులేకుండా యీకట్టలను తెరువకూడదు. వాటిలోని కాగితములను తనిఖీ చేయకూడదు, లేక నెవ్వరికి యివ్వ రాదు

(3) పంచాయతీ ఆఫీసులోని కట్టలు ఒక సంవత్సరము భద్రముగా జాగ్రత్తపెట్టబడిన తర్వాత, అధికారముగల కోర్టు వేరే విధముగా చేయుటకు ఆజ్ఞాపించిన యెడల తప్ప, నాశనముచేయబడవలెను

సెక్షను 23

ప్రెసిడెంటుగాని, వైస్‌ప్రెసిడెంటుగాని, ఈ క్రింది సందర్భములలో ఆ పదవిలో నుండరాదు

(a) ప్రతి సందర్భములోను—

(1) డిస్ట్రిక్టుబోర్డుకుగాని, ఆ జిల్లాలోని ఏ యితరపంచాయతీకిగాని, ప్రెసిడెంటుగా గాని, లేక వైసుప్రెసిడెంటుగాగాని ఎన్నిక అయినయెడల, లేదా

(11) పంచాయతీ సభ్యత్వకాలపరిమితి పూర్తి అయినతర్వాత గాని, లేక యితర కారణముల చేతనయిన అట్లు సభ్యుడుగా నుండని యెడల, లేదా

(b) వైసుప్రెసిడెంటు విషయములో, తాను ప్రెసిడెంటుగా యెన్నుకోబడిన యెడల,

ప్రెసిడెంటు వైసుప్రెసిడెంటు పదవులలో నుండరాదు

21. ప్రెసిడెంటు

(a) వైసు ప్రెసిడెంటుయొక్క ఎన్నికకు ఏర్పాట్లను చేయవలెను

(b) పంచాయతీ మీటింగులను సమావేశపరచవలెను,

(c) పంచాయతీ రికార్డులను పొందుటకు పూర్తి అవకాశమును కలిగియుండవలెను,

(d) ఈ ఆక్టుచే ప్రత్యేకముగా ప్రెసిడెంటుకు విధింపబడిన విధులను నెరవేర్చవలెను లేదా ఇయ్యబడిన అధికారములను చెలాయించవలెను.

ఉపాధ్యక్షుని ఎన్నికకు అధ్యక్షునిచేత సత్వర ఏర్పాట్లు చేయించుటకు, జి, ఓ నెం 1156, లోకల్ అడ్మినిస్ట్రేషన్, తేదీ 17-8-1959 క్రింద జారీచేయబడిన ఉత్తరవులు —

పంచాయతీ అధ్యక్షుని ఎన్నిక అయినతర్వాత, సాధ్యమయినంత శీఘ్రకాలములో, కనీసము అధ్యక్షుని ఎన్నిక అయిన తేదీ లగాయతు ఒక నెలకు మించకుండ, ఉపాధ్యక్షుని ఎన్నిక జరుపబడవలెనని ప్రభుత్వము ఆలోచించినారు అధ్యక్షుడు ఈ ఆదేశములను అనువర్తింపక పోయినయెడల, మద్రాసు గ్రామపంచాయతీల యాక్టు యొక్క 47 వ సెక్షను క్రింద అధ్యక్షుని పదవినుండి తొలగింప తగిన అపరాధము ఆ యధ్యక్షుడు చేసినట్లు భావింపబడును

(జి ఓ. నెం 1116, ఎల్ ఎ తేదీ 4-6-1951)

మరియు

(జి ఓ. నెం 887, ఎల్ ఎ తేదీ 13-5-1957)

సెక్షను 112 (2) (1) క్రిందజారీ చేయబడిన విధులు

విధులు

ఎన్నిక వివాదములను తీర్పుచేయుట

1 (1) ఇతర విధముగా నిబంధింపబడిన విధముగా తప్ప, ఆక్టు ననుసరించి జరుపబడిన ఒక పంచాయతీయొక్క సభ్యుని, ప్రెసిడెంటు లేక వైస్-ప్రెసిడెంటుయొక్క ఎట్టి ఎన్నికగాని, ఈ విధుల కనుగుణముగా, (2) వ ఉపవిధిలో నిర్వచింపబడిన విధముగా ఎన్నిక కమీషనరుకును,(ఇందునిటుతర్వాత ఎన్నుకొనబడిన అభ్యర్థి అనిజెప్పబడు) క్రమముగా ఎన్నుకొనబడిన అభ్యర్థిమీద లేక ఇద్దరు లేక ఎక్కువమంది ఎన్నుకొనబడిన అభ్యర్థులున్నయెడల, అట్టి యావన్మంది అభ్యర్థుల మీద లేక ఏ అభ్యర్థిమీదనైన ఏ అభ్యర్థియైన లేక ఎన్ను

కొను మనిషియైనను, ఒక ఎన్నిక అర్జీ దాఖలు చేయబడిననే తప్ప ప్రశ్నింపబడకూడదు

(2) ఎన్నిక కమీషనరు—

(I) (II) వ క్లాజు క్రిందికి వచ్చు సందర్భములలో తప్ప, పంచాయతీ ఆఫీసుండు స్థలముమీద ప్రదేశ విచారణాధికారముగల జిల్లా మునసబుగా లేక అట్టి జిల్లా మునసబు ఒకరికంటె ఎక్కువ మంది వున్నయెడల ప్రధాన జిల్లా మునసబుగా నుండవలెను, మరియు

(II) ప్రభుత్వమువారు అట్లు ఆజ్ఞాపించినయెడల, సామాన్యముగా పంచాయతీల సందర్భములోనైన సరే, లేక ఏ తరగతి పంచాయతీల సందర్భములోనైన సరే, లేక అదే జిల్లా లేక తాలూకాలోని పంచాయతీల సందర్భములోనైన సరే, ప్రభుత్వమువారు ఈ విషయమున పేరుతోగాని, ఉద్యోగమును బట్టిగాని పేర్కొనగల ప్రభుత్వ వుద్యోగులు లేక వుద్యోగియై యుండవలెను

అయితే ఒక ఎన్నిక అర్జీ, దరఖాస్తు పెట్టుకొన్నమీదట—

(a) (I) వ క్లాజు క్రింద జిల్లా మునసబుకు దాఖలు చేయబడినయెడల, సంబంధించిన జిల్లా జడ్జిచే అతని విచారణాధికారము లోపల నున్న మరియొక జిల్లా మునసబుకు పరివర్తన చేయబడవచ్చును

(b) (II) వ క్లాజు క్రింద ఒక ప్రభుత్వోద్యోగికి దాఖలు చేయబడిన పక్షమున ప్రభుత్వమువారు దానిని మరియొక ప్రభుత్వోద్యోగికి పరివర్తన చేయవచ్చును

ఒక ఎన్నిక అర్జీ, పైన చెప్పిన మినహాయింపు నిబంధన ననుసరించి ఏ అధికారికైనను పరివర్తన చేయబడిన విషయమున, అట్టి అధికారి ఎన్నిక కమీషనరుగా భావింపబడవలెను

(3) ఈ విధుల క్రింద విచారణాధికారమును చెలాయించు ఒక ఎన్నిక కమీషనరు, ఆయా సందర్భమునకు తగినట్లు జడ్జి లేక ఇతర ప్రభుత్వోద్యోగి హోదాలో కాకుండ ప్రత్యేకముగా నియమింపబడిన వ్యక్తిగా అట్టివిచారణాధికారమును చెలాయించునట్లు భావించవలెను.

2 (1) ఎన్నిక అర్జీ, ఎన్నిక ఫలితము ప్రకటింపబడిన తేదీ నుండి పదునైదు దినములలోపల దాఖలు చేయబడవలెను.

వివరణము —జిల్లా మునసబుయొక్క కోర్టును లేక ఎన్నిక కమీషనరగు ప్రభుత్వోద్యోగియొక్క ఆఫీసును పైన చెప్పిన పదునైదు దినములలో కడపటి దినమున మూసివేసిన పక్షమున అటు తరువాత నే దినమున అట్టి కోర్టు లేక ఆఫీసు తెరువబడునో ఆ రోజున ఎన్నిక కమీషనరుకు అర్జీ దాఖలు చేయవలెను.

(2) అర్జీదారు ఆధారపడు ముఖ్యమైన విషయములు సంగ్రహముగా కలిగిన ఒక వివరణమున్ను ఆయన ఆరోపించు ఏ అక్రమ చర్యయొక్కనైన వివరములును అర్జీలో నుండవలెను అవసరమైనప్పుడు అది పేరాగ్రాపులుగా విభజింపబడి వరుసగా సంఖ్య వేయబడియుండవలెను దానిలో అర్జీదారు సంతకము చేసియుండవలెను మరియు అది 1908 వ సం॥పు సివిల్ ప్రొసీజరు కోడులో వాదములను సరిచూచుటకు నిర్ణయింపబడిన విధముగా సరిచూడబడవలెను

3 (1) అర్జీలో ఆరోపింపబడిన అక్రమచర్యలు ఎన్నుకొనబడిన అభ్యర్థులలో ఒకరికంటె ఎక్కువవారి యెన్నిక చెల్లుట బహూశః భావింపగలిగిన పక్షమున అర్జీదారు యెన్నుకొనబడిన అట్టియావన్మంది అభ్యర్థులను అతని అర్జీకి ప్రతివాదులుగా చేర్చుకొనవలెను

(2) అర్జీదారు అట్లు కోరునెడల ఆయా సందర్భమునకు తగినట్లు ఎన్నుకొనబడిన అభ్యర్థియొక్క లేక ఎన్నుకొనబడిన యావన్మంది అభ్యర్థులయొక్క లేక వారిలో యెవరియొక్కనైన ఎన్నికను ఆక్షేపించుటకు అదనముగా తానుగాని లేక ఏ ఇతర అభ్యర్థిగాని క్రమముగా ఎన్నుకొనబడినట్లు ప్రసిద్ధపరుపవలసినదిగా కోరవచ్చును అట్టి సందర్భములో, ఎన్నికకు నియమింపబడి పోలింగుకు పూర్వము వుపసంహరించుకొనని యావన్మంది యితర అభ్యర్థులను తన అర్జీకి ప్రతివాదులుగా ఆయన చేకూర్చుకొనవలెను.

4 (1) అర్జీని దాఖలు చేయునపుడు అర్జీదారు అర్జీకయ్యే ఖర్చులకుగాను ధరావతుగా యిరువదిఐదు రూపాయలను రొక్కముగా డిపాజిటు చేయవలెను.

వివరణము.— ఎన్నుకొనబడిన ఒక అభ్యర్థికంటె ఎక్కువ అభ్యర్థుల ఎన్నిక ఆక్షేపింపబడిన విషయమున అట్టి ప్రతి ఎన్నుకొనబడిన అభ్యర్థి విషయములో ప్రత్యేక డిపాజిటు చేయవలెను.

(2) (1) ఉపవిధియొక్క నిబంధనల ప్రకారము వర్తించని పక్షమున ఎన్నిక కమీషనరు అర్జీని త్రోసివేయవలెను

(3) (1) వ ఉపవిధియొక్క నిబంధనలను నెరవేర్చిన మీదట ఎన్నిక కమీషనరు అర్జీని విచారించుటకు పూనుకొనవలెను

5 ఎన్నిక కమీషనరు సాధ్యమైనంత త్వరలో ప్రతి ప్రతివాదికిని సంబంధించిన పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారికి మరియు ఎన్నిక అధికారికి అర్జీయొక్క నకలు పంపబడునట్లు చేయవలెను నకళ్లు, సందర్భమునకు తగినట్లు ఎన్నిక కమీషనరు యొక్క కోర్టునందలి లేక ఆఫీసు నందలి లేక పంచాయతీ ఆఫీసు నందలి నోటీసుబోర్డు నందుకూడ అంటించబడవలెను ఎన్నిక కమీషనరు ఆయన అదనపు ఖర్చుల చెల్లింపునిమిత్తము కోరునట్టి మొత్తమునకును మరియు జామీనులతోను ఒక పత్రమును వ్రాసియియ్యమనిగూడ అర్జీదారుని కోరవచ్చును అట్లు ప్రకటింపబడిన తరువాత పదునాలుగు దినములలోపుగా నెప్పుడైనను ఏ యితర అభ్యర్థిగాని ఎన్నిక కమీషనరుచే కోరబడునట్టి హామీలను ఆవిధముగనే యిచ్చిన మీదట ప్రతివాదిగా చేర్చబడుటకు అర్హుడగును

6 (1) ప్రతి ఎన్నిక అర్జీని ఎన్నిక కమీషనరు 1908 వ సం॥పు సివిలు ప్రొసీజరు కోడు క్రింద వ్యాజ్య విచారణకు వర్తించు పద్ధతి ననుసరించి వీలగునంతగ విచారణ చేయవలెను అయితే ఎన్నిక కమీషనరు ఆయన పరీక్షించిన ఏ సాక్షియొక్కయైన సాక్ష్య సంగ్రహము తాలూకు యాదాస్తును మాత్రమును తయారుచేయుట అవసరము

(2) ఒక వ్యాజ్యమును విచారణ చేయునప్పుడు ఎన్నిక కమీషనరు ఈ క్రింది విషయములకు సంబంధించి 1908 వ సం॥పు సివిలు ప్రొసీజరు కోడు క్రింది ఒక న్యాయస్థానమునకు కలుగజేయబడిన అధికారములను కలిగి యుండవలెను .—

(a) పరిశోధన మరియు తనిఖీ
(b) సాక్షులు హాజరగుచున్నట్లు బలవంతపెట్టుట మరియూ వారి ఖర్చులకైన డిపాజిటును కోరుట,
(c) దస్తావేజులకు హాజరుపెట్టవలెనని నిర్బంధించుట,
(d) ప్రమాణము చేసినమీాదట సాక్షులను పరీక్షించుట
(e) ప్రమాణ పత్రికపై సాక్ష్యమును తీసికొనుట, మరియు
(f) సాక్షులను పరీక్షించుటకు అధికారి పత్రికల నిచ్చుట

మరియు ఆయన తనంతటతానే ఎవరి సాక్ష్యము ముఖ్యమైన దని ఆయనకు తోచునో అట్టి ఏ వ్యక్తినైనను హాజరు కావలెనని ఉత్తరువు చేయవచ్చును, మరియు పరీక్షించవచ్చును

7 (1) ఎన్నిక కమీాషనరుయొక్క అనుమతి లేకుండ ఏ ఎన్నిక అర్జీనిగాని ఉపసంహరించకూడదు

(2) ఒకరుకన్న యెక్కువమంది అర్జీదారులున్న యెడల, అర్జీదారులందరి సమ్మతిలోతప్ప ఏ ధరఖాస్తుగాని ఉపసంహరించ కూడదు

(3) ఉపసంహరణ నిమిత్తము ఒకదరఖాస్తు పెట్టుకొనబడినప్పుడు, ఆ దరఖాస్తును విచారణచేయు తేదీల నిర్ణయించుచు అర్జీ తాలూకు అన్ని పక్షములవారికి దానినిగూర్చి నోటీసు నియ్యవలెను, ఆ నోటీసు 5 వ విధిలో నిర్దేశింపబడిన రీతిగ ప్రకటింపబడవలెను

(4) ఉపసంహరణ నిమిత్తమై ఏ దరఖాస్తుగాని, ఎన్నిక కమీాషనరు అంగీకరించకూడదని ఆయన తలంచు ఏదైన బేరము లేక ప్రతి ఫలమునుబట్టి అట్టి అర్జీ పెట్టుకొనబడినదని అభిప్రాయపడు నెడల, మంజూరు చేయబడకూడదు

(5) దరఖాస్తు మంజూరు చేయబడిన యెడల —

(a) అంతకు పూర్వము ప్రతివాదికగు ఖర్చులను లేక ఎన్నిక కమీాషనరు యుక్తమని తలంచునట్టి అందలి భాగమును చెల్లించవలెనని అర్జీదారునకు ఆజ్ఞ నియ్యవలెను, మరియు

(b) ఎన్నిక కమీషనరు అట్టి ఉపసంహరణగూర్చి సంబంధించిన పంచాయతీ కార్యనిర్వాహక అధికారికిని ఎన్నిక అధికారికిని తెలియజేయవలెను

8 విచారణ ఖర్చుల విషయమై ఎన్నిక కమీషనరుచేసిన ఏ ఉత్తరువునైనను, దేని విచారణాధికారమందు అట్లు సొమ్మును దేనినైనను చెల్లించుటకు అట్టి ఉత్తరువువలన కోరబడు ఏ వ్యక్తి గాని నివాసస్థలమును లేక వ్యాపార స్థలమును కలిగియుండునో అట్టి స్థానిక హద్దులలోని జిల్లా మునసబు కోర్టుయెదుట లేక అట్టి స్థలము మదరాసునందలి న్యాయవిచారణ సంబంధమైన హైకోర్టుయొక్క సాధారణ అసలు సివిల్ విచారణాధికార సరిహద్దులలోపల నున్నచో మదరాసులోని స్మాల్ కాజుల కోర్టుయెదుట, హాజరు పెట్టవచ్చును. ఆ కోర్టు ఒక వ్యాజ్యములో సొమ్ము చెల్లింపుకై దానిచే చేయబడిన డిక్రీయైనవెట్లో, అట్టి విధమున, పద్ధతిద్వారా, అట్టి ఉత్తరువును అమలు జరుపవలెను, లేక అమలు జరుపబడునట్లు జేయవలెను.

9 ఒక ఎన్నిక అర్జీ, ఒక్కడేయగు అర్జీదారుని మరణము మీదట లేక అనేకమంది అర్జీదారుల మరణానంతరము బ్రతికి ఉండువాని మరణము మీదట నిలిచిపోవలెను అట్టి నిలుపుదలను గూర్చి ఎన్నిక కమీషనరు, సంబంధించిన పంచాయతీ నిర్వాహక అధికారికి మరియు ఎన్నిక అధికారికి తెలియజేయవలెను

10 ఒక ఎన్నిక అర్జీనిగూర్చి విచారణ జరుగునప్పుడు, ఎన్నుకొనబడిన అభ్యర్థి కాని ఏ యితర అభ్యర్థియైనను, తనకే ఆ స్థానము చెందవలెనని కోరినయెడల, ఎన్నుకొనబడిన అభ్యర్థి లేక వ్యవహారమునకు సంబంధించిన ఏ యితర కక్షిదారైనను, అట్టి అభ్యర్థియొక్క యెన్నిక, ఆయన ఎన్నుకొనబడిన అభ్యర్థియైయుండినవో మరియు తన ఎన్నికనుగూర్చి ఫిర్యాదుచేయుచు అర్జీని పెట్టుకొని యుండినచో చెల్లెడిదికాదని సాక్ష్యము నియ్యవచ్చును

11 ఎన్నిక కమీషనరుయొక్క అభిప్రాయములో—

(a) ఎన్నుకొనబడిన అభ్యర్థి, అతని ఏజెంటు లేక అట్టి అభ్యర్థి లేక ఏజెంటుయొక్క ఉపేక్షతో ఏ యితర వ్యక్తియైనను,

ఇండియన్ పీనల్ కోడుయొక్క IX-A అధ్యాయము క్రిందికివచ్చు లేక ఎన్నిక రహస్య అతిక్రమణకు సంబంధించిన ఏ చట్టము లేక విధిక్రిందనైనను వచ్చు ఎట్టి ఎన్నిక అపరాధమునుగాని చేసినయెడల లేక చేయుటను ప్రోత్సాహపరచినయెడల, లేక

(b) ఎన్నుకొనబడిన ఒక అభ్యర్థియొక్క ఎన్నిక, ఈ క్రింది అక్రమ ఆచరణలలో దేనిమూలముగానైనను సంభవించిన లేక ప్రేరేపింపబడినయెడల లేక ఆ ఎన్నికయొక్క ఫలితమందు గొప్ప మార్పు కలిగిన యెడల—

(i) ఇండియన్ పీనల్‌కోడు IX-A అధ్యాయము క్రిందికివచ్చు లేక ఎన్నిక రహస్య అతిక్రమణకు సంబంధించిన ఏ చట్టము లేక విధి క్రిందనైనను వచ్చు యెట్టి ఎన్నిక అపరాధమును అభ్యర్థిగాని అతని ఏజెంటుగాని లేక ఒక అభ్యర్థియొక్క లేక అతని ఏజెంటుయొక్క ఉపేక్షతో వ్యవహరించు వ్యక్తులు చేసినయెడల,

(ii) ఏ ఎన్నికదారునకుగాని ఆయన ఓటుచేయు నిమిత్తము ఏ స్థలమునకు లేక ఏ స్థలమునుండియైన ప్రయాణపు ఖర్చులకుగాను ఏ వ్యక్తికైనను సొమ్మును చెల్లించుట లేక చెల్లించునట్లు వాగ్దానము చేసినయెడల,

(iii) సాధారణముగ బాడుగకిచ్చుటకు లేక బాడుగపై ప్రయాణీకుల రాకపోకలపై ఉంచబడిన ఏదైన పడవ, బండి, లేక జంతువును ఎన్నిక కార్యము నిమిత్తము బాడుగకు తీసుకొనుట, పనికి నియమించుట, అప్పుగా తీసికొనుట లేక ఉపయోగించుకొను నెడల,

అయితే, ఏ ఎన్నికదారైనను ఓటు ఎచ్చట రికార్డు అయి యున్నదో అచ్చటకు లేక అచ్చటనుండి తన ప్రయాణము నిమిత్తము ఏ పడవ, బండి లేక జంతువునుగాని బాడుగకు తీసికొనవచ్చును లేక తన స్వంత ఆస్తియగు ఏ పడవ, బండి లేక జంతువునుగాని ఉపయోగించుకొనవచ్చును, లేక

(c) నామినేషను పత్రమునకు సంబంధించిన లోపమువలన లేక నామినేషను పత్రమును లేక ఓటును అక్రమముగ పొందుట లేక నిరాకరించుటవలన లేక ఈ ఆక్టుయొక్క లేక దాని క్రింద చేయబడిన విధులయొక్క నిబంధనల ననుసరించి నడచుకొనుటకు ఏవిధ

ముగనైన తప్పిపోవుటవలన ఎన్నిక ఫలితము యెక్కువగ మార్పు చెందినయెడల

అట్టి యెన్నుకోబడిన అభ్యర్థియొక్క ఎన్నిక చెల్లకూడదు.

అయితే, ఎన్నిక కమీషనరుకు ఈ విధియొక్క (b) క్లాజులో నిర్దేశింపబడిన, ఇందు నిటు తరువాత వివరింపబడినట్లు ఆదరించుట కానట్టి ఇతర యెట్టి విధమైన లంచమునకుగాని చెందని ఏ అక్రమ ఆచరణగాని జరిగెనని అభిప్రాయపడిన యెడల మరియు యెన్నిక కమీషనరు, సదరు అభ్యర్థి—

(a) సదరు అభ్యర్థిచే ఆ ఎన్నికలో ఏదైన అక్రమ ఆచరణ జరుపబడ లేదనియు మరియు ఏవైన అక్రమ ఆచరణలు జరిగియుండిన యెడల అవి సదరు అభ్యర్థి వుత్తరువులకు విరుద్ధముగాను అతనియొక్క అనుమతిగాని, సమ్మతిగాని లేకయే జరుపబడినట్లును, మరియు

(b) సదరు అభ్యర్థి ఆ ఎన్నికలో అక్రమ ఆచరణలు జరుగకుండ నివారించుటకు న్యాయమైన చర్యలన్నింటిని జరిపెననియు, మరియు

(c) జరిగిన అక్రమ ఆచరణలు అల్పములును, అప్రధానములున్న కొలదిపాటివి అనియును, మరియు

(d) తక్కిన అన్ని విషయములలోను ఆ యెన్నికలో సదరు అభ్యర్థివలన లేక యెవరైన ఆయన ఏజంట్లవలన అక్రమ ఆచరణలు యెట్టివైనను జరుగలేదనియు,

తనకు తృప్తి కలిగించెనని అభిప్రాయపడిన యెడల సదరు ఎన్నిక కమీషనరు సదరు అభ్యర్థి ఎన్నిక చెల్లనిదికాదని తీర్మానించవచ్చును

వివరణము —ఈ విధి కార్యము నిమిత్తము 'ఆదరించుట' అనగా ఒక వ్యక్తి ప్రత్యక్షముగాగాని పరోక్షముగాగాని ఏ వ్యక్తినైనను లేక మరియే యితర వ్యక్తినైనను ఓటు చేయవలెనను లేక ఓటు చేయకూడదను అభిప్రాయముతోగాని ఓటు చేసినందుకు లేక ఓటు చేయకుండ నుండినందుకు బహుమానముగాగాని ఎట్టి ఆహారము, పానీయము, వినోదము లేక ఏర్పాటులను ఇచ్చుటకు లేక ఏర్పాటు

చేయుటకు అగు ఖర్చును పూర్తిగాగాని కొంత భాగముగాగానీ భరించుట అని యర్థము

12 (1) విచారణ ముగిసినమీదట ఎన్నిక కమీషనరు, యెన్నుకొనబడిన అభ్యర్థి లేక అభ్యర్థులయొక్క ఎన్నిక 11 వ విధి ననుసరించి చెల్లతగనిదా యను విషయమును ప్రసిద్ధపరచవలెను.

(2) ఆయన యెన్నుకొనబడిన అభ్యర్థి లేక అభ్యర్థుల యొక్క ఎన్నిక చెల్లకూడదన్నట్లు ప్రసిద్ధపరచినయెడల, అదనము ఇంతకుపైగా—

(a) ఈ విధుల క్రింద స్థానమును హక్కుగ కోరుచు ఈ అర్జీకి సంబంధించిన ఏ యితర కక్షిదారుడుగాని సక్రమముగా యెన్నుకొనబడినట్లు ప్రసిద్ధపరచుచు, లేక

(b) క్రొత్త యెన్నిక యొకటి జరుగవలసినదిగా వుత్తరువు చేయవలెను

(3) (1) మరియు (2) వుపవిధుల క్రింద ఎన్నిక కమీషనరు చేయు వుత్తరువు అంత్యమైనదై యుండవలెను

(4) (1) ఉపవిధి లేక (2) వ ఉపవిధి క్రింద చేయబడు ప్రతి వుత్తరువు యొక్క నకలు, సంబంధించిన పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారికి, ఎన్నిక అధికారికి పంపబడవలెను

13 12 వ విధియొక్క (1) వ ఉపవిధి క్రింద ఒక ఎన్నిక చెల్లకూడదన్నట్లు ప్రసిద్ధపరుపబడి సదరు విధియొక్క (2) వ వుపవిధిలోని (b) క్లాజు క్రింద క్రొత్తగ ఎన్నిక జరుగవలసినదిగ వుత్తరువు చేయబడిన యెడల, యెన్నుకొనబడిన అభ్యర్థియొక్క స్థానము లేక యెన్నుకొనబడిన అభ్యర్థులయొక్క స్థానములు, ఆయా సందర్భమునకు తగినట్లు ఎన్నిక కమీషనరు వుత్తరువుచేసిన తేదీనుండి ఖాళీయై యుండునట్లు భావింపబడవలెను మరియు సంబంధించిన అధికారి వెంటనే అట్టి క్రొత్త ఎన్నికను జరుపుటకు అవసరమైన చర్యలను తీసికొనవలెను.

14 (1) పైన చెప్పిన విధులలో ఏమి చెప్పియున్నను దానితో నిమిత్తము లేకుండ, ఒక పంచాయతీ సెక్షను 10-A క్రింద స్త్రీ మెంబరుగానో, లేక ప్రెసిడెంటు లేక వైస్ ప్రెసిడెంటుగా తాము

ఎన్నుకొనబడినట్లు ఒకరికంటె ఎక్కువమంది హక్కుగా కోరునెడల, 2 వ విధియొక్క (1) వ ఉపవిధిలో నిర్దిష్టము చేసియుండు కాలము లోపల ఎన్నిక కమీషనరునకు ఎన్నిక అర్జీద్వారా, వారిలో ఎవరి ఎన్నికగాని ఆక్షేపింపబడనియెడల లేక అట్టి ఎన్నిక అర్జీ లేక ఎన్నిక అర్జీలు దాఖలుచేయబడి దరిమిలా ఉపసంహరించుకొనబడిన యెడల, ఎన్నిక అధికారి ఆయన అవసరమని తలచునట్టి విచారణను జరిపిన మీదట—

(a) హక్కు కోరువారిలో ఒకరిని పంచాయతీ, సెక్షను 10-A క్రింద స్త్రీ మెంబరు, లేక ప్రెసిడెంటు లేక వైస్-ప్రెసిడెంటుగా సక్రమముగా ఎన్నుకొనబడినట్లు ప్రసిద్ధపరచవచ్చును, లేక

(b) హక్కు కోరువారిలో ఎవరిగాని సక్రమముగా ఎన్నుకొనబడినట్లు ఆయన తీర్మానించని యెడల కొత్తగా ఎన్నిక జరుగవలెనని ఉత్తరువు చేయవచ్చును

(2) (1) వ ఉపవిధి తాలూకు (b) క్లాజు ననుసరించి చేయబడినట్లు ఉత్తరువు అంత్యమైనదిగా అనగా తిరుగుబాటు లేనిదిగా నుండవలెను

(3) (1) వ ఉపవిధి తాలూకు (a) క్లాజు క్రింద చేయబడిన ఉత్తరువుమీద, ఉత్తరువుచేయబడిన తేదీనుండి పదిహేను దినముల లోపుగను, 1 వ విధియొక్క (2) వ ఉపవిధిచే నిర్వచింపబడిన రీతిగను ఏ అభ్యర్థి లేక ఎన్నికదారుగాని ఎన్నిక కమీషనరుకు అపీలును దాఖలు చేసికొనవచ్చును.

(4) ఈ విధులయొక్క నిబంధనలు, సాధ్యమైనంతవరకు ఈ విధుల క్రింద పెట్టుకొనబడిన ఎన్నిక అర్జీయైనదో నెట్లో, అట్లు అట్టి అపీలునకు వర్తించవలెను

(5) (1) వ ఉపవిధి తాలూకు (a) క్లాజు క్రింద చేయబడిన ఉత్తరువు (3) వ ఉపవిధి క్రింద దాఖలు చేసికొనబడిన ఏ అపీలు యొక్కయైన ఫలితమునకు లోబడి, అంత్యమైనదిగా నుండవలెను

15 ఇంతకు పూర్వపు విధులలో ఏమియున్నను దానితో నిమిత్తము లేకుండ, పంచాయతీయొక్క ఉపాధ్యక్షునిగా ఒకరికంటె ఎక్కువ మనుష్యులు ఎన్నుకొనబడిరని హక్కుగాకోరు సందర్భము

లోను, అట్టి ఒకరి లేక అంతకు ఎక్కువమంది ఎన్నిక, ఈ విధుల ననుసరించి పెట్టుకొనబడిన ఎన్నిక అర్జీలో ప్రశ్నింపబడిన సందర్భము లోను, ఎన్నిక అధికారి, తాను అవసరమని తలంచగలట్టి విచారణను జరిపినమీదట, దావాదారులలో ఒకరిని, ఎన్నిక అర్జీమీద ఎన్నికల కమీషనరుచే ఉత్తరువులు జారీ చేయబడునంతవరకు, పంచాయతీ యొక్క ఉపాధ్యక్షుని పనులను చేయవలెనని ఆజ్ఞాపించవచ్చును.

సె 25 (1) ప్రెసిడెంటుయొక్క ఉద్యోగము ఖాళీగా నున్న ప్పుడు ఒక క్రొత్త ప్రెసిడెంటు ఎన్నుకొనబడునట్లు ప్రకటింపబడి ఆయన ఉద్యోగమును స్వీకరించువరకు వైసు-ప్రెశిడెంటు, ప్రెసి డెంటుయొక్క పనులను చేయవలెను

(2) ప్రెసిడెంటు తన విచారణాధికార ప్రదేశమునుండి వరు సగా పదునైదు దినములకంటె ఎక్కువ కాలము గైరుహాజరైన యెడల లేదా అశక్తుడైనయెడల అట్లు గైరుహాజరైన లేక అశక్తు డుగానుండు కాలములో అతని విధులు నిర్ణయింపబడగలట్టి సందర్భ ములలో తప్ప, వైసు ప్రెసిడెంటుకు సంక్రమించవలెను

(3) ప్రెసిడెంటుయొక్క ఉద్యోగము ఖాళీగానుండి లేక ప్రెసి డెంటు తన విచారణాధికార ప్రదేశమునుండి వరుసగా పదునైదు దినములకంటె యెక్కువ కాలము గైరుహాజరు అయివుండి లేక అశక్తు డుగానుండి వైసుప్రెసిడెంటు ఉద్యోగములో ఖాళీయున్నప్పుడు లేదా వైసుప్రెసిడెంటు విచారణాధికార ప్రదేశమునందుండి వరు సగా పదునైదు దినములకంటె ఎక్కువ కాలము గైరుహాజరు అయి నప్పుడు లేదా అశక్తుడుగా నున్నప్పుడు, ప్రెసిడెంటుయొక్క పనులు ఆ విషయమున ఇన్స్పెక్టరు నియమించగల పంచాయతీ మెంబరుకు సంక్రమించవలెను.

అట్లు నియమింపబడిన పంచాయతీ మెంబరు (ఆయనను తాత్కాలికపు ప్రెసిడెంటు అని చెప్పవచ్చును) క్రొత్త ప్రెసిడెంటు లేక వైస్ ప్రెసిడెంటు ఆయా సంగతికి తగినట్లు ఎన్నుకొనబడినట్లు, ఉద్యోగములో చేరినట్లు ప్రసిద్ధపరుచునంతవరకు ప్రెసిడెంటు లేక

వైసు ప్రెసిడెంటు విచారణాధికార ప్రదేశమునకు తిరిగి వచ్చునంత వరకు లేక అతని అశక్తతనుండి బాగు అగునంతవరకు, నిర్ణయింప బడగల నిర్బంధములకు షరతులకు లోబడి ప్రెసిడెంటుయొక్క విధులను నిర్వహించవలెను

(4) (ఆంధ్రఆక్టు XXII ఆఫ్ 1955 మూలంగా రద్దుచేయ బడినది )

(6) నిర్ణయింపబడగల విధులకు లోబడి, ప్రెసిడెంటు వ్రాత మూలకమైన వుత్తరువుద్వారా, సదరు వుత్తరువులో నిర్దేశింపబడ గలట్టి నిర్బంధములతోను, షరతులతోను, తన విధులలో, వేటినిగాని వైసు ప్రెసిడెంటుకు లేదా వైస్ ప్రెసిడెంటు ఉద్యోగములో ఖాళీ యున్నయెడల లేదా వైసు ప్రెసిడెంటు విచారణాధికార ప్రదేశము నుండి వరుసగా పదునైదు దినములకంటె యెక్కువగా గైరు హాజరుగా నున్నయెడల లేదా అశక్తుడుగా నున్నయెడల, ఎట్టి మెంబరు కైన అప్పగించవచ్చును

(6) (1) వ, (2) వ, (3) మరియు (5) వ సబ్ సెక్షనులలో ప్రెసిడెంటుయొక్క విధులకైన సూచనలో ఆయన కార్యనిర్వాహక, అధికారిగాకూడా నుండు సందర్భములో, కార్యనిర్వాహక అధికారిగా ఆయనయొక్క విధులకైన సూచన చేరినట్లు భావింపబడవలెను

(7) ప్రెసిడెంటు, (2) వ సబ్ సెక్షను ననుసరించి వైసు ప్రెసిడెంటుకు సంక్రమించిన లేదా (5) వ సబ్ సెక్షను ననుసరించి వైసు ప్రెసిడెంటుకు లేదా ఎట్టి మెంబరుకైన అప్పగించబడిన ఏ పనుల నైన చెలాయించుటపైగాని, నెరవేర్చుటపైగాని పెత్తనము కలిగి యుండుటకును దానిని సవరించుటకును అధికారమును కలిగియుండ వలెను.

25 వ సెక్షనుక్రింద జారీ చేయబడిన విధులు (జి ఓ నెం. 520, ఎల్ ఎ తేదీ 24-3-1951)

## విధులు.

### ప్రెసిడెంటు విధులు ఇతరులకు చెందుటయు, అప్పగించుటయు.

1 ప్రెసిడెంటు తన విచారణాధికారమును చెలాయించు విషయమున మదరాసు రాజ్యములోపల గైరు హాజరుగానుండి పంచాయితీకి సంబంధించిన పనిమీాదనున్నయెడల, వైసుప్రెసిడెంటుకు ఎంతవరకు అతని విధులు అప్పగింపబడినవో అంతవరకు తప్ప, ఆ విధులు, ఆక్టుయొక్క 25 వ సెక్షను (2) వ సబ్ సెక్షను క్రింద సదరు వైసు ప్రెసిడెంటుకు చెందవు

2. ప్రెసిడెంటు, కార్యనిర్వాహక అధికారిగాకూడ నున్న యెడల, కార్యనిర్వాహక అధికారిగా అతని పనులతోసహా, అతని విధులలో దేనినైన, అప్పచెప్పుటను పంచాయితీ స్పష్టముగా నిషేధించినయెడల, దానిని వైసుప్రెసిడెంటుకు లేక ఒక సభ్యునికి, ఆక్టుయొక్క 25 వ సెక్షను (5) వ సబ్ సెక్షను ననుసరించి ఆయన అప్పజెప్పకూడదు

3 ప్రెసిడెంటుయొక్క విధులను, ఆయన కార్యనిర్వాహక అధికారిగాకూడ నున్నపుడు కార్యనిర్వాహక అధికారిగా అతని పనులతో సహా అప్పగించబడిన సభ్యుడు, అప్పగింపబడిన కాలపరిమితిలో ఆయన 'ప్రెసిడెంటు డెలిగేట్' (అధికారములు అప్పగింపబడిన ప్రెసిడెంటు) అని పిలువబడవలెను

4 ప్రెసిడెంటు, ఒక సభ్యునికి అధికారములను అప్పగించిన ఉత్తరువు అమలులోనున్నపుడు అమలులోనున్న ఉత్తరువు ఎవరి తరఫున చేయబడెనో ఆ సభ్యుని మినహాయించి ఏ యితర సభ్యుని తరఫునగాని విధులలో దేనినైన అప్పగించుటకైన ఎట్టి అదనపు ఉత్తరువుగాని చేయబడకూడదు

5 పంచాయితీయొక్క ప్రత్యేక అనుమతిలేకుండ ఏ సంవత్సరమునందైన మొత్తములో తొంబది దినములకు మించిన ఏ కాల

పరిమితికైన ప్రెసిడెంటు, ఒక సభ్యునికి ఎట్టి (విధిని) అప్పగింత చేయకూడదు.

6 ప్రెసిడెంటు ఒక సభ్యునికి చేసిన ప్రతి అప్పగింతయొక్క ఉత్తరువు పంచాయతీకి, దాని మరుసటి సమావేశములోను, సంబంధించిన జిల్లా పంచాయతీ ఆఫీసరుకును తెలియజేయబడవలెను.

7 3 నుండి 6 వరకుగల విధులయొక్క నిబంధనలు, ప్రెసిడెంటు, తన విధులను వైసు-ప్రెసిడెంటుకు అప్పగించుటకు వర్తించకూడదు.

## 8 తాత్కాలికపు ప్రెసిడెంటుయొక్క విధులు-నిర్బంధములు.

ఆక్టుయొక్క 25 (3) వ సెక్షనుక్రింద నియమింపబడిన తాత్కాలికపు ప్రెసిడెంటు, ప్రెసిడెంటు కార్యనిర్వాహక అధికారిగాకూడనున్న పక్షమున, పంచాయతీయొక్క ఏ ఉద్యోగి లేక నౌకరునైన నియమించుటకు, ఉద్యోగమును హెచ్చించుటకు లేక శిక్షించుటకు సంబంధించిన ప్రెసిడెంటుయొక్క పనులలో దేనినైన చేయకూడదు.

## ప్రెసిడెంటు ఉద్యోగము ఖాళీగానున్నపుడు తెలియజేయుట.

9 ప్రెసిడెంటు ఉద్యోగములోని ప్రతి ఖాళీని, కార్యనిర్వాహక ఉద్యోగి ఎన్నిక అధికారికి తెలుపవలెను లేక కార్యనిర్వాహక ఉద్యోగి లేనపుడు వైసుప్రెసిడెంటు తెలుపవలెను లేక వైసుప్రెసిడెంటు ఉద్యోగము ఖాళీగానున్నపుడు లేక వైసు ప్రెసిడెంటు విచారణాధికార ప్రదేశమునుండి పదునైదు దినములకు పైబడి ఎడతెగకుండ హాజరుగా లేనిపక్షమున లేక అశక్తుడుగానున్నయెడల, పంచాయతీ ఆఫీసువున్న రెవిన్యూ గ్రామముయొక్క గ్రామ మునసబు రిపోర్టుచేయవలెను

10 9 వ విధిలో చెప్పబడిన రిపోర్టు, ఖాళీ ఏర్పడిన తేదీనుండి మూడు దినముల లోపల పంపబడవలెను

## మెంబర్లు.

సె 26. (1) ఏ మెంబరైనను పంచాయతీ పనులను నెరవేర్చుటలో ఏదేని అశ్రద్ధనుగాని, పంచాయతీ ఆస్తిని ఏ విధముగానైన పాడుచేయడమునుగాని లేదా ఏదైన ప్రదేశమునకు కావలసియున్న విషయములనుగాని కార్యనిర్వాహక అధికారి గమనించునట్లు చేయవచ్చును మరియు యుక్తముగా కనబడగల ఏదేని అభివృద్ధులను సూచింపవచ్చును

(2) ప్రతి మెంబరును, నిర్ణయింపబడగలట్టి విధులకు లోబడి, పంచాయతీ పరిపాలనకు సంబంధించిన విషయములను గురించి తీర్మానములను ప్రవేశపెట్టుటకును, ప్రెసిడెంటును. ప్రశ్నలడుగుటకును హక్కును కలిగియుండవలెను.

(3) ప్రతి మెంబరు కార్యనిర్వాహక అధికారికి క్రమముగా నోటీసు నిచ్చిన తర్వాత పంచాయతీ రికార్డులను ఆఫీసు గంటలలో చూచుటకు హక్కును కలిగియుండవలెను కాని, కార్య నిర్వాహక అధికారి, వ్రాతమూలకముగా నీయబడు కారణములను బట్టి అట్లు చూడడమును నిషేధించవచ్చును

### 26. వ సెక్షను క్రింద విధులు

(జి ఓ నెం 520, ఎల్, ఎ తేదీ 24-3-1951 )

### 1. పంచాయతీ సభ్యులు, ప్రెసిడెంటును ప్రశ్నలడుగుట.

1 ఒక పంచాయతీ సమావేశములో పంచాయతీ పరిపాలనకు సంబంధించని ఏ విషయముగానైన ఎట్టి ప్రశ్ననుగాని అడుగకూడదు లేక దానికి బదులు చెప్పకూడదు మరియు జరిగిన సంగతి విషయముగా తప్ప ఎట్టి ప్రశ్ననుగాని అడుగకూడదు మరియు జవాబు, జరిగిన సంగతిని తెలుపుటకు మాత్రము సంబంధించి యుండవలెను అట్లు సంబంధింపబడిన విధముగా తప్ప, ఈక్రింది షరతులకును, నిర్బంధములకును లోబడి ఒక పంచాయితీకి చెందిన ఏ సభ్యుడుగాని ఏ ప్రశ్ననైన అడుగవచ్చును

2 ఒక ప్రశ్నను అడుగకోరు ఒక పంచాయతీ సభ్యుడు తన అభిప్రాయమును లిఖితపూర్వకముగా ప్రెసిడెంటుకు కనీసము

10 పూర్తి దినములకు పూర్వము తెలుపవలెను, అట్లు తెలుపునపుడు, ఆయన అడుగకోరిన ప్రశ్నయొక్క నకలొకటి జతపరుపబడవలెను.

3 ఒక ప్రశ్న అంగీకరింపదగినదిగా నుండుటకు అది ఈ క్రింది షరతులను నెరవేర్చవలెను అవేవనగా—

(1) ప్రశ్న అర్థమగుటను చాల అవసరముగానుండని ఏ పేరునుగాని, వివరణమునుగాని అది ప్రకటించకూడదు,

(2) ఒక ప్రశ్నలో ఒక వివరణవుండిన పక్షమున దానిని అడుగు సభ్యుడు, ఆ వివరణము సరిగానుండుటకు బాధ్యుడుగా నుండవలెను,

(3) దానిలో, వాదోపవాదములు, ఊహలు, పరిహాస కరమైన మాటలు, అపఖ్యాతికరమైన వివరణము లుండకూడదు,

(4) అది ఒక అభిప్రాయమును తెలుపునట్లు లేక కేవలము న్యాయ సంబంధమైన విషయమును, లేక ఊహింపబడిన ప్రతిపాదనమును పరిష్కారము చేయునట్లు అడుగకూడదు,

(5) ఉద్యోగ లేక పబ్లిక్ హోదాలో తప్ప ఏ మనిషి యొక్క స్వభావమును లేక ప్రవర్తనను గురించి అడుగకూడదు,

(6) అది చాల పొడవుగా నుండకూడదు, మరియు

(7) ఒకసారి పూర్తిగా జవాబు చెప్పబడిన ఒక ప్రశ్నను మరల అడుగకూడదు

4 ప్రెసిడెంటు ఒక ప్రశ్న అంగీకరింపదగినదా యని నిశ్చయించవలెను ఏ సమావేశమునకు నిర్ణయించబడిన తేదీకి 2 వ విధి ననుసరించి అది సకాలములోనున్నచో, అంతకు పూర్వము దానిని అంగీకరించవచ్చును లేక త్రోసివేయవచ్చును. ఏ ప్రశ్నగాని ప్రశ్నించుట కియ్యబడిన హక్కును అది దుర్వినియోగించునదియని, ఆయన తలంచు నెడల లేక ఆయన అది ప్రజాక్షేమమునుబట్టి దానికి జవాబుచెప్పుట యుక్తముకాదని అభిప్రాయపడు విషయమున ఆయన ఏ ప్రశ్ననైన త్రోసివేయవచ్చును మరియు ఏ ప్రశ్నయైనను, విధులను వుల్లంఘించుచున్నదని అభిప్రాయపడు

నెడల, ఆయన దానిని త్రోసివేయవలెను అట్టిసందర్భములో ఆ ప్రశ్న పంచాయతీ వ్యవహారములలో నమూదు చేయబడకూడదు.

5 ప్రెసిడెంటు అంగీకరించిన ప్రశ్నలను ఆ దినపు అజెండా (సమావేశ కార్యాను క్రమణిక) లో నమూదు చేయవలెను ప్రెసిడెంటు, అట్లు నమూదు చేయబడిన ప్రతిప్రశ్నకు దానిని అడిగిన సభ్యుడు ముందుగా దానిని వుపసంహరించుకొనని పక్షమున, పత్రములోవుండు వరుసక్రమములో, సమావేశమునందు ఏ యితర వ్యవహారమునైన ప్రారంభించుటకు పూర్వము, బదులు చెప్పవలెను

అయితే ప్రెసిడెంటు, తన ఇష్టానుసారము, ప్రజా శ్రేయమునుబట్టి, ఒక ప్రశ్న వుపసంహరించుకొనబడినప్పటికిని అజెండా పత్రములోని ఒక ప్రశ్నకు జవాబు చెప్పవచ్చును

6 జవాబు చెప్పబడిన బాపతు జరిగిన సంగతిని గురించిన ఏ విషయమునైన ఇంకను విశదపరచు కార్యముకొరకు ఏ సభ్యుడైన సప్లిమెంటరీ ప్రశ్నను అడుగవచ్చును

అయితే ప్రెసిడెంటు, ఏ సప్లిమెంటరీ ప్రశ్నగాని, అతని అభిప్రాయములో, ప్రశ్నల సంగతి విషయముగా విధులను వుల్లంఘించునట్లు అగపడినయెడల దానిని త్రోసివేయవచ్చును

ఇంతే కాకుండ, ఆయన సప్లిమెంటరీ ప్రశ్నకు నోటీసు లేకుండ జవాబు చెప్పుటకు నిరాకరించవచ్చును అట్టి సందర్భములో అది పంచాయతీయొక్క తరువాతి సమావేశములో ఒక క్రొత్త ప్రశ్నగా అడుగబడవచ్చును

7 ఈ విధుల ననుసరించి అడుగబడిన ఏ ప్రశ్న విషయముగాగాని, దానికి చెప్పబడిన ఏ జవాబు విషయముగాగాని ఎట్టి చర్చగాని జరుగుటను అనుమతించకూడదు

8 అడుగబడిన ప్రశ్న దానికి చెప్పబడిన జవాబు పంచాయతీయొక్క వ్యవహారములలో నమూదు చేయబడవలెను

9 ఈ విధులలో 'ప్రెసిడెంటు' అను మాటలో, ఆక్టు యొక్క 25 వ సెక్షను, (1), (2), (3), (5) వ సబు సెక్షనులో

ప్రెసిడెంటుయొక్క ఉద్యోగమును తత్కాలమందు కలిగియున్న మనిషి పేరును

## II పంచాయతీల సమావేశములందు తీర్మానముల ప్రతిపాదనము

1 ఒక తీర్మానమును ప్రతిపాదింపగోరు ఒక పంచాయతీ సభ్యుడు తన ఉద్దేశమును గురించి లిఖితపూర్వకముగా కనీసము 10 పూర్తి దినముల నోటీసు మూలముగా ప్రెసిడెంటు తెలియజేయవలెను అట్టి నోటీసులో ఆయన ప్రతిపాదింపగోరు తీర్మానముయొక్క నకలొకటి ఉండవలెను

అయితే ప్రెసిడెంటు, అంతకంటె తక్కువ కాలపరిమితిలో కూడిన ఒక తీర్మానమును వ్యవహారముల జాబితాలో నమూదు చేయుటను అనుమతించవచ్చును

2 అయితే ఈ క్రింద షరతులను తృప్తిపరచని ఎట్టి తీర్మానమునైన అంగీకరించకూడదు అవేవనగా —

(a) అది స్పష్టముగాను, ఖరారుగాను వ్రాయబడి నిర్దిష్టమైన అంశములను పేర్కొనవలెను, మరియు

(b) దానిలో వాద ప్రతివాదములు, ఊహలు, హాస్యాస్పదమైన మాటలు, అవమానకరమైన వివరణములు ఉండకూడదు మరియు వ్యక్తుల ప్రవర్తనను లేక స్వభావమును గురించి ఉద్యోగ సంబంధమైన పబ్లికు హోదాలో తప్ప అందు ప్రసక్తి ఉంచకూడదు

3 ప్రెసిడెంటు ఒక తీర్మానము అంగీకరింపతగినదా, కాదా యని నిశ్చయించవలెను అతని అభిప్రాయములో ఆక్టుయొక్క నిబంధనలను లేక దాని క్రింద చేయబడిన విధులను ఉల్లంఘించు ఏ తీర్మానమునైన త్రోసివేయవచ్చును మరియు అతని తీర్మానము ఆఖరైనదిగా నుండవలెను

అయితే ప్రెసిడెంటుయొక్క అభిప్రాయములో ఒక తీర్మానము, పంచాయతీ పరిపాలనకు సంబంధించకుండ అనుచితమైనట్టి లేక సాంఘికమైనట్టి వివాదమునకు దారితీయవచ్చునని తలంచునెడల ఆయన

ఆ తీర్మానమును ఇన్‌స్పెక్టరుకు పంపి, అది అంగీకరింపబడవచ్చునా యని అతని ఉత్తరువులను పొందవచ్చును

4 ప్రెసిడెంటు ఆమోదించిన తీర్మానము సమావేశము యొక్క నోటీసులో వ్యవహారముల జాబితాయందు నమూదు చేయ బడవలెను

5 (1) వ్యవహారముల జాబితాలో ఎవరిపేరిట తీర్మానము కలదో అట్టి సభ్యుని పిలిచినపుడు—

(a) తీర్మానము ఉపసంహరించుకొనవచ్చును అట్టి సందర్భములో ఆయన అట్లుచేసినట్లు మాత్రము చెప్పవలెను లేదా

(b) తీర్మానమును ప్రతిపాదించవలెను

(2) సభ్యుని పిలిచినపుడు ఆయన హాజరుగా లేనపుడు లేక తీర్మానమును ఉపసంహరించుకొనుటకు కోరు పక్షమున లేక తీర్మానమును ప్రతిపాదించుటకు సమ్మతించని పక్షమున లేక సమావేశమునకు పూర్వమే సభ్యుడుగా నుండుటకు నిలిచిపోయిన పక్షమున, సమావేశములో హాజరుగానున్న ఏ సభ్యుడుగాని తీర్మానమును ప్రతిపాదన చేయవచ్చును ఏ సభ్యుడుగాని దానిని ప్రతిపాదించని పక్షమున అది ఉపసంహరింపబడినట్లు భావించవలెను

(3) ప్రతిపాదింపబడిన ప్రతి తీర్మానము బలపరుపబడవలెను, లేని యెడల దానిని చర్చించకూడదు

6 ఎట్టి మనిషియైనను, ప్రెసిడెంటుయొక్క అనుమతిలో తప్ప పదునైదు నిమిషముల కాలపరిమితికంటె ఎక్కువగా ఉపన్యాసము చేయకూడదు

అయితే ఒక తీర్మానమును ప్రతిపాదించు సభ్యుడు, దానిని ప్రతిపాదించునపుడు, ముప్పది నిమిషములవఱకు మాటలాడవచ్చును

7 తీర్మానముపై చర్చ తీర్మానమునకు చెందిన విషయమునుగురించి మాత్రము చేయబడవలెను

8 తీర్మానమును గురించి చర్చించునపుడు ఏ సభ్యుడుగాని 2వ, 3వ, 6వ, 7వ విధులకు లోబడి అట్టి తీర్మానమునకు సవరణను తీసికొనరావచ్చును

9 (1) తీర్మానమును లేక తీర్మానమునకు సవరణను ప్రతీపాదించిన సభ్యుడు, పంచాయతీ అనుమతితో తప్ప, దానిని ఉపసంహరించకూడదు

(2) ప్రెసిడెంటుయొక్క అనుమతితో తప్ప, ఉపసంహరించుకొనుటకు అనుమతికొరకు ప్రతిపాదనమీాద ఎట్టి చర్చ జరుగుటనుగాని అనుమతించకూడదు

10 (1) ఏ తీర్మానమునకైనను సవరణ ప్రతిపాదించబడినపుడు లేక రెండు లేక అంతకంటె ఎక్కువ అట్టి సవరణలు ప్రతిపాదింపబడినపుడు, ప్రెసిడెంటు, దాని విషయమై పంచాయతీయొక్క అభిప్రాయమును కనుగొనుటకు పూర్వము అసలు ప్రతిపాదనయొక్కయు చేయనుద్దేశింపబడిన సవరణ లేక సవరణలయొక్క సారములను పంచాయతీకి చెప్పవలెను లేక చదివి వినిపించవలెను

(2) సాధారణముగా ప్రెసిడెంటు, సవరణలు ఏ క్రమములో ప్రతిపాదించబడునో ఆ క్రమములో ఓటుకు పెట్టవలెను కడపట అసలు ప్రతిపాదనను అన్ని సవరణలు ఓడిపోయినయెడల ఓటుకు పెట్టవలెను ఐతే ఆయన తన ఇష్టానుసారము ఏ సందర్భములోనైన అసలు ప్రతిపాదనను సవరణలను ఆయన యుక్తమని తలంచు క్రమములో ఓటుకు పెట్టవచ్చును

11 అనేక అంశములతో కూడిన ఏ తీర్మానముగాని చర్చింపబడినపుడు, ప్రెసిడెంటు తన ఇష్టానుసారము తీర్మానమును విభజించి, ఆయన యుక్తమని తలంచు విధమున ప్రతియొక్క లేక ఏ యొక్క విషయమునుగాని ప్రత్యేకముగా ఓటుకు పెట్టవలెను

12 ఈ విధములలో 'ప్రెసిడెంటు' అను మాటలో, ఆక్టుయొక్క 25 వ సెక్షన్ తాలూకు (1) (2), (3), (5) సబ్ సెక్షనుల క్రింద ప్రెసిడెంటు ఉద్యోగమును తత్కాలమందు కలిగిన వ్యక్తి చేరును

సె 27 ఏ ప్రెసిడెంటు, వైసుప్రెసిడెంటు లేక ఏ మెంబరుగాని అట్టి హోదాలో నైననుసరే ఏ యితర హోదాలోనైనను సరే తాను చేసిన పనికి పంచాయతీయొక్క స్వాధీనములోనున్న లేదా

అధికారములోనున్న ద్రవ్యమునుండి ఎట్టి జీతమును లేదా యితర ప్రతిఫలమునుగాని పుచ్చుకొనకూడదు లేక అతనికి అది యివ్వబడ కూడదు

## కార్యనిర్వాహకోద్యోగి

సె 28 (1) గవర్నమెంటువారిచే ఈ విషయమున ప్రకటింపబడగల ఏ పంచాయతీకైనను పూర్తికాలము పనిచేయు కార్య నిర్వాహకోద్యోగి నొకరిని వారు నియమించవలెను.

(2) అట్లు ప్రకటించని ప్రతి పంచాయతీ సందర్భములోను మరియు అట్లు ప్రకటించిన ఏ పంచాయితీ సందర్భములోకూడ కార్యనిర్వాహకోద్యోగి ఎవరును దానిపై అధికారమును కలిగియుండని సందర్భములో, నిర్ణయింపబడగల విధులకు లోబడి పంచాయతీ ప్రెసిడెంటు, కార్యనిర్వాహకోద్యోగియొక్క పనులను నెరవేర్చవలెను

(3) ఇతర విధముగా నిర్ణయింపబడగలట్లు తప్ప, (1) వ సబ్ సెక్షన్ క్రింద నియమింపబడిన ఏ కార్యనిర్వాహకోద్యోగిగాని గవర్నమెంటువారి అనుమతిలేనిదే తన ఉద్యోగమునకు సంబంధించని ఏ పనినిగాని చేయ పూనుకొనగూడదు

(4) పంచాయతీ, కార్యనిర్వాహకోద్యోగికి గవర్నమెంటు వారు అప్పుడప్పుడు నిర్ణయించగల జీతమున్ను, బత్తెములున్ను చెల్లించవలెను

(5) పంచాయతి—

(a) కార్యనిర్వాహకోద్యోగి ప్రభుత్వ నౌకరీలో నున్నయెడల ఆయనయొక్క, లీవు అలవెన్సులకుగాను, పింఛనుకుగాను, ప్రావిడెంటు ఫండుకుగాను ఆయనచే లేదా ఆయన తరఫున చెల్లింపబడు నట్లు సర్కారు క్రింద అతనిని నౌకరీకి చెందిన షరతులలో కోరబడగలట్టి వంతు పైకమును,

(b) కార్యనిర్వాహకోద్యోగి సర్కారు నౌకరీలో లేనియెడల ఆయన లీవు అలవెన్సులకుగాను, పింఛనుకుగాను, ప్రావిడెంటు ఫండుకుగాను ఈ విషయమున నిర్ణయింపబడగలట్టి వంతు

పైకమును కూడ చెల్లించవలెను

(6) 1 వ సబ్ సెక్షను క్రింద నియమింపబడిన కార్య నిర్వాహకోద్యోగుల తరగతివారి విభజనను, కొలువులో చేర్చుకొను పద్ధతులను కొలువు షరతులను, జీతము మరియు అలవెన్సులను, క్రమశిక్షణమును, నడవడికను, క్రమపరచు విషయములలో విధులను జారీ చేయుటకు గవర్నమెంటువారు అధికారమును కలిగియుండవలెను

సెక్షను 28 (6) క్రింద, పంచాయితీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల ఉద్యోగముయొక్క క్రమనిర్వర్తనకు జారీచేయుబడిన విధులు (రెగ్యులేషన్‌లు) (జి ఓ నెం 1136, ఎల్ ఎ తేదీ 11-8-1956)

మద్రాసు గ్రామపంచాయతీల యాక్టు, 1950 (మద్రాసు యాక్టు X ఆఫ్ 1950) యొక్క 28 వ సెక్షనుయొక్క (6) వ యుప సెక్షను క్రింద నీయబడిన అధికారముచేత, 4-12-1945 తేదీగల ఫోర్టుసెంటు జార్జి గెజెటుయొక్క I-A భాగములోని విధుల అనుబంధము (రూల్సు సప్లిమెంటు) యొక్క 49-50 పేజీలలో ప్రకటింపబడిన మద్రాసు ప్రభుత్వపు లోకల్ అడ్మినిస్ట్రేషన్ డిపార్టుమెంటుయొక్క 17-11-1945 తేదీగల ప్రకటనలోని విధులను (రెగ్యులేషనులను) అధిగమించుచు (త్రోసివేయుచు), ఆంధ్ర గవర్నర్ పంచాయతీల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లయొక్క తరగతివారి విభజన వారిని నియమించు పద్ధతుల, ఉద్యోగ షరతులు, జీత భత్యములు (అలవెన్సులు) క్రమశిక్షణ మరియు ప్రవర్తన గురించి, యీక్రింది రెగ్యులేషనులను జారీచేయుచున్నారు —

పంచాయితీల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లను గురించి రెగ్యులేషనులు.

1 నిర్వచనములు —

ఈ రెగ్యులేషనులలో సందర్భము వేరేవిధముగా సూచించని యెడల-

(1) "సర్వీసుకు నియామకము" అనగా సర్వీసు సిబ్బందిలోని యొక పదవి యీ విధులను సారము మొదటిసారిగా నిర్వర్తించుటకుగాని, లేక అందులోని ఉద్యోగులకు నిర్ణయింపబడిన

ప్రొబేషను ప్రారంభించుటకుగాని ఒక వ్యక్తిని నియమించుట అని అర్థము ,

(2) "అప్రూవ్డు ప్రొబేషనర్" అనగా ప్రొబేషను సంతృప్తికరంగా పూర్తిచేసినట్టి, ఖాయపు వుద్యోగిగాగాని, వుద్యోగి అని అర్థము ,

(3) "వెనుకబడిన జాతులు" అనగా ఈ రెగ్యులేషనులకు II వ ఎనెక్సరులో చెప్పబడిన జాతులు అని యర్థము.

(4) "కాడరు" అనగా సర్వీసులో ననుమతింపబడిన సిబ్బంది మొత్తం అని యర్థము

(5) "ప్రొబేషనరును తీసివేయుట" (డిశ్చార్జి చేయుట) అనగా మరియొక సర్వీసులో అప్రూవ్డు ప్రొబేషనరు అయినగాని, లేక, ఖాయపు వుద్యోగిఅయినగాని, ఆ యుద్యోగిని తిరిగి వెనుక సర్వీసుకు మార్చివేయుట అనియు, లేక అతనిని ఉద్యోగమునుండి తీసివేయుట అనియు యర్థము

(6) "ఖాయపు వుద్యోగి" అనగా సర్వీసులో ఖాయమయిన పదవికి ఖాయముగా నియమితుడైన వుద్యోగిఅని యర్థము ,

(7) "సర్వీసులోని యుద్యోగి" అనగా సర్వీసులోని ప్రొబేషనర్ లేక అప్రూవుడు ప్రొబేషనరు లేక పూర్తి వుద్యోగి అని యర్థము ,

(8) "మిలిటరీ డ్యూటీ (సేవ)" అనగా నీ క్రింది అర్థములు—

(1) నావిక, మిలిటరీ, లేక వైమానిక చట్టములకు లోబడిన సేవ, లేక

(11) విదేశములలోగాని, లేక నావిక, మిలిటరీ, వైమానిక చర్యలు (యుద్ధములు) జరుగుతున్న ప్రదేశములలోని యూనిట్ లోగాని, అట్టి సిబ్బందిలోగాని, లేక మిలటరీ మందుగుండు సామాగ్రి, లేక స్టోర్సు అధికారుల క్రిందగాని, అట్టి కర్మాగారములలోగాని (ఫ్యాక్టరీలు), పనిచేయవలసిన బాధ్యత విధాయకముగల సేవ ,

(iii) ఈ క్రిందివాటిల్లో సర్వకాలసేవ జేయుబాధ్యత .

(a) సివిలు పయనీరీఫోర్సు, మద్రాస్ సివిల్ లేబర్ యూనిట్సు, లేక మద్రాస్ లేబర్ యూనిట్లు ఫర్ సిలోన్, లేక

(b) వైమానిక చర్యల రక్షణ, లేక కేంద్ర ప్రభుత్వముచేత చెప్పిబడిన నేదయిన ప్రజారక్షణ సంస్థ, లేక

(c) 1946- 49 సంవత్సరముల యుద్ధము శక్తి వంతముగా సాగించుటకుగాని లేదా యుద్ధనిపుణులను తయారుచేయు సందర్భములోగాని, నియమింపబడిన ఏ వుద్యోగమయిన కాని అట్టి పదవులలో సేవ మిలిటరీ డ్యూటీఅని కేంద్రప్రభుత్వము ప్రకటింప వలెను, మరియు నందులో పై (i), (ii) అంశములలో తరిఖీదు కూడియుండవలెను

వివరణము .

(i) 3-9-1939 కు 1-4-1946 తేదీలమధ్య (రెండు రోజులుకలిపి) ఏ తేదీనైన ప్రారంభించనిసేవ మిలిటరీ డ్యూటిగా భావింపబడదు

(ii) 22-11-1948 తేదీనిగాని, తర్వాతచేసిన సేవ గాని మిలిటరీ డ్యూటీగా పరిగణింపబడదు

(9) "ప్రొబేషనరు" అనగా ప్రొబేషను పూర్తి చేయని సర్వీసులోని వుద్యోగి అని యర్థము

వివరణ .

మిలిటరీ డ్యూటీలో వుండనియెడల ఏ తేదీని ఒకవ్యక్తికి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా నియమింపబడియుండునో, మిలిటరీ డ్యూటీలో నున్న నా వ్యక్తి యా తేదీనుండి ప్రొబేషను ప్రారంభించినట్లు భావింపబడును

(10) "షెడ్యూల్డు తరగతులు" అనగా ఈ రెగ్యులేషనులయొక్క 1 వ ఎనెక్సర్ (అనుబంధము) యొక్క A భాగము లో చెప్పబడిన తరగతులు అని అర్థము ,

వివరణము :

హిందూమతముకాక మరియొక మతము నవలింబించు నే వ్యక్తియు షెడ్యూల్డు తరగతివారిగా నెంచబడదు

(11) "షెడ్యూల్డు ట్రైబ్స్ (జాతులు)" అనగా, ఈ రెగ్యులేషనులయొక్క I వ ఎనెక్సర్‌లోని B-భాగములో చెప్ప బడిన తరగతులు అని అర్థము

(12) "సర్వీసు" అనగా ఆంధ్ర పంచాయతీ ఎగ్జి క్యూటివ్ ఆఫీసర్ల సర్వీసు అని యర్థము

2. నిర్మాణము .

(a) ఈ సర్వీసులో ఈ క్రింది నాలుగు తరగతుల ఎగ్జి క్యూటివ్ ఆఫీసర్లు వుందురు —

(1) సెలెక్షన్ గ్రేడ్

(2) గ్రేడ్ I

(3) గ్రేడ్ II

(4) గ్రేడ్ III

(b) ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల నియామకమునకు ప్రకటన చేయబడిన పంచాయతీల మొత్తం సంఖ్య సదరు ఆఫీసర్ల మంజూరైన సంఖ్యయు నొకటే

(c) ప్రభుత్వము ఆజ్ఞప్రకారము ప్రకటింపబడిన పంచాయతీలను ఇన్‌స్పెక్టరు తరగతుల వారీగా విభజించును

3. ఉద్యోగుల నియామకం

(a) ఈ సర్వీసుకు ఈ క్రింది తరగతులలోని వ్యక్తు లను ఇన్‌స్పెక్టరు నియమించును

(i) రాష్ట్ర ప్రభుత్వ సర్వీసులో నున్నవారు ,

(ii) పంచాయతిలయొక్క, మ్యునిసిపాలిటీల యొక్క, మరియు జిల్లాబోర్డులయొక్క సర్వీసులో నున్నవారు , మరియు

(iii) (ఏ సర్వీసుకు చెందక) మొదటి పర్యాయము నియమితులైనవారు

అయితే మొదటి పర్యాయము నియమింపబడినవారిని, వున్న ఖాళీల సంఖ్యలో సగము ఖాళీలలో మాత్రమే నియమింపబడవలెను. మరియు (1) వ సబ్ క్లాజ్ లో చెప్పబడినవారు నిర్ణీత కాలమునకు పరివర్తన చేయ (డెప్యుటేషన్) బడినట్లు, ఎంచబడినవారికి, యితర (ఫారెను) వుద్యోగములోనున్నట్లు జీతములు యివ్వవలెను.

(b) ఉద్యోగములలో నియమించుటకు, వుద్యోగమునకు తగిన వారని తనకు తోచిన వ్యక్తులయొక్క జాబితా ఇన్స్పెక్టరు తనవద్ద నుంచుకొనవలెను.

ఇతర విధముల నియామకమున కర్హుడని ఇన్స్పెక్టరునకు తోచిన యెడల, వానిని తనకు యుక్తమని తోచినంత కాలము కావలసిన తరిఫీదు పొందునట్లు ఇన్స్పెక్టరు ఆజ్ఞాపించవచ్చును

(c) సాధారణముగా ఆఖరి గ్రేడునకు నియామకములు చేయబడును ఒక గ్రేడునుండి పై మరియొక గ్రేడునకు ప్రమోషను చేయబడుదురు కాని కొన్ని ఆవశ్యకమైన కారణములచేత, 1 వ 2 వ తరగతులకు మొదటనే నియామకము చేయవచ్చును ఇట్టి వ్యక్తులు, ప్రభుత్వముచేత ఆమోదింపబడిన, ఇన్స్పెక్టరు తయారు చేసిన జాబితాలో వుండవలెను

4. తాత్కాలిక నియామకములు

(1) (i) పరిపాలనావసరములబట్టి, ఈ సర్వీసులోని సెలెక్షన్ గ్రేడ్ లో తప్ప యితర గ్రేడులలోని వుద్యోగిని తక్షణమే నియమించవలసినప్పుడు ఆట్టి నియామకము యీ రెగ్యులేషనుల ప్రకారం చేయవలసినచో ఎక్కువ కాలయాపనయగునపుడు, యిన్స్పెక్టరు యీ రెగ్యులేషన్ల ప్రకారముకాక, యితర విధముగా, సక్రమముగా నొక వ్యక్తి నియమింపబడేవరకు, ఎవరైన నొక వ్యక్తిని నియమించవచ్చును

(ii) కాని సాధారణముగా, యీ రెగ్యులేషను క్రింద క్వాలిఫికేషనులేని అనగా నియమించుటకుగాను వుండవలసిన చదువు వయస్సు విషయములలో అర్హతలేని వ్యక్తిని నియమించరాదు ఏ వ్యక్తి అయిన తాత్కాలికముగ, అర్హత లేకుండా

నియమింపబడిన యెడల, సాధ్యమయినంత త్వరలో నతనిని తొలగించి, అర్హతగల వ్యక్తిని నియమించవలెను

(2) ఈ సర్వీసులో కొద్దికాలముండే ఖాళీని అవసరమైనపుడు ఈ రెగ్యులేషను ప్రకారం ఎవరిని నియమించవలెనో వారిని నియమించిన బత్తామీద ఎక్కువఖర్చుగాని, లేక కార్యనిర్వాహణలో ఎక్కువ చికాకుగాని కలుగనున్న సందర్భమున, అర్హుడైన మరియొక వ్యక్తిని తాత్కాలికముగా ఇన్స్పెక్టరు నియమించవచ్చును

(3) (1) వ క్లాజు క్రింద నియమితుడైన వ్యక్తిని సాధ్యమయినంత త్వరలో తొలగించి, సర్వీసులోని యొక యుద్యోగినికాని, లేక సర్వీసులో నియామకమునకు ఎంచబడియున్న వ్యక్తినిగాని నియమించవలెను

(4) (1), (2) వ క్లాజుల క్రింద నియమితుడైన వ్యక్తి యీ సర్వీసులోని యుద్యోగిగా పరిగణింపబడడు మరియు ఈ నియామకము మూలముగా ముందు జరుగబోవు సక్రమ నియామకము విషయమునందు సదరు వ్యక్తికి ఏ ప్రాముఖ్యత లభింపదు

5 ఉద్యోగములు ప్రత్యేకించుట

(1) ఈ సర్వీసునకు నియామకములు యీ క్రింద చెప్పబడిన క్రమవిధానములో, మొత్తం సంఖ్యలో ప్రతి 25 ఖాళీలకు చేయబడును ,—

1 ప్రత్యక్ష పరీక్ష.

2 వెనుకబడ్డ తరగతులు మరియు వెనుకబడ్డ జాతులు

3 పరోక్ష పరీక్ష.

4 వెనుకబడిన తరగతులు

5 ప్రత్యక్ష పరీక్ష

6 ప్రత్యక్ష పరీక్ష

7 వెనుకబడిన తరగతులు

8 పరోక్ష పరీక్ష.

9 షెడ్యూల్డు తరగతులు మరియు షెడ్యూల్డు జాతులు
10 ప్రత్యక్ష పరీక్ష
11 ప్రత్యక్ష పరీక్ష.
12 వెనుకబడిన తరగతులు.
13 ప్రత్యక్ష పరీక్ష
14 వెనుకబడిన తరగతులు
15. ప్రత్యక్ష పరీక్ష
16 షెడ్యూల్డు తరగతులు మరియు షెడ్యూల్డు జాతులు
17 ప్రత్యక్ష పరీక్ష.
18 ప్రత్యక్ష పరీక్ష
19 వెనుకబడిన తరగతులు
20 ప్రత్యక్ష పరీక్ష
21 ప్రత్యక్ష పరీక్ష
22 షెడ్యూల్డు తరగతులు, మరియు షెడ్యూల్డు జాతులు
23 ప్రత్యక్ష పరీక్ష.
24 వెనుకబడిన తరగతులు
25 ప్రత్యక్ష పరీక్ష

(2) అర్హతను గమనించి చేయబడు నియామకముల విషయములో, షెడ్యూల్డు తరగతుల, షెడ్యూల్డు జాతుల, మరియు వెనుకబడిన యితర తరగతుల హక్కులుకూడ విచారించబడును.

(3) పైనచెప్పబడిన క్రమవిధానములో, వారి వారికి నిర్ణయమైన ఖాళీలోనికి అర్హత గలిగినవ్యక్తి, షెడ్యూల్డు తరగతులలో గాని, షెడ్యూల్డు జాతులలోగాని, లేక వెనుకబడిన తరగతులలో గాని లేనియెడల, ఆ యవకాశము వారికి లేకుండ పోవును మరియు నట్టి ఖాళీకి క్రమవిధానము ప్రకారము సదరు జాతులు లేక తరగతుల కిచ్చినయవకాశము తరువాత చెప్పబడిన విధమున భర్తీకాబడును.

వివరణము .—

ఈ విధిమేరకు "నియామకము" అనగా మొట్ట మొదటి నియామకము అని అర్థము.

6. అర్హతలు!— ఈ క్రింది అర్హతలుండిననే కాని, యే వ్యక్తియు యీ సర్వీసుకు నియమితుడు కాకూడదు — (1) ఇండియా దేశీయుడై (సిటిజను) యుండవలెను (11) షెడ్యూల్డు తరగతులు, షెడ్యూల్డు జాతులు కానివారు, ఈ రెగ్యులేషనుల III వ ఎనెక్సర్‌లో నుదహరించిన కనీసవిద్యార్హతలు కలిగియుండవలెను

(111) షెడ్యూల్డు తరగతులు షెడ్యూల్డు జాతులకు చెందిన వ్యక్తులయినచో, ఈ రెగ్యులేషనులకు చేర్చబడిన III వ ఎనెక్సరు లోని పరీక్షలు పూర్తిచేసినట్లు సర్టిఫికేట్ పొందియుండవలెను

అయితే I వ, II వ గ్రేడ్‌లో ప్రథమ నియామకమునకు ఒక అభ్యర్థి, ప్రభుత్వముచే నామోదింప బడిన ఒక యూనివర్సిటీ డిగ్రీని పొందియుండవలెను

(1V) నియమించబడిన తేదీకి వానికి వయస్సు 18 సంవత్సరములకు తక్కువ కాకుండాను, 25 సంవత్సరముల వయసుకు హెచ్చు కాకుండా యుండవలెను

అయితే ప్రభుత్వములోగాని, జిల్లాబోర్డులోగాని, మ్యునిసిపల్ కౌన్సిళ్ళలోగాని లేక పంచాయతీలోగాని పనిచేయుచున్న ఎడల, నలుబది సంవత్సరముల వయస్సు వచ్చువరకు నియామకమునకు తగి యుండును

అదిగాక, ఏవ్యక్తికిగాని ఏ తరగతి వ్యక్తులకుగాని ఈ సబ్ క్లాజ్‌లోని నియమములు వర్తింపకుండునట్లు ఆజ్ఞాపించుటకు ప్రభుత్వమునకు అధికారము వుండును

(V) మంచి ఆరోగ్యము కలవాడనియు, చురుకైన అలవాట్లు స్వభావము కలవాడనియు, మరియు సర్వీసుకు అనర్హునిచేయు శరీర లోపములు, జాడ్యములు లేవని ఇన్‌స్పెక్టరుకు తృప్తి చేయవలెను, మరియు

(VI) తనయొక్క గుణగణములు, ప్రవర్తన, పూర్వచరిత్ర సర్వీసుకు అర్హత కలుగజేయునట్టివని ఇన్‌స్పెక్టరుకు తృప్తిపరచవలెను

7. తరిఫీదు :— (క్రమశిక్షణ)

ఎంచబడిన అభ్యర్థులు వారి స్వంతఖర్చుతో ఇన్‌స్పెక్టరు నియోగించిన తరిఫీదును (ప్రాక్టికల్ ట్రైనింగు) పొందవలెను ఆ తరిఫీదును సంతృప్తిగా పూర్తి చేసినవారే ఉద్యోగమునకు అర్హులు

8. ధరావత్తు :— (జామీను)

(I) నియమింపబడిన ప్రతి అభ్యర్థియు, రూ 1,000 కు వ్యక్తిగత జామీను, రూ. 500- నగదు జామీను యియ్యవలెను. నగదు జామీను, యీక్రింది స్వరూపములలో కూడ నుండవచ్చును.

పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు డిపాజిట్లు, గవర్నమెంటు ప్రామిసరీ నోట్లు, పోస్టాఫీసు 10-సంవత్సరముల డిఫెన్సు సేవింగ్సు సర్టిఫికెట్లు, పోస్టాఫీసు 5, 7, లేక 12 సంవత్సరముల నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు, లేక ప్రభుత్వముచే నామోదింపబడిన భీమాకంపెనీల విశ్వాసపత్రములు (ఫిడెలిటీ బాండ్లు),

(II) ఒక యభ్యర్థి మొత్తంనగదు జామీనుగాని, లేక (I) వ సబ్‌క్లాజులో చెప్పబడిన యితర పత్రములను గాని యివ్వలేని యెడల, అతని జీతములో 10 వ వంతున మినహాయింపునగాని, లేక నాలుగు సంవత్సరములలో జామీను మొత్తములోని లోపమును పూర్తిచేయుటకు తగిన సొమ్మునుగాని, ఏది ఎక్కువయిన నట్టి విధముగా, జామీను సొమ్మును రాబట్టవలెను

అయితే నగదుమూలంగా పూర్తిజామీను మొత్తం వసూలు అగువరకు, యివ్వవలసిన మొత్తమునకు రెట్టింపు విలువకు వ్యక్తిగత జామీనుగాని, లేక ఎట్టి అడుకుబడులు లేని స్థిరాస్తిగాని, జామీనుగా తీసుకోబడవలెను

9. ప్రొబేషన్ (1) ప్రొబేషనుమీద నియమింపబడిన ప్రతి వ్యక్తియు, జరుగచున్న మూడు సంవత్సరములలో మొత్తం రెండు సంవత్సరములు సేవచేస్తూ ప్రొబేషను అనగా నియామకమున

కర్హతను నిరూపించు పరీక్ష మీాదవుండును. మరియునట్టి ప్రొబే షను కాలము సంతృప్తిగా పూర్తిచేయువరకు నతడు పూర్ణ వుద్యోగి గాని నియమింప బడుటకుగాని, ఉచ్చస్థానమునకు ప్రమోషనకు (పరివర్తనకు) గాని అర్హుడు కాడు

అయితే నొక ప్రొబేషనరు మిలిటరీ సేవకు పంపబడిన యెడల, అతను మిలిటరీ సేవకు పోకుండా నున్నయెడల నెంత కాలము సర్వీసులో ప్రొబేషనులో నుండునో, మిలిటరీ సేవలోని అంతకాలము ప్రోబేషను కాలముగా గణింపబడును

(2) 4 వ రెగ్యులేషన్ క్రింద ఒక వ్యక్తి తాత్కాలికముగ నీసర్వీసు సిబ్బందిలో నియమింపబడి యుండి, ఈ రెగ్యులేషనుల ప్రకారముగానీ సర్వీసులో క్రమ నియమితుడైన యెడల, ఈ సర్వీ సులో నతడు నియమితుడైన తేదీనుండిగాని, లేక యిన్స్పెక్టరు నిర్ణ యించిన అంతకుముందు తేదీ నుండిగాని, అతని ప్రోబేషను ప్రారంభ మగును.

(3) ప్రొబేషను పూర్తి అయ్యేలోగా యిన్స్పెక్టర్ యీా క్రింది విధముగా చేయవచ్చును —

(i) ఖాళీలేనియెడల ప్రొబేషనరును అంతముచేయ వచ్చును. లేదా తాత్కాలికముగా నిలబెట్టవచ్చును, (సస్పెండు చేయవచ్చును), లేదా

(ii) ప్రొబేషనరు అంతముచేసి, ప్రొబేషనరును సర్వీసు నుండి 'తొలగించవచ్చును, లేదా ప్రొబేషను కాలపరిమితి హెచ్చింపవచ్చును కాని ఈ సందర్భములలో ప్రొబేషనరుకు తనపై యీా చర్య తీసుకొనబడునని తెలియజేసి అట్లు చేయుట యసంభ వమని సంజాయిషీయిచ్చుటకు తగు అవకాశము యివ్వవలెను

అయితే 22 వ రెగ్యులేషనుయొక్క (1) వ క్లాజ్‌యొక్క (vi) వ లేక (vii) వ సబుక్లాజుల క్రింద చెప్పబడిన శిక్షలలో నేవి యైన నతనిపై విధించుటకుగాను అతనిపై నేరవిచారణచేసి, అతని సంజాయిషీకి తగిన అవకాశమిచ్చిన తర్వాత ఆ ప్రొబేషనరుయొక్క ప్రొబేషను అంతము చేయుటకు తీర్మానించినయెడల, ఈ రెగ్యు

లేషను క్రింద నతని ప్రొబేషను నంతము చేయుటలో ప్రత్యేకముగా నతనికి సంజాయిషీ యిచ్చుటకు మరియొక యవకాశము యివ్వ నక్కరలేదు

వివరణము

ప్రొబేషనరుకంటె ఎక్కువ హోదాలోని ఇన్‌స్పెక్టరుయొక్క క్రింది అధికారిగాని, లేక యిన్‌స్పెక్టరు తనంతట తానుగాని, ఆ ప్రొబేషనరు ఖాయపు వుద్యోగమునకు అర్హుడా, అనర్హుడా అను విషయములో నొక తాత్కాలికపు నిర్ణయమునకు వచ్చినతర్వాత, సంజాయిషీ యిచ్చుటకు అవకాశము నా ప్రొబేషనరుకు యివ్వవలెను.

(4) నిర్ణీతమయినగాని, లేక పొడిగించిన ప్రొబేషను కాలము అంతమయినపుడు ఆ ప్రొబేషనరు సర్వీసులో పూర్ణ వుద్యోగిగానుండుటకు అర్హుడని ఇన్‌స్పెక్టరు భావించినచో, ఆ ప్రొబేషనరు తన ప్రొబేషను సంతృప్తికరంగా పూర్తిచేసినట్లు అతని యాజ్ఞను జారీచేయును అట్టి యాజ్ఞ జారీఅయినతర్వాత, ప్రొబేషను కాలముగాని, ప్రొబేషను పొడిగించిన కాలముగాని అంతమయిన తేదీనుండిగాని, ఆ ప్రొబేషనరు తన ప్రొబేషను సంతృప్తికరంగా పూర్తిచేసినట్లు భావింపబడును

(5) నిర్ణీతమయినగాని, లేక పొడిగింపబడినగాని ప్రొబేషను కాలము అంతమయిన తర్వాత, సర్వీసునకు ఆ ప్రొబేషనరు అర్హుడు కాడని ఇన్‌స్పెక్టరు భావించినయెడల, అతడా ప్రొబేషనరును తన ఆజ్ఞామూలంగా సర్వీసునుండి తొలగించును అట్లు తొలగించుటకు ముందుగా నా ప్రొబేషనరుకు, అతనిపై నట్టిచర్య నేల తీసికొనరాదో సంజాయిషీ యిచ్చుటకు తగిన అవకాశము నివ్వవలెను.

అయితే 22 వ రెగ్యులేషనుయొక్క (1) వ క్లాజుయొక్క, (VI) వ లేక (VII) వ సబ్‌క్లాజుల క్రింద చెప్పబడిన శిక్షలలో నేవియైన నతనిపై విధించ నుద్దేశించి, అతనిపై నేర విచారణచేసి, అతని సంజాయిషీకి తగిన అవకాశము యిచ్చిన తర్వాత, అతనిని సర్వీసునుండి తొలగించుటకు తాత్కాలికముగ నిర్ణయించిన యెడల

నీ రెగ్యులేషను క్రింద నతనిని సర్వీసునుండి తొలగించుటలో, ప్రత్యేకముగా నతనికి సంజాయిషీ యిచ్చుటకు మరియొక యవకాశము నివ్వనక్కరలేదు

వివరణము I (ఎక్స్ప్లనేషను)

ప్రొబేషనరు సర్వీసులో పూర్ణ వుద్యోగిగా నుండుటకు అర్హుడుకాడన్న ఇన్స్పెక్టరుయొక్క నిశ్చితము, ప్రొబేషనరుయొక్క నిర్ణీతమైన, లేక పొడిగింపబడిన ప్రొబేషను అంతమయిన తేదీ తర్వాత ప్రవర్తన, నైపుణ్యముమీాద కూడ నాధారపడియుండ వచ్చును

వివరణము II

ప్రొబేషనరుకంటె నెక్కువ హోదాగల యిన్స్పెక్టరుక్రింద అధికారిగాని, లేక ఇన్స్పెక్టరుగాని, ప్రొబేషనరు సర్వీసులో ఖాయపు వుద్యోగిగా నుండుటకర్హతనుగూర్చి యొక తాత్కాలిక నిర్ణయమునకు వచ్చిన తర్వాత ప్రొబేషనరును సంజాయిషీకి అవకాశము యివ్వవచ్చును

(6) సర్వీసులో పూర్ణ వుద్యోగిగా నుండుటకు తగడని సర్వీసు నుండి తొలగింపబడిన ప్రొబేషనరు, ఇన్స్పెక్టరుయొక్క ఆజ్ఞపై ప్రభుత్వమునకు అపీలు చేసుకొనవచ్చును అట్టి అపీలుపై ప్రభుత్వము తమకు యుక్తమని తోచిన ఆజ్ఞ యివ్వవచ్చును

ఖాళీలు లేనందువల్ల తొలగింపు లేక అంతకు
పూర్వ వుద్యోగములోనికి తరలింపు

(a) ఖాళీలులేని సందర్భములో, ప్రొబేషనరులుగాని, మరియు అప్రూవ్డ్ ప్రొబేషనరులుగాని ఈ క్రింది క్రమములో తొలగింపబడవలెను. లేదా అంతకు పూర్వపు వుద్యోగమునకు తరలింపబడవలెను —

(1) మొదట, క్రమము ననుసరించి తక్కువ కాలము పనిచేసిన (జూనియరు) ప్రొబేషనర్లు, మరియు

(11) రెండు, క్రమము ననుసరించి తక్కువకాలము పనిచేసిన (జూనియరు) అప్రూవ్డ్ ప్రొబేషనర్లు,

అయితే పై క్రమము ప్రత్యేక కారణములచేతగాని, లేదా కార్య నిర్వహణలో అంతరాయము కలుగు పరిస్థితిలోగాని, మార్చ వచ్చును అట్టి కారణములను వ్రాత మూలముగా రికార్డుచేయ వలెను

(b) ఖాళీలు లేక సర్వీసునుండి తొలగింపబడిన అప్రూవ్డ్ ప్రొబేషనర్లు ప్రొబేషనర్లు, మరల ఖాళీలువచ్చినపుడు, (a) క్లాజులో చెప్పినక్రమమునకు క్రిందనుండి తిరిగి నియమింప బడుదురు

అయితే ఈ క్లాజు క్రింద ప్రథమహక్కుగల వ్యక్తులయొక్క చెప్పబడినగాని లేక యిమడ్చబడినగాని, యిష్టముపై ఈ క్లాజుక్రింది క్రమమును మార్చవచ్చును

మరియు పై క్రమము కొన్ని ప్రత్యేక కారణములచేతగాని, లేదా కార్యనిర్వహణలో అంతరాయము కలుగు పరిస్థితిలోగాని, తప్పించవచ్చును అట్టి కారణములను వ్రాతమూలకముగా రికార్డు చేయవలెను

(c) మరల వుద్యోగములో నియమించుటకు క్లాజు (b) చెప్పబడిన క్రమము, 4 వ రెగ్యులేషను క్రింద చేయబడు నియామకములకు వర్తించదు

(d) యీ రెగ్యులేషను నిమిత్తం, ప్రొబేషనర్ల యొక్క, అప్రూవ్డ్ ప్రొబేషనర్లయొక్క సీనియారిటీ (సర్వీసులోని స్థానము) 14 వ రెగ్యులేషను ననుసరించి నిశ్చయింపబడును

## 11 జీతము (వేతనము)

(1) సర్వీసులోని ప్రొబేషనరుకు, లేక అప్రూవ్డుప్రొబేష నరుకు, లేక ఖాయపు వుద్యోగికి యీ క్రింది ప్రకారము జీతములు యివ్వబడును

(a) సెలెక్షన్ గ్రేడులో నెలకు రూ 120/-వంతున, ప్రతి సంవత్సరాంతమున రూ 6/- వంతున రూ 150/- వరకు హెచ్చుచుండును.

(b) ప్రథమ గ్రేడులో 1 నెలకు రూ 90/- వంతున, ప్రతి సంవత్సరాంతమున రూ 5/- వంతున రూ. 105/-వరకు హెచ్చుచుండును, అటు తర్వాత, ప్రతి రెండు సంవత్సరముల అంతమున రూ. 7-8-0 వంతున రూ 120/- వరకు హెచ్చుచుండును.

(c) రెండవ గ్రేడులో, నెలకు రూ 70/- వంతున, ప్రతి సంవత్సరాంతమున రూ 3/- వంతున రూ 85/ వరకు హెచ్చుచుండును, అటు తర్వాత ప్రతి రెండు సంవత్సరముల అంతమున రూ 5/- వంతున రూ 100/- వరకు హెచ్చుచుండును.

(d) మూడవ గ్రేడులో, నెలకు రూ 55/- వంతున, ప్రతి సంవత్సరాంతమున రూ 2/- వంతున రూ 85/- వరకు హెచ్చుచుండును ఈ జీతము సరణిలో (స్కేలులో) గ్రాడ్యుయేట్ల జీతము నెలకు రూ 61/- తో ప్రారంభమగును.

అయితే ప్రభుత్వముయొక్క, జిల్లాబోర్డుయొక్క, మ్యునిసిపాలిటీయొక్క లేక పంచాయతీయొక్క సర్వీసునుండి బదిలీ చేయబడి సర్వీసులో నియమితుడైన వ్యక్తి, తాను ఖాయపు వుద్యోగి అయ్యేవరకు, తాను వచ్చిన సర్వీసులో ఖాయముగాగాని, లేక ఆఫీషియేటింగుగాగాని, లేక తాత్కాలికముగా (టెంపరరీ) గాని యే వేతనమునకు హక్కు కలిగియుండునో యంతగాని, లేక తాను నియమితుడైన ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు గ్రేడ్ యొక్క వేతనముగాగాని, ఏది ఎక్కువయిన యెడల దానిని తీసుకొనుటకు హక్కు కలిగియుండును

(2) 4 వ రెగ్యులేషను క్రింద నియమింపబడిని వ్యక్తికి, తాను ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా నియమింపబడుటకు ముందు, ప్రభుత్వముయొక్క, జిల్లాబోర్డుయొక్క, మ్యునిసిపాలిటీలయొక్క, లేదా పంచాయతీయొక్క సర్వీసులో ఖాయముగాగాని, అఫీషియేటింగుగాగాని, లేక తాత్కాలికముగా (టెంపరరీగా) గాని నుండి యుండిన యెడల, మూడవ తరగతి వేతనసరణిలో నెలకు రూ 55/- వంతునగాని, లేదా ప్రభుత్వముయొక్క, జిల్లాబోర్డుయొక్క, మ్యునిసిపాలిటీ

యొక్క లేక పంచాయతీయొక్క సర్వీసులో నెంత వేతనమునకు అర్హుడో, ఏది ఎక్కువయిన నంత వేతనము యివ్వబడును

అయితే, ప్రభుత్వపు, జిల్లాబోర్డుయొక్క, మ్యునిసిపాలిటీ యొక్క లేక పంచాయతీ సర్వీసులో ఒక వ్యక్తి అఫీషియేటింగుగా గాని, లేక తాత్కాలికముగాగానివుండి, తీసికొనుచున్న వేతనము ననుసరించి లెక్కించి, అతను ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా నియమింపబడిన తేదీన యివ్వబడు జీతము ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా నియమితుడు కాకుండా అఫీషియేటింగుగాగాని టెంపరరీగాగాని ఎంత కాలము నుండి యుండునో అంతవరకే యివ్వబడును

## 12. ప్రత్యేక పరీక్షలు. (స్పెషల్ టెస్టులు)

(a) ఈ రెగ్యులేషనులు అమలులోనికివచ్చిన తేదీకి, యీసర్వీసులో రెండవ గ్రేడులోగాని, మొదటి గ్రేడులోగాని, ఖాయముగావున్న ఏ వ్యక్తి అయిన, ఆ తేదీనుండి రెండు సంవత్సరముల లోగా, తాను యిదివరకు ప్రభుత్వ సర్వీసులోయుండి, చిన్న ఆఫీసర్లకు (సబార్డినేటు ఆఫీసర్లకు) నిర్ణయించబడిన అకౌంటు టెస్టులో ఉత్తీర్ణుడయి వుండని యెడల, స్థానిక సంస్థల వుద్యోగస్థులకు నిర్ణయింపబడిన అకౌంటు టెస్టులో నుత్తీర్ణుడు కావలెను

అయితే సర్వీసులోని యే వుద్యోగి అయిన పైచెప్పబడిన తేదీకి మిలిటరీ డ్యూటీలోనున్నగాని, సక్రమముగా నియ్యబడిన శెల వులలోనున్నగాని, తిరిగి సర్వీసులో వుద్యోగములోచేరిన తేదీనుండి గాని, శెలవు పూర్తి అయిన తేదీనుండిగాని యీ రెండు సంవత్సర ములు లెక్కింపబడును

(b) ఈ రెగ్యులేషనులు అమలులోనికి వచ్చిన తేదీకి సర్వీ సులో, ఖాయము గాకాక, మరియే యితర స్థానములోనైన, రెండవ గ్రేడులోగాని, మొదటి గ్రేడులోగాని ఏవ్యక్తియైన నున్నయెడల, (a) క్లాజులో చెప్పబడిన కాలములో నా పరీక్షలో నుత్తీర్ణుడుకాని యెడల నతనికి యివ్వవలసిన సంవత్సరాంతపు జీతపుహెచ్చు (ఇంక్రి మెంటు) పరీక్షలో నుత్తీర్ణుడు అయ్యేదాకా యివ్వబడక పోవచ్చును.

కాని అట్టి నిలుపుదల నతడు పరీక్షలో నుత్తీర్ణుడయిన తర్వాత యివ్వ వలసిన యింక్రిమెంట్లుకు వర్తించదు

(c) అట్టి వుద్యోగి, ఈ రెగ్యులేషనులు అమలులోనికి వచ్చిన తేదీనుండి మూడు సంవత్సరములలోగా నా పరీక్షలో వుత్తీర్ణుడు కాని యెడలను, లేక మిలిటరీ సర్వీసునుండి రెండవ గ్రేడుకుగాని, మొదటి గ్రేడుకుగాని ఖాయముగాక యితర విధముగ ఎన్నుకొనబడి యీ సర్వీసుకు వాపసు అయిన తేదీనుండి మూడు సంవత్సరముల లోపల, ఆ పరీక్షలో నుత్తీర్ణుడుకాని యెడలను, సర్వీసునుండి తొలగింప బడుటకు అవకాశముండును, లేదా నతడు ప్రమోషనై రెండవ గ్రేడుగాని, మొదటి గ్రేడులోగాని నున్నయెడల ఆ క్రింది గ్రేడు లోనికి అవరోహణము చేయబడును

(d) ఏ వ్యక్తి అయిన, రెండవ గ్రేడుకుగాని, మొదటి గ్రేడుకుగాని నేరుగా నియమింపబడిన యెడల, అతడు ఆ గ్రేడుకు అధిరోహణకు (ప్రమోషనుకు) నిర్ణయింపబడిన పరీక్షలో (టెస్టు) ప్రొబేషనుకు కాలములోగాని, లేదా యీ రెగ్యులేషనులు అమలు లోనికి వచ్చిన రెండు సంవత్సరములలోగాగాని నుత్తీర్ణుడు కావలెను అట్లుత్తీర్ణుడుకాని యెడల సర్వీసునుండి తొలగింప బడవచ్చును.

## 13 పూర్తి వుద్యోగుల నియామకము

సర్వీసు సిబ్బందిలో ఖాయమయిన ఖాళీ వున్నయెడల, అప్రూవ్డ్ ప్రొబేషనరును యిన్‌స్పెక్టరు సాధ్యమయినంత త్వరలో సర్వీసులోని, ఖాయపు వుద్యోగిగా నియమించ వలెను

కాన, అట్టిఖాళీ, నియామక తేదీకి ముందు తేదీనుండి నున్న యెడల నావెనుక తేదీనుండి నతనిని నియమించ వచ్చును, లేదా ఆ తేదీకి తరువాత నేతేదీనుండి అతడు సర్వీసులో వుద్యోగిగా తగ్గింపు లేక నున్నాడో, నట్టి తేదీనుండి నియమించ వచ్చును

అయితే ఖాయపు వుద్యోగిగాగానట్టి నియామకమునకు ఒక్కరి కంటె నెక్కువ అప్రూవ్డ్ ప్రొబేషనర్లు వున్నయెడల, వారిలో అందరికంటె ముందునుంచి పనిచేసిన (సీనియరు) ప్రొబేషనరుని **నియమించవలెను.**

## 14. సర్వీసులో సీనియారిటీ (ఔన్నత్యము)

(a) సర్వీసులో ఒక వుద్యోగియొక్క సీనియారిటీ అతనిని నియమమునకుగాను నిర్ణయించిన సీనియారిటీ ననుసరించి నిర్ణయించ బడును ఈ రెగ్యులేషనులు జారీచేయుటకు ముందుగా వుద్యోగములో నియమింపబడిన వ్యక్తుల విషయములో, ఇన్‌స్పెక్టరుగారు వుంచిన జాబితాలో నున్న క్రమమునుబట్టి సీనియారిటీ నిర్ణయ మగును

కాని తగిన సరియైన హేతువులచేత, ఒకవ్యక్తిని ఒక గ్రేడునుండి మరియొక గ్రేడుకు మార్చుటకును, లేదా ఒకవ్యక్తి సీనియారిటీని తిరిగి నిర్ణయించుటకును, ప్రభుత్వమునకు అధికార ముండును,

(b) సర్వీసులోని ఒక వుద్యోగి తన ప్రోబేషను పూర్తి అగుటకు ఏ ఆలస్య మున్నప్పటికిని లేక అతను ఖాయవుద్యోగిగా సర్వీసులో నిర్ణయింప బడుటలో కలిగిన ఆలస్యమున్నప్పటికిని, సదరు ఆలస్యములతో సంబంధము లేకుండా, ఈ రెగ్యులేషనుల ప్రకారము సీనియారిటీలో తగ్గింప బడిననేతప్ప, సెలెక్టు (ఎంచ) కాబడిన కాల ములోనిర్ణయింప బడిన సీనియాటిరినే అతను సర్వీసులో నున్నంత కాలము కలిగియుండును

## 15. ప్రమోషను (ఆరోహణ)

(1) (a) ప్రమోషనులు ఇన్‌స్పెక్టరుచేత చేయబడును

(b) ప్రమోషను ఒక గ్రేడునుండి దానియొక్క తరువాత పై గ్రేడునకు జరుగును

(c) ప్రమోషనులు అర్హత, సామర్థ్యముల మీాద ఆధారపడి యుండును అర్హత, సామర్థ్యములు యించు మించు సమానముగా నున్నపుడు మాత్రమే సీనియారిటీ గణింపబడును

(d) స్థానిక సంస్థల వుద్యోగులకై నిర్ణయింపబడిన అక్కౌంటు టెస్టులో నుత్తీర్ణుడు అయిననేకాని యేవుద్యోగికి ప్రమోషను చేయబడదు.

అయితే రాష్ట్ర ప్రభుత్వ సర్వీసులో క్రింది తరగతి సబార్డి నేటు వుద్యోగస్తులకు నిర్ణయింపబడిన అక్కౌంటు టెస్టులో ను త్తీర్ణుడయి యుండిన యెడల ఈ క్లాజులో చెప్పిన టెస్టులో ప్యాసు కానక్కరలేదు

(2) (1) వ క్లాజుక్రింద యిన్‌స్పెక్టరు జారీచేసిన ఆజ్ఞమీాద (ఆర్డరుపై) సర్వీసులోని వుద్యోగి ప్రభుత్వమునకు అపీలుచేయ వచ్చును ప్రభుత్వము కూడ, తమంత తామే, ఎవరైన ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుయొక్క ప్రమోషనుకు సంబంధించిన రికార్డు తెప్పించి, వారికి యుక్తమనితోచిన వుత్తరువులు జారీచేయవచ్చును

## 16. తాత్కాలిక (టెంపరరీ) ప్రమోషన్

పరిపాలనా సందర్భమున యుక్తమని తనకుతోచిన సెలెక్షను గ్రేడులోగాని, మొదటి లేక రెండవ గ్రేడులలోగాని ఖాళీ తక్షణమే క్రింది తరగతినుండి ప్రమోషనులవల్ల పూర్తి చేయవలసిన యెడల, ఈ రెగ్యులేషనుల ప్రకారము అట్టి ప్రమోషను చేయుటలో మిక్కిలి ఆలస్యమగునప్పుడు, సర్వీసులోని యొకయుద్యోగిని ఇన్‌స్పెక్టరు ఈ రెగ్యులేషనుల ప్రకారముకాకుండా యితర విధముగా ప్రమోషను చేయవచ్చును అట్లు ప్రమోషను చేయబడిన వుద్యోగస్తునికి బదులు సాధ్యమయినంత త్వరలో అట్లు ప్రమోషను పొందుటకు హక్కు కలవానిని నియమించవలెను

ఈ రెగ్యులేషను ప్రకారము ప్రమోషను పొందిన కారణము మాత్రము చేతనే, అట్లు ప్రమోషను పొందిన వ్యక్తి, యికముందు సర్వీసులో క్రమప్రమోషనుకు ప్రత్యేక హక్కు కలిగియుండడు ఈ రెగ్యులేషను ప్రకారము ప్రమోషను చేయబడిన వ్యక్తికి, ప్రమోషను చేయబడిన గ్రేడు వేతనస్కేలులో కనిష్టవేతనముగాని, లేక తాను తన నిజ గ్రేడునందు అప్పటికి రావలసిన వేతనముగాని, ఏది యెక్కువయున్న యెడల దానిని యివ్వవలెను.

## 17 స్థలమార్పులు, బదిలీలు

స్థలమార్పులు, బదిలీలు ఇన్‌స్పెక్టరుచేత చేయబడును.

## 18. జీతము, ప్రయాణపు బత్తేము అడ్వాన్సు :

సర్వీసులోని ఒక వుద్యోగి బదిలీ అయినపుడు, ఒక నెల జీతమును, అతనికి ఆంధ్ర ప్రయాణ బత్తా విధుల క్రింద, అనగా ఆంధ్ర టి ఎ, రూల్సు ప్రకారము యీయాయతగిన బత్తాను, అడ్వాన్సుగా తీసుకొనుటకు హక్కు కలిగియుండును. అతను యే పంచాయతీ నుండి బదిలీ చేయబడినా ఆ పంచాయతీ ధనమునుండి ఆ యడ్వాన్సు తీసుకొనవలెను తుదివేతనపు (లాస్టు పే) సర్టిఫికెట్టుపై దానిని (అనగా తీసుకొన్న అడ్వాన్సు మొత్తము) వ్రాయవలెను. బదిలీ అయిన తర్వాత, పూర్తి నెల జీతము అతను పొందుతున్న నెలలగాయతు, మూడు నెలలు కాలములో, సమవంతుల చొప్పున, అతనికి యిచ్చిన అడ్వాన్సుజీతము తిరిగి రాబట్టవలెను. ప్రయాణ బత్తా బిల్లు అతను దాఖలుచేయగానే, ప్రయాణ బత్తా అడ్వాన్సు యావత్తు మొత్తము తిరిగి రాబట్టవలెను

అట్లు తిరిగి రాబట్టిన మొత్తములను, యే పంచాయతీ మొదట అడ్వాన్సు యిచ్చినదో దానికి జమకట్టవలెను

## 19 వాహనము కొనుటకు అడ్వాన్సు

(1) ఒక పంచాయతీ, తత్సంబంధ మయిన జిల్లా పంచాయతీ ఆఫీసరుయొక్క అనుమతితో, ఈ క్రింది షరతులకు లోబడి తన పంచాయతీ ఆఫీసరుకు ఒక బైసికిల్ కొనుగొనుటకు అడ్వాన్సు నియవచ్చును -

(i) అట్టి అడ్వాన్సు రూ 250/- కాని లేక బైసికిలు యొక్క ధరనుగాని, ఏ మొత్తము తక్కువ అయిన దానికి మించరాదు

(ii) తీసుకున్న అడ్వాన్సు కంటె కొనుగోలుకాబడిన బైసికిలు ధర తక్కువ అయిన యెడల, మిగిలిన సొమ్ము వెంటనే పంచాయతీకి వాపసు చేయవలెను , మరియు

(iii) ఒక ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు ఖాయపు వుద్యోగి కాకపోయినా, అప్రూవ్డ్ ప్రొబేషనరు కాకపోయినా, లేక ప్రభుత్వములోగాని, జిల్లాబోర్డులోగాని, మ్యునిసిపాలిటీలోగాని, లేక పంచా

యతీలోగాని ఖాయమైన వుద్యోగముపై హక్కు కలిగియుండక పోయినా, అతనికి అడ్వాన్సు యివ్వబడదు

(2) అడ్వాన్సు యిచ్చునపుడు, ఆ మొత్తమును వాపసు చేయుటకొరకు తగిన జామీను పంచాయతీ తీసుకొనవలెను అట్టి జామీను కొనిన బైసికిలు కాకుండా వేరే యుండవలెను

(3) (I) ఆ యడ్వాన్సు యిరువదియైదు నెలలకు మించకుండ, సమమైన నెలసరి వాయిదాలపై వాపసు చేయబడవలెను

అయితే, అడ్వాన్సును వాయిదాల సంఖ్యచే భాగించగా వచ్చిన మొత్తములో రూపాయికి తక్కువ భాగముచేరివున్న యెడల, ఆఖరి వాయిదా తప్ప మిగిలిన ప్రతివాయిదా మొత్తమును ఒక రూపాయితో హెచ్చించి వసూలుచేసి, మిగిలియున్న అడ్వాన్సు బాకీ, ఆఖరు వాయిదాగా రాబట్టుకొనవలెను

(II) అడ్వాన్సు వాయిదాలను ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు యొక్క నెల జీతపు బిల్లులనుండి క్రమముగా రాబట్టవలయును , మరియు, వాపసు చేయవలసిన అడ్వాన్సుల రిజిష్టరు ద్వారా పై జెప్పిన వాయిదా వసూళ్ళను గమనించుచుండవలెను

(III) ప్రభుత్వము తమ వుద్యోగస్థులకు వాహనములకు యిచ్చు అడ్వాన్సులపై నేవంతున వడ్డీ వసూలు చేయుదురో, నదే వంతున నీ యడ్వాన్సులపై సరసవడ్డీ వసూలు చేయవలెను ఆ వడ్డీ నెలయొక్క కడపటి దినమున మిగిలియున్న మొత్తముపై లెక్కింపబడును అట్టి వడ్డీని ఒకటిగాని అంతకు యెక్కువగాని వాయిదాలపై వసూలు చేయవలెను ఆ వాయిదా మొత్తం అసలు వాయిదా మొత్తం కంటె ఎక్కువ యుండకూడదు.

(IV) ఎగ్జిక్యూటివు ఆఫీసరు మరణించినపుడుగాని, లేక వాని యుద్యోగము సంతకముచేసినపుడుగాని, అడ్వాన్సులో మిగిలియున్న మొత్తము ఏదయిన వున్నయెడల దానిని వడ్డీతో సహా వెంటనే రాబట్టవలెను

## 20. సర్వీసు షరతులు .

ఈ రెగ్యులేషనులలో విధిగా చెప్పబడినంత మేరకు తప్ప ప్రభుత్వము యొక్క అధికారము క్రింద అప్పుడప్పుడు జారీచేయబడు

మూలవిధులు, (ఫండమెంటల్ రూల్సు) సర్వీసులోని వుద్యోగుల కన్వయించును

21 క్రమశిక్షణ మరియు ప్రవర్తన ·

క్రమశిక్షణ, మరియు ప్రవర్తనకు సంబంధించిన విషయములలో సర్వీసులోని యుద్యోగులు ఇన్‌స్పెక్టరుయొక్క అజమాయిషీ క్రింద నుందురు వారిలో ప్రభుత్వపు వుద్యోగులుగా నున్న యెడల వారు ప్రభుత్వోద్యోగుల ప్రవర్తనవిధులకు లోబడియుందురు. మిగిలినవారు పంచాయతీ వుద్యోగులు, నౌకర్ల ప్రవర్తన సక్రమాను సరణకు చేయబడిన విధులకు లోబడియుందురు అయితే సదరు విధులలో 1, 4 మరియు 5 వ విధులలో చెప్పబడిన "ఎగ్జిక్యూటివ్ అధికారి" అంటే తత్సంబంధమయిన రీజినల్ ఇన్‌స్పెక్టర్లనియు యితర అన్ని విధులలోను యుదహరింపబడిన "ఎగ్జిక్యూటివు అధికారి" అంటే ఇన్‌స్పెక్టరు అనియు భావించవలెను

22 శిక్షలు

(1) తగిన సరియైన కారణములకు ఇన్‌స్పెక్టరు సర్వీసులోని యుద్యోగులకు యీ క్రింది శిక్షలు విధింపవచ్చును —

(I) సెన్సూర్ (తీవ్రఖండన)

(II) ఇంక్రిమెంటుగాని, ప్రమోషనుకాని నిలుపుదల

(III) 12 వ రెగ్యులేషనులో చెప్పిన విధముకాక, సీనియారిటీ జాబితాలో క్రిందిహోదాకుదింపుట, లేక వేతన స్కేలులో క్రింది జీతమునకు దింపుట, లేక క్రిందివేతన స్కేలులోనికి దింపుట

(IV) ఆజ్ఞలయొక్క, విధులయొక్క నిర్వహణాలో నిర్లక్ష్యము వల్లగాని, లోపము వల్లగాని పంచాయతీకిగాని, ప్రభుత్వమునకుగాని ఆర్థికనష్టము కలిగినయెడల, అట్టి నష్టమును పూర్తిగాగాని, కొంతగాని జీతమునుండి రాబట్టుట

(V) బలవంతముగా సర్వీసునుండి విరమింప (రిటైరు) జేయుట

(VI) సర్వీసునుండి తొలగించుట

(vii) సర్వీసునుండి డిస్‌మిస్ చేయబడుట

(i) మరియు (ii) అంశములలో చెప్పబడిన శిక్షలు రీజినల్ ఇన్‌స్పెక్టరుచేకూడ విధింపబడవచ్చును (i) వ అంశములో చెప్పబడిన శిక్ష జిల్లాపంచాయతీ అఫీసరుచేతకూడ విధింపబడవచ్చును

వివరణము ప్రొబేషనుమీద నియమింపబడిన వ్యక్తిని ప్రొబేషను కాలములో తొలగింపుట ఈ రెగ్యులేషనుక్రింద తొలగింపుతోగాని, డిస్‌మిస్ చేయుటతోగాని సమానముకాదు

(2) పైన చెప్పబడిన (1) వ క్లాజులోని (i), (ii) మరియు (iv) వ అంశములలోని యే శిక్షనయిన నొక వుద్యోగిపై విధించునపుడు అట్టి చర్యనేల తీసికొనకూడదో సముజాయిషీ యిచ్చుటకు వానికి సదవకాశము నివ్వవలెను

(3) మిగిలిన ప్రతి యితర విషయములోను, చర్యతీసికొనవలసి వచ్చినపుడు, క్రిమినలు కోర్టులోగాని, లేక మిలిటరీ కోర్టు మార్షల్‌లోగాని శిక్షింపబడియుండుటలో నాధారముగానున్న ప్రత్యక్ష అంశములపైనట్టి చర్య తీసికొనునపుడు తప్ప, ఏ కారణముల చేత చర్యతీసుకొనబడునో యట్టి కారణములను స్పష్టముగా నేరారోపణగాగాని, నేరారోపణలుగాగాని, (చార్జీ లేక చార్జీలుగా) వ్రాతమూలకముగా నేరస్థుడుగా కనుబడు వ్యక్తికి పంపవలెను మరియు దానితో (చార్జీకి) నేరారోపణకుచెందిన ఆరోపణలు మరియు ఇంకా ఈ సందర్భములోనే విషయములు పరగణించి ఆజ్ఞలు జారీచేయబడునో నావిషయములనుకూడ వ్రాతపూర్వకముగా నతనికివ్వవలెను అతనిని సాధారణముగా కావలసిన కాల వ్యవధిలో, తనయొక్క రక్షణకు వ్రాతమూలమునిచ్చి, విచారణ (ఎంక్వైరీ) చేయవలెనో, లేక స్వయముగా సముజాయిషీ మాత్రము చెప్పుకొనునో, సూచించవలసినదిగా, చెప్పుమనవలెను నేరారోపణ చేయబడిన వ్యక్తి కోరికపైగాని, లేక తత్సంబంధమయిన అధికారి అట్లు ఆజ్ఞాపించినగాని విచారణ జరుపబడవలెను ఆ విచారణలో, ఆ వ్యక్తి ఒప్పుకొనని ఆరోపణల గురించి సాక్ష్యము యివ్వవలెను మరియు యీ సందర్భములో చార్జీ చేయబడినతడు కోరిన సాక్షులను రప్పించి, వారిచేత

సాక్ష్యము నిప్పించుటకు, సాక్షులకు క్రాసుపరీక్షచేయుటకు హక్కు కలిగియుండును కాని, ఏవయిన తగినంత బలమైన కారణములచేత, విచారణ జరుపుతున్న వుద్యోగి ఏ సాక్షినయిన పిలిపించుటకు నిరాకరించవచ్చును ఆ కారణముల నతడు వ్రాతమూలకముగా రికార్డు చేయవలెను విచారణ ముగిసినపిదప, ఛార్జీచేయబడిన వ్యక్తి, కావలసినయెడల, తన రక్షణకు యింకొక వ్రాతమూలమును యిచ్చుటకు హక్కుకలిగియుండును విచారణ జరుపబడినయెడల, అతను స్వయముగా చెప్పకొనునది వినవలయునని కోరినయెడల, అట్లతను చెప్పునది వినవలెను విచారణ క్రమముయొక్క రికార్డులో, కావలసిన సాక్ష్యము, సకారణముగా నా విచారణయొక్క ఫలితములు రికార్డు చేయబడి యుండవలెను

(11) (1) వ సబ్ క్లాజులో చెప్పబడిన విచారణ ముగిసిన తర్వాత శిక్షవిధించుటకు అధికారముగల అధికారి, యే శిక్షను విధింపవలయునను విషయములో తాత్కాలిక నిర్ణయమునకువచ్చిన తర్వాత, విచారణ జరిపిన అధికారియొక్క నివేదికను (రిపోర్టును) ముద్దాయికి (నేరారోపణ చేయబడినవానికి) యివ్వవలెను మరియు ఒక నెలకు మించకుండ, సబబైన నియమితకాలములో, అట్టి శిక్ష నెందుకు విధించరాదో సముజాయిషీ యివ్వవలసినదిగా ముద్దాయిని శాసించవలెను మరల ముద్దాయి యేదయిన విజ్ఞాపన యీ సందర్భములో సమర్పించినయెడల, తుది ఆజ్ఞలు జారీచేయుటకు ముందు దానినికూడ విచారించవలెను

(4) (2) మరియు (3) వ క్లాజులలో చెప్పబడిన షరతులు ముద్దాయి పరారిఅయిపోయినగాని, లేక అతనికి వర్తమానము పంపుట దుస్సాధ్యమయినపుడుగాని వర్తించవు పై చెప్పబడిన క్లాజులలోని విధానములను కొన్ని ప్రత్యేక సందర్భములతో, తగిన విశేష కారణములవల్ల ఉల్లంఘించవచ్చును అట్టి కారణములను వ్రాతమూలముగా రికార్డుచేయవలెను మరియు నీ విధులు సక్రమముగా అమలు చేయుట కష్టసాధ్యమయి, అట్టి త్రోసి వేతవల్ల ముద్దాయికి యెట్టి అన్యాయము జరుగకుండ నుండవలెను.

(5) నేరములు (బలమయినవి అయిన యెడల) తీవ్రమైన యెడల, విచారణ జరుగుటకు ముందు, పరిపాలనకు చిత్తమని తోచిన యెడల సర్వీసులోని యుద్యోగిని పదవినుండి తాత్కాలికము తప్పించుట (సస్పెండు చేయుట) అవసరమయిన యెడల యిన్‌స్పెక్టరు ఆరుమాసములు మించని కాలమునకు, అతనిని సస్పెండు చేయ వచ్చును

అయితే, కొన్ని ప్రత్యేక విషయములలో సస్పెండుచేసిన తేదీ నుండి ఆరుమాసములలోగా విచారణ పూర్తి కాజాలనపుడు, ప్రభుత్వపు అనుమతి ముందుగాపొంది, ఒక్కొక్కమారు ఆరుమాసములు మించకుండా నతనిని మరల సస్పెండు చేయవచ్చును. సస్పెండు చేయబడిన కాలములో నావ్యక్తికి జీతభత్యము, నెలకు ఇన్‌స్పెక్టరు శాసించిన ప్రకారను, జీతములో నాలుగవవంతు మించకుండాను, కనీసము రూ॥ 20/- లకు తక్కువ కాకుండాను యివ్వబడవలెను

## 23 అప్పీళ్ళు

(a) 22 వ రెగ్యులేషనుయొక్క (1) వ క్లాజుయొక్క (1) వ అంశములో చెప్పబడిన శిక్ష విధిస్తూ జిల్లా పంచాయతీ ఆఫీసరు జారీచేసిన ఆర్డరపై రీజినల్ ఇన్‌స్పెక్టరుకును, పై చెప్పబడిన క్లాజులోని (i) మరియు (ii) వ అంశములలోని శిక్షలలో దేనినైన విధిస్తూ రీజినల్ ఇన్‌స్పెక్టరు జారీచేసిన ఉత్తరువు మీాద ఇన్‌స్పెక్టరుకును, అదే క్లాజులోని (i) నుండి (vii) వరకు చెప్పబడిన అంశములలో నేదైన శిక్ష విధిస్తూ ఇన్‌స్పెక్టరు జారీచేసిన యుత్తరువుపై ప్రభుత్వమునకునూ, సర్వీసులోని వుద్యోగి అపీలు చేసుకొనుటకు హక్కుకలిగి యుండును

(b) అపీలుచేయు ప్రతివ్యక్తియు తన పేరుతోనే, విడిగా నట్లు చేయవలెను క్లాజు (a) క్రింద దాఖలు చేయబడు ప్రతి అపీలులోను. అపీలుచేయు నతనియొక్క ముఖ్యమైన విషయములు వాదనలు యుండవలెను కాని అందులో నగౌరవమైన, అనుచితమైన మాటలుండరాదు అట్టి ప్రతి అపీలున్ను జిల్లా పంచాయతీ ఆఫీసరుద్వారా రీజినల్ ఇన్‌స్పెక్టరుకున్ను లేక రీజినల్ ఇన్‌స్పెక్టరు

ద్వారా ఇన్‌స్పెక్టరుకున్ను, లేక ఇన్‌స్పెక్టరు ద్వారా ప్రభుత్వమున కున్ను దాఖలు చేయబడవలెను

(c) ఏయుత్తరువుపై అపీలు చేయబడుచున్నదో, అట్టి యుత్తరువు అపీలుదారునికి పంపిన తేదీ లగాయతు రెండు మాసముల లోగా నా యపీలు సమర్పింపబడని యెడల, ప్రభుత్వముగాని, ఇన్‌స్పెక్టరుగాని, లేక రీజినల్ ఇన్‌స్పెక్టరుగాని యట్టి అపీలును విచారించరు. కాని అపీలు దాఖలు చేయుటలో నెక్కువ ఆలస్యమయిన యెడల, ఆలస్యమునకు తగిన కారణము చూపించిన యెడల నట్టి యాలస్యమును మన్నించవచ్చును

## వివరణము

దీనికి సంబంధించిన వ్యక్తి పరారి అయిన యెడల లేక యే కారణముచేతనయిన నతనితో నుత్తర ప్రత్యుత్తరములు జరుపుట కసాధ్యమయిన యెడల, ఈ రెగ్యులేషనులో చెప్పబడిన రెండు మాసములు అప్పీలు చేయబడిన యుత్తరువుయొక్క తేదీనుండి లెక్కింపబడును

(b) ఇన్‌స్పెక్టరు ఏ యప్పీలునైన యీ క్రింద వివరించిన కారణములచేత గవర్నమెంటుకు పంపక నిలిపివేయ వచ్చును

(i) క్లాజు (b) లో చెప్పబడిన విధుల ననుసరించని యెడల , లేక

(ii) అంతకు పూర్వము ప్రభుత్వమువారికి సమర్పింపబడినట్టి, దానిపై నిర్ణయము జరిగినట్టి, అప్పీలులోని విషయములే, నీ యప్పీలులోనుండి, పునర్విచారణకు తగినంత కారణములు, పరిస్థితులు లేనియెడల ,

అయితే, అప్పీలు నిలపెట్టబడినట్లైన, దానికి కారణములు అప్పీలు దారునకు తెలియపర్చవలెను,

మరియు, క్లాజ్ (b) లో చెప్పబడిన విధుల ననుసరించ లేదన్న కారణము మాత్రముచేతనే యప్పీలు నిలుపు చేయబడిన యెడల, అట్టి నిలుపుదల అప్పీలుచేయు నాతనికి తెలిపిన తేదీ లగా

యతు ఒక నెల లోపుగా నెప్పుడైన నా యపీలును తిరిగి సమర్పించ వచ్చును ఆ విధుల ననుసరించి అప్పీలు తిరిగి సమర్పింపబడిన యెడల దానిని నిలుపు చేయరాదు

(e) క్లాజు (d) క్రింద నిలుపు చేయబడని ప్రతి అప్పీలును, ఇన్‌స్పెక్టరు దానిపై తన వ్యాఖ్యానముతో ప్రభుత్వమునకు పంపవలెను

(f) క్లాజు (d) క్రింద నిలుపుజేయబడిన అప్పీళ్ళ యొక్క జాబితాను, అట్లు నిలుపు చేయుటకు కారణములను, ఇన్‌స్పెక్టరు ప్రభుత్వమునకు ప్రతి అర్ధసంవత్సరము పంపవలెను

(g) ఈ రెగ్యులేషనులక్రింద సమర్పింప తగినట్టి, ఇన్‌స్పెక్టరు నిలుపుచేసినట్టి ఏ యపీలునైన ప్రభుత్వము రప్పించి, దానిపై తమకు యుక్తమని తోచిన యుత్తరువు జారీ చేయవచ్చును

(h) ఇన్‌స్పెక్టరుచే అపీలు నిలుపుదలపై అపీలు లేదు

(i) ఈ రెగ్యులేషనుల ననుసరించి, జిల్లా పంచాయతీ ఆఫీసరుగాని, రీజినల్ యిన్‌స్పెక్టరుగాని, లేక యిన్‌స్పెక్టరు గాని, ఏదైన శిక్ష విధిస్తూచేసిన యుత్తరువును, క్రమముగా, రీజినల్ యిన్‌స్పెక్టరుగాని, యిన్‌స్పెక్టరుకుగాని, లేక ప్రభుత్వముగాని, చేయని సందర్భములోకూడ, త్రిప్పు లేక మార్పు చేయవచ్చును

## 24. శేషములు

ఈ రెగ్యులేషనులలో నుదహరింపబడిన దేదియు, సర్వీసులోని యేవుద్యోగి విషయములోనైన ప్రభుత్వము న్యాయమని భావించిన విధముగా చర్య తీసుకొనుటకు వున్న అధికారమును తగ్గించినట్లు భావించరాదు

అయితే, సర్వీసులోని యే వుద్యోగి విషయములోనైన ఈ రెగ్యులేషనులు వర్తించినపుడు, ఆ రెగ్యులేషను కంటె నతనికి తక్కువ లాభకరముగానుండునట్టి యే యితరవిధముగాను చర్యతీసుకొనకూడదు.

## 25 తాత్కాలికముగా (టెంపొరరీగా) నియమితులైన వ్యక్తులకు కొన్ని విధులను అన్వయించుట

21 లగాయతు 23 వ రెగ్యులేషనులలో చెప్పబడిన సూత్రములు, సర్వీసులో 4 వ రెగ్యులేషను క్రింద తాత్కాలికముగ నియమింపబడిన వ్యక్తులకు కూడ అన్వయించును

## 26 ప్రావిడెంటు ఫండు

(1) పంచాయతీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ గా నియమితుడైన ఒక వ్యక్తికి, అట్టి నియామకమునకు ముందు అతనికి ప్రభుత్వము యొక్క, లేక జిల్లాబోర్డుయొక్క, లేక మ్యునిసిపాలిటీయొక్క, లేక పంచాయతీయొక్క సర్వీసులో హక్కులేని యెడల, స్థానిక సంస్థల ప్రావిడెంటు ఫండు విధులు వర్తించును ఆ విధులలో నేమి చెప్పబడినప్పటికి, ఏప్రిల్ 1 వ తేదీనుండిగాని, లేక అతని నియామకపు తేదీ నుండిగాని, యేది తర్వాతనో, ఆ తేదీనుండిన ప్రావిడెంటు ఫండుకు చందా కట్టవలెను

(2) స్థానిక సంస్థల ప్రావిడెంటు ఫండు విధులయొక్క 4 వ విధిలోని ఉపవిధి (3) (c) క్రిందనున్న వివరణము వర్తింప జేయుటకు గాను, ఒక పంచాయతీయొక్క ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, ఖాయముగా ఖాళీగానున్న స్థానములో పనిచేయుచున్నట్లు భావింపబడి, ఏ పంచాయతీకి అతను ఎగ్జిక్యూటివు ఆఫీసరుగా నున్నాడో ఆ పంచాయతీ యతని ప్రావిడెంటు ఫండు అకౌంటుకు అవసరమయిన పారితోషికము జమకట్టవలెను

(3) (1) వ క్లాజులో చెప్పబడిన యొక వ్యక్తి యొక్క ప్రావిడెంటుఫండుఅకౌంటును, ఏ పంచాయతీకి, అప్పుడు అతను ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా నున్నాడో, యా పంచాయతీ సంబంధించిన జిల్లాబోర్డు నిర్వహించవలెను

(4) ఒక వ్యక్తి ఒక పంచాయతీకి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ గా నియమింపబడినపుడు, అంతకు పూర్వమతను యే జిల్లాబోర్డు, లేక

మ్యునిసిపాలిటీ, లేక పంచాయతీయొక్క ప్రావిడెంటుఫండుకు చందా జమకట్టుచున్నయెడల—

(a) అతను జిల్లా బోర్డు, లేక మ్యునిసిపాలిటీ లేక పంచాయతీలో సర్వీసులోని వుద్యోగముపై నెంతకాలము హక్కు (లీవు) వుంచుకుని, దానియొక్క ప్రావిడెంటుఫండుకు సొమ్ము జమ చేయుచుండునో, అంతకాలము అతని జీతమునుండి చందా వసూలు చేసి, ఆయా విధుల ప్రకారముగా సదరు ప్రావిడెంటుఫండుకు జమ చేయవలెను, మరియు,

(b) అట్టి వుద్యోగముపై హక్కు వదులుకున్నయెడల, యే పంచాయతీకి అతను ఎగ్జిక్యూటివ్ అఫీసరుగా నున్నాడో, ఆ పంచాయతీ ప్రావిడెంటుఫండులో నతనిని చేర్చుకొని, మరియు అంతకు పూర్వమతను పనిచేయుచున్న జిల్లాబోర్డులోగాని, మ్యునిసిపాలిటీలోగాని, లేక పంచాయతీలోగాని ప్రావిడెంటు ఫండులో నేదైన మొత్తమతనికి వున్నయెడల, ఆ మొత్తము, రెండవ పంచాయతీకి చెందజేసినట్లు మార్చవలెను

(5) (4) వ క్లాజుయొక్క సబ్ క్లాజ్ (a) లో చెప్పబడిన ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుయొక్క ప్రావిడెంటుఫండు అకౌంటును ఏ స్థానిక సంస్థలోని సర్వీసులో నతను హక్కు కలిగియున్నాడో, నా స్థానికసంస్థ నిర్వహించవలెను మరియు నతనికి చెందవలసిన సొమ్మును, అతను ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగానున్న పంచాయతీ యాస్థానికసంస్థకు పంపవలెను

28 శెలవు, శెలవుభత్యముల వర్తన

(1) ఒక పంచాయతీలో ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా నియమింపబడిన వ్యక్తియొక్క శెలవు, మరియు శెలవుభత్యములు యీ క్రింది విధముగా వర్తింపజేయవలెను —

(a) అతను, ప్రభుత్వముయొక్క, లేక జిల్లాబోర్డుయొక్క, లేక మ్యునిసిపాలిటీయొక్క, లేక పంచాయతీయొక్కగాని సర్వీసులో హక్కు వుంచికొనినంతకాలము, ఆ సర్వీసుయొక్క విధులను, రెగ్యులేషనుల ననుసరించి వర్తింపజేయవలెను,

(b) అతనికి అట్టి వుద్యోగముపై హక్కు లేకున్నగాని లేక అట్టి హక్కు వదలుకున్నగాని, ప్రభుత్వేతర యుద్యోగులకు వర్తించు విధుల ప్రకారముగా నీక్రిందిరీతిగా వర్తింపజేయవలెను

(i) ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నతను నియమింపబడిన తేదీకి మూలవిధులు (ఫండమెంటల్ రూల్సు) అతనికి వర్తించునెడల నా విధులను వర్తింపజేయవలెను, మరియు

(ii) మిగిలిన అన్ని విషయములలోను ఆంధ్ర శెలవు విధులు, 1933 వర్తింపజేయవలెను

ప్రొవిసో

అయితే, ఎగ్జిక్యూటివు ఆఫీసరుగా నియమింపబడుటకుముందు, సూపరుసీడు కాబడిన పంచాయతీకి స్పెషలు ఆఫీసరుగా, ఒక వ్యక్తి యుండియున్న సందర్భములో, అతని సర్వీసు నిర్విరామముగానున్న యెడల, అట్టి స్పెషలు ఆఫీసరుగానున్న సర్వీసు, శెలవు విషయములో లెక్కింపబడును

మరియు, నిర్విరామముగానున్న మూడు సంవత్సరములలో, మొత్తం రెండు సంవత్సరములు అతను పంచాయతీ ఎగ్జిక్యూటివు ఆఫీసర్‌గా పనిచేసియున్నయెడల, ప్రభుత్వముయొక్క ఖాయపు వుద్యోగులకు వర్తించువిధులు యీక్రింది విధముగా వర్తించును

(a) ఎగ్జిక్యూటివు ఆఫీసరుగా నియమింపబడిన కాలమున మూలవిధులు (ఫండమెంటల్ విధులు-రూల్సు) వర్తించునెడల నా విధులు వర్తించును, మరియు

(b) మిగిలిన అన్ని విషయములలోను ఆంధ్ర శెలవు విధులు, 1933 వర్తించును

వివరణము .

పై రెండవ ప్రత్యేకవిధిలో (ప్రొవిసోలో) చెప్పబడిన వ్యక్తి విషయములో, ఎగ్జిక్యూటివు ఆఫీసరుగా నియమితుడగుట ముందు ఏదైన నిర్విరామమయిన సర్వీసు అతనికివున్నయెడల, ఆ ప్రత్యేక విధిలో (ఆ ప్రొవిసోలో) చెప్పబడిన రెండు సంవత్సరముల గణనకు అట్టి సర్వీసు ఎంచబడును.

(2) పంచాయతీల ఎగ్జిక్యూటివు ఆఫీసర్లకు, తాత్కాలి కపు శెలవుతప్ప (క్యాజుయల్ శెలవుతప్ప) వేు యితర శెలవునయిన మంజూరు చేయుటకు ఇన్స్పెక్టర్ చట్టరీత్యా అధికారము కలవాడు

## 28. ప్రభుత్వ సర్వీసులో నుండెడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు

ఎగ్జిక్యూటివు ఆఫీసర్గా నియమింపబడిన కాలమునకు, ఒక వ్యక్తి ప్రభుత్వములో పూర్తి వుద్యోగిగాగాని, ప్రొబేషనరుగా గాని అప్పూడు ప్రొబేషనరుగాగాని యున్నయెడల, ఫించను, ప్రావిడెంటుఫండు, మరియు శెలవుభత్యముల విషయములలో ప్రభుత్వేతర (ఫారెను) సర్వీసులలోనున్న యుద్యోగులకు వర్తించు విధులు అతనికి వర్తించును మరియు నాపంచాయతీ యీ విషయ ముల నిమిత్తమైన సొమ్మును ప్రభుత్వమునకు చెల్లించును.

వివరణము

ప్రభుత్వ సర్వీసులోనున్న నొకవ్యక్తి పంచాయతీ ఎగ్జిక్యూ టివు ఆఫీసరుగా నియమింపబడినపుడు, ప్రభుత్వేతర సర్వీసులోనున్న వారికి వర్తించువిధుల ననుసరించియున్న ఎక్కువ జీతమునకు అర్హుడు కాడు

## 29. సర్వీసు పుస్తకములు

ప్రతి ఎగ్జిక్యూటివు ఆఫీసరుకు ఒక సర్వీసు పుస్తకము నిక్రింది విధముగా నిర్వహింప బడవలెను —

(1) ప్రభుత్వముయొక్క, లేక జిల్లాబోర్డుయొక్క, లేక మ్యునిసిపాలిటీయొక్క, లేక పంచాయతీయొక్క సర్వీసులో ఉద్యో గముపై హక్కులేనట్టి ఎగ్జిక్యూటివు ఆఫీసర్లయొక్కయు, మరియు సర్వీసులో పూర్తి వుద్యోగిగా నియమింపబడిన ఎగ్జిక్యూటివు ఆఫీసర్ల యొక్కయు సర్వీసు పుస్తకములు జిల్లా పంచాయతీ ఆఫీసరుచేత,

(11) ప్రభుత్వములోగాని, మ్యునిసిపాలిటిలోగాని, జిల్లా బోర్డులోగాని, లేక పంచాయతిలోగాని, సర్వీసులో వుద్యోగముపై

హాకు —వున్న ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల యొక్క సర్వీసు పుస్తకములు తత్సంబంధమయిన శాఖాధికారిచేత

## 30. రహస్య నివేదికలు

ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల గురించిన అర్థ సంవత్సరపు రహస్య నివేదికలు, తత్సంబంధమయిన జిల్లా పంచాయితీ అఫీసరు తయారు చేసి, రీజినల్ ఇన్‌స్పెక్టరుకు పంపవలెను వాటిని రీజినల్ ఇన్స్పెక్టరు, తనకు తోచిన వ్యాఖ్యానముతో ఇన్స్పెక్టరుకు భద్రపరచుటకు పంపవలెను

## ఎనెక్సర్ I

### A భాగము

షెడ్యూల్డు తరగతులు

(1 వ రెగ్యులేషనులో (10) వ నిర్వచనముచూడుము

| | | | |
|---|---|---|---|
| 1 | ఆది ఆంధ్ర | 17 | చండాల |
| 2 | ఆది ద్రవిడ | 18 | చెరుమను |
| 3 | ఆదికర్ణాటక | 19 | దండాసి. |
| 4 | ఆజిలా | 20 | దేవేంద్రకులతను |
| 5 | ఆరుణంతాతియరు | 21 | డోమ్‌లేక డొంబారా పైడి పానో |
| 6 | బైరా | 22 | చాసి లేక హడ్డి, రెల్లి సాచండి |
| 7 | బకుడా | 23 | గొటగలి |
| 8 | బండి | 24 | గొడారి |
| 9 | బరికి | 25 | గొడ్డ |
| 10 | బావురి | 26 | గొసంగి |
| 11 | బెల్లారా | 27 | హస్ల |
| 12 | బ్యాగరి | 28 | హొలేయ |
| 13 | చచ్చటి | 29 | జగ్గలి |
| 14 | చక్కిలియను | 30 | జంబువులు |
| 15 | చలవాది | | |
| 16. | చామర్ | | |

31 కదన్
32 కల్లాడి
33 కన్నక్కన్
34. కరింపాలన్
35 కొండాలో
36 కూస
37 కొరగ
38 కుడుబి
39. కురుంబన్
40 కురవర్
41 కురిచ్చన్
42 మేదరి
43 మాదిగ
44 మైల
45 మాల (ఏజన్సీ మాలలుకలిపి)
46 మాలదాసు
47 మాలసార్
48 మాతంగి
49 మావిలన్
50 మోగర్
51 ముచ్చి
52 ముదల
53 నాలకేయ
54 యానాది
55 పగడాయి
56 పైండా
57 పాకి
58 పల్లన్
59 పంగాడా
60 పమిడి
61. పానమ్
62 పంచమ
63 పన్నియాండి
64 పరయ్యన్
65 పరవన్
66 పులయన్
67 పుతిరాయ్ వానన్
68 రానేయార్
69 సమగర
70 సంబర్
71 సపారి
72 సెమ్మన్
73 తోటి
74. తిరువళ్లువార్
75 వల్లువన్
76 వాల్మీకి
77 వెట్టువన్

## B భాగము

### పెద్యాల్లు జాతులు

( I వ రెగ్యులేషనులోని (II) వ నిర్వాచనము చూడుము )

1 అరనాదన్
2 బగట

3 భొత్తదాస్-బోడో, భొత్త్రాడ ముదియా భొత్త్రాడ మరియు సానిభొత్త్రాడయులు

4 భూమియులు-భూరిభూమియా మరియు భోడోభూమియా

5 చెంచు

6 గడబ-బోడగడవ, చెర్లంగడవ చెర్లంగడబ, ఫ్రాంజిగడబ, బోడియ గడబ, ఒలారోగడబ, పంగిగడబ, ప్రాంగగడబ

7 గోండి మోడ్యాగోండ్ మరియు రాజోగోండ్

8 గాడులు-బాటో భరిత్యా, ధోహోకొరియా, హాటో, జటాకో, మరియు జోరియా

9 కోసల్యా గాడులు - బోసో-తొరియా గాడులు, చిట్టి గాడులు, దూడుకమారావో, లడియగాడులు, మర్రియు పుల్లో సారియ గాడులు

10 మగతగాడులు, బెరియ గాడులు బూడు మగత, దొంగా యత్ గాడు లద్యగాడు, పూన మగత మరియు సానమగత

11 హాల్వా

12 జాదపూర్

13 జటాపులు

14 కమ్మర

15 కట్టునాయకన్

16 ఖట్టిలు, ఖట్టి, కొమ్మరావో, లోహర

17 కోడు

18 కొమ్మార్

19 కొండదొరలు

20 కొండకాపులు

21 కొండరెడ్డిలు

22 కొండదేశ్య, కొండ డోంగ్రియ కొంధలు, కుట్టియ కొంధలు, టికిరియ కొంధలు, మరియు యేనేటి కొంధలు

23 కోట

24 కోటియబర్తిక బెంతో ఒరియా ధూళియా లేక దూలియా, హోల్వపాయకో

25. కోయ లేక గాడ్, వాటి యొక్క ఉపశాఖలు, రాజా లేక రాషకోయలు, లింగధారి కోయలు (సామాన్య) మరియు కొట్టుకోయలు,

26 కుడియా

27 కురుమానులు

28 మన్నదొరలు

29 మాని

30 ముఖదొర, నూకదొర

31 మురియా

32 పైగాగపు

33 పలాసి

34 పనియన్

35 పోర్జలు, బోడోబండ, దారువ, దుదువా, జోడియా, ముందిలి పంగు, పైడి మరియు నాలీయా

36 రెడ్డిదొరలు

37 సావరులు, కాపుసావరులు, ఖుహుతోసావరులు మరియు మాలియ సావరులు

38 షోలగ

39 తోడా

40 లక్కదీవి మినికాయ్‌లోను, అమిందీవి దీవులలోను నివసించువారు, మరియు వారి తలిదండ్రులు ఆ దీవులలో పుట్టినవారు

## ఎనెక్సర్ II

## వెనుకబడిన తరగతులు

(1 వ రెగ్యులేషనులోని (3) వ నిర్వచనము చూడుము)

1 అగముడయినులు (తులువ వెల్లాలతో సహా)

2 అగస

3 అబలకరన్

4 అన్నదాన్

5 ఆరెమరాతీ

6 ఆర్య (దక్షిణకనరా)

7 అటగర

8 ఆర్చుకట్లవందు

9 బెడగ

10 బలోలిక

11 బెస్త

12. బండారి

13 బిల్లవ

14 బిస్నాయ్

15 బోయ

16. బొందిలి

17. చప్తేగర

18 బాటాది (చట్టాడ శ్రీవైష్ణవ)

19 దాసరి

20 దేవాదిగ

21. దేవాల్కర్

22 దేవాంగ

23 దకాడ

24 దొమ్మర

25 దూదేకుల

26 ఏనాది

27 గల్లర కొంకణి

28 గండ్ల

29 గంగవారులు

30 గణిక (నాగవంశము సహా)

31 గట్టి

32 గవర

33. గొరబ

34. గోండో

35 గౌడ (గమళ్ల మరియు కలాలితో)
36 గుడిగర
37 హెగ్డె
38 ఈడిగ (శెట్టిబలిజతో సహా)
39 ఇసాయ్, వెల్లాలారీ లేక మేలకరార్,
40 ఇల్లువన్ (ఎఝువన్)
41 ఇరులులు
42 జక్కులులు (గుంటూరు జిల్లా)
43. జండార
44 జంగం
45 ఝెట్టి
46 జోగి
47 కబ్బేర
48 కడియర్
49 కదుపట్టర్ (మలబార్)
50 కయికోలర్ (సెంగుతూర్)
51 కళావంతులు
52 కాళింగి
53 కళ్లర్
54 కమ్మలనులు (కంసాలులు విశ్వబ్రాహ్మణులు, మరియు విశ్వకర్మలు)
55. కని లేక కనియూర్ మరియు కనీసు లేక కనియార్ పనికర్
56 కన్నడియర్
57 కవుతియన్
58 కోలసి
59 కార్వి
60 ఖత్రి
61 కొహదల
62. కొలారిలు లేక మునియానిలు
63 కొప్పల వెలమలు
64. కొరచ
65 కొటేయూర్ (పెరగర క్షత్రియులు-దక్షిణ కనరాలో)
66. కులలా
67. కురుబ
68 కురంబ
69. లబ్బైయి
70. లంబాడీలు
71 మడివల
72. మదుగర్ లేక మేదవార్
73. మహేంద్ర (మేదవ)
74 మరారా (బ్రాహ్మణేతరులు)
75 మలైయాలి
76 మలయర్ (మలబార్)
77 మాలె
78 మంగల
79. మప్పిల

80 మరాఠీ (దక్షిణ
కనరా జిల్లా
81. కార్వార్
82 మరుతువార్
83 మేలకుడి లేక
కుడియర్
84 మోడిబండ
85 మొగవీర
86 మోయిలి
87 మొరియాగర్
88 ముదువ
89 ముఖారి
90 ముక్కువన్ లేక
ముకయన్ అనే
మొగయన్ (బోవి
లతో సహా)
91 ముత్రాచ
92 ముత్తిరియన్
93 నాగరం
94 నక్కాల
95 నల్కేదయ
96 నామ్‌దేవ్ మహారటా
97. ఒడ్డెన్ (డోంగా)
98 వడ్డె (వొడ్డె లేక
వడ్డె లేక వొడాయ్)
99 వడియా
100 ఓయియులు
100 వమనైటో
102 ఒరియా
103 పడయాచి (విల్ల
యన్‌కుప్పమ్)
104 పల్లి
105 పాముల
106 పంగడికర
107 పన్నియార్ లేక
పన్నయార్
108 పరకవకులం
(సురితిమన్ మల
యమన్, నాతమన్,
ముప్పనార్ మరియు నైనార్
109 పాతుల్‌కరర్
100 పట్టనవాన్
111 పెంటియులు
112 పెరికి
113 పెరువన్నన్
114 పిచ్చిగుంటి
115 పొరయ
116 పుల్లువన్
117 పూసల (పూసలవాడు)
118 రాజపూర్
119 రెడ్డి (గంజాం)
120 దోణులు
121 సాధుచెట్టి (తెలుగుచెట్టి
మరియు 24 మనాయ్
చెట్టితో సహా)
122 సాలియన్
123 సేడన్
124 పరవతరాజు

125 సెనైతలైవార్ (సైవెకు నాయక్)
126 సెట్టిబలిజ (విశాఖపట్టణం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి మరియు కృష్ణా జిల్లాలలోని)
127 సివియార్
128 సౌరాష్ట్ర
129. శ్రీశాయన
130 సుగాలీలు
131 తాతపు
132 తెలుకుల
133 తెగట వీరక్షత్రియ
134 తెలువ నాయికర్ మరియు వెట్టలకర నాయికర్
135 తెరియన్
136. తూరుపుకాపులు
137. తిగల (తిగియ)
138 తొండమాన్
139 రజక
140 ఉప్పర
141 ఉరల్ గౌండర్
142 వాడబలిజ (గంజాం, విశాఖపట్నం జిల్లాలు)
143 వాడువన్ (వాడుగన్)
144 వక్కలిగ
145 వాలేయన్
146 వన్నియార్
147 వన్నమ్
148 వన్నియకుల క్షత్రియ (తమిళ జిల్లాలలో)
అగ్నికుల క్షత్రియులు (తెలుగు జిల్లాలలో)
149 వలకటలవర్
150 వెలుతాడన్
151 వీరకోడి వెల్లాలర
152 వాతిలు
153 యాదవ
154. యెరుకుల
155 షెడ్యూల్డుతరగతుల నుండి క్రీస్తుమతమునకు మారిన వారుమారినవ్యక్తులుమాత్రమే

## ఎనెక్సర్ III

(6 వ రెగ్యులేషనులో చెప్పబడినది)

1 ఆంధ్ర ప్రభుత్వముయొక్క సెకండరీ స్కూల్ లీవింగ్ సర్టిఫికేట్ పబ్లిక్ పరీక్షలో ప్యాసయి, కాలేజీలో చదువుటకు అర్హత లేక రాష్ట్రప్రభుత్వముయొక్క మినిస్టీరియల్ సర్వీసుకు అర్హతనిచ్చు కనీస విద్యాప్రవీణత

2 ఇండియన్ ఆర్మీ స్పెషల్ సర్టిఫికేట్ ఆఫ్ ఎడ్యుకేషన్.

3 ఇండియన్ నేవియొక్క హైయర్ ఎడ్యుకేషన్ టెస్టులో ప్యాసు

4 ఆంగ్లో - వెర్నాక్యులర్ స్కూల్‌లీవింగ్ సర్టిఫికేట్ (బర్మా) పరీక్షలో ప్యాసు (యూనివర్సిటీలో చదువుటకు అర్హతతో)

5 బర్మా హైస్కూల్ ఫైనల్ పరీక్షలో ప్యాసు (యూనివర్సిటీలో చదువుటకు అర్హతతో)

6 బొంబాయిలోని శ్రీమతి మతిబాయ్ దామోదర్ థేకర్స్ ఇండియన్ వుమెన్స యూనివర్శిటీయొక్క ఎంట్రెన్స్ (ప్రవేశ) పరీక్షలో ప్యాసు

7 రంగూన్ యూనివర్సిటీయొక్క మెట్రిక్యులేషన్ పరీక్షలో ప్యాసు

8 ట్రావెన్కూరులోని యింగ్లీషు స్కూల్ లీవింగ్ సర్టిఫికేట్ పరీక్షలో ప్యాసు (1949 నుండి అమలులోనున్న నూతన సిలబస్ క్రింద)

9 బొంబాయి ప్రభుత్వముచేత (క్రొత్తస్కీము 1951, క్రింద) నడుపబడుచున్న సెకండరీస్కూల్ లీవింగ్ సర్టిఫికేటు పరీక్షలో ప్యాసు అయితే, ఆ పరీక్షలో ప్రతివిషయములోను (సబ్జక్టులో)వచ్చిన మార్కులశాతము, ఆంధ్ర సెకండరీ స్కూల్ లీవింగ్ సర్టిఫికేట్ పరీక్షకు నిర్ణయింపబడిన షెడ్యూలులోని అదే విషయముయొక్క మార్కుల శాతముతో సమముగాగాని, లేక అంతకు ఎక్కువగాగాని యుండవలెను

10 ఆంధ్ర ప్రభుత్వపు అధికారముక్రింద జారీయబడిన, పూర్తిఅయిన యూరోపియన్ స్కూలు లీవింగ్ సర్టిఫికేట్

11 రాష్ట్రములోని యూనివర్సిటీయొక్క మెట్రిక్యులేషన్ పరీక్షలో ప్యాసు

సెక్షన్ 28 (5) క్రింద, ఎగ్జిక్యూటివు ఆఫీసర్లకొరకు నిర్దేశింపబడిన కేంద్రనిధి (సెంట్రలుఫండ్) సంబంధించిన విధులు

(జి. ఓ నెం 1116, లోకలు అడ్మినిస్ట్రేషన్ తేదీ 4-6-1951)

(జి. ఓ నెం 2476, లోకల్ అడ్మినిస్ట్రేషన్, తేదీ 27-12-1951)

## విధులు.

## ప్రభుత్వోద్యోగులు కాని కార్యనిర్వాహక ఆఫీసర్లకు పంచాయతీలు చెల్లించవలసిన వంతు పైకములు

1 కార్యనిర్వాహక ఆఫీసరుగా ఒక వ్యక్తినియమింపబడి యున్న బాపతు పంచాయతీ, ఏ మ్యునిసిపాలిటీ లేక జిల్లాబోర్డు లేక పంచాయితీయొక్కయైన నౌకరీకి చెందిన యే ఉద్యోగములోనైన లీవుహక్కును కలిగియున్న పక్షమున అది కలిగియుండు నంతవరకును, ఈ క్రింద వంతు పైకములను చెల్లించవలెను —

(a) అతని శెలవు బత్తాలకుగాను అప్పుడప్పుడు ఆయన పుచ్చుకొనుచున్న జీతములో నూరింట ప్రంద్రెండున్నర వంతులు, అయితే 1933 వ సం॥పు మదరాసు సెలవు విధులచే పరిపాలింపబడు వ్యక్తుల సందర్భములో జీతములో నూటికి 11 వంతులు మాత్రము చెల్లింపబడవలెను , మరియు

(b) అతనియొద్దనుండి రాబట్టుకొనబడిన చందాల సందర్భములో సంబంధించిన మునిసిపాలిటీ లేక జిల్లా బోర్డు లేక పంచాయతీ యొక్క ప్రావిడెంటుఫండు విధుల ననుసరించి చెల్లించవలసిన వంతు పైకమునకు సమానమైన ఒక మొత్తము లేక ఆయన ఏ ఉద్యోగము సందర్భములో లీవు హక్కును కలిగియున్నారో అట్టిసందర్భములో సివిల్ సర్వీస్ రెగ్యులేషనులయొక్క 802 వ అనుచ్ఛేదముయొక్క నిబంధనలక్రింద ప్రభుత్వమునకు పెంఛనుకై వంతు పైకము చెల్లింపబడు పక్షమున అట్టి వంతు పైకమునకు సమానమైన మొత్తము

(c) అతని శెలవు జీతమునకు యివ్వబడు చందాలో 8-1/3 శాతనువంతున లెక్కించిన మొత్తమును, శెలవులో నున్నపుడు అతని ప్రావిడెండుఫండుకు జనుకట్టుటకుగాను యివ్వబడవలెను

2 కార్యనిర్వాహకోద్యోగికి లీవ్ హక్కుగల స్థానిక సంస్థ, 1 వ విధిలో నిర్దేశింపబడిన వంతు పైకములను పొందవలెను. మరియు ఆయన ఏ పంచాయతీకి కార్యనిర్వాహ కోద్యోగియో ఆ పంచాయతీ సంబంధించిన స్థానిక సంస్థకు వంతు పైకములను చెల్లించవలెను.

3 ప్రభుత్వోద్యోగులు కానివారున్ను, లేక మ్యునిసి పాలిటీలోగాని, జిల్లాబోర్డులోగాని, లేక పంచాయతీలోగాని వాటి సర్వీసులో హక్కులేని వారుగాని లేక హక్కును వదలుకున్న వారు గాని, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లుగా నున్న సందర్భములో, వారు శెలవులో నున్నపుడు వారియొక్క శెలవుజీతము కొరకును, ప్రావిడెంటు ఫండుకు వంతుపైకము చెల్లించుటకును కేంద్రనిధి (సెంట్రల్ ఫండ్) ఒకటి వుండవలెను, అట్టి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లయొక్క సర్వీసు పుస్తకములున్ను, శెలవు అకౌంట్లును ఇన్స్పెక్టరుచే నిర్వహింప బడవలెను అట్టివ్యక్తి ఏ పంచాయతీలో ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా నియమింపబడినాడో, ఆ పంచాయతీ, 1 వ విధియొక్క (a) మరియు (c) క్లాజులలో చెప్పబడిన వంతుల ప్రకారము, అతనియొక్క శెలవు జీతముకొరకు, మరియు ప్రావిడెంటు ఫండు చందాకొరకు కేంద్రనిధికి ప్రతినెల పైకము చెల్లించవలెను

4 కేంద్రనిధి ఇన్స్పెక్టరుచేత నిర్వహింప బడవలెను 3 వ విధక్రింద వసూలుకాని బాకీలు ఇన్స్పెక్టరుచేత నిర్ణయించబడి, సంబంధించిన పంచాయతీచేత కేంద్రనిధికి జమ చేయబడును

5 ఒక వుద్యోగి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా పనిచేసి ఆర్జించిన శెలవునకు శెలవుజీతమును, అట్టి శెలవు సందర్భములో 3 వ విధి ప్రకారము వసూలుచేయబడిన చందావున్నపుడు, కేంద్ర నిధికి జమకట్టవలెను అయితే, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా నియమింపబడుటకు పూర్వము యేస్థానికి సంస్థలో పనిచేసి, శెలవుజీతము నార్జించెనో, ఆ సంస్థ యీ శెలవుజీతమును భరింపవలెను మరియు, కేంద్రనిధి నిర్మాణమయిన తర్వాత నతడేదయిన శెలవు తీసుకున్నచో, యే శెలవు విషయములో కేంద్రనిధినుండి శెలవుజీతము నియ్యవలసిన బాధ్యతయున్నదో, అట్టి శెలవంతయు ఖర్చు అగువరకు, ఆ శెలవు జీతమును కేంద్రనిధినుండి యివ్వవలెను రెండుగాని అంతకు యెక్కువగాని స్థానిక సంస్థలలో, ఒక వుద్యోగి ఎగ్జిక్యూటివ్ ఆఫీ సరుగా నియమితుడగుటకు పూర్వము పనిచేసియుండిన యెడల కేంద్రనిధినుండి శెలవుజీతము యివ్వవలసిన శెలవంతయు వ్యయ

మయిపోయినయెడల, తరువాత శెలవు జీతమును, అతను పనిచేసిన సంస్థలు, తుది మొదట క్రమములో భరించవలెను

6. మద్రాసు శెలవు విధులు, 1933, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుకు వర్తించిన యెడల, ఖర్చు క్రమము యీ క్రింది విధముగా నుండవలెను.—

(a) కేంద్రనిధి యాధిపత్యముక్రింద ఆర్జింపబడిన శెలవు జీతము భరించుటకు పూర్వము, అతనిని కేంద్రనిధికి ప్రవేశపెట్టి నప్పటికి అతడార్జించిన శెలవు ముందుగా వ్యయము చేయవలెను. ఇందుకొరకు కేంద్రనిధికి అతనిని ప్రవేశపెట్టు కాలమునకు అతనికి వున్న ఆర్జిత శెలవుయొక్క జీతమును, అతను యిదివరలో పనిజేసిన స్థానికసంస్థలు, అతను పనిచేసిన క్రమములో భరించవలెను.

(b) ఎగ్జిక్యూటివ్ ఆఫీసరును కేంద్రనిధికి ప్రవేశపెట్టిన తర్వాత, అత డేవిధమయిన శెలవు తీసుకున్నప్పటికి ఆ శెలవు జీతమును కేంద్రనిధి భరించవలెను

7 పంచాయతీకికాని, జిల్లాబోర్డుకుగాని, మ్యునిసిపాలిటీకిగాని, లేక కేంద్రనిధికిగాని 1 వ విధిలో నుదహరింపబడిన ప్రకారము చెల్లింపబడిన చందాలను వాపసుకోరుటకు హక్కులేదు.

సె 29 కార్యనిర్వాహకోద్యోగి

(a) పంచాయతీయొక్క లేదా దాని తాలూకు యే కమిటీ యొక్కయైన మీటింగులలో హాజరై వాటియొక్క చర్చలలో పాల్గొనుటకు హక్కును కలిగియుండవలెను అయితే ఎట్టి తీర్మానమును ప్రవేశపెట్టుటకుగాని ఓటుచేయుటకుగాని, హక్కును కలిగి యుండకూడదు.

(b) పంచాయతీయొక్క లేదా దాని తాలూకు యే కమిటీ యొక్కయైన యే మీటింగుకుగాని అధ్యక్షతవహించు ఉద్యోగివలన హాజరగునట్లు కోరబడినయెడల హాజరు కావలెను.

## కార్యనిర్వాహక అధికారియొక్క అధికారములును, విధులును

### సె. 30 కార్యనిర్వాహక అధికారి-

(a) పంచాయతీయొక్క తీర్మానములను అమలుజరుప వలెను ,

అయితే ఒక తీర్మానము చట్టసమ్మతిగా సాదరు చేయబడ లేదని లేక ఈ యాక్టుచే నియ్యబడిన అధికారములకు అతీతమైయున్న దని లేక దానిని అమలు జరిపిన యెడల మానవప్రాణము లేక ఆరో గ్యము లేక ప్రజాభద్రతకు బహుశః అపాయము కలుగునని ప్రెసి డెంటు అభిప్రాయపడునెడల కార్యనిర్వాహకోద్యోగి ఈ విషయ మును గవర్నమెంటుకు తెలుపవలెను వారి తీర్మానము ఆఖరై నదిగా నుండవలెను ,

(b) పంచాయతీయొక్క యావన్మంది ఉద్యోగులమీదను నౌకరులమీదను అధికారమును కలిగియుండవలెను ,

(c) ఈ ఆక్టువలన లేదా దీని ననుసరించికార్యనిర్వాహక అధికారికి ప్రత్యేకముగా విధింపబడిన లేదా కలుగజేయబడిన విధుల నన్నిటిని నెరవేర్చవలెను మరిన్ని అధికారముల నన్నిటిని చెలా యించవలెను మరిన్ని యీ ఆక్టుచే లేదా దీని ననుసరించి విధింప బడిన యావత్తు నిర్బంధములకును, షరతులకును లోబడి యీ ఆక్టు యొక్క నిబంధనలను అమలుజరుపు కార్యము నిమిత్తము కార్య నిర్వాహక అధికారమును చెలాయించవలెను మరిన్ని వాటి ఉద్దేశ ములను క్రమముగా నెరవేర్చుటకు ఆయన ప్రత్యక్షముగా బాధ్యుడై యుండవలెను

సంపాదకుని సూచిక

సెక్షను 30 (ఎ) యొక్క ప్రత్యేకరక్షణక్రింద (ప్రొవిసొక్రింద) ప్రభుత్వము యొక్క అధికారములు ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్‌కు దత్తత చేయబడినవి. (వప్పగించబడినవి)

(జి. ఓ. నెం 1118, లోకల్ అడ్మినిస్ట్రేషన్, తేది 4-6-1951)

సె. 31 అవసర సందర్భములలో, కార్యనిర్వాహక అధికారి పంచాయతీయొక్క అంగీకారము కావలసియున్నట్టియు ప్రజాభద్రత కొరకు ఏ పనినిగాని వెంటనే నెరవేర్చుట లేదా ఏ కార్యముగాని వెంటనే చేయుట అతని అభిప్రాయములో అగత్యమైయుండునో అట్టి పనిని దేనినయిన నెరవేర్చునట్లును లేక అట్టి కార్యమును దేనినైన చేయునట్లును వుత్తరువు చేయవచ్చును మరిన్ని అట్టిపనిని నెరవేర్చుటలో లేక అట్టి కార్యమును చేయుటలో అయ్యేడి ఖర్చులను పంచాయతీ నిధినుండి చెల్లించునట్లు ఆజ్ఞాపించవచ్చును

కాని—

(a) ఏదేని ప్రత్యేకమైన పనిని నెరవేర్చడమునుగాని ఏదేని ప్రత్యేక పనిని చేయుటకుగాని నిషేధించు పంచాయతీయొక్క ఏదేని వుత్తరువునకు వ్యతిరేకముగా ఈ సెక్షను ననుసరించి ఆయన వ్యవరించకూడదు, మరిన్ని—

(b) ఈ సెక్షను ననుసరించి తీసికొనిన చర్యను, దానికి గల కారణములను ఆయన పంచాయతీకి దాని మరుసటి మీటింగులో తెలుపవలెను

సె 32 ఇన్‌స్పెక్టరు సామాన్య లేదా ప్రత్యేక వుత్తరువు ద్వారా పంచాయతీయొక్క హెల్తు ఆఫీసరును లేదా అట్టి ఆఫీసరు ఎవరును లేనియెడల జిల్లా హెల్తు ఆఫీసరును, అట్టి వుత్తరువులో నిర్దేశింపబడగలట్టి విస్తీర్ణములో ఈ ఆక్టు ననుసరించి కార్యనిర్వాహక అధికారికిగలట్టి పనులను, అట్టి నిర్బంధములకును, షరతులకును, అట్టిపై విచారణకును, రివిజనుకును (సవరింపుకును) లోబడి నెరవేర్చునట్లు అధికారము నియ్యవచ్చును

సె 33 నిర్ణయింపబడగల నిర్బంధనములకును పై అధికారమునకును లోబడి, కార్యనిర్వాహక అధికారి వ్రాతమూలకమైన వుత్తరువుద్వారా తన పనులలో వేటినైన—

(1) ఆయన ప్రెసిడెంటు అయిన పక్షమున వైసు ప్రెసిడెంటుకును, వైసు ప్రెసిడెంటు లేనపుడు ఏ యితర సభ్యునికైన,

(11) ఆయన ప్రెసిడెంటు కానియెడల, ప్రెసిడెంటుకు, ప్రెసిడెంటు లేనపుడు వైసు ప్రెసిడెంటుకు, మరియు ప్రెసిడెంటు, వైసు ప్రెసిడెంటు ఇద్దరు లేనపుడు ఏ యితర సభ్యునికైన అప్పజెప్పవచ్చును

అట్లు అప్పగించబడిన ఎట్టి పనులనైన చెలాయించుట లేదా నెరవేర్చుట కార్యనిర్వాహక అధికారి నిర్ణయించగల నిర్బంధమునకును, షరతులకును లోబడియుండవలెను మరిన్ని అది ఆయన యొక్క పై అధికారమునకును రివిజనుకునుగూడ లోబడి యుండవలెను

33 వ సెక్షను క్రింద విధులు

కార్యనిర్వాహక వుద్యోగియొక్క పనులను అప్పగించుట

(జి ఓ నెం 520 ఎల్ ఎ తేదీ 24-3-51)

1 ప్రభుత్వమువారు, ఇన్స్పెక్టరు, లేక పంచాయతీయిచ్చిన ఏ ఆజ్ఞలకైన లేక విధించిన ఏ నిర్బంధములకైన లోబడి కార్యనిర్వాహక వుద్యోగి, లిఖితపూర్వకమైన వుత్తరువుద్వారా క్యాజుయల్ లీవు మీద నున్నపుడెల్ల లేక తానుండు స్థలమును వదలిపెట్టినపుడెల్ల లేక అతని విధులను ఇతర విధముగా చేయలేక పోయినపుడెల్ల తన విధులను దత్తత చేయవచ్చును

2 అట్లు అప్పజెప్పుటతో బాటు, అవసరమైన యెడల, మామూలు పని పరిష్కారము కొఱకు వలసిన సలహాల నియ్యవచ్చును

3. ఈ విధుల క్రింద చేయబడిన అప్పగింతకు సంబంధించి ప్రతి వుత్తరువు, అనుబంధరూపమైన సలహాలు ఏవైన నున్నయెడల వాటితో సహా సంబంధించిన ప్రెసిడెంటుకు, పంచాయతీకి, జిల్లా పంచాయతీ ఆఫీసరుకు వెంటనే తెలియచేయబడవలెను

సిబ్బంది

సె 34 (1) (2) వ సబు సెక్షను క్రింద చేయబడిన విధులకు లోబడి కార్యనిర్వాహకోద్యోగి తప్ప ప్రతి పంచాయతీయొక్క ఇతర

ఆఫీసర్లు, నౌకర్ల సంఖ్యను, హోదాలను, గ్రేడులను వారికి చెల్లించ వలసిన జీతములను, రుసుములను, అలవెన్సులను ఇన్‌స్పెక్టరు నిర్ణయించవలెను మరియు వారు వాటిని మార్చవచ్చును

అయితే ఒక అవసర సందర్భములో కార్యనిర్వాహక అధికారి నిర్ణయింపబడ గలట్టి విధులకులోబడి, అదనపు ఉద్యోగులను, నౌకర్లను తాత్కాలికముగా పనికి నియమించవచ్చును

(2) కార్యనిర్వాహకోద్యోగులు కానట్టి పంచాయతీల యొక్క ఇతర ఉద్యోగులను, నౌకర్లను నియమించగల అధికారులను గురించిన, అట్టి ఉద్యోగుల యొక్కయు, నౌకర్ల యొక్కయు తరగతి వారీ విభజనను, చేర్చుకొను పద్ధతులను, జీతములను, అలవెన్సులను, క్రమశిక్షణమును, నడవడికను, నౌకరీ షరతులను గురించిన విధులను చేయుటకు గవర్నమెంటువారు అధికారమును కలిగియుండవలెను

అట్టి విధులు కార్యనిర్వాహకోద్యోగులు కానట్టి పంచాయతీల యొక్క యితర ఏ తరగతి ఉద్యోగులను గాని లేదా నౌకర్లనుగాని రాష్ట్రమున కంతటికి ఒక ప్రత్యేక సర్వీసుగా ఏర్పాటుచేయుటకు నిబంధించవచ్చును

(3) రెండు లేదా అంతకంటె యెక్కువ పంచాయతీలు నిర్ణయింపబడగల విధులకులోబడి ఆ రెండింటికి లేదా వాటి అన్నిటికి ఒకే స్వభావముగల ఎట్టి అధికారములనుగాని, విధులనుగాని చెలాయించుటకు లేదా నెరవేర్చుటకు ఒకే ఉద్యోగిని లేదా నౌకరును నియమించవచ్చును మరియు విధులచే ఈ విషయమున అధికార మియ్యబడిన ఏ అధికారిగాని అట్లు కోరునెడల నియమించవలెను

(4) ఈ ఆక్టులో, 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు మునిసిపాలిటీల 5 వ ఆక్టులో లేదా 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు బోర్డుల ఆక్టులో ఏదియున్నను దానితో నిమిత్తములేకుండ పంచాయతీ యొక్క ఎట్టి ఉద్యోగినిగాని లేదా నౌకరునుగాని (కార్యనిర్వాహకోద్యోగితో సహా)—

(i) ఇన్‌స్పెక్టరు యే యితర పంచాయతీయొక్క కొలువుకుగాని ట్రాన్స్ఫరు చేయవచ్చును.

(ii) గవర్నమెంటువారు, 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు బోర్డుల 14 వ ఆక్టు ననుసరించి ఏర్పాటుచేయబడిన ఏ జిల్లా బోర్డుయొక్కయైన కొలువుకు లేదా 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టు ననుసరించి ఏర్పాటు చేయబడిన ఏ మునిసిపాలిటీయైన కొలువుకు ట్రాన్స్ఫరు చేయవచ్చును,

అయితే (కార్యనిర్వాహకోద్యోగి కానట్టి యితర) ఏ ఉద్యోగి గాని లేదా నౌకరుగాని—

(a) ఈ సబు సెక్షనుయొక్క (i) వ క్లాజు క్రిందికి వచ్చు విషయములలో సంబంధముగల పంచాయతీలయొక్క కార్య నిర్వాహక అధికారులతో, మరిన్ని

(b) ఈ సబు సెక్షనుయొక్క (ii) వ క్లాజు క్రిందికి వచ్చు విషయములలో సంబంధముగల జిల్లా బోర్డుతోను లేదా మునిసిపలు కౌన్సిలుతోను పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధి కారితోను ఆలోచించిన మీదట తప్ప అట్లు ట్రాన్స్ఫరు చేయబడ కూడదు

ఈ సబు సెక్షను ననుసరించి ట్రాన్స్ఫరుచేయు ఏ అధికారి గాని అట్టి ట్రాన్స్ఫరును క్రమముగా అమలు జరుపు కార్యము నిమిత్తము అవసరమని అది అభిప్రాయపడగల సామాన్య లేదా ప్రత్యేక ఆజ్ఞలను జారీచేయవచ్చును

(5) ఈ క్రింది విషయములలో ఇన్‌స్పెక్టరు పంచాయతీ నుండి, కార్యనిర్వాహకోద్యోగి కానట్టి పంచాయతీయొక్క యే యితర ఉద్యోగికైన లేదా నౌకరుకైన చెల్లింపబడు జీతమును, అల వెన్సులను పూర్తిగాగాని గవర్నమెంటువారు సామాన్య లేదా ప్రత్యేక ఉత్తరవు మూలముగా నిర్ణయించగలట్టి వాటిలోని దామాషాగాను మరిన్ని ఆయనయొక్క లీవు అలవెన్సుకుగాను, పింఛనుకుగాను, ప్రావిడెంటు ఫండుకుగాను గవర్నమెంటువారు అట్లు

నిర్ణయించగలట్టి వంతు పైకమును రాబట్టుకొనవచ్చును ఆ విషయము లేవనగా —

(a) అట్టి ఉద్యోగి లేదా నౌకరు గవర్నమెంటువారిచే పంచాయతీ కొలువుకు నియమింపబడి యుండినప్పుడు, మరిన్ని

(b) అట్టి ఉద్యోగి లేదా నౌకరు, సర్కారు నౌకరుగా నున్నప్పుడు

(6) పంచాయతీయొక్క యావన్మంది ఉద్యోగులును, నౌకరులును కార్యనిర్వాహక అధికారియొక్క తాబేదారులుగా నుండవలెను మరిన్ని యీ ఆక్టులో లేదా దీని ననుసరించి చేయబడిన విధులలో యితర విధముగా నిబంధింపబడియున్నట్లు తప్ప మరిన్ని అట్టి విధులలో నిర్ణయింపబడగలట్టి నిర్బంధములకును పై విచారణలకును అపీలు చేసికొనుటకైన హక్కులకును లోబడి కార్యనిర్వాహక అధికారి—

(a) పంచాయతీయొక్క యావన్మంది ఉద్యోగులను, నౌకరులను నియమించవచ్చును

(b) అట్టి ఏ ఉద్యోగికిగాని, నౌకరుకుగని శెలవు నియ్యవచ్చును. మరిన్ని

(c) సరియైన చాలినంత కారణము నిమిత్తము, అట్టి ఏ ఉద్యోగిని లేక నౌకరునైన నిందించవచ్చును అతనికి అపరాధము విధించవచ్చును, హెచ్చు జీతమును పొందక చేయవచ్చును, ప్రమోషనును పొందకుండ చేయవచ్చును, సీనియారిటీ లిస్టులో తక్కువ రాకుండ లేక తక్కువ స్థానమునకు లేక టైం-స్కేలుకు లేక ఒక టైం-స్కేలులో తక్కువ దశకు తగ్గించవచ్చును. తాత్కాలికముగా ఉద్యోగమునుండి నిలిపియుంచవచ్చును లేదా బర్తరఫుచేయవచ్చును.

(7) ఈ సెక్షనుయొక్క నిబంధనలు, 1939 వ-సం॥పు మదరాసు పబ్లికు హెల్తు ఆక్టులో ఏదియున్నను దానితో నిమిత్తము లేకుండ పంచాయతీలయొక్క పబ్లిక్ హెల్తు సిబ్బందులకుకూడ వర్తించవలెను

(8) (1) ఈ యాక్టులో ఏదియున్నను దానితో నిమిత్తము లేకుండ మరియు నిర్ణయింపబడగల విధులకులోబడి ఇన్‌స్పెక్టరు—

(a) ఏ పంచాయతీయొక్కయైన కార్యముల నిమిత్తము ఆయన అవసరమని తలంచగల ఇంజనీరింగు, మరియు ఇతర సిబ్బందిని నియమించి అట్టి సిబ్బందికి చెందినవారికి చెల్లింపబడు జీతము, బత్తెములను మరియు ఆయన సామాన్య లేక ప్రత్యేక ఉత్తరువుద్వారా నిర్ణయించగల సెలవు బత్తెములు, పింఛను, ప్రావిడెంటుఫండుకగాను వంతు పైకమును దానివద్దనుండి రాబట్టుకొనవచ్చును

(b) రెండు లేక ఎక్కువ పంచాయతీలకు ఉమ్మడిగా ఇంజనీరింగు లేక యితర సిబ్బందిని నియమించి, ఆయన సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువుద్వారా నిర్ణయించగల బత్తెములలో అట్టి సిబ్బంది చెందినవారికి చెల్లించబడు జీతము మరియు దామాషాను వారి లీవు బత్తెములు, పింఛను, ప్రావిడెంటు ఫండుకుగాను అట్టి వంతు పైకమును సంబంధించిన పంచాయతీలలో ప్రతిదానివద్దనుండి రాబట్టుకొనవచ్చును

(11) (1) వ క్లాజు ననుసరించి నియమింపబడిన సిబ్బందికి చెందిన ఏ మెంబరుయొక్కయైన జీతము, బత్తెములు కొలువు షరతులు, నిర్ణయింపబడగల విధముగా నుండవలెను

సంపాదకుని సూచిక

34 వ సెక్షను క్రింద ప్రభుత్వముయొక్క అధికారములు ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్‌కు దత్తత చేయుబడినవి

## 34 వ సెక్షను క్రింద విధులు

(జి ఓ నెం 1118, ఎల్ ఏ, తేదీ 4-6-1951)

(జి ఓ నెం 823, ఎల్ ఏ, తేదీ 4-6-1956)

పంచాయతీయొక్క యుద్యోగులు నౌకర్ల నియామకం, శిక్షలు

1 ఈ విధులు ఈ క్రిందనుడివిన ఆఫీసర్లకు వర్తింపవు —

ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లకు, రు 24 - లు వేతనముగల లేక, ఏ స్థానముల వేతనస్కేలు రు 24 లు మించదో, సదరు స్థానములకు,

నియమింపబడిన, పంచాయతీ యుద్యోగులకు, రెండవ ఐటెముములో చెప్పబడిన ఆఫీసర్ల విషయములో, దీనికి విరుద్ధముగా, ఇంకేదైన విధియందు, సూచించిన, ఈ విధులు వర్తింపవచ్చును పైనజెప్పిన ఆఫీసర్లకుతప్ప, తదితర పంచాయతీ ఆఫీసర్లకు నౌకర్లకు, వారు ఖాయపుద్యోగమున నుండవచ్చును, లేక మరియొకరి స్థానమున నియమింపబడి అఫీషియేటు చేయుచుండ వచ్చును, లేదా తాత్కాలికముగా నియమింప బడవచ్చును ఈ విధులు పూర్తిగా అన్వయించును

2 (1) ముప్పది సంవత్సరముల వయస్సు దాటినవారిని గాని, లేదా నిర్ణయింపబడిన విద్య విషయమునందు లేక ఇతర విధముగా నర్హత (క్వాలిఫికేషను) లేని వారినిగాని, పంచాయతీలో ఉచ్ఛ (సుపీరియరు) సర్వీసులో నియమించరాదు

అయితే, ఆంధ్ర రాష్ట్రములోని ఏ జిల్లాబోర్డు మ్యునిసిపాలిటీ లేక పంచాయతీలోని సర్వీసునుండి బదిలీవల్ల నియమించబడిన వ్యక్తికి యీ విధిలోని నిబంధన వర్తించదు

వివరణము

ఈ విధుల నిమిత్తము, "ఉచ్ఛసర్వీసులోని స్థానములలో, బంట్రోతులు కాక, నెలకు రూ 30/- జీతము మించినట్టి స్థానములన్నియు కూడియున్నవి

(2) 7 వ విధి క్రింద తాత్కాలికముగా నియమింపబడిన విషయములలో తప్ప, ప్రథమముననే, తిన్నగా ఉచ్ఛస్థానములో నియమింప బడిన ప్రతివ్యక్తినుండి, వయస్సు, ఆరోగ్యము మరియు టీకాలు గురించి వివరించు సర్టిఫికేటును (యోగ్యతాపత్రమును) ఎగ్జిక్యూటివు అధికారి తీసుకొనవలెను సాధారణముగా నట్టి యోగ్యతాపత్రమును ప్రభుత్వపు అసిస్టెంట్ సర్జను జారీ చేయవలెను

3 కేంద్ర ప్రభుత్వముయొక్క, లేక రాష్ట్ర ప్రభుత్వము యొక్క, లేక ఏదయిన స్థానిక సంస్థయొక్క, సర్వీసునుండి తొలగింప (డిస్‌మిస్) కాబడినవానినిగాని లేక అట్టి సర్వీసునుండి దివాలా కారణముచేత తొలగింప బడిన వానినిగాని, లేక కేంద్ర, లేక

రాష్ట్ర ప్రభుత్వ సర్వీసులో ఉద్యోగార్హుడుగాడని తిరస్కరింప బడిన వానినిగాని,

ఇన్‌స్పెక్టరుయొక్క అనుమతి ముందుగా పొందకుండా, సర్వీసులో చేర్చరాదు.

4 దుర్మార్గపు నడవడికకు శిక్షింపబడిన పంచాయతీలోని యే వుద్యోగినికాని, లేక నౌకరునుకాని పంచాయతీ సర్వీసులో నుంచరాదు మరియునట్లు శిక్షితుడైన నేవ్యక్తికూడ, ప్రభుత్వముయొక్క ప్రత్యేక అనుమతితోతప్ప, పంచాయతీ సర్వీసులో నే స్థానమునకు నియోగించరాదు

5 ఖాళీలు ఏర్పడినపుడెల్ల, యీ క్రింద చెప్పబడిన తరగతుల స్థానములకు వచ్చు దరఖాస్తులను, వాటి కెదురుగ వ్రాయబడిన అధికారికి, పంచాయతీ ఎగ్జిక్యూటివ్ అధికారి పంపవలెను అట్టి దరఖాస్తు లన్నింటిని, పంపబడిన యధికారి, ఎగ్జిక్యూటివ్ అధికారికి, వారిలో ఆయాస్థానముల కెవ్వరెవ్వరు తగియున్నారో తెలుపుచూ పేర్ల జాబితాను, ఈ ఎగ్జిక్యూటివు అధికారికి పంపవలెను విధిలో చెప్పబడిన ప్రత్యేక విధులకులోబడి, ఆ జాబితాలోని వ్యక్తులను, నియమించు అధికారి ఆయా స్థానములకు నియమించును

| ఉద్యోగము పేరు | సంప్రతించవలసిన అధకారి |
|---|---|
| (1) పంచాయతీలోని, ఆయుర్వేద, యునాని, సిద్ధ లేక హోమ్యోపతి ఆస్పత్రిలో, లేక డిస్పెన్సరీలోని వైద్యుడు, లేక పంచాయతీ సర్వీసులోని, అట్టి ఆస్పత్రిలో లేక డిస్పెన్సరీలో నియమింపబకుటకు ప్రత్యేకింపబడిన (రిజర్వు) వైద్యుడు | డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసర్ |

కాని, పంచాయతీనుండి విద్యా వేతనము (స్టైఫండ్) పొంది, మద్రాసు ఇండియన్ మెడికల్ స్కూలులో విద్యనభ్యసించినట్టి, ఆ స్కూలుయొక్క ప్రిన్సిపాలు అతడా యుద్యోగమునకు తగినవాడు కాడని సూచించినతప్ప, అట్టి వ్యక్తివున్న యెడల, ఖాయముగాగాని,

లేక యితర విధముగాగాని, అతనికితప్ప మరెవ్వరిని, ప్రభుత్వము యొక్క ప్రత్యేక అనుమతితోతప్ప, ఆస్థానమునకు నియమించ కూడదు.

| ఉద్యోగము పేరు | సంప్రదించవలసిన అధికారి |
|---|---|
| (2) పంచాయతీ పాలనలోనున్న యితర వైద్య సంస్థలలోని వైద్యుడు, లేక పంచాయతీ సర్వీసులోని రిజర్వు మెడికల్ ఆఫీసరు లేదా అట్టి సంస్థలో నియమితుడైన వ్యక్తి | పంచాయతీ కివ్వబడిన ప్రభుత్వ మెడికల్ ఆఫీసరు అయిన యెడల, జిల్లా మెడికల్ ఆఫీసరు, లేక యితర విషయములలో, డైరెక్టరు ఆఫ్ మెడికల్ సర్వీసెస్సు |

అయితే, పంచాయితీనుండి విద్యావేతనముపొంది, మద్రాసు స్టాన్లీ మెడికలు స్కూలులోగాని లేక స్త్రీలయొక్క లేడీ విల్లింగు డన్ మెడికల్ స్కూలులోగాని, విద్యనభ్యసించినట్టి, డైరెక్టరు ఆఫ్ మెడికల్ సర్వీసెస్ ఆ వ్యక్తి యేపుద్యోగమునకు తగినవాడుకాడని తలంచనట్టి వ్యక్తివున్నయెడల, ఆవ్యక్తితప్ప యింకెవరిని, ప్రభుత్వముయొక్క ప్రత్యేకానుమతితోతప్ప, ఖాయమైనగాని, ఖాయము కానట్టిగాని స్థానములో నియమించరాదు

మరియు గ్రామవైద్యులుగా (రూరల్ మెడికలు ప్రాక్టీష నరుగా) ఖాయమయిన స్థానములకు అభ్యర్థులను ఎంచునపుడు, గత యుద్ధములో, భారతదేశములోని, దేశాంతరమునగాని, పనిచేసిన వారికి ప్రాముఖ్యత నివ్వవలెను

| ఉద్యోగము పేరు. | సంప్రతించవలసిన అధికారి |
|---|---|
| (3) పంచాయతీలోని కాంపౌండరు, మంత్రసాని, నర్సు, నర్సింగు ఆర్డర్లీ (వార్డు సేవకుడు) | జిల్లా మెడికల్ ఆఫీసర్ |
| (4) ప్రజారోగ్య (పబ్లిక్ హెల్తు సిబ్బంది) | జిల్లా హెల్తుఆఫీసర్. |
| (5) నెలకు గరిష్ఠజీతము రూ 50/-కు మించనట్టి, మంచినీటి సప్లయి, మురుగునీటి పారుదల శాఖలలోని స్థానము | శానిటరీ యింజనీరు. |

| | | |
|---|---|---|
| (6) | పట్టణ నిర్మాణశాఖలో (టౌన్ప్లానింగు సాంకేతిక (టెక్నికల్) స్థానము | డైరెక్టరు ఆఫ్ టౌను ప్లానింగు |
| (7) | ప్రాథమిక పాఠశాలలోని ఉపాధ్యాయులు. | ఆ రేంజియొక్క స్కూళ్ల డిప్యూటీ ఇన్స్పెక్టర్ |

6 (1) ఉచ్ఛ సర్వీసులో ప్రతిస్థానమున నియామకమునకు, మూడు సంవత్సరముల నిర్విరామ కాలములో, మొత్తం రెండు సంవత్సరముల ప్రొబేషను మీద సేవచేయవలెను

(2) ప్రొబేషను పూర్తి అగుటకు ముందు తనయొక్క స్వేచ్ఛాధికారముతో, వ్రాత మూలకమయిన సకారణములవల్ల ఎగ్జిక్యూటివు అధికారి, ఒక వ్యక్తియొక్క ప్రొబేషను అంతము చేయవచ్చును, లేదా, అతను యిదివరకే ఖాయపు వుద్యోగిగాగాని, నౌకరుగాగాని అయివున్న యెడల. అతని ఖాయపు స్థానమునకు వేయవచ్చును, లేదా, అతను యిదివరకే ఖాయపు వుద్యోగిగాగాని, లేక నౌకరుగాగాని యుండనివో, ప్రోబేషనరుగాగాని, అప్రూవ్డ్ ప్రొబేషనరుగాగాని ఒక క్రింది స్థానములో అయివున్న యెడల, అట్టి క్రిందిస్థానములో ఖాళీవున్న యెడల, లేక అట్టి క్రింది స్థానములో తక్కువ సర్వీసుగల వ్యక్తి (జూనియర్ పనిచేయుచున్న యెడల, అట్టి క్రింది స్థానమునకు దింపివేయవచ్చును, లేదా యితర సందర్భములలో నతనిని పంచాయతీ సర్వీసునుండి తొలగించ (డిశ్చార్జి చేయ) వచ్చును

అయితే, ఎగ్జిక్యూటివు అధికారి ఒక వ్యక్తియొక్క ప్రొబేషనునంతము చేయువిషయములో తాత్కాలికపు నిశ్చయమునకు వచ్చిన తర్వాత, అట్లు ప్రొబేషనును యేల నంతము చేయరాదో తగిన హేతువు చూపమని ఆ వ్యక్తికి అవకాసము నీయవలెను

(3) నిర్ణీతమయిన ప్రొబేషను కాలము పూర్తిఅయిన పిదప, లేదా (5) వ యువవిధి ననుసరించి పొడిగింపబడిన ప్రొబేషను కాలము పూర్తి అయిన తర్వాతగాని, ఆ ప్రొబేషనరు ఖాయపర్చుటకు తగిన వానిగా ఎగ్జిక్యూటివు అధికారి నిశ్చయించినయెడల, సాధ్యమయినంత త్వరలో నతడు యీ ప్రొబేషనరు తన ప్రొబేషను

తృప్తికరముగ పూర్తి చేసినట్లు సూచించుచూ ఉత్తరువు జారీచేయవలెను

(4) ప్రొబేషనరు ఖాయపరుపబడుటకు తగిన వాడు కాడని ఎగ్జిక్యూటివు అధికారి నిశ్చయించిన యెడల, (5) వ యుపవిధి క్రింది ప్రొబేషనను పొడిగించినతప్ప తన యుత్తరువు మూలముగా, పూర్వస్థానమునకు దింపి వేయవలెను లేదా, సర్వీసునుండి తొలగించి డిశ్చార్జి చేయవలెను

(5) నిర్ణీతమయిన ప్రొబేషను కాలము అంతమయిన తర్వాత, ప్రొబేషనరు ఖాయము చేయబడుట కర్హుడు కాడని ఎగ్జిక్యూటివు అధికారి తలచిన యెడల, అతని ప్రొబేషను నాయధికారి పొడిగింప వచ్చును కాని అట్లు పొడిగింపబడిన కాలము (1) వ యుపవిధిక్రింద నిర్ణీతమయిన ప్రొబేష నంతమయిన తేదీ నుండి ఒక సంవత్సరమునకంటె నేసందర్భములోను యెక్కువ వుండరాదు

7 ఏదయిన నొక అత్యావశ్యకమునందుకాని, లేక పరిపాలనా కారణములచేతగాని, యీ విధుల ప్రకారముకాక యితర విధముగా నొక వ్యక్తిని నియమించు టవసరమని ఎగ్జిక్యూటివ్ అధికారి తలచిన యెడల, వ్రాతమూలకమయిన హేతువులతో, ఆ పదవికి సమర్థుడని తోచిన వ్యక్తిని, తాత్కాలికముగ, ప్రతిపర్యాయము, మూడు మాసములు మించని కాలమునకు, ఆ యధికారి ఆ వ్యక్తిని నియమించ వచ్చును కాని అట్లు నియమితుడైన వ్యక్తి ప్రొబేషనరుగా పరిగణింపబడడు మరియు నట్టినియమము మాత్రమున నేవ్యక్తికి భవిష్యత్తులో నియమమునకు హెచ్చుహక్కు వుండదు. అట్టి వ్యక్తి స్థానములో యీ విధులక్రింద అర్హతలుగల వ్యక్తిని సాధ్యమయినంత త్వరలో నియమించవలెను

8 ఒక స్థానములో నొక వ్యక్తి తన ప్రొబేషను పూర్తి చేసినపుడు, అతను ప్రథమమున నియమింపబడిన తేదీ లగాయతు, సర్వీసులో నాతని సీనియారిటీ గణించి, సత్వరావకాశములో నతనిని ఖాయము చేయవలెను ఇరువురు లేక అంతకు యెక్కువ వ్యక్తుల

యొక్క సీనియారిటీ, నిర్ణయించుటకు లేదీ ఒక్కటే అయిన వారి మధ్య సీనియారిటీ, యిదివరకేదైన వారి వారి కిచ్చిన ప్రాముఖ్యత (ఎవరెక్కువ, ఎవరు తక్కువ అనుసూచన) యున్నయెడల, దానిని బట్టి నిర్ణయింపవలెను అట్లు వార్ల కిదివరకెట్టి ప్రాముఖ్యత యివ్వబడినదో. లేక సందేహములున్నచో, సీనియారిటీ ఎగ్జిక్యూటివ్ అధికారివల్ల నిర్ణయింపబడును

(9) (1) హెడ్‌గుమాస్తాయొక్క, లేక రివిన్యూ ఇన్‌స్పెక్టరు యొక్క ప్రతిస్థానము (గుమాస్తా జీతముకంటె నెక్కువ జీతమా స్థానమున కున్నయెడల) ఎన్నికస్థానము (సెలెక్షనుపోస్టు) గా పరిగణింపబడును ఈ యుపవిధిలో చెప్పబడిన స్థానములుకాక, యితర గుమాస్తా స్థానములు (మినిస్టీరియల్ స్థానములు) ఎన్నిక స్థానములు కావు

(2) ఎన్నిక స్థానములకు ప్రమోషను. పనినిపుణత సామర్థ్యములబట్టి నిర్ణయింపవలెను సామర్థ్యము యించుమించు సమముగానున్నపుడు మాత్రమే సీనియారిటీకూడ పరిగణింపబడును

(3) సెలక్షనుకాని స్థానములు ప్రమోషనువల్ల నింపుటలో, సీనియారిటీ ననుసరించవలెను, కాని

(i) సీనియరు వ్యక్తికి సదరు పైస్థానమునకు నిర్ణీతమయిన నర్హత విశేషములు అట్టి లేనియెడలను, లేదా అట్టి స్థానములో నుండుట కతడు అసమర్థుడని నిర్వివాదముగా రుజువయినపుడును, అతనిని ప్రమోషను చేయరాదు, లేక,

(ii) ఋజువుచేయబడిన దుష్ప్రవర్తనవల్ల నాతనిని ప్రమోషన్ చేయరాదని తలంచిన, వానిని ప్రమోషన్ చేయరాదు.

10 ఈ విధులలో యితర విధముగా నేర్పరుపబడిననేతప్ప, ఈక్రింద నుదహరింపబడిన విషయములలో, పంచాయతీ యుద్యోగుల సర్వీసుపరతులు, ప్రభుత్వములోని, అదేహోదా, సర్వీసుగల వుద్యోగుల సర్వీసు షరతులవూదిరిగనే వుండును —

(a) శెలవు, శెలవు భత్యములు,

(b) ప్రయాణభత్యములు, మరియు

(c) సర్వీసు కాలపరిమితి, సర్వీసునుండి విరమణ (రిటైరగుట)

అట్టి ప్రభుత్వోద్యోగులకు వర్తించు విధాయకములలో ప్రభుత్వమునకు మరియు శాఖాధికారికి (డిపార్టుమెంటు హెడ్డు) యివ్వబడిన అధికారములను ఇన్‌స్పెక్టరు జనరలు ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్ మరియు మ్యునిసిపాలిటీయొక్క, స్థానిక సంస్థలయొక్క రీజినల్ ఇన్‌స్పెక్టరు వినియోగించును

11 (1) సిబ్బందిలోని యీ క్రింద వివరించిన వుద్యోగుల నుండి, వారికెదురుగా గుర్తింపబడిన మొత్తములకు తక్కువకాకుండ ధరావత్తు తీసికొనవలెను —

(i) స్టోరుకీపర్లు, గుమస్తాలు రూ 100

(ii) బిల్లు కలక్టర్లు, మరియు వారంటు ఆఫీసర్లు రూ 200

(2) ఈ ధరావత్తు నగదుగాగాని, పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు డిపాజిటుగాగాని, గవర్నమెంటు ప్రామిసరీ నోట్లుగాని, పోస్టాఫీసు 10 సంవత్సరముల డిఫెన్సు సేవింగ్సు సర్టిఫికేట్లుగాని, పోస్టాఫీసు 5, 7 లేక 12 సంవత్సరముల నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లుగాని, లేక ప్రభుత్వము ఆమోదించిన భీమాకంపెనీయొక్క విశ్వాసపత్రములు (ఫిడెలిటీ బాండ్సు) గాని, అయివుండవలెను

(3) ఒక వుద్యోగిగాని, లేక నౌకరుగాని అట్టి ధరావత్తు నొక్కమారుగా నగదు రూపములోగాని, లేక (2) వ యుపవిధిలో చెప్పబడిన విధములలో నేరీతిగాగాని యివ్వలేని పక్షములో,

ఆ ధరావత్తును అతని వేతనము నుండి జీతములో 10 వంతున నెలనెలకుగాని, లేక నాలుగు సంవత్సరములలోగాని నా ధరావత్తు పూర్తియగుట కెంతసొమ్ము అవసరమో యంతవంతుగాని, ఏది యెక్కువో దానిని, ఆ ప్రకారముగా తీసికొనబడవలెను

అయితే, ధరావత్తునకు కావలసిన మొత్తము సొమ్మంతయు వసూలు అయ్యేవరకు, ఆ మొత్తమునకు రెట్టింపు సొమ్మునకు, డబ్బు

గల వ్యక్తుల జామీనుగాని, లేక, యెట్టి బకాయిలు, అధిక్షేపణలు లేని, జాగ్రత్తగా విలువచేయబడిన, రెట్టింపు విలువగల స్థిరాస్తిని గాని జామీనుగా తీసుకోవలెను

మరియు, బిల్లుకలెక్టర్ల విషయములో, (1) వ యుపవిధిక్రింద విధింపబడిన ధరావత్తు మొత్తములో సగము, యీ యుపవిధిలో చెప్పబడిన జామీనుకాక, క్యాషుగా తప్పక తీసుకోవలెను

12 పంచాయతీయొక్క ఉచ్ఛసర్వీసులోని వుద్యోగిని గాని, లేక నౌకరునుగాని 55 సంవత్సరముల వయస్సు పూర్తి అయిన పిమ్మట పంచాయతీ సర్వీసులో నుంచరాదు

అయితే, పరిపాలనా క్షేమముకొరకు, కేంద్ర, లేక రాష్ట్ర ప్రభుత్వపు లేక స్థానిక సంస్థలలో పనిచేసి సర్వీసునుండి విరమించిన యేవ్యక్తినయిన, ఇన్‌స్పెక్టర్‌యొక్క అనుమతి ముందుగా పొంది, ఎగ్జిక్యూటివ్ అధికారి నియమించు సందర్భములో నీ విధి వర్తించదు అట్టి నియామకము ప్రతి పర్యాయము ఒక సంవత్సరముకంటె నెక్కువ యుండరాదు

13 (1) మ్యునిసిపలు వుద్యోగులకు యే విధముగా నెట్టి సర్వీసు పుస్తకము వుపయోగింపబడునో, అట్లు సర్వీసు పుస్తకములను క్రమపద్ధతిలో నడుపవలెను

(2) యిదివరకు ఒక సర్వీసుపుస్తకములో వ్రాయబడిన పుట్టినతేది, ఇన్‌స్పెక్టర్‌యొక్క ఆదేశముపైనగాని, లేక అనుమతి పొందిన పిదపగాని మార్చరాదు

14 ప్రతి సంవత్సరము ఏప్రెల్‌నెలలో, ఏప్రెల్ 1 వ తేదికి ఆ పంచాయతీలో నెన్ని ఖాయపు స్థానములున్నవో, వివరముగా నొక పట్టీని తయారుచేసి, మద్రాసు గ్రామ పంచాయతీల యాక్టు 1950 యొక్క 74 వ సెక్షనుక్రింద నియమింపబడిన ఆడిటరుకు, ఏప్రిల్ 15 వ తేదీలోగా ఎగ్జిక్యూటివ్ అధికారి పంపవలెను

15 ఒక పంచాయతీ సిబ్బందిలోని యొక యుద్యోగియొక్క అజాగ్రత్తవల్లగాని, లేక విధులనుగాని ఆజ్ఞలనుగాని ఉల్లంఘించినందు

వల్లగాని అట్టి నేర మతనియందు నిరూపింపబడినపుడు, అందువల్ల పంచాయతీకి ఏ విధమయిన ధన నష్టము కలిగినయెడల, ఎగ్జిక్యూటివు అధికారి, అతనిపై తగు యితర శిక్ష విధించుటయేకాక, అట్టి ధన నష్టమును పూర్తిగాగాని లేక కొంతవరకుగాని, ఆ యుద్యోగి లేక నౌకరువల్ల భర్తీచేయ నాజ్ఞ నీయవచ్చును

16 ఈ క్రింద చెప్పబడిన శిక్షలు, నేరస్థుడని యెంచబడిన పంచాయతీ సిబ్బంది యందుండు వ్యక్తిపై విధించుటకు ముందాతనికి, సదరు చర్య ఎందుకు తీసికొనకూడదో తెలియజేయమని సంజాయిషీ నిచ్చుటకు ఉచితమగు నవకాశ మీయవలెను

ఖండన (సెన్సూరు) జరిమానా (జరిమానాకు బద్ధులగు వారిపై మాత్రము), ఇంక్రిమెంటు నిలుపుదల, ప్రమోషను నిలుపుదల, ఇంక్రిమెంటు, ఎఫిషెన్సీ బారుయొద్ద నిలుపుదల (వేతన స్కేలులో నిపుణత వలననే ముందుకు రావలసిన యింక్రిమెంటు రాబోవునను నిర్ణాణ మున్న, దానిని ఎఫిషెన్సీ బారనబడును) ఎలిమెంటరీస్కూలు ఉపాధ్యాయునకు జీతము తగ్గించుట

17 ఒక పంచాయతీయొక్క సిబ్బందిలోని యే యుద్యోగి విషయములోను, ఉద్యోగమునుండి డిస్‌మిస్ చేయుటగాని, తొలగించుట (రిమూవల్) గాని, పదవి తగ్గించుటగాని, (ప్రాథమిక బడిలోని యుపాధ్యాయుని విషయములో తప్ప) విచారణకు పూర్వము వుద్యోగమునుండి తాత్కాలిక విరమణ (సస్పెన్షను) కాని తాత్కాలిక విరమణగాని, ఆ వుద్యోగియొక్క అజాగ్రత్తవల్ల లేక విధులను, ఆజ్ఞల నుల్లంఘించుటవల్ల పంచాయతీకి కలిగిన ధన నష్టమును పూర్తిగానో లేక కొంత రాబట్టుటలోగాని, ఆ వుద్యోగికి వ్రాతమూలముగా కారణములను తెలిపి అతనిపై నిట్టి చర్య నెందుకు తీసుకొనరాదో సంజాయిషీ ఇమ్మని, (క్రిమినలు కోర్టులో యే కారణములకు శిక్షింపబడెనో ఆ కారణములై తేనే తప్ప), అతనికి రక్షణకు కావలసిన అవకాశము యివ్వకుండా శిక్ష విధించకూడదు ఏ కారణములవల్ల చర్య తీసుకొనబడునో ఆ కారణములను స్ఫుటముగా

నేరము (ఛార్జీలు) గాను, ఆరోపణలును (ఏవిగేషనులు) వివరించి, ఆ వ్యక్తికిగాని, వ్యక్తులకుగాని పంపవలెను అంతే కాకుండా

ఏ సందర్భమువల్ల యీ నేరారోపణ జేయబడెనో వాటిని, మరియు ఈ చర్యలో ఉత్తరువు జారీచేయు సందర్భములో యింకా యే విషయములు విచారించబడునో వాటిని కూడ నతనికి వ్రాసి పంపవలెను అతని రక్షణకు వ్రాతమూలకముగ సముజాయిషీ (స్టేటుమెంటు) యివ్వవలెననియు అతను ఏమయిన సమక్షమున చెప్పు కొనున దేమయిన యున్న యెడల తెలుపమనియు ఆనతీయవలెను మరియు అతడట్లు కోరినగాని లేక తత్సంబంధమయిన అధికారి శాశించినగాని, విచారణ ఓరల్ యంక్వాయిరీ జరుపవలెను ఆ విచారణలో, అతను ఒప్పుకోనని నేరారోపణల గూర్చి సాక్ష్యము వినవలెను మరియు నా వ్యక్తి స్వయముగా సాక్ష్యము నియ్య వచ్చును సాక్షులను తానుఅడ్డు పరీక్ష (క్రాసు పరీక్ష) చేయుటకు హక్కు వుండును మరియు తనకు కావలసిన సాక్షులను పిలిపించ వచ్చును కాని విచారణచేయు నధికారి, ప్రత్యేకమైన, తగిన హేతువులవల్ల నేసాక్షినైన రప్పింప నిరాకరించవచ్చును సదరు హేతువుల నాతడు రికార్డు చేయవలెను ఆ విచారణ నివేదికలో సాక్ష్యవివరములను, నేరముల గూర్చిన నిర్ణయములును, అట్టి నిర్ణయములకు వలసిన హేతువులను వివరముగా చెప్పబడియుండ వలెను

అయితే, ఒక వ్యక్తి పరారి అయిపోయినపుడు గాని, లేక యే కారణముచే నయిన నతనితో నుత్తర ప్రత్యుత్తరములు జరుపు టకు సాధ్యమయినగాని, యీ విధి వర్తించదు

మరియు, యీ విధిలోని అంశములన్నియు సక్రమముగా నిర్వహించుటలో నేదేని ప్రతిబంధకమున్న యెడల కొన్ని అనివార్య మయిన పరిస్థితులలో, ప్రత్యేక కారణములచేత (ఈ కారణములు వ్రాయబడవలెను) యీ విధిలోని కొన్నిగాని లేక అన్ని అంశము లనుగాని, అప్పీలును తీర్మానించుట కర్హుడైన పై యధికారి (అప్పిలేట్లు అధికారి) యొక్క అనుమతితో, వర్తింపచేయవచ్చును

అంతేకాక ఈ క్రింద వివరింపబడిన పట్టీలో ఒకటవ కాలములో వ్రాయబడిన సిబ్బందిలోని యే వుద్యోగిపైనను, (సాంకేతిక, అనగా, టెక్నికల్ వుద్యోగులు కానివారలుకాక) వానికెదురుగా రెండవ కాలములో వ్రాయబడిన వుద్యోగితో సంప్రదించకుండ, యీ విధిలో చెప్పబడిన యే శిక్షయు విధించకూడదు —

పట్టీ.

| సిబ్బంది— | సంప్రదించ వలసిన యుద్యోగి. |
|---|---|
| వైద్యసంస్థలోని సిబ్బంది రిజర్వు సిబ్బందితోసహా | జిల్లా వైద్యశాఖాధికారి (డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసరు) |
| ఆరోగ్యశాఖ సిబ్బంది | జిల్లా ఆరోగ్యశాఖాధికారి డిస్ట్రిక్టు హెల్తు ఆఫీసరు) |
| నీటి సప్లైకి సంబంధించిన యంత్రాగారము, మురుగు నీరు పారుదల సిబ్బంది | ప్రభుత్వపు శానిటరీ యింజనీరు |
| పట్టణ నిర్మాణ (టౌన్ ప్లానింగు) సిబ్బంది | డైరక్టరు ఆప్ టౌను ప్లానింగు |

18 ఒకపంచాయతీయొక్క ఎగ్జిక్యూటివ్ అధికారి ఒకవ్యక్తికి, 16 లేక 17 వ విధులలో చెప్పబడిన శిక్షలు విధించుటలో నేదైన నొక తాత్కాలిక నిర్ణయమునకువచ్చిన పిమ్మట, ఆ శిక్ష విధింపు విషయమున ఏదయిన విన్నపముచేసుకొనుటకు ఆ వ్యక్తికి ఒక అవ కాశము నీయవలెను

19 (1) స్కూళ్లను తనిఖీచేయు వుద్యోగి తన తనిఖీ నివేదికలో గాని, ఆ నివేదిక విమర్శలోగాని వ్రాసిన కారణములచేత, ఒక ప్రాథ మిక బడిలోని యుపాధ్యాయుని వేతనాభివృద్ధిని (ఇంక్రిమెంటు) నిలుప వలసినదిగా సిఫారసు చేసినయెడల, ఆ పంచాయతీ ఎగ్జిక్యూటివ్ అధి కారి ఆ సిఫారసును అమలు చేయవలెను మరియు నీ విషయములో 16 వ విధిని అనుసరించ నవసరములేదు

(ii) వేతన శ్రేణిలో (టైమ్ స్కేలులో) గరిష్ట జీతమును పొందినట్టి ప్రాథమిక పాఠశాలలోని యే యుపాధ్యాయుని

జీతమునైన తగ్గించవలసినదిగా తనిఖీచేయువుద్యోగి సిఫార్సుచేసిన యెడల, ఎగ్జిక్యూటివ్ అధికారి ఆ యుపాధ్యాయునికి వ్రాతమూలకముగా జీతము తగ్గింపును గురించి నోటీసు యిచ్చి, అది అందిన నెల లోపుగా నట్టితగ్గింపు నేల చేయరాదో తగిన కారణము సంజాయిషీ యివ్వమని నిర్దేశించవలెను

నిర్ణీతకాలపరిమితిలో నా యుపాధ్యాయునివద్దనుండి నేదైన సముజాయిషీ వచ్చినయెడల, దానిని ఎగ్జిక్యూటివ్ అధికార జిల్లా విద్యాశాఖాధికారికి పంపవలెను నిర్దేశప్రకారముగా సముజాయిషీ ఆ యుపాధ్యాయుని వద్దనుండి రాకపోయినను, లేక జిల్లావిద్యాశాఖాధి కారి ఆ సముజాయిషీని అంగీకరించకపోయినను, ఆ యుపాధ్యాయుని జీతము తగ్గించుచు, ఎగ్జిక్యూటివు అధికారి యుత్తరవు జారీచేయును

అయితే, అట్టి యుత్తరవు మూలముగా నా యుపాధ్యాయుని జీతము ఒక్కమారు ఒక్క యింక్రిమెంటుకంటె నెక్కువగా తగ్గించుటకు వీలులేదు, మరియు, అట్టి యుత్తరువు, రెండు సంవత్సరముల కంటె నెక్కువకాలము, యీలోపుగ మరల నటువంటి మరియొక యుత్తరవు జారీచేసినతప్ప అమలులో నుండకూడదు

(111) ఒక ప్రాథమిక పాఠశాలలోని యుపాధ్యాయుని యొక్క ట్రైనింగు స్కూల్ లీవింగ్ సర్టిఫికేటును డివిజనలు యిన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సుగాని, లేక డైరెక్టరు ఆఫ్ పబ్లికు ఇన్స్ట్రక్షను ఆంధ్రగాని తాత్కాలికముగ రద్దుచేసినగాని (సస్పెండు చేసినగాని) లేక డైరెక్టర్ పూర్తిగా రద్దుచేసినగాని, ఆ పంచాయితీ ఎగ్జిక్యూటివ్ అధికారి, తదను గుణ్యముగా నాయుపాధ్యాయుని సర్టిఫికేటు సస్పెండు చేయబడినంతకాలము సస్పెండుగాని, లేక వుద్యోగమునుండి తొలగింపు (డిస్మిస్) గాని చేయవలెను ఈ విధిక్రింది సస్పెన్షనుకుగాని, వుద్యోగమునుండి తొలగింపు (డిస్మిస్) చేయుటకుగాని, 17 వ విధి లోని విధాయకములు వర్తించవు ఈ విధిక్రింద సస్పెండు చేయబడినంతకాలమా యుపాధ్యాయునికి యెట్టి బత్యమునకు హక్కువుండదు.

20 ఒక పంచాయతీలోని యొక యుద్యోగియొక్క ప్రవర్తన విషయమై విచారణ జరుగుటకు ముందుగా ఎగ్జిక్యూటివు అధికారి

యావ్య_క్తిని మూడుమాసములు మించని కాలమునకు సస్పెండు చేయవచ్చును అయితే కొన్ని అనివార్యమయిన పరిస్థితులలో, సస్పెండుచేసిన తేదీలగాయతు మూడు మాసములలో విచారణ ముగియనిచో స్థానికసంస్థలయొక్క రీజినల్ యిన్‌స్పెక్టరు అనుమతితో, ఆ వ్య_క్తిని మరి మూడుమాసములు మించని కాలమునకు సస్పెండు చేయవచ్చును

అట్లు సస్పెండు చేయబడిన కాలములో నా వుద్యోగికి, యీ క్రింద వివరించిన గరిష్ఠ కనీసములకు లోబడి, సస్పెండుచేయు అధికారి యీ దేశము ప్రకారము, జీతభత్యము నీయవలెను —

(1) అతని జీతము నెలకు రూ 40/- కంటె నెక్కువ కానిచో, నెలకు కనీసము రూ 10/- కంటె తక్కువ కాకుండ, గరిష్ఠము జీతములో సగమునకు యెక్కువ గాకుండ,

(2) అతని జీతము నెలకు రూ 40/- కంటె నెక్కువయినచో, నెలకు రూ 20/- కు తక్కువ కాకుండ, గరిష్ఠము నెలకు జీతములో నాల్గవవంతుకు మించకుండ

21 పంచాయతీ సిబ్బందిలోని, బిల్లు కలెక్టరుమీద గాని, ఆఖరితరగతి నౌఖర్లపై గాని, లేక ఉచ్ఛ సర్వీసులోని వాడు కాక క్రమ సిబ్బందిలోని పనివాడు కాని, లేక కడపటి తరగతిలోని పనివాడు కాని, తప్ప మిగిలిన పంచాయతీ సిబ్బందిలోని యే వుద్యోగిపైనను ఎగ్జిక్యూటివ్ అధికారి జరిమానా విధింపకూడదు

22 ఈ క్రింద వివరింపబడిన శిక్షలలో నొకటికాని, లేక అంత కెక్కువగాని విధింపుచూ పంచాయతీ ఎగ్జిక్యూటివు అధికారి జారీచేసిన యు_త్తరువుపై అపీలు లేదు —

(a) సెన్సార్ (నిందింపు)

(b) 15 వ విధి క్రింద రూ 5/- కు మించని జరిమానా లేక రూ 5/- మించని వసూలు

(c) 19 (III) వ విధి క్రింద సస్పెండు చేయుట లేక డిస్‌మిస్ చేయుట.

(d) 20 వ విధి క్రింద విచారణ ముగియు వరకు సస్పెండు చేయుట

23 (1) (2) వ యుపవిధిలో, యుపాధ్యాయుల విషయములో చెప్పబడినట్లు తప్ప, పంచాయతీ ఎగ్జిక్యూటివు అధికారి, 22 వ విధిలో చెప్పబడిన శిక్షలుకాక, పనినుండి తొలగించుట, ప్రొబేషనుపై నియమింపబడిన వారిని క్రింది స్థానమునకు దింపి వేయుట, లేక ఎన్నికేతరం స్థానమునకు (నాను-సెలెక్షను పోస్టు) ప్రమోషను చేయకపోవుట అను శిక్షలను విధింపుచూ జారీచేసిన యుత్తరువులపై, స్థానిక సంస్థల రీజినలు యినస్పెక్టరుకు అపీలుచేసుకొనవచ్చును

(2) ప్రాథమిక పాఠశాలలోని యుపాధ్యాయుని విషయములో డివిజనలు ఇనస్పెక్టరు ఆఫ్ స్కూల్సుకు అప్పీలు చేసుకొనవచ్చును

(3) ఈ పై విధులలో నేమి వివరింపబడియున్నప్పటికి, ఈ క్రింది పట్టీలో 1 వ కాలములో చెప్పబడన అధికారు లెవరైన 2 వ కాలములో వారి కెదురుగా వ్రాయబడిన పంచాయితీ యుద్యోగి యొక్క ప్రవర్తనను గురించి జరుపబడిన విచారణకు సంబంధించిన యావత్తు రికార్డులను రప్పించి, వారికి యుక్తమని తోచిన యుత్తరువులను జారీ చేయవచ్చును

పట్టీ.

| అధికారి<br>(1) | పంచాయతీ యుద్యోగులు<br>(2) |
|---|---|
| ప్రభుత్వము, లేక ప్రభుత్వముచే నధికారమీయబడిన యుద్యోగి | సిబ్బందిలోని యే యుద్యోగియైన |
| ఇన్‌స్పెక్టరు జనరలు అతనిచే అధికారమీయబడిన యుద్యోగి | ఉపాధ్యాయులు తప్ప సిబ్బందిలోని యే యితర యుద్యోగియైనా |
| స్థానిక సంస్థల రీజినల్ యిన్‌స్పెక్టరు లేక అతనిచే అధికారమీయబడిన యుద్యోగి | డిటో |
| డివిజనలు యిన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సు లేక అతనిచే అధికారమీయబడిన యుద్యోగి | ప్రాథమిక పాఠశాలలోని యేయుపాధ్యాయుడైన |

పంచాయతీ ఎగ్జిక్యూటివు అధికారి శిక్ష విధింపనప్పుడు ఈ యుపవిధి క్రింద విధిస్తూ జారీచేసిన యుత్తరుపైన, లేక ఆ యధికారి జారీచేసిన యుత్తరువువల్ల శిక్ష అధికమైనయెడల, ఈ క్రింది విధముగా అపీలు చేయవచ్చును —

(I) ఇన్‌స్పెక్టరు జనరలుగాని, లేక ప్రభుత్వముచే నధికార మీయబడిన యుద్యోగిగాని జారీచేసిన యుత్తరువుపై, ప్రభుత్వమునకు

(II) ఇన్‌స్పెక్టరు జనరలువల్ల అధికార మీయబడిన యుద్యోగి జారీచేసిన యుత్తరువుపై ఇన్‌స్పెక్టరు జనరలుకు.

(III) స్థానిక సంస్థల రీజినలు ఇన్‌స్పెక్టరుచే నధికార మీయబడిన యుద్యోగిచే జారీచేయబడిన యుత్తరువుపై, రీజినలు ఇన్‌స్పెక్టరుకు

(VI) డివిజనల్ ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సుచే జారీచేయబడిన యుత్తరువుపై డైరెక్టరు ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షనుకు.

(V) డివిజనలు ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సుచే నధికార మీయబడిన యుద్యోగిచే జారీచేయబడిన యుత్తరువుపై, డివిజనలు ఇన్‌స్పెక్టరుకు

(4) అప్పీలుపై (1) మరియు (2) వ యుపవిధుల క్రింద జారీచేయబడిన యుత్తరువులను, (3) వ యుపవిధి క్రింద జారీచేయబడిన యుత్తరువులను, ఎగ్జిక్యూటివు అధికారి అమలు పరచవలెను

24 పంచాయతీ సిబ్బందిలోని యే యుద్యోగి అయినను అప్పీలు చేయదలచునపుడు, ఏ యుత్తరుపై నతడప్పీలు చేయునో నా యుత్తరు వాతనికి చేరిన తేదీనుండి రెండు మాసములలోగా, తన స్వంతపేరుతో, విడిగా అప్పీలు చేయవలెను

25 అప్పీలుచేయు ప్రతివాదు చెందినట్టి, లేక యిదివరకు చెందియున్నట్టి కార్యాలయముయొక్క అధికారి ద్వారాను, మరియు నే యధికారి యొక్క ఆజ్ఞపై నా యప్పీలు చేయబడుచున్నదో, నా యధికారి ద్వారాను, తన యప్పీలు పంపబడవలెను అయినను,

ఆ యప్పీలుయొక్క నకలు నొకదానిని అప్పెల్లేటు అధికారికి తిన్నగా పంపవచ్చును

26 ఎగ్జిక్యూటివు అధికారి, తానుగాని, యిదివరలో తన స్థానమందున్న వారుగాని శిక్ష విధిస్తూ జారీచేసిన యుత్తరువును దేనిని కూడ, స్థానిక సంస్థల రీజినలు ఇన్స్పెక్టరుయొక్క అనుమతి ముందు పొందకుండ, మార్పులేక రద్దుచేయరాదు

27 (1) పంచాయతీలోని స్థానములు రద్దుచేసినపుడు వుద్యోగులను తొలగించు విషయములోను, లేక క్రిందిస్థానమునకు దింపుటలోను, మరియు తొలగింపబడిన వ్యక్తులను తిరిగి నియమించుటలోను, ఈ విధులలో వివరింపబడని సర్వీసు సంబంధమయిన ఇతర షరతులు మున్నగు వాటి విషయములలోను, మరియు నీ విధులు అమలుచేయునపుడు కలిగే సందేహముల విషయములలోను, తత్సంబంధమయిన రీజినలు ఇన్స్పెక్టరు సంప్రదించి, ఎగ్జిక్యూటివు అధికారి నిర్ణయము చేయవలెను

(2) రీజినల్ ఇన్స్పెక్టరు తనతో (1) వ యుపవిధి క్రింద సంప్రతించిన మీదటగాని, లేక తనంతతానే గాని, ఏసిబ్బంది విషయములోనైన తత్సంబంధమయిన కాగితములను, రికార్డులను, పంచాయతీ ఎగ్జిక్యూటివు అధికారినుండి రప్పించి, తనకు యుక్తమని తోచిన యుత్తరవులను జారీచేయవచ్చును అట్టి యుత్తరువులను ఎగ్జిక్యూటివు అధికారి అమలుజరుపవలెను

(3) రీజినలు యిన్స్పెక్టరు (2) వ యుపవిధి క్రింద జారీచేయు నుత్తరవులు, ఇన్స్పెక్టరుజనరలు శాసించిన జనరలు వుత్తరవులుగాని ప్రత్యేక వుత్తరవులుగాని ననుసరించవలెను. సదరుత్తరవులొక విషయమును ప్రత్యేకించి యుండవచ్చును లేక నొక ప్రత్యేక మోస్తరు విషయముల గురించియైన కావచ్చును

28 (2) ఈ పైన చెప్పబడిన విధులలో నేమియున్నను, ప్రభుత్వముయొక్క అనుమతిముందుగా పొంది, ఇనస్పెక్టరు జనరలు ప్రకటన మూలముగా, అన్ని పంచాయతీలలోని శానిటరీ ఇనస్పెక్టర్ల

కందరకు యొక్క ప్రత్యేకసర్వీసు రాష్ట్రమున కంతకు, ఆ ప్రకటనలో చెప్పబడిన తేదీ లగాయతు నిర్మించ వచ్చును

(2) శానిటరీ యినస్పెక్టర్లకు అట్లు (1) వ యుపవిధి క్రింద ప్రత్యేకసర్వీసు నిర్మింపబడినపుడు, ఆ సర్వీసులోని యుద్యోగులకు ఈ క్రింది ప్రత్యేక విధులు వర్తించును —

(i) ఈ సర్వీసు సిబ్బంది మొత్తములో ఈ సర్వీసు నిర్మాణము అయిన తేదీకి పంచాయతీలలోనున్న శానిటరీ ఇనస్పెక్టర్ల స్థానములును, అటుపిమ్మట మంజూరు చేయబడిన స్థానములును, చేరియుండును మరియు నీ సర్వీసులో (I) వ తరగతి (గ్రేడు I) మరియు II వ తరగతి (గ్రేడు II) అను రెండు తరగతులుండును

(ii) ఈ సర్వీసులో చేరియున్న స్థానములను సృష్టించుట రద్దు చేయుట ఇనస్పెక్టరు జనరలు మంజూరు చేయును

(iii) ఈ క్రింది విషయములలో ఇనస్పెక్టరు జెనరలు అధికారి —

(a) సర్వీసులో నియామకములు చేయుట (తాత్కాలికపు నియామకములుకూడ),

(b) సర్వీసులోని యే యుద్యోగి విషయములోనైన, ప్రొబేషను హెచ్చుచేయుట, లేక అంతముచేయుట, లేక ప్రొబేషను తృప్తికరముగా పూర్తిచేసినట్లు తీర్మానించుట,

(c) ఖాయమయిన స్థానములో నేయుద్యోగినైన ఖాయము చేయుట,

(d) II వ గ్రేడునుండి I వ గ్రేడుకు యే వుద్యోగినైన ప్రమోషను చేయుట,

(e) సర్వీసులోని యుద్యోగులను నియమించుట మరియు బదిలీచేయుట (స్థలము మార్చుట), మరియు

(f) సర్వీసులోని యుద్యోగులపై శిక్షలు విధించుట

(iv) ఇనస్పెక్టరు జనరలు తనయొక్క స్వబుద్ధి ననుసరించి, యీ సర్వీసులోని సిబ్బంది విషయమై

(iii) వ క్లాజులో చెప్పబడిన అధికారములను, అన్నిటిని కాని, కొన్నిటినికాని, ఇనస్పెక్టర్ల పర్యవేక్షణ క్రిందనున్న పంచాయతీలలోని యుద్యోగస్తుల విషయములలో, నిర్వహించుటకు, తత్సంబంధమయిన రీజినల్ యిన్‌స్పెక్టర్లకు అధికారమీయవచ్చును

(v) ఈ సర్వీసులోని యే యుద్యోగిపైన నేదైన శిక్షవిధించు ఆజ్ఞ జారీచేయబడినయెడల, రీజినల్ ఇన్‌స్పెక్టర్ జారీ చేసిన ఆజ్ఞపై ఇన్‌స్పెక్టరు జనరల్‌కు, ఇన్‌స్పెక్టరు జనరలుచే జారీచేయబడిన ఆజ్ఞపై ప్రభుత్వమునకును, అప్పీలు చేయవచ్చును

(vi) సర్వీసులోని యుద్యోగులయొక్క వేతనము, సర్వీసుషరతులు, క్రమశిక్షణ మరియు ప్రవర్తనగురించి అప్పుడప్పుడు ఆదేశములను యిచ్చుటకు ఇన్‌స్పెక్టరు జనరల్‌నకు అధికారము కలదు

(3) 1 నుండి 27 వ విధులలో నుడువబడిన విధాయకములు, (2) వ యుపవిధిలోని ప్రత్యేక విధాయకములకు వ్యతిరేకము కానంత మేరకు, (1) వ యుపవిధి ననుసరించి నిర్మింపబడిన శానిటరీ యినస్పెక్టర్ల సర్వీసులోని యుద్యోగులకు వర్తించును

2 వ ప్రకటన

(1950 వ సం॥పు 10 వ మదరాసు ఆక్టు అగు) 1950 వ సం॥పు గ్రామ పంచాయతీ ఆక్టుయొక్క 34 (1) ॥ విభాగమునకైన మినహాయింపు నిబంధనచే నియ్యబడిన అధికారములను చెలాయించుచు ఘనతవహించిన మదరాసు గవర్నరుగారు ఇందుమూలముగా ఈక్రింది విధులను చేయుచున్నారు —

(జి ఓ నె 677 ఎల్ ఏ తేదీ 2-4-1952)

విధులు

కార్యనిర్వాహక అధికారి అవసర నియామకములమీద అధికారము కలిగియుండుట,

1 కార్యనిర్వాహక అధికారి ఈ క్రింది షరతులకు లోబడి ఆక్టుయొక్క 34 (1) వ విభాగమునకైన మినహాయింపు నిబంధన వలన ఇయ్యబడిన అధికారములను చెలాయించవలెను అవేవనగా —

(1) ప్రత్యేకమైన ఏ పనికైనను, అదనపు ఉద్యోగుల మరియు సేవకుల తాత్కాలికపు నియామకము పంచాయతీయొక్క ఏ తీర్మానమువలనగాని లేక రీజినల్ ఇన్‌స్పెక్టరు లేక ఇన్‌స్పెక్టరు వలనగాని నిషేధింపబడియుండలేదు , మరియు

(2) ప్రతి నియామకమును గురించి కార్యనిర్వాహక అధికారి, పంచాయతీకి, దాని మరుసటి సమావేశమప్పుడు మరియు సంబంధించిన రీజినల్ ఇన్‌స్పెక్టరుకు వెంటనే, అట్టి అధికారములను చెలాయించి నందుకైన పూర్తి కారణములతో తెలియజేయవలెను

2 1 వ విధిక్రింద పంచాయతీకి నియామకమును గురించి రిపోర్టుచేసిన తేదీకి పూర్వము, అది అంత్యము కానప్పుడును, అట్టి నియామకము అట్లే జరుగుచుండవలెనని పంచాయతీ తీర్మానముచేసినపుడును, అట్టి నియామకము అట్లే జరుగుచుండుటకు ఆక్టుయొక్క 34 (1) వ విభాగము ననుసరించి అంగీకారముకొఱకు జిల్లా పంచాయతీ ఉద్యోగిద్వారా ఇన్‌స్పెక్టరుకు వెంటనే కార్యనిర్వాహక అధికారి దరఖాస్తు పెట్టుకొనవలెను కాని ఆ నియామకము అంత్యము కావలెనని పంచాయతీకి తీర్మానించు పక్షమున, కార్యనిర్వాహకోద్యోగి తన స్వంత బాధ్యతమీాద ఆ నియామకమును అట్లే జరుగనిచ్చుటకు ఉద్దేశించి దానికి గల కారణములను లిఖితపూర్వకముగా తెలిపిననే తప్ప కార్యనిర్వాహకోద్యోగి ఆ తీర్మానమును అమలులో నుంచవలెను అట్టి సందర్భములో అట్టి అంగీకారము నిమిత్తము ఆయన జిల్లా పంచాయతీ ఉద్యోగిద్వారా ఇన్‌స్పెక్టరుకు వెంటనే దరఖాస్తు పెట్టుకొనవలెను

3 కార్యనిర్వాహక అధికారి తాత్కాలికముగా నియమించిన ఏ ఉద్యోగి లేక సేవకునియొక్కయైన జీతము, బత్తెములు, క్రమముగా నియమింపబడిన ఒక ఉద్యోగికి లేక సేవకునికి వర్తించగల రేట్లకంటె ఎక్కువగా నుండకూడదు

(1950 వ సం॥పు 10 వ మదరాసు ఆక్టు అగు) 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టుయొక్క 34 (2) వ విభాగము వలన ఇయ్యబడిన అధికారములను చెలాయించుచు, ఘనత వహించిన

మదరాసు గవర్నరుగారు ఇందుమూలముగా ఈ క్రింది విధిని చేయు చున్నారు —

విధి.

(జి ఓ నెం 677 ఎల్ ఎ తేదీ 2-4-52)

ప్రజారోగ్య సిబ్బందిలో స్థానములను మంజూరుచేయుట

ఏ పంచాయతీయొక్కనైన ప్రజారోగ్య సిబ్బందియొక్క ఉద్యోగుల, సేవకుల సంఖ్య, హోదా తరగతులను మరియు వారికి చెల్లించగల జీతములు, రుసుములు, బత్తాలను నిర్ణయించుటకు లేక మార్చుటకు పూర్వము ఇన్‌స్పెక్టరు, పబ్లికు హెల్తు డైరెక్టరుతో సంప్రతించవలెను ఏ సందర్భములోనైన ఇన్‌స్పెక్టరును పబ్లికు హెల్తు డైరెక్టరును మధ్య అభిప్రాయభేదము కలిగినయెడల ఇన్‌స్పెక్టరు ఆ విషయమును ప్రభుత్వమువారి ఉత్తరులకై పంపవలెను

(1950 వ సం॥పు 10 వ మదరాసు ఆక్టుఅగు) 1950 వ సం॥రపు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టుయొక్క 34 (2) వ విభాగమువలన యియ్యబడిన అధికారములను చెలాయించుచు ఘనత వహించిన మదరాసు గవర్నరుగారు ఇందుమూలముగా ఈ క్రింది విధులను చేయుచున్నారు —

విధులు

పంచాయతీయొక్క ఉద్యోగుల, సేవకుల అర్హతలు.

(జి ఓ నెం 677, ఎల్ ఎ తేదీ 2-4-1952)

(జి ఓ నెం 839 ఎల్. ఎ తేదీ 10-4-1953)

(జి ఓ నెం 928 ఎల్ ఎ తేదీ 12-10-1954)

1 మినిస్టీరియల్ ఉద్యోగములు, రెవిన్యూ యిన్‌స్పెక్టర్లు, అటెండర్లు, బిల్లుకలెక్టర్లు

ఇందుకు జతచేయబడిన తక్తాయొక్క (1) వ గడిలో నిర్దేశింప బడిన ఒక పంచాయతీక్రింద ఏ స్థానముకుగాని ఏ మనిషినైనను, దానియొక్క (2) వ గడిలో దానికి సరిపోవు నమూదులో విధింప బడిన అర్హతలు ఆయనకున్ననేతప్ప నియమించకూడదు.

తక్తా

| వివరము (1) | అర్హతలు (2) |
| --- | --- |
| (1) మినిస్టీరియల్ ఉద్యోగములు రెవిన్యూ యిన్ స్పెక్టర్లు | మదరాసు విశ్వకళాపరిషత్తు యొక్క మెట్రిక్యులేషన్ పరీక్ష లేక ప్రభుత్వమువారి అధికారము క్రింద జారీచేయబడిన పూర్తియైన సెకండరీ స్కూలు లీవింగ్ సర్టిఫికేటు, లేక అనుబంధములో చెప్పబడిన ఇండియాలోని ఇతర విశ్వకళాపరిషత్తులచే జరుపబడిన దానికి సమానమైన ఏదైన పరీక్ష లేక ఇండియన్ ఆర్మీ స్పెషల్ సర్టిఫికేట్ ఆఫ్ ఎడ్యుకేషన్ |
| (2) అటెండర్లు | అంగీకరించబడిన సెకండరీ పాఠశాలలో మూడవ ఫారములో ఉత్తీర్ణత |
| (3) బిల్లుకలెక్టరు | డిటో |

## అనుబంధము

### ఇండియాదేశపు విశ్వకళాపరిషత్తులు

అలహాబాదు, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, లక్నో, నాగపూర్, పాట్నా విశ్వకళాపరిషత్తులు

అలిఘర్ ముస్లిమ్ విశ్వకళాపరిషత్తు
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు
అన్నామలై విశ్వకళాపరిషత్తు
బెనారస్ హిందూ విశ్వకళాపరిషత్తు
మైసూరు విశ్వకళాపరిషత్తు
ఉస్మానియా విశ్వకళాపరిషత్తు
ఉత్కళ విశ్వకళాపరిషత్తు

### II మెడికల్ ఆఫీసర్లు మరియు క్రింది యుద్యోగస్థులు

యీ క్రింద పట్టీలోని 1 వ కాలములో వుదహరింప బడిన వుద్యోగమునకు, దాని కెదురుగా 2 వ కాలములో చెప్పబడిన విద్యా విశేషణములున్న గాని, పంచాయతీలోని, వుద్యోగములకు ఏవ్యక్తియు తిన్నగా (ప్రథమముననే) నియమింపబడుటకు అర్హుడు కాడు.

## పట్టీ

| ఉద్యోగములు | విద్యా విశేషణములు |
| --- | --- |
| 1 సబ్ అసిస్టెంట్ సర్జన్<br>2 అసిస్టెంటు సర్జన్ | (1) మద్రాస్ మెడికల్ కౌన్సిల్ చే రిజిష్టరు చేయబడినట్టి, రాష్ట్రము లోని యూనివర్సిటీ యొక్క ఎం బి బి, యస్, డిగ్రీ ఎల్ ఎం పి, ఎల్ ఎం. అండ్ ఎస్, లేక డి యం. అండ్ ఎస పట్టాలు గలవారు.<br>(2) ఈ క్రింది హోదాలలో నొక సంవత్సరమునకు తక్కువ కానట్టి సర్వీసు —<br>(1) రాష్ట్రములోని ప్రభుత్వ ఆస్ప త్రులలోగాని, లోకల్ బోర్డుల యొక్క మరియు మ్యునిసిపాలి టీలయొక్క ఆస్పత్రులలోగాని, డిస్పెన్సరీలో గాని, హౌసు సర్జన్, హౌసు ఫిజీషియను, క్లినికల్ అసిస్టెంటు, లేక ఆన రరీ అసిస్టెంటు సర్జను, లేక<br>(11) రాష్ట్రములోని విరాళములతో పోషింపబడుచున్న రూరల్ డిస్పెన్సరీ (గ్రామ డిస్పెన్స రీలో) మెడికలు ఆఫీసర్<br>(3) వయస్సు 35 సంవత్సరములకు మించరాదు |
| 3 నర్సు<br>4 వార్డు అటెండెంటు<br>5 నర్సింగు ఆర్డర్లీ | మద్రాసు ప్రభుత్వములో నా కాలమునకు అట్టి స్థానము లకు అమలులో నున్న విద్యా విశేషణములు |

అయితే అసిస్టెంటు సర్జను స్థానమునకు సాధారణముగా సబు అసిస్టెంటు సర్జనులను ప్రమోషను మూలముగా నియమింప వలెను ఈ విషయములో, సమర్థత, ప్రజ్ఞావిశేషము గమనింపబడి, ఇవి

యించుమించు సమముగా నున్నపుడు మాత్రమే సీనియారిటీ పరిగణింప బడును మరియు, తగిన సబ్ అసిస్టెంటు సర్జనులు లేనపుడు మాత్రమే, అసిస్టెంటు సర్జన్ పదవికి తిన్నగా నియామకము చేయవలెను

అంతేకాక ఆయుర్వేద, యూనాని, సిద్ధ లేక హోమియోపతి ఆస్పత్రులు, లేక డిస్పెన్సరీల విషయములో, ఆనరరీ డైరక్టరు ఆఫ్ ఇండిజినెస్ మెడిసన్‌యును, ఇతర వైద్య సంస్థల విషయములలో డైరెక్టరు మెడికలు సర్వీసెస్‌యును, ఈ విధిక్రింద అట్టి వుద్యోగమునకు అర్హుడుకాని వ్యక్తిని, నర్సింగు ఆర్డర్లీగా నియామకము చేయవచ్చును. కాని అతని జీతము అప్పటికి ప్రభుత్వములో అర్హతలేని నర్సింగు ఆర్డర్లీకి యివ్వతగిన జీతముకంటె నెక్కువ యుండరాదు.

రూరల్ మెడికలు ప్రాక్టీషనరు, పంచాయతీ యొక్క మామూలు క్రమమైన డిస్పెన్సరీలో నియమింపబడిన, అతని వయస్సు, ప్రభుత్వము ఎగ్జంప్షన్ నిస్తే తప్ప, 35 సంవత్సరములు మించిన వయస్సుండరాదు

అంతేకాక, పంచాయతీలచే పోషింపబడుచున్న సక్రమమైన ఆస్పత్రులలోగాని, డిస్పెన్సరీలలోగాని, అసిస్టెంటు సర్జనులుగాను, సబ్ అసిస్టెంటు సర్జనులుగాను నియమింపతగిన అభ్యర్థుల విషయములో, నిర్ణీతమయిన వయస్సు పరిమాణమునుండి ప్రత్యేక రక్షణ (ఎగ్జంప్షను) నిచ్చుటకు ప్రభుత్వమునకు అధికారము కలదు

## III ఆయుర్వేదము, యునానీ లేక సిద్ధ ఆస్పత్రులు, లేక డిస్‌పెన్సరీలలో వైద్య ఉద్యోగులు

ఎట్టి మనిషిగాని, సామాన్య లేక ప్రత్యేక ఉత్తరువుద్వారా ప్రభుత్వమువారిచే జారీచేయబడిన మంజూరు లేకుండ అట్టి మనిషి—

(1) దేశీయ వైద్య వృత్తిదారులను రిజిష్టరు చేయుటకైన విధులలో 2 వ విధిలో చెప్పబడిన "A" తరగతిక్రింద రిజిష్టరుకాబడిననే తప్ప, మరియు

(ii) పనికి నియమింపబడిన తేదీన, పురుషుడైన యెడల 27 సంవత్సరముల వయస్సును, స్త్రీయైన యెడల 30 సంవత్సరముల వయస్సును వచ్చియున్న నే తప్ప,

ఒక పంచాయతీయొక్క పరిపాలనాధికారము క్రింద అయుర్వేద, యూనానీ లేక సిద్ధ ఆస్పత్రి లేక డిస్పెన్సరీలో వైద్య ఉద్యోగిగా నియమింపబడకూడదు,

అయితే

(1) షెడ్యూలు దాఖలా జాతులకు చెందిన ఒక మనిషి విషయములో వయస్సు పరిమితి 30 గా నుండవలెను, మరియు

(2) ఆయుర్వేదము, యునానీ లేక సిద్ధ వైద్యముచేయు గ్రామ డిస్పెన్సరీల స్వాధీనములో కలిసిన ఒక పంచాయతీ క్రింద అదే వైద్యపద్ధతికి చెందిన క్రమమైన డిస్పెన్సరీలో వైద్య ఉద్యోగిగా నుండు ఒక వైద్యవృత్తిదారు సందర్భములో వయస్సు పరిమితి, ప్రభుత్వమువారిచే మినహాయించబడిన మనుష్యుల సందర్భములో తప్ప 35 గా నుండవలెను

## IV కాంపౌన్డర్లను, మెటర్నిటీ అసిస్టెంట్లును

1 కాంపౌండరుగా ప్రభుత్వ నౌకరిలో చేర్చుకొనుటకై ఎన్నుకొన బడుటకు తత్కాలమందు విధింపబడిన అర్హతలను ఒక మనిషి కలిగియున్న నేతప్ప, ఎట్టి మనిషిగాని ఒక పంచాయతీలో కాంపౌండరుగా నియమింపబడకూడదు,

అయితే పంచాయతీలచే పోషింపబడు క్రమమైన లోకల్ ఫండు డిస్పెన్సరీలకు నియమింపబడు, గ్రామ సీమల డిస్పెన్సరీలలోని కాంపౌన్డర్ల సందర్భములో వయస్సు పరిమితి, ప్రభుత్వమువారిచే మినహాయించబడిన మనుష్యుల సందర్భములో తప్ప, 45 ఏండ్లయి యుండవలెను

2 కాంపౌన్డరుగా నియమింపబడుట—

(i) కాంపౌన్డరుగా నియమింపబడుటకు పూర్తిగా అర్హతలను కలిగి తగియున్న నర్సింగు ఆర్డర్లీల తరగతినుండి పరివర్తన మూలముగా జరగవలెను, లేక

(11) అట్టి నర్సింగు ఆర్డర్లీ నియమింపబడుటకు లభించని యెడల, ప్రత్యక్ష నియామకముద్వారా జరగవలెను

3 సామాన్య లేక ప్రత్యేక ఉత్తరువుద్వారా ఇయ్యబడిన ప్రభుత్వ మంజూరీ లేకుండ ఎట్టి మనిషిగాని, మెటర్నటీ అసిస్టెంటుగా ప్రభుత్వ నౌకరీలో నియమింపబడుటకై ఎన్నుకొను నిమిత్తము తత్కాలమందు విధింపబడిన అర్హతలను అట్టి మనిషి కలిగియున్న నే తప్ప, ఒక పంచాయతీ క్రింద మెటర్నటీ అసిస్టెంటుగా నియమింప బడకూడదు.

మినిహాయింపు :— ఈ విధిలోనున్న దేదియు, ఒక పంచాయతీ క్రింద, ప్రసూతి మరియు శిశు సంరక్షణ కేంద్రమును స్వాధీనములో కలిగియుండుటకు నియమింపబడిన ఒక మెటర్నటీ అసిస్టెంటుకు వర్తించకూడదు

## V ఆయుర్వేదము, సిద్ధ యునానీ ఆస్పత్రులు లేక డిస్పెన్సరీలతో కాంపౌన్డర్లును, నర్సింగు ఆర్డర్లీలు

1 ఒక పంచాయతీయొక్క పరిపాలనాధికారము క్రిందనుండు ఆయుర్వేదము, సిద్ధ లేక యునానీ ఆస్పత్రి లేక డిస్పెన్సరీలో ఎట్టి మనిషిగాని, అట్టి మనిషి—

(1) దేశీయ వైద్యములో గవర్నమెంటుబోర్డు ఆఫ్ ఎగ్జామినర్సుచే జారీచేయబడిన ఆయా సంగతికి తగినట్లు ఆయుర్వేదము, సిద్ధ లేక యూనానీవైద్య పద్ధతులలో అర్హతగల కాంపౌన్డరు డిప్లొమాను కలిగియున్న నే తప్ప, మరియు

(2) ఆంగ్లభాషను చదువుటయును వ్రాయుటయును తెలిసియున్న నేతప్ప, కావలసిన ప్రమాణమేమనగా అంగీకరింపబడిన పాఠశాలలో III ఫారము విద్యార్థిగా నుండవలెను

కాంపౌన్డరుగా నియమింపబడకూడదు

2 పంచాయతీ పరిపాలనాధికారము క్రింద ఆయుర్వేద, సిద్ధ, యూనానీ ఆస్పత్రి లేక డిస్పెన్సరీలో ఎట్టి మనిషిగాని, అట్టి మనిషి—

(1) దేశీయ వైద్య కళాశాల ప్రిన్సిపాలుచే అంగీకరింపబడిన ఆయుర్వేద, సిద్ధ, యూనానీ ఆస్పత్రి లేక డిస్పెన్సరీలో ఒక సంవత్సరము కంటె తక్కువకాని కాలపరిమితి వఱకు జీతము చెల్లించబడు లేక జీతము చెల్లించబడని అప్రెంటీసుగా తర్ఫీయతును పూర్తిచేసియున్న నేతప్ప, మరియు

(2) అంగీకరించబడిన ఒక ప్రాథమిక పాఠశాలలో V తరగతిలో ఉత్తీర్ణుడైయున్న నే తప్ప,

నర్సింగు ఆర్డర్లీగా నియమింపబడ కూడదు

3 ఎట్టి మనిషిగాని, పంచాయతీయొక్క పరిపాలనా అధికారము క్రిందనుండు ఆయుర్వేద, సిద్ధ, లేక యునాని ఆస్పత్రి లేక డిస్పెన్సరీలో, అట్టి మనిషి నియమింపబడిన తేదీన 30 సంవత్సరముల వయస్సు పొందియుండినయెడల కాంపౌన్డరుగా లేక నర్సింగు ఆర్డర్లీగా నియమింపబడకూడదు

అయితే పంచాయతీలచే పోషింపబడు దేశీయవైద్య డిస్పెన్సరీలకు నియమింపబడిన గ్రామ సీమల డిస్పెన్సరీల కాంపౌన్డర్ల సందర్భములో వయస్సు పరిమితి, ప్రభుత్వము వారిచే మినహాయించబడిన మనుష్యుల సందర్భములో తప్ప, 34 ఏండ్లుగా నిర్ణయించవలెను

## VI ప్రాథమిక పాఠశాలలలో నియమింపబడు నేతను నూలు వడకుటను నేర్పువారు

ఒక మనిషి నేతపనిలో లోయర్ గ్రేడునందు గవర్నమెంటు టెక్నికల్ ఎగ్జామినేషన్‌లో ఉత్తీర్ణుడైయున్న నే తప్ప లేక గవర్నమెంటు టెక్స్టైయిల్స్ ఇన్‌స్టిట్యూటు తాలూకు నేతపని బోధకుని కోర్సుయొక్క సర్టిఫికేటును పొందిననే తప్ప ఎట్టి మనిషిగాని, ఒక పంచాయతీ పోషించు ఒక ప్రాథమిక పాఠశాలలో నేత లేక వడకుపని బోధకుడుగా, నియమింపబడకూడదు ,

అయితే అర్హతగల అభ్యర్థి నియమింపబడుటకు లభించనియెడల అర్హతగల అభ్యర్థి లభించువరకు, అర్హతలేని మనిషిని, పాఠశాలల డిప్యూటీ ఇన్‌స్పెక్టరుతో సంప్రదించినమీదట నియమించ వచ్చును.

## VII. ప్రాథమిక పాఠశాలలలో ఉపాధ్యాయులు.

1 (1) (2) వ (3) వ ఉపవిధులలో నిబంధింపబడిన విధముగా తప్ప, పంచాయతీచే పోషింపబడు ఒక ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయ పదవిలో నియమించబడు ప్రతి మనిషి, ప్రాథమిక పాఠశాలలకు అంగీకారము నిచ్చుటకు విధులచే నిర్ణయించబడిన అర్హతలను కలిగియుండవలెను ,

అయితే లోయర్ ఎలిమెంటరీ గ్రేడు, ట్రెయిన్డు టీచరు సర్టిఫికేటును కలిగిన ఏ మనిషిగాని సంబంధించిన జిల్లా ఎడ్యుకేషనల్ ఆఫీసరుయొక్క అంగీకారమును ముందుగా పొందకుండ ఏ ప్రాథమిక పాఠశాలలలోగాని నియమింపబడకూడదు

పై మినహాయింపు నిబంధన క్రింద ఇయ్యబడిన ప్రతి అంగీకారముతో, మినహాయింపు నిబంధనలో నిర్దేశింపబడిన అర్హతలకంటె ఎక్కువ అర్హతలు కలిగిన ఏ మనిషిగాని ఆ పదవికి నియమించుటకు లభించలేదని సంబంధించిన ఉద్యోగినుండి ఒక సర్టిఫికేటును పంపవలెను

(2) (1) వ ఉపవిధిలో నిర్దేశింపబడిన అర్హతలను కలిగియుండని ఒక మనిషిని, సంబంధించిన జిల్లా ఎడ్యుకేషనల్ ఆఫీసరుయొక్క అంగీకారమును ముందుగా పొంది అందులో చెప్పబడిన ఏ పదవికైనను నియమించవచ్చును

ఈ ఉప విధి క్రింద ఇయ్యబడిన ప్రతి అనుమతితో, (1) వ ఉపవిధిలో నిర్దేశింపబడిన అర్హతలను కలిగిన ఎట్టి మనిషిగాని సంబంధించిన పదవిక నియమించుటకు లభించలేదని సంబంధించిన ఉద్యోగినుండి ఒక సర్టిఫికేటును జతచేసి పంపవలెను అట్టి అనుమతి ఒక సంవత్సరముకంటె ఎక్కువ కాలపరిమితివరకు చెల్లకూడదు

(3) స్థానికావసరములనుబట్టి, ఒక సమయమందు ఒక సంవత్సరముకంటె ఎక్కువకాని కాలపరిమితివరకు ప్రత్యేక సందర్భములలో జిల్లా ఎడ్యుకేషనల్ ఆఫీసరుయొక్క అనుమతి ముందుగా పొంది తర్ఫీయతుపొందని మనిషిని, ఒక ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయునిగా నియమించవచ్చును. అయితే అట్టి మనిషి III ఫార

ములో ఉత్తీర్ణతకు తక్కువకాని సాధారణ విద్యార్హతలను కలిగి యుండి ఆ పాఠశాలయుండు ప్రాంతమునకు చెందినవాడై యుండవలెను

(4) 17 ఏండ్లు ఈడురాని ఏ మనిషిగాని, ఒక పంచాయతీచే పోషించబడు ఏ పాఠశాలలోనైన ఉపాధ్యాయపదవికి నియమింపబడుటకు అర్హుడై యుండకూడదు

2 (1) ఒక స్త్రీ, బాలుర పాఠశాలలో ఉపాధ్యాయినిగా నియమింపబడుటకు లేక బదిలీచేయబడుటకు అర్హురాలుగా నుండవలెను

(2) ఎట్టి మనిషిగాని—

(a) ఆయన 30 ఏండ్ల వయస్సుకు పైబడియున్ననే తప్ప మరియు

(b) 1 వ విధియొక్క (1) వ ఉపవిధి ననుసరించి అర్హతగలిగిన ఒక స్త్రీ ఉపాధ్యాయుని నియమింపబడుటకు లభింపక యున్నచేతప్ప,

ఒక బాలికా పాఠశాలలో ఉపాధ్యాయుడుగా నియమింపబడుటకు లేక బదలీచేయబడుటకు అర్హుడుగా నుండకూడదు

3 ఈ విధులలో అంగీకరింపబడిన విధముగాకాక ఇతర విధముగా నియమింపబడిన అనర్హులైన ఉపాధ్యాయుల సందర్భములో తగిలిన ఏ ఖర్చునయనను నియామకమునుచేయు అధికారిమీద సర్చార్జి చేయబడవలెను

4 ఏ పండితుడు లేక మనిషి వ్యాయామబోధకుడు, లేక చిత్రలేఖనోపాధ్యాయుడుగాని, ప్రభుత్వమువారి అనుమతిని ముందుగా పొందకుండ ఒక పంచాయతీచే పోషించబడిన ఏ ప్రాథమిక పాఠశాలలోనైన ప్రత్యేకముగా ఆలాగున నియమింపబడకూడదు

## VIII వెటరినరీ సర్జనులు

జంతురక్షణ డైరెక్టరుతో సంప్రదించిననే తప్ప, ఎట్టి మనిషిగాని ఒక పంచాయతీ క్రింద వెటరినరీ సర్జనుగా నియమించబడకూడదు, మరియు అట్టి మనిషి—

(i) 32 ఏండ్ల వయస్సు వాడైయున్ననే తప్ప,

మరియు

(ii) మదరాసు వెటరినరీ సబార్డినేటు సర్వీసు-1 వ తరగతి-వెటరినరీ అసిస్టెంటు సర్జనులుగా నియమింపబడుటకు తత్కాలమందు అమలులోనున్న వయస్సుకు సంబంధించిన అర్హతలు కాని ఇతర అర్హతలను కలిగియున్ననేతప్ప అట్లు నియమింపబడకూడదు.

## IX సర్వేయరులు

ఒక పంచాయతీచే సర్వేయరుగా నియమింపబడిన ఒక మనిషి, అతని ప్రొబేషన్ కాలపరిమితిలోపల క్రింది అనుబంధములో నిర్దేశింపబడిన డిప్యూటీ సర్వేయరు టెస్టులో ఉత్తీర్ణుడు కావలెను,

అయితే ఈ విధిలో నున్న దేదియు గిండీ ఇంజినీరింగు కాలేజి యొక్క అప్పర్ లేక లోయర్ సబార్డినేటు సర్టిఫికేటును కలిగిన ఒక మనిషికి వర్తించకూడదు కాని అట్టి మనిషి డిప్యూటీ సర్వేయరు టెస్టులో ఉత్తీర్ణుడగు నంతవరకు ఒక పంచాయతీ క్రింద ఒక సర్వేయరుగా అతని ఉద్యోగములో ఖాయము చేయబడుటకు అర్హుడుగా నుండకూడదు

### అనుబంధము

### డిప్యూటి సర్వేయరు పరీక్ష

1 లెక్కలు-దశాంశ భిన్నములు, వర్గమూలము వరకు

2 దస్తూరి చెప్పి వ్రాయించుట

3 'గ్రామ కరణములకైన భూమిని సర్వేచేయుట' అను పుస్తకము పూర్తిగ

4. సర్వే మాన్యుయలు 1923—

అధ్యాయములు 1, 2, 3 6, 7 పూర్తిగా

10 వ అధ్యాయము-3 నుండి 13 వరకు గల విధులు

11 వ అధ్యాయము-1 నుండి 6 వరకు గల విధులు

12 వ అధ్యాయము-1 నుండి 30 వరకు గల విధులు

13 వ అధ్యాయము-1 నుండి 133 వరకు గల విధులు

16 వ అధ్యాయము - 16 నుండి 36 వరకు గల విధులు.

17 వ అధ్యాయము - 241 నుండి 279 వరకు గల విధులు

19 వ అధ్యాయము - ప్రపోర్షనల్ కాంపసెస్, బీమ్ కాంపసెస్, బో కాంపసెస్, పన్టెగ్రాఫు మినహాయించి అన్ని సర్వే పరికరములు

20 వ అధ్యాయము - ప్రాబ్లములు (సమస్యలు)

5 బో స్టా ఆ నెం 34 రు, A B C - 3, 4, 5, 6, 7, 10, 11, 12, 15, 16 అనుబంధములు మినహాయించి

## X ప్రజారోగ్య (పబ్లిక్ హెల్తు) సిబ్బంది.

ఈ క్రింద వివరింపబడిన పట్టీలో (1) వ కాలము క్రింద చెప్ప బడిన యే స్థానమునకయిన, దాని కెదురుగా (2) వ కాలములో వ్రాయబడిన విద్యా విశేషములున్నగాని యే వ్యక్తిని పంచాయతీలో నియమింపరాదు

అయితే జనరలు సిబ్బందియొక్క నియామకము, శిక్షలు మున్నగువాటిని గురించి చేసిన విధులలో ఏమి చెప్పబడి యున్నప్ప టికిని, ఈ క్రింది పట్టీలోని (2)వ కాలమును నుదహరించబడిన వయస్సు పరిమితి, దాని కెదురుగానున్న స్థానములో మొట్టమొదట నియ మితుఢయ్యే వ్యక్తికి వర్తించును

అయితే పంచాయతీకిగాని, మరియొక పంచాయతీకిగాని, బదిలీవల్లగాని, లేక ప్రమోషను వల్లగాని నియమితుడగు వ్యక్తికి (2) వ కాలములోని వయస్సు పరిమితి వర్తించదు

మరియు యితర విధముగా యీ పట్టీలో ప్రత్యేకముగా వక్కాణింపబడిననే తప్ప, పట్టీలో చెప్పబడిన స్థానములలో ఇదివరకే నున్న వ్యక్తులను ఆ స్థానములలో వుంచుటకు ఎట్టి అంతరాయము యీ విధి కలిగింపకూడదు ఇంతేకాక అట్టి స్థానములలో ప్రొబే షను ప్రారంభించి యిదివరకు అమలులోనున్న విధుల ప్రకారం ఆ స్థానములో నుండుటకు తగినవారై యుండిగాని, లేక క్రమ పద్ధతిపై ఆ స్థానములలో నియమింపబడుటకుగాని, ఆ స్థానములలోనే యుంచబడుటకుగాని ప్రత్యేక రక్షణ (ఎగ్జంప్షను) నియ్యబడి నట్టి

వారినిగాని, వారివంతు ప్రకారము తిరిగి ఆ స్థానములలో నియమింప బడుటకు, యీ విధి యేఅడ్డు కలిగింపరాదు

పట్టి

| ఉద్యోగము | విద్యాగుణ విశేషగుణములు |
| --- | --- |
| (1) శానిటరీ ఇన్‌స్పెక్టరు మరియు హెల్తు అసిస్టెంటు. | (1) 30 సంవత్సరములకు మించి వయస్సు వుండరాదు<br>అయితే బదిలీ మీదగాని, లేక II వ గ్రేడునుండి I వ గ్రేడుకు ప్రమోషను వల్లగాని, మరియు హెల్తు అసిస్టెంటు నుండి IIవ గ్రేడు శానిటరీ ఇన్‌స్పెక్టరుగా ప్రమోషను మూలమునగాని, శానిటరీ ఇన్‌స్పెక్టరుగా నియమింపబడు టలో ఈ విధి వర్తించదు అదియుకాక, వారి సక్రమ నియామకమునకు పూర్వము ఏదయిన స్థానిక సంస్థలో క్రింద మూడు సంవత్సరముల కాలము వ్యాపించుచున్న జాడ్యములలోగాని, ఉత్సవ సందర్భము లలోగాని, శానిటరీ ఇన్‌స్పెక్టర్లుగా పని చేసిన వారికి 35 సంవత్సరముల వయస్సు నిండనియెడల ఈ విధి వర్తించదు<br>(ii) ఈ విషయములో, ప్రభుత్వము బోర్డు ఆఫ్ ఎగ్జామినర్సుయొక్క అధ్య క్షుడుగా నియమింపబడిన డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ హెల్తువల్ల నియమించబడిన శానిటరీ యిన్‌స్పెక్టరు సర్టిఫికెటు కలిగియుండ వలెను<br>(iii) ఈ క్రింద వివరింపబడిన భాష లలో కనీసమొక్క దానిమైన వ్రాయు టకు, చదువుటకు సమర్థత యుండ వలెను —<br>తమిళము, తెలుగు, మలయాళము, కన్నడము మరియు హిందూస్తాని<br>అయితే, మద్రాసు మెడికలు రిజి స్ట్రేషను ఆక్టు, 1914 క్రింద రిజిష్టరు |

| వుద్యోగము | విద్యా గుణవిశేషములు |
| --- | --- |
| | చేయబడిన విద్యావిశేషములున్న అభ్యర్థి విషయములో, (1)నుండి(111) వర్గాజులలో చెప్పబడిన గుణవిశేషములు వర్తింపవు |
| (2) మెటర్నిటీ అసిస్టెంటు (పురిటాలు, బిడ్డ ఆరోగ్యము) | (1) 21 సంవత్సరములకు తక్కువగాను, 40 సంవత్సరములకు ఎక్కువగాను, వయస్సువుండ రాదు మరియు<br>(11) మంత్రసానిత్వములో డిప్లొమా (పట్టా) కలిగియుండి, మరియు, మద్రాసు నర్సస్ అండు మిడ్వైవ్సు ఆక్టు 1926 క్రింద రిజిష్టరు చేయబడిన మెటర్నిటీ అసిస్టెంటు అయివుండ వలెను |
| (3) శానిటరీ మేస్త్రీ లేక పబ్లికుహెల్తు జవాను. | (1) 25 సంవత్సరముల వయస్సు మించరాదు అయితే, కంటింజెన్సీ మొత్తము నుండి వేతనమియ్య బడుచున్న నౌఖరును, పంచాయతీ సర్వీసులో నతను 25 సంవత్సరములు వయస్సు రాక పూర్వము చేరియుండిన యెడల, అతనిని శానిటరీ మేస్త్రీగా గాని, పబ్లిక్ హెల్తుజవానుగా గాని, నియమించుటలో ఈ విధి వర్తించదు ఆదియుకాక యిగివరలో<br>సైన్యములో పని చేసిన వానినిగా గాని, లేక ఎ ఆర్ పి గాని, సివిల్ డిఫెన్సు స్కీములో జవానుగాగాని, మేస్త్రీగాగాని పనిచేసిన వానినిగాని, శానిటరీ మేస్త్రీగాగాని, పబ్లిక్ హెల్తు జవానుగాగాని, నియమించుటలో యీ విధి వర్తించగ<br>(11) అతను యే జిల్లాలో నియమింపబడునో, ఆ జిల్లాలోని భాషగాని, ఆజిల్లాలోని భాషలలో నొక దానినిగాని వ్రాయుటకు చదువుటకు సమర్థత యుండవలెను |
| (4) ఫీల్డు అసిస్టెంటు (మలేరియా) మరియు మేస్త్రీ (మలేరియా) | (1) ప్రభుత్వ సర్వీసులో నిట్టి స్థానములకు నియమించుటకు నిర్ణయింపబడిన యోగ్యత కలిగియుండవలెను |

| ఉద్యోగము | విద్యాగుణవిశేషములు |
|---|---|
| | (ii) తిన్నగా నియమించబడిన యెడల 25 సంవత్సరముల వయస్సు పూర్తి కాకూడదు. |
| (5) ఫీల్డు అసిస్టెంటు (గినీవరమ్) (నారిసురుపు) | (i) తిన్నగా నియమింపబడిన యెడల 25 సంవత్సరముల వయస్సు పూర్తి కాకూడదు |
| | (ii) గవర్నమెంటు విద్యాశాఖ వలన ఆమోదింపబడిన సెకండరీ స్కూలులో III వ ఫారం ప్యాసు కావలెను, లేదా, ఆర్మీ ఫస్ట్‌క్లాస్ సర్టిఫికేటు ఆఫ్ ఎడ్యుకేషనుపొంది యుండవలెను, మరియు, |
| | (iii) రాష్ట్రములోని రీజినల్ మలేరియాల జిస్టు ఆర్గనైజేషనులలో నొకదానిలో గినీవరము సర్వే మరియు కంట్రోలు పనిలో ఒక నెల తరిఫీదు పొందియుండవలెను |
| (6) ఆయా-(పురటాలు శిశు ఆరోగ్యము) | 30 సంవత్సరముల వయస్సు పూర్తి కావలెను |

## XI పట్టణనిర్మాణ (టౌనుప్లానింగు) సిబ్బంది

ఈ క్రింది వివరించిన పట్టీలో మొదటి వరుసలో (కాలములో) చెప్పబడిన యే ఉద్యోగమునకైన, దాని కెదురుగ రెండవ వరుసలో (కాలములో) చెప్పబడిన విద్యాగుణవిశేషములు కలిగి యుండనిదే ఏ వ్యక్తిని పంచాయతీలో నియమించరాదు

పట్టీ

| ఉద్యోగములు | విద్యాగుణవిశేషములు |
|---|---|
| (1) టౌను ప్లానింగు మరియు బిల్డింగు సూపరువైజర్ | (i) గిండీ యింజనీరింగు కాలేజి యొక్క అప్పరు సబార్డినేటు డిప్లొమా మరియు నే స్థానిక సంస్థలోనైన మూడు సంవత్సరములకు తక్కువ కాకుండా టౌను ప్లానింగు మరియు యింజనీరింగులో అనుభవము, ఆ మూడు సంవత్సరములలో |

| వుద్యోగము | విద్యాగుణవిశేషములు |
|---|---|
| | రెండు సంవత్సరముల టౌను ప్లానింగులో అనుభవము ; లేక |
| | (ii) గిండీ యింజనీరింగు కాలేజి యొక్క లోయరు సబార్డినేటు డిప్లొమా మరియు నేస్థానిక సంస్థలలోనైనా ఐదు సంవత్సరములకు తక్కువ కాకుండా టవునుప్లానింగు మరియు యింజనీరింగులో అనుభవము, సదరు అయిదు సంవత్సరములలో మూడు సంవత్సరముల టౌను ప్లానింగులో అనుభవము వుండవలెను. |
| | అయితే, (i) వ అంశముక్రింద నుడువబడిన విద్యాగుణములుకల అభ్యర్థి లేనప్పుడు మాత్రమే (ii) వ అంశములో నుడువబడిన విద్యా విశేషములు కలవానిని నియమించవలెను. |
| (2) టౌను ప్లానింగు మరియు బిల్డింగు ఓవర్సీరు | (i) గిండీ యింజనీరింగు కాలేజీయొక్క అప్పర్ సబార్డినేటు డిప్లొమా, మరియు నే స్థానికసంస్థలోనైన ఒక సంవత్సరమునకు తక్కువకాకుండ టౌను ప్లానింగు మరియు ఇంజనిరింగులో అనుభవము లేక |
| | (ii) గిండీ యింజనిరింగు కాలేజీ యొక్క లోయరు సబార్డినేటు డిప్లొమా మరియు నే స్థానిక సంస్థలోనైన రెండు సంవత్సరములకు తక్కువకాకుండ టౌన్ ప్లానింగు మరియు యింజనీరింగులో అనుభవముండవలెను , లేక |
| | (iii) ఒక స్థానిక సంస్థలో రెండు సంవత్సరములకు తక్కువకాకుండ I వ గ్రేడు టౌన్ ప్లానింగు మరియు బిల్డింగు యిన్‌స్పెక్టరుగా సర్వీసు , |
| | అయితే (iii) వ అంశములో నుడువబడిన విద్యావిశేషములున్న అభ్యర్థిని, (i) (ii) వ అంశములలో నుడువబడిన |

## ఉద్యోగములు

(3) టౌను ప్లానింగు మరియు బిల్డింగు యిన్‌స్పెక్టరు, I వ గ్రేడు

(4) టౌన్ ప్లానింగు మరియు బిల్డింగు యిన్‌స్పెక్టరు, II వ గ్రేడు

## విద్యాగుణవిశేషములు

విద్యాగుణములు కలిగిన అభ్యర్థులు దొరకనపుడు మాత్రమే నియమింపబడవలెను.

మరియు, గిండీ యింజనీరింగు కాలేజీ యొక్క అప్పరు లేక లోయరు సబార్డినేటు డిప్లొమా లేని అభ్యర్థులను, డైరెక్టరు ఆఫ్ టౌను ప్లానింగుయొక్క అనుమతి ముందుగా తీసుకొని మాత్రమే నియమించవలెను

(i) గిండీ యింజనీరింగు కాలేజీ యొక్క అప్పర్ సబార్డినేటు డిప్లొమా గాని లేక లోయరు సబార్డినేటు డిప్లొమాగాని, మరియు నేదేని స్థానిక సంస్థలో ఒక సంవత్సరమునకు తక్కువ కాకుండ టౌను ప్లానింగులోగాని, ఇంజనీరింగులోగాని అనుభవము

అయితే I వ గ్రేడుకు, అప్పరు సబార్డినేటు డిప్లొమాకల అభ్యర్థులు లేనపుడు మాత్రమే, లోయరు సబార్డినేటు డిప్లొమా కలవారిని నియమించవలెను, లేక

(ii) I వ గ్రేడుకు నియామకమునకు, II వ గ్రేడు టౌను ప్లానింగు మరియు బిల్డింగు ఇన్‌స్పెక్టరుగా ఒక స్థానిక సంస్థలో రెండు సంవత్సరములకు తక్కువ కాకుండ అనుభవము, మరియు II వ గ్రేడుకు నియామక విషయములో, III వ గ్రేడు టౌను ప్లానింగు మరియు బిల్డింగు యిన్‌స్పెక్టరుగా ఒక సంవత్సరమునకు తక్కువ కాకుండ అనుభవము

అయితే, (i) వ అంశములో పేర్కొనబడిన విద్యాగుణ విశేషములుకల అభ్యర్థి లేనపుడు మాత్రమే (ii) వ అంశములో పేర్కొనబడిన విద్యాగుణములు కలిగిన అభ్యర్థిని నియమించవలెను,

| ఉద్యోగములు | విద్యాగుణ విశేషములు |
|---|---|
| | మరియు, గిండీ యింజనీరింగు కాలేజి యొక్క అప్పరు లేక లోయరు సబార్డినేటు డిప్లొమా కలిగియుండని అభ్యర్థులను, డైరక్టర్ ఆఫ్ టౌను ప్లానింగు యొక్క అనుమతి ముందుగాపొంది నియమించ వలెను |
| (5) టౌన్ ప్లానింగు మరియు బిల్డింగు యిన్‌స్పెక్టరు గ్రేడు III | (i) గిండి యింజనీరింగు కాలేజి యొక్క లోయరు సబార్డినేటుడిప్లొమా, లేక<br>(ii) ప్రభుత్వము యొక్క టెక్నికల్ పరీక్షలలో, బిల్డింగు డ్రాయింగు, బిల్డింగు కంస్ట్రక్షన్ మరియు సర్వేయింగులో ప్యాసు, మరియు నేదేని స్థానిక సంస్థలో ఒక సంవత్సరమునకు, తక్కువ కాకుండ టౌను ప్లానింగులోగాని, లేక యింజనీరింగులోగాని అనుభవము, లేక<br>(iii) డిప్యూటీ సర్వేయర్సు టెస్టులో ప్యాసు మరియు నేస్థానిక సంస్థలోనైన ఒక సంవత్సరమునకు తక్కువ కాకుండ, టౌను సర్వేయరుగాగాని; లేక సర్వేయరుగాగాని, లేక డ్రాఫ్ట్స్‌మనుగాగాని అనుభవము |
| (6) టౌను ప్లానింగు సర్వేయరు లేక బిల్డింగ్ డ్రాఫ్ట్స్‌మను, గ్రేడు I<br>(7) బిల్డింగ్ డ్రాఫ్ట్స్‌మన్, గ్రేడు II. | (i) గిండి యింజనీరింగు కాలేజి యొక్క లోయరు సబార్డినేటు డిప్లొమా, లేక<br>(ii) మద్రాసు ప్రభుత్వముచే నామోదింపబడిన డ్రాఫ్ట్స్‌మను డిప్లొమా నేదయినా, లేక<br>(iii) డిప్యూటి సర్వేయర్సు టెస్టు, లేక<br>(iv) ప్రభుత్వము యొక్క టెక్నికల్ పరీక్షలలో, బిల్డింగు డ్రాయింగు, బిల్డింగ్ కంస్ట్రక్షను మరియు సర్వేయింగులో ప్యాసున్ను, మరియు ఆరుమాసములకు |

| వుద్యోగములు | విద్యాగుణవిశేషములు |
|---|---|
| | తక్కువకాకుండ టౌను ప్లానింగు లేక డ్రాయింగు పనిలో అనుభవము, లేక |
| | (v) రెవిన్యూ డ్రాఫ్ట్సుమన్సు టెస్టు |
| (8) టౌను ప్లానింగు డ్రేసరు, | (i) మద్రాసు ప్రభుత్వముచే నామోదింపబడిన డ్రాఫ్ట్సుమను డిప్లొమా యేది అయిన, లేక |
| | (ii) డిప్యూటీ సర్వేయర్సు టెస్టు, లేక |
| | (iii) రివిన్యూ డ్రాఫ్ట్సుమన్సు టెస్టు, లేక |
| | (iv) ప్రభుత్వముయొక్క టెక్నికలు పరీక్షలలో, బిల్డింగ్ డ్రాయింగు, లేక బిల్డింగ్ కన్‌స్ట్రక్షను మరియు సర్వేయింగులో ప్యాసు |

ఈ విధిలో నేమి చెప్పబడినప్పటికి, యీ విధిలో నుడువబడిన విద్యాగుణవిశేషములు కాక, యితర విద్యా విశేషములు కలిగియున్న వ్యక్తిని యే వుద్యోగమునకై నియమింపవలసినపుడు, ఆవ్యక్తి కలిగియున్న విద్యా విశేషములు, ఆ వుద్యోగమును నిర్వహించుటకు తగినవని లేక చాలునని, డైరక్టరు అఫ్ టౌనుప్లానింగు తృప్తిపడిన యెడల, అట్టి నియామకము నాతడు ఆమోదించవచ్చును అయితే అట్టి నియామకము ఒకమారు ఒక సంవత్సరముకంటె నెక్కువ కాకూడదు

(1950 వ 10 వ మదరాసు ఆక్టు అగు) 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టుయొక్క 34 (2) మరియు (6) వ సెక్షనుచే నియ్యబడిన అధికారములను చెలాయించుచు, ఘనత వహించిన మదరాసు గవర్నరుగారు ఇందుమూలమున ఈ క్రింది విధులను చేయుచున్నారు —

(జి ఓ, నెం॥ 1116 ఎల్ ఎ తేదీ 4-6-1951)

(జి ఓ, నెం॥ 470 ఎల్ ఎ తేదీ 17-3-1952)

## విధులు

## పంచాయతీల ఉద్యోగులును నౌకరులును నడచుకొనవలసిన విధాయకము.

బహుమతులు, పారితోషికములు మరియు బహుమానములు —(1) ఈ విధులలో ఇతరవిధముగా నిబంధింపబడిననే తప్ప ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు కార్యనిర్వాహక అధికారి యొక్క అనుమతిని ముందుగా పొందిననే తప్ప, తన తరఫునగాని ఏ ఇతర మనిషి తరఫునగాని ప్రత్యక్షముగా లేక పరోక్షముగా, అతనికి సంబంధములేని ఏ మనిషియొద్దనుండియైన ఎట్టి బహుమతి పారితోషికము లేక బహూమానమునైన్న లేక బహుమతి పారితోషికము లేక బహుమానమును ఇచ్చుటనుగాని అంగీకరించకూడదు లేక అతని కుటుంబమునకు చెందిన ఏ వ్యక్తిగాని అట్లు అంగీకరించుటను అనుమతించకూడదు

(2) ప్రభుత్వమువారి ఏదైన సామాన్య లేక ప్రత్యేక ఉత్తరువుయొక్క నిబంధనలకు లోబడి, ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు మర్యాదకొరకు నియ్యబడు పుష్పములు లేక పండ్లువంటి బహుమతిని లేక స్వల్ప విలువగల అదే విధమైన వస్తువులను అంగీకరించవచ్చును. కాని ఒక పంచాయతీయొక్క ఉద్యోగులు, నౌకర్లు అందరు అట్టి బహుమతులను ఇవ్వజరపుటను ప్రోత్సహించకుండుటకు సాధ్యమైనంతవరకు ప్రయత్నించవలెను

(3) ప్రభుత్వమువారి ఏదైన సామాన్య లేక ప్రత్యేక ఉత్తరువుయుక్క నిబంధనలకు లోబడి ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు అతని దగ్గరి స్నేహితుడైన ఒక వ్యక్తినుండి అన్ని పరిస్థితులలో న్యాయమైన విలువగల వివాహ సమయమందు ఇయ్యబడు ఒక బహూమానమును అంగీకరించునట్లు అతని కుటుంబమునకు చెందిన ఏ మనిషికైన అనుమతి నియ్యవచ్చును ఒక పంచాయతీయొక్క యావన్మంది ఉద్యోగులును, నౌకర్లును అట్టిబహుమతుల నిచ్చుటను ప్రోత్సహించకుండుటకు తమ శాయశక్తుల

ప్రయత్నించవలెను మరియు అట్లు పుచ్చుకొనుటను లేక అనుమతి నిచ్చుటను కార్యనిర్వాహక అధికారికి తెలుపవలెను కార్యనిర్వాహక అధికారి అట్లు కోరినయెడల ఆ బహుమతిని, బహుమతి నిచ్చిన వారికి తిరిగి ఇచ్చివేయవలెను

(4) ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు ఎక్కువ మనోక్లేశము కలిగించక ఒక మనిషినుండి ఎక్కువ విలువ కలిగిన ఒక బహుమతిని నిరాకరించుటకు వీలులేనియెడల ఆయన దానిని అంగీకరించవచ్చును కాని పంచాయతీ యితర విధముగా ఆజ్ఞాపించిననే తప్ప ఆ బహుమతిని పంచాయతీకి అప్పచెప్పవలెను

(5) ప్రభుత్వమువారి ఏదైన ప్రత్యేక లేక సామాన్య ఉత్తరవు ననుసరించి, ఒక పంచాయతీయొక్క వైద్య లేక పశువైద్య ఉద్యోగి, ఆతని వృత్తికి సంబంధించిన సేవలకొరకు ఏ మనిషి లేక మనుష్యుల సంస్థవలననైన సముద్దేశముతో నియ్యబడిన ఏ బహుమతి పారితోషికము లేక బహుమానమునైన అంగీకరించవచ్చును

అయితే ఒక పంచాయితీయొక్క పశువైద్యముచేయు ఏ ఉద్యోగిగాని అంటువ్యాధులకొరకు జంతువులకు సూదివేసినందుకు ఎట్టి బహుమతి, పారితోషికము, లేక బహుమానమునుగాని అంగీకరించకూడదు

(6) ఒక పంచాయతీయొక్క ఏ ఉద్యోగి లేక నౌకరుగాని ఇతరులకు చెందిన బండ్లను లేక జంతువులను వాలాయముగా ఉపయోగించకూడదు, లేక బాడుగకుపోవు ఏ బండిలోనైన ఛార్జి లేకుండ ప్రయాణము చేయకూడదు

2. చందాలు —ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు ఏదైన పబ్లిక్ లేక స్థానిక కార్యముకొరకు చందాలు వసూలు చేయుటలో పాల్గొనకూడదు

అయితే కార్యనిర్వాహక అధికారి బాలుర ప్రాథమిక పాఠశాలలలో నియమింపబడిన ఉపాధ్యాయుల సందర్భములో పాఠశాలల సీనియర్ డిప్యూటీ ఇన్‌స్పెక్టరుతోను, బాలికా ప్రాథమిక పాఠశాల

లలో నియమింపబడిన ఉపాధ్యాయసందర్భములో పాఠశాలల సబ్ అసిస్టెంటు ఇన్‌స్పెక్టర్స్‌తోను సంప్రతించి ఈ క్రింది కార్యముల కొరకు చందాలను వసూలుచేయుటకు ఉపాధ్యాయులకు అనుమతి నీయవచ్చును, అవేవనగా —

(I) పాఠశాల వార్షికోత్సవము లేక తలిదండ్రుల దినమునకు సంబంధించిన ఉత్సవము దీనిలో తరగతిలో జరుగు పనులకు, వ్యాయామ క్రీడలకు ఇయ్యబడు బహుమతులు, విద్యార్థులచే జరుపబడు పాఠశాల వేడుకలు చేరును,

(II) జీతము లేక పుస్తకములకొరకు లేక అర్హులైన విద్యార్థులకు భోజనము పెట్టుటకై బీద విద్యార్థుల నిధి,

(III) పాఠశాల సంబంధమైన యాత్రలు,

(IV) విద్యా సంబంధమైన ప్రదర్శనములును, ప్రచారమును

అట్టి వసూళ్లు వాటినుండి అయిన ఖర్చుల విషయమున సరియైన లెక్కలను వ్రాసియుంచుటకు పాఠశాలయొక్క ప్రధానోపాధ్యాయుడు లేక ప్రధానోపాధ్యాయిని బాధ్యులై యుండవలెను.

ప్రధానోపాధ్యాయుడు లేక ప్రధానోపాధ్యాయిని ప్రతికార్యమునకు ప్రత్యేకముగా రాబడులు, ఖర్చుల స్టేటుమెంటు నొకదానిని తయారుచేసి, వేడుకలు ముగిసిన తరువాత ఒక వారములోపల లేక ఇతర సందర్భములలో లెక్కలు పరిష్కారమైన తరువాత కార్యనిర్వాహక అధికారికి పంపవలెను పాఠశాలలను చూడవచ్చినపుడుగాని పరీక్షా సమయమందుగాని తనిఖీచేయు ఉద్యోగులు పరీక్షించు నిమిత్తము కూడ ఈ లెక్కలు సిద్ధపరుపబడవలెను వసూళ్లలో మిగత ఏదైన ఉన్నయెడల దానిని పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకులో డిపాజిటుచేసి ఉంచవలెను

3 రాజీనామాను కొనుట —ఒక పంచాయతీయొక్క వుద్యోగులు లేక నౌకర్లు యితరుల లాభముకొరకు పంచాయతీ క్రింద నుండు ఏ వుద్యోగమునైనను వారిలో నొకరిచే రాజీనామా ఇవ్వ

బడు నిమిత్తము ఎట్టి ద్రవ్యసంబంధమైన ఏర్పాట్లుగాని చేయకూడదు. ఈ విధిని వుల్లంఘించిన పక్షమున అట్టి రాజీనామా ఫలితముగా ఏర్పడిన ఏ వుద్యోగముగాని రద్దుచేయబడవలెను అట్టి ఏర్పాటుకు సంబంధించిన మనుష్యులు నౌకరీలో యింకను వుండిన పక్షమున కార్య నిర్వాహక అధికారి వుత్తరువు జారీచేయునంతవరకు పనినుండి తాత్కాలికముగ నిలిపియుంచవలెను

4 పంచాయతీలయొక్క వుద్యోగులు మరియు నౌకర్లకు చెందిన లేక వారు సంపాదించిన స్థిరాస్థిమీద అధికారము —ఒక పంచాయతీయొక్క ప్రతి వుద్యోగి లేక నౌకరు లేక ఒక పంచాయతీ క్రింద నౌకరీ చేయుటకు కోరు ఒక అభ్యర్థి, తనచే లేక తన భార్యచే లేక తనతో నివసించు లేక తనమీద ఏవిధముగానైన ఆధారపడి యుండు తన కుటుంబమునకు చెందిన ఏ వ్యక్తిచేనైన లేక అప్పు డప్పుడు ఉండిన లేక సంపాదించియుండగల యావత్తు స్థిరాస్థిని గురించి ఒక రూఢివచనమును కార్యనిర్వాహక అధికారికి చేర వలెను అట్టి రూఢివచనము ఆ ఆస్థి ఏ జిల్లాలో యుండునది తెలుప వలెను మరియు పంచాయతీ సామాన్య లేక ప్రత్యేక వుత్తరువు ద్వారా కోరగల అదనపు విషయములను తెలుపవలెను

ఈ విధి పంచాయతీలు తమ వుద్యోగులకును నౌకర్లకును పారి తోషికము నొసంగుటకు క్రమపరచు విధులలో నిర్వచింపబడిన విధ ముగానుండు సుపీరియర్ సర్వీసులోని వుద్యోగులకును, నౌకరులకును అట్టి సర్వీసుకు చెందిన వుద్యోగములను కోరు అభ్యర్థులకు మాత్రము వర్తించవలెను

షరా —(i)రూఢివచనములో యావత్తు స్థిరాస్థి ఇండియాలో ఎచటనుండినప్పటికిని లేక సంపాదింపబడినప్పటికిని చేరవలెను అది సాధ్యమైనంతవరకు A అనుబంధములోని నమూనాలో నిర్దేశింప బడిన వివరములను తెలుపవలెను

(ii) ఒక పంచాయతీ యొక్క ప్రతివుద్యోగి లేక నౌకరు, ప్రతి సంవత్సరములో జనవరి 15 వ తేదీ కంటె ఆలస్యము గాకుండా

అంతకు పూర్వపు క్యాలెండరు సంవత్సరమునకు చివర అతని స్వాధీనమున నుండిన లేక అతనికి హక్కుయుండిన యావత్తు స్థిరాస్థిని తెలుపు ఒక స్టేటుమెంటును A అనుబంధములోనుండు నమూనాలో కార్యనిర్వాహక అధికారికి పంపవలెను నమూనాయొక్క (6) నుండి (16) వరకును (19) నుండి (21) వరకును గల గడులలో యిచ్చివేయబడిన లేక యితర విధముగా పరిష్కరింపబడిన ఏ స్థిరాస్థియొక్క తబ్సీళ్ళనైన నమూదు చేయవలెను

(III) ఏ సంవత్సరములోనైన ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు ఏ స్థిరాస్థిగాని లేక స్థిరాస్థిలో యెట్టిహక్కునుగాని సంపాదించలేక ఇచ్చివేయక లేక యితర విధముగా పరిష్కరించక పోయిన పక్షమున A అనుబంధములో తెలుపబడిన నమూనాలో ఒక రిటరను పంపుటకు బదులుగ క్రింది నమూనాలో ఒక సర్టిఫికేటును పంపవచ్చును

"... .. . ... ... . . తేదీన రిటరను సర్టిఫికేటును నేను పంపినప్పటినుండి నా పేరిటగాని ఏ ఇతర మనిషి పేరిటగాని ఏ స్థిరాస్థిని గాని లేక స్థిరాస్థిలో ఏ ప్రయోజనకరమైన లేక ఇతర హక్కును గాని నేను సంపాదించలేదనియు లేక లేదని కలిగియుండు యిచ్చివేయలేదని లేక ఇతర విధముగ పరిష్కరింపలేదని A B అను నేను శ్రద్ధాభక్తులతో రూఢి చేయుచున్నాను

స్థలము

తేదీ... ... ... ... (సంతకము) A. B,

ఉద్యోగ హోదా"

(iv) సంవత్సరవారీ రిటరనులో, తన స్వంత పేరిటగాని లేక ట్రస్టీగా ఎగ్జిక్యూటరుగ ఎడ్మినిస్ట్రేటరుగ లేక గుడి మిరాశదారుగ, పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు పేరుతో సంపాదింపబడిన లేక రిజిష్టరు కాబడిన లేక అతని భార్యచే లేక అతనితో నివసించు లేక అతనిమీద ఏ విధముగానైన ఆధారపడియుండు అతని కుటుంబముయొక్క ఏ ఇతర వ్యక్తియొక్కనైన పేరుతో సంపాదింపబడిన లేక రిజిష్టరుకాబడిన లేక కలిగియుండిన లేక నిర్వహింపబడు యావత్తు స్థిరాస్థి చేర్చబడవలెను మరుమకతాయం లేక అళియసంతాన చట్టము ననుసరించి ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు సందర్భములో వివరణలో అతని భార్యచే సంపాదింపబడిన స్థిరాస్థి చేరవలెను

(v) ప్రతి ఉద్యోగి లేక నౌకరు కలిగియుండు స్థిరాస్థిని తెలుపు B అనుబంధములోనుండు నమూనాలో ఒక వివరణము అతని సర్వీసు బుక్కులో రికార్డు చేయబడవలెను ఈ వివరణమును పైని (ii) వరా క్రింద తెలుపబడిన వివరణముల కనుగుణముగా ప్రతి సంవత్సరము వివరించవలెను వివరణములోని ప్రతి నమూదుకు లేక మార్పుకు సంబంధించిన సర్వీసు బుక్కులో ప్రతి సంవత్సరము సరిచూచుటకు సంబంధించిన సర్టిఫికేటును రికార్డుచేయుటకు అర్హత గల ఉద్యోగిచే క్రమముగా సాక్షి సంతకము చేయబడవలెను

(vi) ఒక పంచాయతీ క్రింద ఉద్యోగమును కోరు అభ్యర్థి A అనుబంధములో నుండు నమూనాలో ఒక వివరణమును తన దరఖాస్తుతో చేర్చి పంపవలెను

(vii) అబద్ధము చెప్పుటకు ఏ విధముగా ప్రయత్నించినను సంపూర్ణమైనట్టియు, సరియైనట్టియు సమాధానమును తెలుపుటకు తప్పిపోయిన పక్షమునను, సంబంధించిన ఉద్యోగి లేక నౌకరు పని నుండి తొలగింపబడుటకు అర్హుడై యుండును

5 కంపెనీలను ప్రోత్సాహము చేయుటయు, నిర్వహించుటయు — (1) పంచాయతీయొక్క ఎట్టి ఉద్యోగి లేక నౌకరుగాని ఏ కంపెనీలోనైన మ్యూచువల్ బెనిఫిట్ సంఘములోనైన, వేత

నముతో గూడిన ఉద్యోగమును అంగీకరించరాదు లేక జీతముగా గాని కమీషనుగాగాని చెల్లించబడు ఏజెంటుగా ఏ భీమాకంపెనీ లేక సంఘములో వ్యవహరించకూడదు

(2) ఒక పంచాయతీయొక్క ఏ ఉద్యోగి లేక నౌకరుగాని, కార్యనిర్వాహక అధికారియొక్క అనుమతిని ముందుగా పొంది మ్యూచువల్ బెనిఫిట్ సంఘముయొక్క నిర్వహణలో పాల్గొన వచ్చును అయితే దానికిగాను ఎట్టి ప్రతిఫలముగాని పుచ్చుకొన కూడదు

(3) ఒక పంచాయతీయొక్క ఏ ఉద్యోగి లేక నౌకరుగాని, సహకార సంఘములను అభివృద్ధిచేయుటలో పాల్గొన వచ్చును. మరియు కార్యనిర్వాహక అధికారియొక్క అనుమతిని ముందుగా పొంది ఏ సహకారసంఘములోనైన ఉద్యోగమును కలిగియుండ వచ్చును లేక దాని నిర్వహణ నిమిత్తము ఏర్పడిన ఏ కమిటీలో నైన పనిచేయవచ్చును లేక తాను చేసిన ఏ సేవకైన దానినుండి ప్రతి ఫలమును పొందవచ్చును

(4) (2) (3) వ సబు సెక్షనుల క్రింద ఏ సందర్భములోనైన అనుమతి నిచ్చుటకు పూర్వము కార్య నిర్వాహక అధికారి, ఉద్యోగి లేక నౌకరు చేయపూనుకొనిన పని అతని ఉద్యోగమునకు సంబంధిం చిన పనులకు భంగకరముగ నుండక జరుగునని తృప్తి పడవలెను

5 ప్రైవేటు వ్యాపారము లేక ఉద్యోగము — (1) ఒక పంచాయతీ ఉద్యోగి లేక నౌకరు ఏ వ్యాపారమునుగాని చేయ కూడదు లేక అతని పబ్లికు పనులు తప్ప ఏ యితర ఉద్యోగమునై నను చేయకూడదు

అయితే ఈ ఉపవిధి, కమీషను పుచ్చుకొను ఏర్పాటుమీద నేషనల్ సేవింగ్సు సర్టిఫికేటుల విక్రయము నిమిత్తము అధికారము పొందిన ఏజెంట్లుగా నియమింపబడిన ఉపాధ్యాయులకు వర్తించ కూడదు

(2) (a) పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు సాంఘిక లేక ధర్మ సంబంధమైన స్వభావముగల గౌరవార్థముగా చేయు పనినిచేయు

వచ్చును లేక సారస్వత లేక కళాస్వభావముగల పనిని ఎప్పుడో ఒక ప్పుడు చేయవచ్చును అయితే అందువలన అతని ఉద్యోగము నకు సంబంధించిన పనులకు భంగము కలుగకూడదు కాని పంచా యతీ, వాంఛనీయముకాదని అభిప్రాయపడు ఏ ఉద్యోగమునైన చేయుటకు ఏ కాలమందైనను నిషేధించవచ్చును లేక వదలు కొమ్మని కోరవచ్చును

(b) కార్యనిర్వాహక అధికారి వ్రాతమూలకమైన సమ్మతిని పొందినతప్ప నేయుపాధ్యాయుడు ప్రయివేటుట్యూషను ఇవ్వకూడదు

(3) కార్యనిర్వాహక అధికారి, బాలుర ప్రాథమిక పాఠ శాలలో నియమింపబడిన ఉపాధ్యాయుల సందర్భములలో, పాఠశాలల సీనియర్ డిప్యూటీ ఇన్‌స్పెక్టరుతోను, ప్రాథమిక బాలికా పాఠ శాలలలో నియమింపబడిన ఉపాధ్యాయుల సందర్భములో, పాఠశాలల సబ్ అసిస్టెంటు ఇన్‌స్పెక్ట్రెస్‌తోను సంప్రదించి, ఈ క్రింద తెలుప బడిన పనులను చేయుటకు ఉపాధ్యాయులకు అనుమతి నియ్యవచ్చును అవేవనగా —

(i) విద్యా సంబంధమైన సమస్యలను గురించి బ్రాడ్ కాస్ట్ ఉపన్యాసములు

(ii) ఈ క్రింది షరతులకు లోబడి ప్రత్యేక సందర్భము లలో తరగతులకు లేక గ్రంథాలయముల ఉపయోగమునకు పాఠ్య పుస్తకములను వ్రాయుట, ఆ షరతు లేవనగా —

(a) ఉపాధ్యాయుడు, ఈ రాజ్యములోని అంగీకారము పొందిన పాఠశాలలో ఉపయోగింపబడుటకు తనచే వ్రాయబడిన ఏ పాఠ్యపుస్తకముయొక్క నకళ్లనైన విక్రయించుటలో, కాపీ రైటును లేక హక్కును ఉంచుకోకూడదు ఆయన ప్రచురణచేయు ఫరము నుండి లేక, ఏ ఇతర వ్యక్తినుండియైన ప్రతిఫలముగా ఒక నిర్దిష్ట మైన పైకపు మొత్తమును మాత్రము అంగీకరించవచ్చును

(b) పాఠ్యపుస్తక కమిటీలో సభ్యుడుగానున్న ఏ ఉపా ధ్యాయుడుగాని, ఆయన కమిటీలో సభ్యుడుగా నున్నంతవరకు అంగీక రింపబడిన పాఠశాలలో ఉపయోగముకొరకు ఏ పాఠ్యపుస్తకములనైన వ్రాయకూడదు లేక సవరించి ప్రకటించకూడదు

వివరణము—'అంగీకరింపబడిన పాఠశాల' అనగా గవర్న మెంటువారి అనుమతితో పోషింపబడు లేక స్థాపించబడిన ఒక పాఠ శాల లేక మదరాసు విద్యా విధుల క్రింద లేక 1920 వ సం॥పు మద రాసు ప్రాథమిక విద్యా ఆక్టు క్రింద నిర్మింపబడిన విధుల ననుసరించి అంగీకార మొసంగబడిన పాఠశాల అని అర్థము

(iii) పబ్లిక్ పరీక్షలకు పరీక్షకుడుగా నుండుట

(iv) ఒక పంచాయతీలో కొంతకాలము పనిచేయు గుమస్తా నౌఖరీ అయితే, ఎట్టి ఉపాధ్యాయునిగాని ఒకే సమయమందు ఒక పంచాయతీయొక్క కొంతకాలము పనిచేయు పోష్టుమాస్టరు యొక్కయు, కొంతకాలము పనిచేయు గుమస్తాయొక్కయు ఉద్యోగమును కలిగియుండుటకు అనుమతించకూడదు

(4) (a) (3) వ ఉపవిధిలో నిబంధింపబడిన విధముగా తప్ప, విద్యా సంబంధమైన సమస్యలను గురించి బ్రాడ్ కాస్టు ఉపన్యాస ముల సందర్భములో, ఒక పంచాయతీయొక్క ఏ ఉద్యోగి లేక నౌఖరుగాని ఇన్‌స్పెక్టరుయొక్క అంగీకారమును ముందుగా పొందక ఏ విషయమును గురించిగాని, ఒక బ్రాడ్ కాస్టింగు స్టేషనులో బ్రాడ్ కాస్టింగు ఉపన్యాసము నియ్యరాదు ఏ సందర్భములోనైన ప్రభు త్వమువారి ఉత్తరువును పొందుట వాంఛనీయమని ఇన్‌స్పెక్టరు తలంచునెడల ఆయన అట్లు చేయవచ్చును.

(b) బ్రాడ్ కాస్టు ఉపన్యాసమిచ్చుటకు ఆహ్వానించబడిన లేక కోరు ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌఖరు ఆయన ఏ విషయమును గురించి మాట్లాడగోరునో ఆ విషయమును సరియైన అధికారులద్వారా ఇన్‌స్పెక్టరుకు తెలుపవలెను ఆ విషయము అతని ఉద్యోగ సంబంధమైన పనులతో ప్రత్యక్షముగగాని, పరోక్ష ముగగాని సంబంధించియున్న పక్షమున లేక అట్లు కోరబడినయెడల, ఉపన్యాసము నిచ్చుటకు పూర్వము పూర్తి ఉపన్యాసమును ఇన్ స్పెక్టరుయొక్క అంగీకారము నిమిత్తము పంపవలెను

(c) (a) (b) క్లాజులయొక్క నిబంధనలు, పాట కచ్చే రీలు లేక ఇతర కచ్చేరీలను పంచాయతీ ఉద్యోగి లేక నౌఖరు

బ్రాడ్ కాస్టు చేయుటకు అవసరమైన మార్పులతో వర్తించవలెను. (దీనిలో ముందుగా తయారుచేయుబడిన పాటలను పాడుట, గ్రామ ఫోను రికార్డులు చేరును )

7 కంట్రాక్టరుతో ద్రవ్య సంబంధమైన వ్యవహారములు.—పంచాయతీలయొక్క ఉద్యోగులు, నౌకరులందరు పంచాయతీ కంట్రాక్టరులతో లేక పంచాయతీల క్రిందనుండు ఏ డిపార్టుమెంటుతో గాని ఏ విధముగానైన సంబంధముకలిగిన ఏ ఇతర వ్యక్తులతోగాని ఎట్టి ద్రవ్య సంబంధమైన వ్యవహారములనుగాని కలిగియుండకూడదు

8 ఋణములు తీర్చుకోలేని స్థితి మరియు వాడుకగా ఋణ గ్రస్తుడుగా నుండుట —పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు వాడుకగా ఋణగ్రస్తుడై యుండకూడదు ఆయన దివాలా తీర్పు చెప్పబడిన పక్షమున లేక ప్రసిద్ధపరుపబడిన పక్షమున లేక సామాన్య పరిస్థితులతో రెండు సంవత్సరముల కాలపరిమితిలోపల ఆయన తిరిగి చెల్లించుటకు సాధ్యములేనంత పెద్ద మొత్తముగల ఋణములను చేసిన యెడల లేక ఋణముకొరకు అతని జీతములో కొంతభాగము తర చుగా పట్టుకోబడుచున్న యెడల లేక రెండు సంవత్సరముల కాలపరి మితివరకు ఎడతెగకుండ అట్లు బిగపట్టబడుచున్న పక్షమున, లేక రెండు సంవత్సరముల కాలపరిమితిలో సాధారణ పరిస్థితులలో ఆయన తిరిగి చెల్లించుటకు సాధ్యములేనంత ఒక మొత్తమునకు బిగపట్టబడు చున్న పక్షమున, సదరు దివాలా తనము లేక ఋణగ్రస్థత, సాధారణ మైన జాగ్రత్తతో ఉండినప్పటికిని తాను అనుకొనని లేక తన స్వాధీ నములోని పరిస్థితులయొక్క పర్యవసానమనియు దుబారాఖర్చు లేక దురలవాట్లవలన ఏర్పడలేదని ఆయన ఋజువు పరచిననే తప్ప ఈ విధిని ఉల్లంఘించినట్లు భావించవలెను దివాలాదారుగా నుండుటకు లేక తీర్పు చెప్పుటకు లేక ప్రసిద్ధపరచుటకు ధరఖాస్తు పెట్టుకొన్న ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు ఆయన నియమింపబడి యుండు ఆఫీసు లేక డిపార్టుమెంటుయొక్క పెద్దకు తాను దివాలా దారని వెంటనే తెలుపవలెను

8 ఉద్యోగ సంబంధమైన దస్తావేజులు లేక సమాచారమును ఇతరులకు తెలుపుట.—ఒక పంచాయతీయొక్క ఎట్టి ఉద్యోగి లేక నౌకరుగాని పంచాయితీచే ఈ విషయమున సాధారణముగా లేక ప్రత్యేకముగా అధికారమియ్యబడిననే తప్ప అతని ఉద్యోగ ధర్మములను నెరవేర్చునపుడు అతని స్వాధీనములోనికి వచ్చిన, లేక ఉద్యోగ ధర్మములను నెరవేర్చుటలో ఉద్యోగ సంబంధమైన ఆధారములనుండి గాని ఇతర విధముగాగాని, ఆయన తయారుచేసిన లేక సేకరించిన ఏ దస్తావేజు లేక సమాచారమైన, పంచాయతీయొక్క ఏ ఇతర ఉద్యోగికి లేక నౌకరుకు, దానిని పొందుటకు అధికారములేని ఒక గవర్నమెంటు నౌకరుకు, లేక ఒక ఉద్యోగేతర వ్యక్తికి లేక వార్తా పత్రికలకు ప్రత్యక్షముగా గాని పరోక్షముగా గాని, తెలుపకూడదు

10. వార్తా పత్రికలతో సంబంధము — ఒక పంచాయతీ యొక్క ఉద్యోగి లేక నౌకరు ఏ వార్తాపత్రికయైన లేక ఇతర సంచికయొక్కయైన పూర్తికాలముఎరకు లేక కొంతకాలమువరకు ప్రొప్రైటరుగా నుండకూడదు లేక వాటి సంపాదకత్వమును లేక నిర్వహణను జరుపకూడదు లేక దానిలో పాల్గొనగూడదు

11. దస్తావేజులను ప్రకటించుటనుగురించి వార్తా పత్రికలకు వానిని తెలియజేయుటకు గురించియు నిర్బంధములు — (1) ఒక పంచాయితీయొక్క ఎట్టి ఉద్యోగి లేక నౌకరుగాని, తన స్వంత పేరుతో ప్రకటింపబడిన ఏ దస్తావేజులలోగాని, లేక స్వంత పేరుతో వార్తాపత్రికలకు ఈయబడిన ఏ సమాచారములోగాని, లేక ఆయన చేసిన ఏ బహిరంగ ఉపన్యాసములోగాని—

(a) ఒక పంచాయితి లేక ఇతర స్థానిక అధికార వర్గము నకును ప్రభుత్వమునకును గల సంబంధములను, లేక

(b) కేంద్ర ప్రభుత్వమునకును లేక ఏ రాజ్యప్రభుత్వము నకైన మరియు ఇండియాదేశపు ప్రజలకు లేక అందలి ఏ భాగమున కైనను మధ్యగల సంబంధములను , లేక

(c) యూనియన్‌కును, ఏ విదేశీయ రాజ్యమునకును మధ్యగల సంబంధములను

భంగపరుచగల విషయమును లేక అభిప్రాయమును తెలుపరాదు

(2) తన స్వంత పేరుతో ఏ దస్తావేజునైన ప్రకటించుటకు లేక తన పేరుతో వార్తాపత్రికలకు ఏ సమాచారమునైన తెలుపుటకు లేక (1) ఉపవిధిచే విధించబడిన నిర్బంధములు వర్తించునని ఏసందేహమైననుగల స్టేటుమెంట్లతోకూడిన ఏ బహిరంగ ఉపన్యాసమును చేయుటకు ఉద్దేశించు ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు ఆయన ప్రకటించుటకు ఉద్దేశించిన దస్తావేజుయొక్క లేక ఆయన చెప్పగోరు సమాచారముయొక్క లేక ఆయన ఈయగోరు ఉపన్యాసముయొక్క నకలు లేక ముసోదాను ఇన్‌స్పెక్టరుకు పంపవలెను ఇన్‌స్పెక్టరుయొక్క అనుమతితో తప్ప మరియు ఆయన ఆజ్ఞాపించగల మార్పులేవైనయున్న యెడల వాటితో తప్ప దస్తావేజును ప్రకటించకూడదు, సమాచారములను తెలియజేయ కూడదు లేక ఉపన్యాసములను చేయకూడదు

12 సంఘముల సమక్షమున సాక్ష్యమిచ్చుట — కార్యనిర్వాహక అధికారియొక్క అంగీకారమును అతడు ప్రథమమున పొందిననే తప్ప, ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు ఒక పబ్లిక్ కమిటీ సమక్షమున సాక్ష్యమియ్యకూడదు అట్లు సాక్ష్యమిచ్చుటలో ఆయన పంచాయతీయొక్క లేక రాజ్య లేక కేంద్ర ప్రభుత్వము యొక్క విధానమును లేక తీర్పులను విమర్శించకూడదు

హాజరగుటను జవాబు నిచ్చుటను బలవంతపెట్టుటకును న్యాయసంబంధమైన విచారణలలో సాక్ష్యమిచ్చుటకు అధికారముగల చట్ట సంబంధమైన కమిటీల సమక్షమున సాక్ష్యమిచ్చుటకు ఈ విధి వర్తించకూడదు

13 ఎన్నికలలో పాల్గొనుట — ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు, శాసనసభ లేక స్థానిక అధికారవర్గమునకైన

ఏ ఎన్నికలలోగాని ఒక అభ్యర్థిగా నిలువకూడదు లేక ఏ అభ్యర్థికైన సహాయముచేయుట యో లేక ఆటంకపెట్టుటలో జోక్యము కలిగించుకొన కూడదు లేక ఏవిధముగానైన తన పలుకుబడిని వినియోగించ కూడదు లేక దేనినిగాని చేయకూడదు మఱియు ఎన్నిక ప్రచారముచేయు ఏ కక్షిసంస్థలోగాని ఆయన పాల్గొనకూడదు లేక సహాయపడకూడదు

అయితే అట్టి ఎన్నికలలో ఓటుచేయుటకు అర్హతగల పంచాయతీయొక్క ఒక ఉద్యోగి లేక నౌకరు ఓటు చేయుటపైన తన హక్కును చెలాయింపవచ్చును అయితే హక్కును ఏ విధముగా చెలాయించుటకు ఉద్దేశించెనని సాధ్యమైనంత వఱకు ఎట్టి సూచనను గాని తెలుపకూడదు

ఈ విధి, పూర్తి కాలము పనిచేయు ఉద్యోగులకు నౌకర్లకు మాత్రము వర్తించవలెను

14. రాజకీయములలో పాల్గొనుట — ప్రభుత్వము వారియొక్క ఏదైన సామాన్య లేక ప్రత్యేక ఉత్తరువుకు లోబడి పంచాయతీయొక్క ఎట్టి ఉద్యోగి లేక నౌకరుగాని ఇండియాలోని ఏ రాజకీయోద్యమములోనైన లేక ఇండియాకు సంబంధించిన విషయములలో పాల్గొనకూడదు దాని సహాయముగా చందావేయ కూడదు లేక ఏ విధముగానైన సహాయము చేయకూడదు ఒక ఉద్యోగి లేక నౌకరుచేయు నుద్దేశించు ఏ కార్యముగాని ఈ విధిని ఉల్లంఘించునా యని ఎట్టి సందేహముగాని ఉన్న పక్షమున కార్యనిర్వాహణాధికారిద్వారా ఇన్‌స్పెక్టరును ఈవిషయమును అడుగవలెను

షరా —ఒక ఉద్యోగి లేక నౌకరుయొక్క ద్రోహ చర్యలు లేక దేశద్రోహము సంబంధమైన మాటలు అతనిని పనినుండి తీసివేయుటకు చాలినంత కారణముగా భావింపబడును

15. తమ కుటుంబమునకు చెందినవారి చర్యలకు ఉద్యోగులయొక్కయు, నౌకర్లయొక్కయు బాధ్యత —

తానే ఒక పనిని చేసిన విధుల ఉల్లంఘనగా ఏర్పడు ఏ చర్యనైన అతని భార్యచే లేక అతనితో నివసించు లేక అతనిమీద

ఏ విధముగానైన ఆధారపడియుండు అతని కుటుంబమునకు చెందిన ఏ వ్యక్తిచేనైన చేయబడు ఏ చర్యకైన •ఒక పంచాయతీయొక్క వుద్యోగి లేక నౌకరు బాధ్యుడై యుండవలెను

16 పంచాయతీ ఉద్యోగులు లేక నౌకర్లు తమ ఉద్యోగము యొక్క చర్యలను, స్వభావమును తప్పులేదని నిరూపించుకొనుట—

ఒక పంచాయతీయొక్క వుద్యోగి లేక నౌకరు కార్యనిర్వాహక అధికారియొక్క అనుమతిని ముందుగా పొందక అతని వుద్యోగ సంబంధమైన చర్యలు లేక స్వభావము అపఖ్యాతికరమైనదిగా చేయ బడినపుడు దానిని తప్పులేదనునట్లు నిరూపించుటకు ఏ కోర్టుకుగాని పోకూడదు ఏ వార్తాపత్రికలలోగాని ప్రకటించకూడదు

ఈ విధిలోనున్న దేదియు స్వంత పనులు లేక స్వభావమును దోషరహితమైనదని నిరూపించుకొనుటకు పంచాయతీయొక్క ఏ ఉద్యోగి లేక నౌకరియొక్కయైన అధికారమును పరిమితపరచకూడదు లేక యితర విధముగా బాధించకూడదు

17 తాత్కాలికముగా పనినుండి నిలిపియుంచబడినపుడు పై విలాసము —ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు తాత్కాలికముగా పనినుండి నిలిపియుంచబడినపుడు ఆయన తనకు ఇష్టమువచ్చిన చోటికి పోవచ్చును కాని తన పై విలాసము కార్య నిర్వాహక అధికారికి తెలుపవలెను తన ప్రవర్తనను విచారించు ఏ ఉద్యోగియైనను ఉన్న పక్షమున అతనికిగూడ తన పై విలాసమును తెలుపవలెను

అతని ప్రవర్తనను గురించి జరుగు ఏ విచారణకైనను హాజ రగునట్లు పంపబడిన వుత్తరువులన్నిటిని ఆయన శిరసావహించవలెను అట్లు చేయుటకు తప్పిపోయిన పక్షమున అతని పరోక్షములో విచారణ జరుపబడవచ్చును

18 స్వలాభమును ఎక్కువ చేసికొనుటకు పై అధికారు లతో పలుకుబడిని ఉపయోగించుట —ఒక పంచాయతీయొక్క ఎట్టి వుద్యోగి లేక నౌకరుగాని తన స్వలాభమును ఎక్కువ చేసికొనుటకు

పద్దైన రాజకీయ లేక ఇతర పలుకుబడిని ఏ అధికారిమీాదనైన వుప యోగించకూడదు లేక వుపయోగించుటకు ప్రయత్నించకూడదు ఈ విధిని వుల్లంఘించినందుకు అపరాధము, శాశ్వతముగాగాని, కార్య నిర్వాహక అధికారి నిర్ణయించగల కాలపరిమితి వరకుగాని అతని ప్రమోషనును నిలిపియుంచుట లేక జీతముయొక్క గ్రైము స్కేలులో తక్కువదశకు తగ్గించుటగా నుండవలెను

వివరణము —తన విషయమై పంచాయతీలో లేక పార్ల మెంటులో, లేక రాజ్యముయొక్క శాసనసభలో ప్రశ్నింపదగిన ఒక విషయముగా (ఇంటర్ పెలేషన్) తెచ్చు పంచాయతీయొక్క ఒక వుద్యోగి లేక నౌకరు ఈ విధిని వుల్లంఘించినవాడగును

19 ఉన్నతోద్యోగులకు ఉత్తరములను పంపుట లేక వారిని కలిసి మాట్లాడుట—(1) ఒక పంచాయతీయొక్క ఎట్టి వుద్యోగి లేక నౌకరుగాని వుద్యోగ సంబంధమైన అతని పనులకు సంబంధించిన లేక అట్టి వుద్యోగి లేక నౌకరుగా అతనికి స్వయముగా సంబంధము గల ఏ విషయములోనైన ఆయన ఎవరికి అవ్యవహితముగ తాబేదారుడో అట్టి వున్నతోద్యోగి కానట్టి ఏ యితర వుద్యోగికినైన ప్రత్యక్షముగా వుత్తరములు వ్రాయగూడదు

షరా —తనకు అవ్యవహితముగ అధికారి ద్వారా ఒక వున్న తోద్యోగికి వుత్తరము పంపిన పంచాయతీయొక్క ఒక వుద్యోగి లేక నౌకరు, ఆయన కోరునెడల అతని వుద్యోగ సంబంధమైన అధికారి ద్వారా పంపిన వుత్తరముయొక్క నకలును వున్నతోద్యోగికి ప్రత్యక్ష ముగా పంపవచ్చును

(2) పంచాయతీయొక్క ఎట్టి ఉద్యోగి లేక నౌకరుగాని, పంచాయతీయొక్క ఉద్యోగిగా లేక నౌకరుగా తన స్వంతపనిసందర్భ ములో సిఫారసును పొందుటకు లేక యోగ్యతాపత్రములనుగాని సర్టిఫికేట్లనుగాని పొందుటకు ఆయన ఎవరికి అవ్యవహితముగ తాబే దారో అట్టి ఉద్యోగికానట్టి ఇతర ఏ మనిషి ఉద్యోగి లేక ఉద్యోగేత రుని వద్దకునైన పోగూడదు

(3) ఒక పంచాయతీయొక్క ఎట్టి ఉద్యోగి లేక నౌకరు గాని ఆయన ఏ అధికారికి అవ్యవహితముగ తాబేదారో అట్టివ్యక్తి యొక్క అనుమతిని ముందుగా పొందక, అట్టి ఉద్యోగిగా లేక నౌకరుగా అతని స్వంతపనుల విషయములో తనకు అవ్యవహితముగ పైనుండు ఉద్యోగికానట్టి ఏ ఇతర ఉద్యోగినిగాని కలిసికొని మాట్లాడుటకు ప్రయత్నించరాదు మరియు పంచాయతీయొక్క ఎట్టి ఉద్యోగి లేక నౌకరుగాని ఒక మంత్రితో లేక గవర్నమెంటు సెక్రటరీని కలుసుకొని మాట్లాడుటకు ప్రయత్నించరాదు

(4) ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు ఉద్యోగముకొరకు లేక ప్రమోషను (హెచ్చింపు) కొరకు పెట్టుకొనబడు ప్రతి దరఖాస్తు సరియైన మార్గముగుండా పంపబడవలెను

షరా —(1) నుండి (4) వరకుగల ఉపవిధులయొక్క నిబంధనలు తాబేదారుగానుండు ఏ ఉద్యోగియైనను తన ఉద్యోగహోదాలో తనకు అవ్యవహితముగ పెద్దగానుండని ఏ ఉద్యోగికైనను పంపవలసినదిగా కోరబడిన ఏ రిటరును, లేక రిపోర్టునైన పంపుటను నిషేధించునట్లు అర్థము చేసికొనగూడదు

20. పంచాయతీలయొక్క ఉద్యోగుల లేక నౌకర్ల గౌరవార్థముగా బహిరంగ ప్రదర్శనములు —(1) పంచాయతీయొక్క ఎట్టి ఉద్యోగి లేక నౌఖరుగాని అతనిని గౌరవించుటకుగాను లేక తనపని నుండి సెలవుపుచ్చుకొనునప్పుడు చేయబడిన ఎట్టి పత్రమునుగానిపుచ్చుకొనగూడదు, లేక తనను గౌరవించుటకుకూడిన ఏ బహిరంగ సమావేశమునకైన లేక వేడుకకైన హాజరుకాగూడదు ఐతే ఒక ఉద్యోగి లేక నౌకరు తన స్వంత స్నేహితులచే లేక, తాను సభ్యుడుగానుండు ఒక క్లబ్బుచే ఏర్పాటుచేయబడిన ఒక పిక్నిక్కులు వేడుకకు హాజరు కావచ్చును. కాని అట్టి ఆహ్వానమును అంగీకరించినపుడు అట్టికార్యము బహిరంగమైనదిగా నుండకూడదనియు, బహిరంగమైన వేడుకగా నుండకూడదనియు అతనికి ఎట్టి సన్మానపత్రమునైన బహూకరించకూడదనియు జరిగిన కార్యమును గురించి వార్తాపత్రికలలో ప్రకటించగూడదనియు స్పష్టముగా తెలుపవలెను

(2) ఏ హోదానైన కలిగిన ఎట్టి ఉద్యోగి లేక నౌకరు గాని తన తాబేదారులనుండి విందును అంగీకరించగూడదు

21 ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు కానట్టి ఒక మనిషి పంచాయతీలయొక్క ఉద్యోగుల, నౌకర్లయొక్క ఏ అసోసియేషన్, యూనియన్, లేక ఫెడరేషన్ యొక్కయైన సభ్యుడుగా ఆఫీసు బేరరుగా, లేక పోషకుడుగా ఉన్నపక్షమున పంచాయతీయొక్క ఎట్టి ఉద్యోగి లేక నౌకరుగాని అట్టి అసోసియేషన్, యూనియన్ లేక ఫెడరేషన్ యొక్క సభ్యుడుగానుండకూడదు

22 ప్రభుత్వమువారి పద్ధతి లేక చర్య వగైరాగురించి చర్చ- ఒక పంచాయతీయొక్క ఎట్టి ఉద్యోగి లేక నౌకరుగాని వాచాగా, లిఖితపూర్వకముగా లేక ఇతర విధముగా ఏ అసోసియేషన్ లేకసంస్థ యొక్క ఏ సమావేశములోనైన లేక కేంద్ర రాజ్య ప్రభుత్వము వలన ఒక పంచాయతీ లేక జిల్లాబోర్డు లేక మునిసిపలుకౌన్సిలుచే అవలంబించబడు ఎట్టి పద్ధతినిగాని లేక తీసికొనబడిన ఎట్టిచర్యనుగాని బహిరంగముగ చర్చించగూడదు లేక విమర్శించగూడదు మరియు అట్టి ఏ చర్చలేక విమర్శలోగాని ఆయన ఏ విధముగానైన పాల్గొనగూడదు

ఐతే ఈ విధిలోనున్నదేదియు

(1) వేర్వేరుగా లేక సామాన్యముగా పంచాయతి నౌకర్ల స్వంత లాభములకు సంబంధించిన విషయములను చర్చించుటకు పంచాయతీ ఉద్యోగులు మరియు నౌకర్లు మాత్రముగూడిన ఏ ప్రైవేటుసభలోనైన పంచాయతీయొక్క ఏ ఆఫీసరు లేక నౌకరుగాని పాల్గొనుటకు, లేక

(2) దురభిప్రాయములను తొలగించుటకు తప్పు వివరణములను సరిచేయుటకు లేక పాలసీని సక్రమముగా నెరవేర్చుటకు పంచాయతీయొక్క ఏదైన పాలసి లేక చర్యను పబ్లికు లేక ప్రయివేటు సమావేశములలో ఒక పంచాయతీయొక్క ఉద్యోగి లేక నౌకరు సమర్థించుటకు మరియు వివరించుటకును,

నిషేధించునట్లు భావింపకూడదు

వివరణము :—ఈ విధిలోనున్న దేదియు పంచాయతీకి యుక్తము లేక అవసరమని అగపడు విధముగా దానియొక్క ఏ పాలిసీ లేక చర్యనైన ప్రకటించుటకు లేక వివరించుటకు దానియొక్క ఏ వుద్యోగులను లేక నౌకర్లనైన కోరుటకు పంచాయతీ అధికారమును మితపరచునట్లు లేక తగ్గించునట్లు భావింపబడకూడదు

23 (1) ప్రయివేటు వుద్యోగమునకు దరఖాస్తు.—

పంచాయతీయొక్క ఎగ్జిక్యూటివు అధికారియొక్క అనుమతి ముందుగా పొందకుండ, ఆ పంచాయతీలోని యే వుద్యోగిగాని, లేక నౌకరుగాని, ప్రయివేటు వుద్యోగమునకు దరఖాస్తు చేయుటకాని, లేక అట్టి వుద్యోగమును స్వీకరించుటకు అంగీకారము తెలుపుట కాని చేయరాదు

(2) (a) సర్వీసునుండి పూర్తిగా విరమించుటకుగాను, అంతకు పూర్వము శెలవు తీసుకున్న యే వ్యక్తి కయిన, సాధారణముగా ప్రయివేటు వుద్యోగమునకు దరఖాస్తు చేయుటకుగాని, లేక అట్టి ప్రయివేటు వుద్యోగము స్వీకరించుటకుగాని, అట్టి వుద్యోగము భారత దేశములోని వ్యాపార సంస్థలలో కాకుండునపుడు, అనుమతి యివ్వబడును

వ్యాపార సంస్థలలో ప్రయివేటు వుద్యోగమునకు దరఖాస్తుకు గాని, లేక వుద్యోగము స్వీకరించుటకుగాని, అనుమతి మిక్కిలి విశేష పరిస్థితులలో మాత్రమే యివ్వబడును అయితే ఆ వుద్యోగిని గాని, నౌకరునుగాని వెంటనే పంచాయతీ వుద్యోగమునుండి పూర్తిగా విరమించునట్లు ఆదేశించవచ్చును

(b) ఎగ్జిక్యూటివు అధికారి, ఆ వుద్యోగియొక్కగాని, నౌకరుయొక్కగాని, అకాల రాజీనామా వల్ల పంచాయతీ సేవకు ఎట్టి హానియు కలుగదని తృప్తి పొందిననే తప్ప, ఏ యితర వుద్యోగికి

గాని, సౌకరుకుగాని, ప్రయివేటు వుద్యోగమునకు దరఖాస్తు చేయుటకుగాని, వుద్యోగమును స్వీకరించుటకుగాని, అనుమతి యివ్వరాదు

(3) ప్రయివేటు వుద్యోగమునకు దరఖాస్తు చేయుటకుగాని, దానిని స్వీకరించుటకు గాని ఏ వ్యక్తికయిన అనుమతి నిరాకరింప బడిన యెడల, ఆవ్యక్తి పంచాయతీ యుద్యోగమునకు రాజీనామా నియ్యదలచిన యెడల నట్టి రాజీనామా సాధారణముగా నంగికరింప బడును

(4) పంచాయతీ వుద్యోగమునుండి పూర్తి విరమణకు ముందుగా శెలవులో లేని యే వ్యక్తికైన ప్రయివేటు వుద్యోగమునకు దరఖాస్తు చేయుటకుగాని, దానిని స్వీకరించుటకుగాని అనుమతి యిచ్చిన యెడల, అట్టి వుద్యోగమును స్వీకరించిన వెంటనే నతడు పంచాయతీ యుద్యోగమునకు రాజీనామా నియ్యవలెను

## A అనుబంధము

### 19 వ సం॥ డిశంబరు 31 వ తేదీతో అంత్యమగు సంవత్సరములో కలిగయున్న, సంపాదించిన లేక పరివర్తనచేసిన స్థిరాస్థి యొక్క మరియు స్థిరాస్థిలోగల హక్కుయొక్క వివరణము

షరా —రిటరను ఏ సంవత్సరమునకు పంపబడినదో ఆ సంవత్సరమునకు పూర్వము వుద్యోగి లేక స కరు ఏ ఆస్తిలో హక్కును సంపాదించెనో ఆ ఆస్తిని ఆ సంవత్సరమునందు యే ఆస్తిలో బాధ్యతను ఆయన ఉంచుకొనెనో ఆ యాస్తిని మొదట తెలుపవలెను పిదప ఆ సంవత్సరమునందు యే ఆస్తుల విషయములో వ్యవహారములు జరిగెనో ఆ యాస్తులను చూపవలెను.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | భూమిలేక ఇతర ఆ స్థిరుండు చోటు | | | | భూముల యొక్క విస్తీర్ణము మరియు అసెస్‌మెంటు (పన్ను) మెరకమాగాణీ | | | | | | | | | | | |
| ఉద్యోగి లేక నౌకరుయొక్క పేరు | పొందియున్న ఉద్యోగము | సర్వీసులో నియమించబడిన తేది | ఆ స్థిరాస్తియొక్క స్వభావము అనగా (1) ఇండ్లు (అవి తోటలను కలిగియున్నవా లేవా అని తెలుపవలెను) అవి ఏకార్యముల కొరకు వినియోగింపబడుచున్నవి (2) భూములు, వ్యవసాయ కార్యముల నిమిత్తము లేక తోటలుగా లేక ఏ యితర కార్యముల కొరకుగాని వినియోగింపబడుచున్న వాయని తెలుపుడు | 19 వ సం॥ పూర్వము లేక ఆ సం॥లో సంపాదింపబడినవా యని తెలుపుడు | 19 వ సం॥లో వదలిపెట్టబడినదా? | గ్రామము | తాలూకా | జిల్లా | సర్వే నెంబరు | వ్యాప్తి | అసెస్‌మెంటు | వ్యాప్తి | అసెస్‌మెంటు | సర్కారు లేక ఇనాము | ఎవరినుండి సంపాదింపబడినది లేక ఎవరికి విడిచిపెట్టబడినది | సంపాదించిన తరగతి లేక విడిచిపెట్టుటకు పూర్వము ఎవరిపేరట రిజిష్టరు చేయబడినది | ఎట్లు మరియు ఏ కార్యముకొరకు సంపాదించబడినది | పత్రము వ్రాసిన సంవత్సరము, నెల, తేదీ | భూమిలోగల వాటా | భూమికి చెల్లించబడిన లేక పుచ్చుకొనబడిన ఖరీదు. | షరాలు. |

ఈ రిటరనులో నమూదుచేయబడియున్నదితప్ప ఏ స్థిరాస్తిగాని, ఇతర స్థిరాస్తిలో ఎట్టి ప్రయోజనకరమైన లేక ఇతని హక్కునైన నేను ఈ సమయమందు నా పేరుతోగాని ఏ ఇతర మనిషి పేరుతోగాని కలిగియుండలేదనియు, 19 వ సం॥లో నేను సంపాదించలేదని లేక వదలిపెట్టలేదని అను నేను భయభక్తులతో ప్రసిద్ధపరచుచున్నాను

స్థలము (సంతకము)
19 వ సం॥ తేదీ (ఉద్యోగము)

షరా —(1) ఈ వివరణము ప్రతిసంవత్సరము జనవరి 15 వ తేదీన సరిగా పంపవలెను.

(2) ఈ రిటరను సంబంధించిన సంవత్సరములో క్రొత్తగా సంపాదించబడిన ఎట్టి సరాతో వ్రాయబడవలెను

(3) సంవత్సరములో ఉద్యోగి వదలుకొన్న ఏ స్థిరాస్తియొక్కయైన వివరములనుకూడ సంవత్సరవారీ రిటరనులో నమోదు చేయవలెను

## B అనుబంధము

**పంచాయతీల ఉద్యోగులు నౌకర్లు కలిగియుండు స్థిరాస్తియొక్కయు స్థిరాస్తిలోని వాక్కులయొక్కయు వివరము.**

ఆస్తిని గురించిన వివరములు

(1). ఉద్యోగి లేక నౌకరు యొక్క పేరు

(2) ఉద్యోగములో నియమింపబడిన తేదీ

(3) ఏ ఉద్యోగములో నున్నారు

(4) ఆస్తియుండు జిల్లా మరియు డివిజను

(5) ఆస్తి స్వభావము

(6) వ్యాప్తి

(7) ఆసెస్ మెంటు (పన్ను)

(8) ఎవరి పేరిట రిజిష్టరు చేయబడినది

(9) ఎప్పుడు సంపాదించబడినది లేక వారసత్వము ద్వారా సంక్రమించినది వగైరా

(10) ఎట్లు మరియు ఏ కార్యముకొరకు సంపాదించబడినది

(11) అట్టి ఆస్తిలో సంబంధించిన ఉద్యోగి లేక నౌకరు కలిగియుండు హక్కు యొక్క స్వభావము

(12) షరాయి.

## 4 వ ప్రకటన

(1950 వ సం॥పు 10 వ మదరాసు ఆక్టు అ.వు) 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టుయొక్క 34 (2) మరియు 112 (1) సెక్షనులచే నియ్యబడిన అధికారములను చెలాయించుచు ఘనతవహించిన మదరాసు గవర్నరుగారు ఇందుమూలముగా ఈ క్రింది విధులను చేయుచున్నారు —

(జి ఓ నెం 1116 ఎల్ ఎ తేదీ 4-6-1951)
(జి. ఓ నెం 353 ఎల్ ఎ తేదీ. 8-4-1954)

### విధులు

### ఉద్యోగులకును, నౌకర్లకును పారితోషికముల (గ్రాట్యూయిటీ) నిచ్చుట

1 ఈ విధులలో, విషయమునందుగాని పూర్వోత్తర సందర్భమునందుగాని విరుద్ధముగా నేదైన నున్ననే తప్ప—

(i) 'జీతము' అనగా మాసవారీ సబ్‌స్టాన్‌టివ్ జీతము అని అర్థము, మరియు దానిలో వ్యక్తికి సంబంధించిన (పెర్సనల్) జీతము చేరును

(ii) 'నౌకరు' అనగా ఒక పంచాయతీక్రింద ఒక వుద్యోగమును కలిగియున్న ఒక వుద్యోగి లేక నౌకరు అని అర్థము, మరియు

(iii) 'ఇన్ఫీరియర్ సర్వీసు' మరియు 'సుపీరియర్ సర్వీసు' అనగా ఈ విధులకైన 1 వ అనుబంధములో క్రమముగా ఇన్ఫీరియరు మరియు సుపీరియరనియు విభజింపబడి వుద్యోగములలోని కొలువు అని అర్థము

2 ఈ విధుల క్రింద పారితోషికము శాశ్వతమైన దైనను తాత్కాలిక మైనదైనను, సబ్‌స్టాన్‌టివ్ అయినను, అఫీషియేటింగు అయినను ఏ కొలువు సందర్భములోనైన మరియు బత్తెములతో సెలవు మీాద గైరుహాజరైన కాలపరిమితులతో చేరి ఇయ్యబడవలెను. కొలువు

చేసిన పూర్తి సంవత్సరములకు మాత్రము పారితోషికము (గ్రాట్యూయిటీ) ఇయ్యవచ్చును ఒక పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి తగిన సందర్భములలో మూడు నెలలకుమించని ఒక కాలపరిమితిలోటును క్షమించవచ్చును ఇదేవిధము పంచాయతీ 12 నెలలకు మించని లోటును క్షమించవచ్చును

3. ఏ కొలువు కాలపరిమితికి ఒక నౌకరు ప్రావిడెంటుఫండు లాభములకు హక్కు కలిగియుండునో అట్టి ఏ కాలపరిమితికిగాను ఆయన ఎట్టి పారితోషికము పొందుటకు హక్కు కలిగియుండకూడదు

4 ఒక నౌకరు పనికి నియమించుకొనబడిన పింఛనునిచ్చు విధానముక్రింద ఆయనకు ఈయబడు ఏ పారితోషికము నైనను మినహాయించి పింఛను ఈయబడు కొలువునుచేయు ఒక నౌకరుకు ఈ విధులక్రింద ఎట్టి పారితోషికమునైన పొందుటకు హక్కు వుండకూడదు

5 (a) పంచాయతీ కొలువునుండి భర్తరఫు (డిస్‌మిస్) చేయబడిన లేక

(b) తొలగింపబడిన లేక దుష్ప్రవర్తన లేక అసమర్థతనుబట్టి రాజీనామా నియ్యవలసినదిగా కోరబడిన, లేక

(c) తన యిష్టానుసారము రాజీనామా యిచ్చిన

ఒక నౌకరు యెట్టి పారితోషికమునయిన పొందుటకు హక్కు కలిగియుండకూడదు

6 (1) పంచాయతీలో ఐదు సంవత్సరములకంటె తక్కువైన మొత్తము కొలువుచేసిన ఒక నౌకరు ఎట్టి పారితోషికమునయిన పొందుటకు హక్కు కలిగియుండకూడదు

(2) ప్రావిడెంటుఫండు లాభములకు ఒక నౌకరు చేర్చుకొనబడుటకు పూర్వపు కొలువుకు అట్టి కొలువు ఐదు సంవత్సరముల కంటె తక్కువగా నున్నప్పటికిని పారితోషికమును పొందుటకు ఒక నౌకరు హక్కు కలిగియుండవలెను అయితే అతని మొత్తము కొలువు అయిదు సంవత్సరముల కంటె తక్కువగా నుండకూడదు. ఎడ

తెగక లేనికొలువు సందర్భములో కూడ ఒక నౌకరు పారితోషికము పొందుటకు హక్కు కలిగియుండవలెను

7 (1) సుపీరియర్ సర్వీసులోని ఒక నౌకరుకు—

(a) వృద్ధాప్యమువలన లేక దౌర్బల్యమువలన కొలువు నుండి ఆయన విరమించినపుడు, లేక

(b) సిబ్బందిని తగ్గించుటవలన లేక దుష్ప్రవర్తన లేక అసమర్థత మినహా ఇతర ఏ దోషకారణములవలన కొలువునుండి అతనిని పంపివేయబడినపుడు,

పారితోషికము చెల్లించవచ్చును

(2) ఇన్ఫీరియర్ సర్వీసులోని ఒక నౌకరుకు—

(a) దేహసంబంధమైన లేక మానసిక సంబంధమైన అస్వస్థతవలన ఇకముందు కొలువుచేయుటకు ఆయన శాశ్వతముగా అశక్తుడైనపుడు, లేక

(b) అతని ఉద్యోగము రద్దుచేయబడిన మీదట లేక సిబ్బంది తగ్గించబడిన మీదట అతనిని కొలువునుండి పంపివేయబడి అతనికి తగిన ఇతర ఉద్యోగము ఇచ్చుటకు వీలులేనపుడు,

పారితోషికమును చెల్లించవచ్చును

8 2 నుండి 7 వరకు గల విధులయొక్కయు 12 వ విధి యొక్కయు నిబంధనలకు లోబడి ప్రావిడెంటుఫండు లాభములకు చేర్చుకొనబడని సుపీరియర్ సర్వీసుకు చెందిన నౌకర్లకు, చేసినకొలువు పదిహేను సంవత్సరములకు తక్కువగా నున్నసమయమున పారితోషికము ఆరు నెలల జీతమును మించకూడదను, మరియు కొలువు పదునైదు సంవత్సరములు అంతకుమించిన యెడల పదునైదు నెలలజీతము మించకూడదను నిర్బంధమునకు లోబడి కొలువుచేసిన ప్రతి సంవత్సరమునకు అర్ధ నెల జీతము చొప్పున పారితోషికము చెల్లించవచ్చును.

ఈవిధి క్రింద పారితోషికము, 7 వ విధి క్రింద పారితోషికము చెల్లించవలసిన కాలమందు చెల్లించబడుచున్న జీతమునుబట్టి లెక్కింపబడవలెను.

9 2 నుండి 7 వఱకు గల విధుల యొక్కయు 12 వ విధి యొక్కయు నిబంధనలకు లోబడి సుపీరియర్ సర్వీసులోని నౌకర్లు, వారు ఉద్యోగములో నున్నపుడు ప్రావిడెంటుఫండు లాభములకు చేర్చుకొనబడినపుడు మాత్రము, అట్లు చేర్చుకొనబడుటకు పూర్వము వారి సర్వీసును పదునైదు సంవత్సరములకు లోబడియున్నయెడల వారి పారితోషికము ఆరు నెలల జీతమును మించకూడదను, అది పదునయిదు సంవత్సరములు అంతకు పైబడినయెడల పదునయిదు నెలల జీతమును మించకూడదను షరతుకు లోబడి, ప్రావిడెంటుఫండు నుండి వారు పొందుటకు హక్కు గల ఏ మొత్తములకైన అదనముగా, ప్రావిడెంటు ఫండు లాభములకు చేర్చుకొనబడుటకు పూర్వపు సర్వీసులో ప్రతి సంవత్సరమునకు అర్ధ నెలజీతము చొప్పున పారితోషికము చెల్లింపబడవచ్చును

ప్రావిడెంటు ఫండుకు చేర్చుకొనబడుటకు అవ్యవహితముగా పూర్వము పుచ్చుకొనబడిన జీతమును బట్టి, ఈ విధిక్రింద పారితోషికము లెక్కింపబడవలెను

10 2 నుండి 5 వఱకు గల, 7 ఎ, 12 వ విధుల యొక్క నిబంధనలకు లోబడి, ఇన్ఫీరియర్ సర్వీసులోని నౌకర్లకు ఈ క్రింది నిర్బంధములకు లోబడి సర్వీసులోని ప్రతి సంవత్సరమునకు ఒక నెల జీతము చొప్పున పారితోషికము చెల్లింపబడవచ్చును

(a) మొదటి ఐదు సంవత్సరముల సర్వీసుకు ఎట్టి పారితోషికముగాని చెల్లించకూడదు, మరియు

(b) పారితోషికము. ఏ సందర్భములోగాని ఇరువది నెలల జీతమును మించకూడదు

7 వ విధి క్రింద పారితోషికము చెల్లింపవలసినట్లు ఏర్పడు కాలమందు పుచ్చుకొనబడు జీతమును బట్టి, ఈ విధి క్రింది పారితోషికము లెక్కపెట్టబడవలెను

11 ఈ విధుల క్రింద పారితోషికము పంచాయతీ జారీచేయవచ్చును అయితే ఇన్స్పెక్టరుయొక్క లిఖితపూర్వకమైన అంగీ

కారమును ముందుగా పొందక ఎట్టి చెల్లుబడిగాని చేయకూడదు 8, 9, 10 వ విధులలో విధించబడిన రేట్లు గరిష్ఠ మొత్తములుగా భావించబడవలెను చేసిన కొలువు పూర్తిగా తృప్తికరముగా నున్న నే తప్ప అది మంజూరు చేయబడకూడదు చేసినకొలువు పూర్తిగా తృప్తి కరముగా లేని సందర్భములో, పంచాయతీ యుక్తమని తలంచు విధముగా చెల్లించబడు మొత్తమును తగ్గించవచ్చును

12. ఇన్ఫేరియర్ సర్వీసులోని ఒక నౌకరుకు చెందవలసిన పారితోషికమును లెక్కించుటలో 16 సం॥ వయస్సు వచ్చిన తర్వాత ఆయన చేసిన కొలువును మాత్రము లెక్కపెట్టవలెను సుపీరియరు సర్వీసులోని నౌకరు సందర్భములో 20 సం॥ వయస్సు వచ్చిన తర్వాత ఆయనచేసిన కొలువును మాత్రము లెక్కపెట్టవలెను

13 కొంతవరకు ఇన్ఫరియర్ సర్వీసును కొంతవరకు సుపీరి యరు సర్వీసును చేసిన ఒక నౌకరు—

(a) పూర్తి కొలువును, ఇన్పేరియరు స్కేలుమీద పారి తోషికమునకుగాను ఇన్ఫేరియర్ కొలువుగానైన తీసికొనవచ్చును, లేక

(b) సుపేరియర్ భాగమును పారితోషికమునకుగాను సుపీరి యర్ స్కేలులోను, ఇన్ఫీరియర్ భాగమును, పారితోషికమునకు గాను ఇన్ఫేరియర్ స్కేలులోను లెక్కపెట్టవచ్చును

ఆయా సందర్భమునకు తగినట్లు 7 వ విధిక్రింద పారితోషికము చెల్లింపవలసిన కాలమందు లేక ప్రావిడెంటు ఫండుకు చేర్చుకొనుటకు అవ్యవహితముగా పూర్వము నౌకరు పుచ్చుకొనుచుండిన (సుపీరి యర్ సర్వీసులోగాని) ఇన్ఫీరియర్ సర్వీసులోగాని జీతమును (a) క్లాజుక్రింద పారితోషికము లెక్కింపబడవలెను

ఇన్ఫీరియర్ నుండి సుపీరియర్ సర్వీసుకు లేక సుపీరియర్ నుండి ఇన్ఫీరియర్ సర్వీసుకు పరివర్తన చేయబడిన కాలమందు, మరియు క్రమముగా 7 వ విధిక్రింద పారితోషికము చెల్లింపవలసిన

కాలమందు లేక ప్రావిడెంటు ఫండుకు చేర్చుకొనుటకు అవ్యవహిత ముగా పూర్వము, నౌకరు పుచ్చుకొనుచుండిన జీతమునుబట్టి, (b) క్లాజు క్రింద, ప్రతి స్కేలు ననుసరించిన పారితోషికము లెక్క పెట్టబడవలెను ఒక నౌకరు, దుష్ప్రవర్తనను బట్టి సుపీరియర్ సర్వీసునుండి ఇన్ఫీరియర్ సర్వీసుకు తగ్గించబడినయెడల, ఇన్స్పెక్టరు యొక్క ప్రత్యేక అనుమతితో తప్ప, ఈ విధి ననుసరించి అతనికి ఎట్టి పారితోషికము నయిన చెల్లించకూడదు

వివరణము —ఇన్ఫీరియర్ సర్వీసుయొక్క పారితోషికమును సుపీరియర్ సర్వీసుయొక్క పారితోషికమును ఒకటిగా చేర్చగా వచ్చు మొత్తము పూర్తి కొలువును సుపీరియర్ సర్వీసుగా భావించిన పక్ష మున ఎంత పారితోషికము నియ్యవచ్చునో ఆ మొత్తమును మించ కూడదు

14 ఒక నౌకరు కొలువులో నున్నపుడు చనిపోయిన విషయ మున, అతని కుటుంబమునకు ఇతర బ్రతుకుతెరువు లేదని పంచాయతీ తృప్తిపడిన యెడల, ఆయన చనిపోయిన దినమందు 7 వ విధిక్రింద పారితోషికము చెల్లించవలసిన విధముగా చెల్లించబడవలెను

వివరణము —ఈ విధియొక్క కార్యముల నిమిత్తము 'కుటుం బము' అనుమాటలో నౌకరుయొక్క భార్య, అతని ఔరసబిడ్డలు చేరుదురు ఔరసబిడ్డలు అనుమాటలో దత్తు తీసికొన్న కుమారుడు, అతనితో నివసించుచుండి అతనిమీద పూర్తిగా ఆధారపడిన సవితి బిడ్డలు చేరుదురు మరియు అతని తలిదండ్రులు, ఆయనమీద పూర్తిగా ఆధారపడి ఆయనతో నివసించు అప్పచెల్లెండ్రు, మైనరు సహోదరులు కూడ చేరుదురు పైన నిర్వచింపబడిన విధముగా ఒక నౌకరు కుటుంబమునకు లేనియెడల మరియు ప్రావిడెంటుఫండుకు చందా చెల్లించువాడైనయెడల, అతనికి పారితోషికమేదైన చెల్లించ వలసియున్న పక్షమున, దానిని ప్రావిడెంటుఫండు మొత్తమును పుచ్చుకొను అతని నామినీకి (నియమింపబడిన మనిషి) చెల్లించ వలెను అయితే అట్టి నామినీ ఆర్థికముగా ఇబ్బందులలో నున్నాడని పంచాయతీ తృప్తి పడవలెను.

15 ఒక నౌకరు, వేర్వేరు స్థానిక సంస్థలలో కొలువుచేసి యుండినయెడల, వేర్వేరు స్థానిక సంస్థలలో చేసిన కొలువును ఒకటిగా చేర్చి, ఈవిధుల క్రింద అనుమతింపబడగల పారితోషికమును లెక్కించుటకుగా ఒకటిగాను భావించవలెను నౌకరుయొక్క అర్హతనిచ్చు పూర్తి నౌకరీ చేసిన కాలమందు ఆయనకు చెల్లింపబడిన మొత్తము జీతములో అది ఏదామాషాలో జీతము ఇయ్యబడెనో ఆదామాషాలో పారితోషికమును చెల్లించు బాధ్యతను, ఆ వివిధ స్థానిక సంస్థలకు విభజించవలెను అట్లు విభజన చేసినపుడు, పారితోషికపు మొత్తములో మున్పాతిక వంతుకు పైగా ఒకే స్థానిక సంస్థ చెల్లించవలసినదిగా కనుగొనబడిన యెడల, ఆ స్థానిక సంస్థ పూర్తి ఛార్జిని భరించవలెను ఎట్టి విభజన గాని చేయవలసినది లేదు

వివరణము —మరియొక స్థానిక సంస్థ క్రింద ఉద్యోగమును స్వీకరించుటకు ఒక స్థానిక సంస్థనుండి రాజీనామా నిచ్చు సందర్భములకు యీ విధి వర్తించకూడదు

16 (1) (a) ఈ విధి క్రింద పారితోషికమును పొందుటకు అర్హుడైన ఒక నౌకరు, దానిని చెల్లించు నిమిత్తము, అతని ఆఫీసు పెద్దకు దరఖాస్తు పెట్టుకొనవలెను

(b) 7 వ విధియొక్క, (2) వ ఉపవిధి తాలూకు (a) క్లాజు క్రింద పారితోషికమునకై పెట్టుకొనబడు ప్రతి దరఖాస్తుతోకూడ, దరఖాస్తుదారు అటుపైని నౌకరుచేయుటకు అశక్తుడని, వైద్యవుద్యోగి లేక ఆఫీసు పెద్దనుండి ఒక సర్టిఫికేటును తీసిపంపవలెను

(c) ఒక నౌకరు కొలువులో నున్నపుడు లేక పారితోషికమునకు దరఖాస్తు పెట్టుకొనుటకు పూర్వము చనిపోయినయెడల 14వ విధి క్రింద పారితోషికమునకు అర్హతగల మనిషిచే లేక అట్టి మనిషి మైనరైనయెడల లేక ఇతర విధముగా అశక్తుడైనయెడల అట్టి మనిషి యొక్క సంరక్షకుడు పారితోషికమునకు దరఖాస్తు పెట్టుకొనవలెను

(d) పారితోషికము చెల్లింపబడుటకైన ప్రతి దరఖాస్తు ఒక నౌకరు—

(i) కొలువునుండి విరమించిన,

(ii) కొలువునుండి విడుదలచేయబడిన, మరియు

(iii) చనిపోయిన,

తేదీనుండి ఆరు నెలలలోపల దాఖలు చేయబడవలెను

(2) పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి, దరఖాస్తు పెట్టుకొనబడిన బాపతు పారితోషికమును జారీచేయుటకు వుద్దేశించు నెడల, ఈ విధులయొక్క 2 వ అనుబంధములోని నమూనాలో పారితోషికమునకుగాను ఒక దరఖాస్తును ఆయన సిద్ధము చేయవలెను

17 తక్కువ తరగతి సేవకులు (మీనియల్సు) సాధారణముగా పారితోషికము పొందుటకు అర్హులుకారు అయినప్పటికిని అర్హతగల సందర్భములలో పారితోషికము చెల్లింపబడవచ్చునని ఒక పంచాయతీ తలంచు పక్షమున, అట్టి చెల్లుబళ్ళు ఈ క్రింది షరతులకు లోబడి మంజూరు చేయబడవచ్చును అవేవనగా—

(a) పంచాయతీ క్రింద సేవకుని కొలువు ఇరువది సంవత్సరములకంటె తక్కువగా నుండకూడదు,

(b) మంజూరు చేయబడిన పారితోషికముయొక్క వెరసి మొత్తము, పైన చెప్పబడిన విధుల ననుసరించి ఇన్‌ఫీరియర్ నౌకర్లకు అనుమతింపబడిన మొత్తమును మించకూడదు

(c) సంబంధించిన రీజినల్ ఇన్‌స్పెక్టరుయొక్క అనుమతిని చెల్లుబడికి ముందుగా పొందవలెను.

## 1 వ అనుబంధము

[ 1 (iii) వ విధిని చూడుడు ]

| సుపీరియరు సర్వీసులో వుద్యోగములు | | ఇన్‌ఫీరియరు సర్వీసులో వుద్యోగములు | |
|---|---|---|---|
| అవెన్యూ లేక తోట సూపరింటెండెంటు | | ఆస్పత్రులు, డిస్పెన్సరీలలో పరిచారకులు, | |
| అటెండర్లు | .. | | |
| బిల్ కలెక్టర్లు | .. | ... | ... |

| సుపీరియర్ సర్వీసులో ఉద్యోగములు | | ఇన్ఫీరియర్ సర్వీసులో ఉద్యోగములు |
|---|---|---|
| జనన మరణముల రిజిస్ట్రారులు | ... | . |
| గుమాస్తాలు | | ... |
| గుమస్తాల బిల్ కలెక్టరుల పని గల జాయింటు ఉద్యోగములు | | . |
| కాంపౌండర్లు | . | . |
| జన సామాన్యము యొక్క ఆరోగ్యమునకు సంబంధించినపనిలో నియమింపబడిన సినిమా ఆపరేటర్లను, నిపుణులగు ఇతర పనివాండ్రును | | |
| ఫిట్టర్లు* .. | . | తోట కూలీలు |
| ప్రధానోపాధ్యాయులు | ... | . |
| హెల్తు విజిటర్లు | | |
| లైసెన్సు సూపరింటెండెంట్లు | ... | . |
| లైబ్రేరియనులు . | . | |
| లైటింగు సూపరింటెండెంట్లు లేక ఇన్స్పెక్టరు | | . |
| లారీ డ్రైవరు* | | .. |
| వైద్య ఉద్యోగులు (అలోపతిక్, యల్ ఐ యమ్, ఆయుర్వేదిక్, యునాని), | | .. |
| మంత్రసానులు | . | |
| మాస్టర్లు-డ్రాయింగు, డ్రిల్లు వగైరా | | ... |
| మెకానిక్కులు | ... | ... |

* జీతము లేక గరిష్ఠ జీతము నెల ఒకటికి రూ 20 లను మించినపుడు

మార్కెట్ సూపరింటెండెంటు
లేక సూపర్‌వైజరు సార్జంటు ...
నర్సులు .. .. నర్సింగు ఆర్డర్లీలు
వైద్యులు (ఆయుర్వేద, యునానీ పబ్లిక్ హెల్తు జవాను
డిస్పెన్సరీలు) లతో సహా జవానులు
పార్కు సూపర్‌వైజరు
రేడియో ఆపరేటర్ . ..
రిజిస్ట్రారు-వాక్సినేటర్లు . .
రెవెన్యూ ఇన్‌స్పెక్టర్లు ...
శానిటరీ ఇన్‌స్పెక్టర్లు ... .
పాఠశాలల సూపర్‌వైజర్లు లేక
సూపరింటెండెంట్లు ..
పార్కు సూపర్‌వైజర్లు .. ..
స్టాకర్లు . ..
స్టోరుకీపర్లు ... ...
ఉపాధ్యాయులు . టర్న్ కాక్స
టౌన్‌ప్లానింగు సూపర్‌వైజరు ... .
టీకాలు వేయువారు
పశువైద్య సర్జను లేక ఇన్‌స్పెక్టరు
లేక ఉద్యోగి ...
వారంటు ఆఫీసరు ..
ప్రసూతి, శిశుసంరక్షణ కేంద్రము
యొక్క స్త్రీవైద్యఉద్యోగి.. .

2 వ అనుబంధము

[16 (2) వ విధిని చూడుడు]

పారితోషికమునకు దరఖాస్తు

1. దరఖాస్తుదారుని పేరు
2 తండ్రి పేరు
3. జాతి, మత, శాఖ, కులము.

4 గ్రామము, జిల్లాను తెలుపుచు, నివాసస్థలము
5 సంస్థ పేరుతోసహా ప్రస్తుతపు లేక కడపటి ఉద్యోగము
6 కొలువు ప్రారంభమైన తేదీ
7 కొలువు అంతమైన తేదీ
8 మధ్య మధ్య నిలిచిపోవుటతో సహా ఎంతకాలము కొలువు చేసినది
దీనిలో సుపీరియరు
ఇన్‌ఫీరియరు
అర్హాత నియ్యాని మరియు మధ్యమధ్య నిలిచిపోయిన కాల పరిమితులు
9 దరఖాస్తు పెట్టుకొన్న పారితోషికముయొక్క తరగతి మరియు దరఖాస్తు పెట్టుకొన్నందుకు కారణము ♦
10 (సగటు) వేతనములు లేక జీతము.
11 జారీచేయుటకు ఉద్దేశింపబడిన పింఛను
12 జారీచేయుటకు ఉద్దేశింపబడిన పారితోషికము
13 ఏ తేదీనుండి పింఛను ప్రారంభమగును
14 చెల్లించవలసిన స్థలము
15 క్రైస్తవ శకమునబట్టి దరఖాస్తుదారుని పుట్టిన తేదీ *
16 ఎత్తు
17 గుర్తులు.
18 తేదీ

కార్యనిర్వాహక అధికారియొక్క సంతకము

యొక్క (మధ్య మధ్య నిలిచిపోయిన కాల పరిమితులు తెలుపు) కొలువుయొక్క చరిత్ర

---

♦ దరఖాస్తు నష్టపరిహారము, పింఛను లేక పారితోషికముకొరకు పెట్టుకొనబడిన పక్షమున హక్కును కోరుటకు ఏర్పడిన సంస్థ మార్పుయొక్క స్వభావమును పూర్తిగా తెలుపవలెను

*(సరిగా తెలియనిపక్షమున నమ్మదగిన సమాచారము లేక అంచనానుబట్టి తెలుపవలెను )

| (1) సంఖ్య | (2) ఉద్యోగము | (3) జీతము | (4) ఆక్టింగు జీతము | (5) ప్రారంభపు తేదీ | (6) అంత్యమైన తేదీ | (7) కొలువుచేసినట్లు లెక్క పెట్టబడిన కాల పరిమితి | (8) కొలువుచేసినట్లు లెక్క పెట్టు కాల పరిమితి | (9) షరాలు | (10) ఎట్లు సరిచూడబడినది | (11) లోకల్ ఫండు అకౌంట్సు ఎగ్జామినరు యొక్క షరాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|

సుపీరియర్ } కొలువు
ఇన్ఫిరియర్

యొక్క పూర్తి కాలపరిమితి

## ఆఫీసు పెద్దయొక్క షరాలు.

1 దరఖాస్తుదారుని గుణము మరియు పూర్వపు ప్రవర్తనన గురించి.

2 తాత్కాలికముగా పనినుండి నిలిచియుంచిన విషయమై లేక ఉద్యోగములో తక్కువ హోదాకు పంపివేసిన విషయమై సంజాయిషీ

3 దరఖాస్తుదారు అదివరకే ఏదైన పారితోషికము లే పింఛను పుచ్చుకొనియుండినయెడల ఆ విషయమును గురించి

4 ఏదైన ఇతర షరాలు

5. హక్కుగా కోరబడిన కొలువు స్థిరమైనదా అనియ మఱియు దానిని అంగీకరించవచ్చునా లేదా అనియు ఆఫీసు పె యొక్క నిర్దిష్టమైన అభిప్రాయము

సర్టిఫికేటు మఱియు రిపోర్టు

(క్రింద రికార్డుచేయబడిన షరాలకు లోబడి) { సుపీరియర్ / ఇన్ఫీరియర్

గ్రేడులలోని అర్హతనిచ్చు సర్వీసు          సంవత్సరములు
నెలలు          దినములుగా క్రమముగా ఋజువైనది    మఱియు రూ.
లకు మించని పారితోషికమును జారీచేయవచ్చును   లెక్కలు
క్రమముగా సరిచూడబడినవి

కార్యనిర్వాహక అధికారి

## పారితోషికమునకై దరఖాస్తు

దరఖాస్తుయొక్క తేదీ.
దరఖాస్తుదారుని పేరు
కడపటి ఉద్యోగము
పారితోషికముయొక్క తరగతి
మంజూరీచేయబడిన పారితోషికపు మొత్తము.
ప్రారంభమగు తేదీ.
మంజూరు చేయబడిన తేదీ

కార్యనిర్వాహక అధికారి.

సంపాదకుని సూచన.—

విధి 16 (1) (d) చూడుడు (పేజీ 235) జి ఓ నెం 821 ఎల్ ఎ తేదీ 26-4-1952 లో, ప్రభుత్వము ఇన్‌స్పెక్టరు జనరల్‌కు, గ్రాట్యుయిటీ దరఖాస్తు పెట్టుట ఆలస్యము ఆరునెలలను మించిన, క్షమించుటకు అధికార మొసంగిరి

ఈ విధుల మేరకు మీనియల్ నౌకర్లు పారితోషికమునకు (గ్రాట్యుయిటీకి) సాధారణముగా నర్హులు విధి 17 ప్రకారము, ఉచితమని పంచాయతీకి తోచిన, ఎవరైన మీనియలు నౌకర్లకు, పంచాయతీ పారితోషిక మివ్వవచ్చును జి ఓ నెం. 192 ఎల్ ఎ తేదీ 1-3-54 లో, ప్రభుత్వము పంచాయతీలు సదరు నౌకర్లకు గ్రాట్యుయిటీ ఇవ్వవచ్చును మరియు నట్టి సందర్భములో గ్రాట్యుయిటీ దరఖాస్తు పెట్టుట ఆలస్యమగునో, నట్టి యాలస్యమునకు తగిన కారణములు చూపించిన, సదరు ఆలస్యము క్షమించుటకు రీజినల్ ఇన్‌స్పెక్టర్ల కధికార మొసగిరి

## పంచాయతీ సిబ్బంది - జీతబత్తెములు - రావలసిన బాకీలు - దరఖాస్తులు తీర్మానమునకై సెక్షను 34 (2) క్రింద చేసిన విధులు

(జి ఓ నెం. 501 ఎల్ ఎ తేదీ 2-6-1954)

(1) పంచాయతీ సిబ్బందిలో నెవరిదైన జీతము, జీతము హెచ్చు (ఇంక్రిమెంటు) లేక బత్తెములు బాకీపడియుండిన, సదరు

బాకీ జీతము బత్తెములకై పెట్టుకొన్న యూతని దరఖాస్తు తీర్మానమునకు ముందు, ఎగ్జిక్యూటివు అధికారిచే విమర్శింపబడవలెను సదరు విమర్శనకు—

(1) బాకీలు ఆరు నెలలకుమించి రెండు సంవత్సరములకు మించనియెడల, పంచాయతి మంజూరు పొందవలెను, మరియు

(11) బాకీలు రెండు సంవత్సరములకు మించినయెడల, పంచాయతీ మంజూరేకాక, రీజినలు ఇన్‌స్పెక్టరు మంజూరుకూడ పొందవలెను

నోటు :—ప్రయాణము పూర్తి అయిన తేదీనుండి, మూడు నెలల తరువాత పంపించిన, మంజూరుకాబడదు ఆట్టి దరఖాస్తు బిల్లులను, పై అధికారులు మంజూరునకు అర్హత కలిగింప జేయుటకుగాను సంతకము (కౌంటరు సైను జేయుటకుగాను) చేయకూడదు

2 విధి 1 క్రింది బాకీ దరఖాస్తుపై, జారీచేసిన మొత్తము, బాకీ కనిపెట్టిన తేదీనుండి గతించిన నొక సంవత్సరము మించని కాలమున కెంత మొత్తమున కర్హతయున్నదో, అంతే మంజూరు చేయవలెను ఏదైన నొక బాకీ విషయమున, విశేష కారణముల వల్ల పై పరిమితి మించి నుద్దేశించిన, ఎగ్జిక్యూటివ్ అధారటి లోకలు ఫండు ఎగ్జామినరు గారితో మొదట సంప్రతించవలెను ఎగ్జామినరు వారి సలహాపై, సదరు సంవత్సరమునకు మించిన బాకీ మొత్తం యిచ్చుటకు, రీజినలు ఇన్‌స్పెక్టరు వారి మంజూరు పొందవలెను, కాని, ఏ యొక్క బాకీయైన, రు 25 లు మించినదో, ఎగ్జామినరుతో సంప్రతించననవసరము

నోటు —ఈ విధికి గాను "బాకీ కనిపెట్టిన తేదీ యీ క్రింది సూచించిన ప్రకారము నిర్ణయించవలెను—

ఏ తేదీని, సదరు బాకి ఎగ్జిక్యూటివు అధారటి కనిపెట్టెనో, లేక వారి దృష్టికి తీసుకురాబడెనో, యీ తేదీ లేక ఆడిటు పరిశీలనా క్రమమున బాకీ కనుగొనబడిన, ఆడిటు డిపార్టుమెంటువారు కనిపెట్టిన

తేదీ, ఇవ్వవలసిన మొత్తము, గతించిన దేదైన తేదీనుండి మంజూరు కాబడిన, సదరు గతించిన తేదీనుండి రావలసిన మొత్తము, మంజూరు తేదీవరకు బాకీగా నెంచబడదు సదరు మొత్తము బాకీగా, ఆ రెండు తేదీల మధ్య నిలబడియున్నట్లు నెంచకూడదు అట్టి, అనగా గతించిన తేదీనుండి అమలగునట్లు జారీచేసిన ఆర్డరు, సంబంధించిన సందర్భములలో, ముందుగానే నిచ్చుటకు వీలులేనట్లో లేక సదరు ఆర్డరు జారీచేయుట, తెలిసియే ఆలోచించుటకుగాను నిలుపుదల జేయబడినట్లో నెంచవలెను

3 విధి 1 క్రింద నివ్వబడిన హక్కును, పంచాయతీ దత్తత చేయకూడదు

VII. ఆంధ్ర మునిసిపల్, జిల్లాబోర్డు, మరియు పంచాయతీ సర్వీసుల (దేశ భద్రత రక్షణ విధులు, 1955)

(జి. ఓ నెం 1150 లోకల్ అడ్మినిస్ట్రేషన్,
తేదీ 17-11-1955)

ఈ క్రింద నుదహరింపబడిన సెక్షనులలోని అధికారములను నిర్వహించుచు, ఆంధ్ర గవర్నరు, దేశ భద్రతను కాపాడు విషయములో, నీ క్రింది విధులు.. యాక్టుయొక్క 113 (2) సెక్షనులలో విధింపబడిన ప్రకారము యిదివరకే ప్రకటింపబడినవి—

మద్రాసు గ్రామ పంచాయతీల యాక్టు 1950 మద్రాసు యాక్టు X ఆఫ 1950 యొక్క 112 (1) వ సెక్షను.

విధులు.

1 (1) వీనిని, ఆంధ్ర మునిసిపలు, జిల్లాబోర్డు, మరియు పంచాయతీ సర్వీసుల (దేశ భద్రత రక్షణ) విధులు 1955, అని పేర్కొనవచ్చును

(2) ఇవి పంచాయతీల వ్యవహార సందర్భములలో పనిచేయు అందరు వ్యక్తులకు, ఎప్పుడైన నే దేని అవకాశము కొరకుగాని, లేక ఒక నెలకు తక్కువ కాలపు నోటీసుతో తొలగింపబడతగిన వ్యక్తులకు తప్ప, వర్తించును.

(3) ఈ విధులచే నధిగమింపబడిన (రద్దుచేయబడిన) విధుల లోని విధాయకముల క్రిందనే వేని విచారణలు ప్రారంభింపబడినను, ఏదైన చర్య తీసికొనబడినను, లేక ఆజ్ఞ జారీచేయబడినను, లేక నోటీసు యివ్వబడినను, అవి అన్నియు ఆ విధుల కనుగుణ్యముగ నున్న ఈ విధుల క్రింద ప్రారంభించినట్లు, చర్యలు తీసికొనబడినట్లు పరిగణింపబడి, ఆ విచారణలు, ఆ చర్యలు అదే ప్రకారముగా కొనసాగించి తుదముట్టించవలెను

2 ఈ విధులలో

(a) "పంచాయతీ నౌకరు" అనగా ఈ విధులు వర్తించు నేవ్యక్తి అయిన, అని అర్థము.

(b) "శాఖాధికారి (డిపార్టుమెంటు హెడ్డు)" అనగా ఈ క్రింద వివరింపబడినవారు—

(1) ప్రజారోగ్య పబ్లికు హెల్తు సిబ్బందిలోని నౌకరు అయితే, డైరెక్టరు ఆఫ్ పబ్లికు హెల్తు,

(2) విద్యాశాఖ సిబ్బందిలోని నౌకరు అయితే డైరెక్టరు ఆఫ్ పబ్లికు ఇన్‌స్ట్రక్టరు,

(3) యింజనీరింగు శాఖ సిబ్బందిలోని నౌకరు అయితే, చీఫు యింజనీరు, పబ్లికు వర్క్సు డిపార్టుమెంటు, (జనరలు అండ్ బిల్డింగ్సు),

(4) వైద్యశాఖ సిబ్బందిలోని నౌకరు అయితే, డైరెక్టరు ఆఫ్ మెడికల్ సర్వీసెస్, మరియు

(5) యితర శాఖలలో సిబ్బందిలోని నౌకరు అయిన యెడల ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషను

(c) హక్కు గలాధికారి (కాంపిటెంటు అధికారి) అనగా, పంచాయతీయొక్క ఎగ్జిక్యూటివ్ అధికారి

3 పంచాయతీలోని ఒక నౌకరు విప్లవాత్మకమైన (వినాశకరమైన) పనులలో నిమగ్నుడై యున్నాడని, లేక అట్టి పనులలో

నిమగ్నుడై యున్నట్లు సకారణముగా అనుమానింప వచ్చునని గాని, గవర్నరు అభిప్రాయపడిన యెడల, మరియు అందుచేత పంచాయతీ సర్వీసులో నుంచుట దేశ రక్షణకు ప్రమాదకరమని తోచినయెడల, ఆ నౌకరును సర్వీసునుండి బలవంతముగా విరమింపచేయుచు ఆజ్ఞను జారీ చేయవచ్చును

4 మూడవ విధి క్రింద ఆజ్ఞ జారీ చేయుటకు ముందుగా—

(a) గవర్నరుయొక్కగాని, శాఖాధికారియొక్కగాని ఆ గ్రామముపై హక్కుగలాధికారి, పంచాయతి నౌకరుకు వ్రాత మూలకమయిన నోటీసుద్వారా నతనిపై నెట్టి చర్య తీసికొనబడ నున్నదో తెలియపరచి, సదరుహక్కు గలాధికారిద్వారా గవర్నరుకు అట్టిచర్యకు వ్యతిరేకముగ (ఏల తీసికొనరాదో) విజ్ఞాపనను నోటీసులో చెప్పబడిన కాలములో సమర్పించుటకు అవకాశము నీయవలెను

(b) హక్కుగలాధికారి అట్టి విజ్ఞాపనను ఆ శాఖాధికారి ద్వారా సమర్పించవలెను,

(c) అట్లు అతనిచే చేయబడిన విజ్ఞాపనను గవర్నరు విచారణలోనికి తీసుకొనవలెను

5 ఈ విధుల క్రింద చర్య తీసికొనవలసినపుడు హక్కుగలాధికారి ఆ నౌకరును సస్పెండు చేయవలెను

అయితే పంచాయతీ నౌకరు కోరినయెడల, అతనికి శెలవునకు హక్కువున్న యెడల ఆ హక్కుగలాధికారి అతనిని సస్పెండుచేయుటకు ముందు, అతనికి హక్కు గల శెలవు తీసుకొనుటకు అనుజ్ఞ నీయవలెను

6 ఈ విధుల క్రిందనే చర్య తీసికొనినను, తీసుకొనవలసినపుడును, పంచాయతీ నౌకరుల నియామకం శిక్షలకు సంబంధించిన చట్టబద్ధమైన విధులలో చెప్పబడిన విధాయకములేవియు నీసందర్భములో వర్తింపనేరవు

7 సర్వీసులోని యొక స్థానము రద్దుచేయబడినపుడు, ఆ నౌకరుకు మరియొక వుద్యోగము కలుగజేయకుండ తొలగించినపుడు,

అతనికి ఆ తేదీనాటికి ముదరా, ఫించను, పారితోషికము (గ్రాట్యూయిటీ) లేక ప్రావిడెంటుఫండు యిచ్చుటకు ఏ విధులు వర్తించునో, ఆ విధులే పై 3 వ విధి క్రింద బలవంతముగా సర్వీసునుండి విరమింపబడిన వ్యక్తికి వర్తించును

34 (3) వ సెక్షను క్రింద జారీచేయబడిన

విధులు

## రెండు లేక ఎక్కువ పంచాయతీలకు ఉమ్మడి వుద్యోగి లేక నౌకరును నియమించుట

(జి ఓ నెం 510 ఎల్ ఎ తేదీ 24-3-1951)

1 ఇన్‌స్పెక్టరు అవసరమైనపుడు రెండు లేక ఎక్కువ పంచాయతీలను కార్యనిర్వాహక ఉద్యోగి కానట్టి ఒకే ఉద్యోగి లేక నౌకరును ఆ రెండింటికి లేక అన్నిటికి ఒకేవిధమైన స్వభావము గల ఏ అధికారమునైనను చెలాయించుటకు లేక ఏ విధులనైనను నెరవేర్చుటకు నియమించవలెనని కోరవచ్చును

అయితే ప్రజారోగ్యసిబ్బందికి సంబంధించిన ఆలోచనల సందర్భములలో ఇన్‌స్పెక్టరు పబ్లిక్ హెల్తు డైరెక్టరుతో ఆలోచించవలెను

2 సంబంధించిన పంచాయతీలు అట్టి వుద్యోగి లేక నౌకరుకు చెల్లించవలసిన జీత బత్తెముగా మరియు పంచాయతీల ఆదాయమును, అట్టి వుద్యోగి లేక నౌకరుచేయు పని మొత్తమును లేక సదరు కార్యము నిమిత్తము ఇన్‌స్పెక్టరు ఉత్తమమని తలంచగల ఏ ఇతర విషయములను బట్టియైన ఇన్‌స్పెక్టరు విధించగల దామాషాలోను అట్టి విధముగాను ఆయన శెలవు జీతమునకు లేక ప్రావిడెంటుఫండుకు చెల్లించవలసిన సహాయద్రవ్యముతో సహా భరించవలెను

3 ఇన్‌స్పెక్టరు సంబంధించిన పంచాయతీలలో నొకదాని యొక్క కార్యనిర్వాహక అధికారిని ఆక్టుయొక్క 34 (6) వ సెక్షనులో చెప్పబడిన అధికారములను చెలాయించుటకు నిర్దేశించవలెను.

4 సంబంధించిన పంచాయతీలలో దేనియొక్కయైనా కార్య నిర్వాహకాధికారి ఆ విధి క్రింద నిర్దేశింపబడిన కార్యనిర్వాహకాధికారివలన 3 వ విధిలో చెప్పబడిన అధికారములను చెలాయించు విషయమున తృప్తిపడని యెడల మొదట చెప్పబడిన కార్యనిర్వాహకాధికారి ఈ విషయమును ఇన్‌స్పెక్టరుకు తెలుపవలెను. అట్టి విషయమున ఆయనయొక్క తీర్మానమును ఆఖరు అయనదిగా యుండవలెను

సంపాదకుని సూచిక —

ఆక్టుయొక్క 34 (8) వ సెక్షను క్రింద పదకొండు ఆంధ్ర జిల్లాలలోని పంచాయతీలకు కలిపి ఉమ్మడిగా యింజనీరింగు సిబ్బందిని నియమించుటకు ఇన్‌స్పెక్టరు జనరల్‌కు అవకాశమిచ్చుటకుగాను, ఆంధ్రపంచాయతీ సబార్డినేటు యింజనీరింగు డిపార్టుమెంటు (శాఖ) నిర్మాణము చేయబడినది ఈ సిబ్బందికయ్యే ఖర్చు పంచాయతీలనుండి రాబట్టబడును

ఆంధ్ర పంచాయతీ సబార్డినేటు యింజనీరింగు సర్వీసుపాలనా సౌకర్యము నిమిత్తము విధులు

(జి ఓ నెం 956, లోకల్ అడ్మినిస్ట్రేషన్,
తేదీ 4-10-1955)

ఇండియా దేశపు రాజ్యాంగము (కాన్‌స్టిట్యూషను) యొక్క 309 వ ఆర్టికల్‌లోని ప్రత్యేక విధిక్రింద (ప్రావిసోక్రింద) యివ్వబడిన అధికారములను నిర్వహింపుచు, ఆంధ్ర పంచాయతీ యింజనీరింగు సబార్డినేటు సర్వీసుకొరకు యీ క్రింది విధులను ఆంధ్ర గవర్నరు వ్యక్తము చేయుచున్నారు.

విధులు

ఆంధ్ర పంచాయితీ యింజనీరింగు సబార్డినేటు సర్వీసు

1 ప్రారంభము ఈ విధులు 4-10-1955 తేదీనుండి అమలులోనికి వచ్చును

2 నిర్మాణము - ఈ సర్వీసులో యీ క్రింద పేర్కొనబడిన తరగతుల వుద్యోగులు వుందురు -

తరగతి 1—సూపరువైజర్లు

తరగతి 2—ఓవరుసీర్లు.

3. నియామకము

(a) ఈ తరగతులకు యీ క్రింది విధముగా నియామకము చేయబడును -

| తరగతి (కేటగిరి) (1) | నియామకపు పద్ధతి (2) |
|---|---|
| 1 సూపరువైజరు | (i) తిన్నగా నియామకము (ప్రత్యక్ష నియామకము), లేక<br>(ii) ఓవరుసీయరునుండి ప్రమోషను, లేక<br>(iii) ప్రత్యేక కారణముల చేత మరియొక సర్వీసునుండి బదిలీచేత నియామకము |
| 2 ఓవరుసీర్లు | (i) ప్రత్యక్ష నియామకము లేక<br>(ii) ప్రత్యేక కారణములచేత మరియొక సర్వీసునుండి బదిలీచేత నియామకము. |

(b) సూపరువైజరు స్థానములకు ప్రమోషనులు యోగ్యతను, సమర్థతనుబట్టి చేయబడును యోగ్యత, సమర్థత యించుమించు సమముగా నున్నపుడు సీనియారిటీ పరిగణింపబడును

4 ఆమోదింపబడిన అభ్యర్థుల జాబితా.

(1) వ మరియు (2) వ తరగతులకు ప్రత్యక్ష నియామకమునకు ఆమోదింపబడిన అభ్యర్థుల జాబితాను ఆంధ్ర పబ్లికు సర్వీసు కమీషను తయారుచేయును

5 నియమించు అధికారి ఈ రెండు తరగతుల స్థానములకు నియామకముచేయు అధికారి ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషను

6 నియామకములను (స్థానములను) ప్రత్యేకించుట

ప్రత్యేక నియామకపు విధులు (జనరల్ విధి 22), సూపర్‌వైజర్లు, ఓవరుసీర్ల నియామకమునకు వేరుగా వర్తించును

7 వయస్సు గురించిన యోగ్యతలు (క్వాలిఫికేషనులు)

ఈ క్రింద వివరింపబడిన పట్టీలో మొదటి వరుసలో చెప్పబడిన ఏ స్థానములకైన, రెండవ వరుసలో దానికెదురుగా చెప్పబడిన

విద్యావిశేషములను, వయస్సు పరిమితియు కలిగియుండినచేతప్ప, ప్రత్యక్ష నియామకమునకు ఏ వ్యక్తియు అర్హుడుకాడు

పట్టీ

| ఉద్యోగములు (1) | వయస్సు (2) |
| --- | --- |
| సూపర్వైజర్లు | (a) వెనుకబడిన జాతులకు షెడ్యూల్డు కులములకు లేక షెడ్యూల్డు జాతులకు చెందనివాని విషయములో-<br><br>(i) ఉత్కళ, ఆంధ్ర, మద్రాసు, అన్నామలై యూనివర్సిటీలయొక్క యింజనీరింగు డిగ్రి (సివిల్, మెకానికల్, లేక ఎలక్ట్రికల్) గాని, లేక అనంతపురం, కాకినాడ లేక గిండీ యింజనీరింగు కాలేజీలయొక్క యింజనీరింగు డిప్లొమా (సివిల్, మెకానికల్, లేక ఎలక్ట్రికల్) గాని, లేక<br><br>కాకినాడ వుయ్యూరులోని పాలిటెక్నిక్సునుండి పాలిటెక్నిక్సులో డిప్లొమాగాని, లేనియెడల 26 సంవత్సరములు<br><br>(ii) పై (i) వ అంశములో చెప్పబడిన ఏ డిగ్రీగాని, డిప్లొమాగాని కలిగియున్నయెడల-28 సంవత్సరములు<br><br>(b) వెనుకబడిన తరగతులు, షెడ్యూల్డు కులములు లేక షెడ్యూల్డు జాతులకు చెందిన వ్యక్తి విషయములో-<br><br>(i) పై (a) (i) వ అంశములో చెప్పబడిన యేడిగ్రీగాని, లేక డిప్లొమాగాని కలిగియున్నయెడల-వయస్సు పరిమితి లేదు<br><br>(ii) (a) (i) వ అంశములో చెప్పబడిన యేడిగ్రీగాని, డిప్లొమాగాని లేనియెడల-30 సంవత్సరములు |

| ఉద్యోగములు | వయస్సు |
|---|---|
| (1) | (2) |
| (2) ఓవరుసీర్లు | 25 సంవత్సరములు, అయితే, యిది వరకు సిపాయిగానున్న వ్యక్తి విషయములో, సైన్యములో పనిచేసిన కాలము మినహాయించి అతని వయస్సు పరిమితి నిర్ణయింపబడును |

పై పట్టీలో (2) వ వరుసలో నుడువబడిన వయస్సు పరిమితులు. సెలెక్షన్ చేయబడిన సంవత్సరముయొక్క జూలై 1 వ తేదీ నుండి వర్తించును

## 8. యితర యోగ్యతా విశేషములు

యీ విధుల కనుబంధముగానున్న షెడ్యూలలో (1) వ వరుసలో చెప్పబడిన స్థానములకు, వాటి కెదురుగ (2) వరుసలో నుడువబడిన విద్యాగుణ విశేషములు కలిగియున్నగాని, ఏ వ్యక్తియు నియామకమునకు అర్హుడుకాడు

9 ప్రొబేషన్ — ఏ తరగతికైనను నియమింపబడిన వ్యక్తి, అతను పనిలో చేరిన తేదీ లగాయతు, మూడు సంవత్సరములలో, మొత్తము రెండు సంవత్సరములు ప్రొబేషనులో నుండవలెను

## 10 టెస్టులు (పరీక్షలు) –

యీ సర్వీసులోని యుద్యోగస్తులకు యీ క్రింది పరీక్షలు (టెస్టులు) నిర్ణయింపబడినవి —

| తరగతి | పరీక్ష | కాలవ్యవధి |
|---|---|---|
| (1) | (2) | (3) |
| (a) ప్రత్యక్షముగ నియామకమయిన గాని, లేక యితర సర్వీసు దేనినుండి అయిన బదిలీ చేయబడిన గాని, సూపర్వైజర్లు | పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు ఆఫీసర్లకు, సబార్డినేట్లులకు నిర్ణీతమయిన అక్కౌంట్సు టెస్టు | ప్రొబేషను కాలములో ప్యాసు కావలెను |

| తరగతి | పరీక్ష | కాలవ్యవధి. |
|---|---|---|
| (1) | (2) | (3) |
| (b) ఓవర్ సీర్లు నుండి ప్రమోషను ద్వారా నియమితులైన సూపర్ వైజర్లు | డిట్టో | మూడు సంవత్సరముల నిర్విరామ కాలములో మొత్తం రెండు సంవత్సరములు పనిచేస్తూయున్న కాలములో ప్యాసు కావలెను |

షరా — పైన చెప్పబడిన (2) వ వరుసలోని పరీక్షలో, (3) వ వరుసలో చెప్పబడిన కాల పరిమితిలో ప్యాసుకాని సూపర్ వైజరు విషయములో, (3) వ వరుసలో చెప్పబడిన కాలపరిమితి తర్వాత సంవత్సరములో చేయబడిన పరీక్షలయొక్క ఫలితములు ప్రకటనఅయ్యేవరకు కాలవ్యవధి ఎక్కువచేయబడును ప్రొబేషనులో నున్న సూపర్ వైజరు, ప్రొబేషనుకాలములో పై నుదహరింప బడిని పరీక్షలో ప్యాసు కానియెడల, అతనిని యుద్యోగమునుండి తొలగింపరాదు మరియు క్రింది పదవికి దింపరాదు, కాని అతను పరీక్ష ప్యాసు అయ్యేదాకా ప్రొబేషను పొడిగించి, యింక్రిమెంటు నిలుపుజేయవలెను

11 బదిలీలు — యీ సర్వీసులోని యుద్యోగుల బదిలీలు ఇన్ స్పెక్టర్ జనరలు ఆఫ్ లోకలు అడ్మినిస్ట్రేషనుచేత చేయబడును.

12. జీతముల శ్రేణులు (స్కేలు)

సూపర్ వైజర్లు — ఈ స్థానములోనున్న యుద్యోగికి రూ. 100-5-150-10-250 శ్రేణిలో లెక్కించి వేతనము నియ్యవలెను యింజనీరింగు గ్రాడ్యుయేట్లుకు రూ 150/- జీతముతో ప్రారంభము చేయవలెను )

ఓవరుసీర్లు — ఈ స్థానములో నున్న వుద్యోగికి 70-3-115 శ్రేణిలో లెక్కించి వేతనము నియ్యవలెను

# షెడ్యూలు

(౨ వ విధిలో నిరూపింపబడినది)

| ఉద్యోగములు (i) | విద్యావిశేషగుణములు (ii) |
| --- | --- |
| సూపర్ వైజర్లు | (i) మద్రాసు, ఆంధ్ర, లేక అన్నామలై యూనివర్సిటీలయొక్క యింజనీరింగు డిగ్రీ (సివిల్, మెకానికల్ లేక ఎలెక్ట్రికల్) లేక, (ii) గిండీ కాకినాడ, లేక అనంతపురం ఇంజనీరింగు కాలేజీలయొక్క ఇంజనీరింగు డిప్లొమా (సివిల్, మెకానికల్, లేక ఎలక్ట్రికల్), లేక కాకినాడ లేక వుయ్యూరు పాలిటెక్నిక్కులయొక్క పాలిటెక్నిక్కులో డిప్లొమా, లేక (iii) గిండీ యింజనీరింగు కాలేజి యొక్క అప్పర్ సబార్డినేటు లేక ఎల్. సి. యి డిప్లొమా లేక (iv) ఎ ఎం ఐ యి (ఇండియా) పరీక్షయొక్క A మరియు B సెక్షనులలో ఈ క్రింది విషయములలో (సబ్జక్టులలో) ప్యాసునూన్న, ఇంజనీరింగు పనులలో ఒక సంవత్సరమునకు తక్కువ కాకుండ అనుభవము— |
| సూపర్ వైజర్లు(కం)— | ప్రోపర్టీస్ అండ్ స్ట్రెంగ్త్ ఆప్ మెటీరియల్స్ అండ్ ఎలిమెంటరీ స్ట్రక్చర్స్, థియరీ ఆఫ్ స్ట్రక్చర్స్ A సెక్షనులో (a) మరియు (b) పేపర్లు, హైడ్రాలిక్స్ అండ్ హైడ్రాలిక్ మెషీనరీ, జియాలజీ, హైవే ఇంజనీరింగు, B సెక్షనులో (f) (j) మరియు (m) పేపర్లు, (a) అయితే పై నుదహరింపబడిన (i) (ii) లేక (iii) అంశములలో |
| సూపర్ వైజర్లు— | చెప్పబడిన విద్యా విశేషములు గల అభ్యర్థి నియామకమునకు అవకాశమున్న |

| ఉద్యోగములు (1) | విద్యాగుణ విశేషములు (2) |
| --- | --- |
| | పుడు, పై (IV) వ అంశములో పేర్కొన బడిన ఎ ఎం ఐ యి (యిండియా) A M I E (Ind) విద్యా గుణము లున్న అభ్యర్థిని అట్లు నియమింపరాదు. |
| | (b) మరియు పై (I) లేక (II) వ అంశములలో నుదహరింప బడిన విద్యా విశేషములు గల అభ్యర్థి నియామకము నకు అవకాశమున్నపుడు, గిండీ యింజ నీరింగు కాలేజీయొక్క అప్పరు సబార్డి నేటు లేక L C E. డిప్లొమా (ఎల్. సి యి) డిప్లొమా కలిగియున్న అభ్య ర్థిని అట్లు నియమింపరాదు. |
| | (c) మద్రాసు, ఆంధ్ర, లేక అన్నా మలై యూనివర్సిటీలయొక్క యింజ నీరింగు డిగ్రీ (సివిల్, మెకానికల్, లేక ఎలెక్ట్రికల్) కలిగియున్న అభ్యర్థి నియామకమునకు అవకాశమున్నపుడు, గిండీ, కాకినాడ లేక అనంతపురం ఇంజి నీరింగు కాలేజిలయొక్క ఇంజినీరింగు డిప్లొమాగాని, లేక కాకినాడ లేక వుయ్యూరు పాలిటెక్నిక్సు యొక్క పాలీటెక్నిక్సులో డిప్లొమాగాని కలిగి యున్న అభ్యర్థిని నియమింపరాదు |
| | అయితే, యిట్లు నిర్ణయింపబడిన విద్యావిశేషము లేవియు లేకపోయి నప్పటికి, యితర విధముగా తగియున్న యెడల, ఓవరుసీరు నియామకమునకు అర్హుడగును, |
| ఓవరుసీర్లు | (1) మద్రాసు, ఆంధ్ర లేక అన్నా మలై యూనివర్సిటీలయొక్క యింజి నీరింగు డిగ్రీ (సివిల్, మెకానికల్ లేక ఎలెక్ట్రికల్), లేక |
| | (2) గిండీ, కాకినాడ, లేక అనంత పురం యింజినీరింగు కాలేజిలయొక్క |

| ఉద్యోగమును (1) | విద్యాగుణ విశేషములు (2) |
|---|---|
| | యింజనీరింగు డిప్లొమా (సివిల్, మెకానికల్, లేక (ఎలెక్ట్రికల్), (3) గిండీ, కాకినాడ, లేక అనంతపురం యింజనీరింగు కాలేజీలయొక్క సివిలు యింజనీరింగులో లైసెన్సియేట్ (L C. E ఎల్ సి యి) డిప్లొమా గాని, లేక, కాకినాడ లేక వుయ్యూరు లోని పోలీటెక్నిక్స్ నుండి పోలీటెక్నిక్స్‌లో డిప్లొమా, లేక వీటికి సరియగు మరియొక విద్యావిశేషము, లేక (4) (A M I E (Ind) ఎ ఎం ఐ, యి (ఇండియా) పరీక్షలో A, B భాగములలో, యీ క్రింది విషయములలో (సబ్జక్టులలో) ప్యాసున్ను, ఒక సంవత్సరమునకు తక్కువ కాకుండ, యింజనీరింగు పనులలో అనుభవమున్ను -ప్రోపర్టీసు అండు స్ట్రెంగ్తు ఆఫ్ మెటీరియల్స్, అండ్ ఎలిమెంటరీ స్ట్రిక్చర్స్ థియరి ఆఫ్ స్ట్రిక్చర్స్ (A) సెక్షన క్రింద (a) మరియు (b) పేపర్లు హైడ్రాలిక్స్, మరియు హైడ్రాలిక్స్ మెషినరి, జియోడెసీ, శానిటరీ యింజినిరింగు, (B) సెక్షనుక్రింద (f), (l) మరియు (m) పేపర్లు |

## విధి.

## పంచాయతీల అధికారము క్రిందనుండు సంస్థలకు పంచాయతీ సెలవుల నొసగుట

(జి ఓ నెం 520, ఎల్ ఎ తేదీ 24-3-1951)

పంచాయతీల అధికారము క్రిందనుండు ఆఫీసులును, సంస్థలును, ప్రభుత్వ ఆఫీసుల సంస్థల సందర్భములో అప్పుడప్పుడు ప్రభుత్వమువారు సాదరుచేయగల పబ్లికు మరియు ప్రత్యేక స్థానిక సెలవు దినములను మాత్రము తిసికొనునట్లు అనుమతించవలెను

అయితే పంచాయతీల అధికారము క్రింద నుండు విద్యా సంస్థలకు నియ్యబడు సెలవు దినములు మదరాసు విద్యాసంబంధమైన విధుల ప్రకారము క్రమపరుపబడవలెను

ఇంతే కాకుండ ఇన్‌స్పెక్టరుయొక్క అనుమతిని ముందుగా పొందకుండా ఎట్టి పంచాయితీగాని దాని అధికారము క్రింద నుండు ఆఫీసులకును, సంస్థలకును, గవర్నమెంటు ఆఫీసులకు సంస్థలకు సాదరు చేయబడిన సెలవుదినములు కాని ఇతర శెలవుదినములను ఇయ్య కూడదు

## చర్యాక్రమము.

సె 35 (1) పంచాయితీయొక్క ప్రతి మీటింగులోను ప్రెసి డెంటును, ఆయన లేనప్పుడు వైసుప్రెసిడెంటును, ప్రెసిడెంటు, వైసు ప్రెసిడెంటు ఇద్దరును లేనప్పుడు ఆ సమయమున అధ్యక్షత వహించు టకు మీటింగులోనున్నవారిచే ఏర్పరచుకోబడిన ఒక మెంబరు అధ్యక్షత వహించవలెను

(2) ప్రెసిడెంటు మీటింగులో క్రమమును (సభలో అన్నియు క్రమముగా జరుగు పద్ధతిని) కాపాడవలెను మరియు మీ టింగులోగాని వాటికి సంబంధించిగాని కలుగు ఆర్డరు (క్రమము) కు సంబంధించిన యావత్తు విషయములను తీర్మానించవలెను క్రమ మును గురించిన ఏదేని విషయమున చర్చ ఏదియు జరుగకూడదు. క్రమమును గురించిన ఏ విషయములోనైనను ప్రెసిడెంటుయొక్క తీర్మానము, ఈ యాక్టులో మరియొక విధముగా స్పష్టముగా నిబం ధింపబడియున్నట్లు తప్ప పరిష్కారమైనదై యుండవలెను

(3) వైసు ప్రెసిడెంటుగాని ఆ సమయమున అగ్రాసనాధి పతియైన యుండు మెంబరుగాని, ఆ మీటింగునకు ఆయన దానికి అధ్యక్షత వహించు కాలపరిమితిలోను ప్రెసిడెంటుయొక్క అధికారము లన్నిటిని కలిగియుండవలెను

సె 36 పంచాయతీయొక్క ప్రతి మీటింగులోని వ్యవహార ముల మినిట్లు (వివరముల) యొక్కయు మీటింగులో హాజరైన (ప్రెసి డెంటు మినహా) ఏ మెంబరువద్దనుండియైన అది ముగిసినమీదట 48

గంటలలోపుగా అట్టి వ్యవహారము విషయమున అందిన యావత్తు భిన్నాభిప్రాయ మినిట్లయొక్కయు నకలు నొకదానిని ప్రెసిడెంటు మీటింగు జరిగిన తేదీనుండి మూడు దినములలోపుగా ఇన్‌స్పెక్టరుకు పంపవలెను

అయితే ఇన్‌స్పెక్టరు అట్టి మినిట్లను సాధారణముగా లేదా ఏదేని నిర్దేశింపబడిన తరగతుల విషయములలో, ఈ విషయమున ఆయనచే అధికారమియ్యబడిన ఏ ఉద్యోగికిగాని పంపవలెనని ఆజ్ఞాపించవచ్చును

సె 37 పంచాయతీ, కార్యనిర్వాహక అధికారిస్వాధీనములో నున్న ఏదేని దస్తావేజును హాజరు పరచుమని ఆయనను కోరవచ్చును మరిన్ని ఆయన నిర్ణయింపబడగలట్టి విధులకులోబడి అట్టి ప్రతి ఆజ్ఞను నెరవేర్చవలెను

## 87 వ సెక్షనుక్రింద విధి

## కార్యనిర్వాహకాధికారి దస్తావేజులను హాజరుపెట్టుట.

## (జి ఓ నెం 520, ఎల్. ఎ., తేదీ 24-3-1951)

కార్యనిర్వాహకాధి (ఎగ్జిక్యూటివు) కారియొక్క స్వాధీనములోనున్న ఏ దస్తావేజునైన హాజరుపెట్టునట్లు పంచాయతీకోరిన ప్రతి సందర్భములో సదరు అధికారి అట్లుచేయవలెను అయితే వెంటనే అట్లుచేయుటవలన, పంచాయతీ లేక జనసామాన్యముయొక్క క్షేమమునకు భంగకరముగ నుండునని ఆయన అభిప్రాయబడు సందర్భములో ఆ విధముగా ఆయన ఒక లిఖితపూర్వకమైన ఒక రూఢి వచనమున చెప్పవలెను మరియు పంచాయతీ కోరునెడల రీజనల్ ఇన్‌స్పెక్టరుకు లేక ఈ విషయమున ఆయనచే అధికారమీయబడిన ఉద్యోగికి ఈ విషయము తెల్పవలెను మరియు ఆయన తీర్మానము అంత్యమైనదై యుండవలెను

సె 38 (1) ప్రతి పంచాయతీయొక్కయు దాని తాలూకు యావత్తు కమిటీల యొక్కయు వ్యవహారములు ఇన్‌స్పెక్టరుయొక్క అంగీకారముతో పంచాయతిచే నిర్ణయింపబడగల విధులవలనను

అట్టి విధులకు లేదా ఈ ఆక్టుయొక్క నిబంధనలకు భిన్నముగా నుండని రెగ్యులేషనుల (నిబంధనల) వలనను పరిపాలింపబడవలెను

(2) (1) వ సబు సెక్షను ననుసరించి ఇన్‌స్పెక్టరుయొక్క అంగీకారమునకై పంపుకొనబడిన ఏ రెగ్యులేషనులనుగాని చేయ్చుటకు, వాటిని విడిచిపెట్టుటకు లేక మార్చుటకు ఆయన కధికారమును కలిగియుండవలెను

(3) (1) వ సబు సెక్షనులో చెప్పబడిన విధులు, ఎట్టి మెంబరునుగాని, ప్రెసిడెంటునుగాని లేక ఒక కమిటీ తాలూకు ఎట్టి మెంబరునుగాని చేర్మనునుగాని జనసామాన్యమునకు అది సాధారణముగా వర్తించుట గాకుండ తనకు తానే లేదా ఏదో ఒక యితర మనిషి ద్వారా తనకు ప్రత్యక్షముగా లేదా పరోక్షముగా డబ్బు సంబంధమైన బాధ్యత వుండు ఏ విషయమునగాని ఓటు నివ్వకుండ లేదా దానిని గురించిన చర్చలో పాల్గొనకుండా లేదా అట్టి ఏ విషయముగాని చర్చించబడునప్పుడు పంచాయతీయొక్క లేదా కమిటీయొక్క ఎట్టి మీటింగులోగాని హాజరుకాకుండా లేదా అధ్యక్షత వహించకుండా ఆటంకపెట్టునట్లు ఏర్పాటు చేయవచ్చును

సంపాదకుని సూచన

ఈ యాక్టు పంచాయతి తనయొక్క సభ్యులనుండి కమిటీలను (సంఘములను) నిర్మాణము చేయుటకు పంచాయతీకి నిర్దిష్టముగా అధికారము నీయలేదు కాని అట్టి కమిటీలను నిర్మించవలసినదిగా భావింపబడుచున్నది—112 (2) (IV) వ సెక్షను చూడుము ఆ విధులు ఈ సెక్షను క్రింద యిక్కడ అమర్చుట యుక్తమని, ఈ క్రింద సూచించబడినవి

## పంచాయతీలచే కమిటీల నిర్మాణము గురించి విధులు

(జి ఓ నెం 520 ఎల్ ఎ తేదీ 24-3-1951)

1 (1) పంచాయతీ దత్తతచేసే (ఒప్పగించే) అధికారములను వహించుటకును విధులను నిర్వహించుటకును, లేక పనులను నెరవేర్చుటకును, పంచాయతీ కమిటీలను నియమించవచ్చును.

(2) పంచాయతీ సూచించిన ఏ విషయములపైన విచారించుటకు, వాటి గురించి సలహాగాని, నివేదికగాని యిచ్చుటకుకూడ పంచాయతీ కమిటీలను నిర్మించవచ్చును.

2 ఒక పంచాయతీ తన సభ్యులలో సగముకంటె నెక్కువ మందిచే బలపరుపబడిన తీర్మానముచేత, 1 వ విధిక్రింద నియమింపబడిన యే కమిటీలోనైన పంచాయతీలో సభ్యులు కానివారిని, తన అభిప్రాయములో అట్టివారు ఆ కమిటీలలో నుండదగిన ముఖ్య యోగ్యతలు కలవారని, లేక వారికి అట్టి కమిటీలో పనిచేయుటకు ప్రత్యేక అభిలాష వున్నదని తోచినయెడల, సభ్యులుగా చేర్చవచ్చును కాని అట్టి సభ్యులసంఖ్య కమిటీసభ్యుల మొత్తం సంఖ్యలో మూడవవంతుకంటె నెక్కువ వుండరాదు

3 ఆక్టులోని విధులు పంచాయతీ సభ్యులయొక్క అధికారములు, విధులు, బాధ్యతలు, అనర్హతలు, నిర్బంధములు మున్నగువాటి విషయమై యెట్లు వర్తించునో, అట్లే వీలయినంతవరకు పంచాయతీ సభ్యులుకాని ఆ కమిటీసభ్యులకుకూడ వర్తించును

4 ఒకటవ విధి క్రింద నిర్మింపబడిన ప్రతి కమిటీలోను, పంచాయతీ అధ్యక్షుడు, తనయొక్క పదవి హోదావల్ల సభ్యుడుగాను, అధ్యక్షుడుగు (చైరుమనుగా) వుండును

## విధులు

## పంచాయతీలయొక్కయు, పంచాయతీ కమిటీలయొక్కయు వ్యవహారములు

(జి ఓ నెం 520 ఎల్ ఎ తేదీ 24-3-1951)

### 1 పంచాయతీల వ్యవహారములు

1 ప్రతి పంచాయతీ ఒక ఆఫీసును ఏర్పాటు చేసుకొనవలెను మరియు అది ఏర్పాటుచేయగల దినమందును కాలమందును, ప్రతినెల కనీసము ఒక సారియైనను మరియు ఇతర సమయములందు అధ్యక్షుడు సభ సమావేశము కావలెనని కోరినప్పుడెల్లను వ్యవహారములను సాగించుటకు సమావేశము కావలెను

2 పంచాయతీ సెలవు దినముగా భావించు ఏ దినమందైనను ఏ సమావేశమునుగాని జరుపకూడదు

3 (1) సభ ఏ దినమందు ఏ కాలమందు జరుగుననియు దానిలో జరుగబోవు వ్యవహారమును గురించియు నోటీసును సభ

జరుగుటకు కనీసము 3 పూర్తిదినముల పూర్వము ఇయ్యబడిన నేతప్ప ఎట్టి సభనుగాని జరుపగూడదు

(2) అవసర సందర్భములలో ప్రెసిడెంటు, (1) వ ఉపవిధిలో నిర్దేశింపబడిన నోటీసుకంటె తక్కువ నోటీసును ఇచ్చి ఒక సభను సమావేశ పరుచవచ్చును

4 (1) పంచాయతీలో అప్పుడున్న సభ్యుల సంఖ్యలో మూడవ భాగము కంటె తక్కువకానివారు వ్రాతమూలకముగా కోరిన మీదట ప్రెసిడెంటు పంచాయతీయొక్కసభను సమావేశ పరుచవలెను అయితే అట్లుకోరుటలో (పంచాయతీ సెలవుదినముగా పరిగణించు ఒకదినము కానట్టి) దినమును, సభ ఎప్పుడు, ఏ కార్యము కొరకు సమావేశము జరుపబడునది నిర్దేశించవలెను, అట్లు కోరు ఒక లేఖ ప్రెసిడెంటుకు, కార్యనిర్వాహక ఉద్యోగికి లేక ఆకాలమందు ఆఫీసును తన స్వాధీనమందు కలిగిన ఇతరమనిషికి పంచాయతీ ఆఫీసులో ఆఫీసు పనిచేయు గంటలందు, సభకూడు దినమునకు కనీసము పది పూర్తిదినములకు పూర్వము అందజేయబడవలెను

(2) సభ సమావేశమునుకోరు లేఖ అందజేయబడినప్పటి నుండి నలువది ఎనిమిది గంటలలోపల ప్రెసిడెంటు అందులో నిర్దేశింపబడిన దినమున లేక అటుతర్వాత మూడుదినముల లోపల సభను సమావేశపరచుటకు తప్పిపోయిన పక్షమున, సభ సమావేశ పరుచకోరు లేఖలో సంతకముచేసిన మెంబర్లు, 3 వ విధి (1) వ ఉపవిధిలో ఏర్పాటుచేయబడిన నోటీసును పంచాయతీయొక్క ఇతర మెంబర్లకు ఇచ్చినమీదట సభను సమావేశ పరుచవచ్చును

(3) (1) వ ఉపవిధి లేక (2) వ ఉపవిధి క్రింది ఎట్టిసభను గాని, పంచాయతీ అఫీసువుండు స్థలము కానట్టి ఏ ఇతర స్థలములో సమావేశ పరుచకూడదు

5 పంచాయతీయొక్క అన్నిసభలకు ప్రజానీకము హాజరగు టకు వీలుగా నుండవలెను అయితే అధ్యక్షతవహించు మెంబరు, ఏ సందర్భములో నైన సామాన్యముగా ప్రజానీకమును లేక నిర్దిష్టమైన ఏ మనిషినైనను సభనుండి వెడలిపోవలెనని ఆజ్ఞాపించవచ్చును,

6 పంచాయతీ సమక్షమున ఏ సభలోనైన రాగల అన్ని విషయములు, సభకు హాజరై ఓటుచేయు సభ్యులలో అత్యధిక సంఖ్యాకులచే తీర్మానింపబడవలెను ఓట్లు సమముగా వచ్చినపుడు అధ్యక్షతవహించు సభ్యుడు రెండవ లేక కాస్టింగు ఓటును కలిగి యుండి దానిని వినియోగించ వలెను ఏకగ్రీవముగా సాదరు చేయబడని తీర్మానము విషయమున దానికి అనుకూలముగను వ్యతిరేకముగను ఓటు చేసిన వారిపేర్లు రికార్డు చేయబడవలెను

7 పంచాయతీలో అప్పుడుండు సభ్యుల సంఖ్యలో కనీసము మూడవవంతు హాజరుగానుండిననే తప్ప యే పంచాయతీ సభలో గాని ఎట్టి వ్యవహారమునుగాని జరుపకూడదు

8 ఒక సభకై నియమింపబడిన కాలము తర్వాత అర్ధగంట లోపల కోరము (సభ జరుగుటకు వలసిన సభ్యుల కనీసపుసంఖ్య) లేని పక్షమున, హాజరైన మెంబర్లందరు ఇంకను కొంతసేపు వేచి యుండుటకు అంగీకరించినచేతప్ప, సభవాయిదా వేయబడవలెను.

9 ఒక పంచాయతీయొక్క ఎట్టి తీర్మానముకాని, అది సాదరుచేయబడినతర్వాత మూడు నెలలలోపల ఆ విషయమై ప్రత్యేకముగా సమావేశ పరుపబడిన ఒక సభలోను, నిర్ణయింపబడిన సభ్యుల సంఖ్యలో సగముకంటె తక్కువకానివారిచే బలపరుపబడిన పంచాయతీయొక్క తీర్మానమువలన తప్ప సవరింపబడకూడదు లేక రద్దుచేయబడ కూడదు

10 ఒకపంచాయతీయొక్క వ్యవహారములు ఇంగ్లీషుభాషలో గాని, గ్రామముయొక్క ప్రధానభాషలోగాని జరుగవచ్చును అయితే ఇంగ్లీషుభాష రాజ్యములోపల, ప్రభుత్వకార్యములకొరకు ఉపయోగింప బడునంతవరకు మాత్రము ఈ కార్యము నిమిత్తము ఉపయోగింపబడవలెను ప్రతి సమావేశము నందలి వ్యవహార ముల సంగ్రహము సదరు కార్యముకొరకు ఉంచబడు ఒక పుస్తక ములో నమూదుచేయ బడవలెను దానిలో అధ్యక్షత వహించు సభ్యుడు లేక ఆయన లేనపుడు అచ్చట హాజరుగానుండు మెంబర్లలో ఎవరో ఒకరు సంతకము చేయవలెను సదరు వ్యవహారముల సంగ్ర

హము, ఈ ఆక్టు క్రింద పంచాయతీకి ఏపన్నునైన చెల్లించు ఏమనిషి యైనను, ఉచితముగా తనిఖీ చేయుటకు పంచాయతీ ఆఫీసులో, న్యాయమైన అన్ని వేళలందు వీలుగా నుండవలెను

11 (1) పంచాయతీ సభలో ఆలోచనకు వచ్చు విషయము, ప్రజానీకమునకు సామాన్యముగా వర్తించునదిగానుండుట అదనముగా అందు ఏ సభ్యునికైన, తనకుగాని, తన భాగస్తునకుగాని ప్రత్యక్షముగా లేక పరోక్షముగా ఆర్థికసంబంధమైన బాధ్యతకలదిగా యున్న పక్షమున అట్టి ఏ విషయము సందర్భములోగాని అట్టి సభ్యుడు ఓటు చేయకూడదు లేక పాల్గొనకూడదు

(2) ఒక సభ్యునికి ఆర్థిక లాభమున్నట్లు ప్రెసిడెంటు నమ్ము ఏ విషయ సందర్భముయొక్కయైన చర్చలో అట్టి సభ్యుడు ఓటు చేయుటను లేక పాల్గొనుటను ఆయన నిషేధించవచ్చును లేక చర్చజరుగునపుడు అచ్చట ఉండకూడదని అట్టి సభ్యుని ఆయన కోరవచ్చును.

(3) అట్టి సభ్యుడు ప్రెసిడెంటుయొక్క నిర్ణయమును ఆక్షేపించవచ్చును అందుమీదట ఆయన ఆ విషయమును సభలో పెట్టవలెను సభవారి తీర్పు ఆఖరైనదిగా నుండవలెను

(4) చర్చించబడు ఏ విషయములోగాని ప్రెసిడెంటుకు అట్టి ఏదైన ఆర్థిక లాభము కలిగియున్నట్లు సభలో హాజరుగానున్న ఏ సభ్యుడైనను నమ్ము పక్షమున, అట్టి చర్చ జరుగునపుడు సభలో ప్రెసిడెంటు ఉండకూడదని కోరుచు ఒక తీర్మానముచేయబడిన పక్షమున ఆయన ఉండకూడదని ఆయనను కోరవచ్చును

(5) సంబంధించిన సభ్యుడు (3) వ ఉపవిధిలో చెప్పబడిన విషయము సందర్భములో ఓటుచేయుటకు హక్కును కలిగియుండకూడదు మరియు సంబంధించిన ప్రెసిడెంటు (4) వ ఉపవిధిలో చెప్పబడిన ఉపపాదన సందర్భములో ఓటుచేయుటకు హక్కును కలిగియుండకూడదు

వివరణము — ఈ విధిలో "ప్రెసిడెంటు" అనుమాటలో పంచాయతీ సమావేశములో ఆ సందర్భమునందు అధ్యక్షత వహించు వైసు-ప్రెసిడెంటు లేక సభ్యుడు చేరును.

## II పంచాయతీయొక్క కమిటీల వ్యవహారములు

12 1, 3, 6, 7, 8, 10, 11 వ విధులు అవసరమైన మార్పులతో పంచాయతీయొక్క కమిటీ తాలూకు వ్యవహారములకు వర్తించవలెను పంచాయతీకి దాని సభ్యులకు లేక దానియొక్క ప్రెసిడెంటుకు చేయబడిన అన్ని నిర్దేశ్యములు అవసరమైనప్పుడెల్ల కమిటీ, సభ్యులు లేక దానియొక్క చేర్మెనుకు చేయబడిని నిర్దేశ్యములుగా భావింపబడవలెను

13 పంచాయతీయొక్క కమిటీ తాలూకు ప్రతి సభకు చెందిన వ్యవహారముల సంగ్రహాముయొక్క నకలొకటి సభ జరిగిన తేదీనుండి మూడు దినములలోపల కమిటీయొక్క చేర్మెను పంచాయతీ ప్రెసిడెంటుకు పంపవలెను ప్రెసిడెంటు అది అందిన తర్వాత జరుగు పంచాయతీ మొదటి సభయందు పంచాయతీ సమక్షమున దానిని ఉంచవలెను

14 పంచాయతీయొక్క ప్రతి కమిటీయును, కమిటీయొక్క వ్యవహారములను జరుపుటకును, అది ఏ కార్యముల నిమిత్తము ఏర్పాటు చేయబడినదో ఆ కార్యములను నెరవేర్చు నిమిత్తమును పంచాయతీ సిబ్బందియొక్క సేవలను వినియోగించుకోవచ్చును

## III సామాన్య విషయములు

15 కార్య నిర్వాహక అధికారి పంచాయతీయొక్క మరియు దానికిచెందిన యేవైన కమిటీలయొక్క వ్యవహారములను రికార్డులను స్వాధీనమునందు కలిగియుండవలెను మరియు ఇన్స్పెక్టరు సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువులవలన నిర్ణయించగలట్టి రుసుమును చెల్లించిన మీదట అట్టి వ్యవహారముల లేక రికార్డులయొక్క నకళ్లను జారీ చేయవచ్చును 1872 వ సం॥పు ఇండియాదేశపు సాక్ష్యము ఆక్టుయొక్క 76 వ సెక్షనులో నిబంధింపబడిన విధముగా కార్య నిర్వాహక అధికారిచే నకళ్లును సర్టిఫై చేయబడవలెను అట్లు సర్టిఫై చేయబడిన నకళ్లు, మునిసిపల్ సంస్థయొక్క వ్యవహారములు సదరు ఆక్టుయొక్క 78 వ సెక్షను (5) వ సబు సెక్షనుక్రింద ఆ సంస్థయొక్క

వ్యవహారములను ఋజువుచేయుటకు ఏవిధముగా వినియోగింపబడునో ఆవిధముగా పంచాయతీ లేక కమిటీయొక్క వ్యవహారములను లేక రికార్డులను ఋజువుచేయుటకు వినియోగింపబడవచ్చును

సెక్షను 38 క్రింద, పంచాయతి ఆఫీసు మార్పు సందర్భములో జారీచేసిన విధులు

(జి ఓ నెం 1280 ఎల్ఏ తేదీ 23-7-1957)

I (1) ఈ విధులు పంచాయతీ (ఆఫీసు నిర్మాణము) విధులు, 1957, అనబడును

(2) ఇవి 1–8–1957 తేదీనుండి అమలులోనికి వచ్చును

II (1) ప్రతి పంచాయతీ, తన ఆఫీసును పెట్టుకొనుటకు, ఒక భవనము, అద్దెకు తీసుకొనో, లేక అద్దెలేకుండా ఉచితముగానో, లేక స్వంతముగా కొనుక్కొనో, లేక కట్టించుకునో, సంపాదించుకొనవలెను సదరు భవనమున, పంచాయతీఆఫీసు నుంచవలెను

(2) ఆ భవనము (i) వీలైనంతవరకు గ్రామమధ్యమున నుండవలెను

(ii) అన్ని కులములకు జాతులకు ప్రవేశించుటకు వీలుగా నుండవలెను

III పంచాయతీ స్వంతము కాని భవనమున, పంచాయతీ ఆఫీసునుంచినయెడల, సదరు భవనమునుంచి మరియొక స్థలమునకు ఆఫీసునుమార్చ నుద్దేశించిన, పంచాయతీ సదరు విషయమై ప్రత్యేకపు తీర్మానము చేయవలెను ఆ తీర్మానము పంచాయతీకి మంజూరు కాబడిన మొత్తపు సభ్యుల సంఖ్యలో మూడు పావులకు తక్కువకాని సంఖ్యగల సభ్యుల ఆమోదముతో ప్యాసు కాబడవలెను మరియు జిల్లాపంచాయతీ ఆఫీసరు వారి శాంక్షను ఆ తీర్మానమునకు పొందవలెను

III పంచాయతీ ఆఫీసుకు ప్రెసిడెంటు, వైసుప్రెసిడెంటు, లేక వారి ఏ సభ్యుని యింటిలోగాని, లేక బంధువులవారి యింటిలోగాని, జిల్లా పంచాయతీ ఆఫీసరు ఆమోదము ముందుగా పొందిననే తప్ప ఉంచకూడదు

సె 39 (1) ఒక పంచాయతి ఇన్‌స్పెక్టరుచే అట్లుకోరబడిన పక్షమున ఇతర స్థానిక అధికారవర్గముతో ఒకటితోగాని అంతకంటె యెక్కువ వాటితోగాని కలిసి వాటికి ఉమ్మడిగా బాధ్యతగల యే కార్యము నిమిత్తముగాని ఒక జాయంట కమిటీని ఏర్పరచ వచ్చును

(2) ఒకజాయింటు కమిటీయొక్క నిర్మాణమును, అధికారములను, చర్యాక్రమమును కమిటీ విషయమున సంబంధముగల స్థానిక అధికారవర్గముల మధ్య ఏర్పడు భిన్నాభిప్రాయములను పరిష్కరించు పద్ధతియును నిర్ణయింపబడగల విధుల కనుగుణముగా నుండవలెను

## విధులు.

## జాయింటు కమిటీలయొక్క నిర్మాణము, అధికారములు, వ్యవహార క్రమము మొదలైనవి.

(జి ఓ నెం 520 ఎల్ ఎ తేదీ 24-3-1951)

1 ఒక జాయింటు కమిటీలో సంబంధించిన స్థానిక అధికార వర్గములయొక్క సభ్యులు కానట్టి మనుష్యులు చేరియుండవచ్చును అయితే వారు అట్టి కమిటీకి సేవచేయుటకు ప్రత్యేక అర్హతలను లేక ప్రత్యేక ఆసక్తి కలిగినవారై యుండవచ్చును

అయితే అట్టిమనుష్యుల సంఖ్య జాయింటు కమిటీ సభ్యుల మొత్తము సంఖ్యలో 3 వ వంతుకు మించకూడదు

2 ఒక జాయింటు కమిటీయొక్క నిర్మాణము రెగ్యులేషనుల ద్వారా జరుగవలెను 5వ, 6వ విధులలో చెప్పబడిన సందర్భములలో తప్ప సంబంధించిన స్థానిక అధికారులలో ఒక్కొక్కరిచే అంగీకరింపబడిననే తప్ప ఈ రెగ్యులేషనులు అమలును కలిగియుండ కూడదు.

3 ఈ రెగ్యులేషనులు —

(a) జాయింటు కమిటీ సభ్యులయొక్క మొత్తము సంఖ్యను.

(b) సంబంధించిన స్థానిక అధికారవర్గముల యొక్క సభ్యుల సంఖ్యను, సభ్యులుకాని మనుష్యుల సంఖ్యయు,

(c) జాయింటుకమిటీయొక్క సభ్యులుగా నుండు మనుష్యులను, లేక వారు ఎన్నుకొనబడు లేక నియమింపబడువిధమును

(d) జాయింటు కమిటీయొక్క చైరుమనుగానుండు మనిషిని లేక ఆయన ఎన్నుకొనబడు లేక నియమింపబడు విధమును,

(e) సభ్యులయొక్కయు, చైర్మెనుయొక్కయు ఉద్యోగ కాల పరిమితిని,

(f) సంబంధించిన స్థానిక అధికారవర్గములలో ఒకటి లేక అంతకంటె ఎక్కువ వాటిచే చెలాయించబడగలవై జాయింటు కమిటీచే చెలాయించబడగల అధికారములను, మరియు

(g) జాయింటు కమిటీయొక్క వ్యవహార క్రమమును నిర్ణయించవలెను

4 2 వ, 3 వ విధులక్రింద చేయబడిన రెగ్యులేషన్లను మార్చవచ్చును లేక రద్దుచేయబడవచ్చును అయితే సంబంధించిన అన్ని స్థానిక అధికారవర్గములు అట్టి మార్పుకు లేక రద్దుకు సమ్మతించవలెను

5 39 వ సెక్షనుయొక్క (1) వ సబు-సెక్షనుక్రింద ఇన్స్పెక్టరు చర్యతీసుకొను పక్షమున 2 వ, 3 వ విధులలో చెప్పబడిన అన్ని లేక యేవైన విషయముల సందర్భములో ఆయన అవసరమని లేక వాంఛనీయమని తలంచు ఆజ్ఞలను, ఆయన జారీచేయవచ్చును.

6 పైన చెప్పిన విధులలో దేనిక్రింద నయిన స్థానికఅధికార వర్గముల మధ్య అభిప్రాయభేదము కలిగినయెడల దానిని ఇన్స్పెక్టరుకు తెలుపవలెను ఆయనతీర్పు ఆఖరైనదిగా యుండవలెను

7 39 వ సెక్షను (1) వ సబు-సెక్షను క్రింద లేక పైన చెప్పిన విధులలో దేనిక్రింద అయినను, ఇన్స్పెక్టరుయొక్క అధికారములు, సంబంధించిన స్థానిక అధికారవర్గములలో నొకటి కంటె నెక్కువ అధికారవర్గము లేక ఒక పెద్ద ఓడరేవుయొక్క ఓడరేవు అధికారవర్గముగానున్న విషయములో రాజ్యప్రభుత్వము ద్వారా

కేంద్రప్రభుత్వమునుండి అంగీకారమును పొంది మాత్రము చెల్లించబడవలెను

సంపాదకుని సూచిక

ఈ సందర్భములో యాక్టుయొక్క 52వ సెక్షనును, దానిక్రింద చేయబడిన విధులను చూచిన అనుగుణ్యముగా నుండును

సె 40 (1) ప్రతి పంచాయితీయును ప్రతి సంవత్సరము దాని పరిపాలనను గురించిన ఒక నివేదికను ఆసంవత్సరము అంతమైన తర్వాత సాధ్యమైనంత త్వరగాను నిర్ణయింపబడిన తేదీ దాటకుండ నిర్ణయింపబడగలట్టి నమూనాలోను, వివరములతోను అధికార వర్గముద్వారాను ఇన్స్పెక్టరుకు పంపుకొనవలెను

(2) కార్యనిర్వాహక అధికారి ఆ నివేదికను తయారు చేయవలెను పంచాయతి దానిని ఆలోచించి అందును గురించి దాని తీర్మానములు, ఏవైన నున్న యెడల వాటితోకూడ దానిని ఇన్స్పెక్టరుకు పంపవలెను

(3) ఆ సంవత్సరములో రాజ్యములోని పంచాయతీల పరిపాలనను గురించిన ఒక సామాన్య నివేదికను ఇన్స్పెక్టరు గవర్నమెంటువారికి పంపుకొనవలెను

## 40 వ సెక్షనుక్రింద విధులు,

పంచాయతిలయొక్క పరిపాలనా నివేదికను తయారుచేయుటకై ప్రశ్నావళిని నిర్ణయించు విధులు

(జి ఓ నెం 677, ఎల్ ఎ తేదీ 2-4-1952)

(జి ఓ నెం, 2493, ఎల్ ఎ తేదీ 16-12-1952)

## విధులు

పరిపాలనా నివేదికలను తయారుచేయుటయు, పంపుటయు,

1 ప్రతి పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి ప్రతి సంవత్సరాంతమున పంచాయతీయొక్క పరిపాలనానివేదికను రెండు భాగములలో తయారుచేయవలెను అవేవనగా —(1) ఈ విధులకు అనుబంధముగా చేర్చబడిన ప్రశ్నావళిలో సూచించబడిన వివరము

లను కలిగిన నివేదిక (11) ప్రభుత్వమువారు అప్పుడప్పుడు తెలుపగల నమూనాలో సంవత్సర వారీ లెక్కలు

2 పంచాయతీ పరిపాలనా నివేదికయొక్క రెండు ప్రతులను, రీజినల్ ఇన్‌స్పెక్టరు, జిల్లా పంచాయతీ ఉద్యోగిద్వారా ఇన్‌స్పెక్టరుకు నివేదిక ఏ సంవత్సరమునకు చెందినదో దానికి తర్వాత వచ్చు సంవత్సరముయొక్క మే 1 వ తేదీకంటె ఆలస్యముకాకుండ పంపవలెను

జిల్లా పంచాయతీ ఉద్యోగి లెక్కలన్నిటిని సమీకరించి పరిపాలనా నివేదికయొక్క నకలుతో సహా అతని విస్తీర్ణమునకైన సమీకరింపబడిన నివేదికను, సదరు సంవత్సరము మే 15 వ తేదీకంటె ఆలస్యముకాకుండ రీజినల్ ఇన్‌స్పెక్టరుకు పంపవలెను

జిల్లా పంచాయతీ ఉద్యోగులు పంపిన లెక్కలను రీజినలు ఇన్‌స్పెక్టరు సమీకరించి అతని రేంజికి ఒకటిగా చేర్చబడిన నివేదికను, సదరు సంవత్సరము జూలై 15 వ తేదీకంటె ఆలస్యముకాకుండ ఇన్‌స్పెక్టరుకు పంపవలెను

రీజినలు ఇన్‌స్పెక్టర్లవద్దనుండి సమీకరింపబడిన నివేదికలు అందిన తర్వాత సాధ్యమైనంత త్వరలో ఇన్‌స్పెక్టరు రాజ్యములోని అన్ని పంచాయతీలకు ఒక సామాన్య నివేదికను ప్రభుత్వమువారికి పంపవలెను

## అనుబంధము

### పంచాయతీయొక్క పరిపాలనా నివేదిక

తాలూకా జిల్లా 196-196 వ

సం॥కు

### నిర్మాణము, నిర్వహణము

1 (a) పంచాయతీని నిర్మాణముచేసిన ఉత్తరువుయొక్క సంఖ్యయు, తేదీయు ఏది ?

(b) ఈ సంవత్సరమందు విచారణాధికారములో ఏమార్పుగాని చేయబడెనా ? ఉత్తరువుయొక్క సంఖ్యను తేదీని తెల్పుడు.

(c) పంచాయతీ 1 వ తరగతి పంచాయతీయా లేక 2 వ తరగతి పంచాయతీయా ? లభ్యముగానుండు ఇటీవల జనాభా లెక్క ప్రకారము దాని జనసంఖ్య ఏమి ?

2 (a) పంచాయతీలో అనుమతించబడిన మొత్తము సభ్యుల సంఖ్య ఏమి ?

(b) ఈ సంవత్సరములో సభ్యుల సంఖ్యలో ఏ మార్పయినను జరిగెనా ?

(c) ఈ సంవత్సరములో వార్డులను మార్చుటకు ఎట్టి ఉత్తరువుగాని చేయబడెనా ?

(d) షెడ్యూల్డు దాఖలా కులములకొరకు స్థానములేవైన ప్రత్యేకించబడినచో వాటి సంఖ్యను తెల్పుడు ఈ సంవత్సరమందు ఆ సంఖ్య మార్చబడెనా ?

(e) ఏదైనా సాధారణ లేక ఆకస్మికమైన సభ్యుల ఎన్నికలు ఈ సంవత్సరములో జరిగెనా ? ఏదైన ఎన్నిక వివాదమేర్పడెనా?

(f) ఏదైన ఆకస్మిక లేక సాధారణ ఖాళీలను భర్తీచేయుటలో ఎట్టి ఆలస్యముగాని జరిగెనా ? అట్లు జరిగిన పక్షమున దానికి కారణములేమి ?

3 అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, సభ్యులు—

(a) ఈ సంవత్సరములో అధ్యక్షుని లేక ఉపాధ్యక్షుని ఎన్నిక ఏదైన జరిగినదా ? ఏ ఎన్నిక వివాదముగాని ఏర్పడినదా ?

(b) ఈ సంవత్సరములో అధ్యక్షుడు లేక ఉపాధ్యక్షుడు పదవినుండి తొలగింపబడెనా ?

(c) ఉపాధ్యక్షుడు, అధ్యక్షుని ఉద్యోగములో నుండెనా లేక తాత్కాలికముగా ఏ అధ్యక్షుడుగాని నియమింపబడెనా, అట్లయినయెడల ఏ కాలపరిమితివరకు ?

(d) ఈ సంవత్సరములో ఉద్యోగమునుండి ఏ సభ్యుడైన తొలగింపబడెనా ?

4 సమావేశములు—

(a) పంచాయతీల వ్యవహారములకు సంబంధించిన విధుల లోని 3 (1) 3 (2) మరియు 4 (1) వ విధులక్రింద ఈ సంవత్సర

ములో ఏ సమావేశమైనను జరుపబడెనా ? అట్టి సమావేశములో ఎన్ని సాధారణమైనవి, జరూరైనవి, ప్రత్యేకమైనవి ?

(b) సభ జరుగుటకుండవలసిన సభ్యులు లేనందువలన ఎన్ని సమావేశములు వాయిదా వేయబడినవి ?

5 ఈ సంవత్సరములో ఏ కమిటీ (సంఘము) గాని ఏర్పాటు చేయబడినదా ? అట్లయితే ఏ కారణము కొరకు ?

6 నిర్వహణము—

(a) పంచాయతీ ఆఫీసు ఎచ్చట నెలకొల్పబడియున్నది ? భవనము స్వంతమా లేక అద్దెకు తీసికొన్నదా ? అద్దెకు తీసికొన్న యెడల చెల్లించు మొత్తమేమి ? అది అన్ని కులములవారికి అందుబాటులో నున్నదా ?

(b) నిర్ణయించబడిన రిజిష్టర్లు, నమూనాలో వ్రాయబడుచున్నవా ?

(c) పూర్తికాలము పనిచేయు కార్య నిర్వాహకోద్యోగి నియమింపబడుటకు పంచాయతీ ప్రకటించబడినదా ? ప్రకటన జారీ చేయబడిన ఉత్తరువుయొక్క సంఖ్య, తేదీ ఏమి ? పంచాయతీలో సంవత్సరమునందంతటను, ఒక కార్యనిర్వాహకోద్యోగి ఉండెనా ? అట్లులేనియెడల, కార్యనిర్వాహకోద్యోగి వాస్తవముగా పంచాయతీపై అధికారము కలిగియుండిన కాలపరిమితి లేక కాలపరిమితులను తెల్పుడు

(b) సిబ్బంది—

(i) ఎంతమంది గుమస్తాలు ఏ జీతపు స్కేలుమీద నియమింపబడియున్నారు ?

(ii) గుమాస్తాల సంఖ్య, జీతపు స్కేలు, ఇన్‌స్పెక్టరు లేక అతని ప్రతినిధియొక్క ఉత్తరువుల ప్రకారమున్నవా ?

(iii) పంచాయతీ, ఏ యితర పంచాయతీతోనైన చేరి ఉమ్మడిగా ఇంజనీరింగు లేక ఇతర సిబ్బందిని నియమించియున్నదా? అట్లయితే, పంచాయతీ కయ్యేదాని ఖర్చుయొక్క దామాషాను

గురించిన సమాచారముతో అట్టి సిబ్బందియొక్క వివరములను తెలుపుడు

## II రాకపోకలు

(1) (a) ఈ సంవత్సరములో ఏ రోడ్లయినను క్రొత్తగా నిర్మింపబడినవా లేక వంతెనలు, తూములు నిర్మింపబడినవా ? వాటికైన ఖర్చు ఎంత ?

వాటికి ఎట్లు ధనము సంపాదించబడినది ?

(b) పంచాయతీ పోషించురోడ్లు, వీధుల మొత్తము పొడవెంత ?

(c) సంవత్సర ప్రారంభమునందు తీర్మానము చేయబడక నిలిచియుండు ఆక్రమణల సంఖ్య ఏమి ?

(d) ఈ సంవత్సరములో కనుగొనబడిన ఆక్రమణల సంఖ్య ఏమి ?

(e) ఈ సంవత్సరములో పరిష్కరించబడిన ఆక్రమణల సంఖ్య ఏమి ?

(f) సంవత్సరాంతమున తీర్మానముకాక నిలిచియుండు ఆక్రమణ సంఖ్య ఏమి ?

(g) రోడ్ల సాధారణ పరిస్థితి ఏమి ?

(h) ఏదైన పబ్లికు రోడ్డు, మురుగు కాల్వ, కాలువ, డ్రేయినేజి వర్కు, టన్నెలు లేక తూము ఈ యాక్టుయొక్క అమలునుండి మినహాయించబడినదా ?

(2) గ్రామములో ఏదైన కాలువలుగాని, ఫెర్రీలుగాని ఉన్నవా? వాటి పోషణ పంచాయతీకి అప్పజెప్పబడినదా ? ఈ ఆధారమునుండి వచ్చు ఆదాయమేమి ?

(3) రోడ్ల కిరువైపులనుండి చెట్ల ఫలసాయమునుండి లభించు ఆదాయమును వసూలుచేయుటకైన అధికారము గుత్తకియ్యబడినదా ? జమాఖర్చులేమి ?

## III దీపములు

(1) గ్రామములో విద్యుచ్ఛక్తి ప్రవేశ పెట్టబడినదా ?

(2) పంచాయతీ పోషించు ఎలక్ట్రిక్ దీపములు, కిరసనాయిలు దీపములు, పెట్రోమాక్సు లేక గ్యాస్ దీపములెన్ని ? మొత్తము ఖర్చు ఎంత?

(3) 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టు యొక్క 63 (3) (b) విభాగము ననుసరించి దీపములు వేయుటకైన ఖర్చును భరించుట నిమిత్తము వ్యవసాయ భూమిమీాద ఏ పన్నుగాని విధింపబడినదా ? అట్లయినయెడల దానినుండి లభించిన ఆదాయ మేమి ?

## IV విద్య

(1) గ్రామములోని పాఠశాలల సంఖ్య ఏమి ? అవి ఎవరిచే పోషింపబడుచున్నవి ? అవి చాలునా? పాఠశాలలకు హాజరగు బాల బాలికల సంఖ్య ఏమి ?

(2) (a) పంచాయతీయే ఒక పాఠశాలను నడుపుచున్నదా ? దానిలో చదువు విద్యార్థుల మొత్తము సంఖ్య ఏమి ? నియమింపబడి యుండు ఉపాధ్యాయులెందరు ? దానికి స్వంతభవనమున్నదా? దానికి అవసరమైన ఉపకరణములు ఏర్పాటు చేయబడియున్నవా ?

(b) పంచాయతీ పాఠశాలలో ఎందరు షెడ్యూలు దాఖలా కులములకు చెందిన బిడ్డలు చదువుచున్నారు ?

(c) ఈ పంచాయతీ, ఏ యితర పంచాయతీతోనైన కలసి, ఉమ్మడిగా ఒక పాఠశాలను పోషించుచున్నదా ?

(3) గ్రామములో నిర్బంధ విద్యావిధానము అమలులో నున్నదా ?

(4) పంచాయతీ గ్రంథాలయమును పోషించు చున్నదా? సేకరింపబడిన పుస్తకముల వెరశి మొత్తమేమి ? వాటి విలువ ఏమి ?

(5) గ్రామములో ఏ పఠన మందిరముగాని ఉన్నదా ? సర ఫరా చేయబడు సంచికల వివరములను తెలుపుడు

(6) గ్రామములో ఏ వయోజన పాఠశాలగాని, రాత్రి పాఠ శాలగాని ఉన్నదా ? అట్లయినయెడల ఎన్ని ఉన్నవి ? అవి ఎవరిచే జరుపబడుచున్నవి ? ఈ సంవత్సరములో ఈ పాఠశాలలలో ఎందరు

విద్యార్థులు చదువుచుండిరి ? ఈ సంవత్సరములో పంచాయతియందు చదువురాని ఏయీడు వచ్చినవ్యక్తులైనను చదువువచ్చినవారైనారా? అట్లయిన ఎంత మంది ? వయోజన విద్యకొరకు పంచాయతీ ఏ మొత్తమునైన ఖర్చుపెట్టెనా ? అట్లయిన ఎంత మొత్తము ?

## V ప్రజారోగ్యము

(1) వీధులు—

వీధులు క్రమముగ ఊడ్చబడుచున్నవా? పనికి నియమింపబడిన ఊడ్చువారి సంఖ్యయెంత ? వారికిగాను ఎంత ఖర్చగును?

(2) పాయిఖానాలు—

పల్లికు పాయిఖానా లేవైననున్నవా?
అట్లున్నచో ఎన్ని కలవు ?

(3) నీటి సరఫరా—

(a) మంచి నీటి యాధారము లేవేవి కలవు ? అవి చాలునా?

(b) వాటిని అపరిశుభ్రపరచకుండ కాపాడుటకు చర్యలు తీసికొనబడినవా ?

(c) ఫిర్యాదు చర్యలేవైన తీయబడినవా? అట్లగుచో, అవి ఎన్ని ?

(4) జలదారులు—

పంచాయతీయందు జలదారులేవైన గలవా? అవి క్రమముగ శుభ్రము జేయబడి తగురీతిగ నుంచబడుచున్నవా? జలదారులు లేని పక్షమున, మురుగును తీసివేయుట కేమేమి ఏర్పాట్లు చేయబడియున్నవి ?

(5) 1889 వ సం॥పు పట్టణ ఉపద్రవముల ఆక్టు గ్రామమునందములలోనున్నదా అట్లున్నచో, ఫిర్యాదు చర్యలు తీసుకొనబడినవెన్ని ? విధింపబడిన జరిమానాల మొత్తమెంత ?

(6) 1899 వ సం॥పు మదరాసు జననమరణముల రిజిస్ట్రేషను అట్టి గ్రామమునందములలో నున్నదా ?

(7) సంతలు, ఉత్సవములు—

(a) ప్రధానమైన సంతలు, ఉత్సవములు ఏవి ?

(b) అట్టి సంతలు, ఉత్సవములు జరుగు కాలమందు పారిశుద్ధ్యపు ఏర్పాట్లు చేయబడియున్నవా? అట్లు చేయబడినచో వాటిని చేసిన దెవరు? అందుకగు ఖర్చెంత?

(8) ఏకకాలమం దనేకులకు వచ్చురోగములు—

ఏక కాలమం దనేకులకు వచ్చురోగము లేవైన సంవత్సరములో సంభవించినవా? పంచాయతీ వారేయే నివారకచర్యలను తీసుకొనిరి?

(9) ప్రమాదకరమైనట్టియు, ఉపద్రవకరమైనట్టియు వ్యాపారములు—

(a) పంచాయతీ ఏ పారిశ్రామిక విస్తీర్ణమునైన ప్రకటించినదా?

(b) ఏ ఏ వ్యాపారములు పంచాయతీయొక్క పై అధికారముక్రింద నున్నవి?

(c) సంవత్సరమందు జారీచేయబడిన లైసెన్సు లెన్ని, వాటినుండి ముట్టిన రాబడి యెంత?

(d) పంచాయతి ఉపవిధులు (బైలాలు) వేటినైనను యేర్పరచియున్నదా?

(10) వైద్య సహాయము—

(a) గ్రామమందు ఏదైన ఆసుపత్రిగాని, డిస్పెన్సరీగాని ఉన్నదా?

(b) పంచాయతి ఏ వైద్యశాలనైనను నడుపుచున్నదా? అయినచో అందుపనికి నియమింపబడిన సిబ్బంది ఎవరు?

(c) పంచాయతీ యే యితర పంచాయతీతోనైన చేరి వుమ్మడిగ ఏదైన ఆసుపత్రి, ఔషధశాల లేక ఆరోగ్యకేంద్రమును పోషించుచున్నదా?

(11) పంచాయతీ ఖానిగే పాకీపనిని పోషించుచున్నదా? అయినచో అది స్వయంపోషకత్వము గలదేనా?

(12) 1888 వ సం॥పు జనవిహారస్థలముల ఆక్టు లేక 1918 వ సం॥పు మద్రాసు కల్తీ నివారణ ఆక్టు లేక 1920 వ సం॥పు మద్ర

రాసు జిల్లా మునిసిపాలిటీల ఆక్టుయొక్క ఏ నిబంధనలైనను లేక 1920 వ సం॥పు మదరాసు పట్టణ నిర్మాణపు ఆక్టు సదరు విస్తీర్ణమునకు వ్యాప్తి చేయబడియున్నదా ?

VI లాభకరమైన సాహస వ్యాపారములు

(1) పంచాయతీ ఈ సంవత్సరమందు క్రొత్త మార్కెట్లను, బండ్లశాలలను లేక పశువధశాలలను వేటినైనను నెలకొల్పినదా ?

(2) మార్కెట్లు—

(a) గ్రామమందెన్ని పబ్లికు మార్కెట్లు గలవు ? పంచాయతీ విక్రయశాలలను వేటినైన పోషించుచున్నదా ? లేక నిర్మించినదా ? వాటినుండి వచ్చు రాబడి యెంత ?

(b) జిల్లాబోర్డు మార్కెట్లుగ వర్గీకరింపబడిన మార్కెట్ల విషయములో జిల్లా బోర్డునుండి పంచాయతీ వంతు పైకమును పొందుచున్నదా ?

(c) అందు ఖానిగీ మార్కెట్లపైన నున్నవా ? ఉన్నచో అవి ఎన్ని ? వాటిపై విధింపబడిన లైసెన్సు రుసుము మూలమున వచ్చు రాబడి యెంత ?

(d) ఈ సం॥మునందు ఏ ప్రవేటు మార్కెట్టు అయినను మూసివేయబడినవా ? అట్లయిన యెడల వాటికి బదులుగా పబ్లికు మార్కెట్టు స్థాపింపబడినవా ?

(3) బండ్ల శాలలు—

పంచాయతీ బండ్లశాల దేనినైన పోషించుచున్నదా ? రుసుము వసూలుచేయు పద్ధతి ఏది ? వాటినుండివచ్చు రాబడియెంత ? సిబ్బందికగు ఖర్చెంత ?

(4) పశువధశాలలు—

పంచాయతీచే పోషింపబడు పశువధశాలలసంఖ్యను వాటినుండి వచ్చు నికరపు రాబడిని తెల్పుడు

(5) సత్రములు, ధర్మశాలలు—

సత్రములు, ధర్మశాలలు ఏవైనను పంచాయతీయొక్క పై అధికారము క్రిందనున్నవా ? అట్లున్నచో వాటినుండివచ్చు రాబడి ఎంత ? వాటి నిమిత్తమగు ఖర్చెంత ?

(6) కుటీర పరిశ్రమలు — కుటీరపరిశ్రమల యభివృద్ధికై పంచాయతీలే చర్యలేవైన తీసుకొనబడినయెడల వాటిని వివరింపుడు

(7) పంచాయతీయొక్క పై అధికారము క్రిందనున్న కాపాడబడని అడవికి శిస్తు చెల్లింపబడుచున్నదా? అట్లయినచో రాబట్టుకొనబడిన మొత్తమును రాబడిని మరియు అగు ఖర్చును తెల్పుడు

(8) ఎరువు తయారుచేయుబడుచున్నదా? అట్లయినచో దాని మూలమున వచ్చు రాబడిని తెల్పుడు

(9) సంవత్సరమందు ఎన్నిచెట్లు నాటబడినవి

(10) (i) ప్రజావినోద (పబ్లిక్) పార్కులు తోటలు ఏవయిన వున్నయెడల, వాటిసంఖ్య, పేర్లు

(ii) వాటియొక్క పోషణకొరకు అయిన వ్యయము సిబ్బందికి, యితర అంశములకు వేరుగా

(iii) వాటినుండి ఏదయిన రాబడి వచ్చినయెడల, ఎంత? మరియు దానికగుఖర్చు ఏ నిధినుండి భరింపబడుచున్నది

(iv) క్రొత్త పార్కులనుగాని, తోటలనుగాని ఏదయిన స్థాపించుటకు ఉద్దేశమున్నదా?

## VII సాధారణ ఆదాయములు

(1) పన్నులు —

(a) ఇంటిపన్ను, వృత్తిపన్ను, బండిపన్ను ఏ రేట్లు చొప్పున విధింపబడుచున్నవో ఆ రేట్లను, ప్రతిశీర్షికక్రింద సంవత్సరమందు వసూలుచేయబడిన మొత్తమును తెల్పుడు.

(b) పన్నును రాబట్టుటకుగాను జారీ చేయబడిన నిర్బంధయుత ఆజ్ఞాపత్రికల సంఖ్యను తెల్పుడు

(c) ఏ పన్ను లేక రుసుముయొక్కయైన వసూలు గ్రామాధికారికి అప్పగింపబడినదా?

(2) నానావిధములైన రాబడులు —

(a) గ్రామములో విధింపబడి 1920 వ సం॥పు మదరాసు జిల్లాబోర్డుల ఆక్టుయొక్క 92వ విభాగము ననుసరించి పంచాయతీకి రావలసియున్నట్టి భూమిశిస్తులో పంచాయతీయొక్క వాటా,

(b) 1950 వ సం॥పు మదరాసు గ్రామపంచాయతీల ఆక్టుయొక్క 63 (3) (a) విభాగము ననుసరించి భూమిశిస్తు ఏదైన విధింపబడియున్నచో అది

(c) 63 (3) (b) విభాగము ననుసరించి వ్యవసాయ భూమిపై పన్నేదైనను విధింపబడి యున్నచో అది

(d) 1950 వ సం॥పు మదరాసు గ్రామపంచాయతీల ఆక్టుయొక్క 63 (3) (c) విభాగము ననుసరించి వ్యాపారమున కనువగు ఫలసాయములమీాద రుసుమేదైన విధింపబడియున్నచో అది

(e) ఆస్తియొక్క పరివర్తనలపై సుంకము నుండి రాబడి

(f) మత్స్యాలయముల వలన రాబడి

(g) ప్రజాసంబంధమైన పోరంబోకుల మూలమున రాబడి

(h) ధర్మాదాయములు మరియు ట్రస్టులనుండి రాబడి

(i) 1950 వ సం॥పు మదరాసు గ్రామపంచాయతీల ఆక్టుయొక్క 71 వ విభాగముక్రింద ప్రభుత్వమువారి గ్రాంట్లు

(j) ప్రభుత్వమువారిచే దాక్షిణ్యముతో చెల్లింపబడిన గ్రాంట్లు

(k) ఏదైన ఇతర రాబడి

3 (a) జిల్లాబోర్డుచే ఏదైన వంతు పైకము చెల్లింపబడి యున్నచో ఆ మొత్తము అది ఏ ఏ కారణములపై చెల్లింపబడియున్నది.

(b) ప్రత్యేకవ్యక్తులచే ఏదైన వంతుపైకము చెల్లింపబడియున్నచో ఆ మొత్తము ఏ కారణము నిమిత్తమై చెల్లింపబడియున్నది

(4) 1933 వ సం॥పు మదరాసు వ్యాపారమున కనువగు ఫలసాయములు మార్కెట్ల ఆక్టుయొక్క 11 (3) వ విభాగము ననుసరించి ఒక మార్కెటుకమిటీచే ఏదైన చెల్లింపు చేయబడియున్నచో అది.

## VIII ఆర్థికస్థితి

( ) (a) పంచాయితీ ఫండు సేవింగుబ్యాంకులో నుంచ బడినదా లేక నితరముగ అంగీకరింపబడినరీతిని ఇతరవిధముగా ఉంచబడినదా ?

(b) పంచాయతీ ఫండు తాలూాకు పెట్టుబడి ఏదైన నున్నచో దాని వివరములు తెల్పుడు అట్టి పెట్టుబడిని బలపరచు అధికారముగ పేర్కొనుడు

(2) పంచాయతీ లెక్కలు లోగడ కడపటగ ఎప్పుడు తనిఖీ చేయబడినవి ? సదరు లెక్కల తనిఖీయొక్క ఫలితమేమి ?

(3) ప్రారంభపు మరియు ముగింపు రొక్కపు నిల్వతో పాటు సంవత్సరమందలి జమాఖర్చుల సంక్షిప్త సంగ్రహమును తెల్పుడు (లెక్కల తనిఖీ ఇదివరకే పూర్తియైనచో రిపోర్టు పంప బడు సంవత్సరము తాలూకులెక్కల తనిఖీలో తెలుపబడిన పద్దులను మొత్తములను ఇక్కడ నమూదు చేయవలెను )

## IX నానావిధములైనవి

(1) సివిలు మరియు క్రిమినలు విచారణాధికారములు —

(a) ఈ సంవత్సరమందు పరిష్కరింపబడిన సివిలు సంబంధమైన వ్యాజ్యముల సంఖ్య లెన్ని ?

(b) పంచాయతీ క్రిమినలు సంబంధమైన విచారణాధి కారమును పొందియున్నదా ? అట్లయినచో ఈ సంవత్సరమందు క్రిమినలు సంబంధమైన వ్యాజ్యములు సంఖ్య ఎన్ని విచారణ చేయబడినవి

(c) 1888 వ సం॥పు మదరాసు గ్రామకోర్టుల ఆక్టులో నిర్బంధింపబడిన ఏదైన సివిల్ లేక క్రిమినల్ విచారణాధికారము పంచా యతీకి యీ సంవత్సరమందు ఈయబడినదా ?

(2) (కార్య నిర్వాహకోద్యోగులు గల పంచాయతీల విష యములో) రిజిస్ట్రేషను పని—

(a) కార్యనిర్వాహకోద్యోగి రిజిస్ట్రేషను పనిని జేయ బూనుటకు క్రమముగా అధికారమియ్యబడిన మనిషియేనా ?

(b) సంవత్సరమందు రిజిష్టరుచేయబడిన వాటియందు స్టాంపు సుంకిమునుండియు రిజిస్ట్రేషను రుసుమునుండియు మినహాయింపబడిన దస్తావేజు లెన్నియో తెల్పుము

(c) సంవత్సరమందు రిజిష్టరుచేయబడిన దస్తావేజులలో అశాశ్వత స్వభావముగల వెన్నియో తెల్పుడు సంవత్సరమందు రాబట్టిబడి ప్రభుత్వమునకు జమకట్టబడిన రిజిస్ట్రేషను రుసుముయొక్క మొత్తమెంత ?

(3) సంవత్సరమందు కాపాడబడని ఏదైన అడవి పంచాయతీయొక్క పై అధికారిమునుండి తీసివేయబడినదా ?

(4) సంస్థలు లేక నిర్మాణములు ఏవైనను పంచాయతీ యాజమాన్యమునకు బదిలీ చేయబడినవా ?

(5) పంచాయతీయొక్క నిర్వాహణముక్రింద లేక తనిఖీ క్రింద ఏవైన దానసంబంధమైన ధర్మాదాయములు లేక ఇనాములుగలవా?

(6) సంవత్సరమందు విరాళమేదైనను స్వీకరింపబడెనా ? అట్లయినచో వివరములు వ్రాయుడు

(7) పంచాయతీయొక్క నిర్వాహణము క్రింద ట్రస్టు లేవైనగలవా ?

(8) ఏ గ్రామ నీటిపారుదల నిర్మాణముయొక్క యైన సంరక్షణ మరియు పోషణ, నీటిపారుదల వంతులు (టరనుల) నిర్వహణ లేక పారుదలకైన నీటిని పంపకముచేయుటను క్రమపరచుట పంచాయతీకి ఇవ్వబడినదా ?

(9) సంవత్సరమందు పోరంబోకు, పచ్చికభూమి, నూర్పుడు కళ్ళము, దహన మరియు ఖననభూమి, గొడ్లశాల, బండ్లశాల, తోపు ఏదైన కలెక్టరుచే చట్టముయొక్క అమలునుండి మినహాయింపబడినదా ?

## X సాధారణ పరిపాలన

(1) సంవత్సరమందు పంచాయతీ సూపర్సీడుచేయబడియున్నదా లేక డిసాల్వుచేయబడి యున్నదా ? అయినచో కాలపరిమితిని వ్రాయుడు.

(2) క్రమముగా 1950 వ సం॥పు గ్రామ పంచాయతీల ఆక్టుయొక్క 31 వ విభాగముక్రింద లేక 44వ విభాగముక్రింద అత్యావసర అధికారములను చెలాయించుటకు కార్యనిర్వాహకోద్యోగికి గాని కలెక్టరుకుగాని ఇన్‌స్పెక్టరుకుగాని ఎట్టిఅవకాశమైననువర్పడెనా?

(3) సంవత్సరమందేదైన తీర్మానము, లైసెన్సులేక అనుమతి రద్దుచేయబడినదా?

(4) కర్తవ్యములను నిర్వహించు పంచాయతీ అధ్యక్షుడు లేక కార్యనిర్వాహకోద్యోగి వాటిని నిర్వహించుటకు తప్పిపోయిన విషయమున ఇన్‌స్పెక్టరు లేక అధికారముగల ఇతరవ్యక్తి ఆజ్ఞాపించు సందర్భమేదైన ఏర్పడినదా?

(5) గుడి మరమ్మత్తు ఏదైన నిర్వర్తింపబడినదా?

(6) తూకపురాళ్ళు మరియు కొలతపాత్రలు సరిచూడబడినవా?

(7) ఉపవిధులేవైన చేయబడినవా? అట్లయినచో వాటి స్వభావమెట్టిది

(8) సాధారణ షరా లేవైననున్నచో అవి

## వ్యవహారము చెల్లతగియుండుట

సె 41 పంచాయతియొక్క లేదా దాని తాలూకు ఒకకమిటీయొక్క లేదా అట్టి పంచాయతీ లేదా కమిటీయొక్క ప్రెసిడెంటుగా, వైసుప్రెసిడెంటుగా, చైర్మనుగా లేదా మెంబరుగా పనిచేయుచున్న ఏ మనిషియొక్కయైన ఏ చర్యగాని, అట్టి పంచాయతి లేదా కమిటీయొక్క నిర్మాణములో ఒక లోపము కలదను కారణమునుబట్టి మాత్రము లేదా అనర్హత కారణమువలనగాని లేదా అతని యెన్నికలో ఎట్టి అక్రమము లేదా న్యాయాతిక్రమణము వున్న సదరుచర్య క్రమమైనది కాదని ఎంచకూడదు

## పై విచారణ

సె 42 (1) ఇన్‌స్పెక్టరు రాజ్యములోని అన్ని పంచాయతీ పరిపాలనను తనిఖీ చేయవలెను మరియు ఈ ఆక్టుచే లేక ఆక్టుక్రింద అతని కియ్యబడిన అధికారములను చెలాయించవలెను. విధులను నెర

వేర్చవలెను ప్రభుత్వమువారు నియమించిన ఒక లేక ఎక్కువమంది రీజినల్ ఇన్‌స్పెక్టరు వారియనకు సహాయముచేయునవలెను

(2) (a) ఈ ఆక్టుననుసరించి నిర్మింపబడిన పంచాయతీలు అన్నిటియొక్క లేదా ఏదేని పంచాయతీలయొక్క పనులను తనిఖీ చేయు లేదా పై విచారణచేయు కార్యము నిమిత్తము వారు అవసరమని తలంచగల ఇతర ఉద్యోగులనుకూడ గవర్నమెంటువారు నియమించవచ్చును

(b) ముఖ్యముగాను, పైన చెప్పిన నిబంధనకు సామాన్యముగా భంగములేకుండ, గవర్నమెంటువారు ప్రతిరెవిన్యూ జిల్లాకును ఒకరు లేక అంతకు ఎక్కువమంది డిస్ట్రిక్టు పంచాయతీ ఆఫీసర్లను, ఒకరు లేక అంతకు యెక్కువమంది డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లను నియమించవచ్చును

(c) (a) (b) క్లాజులలో చెప్పబడిన ఉద్యోగుల యొక్కయు, సిబ్బంది తాలూకు మెంబర్లయొక్కయు తరగతివారీవిభజనను, వారిని చేర్చుకొను పద్ధతులను, నౌకరి షరతులను, జీతములను, అలవెన్సులను, క్రమ శిక్షణమును, నడవడికను, క్రమపరచుటకు గవర్నమెంటువారు అధికారమును కలిగియుండవలెను

(3) పైన చెప్పబడిన ఉద్యోగుల, సిబ్బంది తాలూకు మెంబర్లకైన ఖర్చును రాజ్యముయొక్క సంచిత నిధినుండి చెల్లించవలెను

(4) డిస్ట్రిక్టు మరియు డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లు ఈ ఆక్టుక్రింద నిర్ణయింపబడగలట్టి లేక వారికి అప్పగింపబడగలట్టి అధికారములను చెలాయించవలెను మరియు విధులను నెరవేర్చవలెను

(5) (1) వ సబ్ సెక్షను ననుసరించి నియమింపబడిన ఇన్‌స్పెక్టరు, కలెక్టరు లేక ఏ ఉద్యోగియైన లేదా ఈ విషయమున గవర్నమెంటువారు లేక ఇన్‌స్పెక్టరు లేదా కలెక్టరు అధికారమియ్యగల యే యితర ఉద్యోగియైన లేదా మనిషియైన—

(a) ఎట్టి పంచాయతీయొక్కయైన లేదా కార్యనిర్వాహకోద్యోగియొక్కయైన అధికారము క్రిందనున్న యెట్టి స్థిరాస్తిలో

లేదా జరుగుచున్నట్టి యెట్టి వర్కు (పని) ప్రవేశించి తనిఖి చేయ వచ్చును లేక ప్రవేశించి తనిఖీ చేయబడునట్లు చేయవచ్చును

(b) ఎట్టి పంచాయతివలననైన పోషింపబడుచున్న లేదా దానిపరిపాలనలోనున్న యే పాఠశాలలో, ఆసుపత్రిలో, ఔషధ శాలలో, టీకాలు వేయుస్థలములో, సత్రములో లేదా ఇతర సంస్థలో ప్రవేశించి తనిఖీ చేయవచ్చును లేక ప్రవేశించి తనిఖీ చేయబడునట్లు చేయవచ్చును మరిన్ని అట్టి సంస్థలో నుంచబడిన ఎట్టి రికార్డుల నైనను, రిజిష్టరులనైనను లేదా యితర దస్తావేజులనైనను తనిఖీ చేయవచ్చును, మరిన్ని తనిఖీ చేయబడునట్లు చేయవచ్చును

(c) ఎట్టి పంచాయతీయొక్క ఆఫీసులోనైనను ప్రవేశించి తనిఖీ చేయవచ్చును ప్రవేశించి తనిఖీ చేయబడునట్లు చేయవచ్చును మరిన్ని అందులో నుంచబడిన యెట్టి రికార్డులను, రిజిష్టరులను లేదా యితర దస్తావేజులనైనను తనిఖీ చేయవచ్చును, తనిఖీ చేయబడునట్లు చేయవచ్చును

పంచాయితీలను, వాటి ప్రెసిడెంట్లును, కార్యనిర్వాహక అధి కారులును, వుద్యోగులును, నౌకరులును, పైన చెప్పబడిన వుద్యోగు లకును, మనుష్యులకును, న్యాయమైన అన్ని వేళలందును, అట్టి వుద్యో గుల లేదా మనుష్యుల, అభిప్రాయములో నిర్ణయింపబడగల విధులకు లోబడి ఆయా సంగతికి తగినట్లు ఈ సెక్షను ననుసరించి వారు వారియొక్క పనులను నెరవేర్చుటకు వారికి వీలును కలుగ జేయుటకు అవసరమని అభిప్రాయ పడగల పంచాయతి ఆస్తి విషయము నను లేదా ఆవరణాల విషయమునను, యావత్తు దస్తావేజుల విష యమునను అట్టి ప్రవేశ మివ్వవలెను

(6) ఇన్‌స్పెక్టరు లేక గవర్నమెంటువారు, లేక ఇన్‌స్పెక్టరు ఈ విషయమున అధికారమివ్వగల ఏ వుద్యోగి లేదా మనిషిగాని—

(a) 50 వ సెక్షనులో చెప్పబడిన వివరములుగల ఏదైన పబ్లిక్ వర్కుకుగాను లేక వసతికిగాను లేక పనికిగాను ఏర్పాటుచేయు నట్లున్ను వాటిని చేయునట్లు లేక ఏర్పాటు చేయునట్లు పంచాయతీని ఆజ్ఞాపించవచ్చును

(b) ఎట్టి పంచాయతియొక్కయైన లేదా కార్యనిర్వాహక అధికారియొక్కయైన స్వాధీనములో లేదా పరిపాలనలోనున్న యెట్టి రికార్డునైనను, రిజిష్టరు నైనను లేదా యితర దస్తావేజునైనను యివ్వ మని అడుగవచ్చును

(c) ఎట్టి రిటరను నైన, ప్లానునైన, అంచనానైన, స్టేటు మెంటునైన, లెక్కలనైనా లేదా (స్టాటిస్టిక్స్) అంకెలనైన, ఇచ్చు నట్లు ఎట్టి పంచాయతీనిగాని, లేక కార్యనిర్వాహక అధికారినిగాని కోరవచ్చును

(d) అట్టి పంచాయతిక సంబంధించిన ఏ విషయమును గూర్చిగాని, యెట్టి సమాచారమునుగాని, లేదా నివేదికనుగాని పంపు నట్లు ఎట్టి పంచాయతీనిగాని లేదా కార్యనిర్వాహక అధికారినిగాని కోరవచ్చును

(e) ఎట్టి పంచాయతి లేదా కార్యనిర్వాహక అధికారి యొక్కయైన ఆలోచన నిమిత్తము దానియొక్క లేదా ఆయనయొక్క వ్యవహారములను విధులను గూర్చి ఎట్టి అభిప్రాయములనైన వ్రాత మూలకముగా రికార్డు చేయవచ్చును

సంపాదకుని సూచన

రీజినల్ ఇన్స్పెక్టర్లు హోదా రీజినల్ ఇన్స్పెక్టర్సు ఆఫ్ లోకల్ అడ్మిని స్ట్రేషన్‌గా మార్చబడినది (జి ఓ. నెం 826, ఎల్ ఎ తేది 4-6-1956)

పంచాయితిలను తనిఖీ చేయునట్టి పర్యవేక్షించునట్టి యుద్యోగుల అధికారము లను నిర్వచించు విధులు

(జి ఓ నెం 520 ఎల్ ఎ తేదీ 24-3-1951)

## విధులు

### తనిఖీచేయు పై విచారణచేయు వుద్యోగులు మొదలైనవారి యొక్క అధికారములు

1 విచారణలు చేయుటకు 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టు లేక దానిక్రింద చేయబడిన విధులచే అధి కార మియ్యబడిన యేవవ్యక్తియైనా మనుష్యులు, వారి విధుల వ్యవ ధిలో నున్న విషయములను గురించి విచారించుటకు సదరు ఆక్టు

క్రింద తనిఖీచేయను నియమింపబడిన యావన్మంది పై విచారణ చేయు కార్యము నిమిత్తము—

(1) విచారణ క్రిందిప విషయమునైన పరిశోధించుటకు వారికి అవసరమై తోచుసాక్ష్యమును చెప్పుటకు ఆ జిల్లాలో కాపుర ముండు ఏ మనిషినైన సమను చేయుటకును, అట్టి మనిషి స్వాధీన ములో లేక అధికారములోనుండగల ఆ విషయమునకు సంబంధించిన ఏ దస్తావేజునైన హాజరుపరచునట్లు కోరుటకు, మరియు

(ii) అట్టి ఏ మనిషికైనను ఒక సివిలు కోర్టుచే సమను చేయబడిన సాక్షికి ఇయ్యదగిన బత్తాలను జారీచేయుటకును, బత్తాలు ఎవరిచే మరియు ఏ నిధినుండి చెల్లింపబడవలెనో దానినిగురించి ఉత్తరువు జారీచేయుటకును

అధికారములను కలిగియుండవలెను

2 అట్టి సమనులు లిఖితపూర్వకముగానుండి, అది ఎవరిచే జారీచేయబడినదో ఆ ఉద్యోగియొక్క సంతకముచే మరియు సీలుచే ధృవపరచబడవలెను

సమనుచేయబడిన మనిషిని ఒక నిర్దిష్టమైన కాలమందును, స్థలమందును సదరు ఉద్యోగి సమక్షమున హాజరగునట్లు కోరవలెను సాక్ష్యమునిచ్చుట లేక దస్తావేజును హాజరుపెట్టుట లేక ఈ రెండు కార్యములకు—వీటిలో దేనికొరకు ఆయన హాజరుకావలెనో దాని నిర్దేశించవలెను ఏ నిర్దిష్టమైన దస్తావేజును హాజరుపెట్టవలసినదిగా కోరబడెనో దానిని వీలగునంతవరకు స్పష్టముగా సమనులలో వివరించ వలెను

3 సమను చేయబడిన మనిషికి సమనులను ప్రత్యేకముగా అందచేయవలెను లేక ఆయన కనుపించని పక్షమున అతనితో నివసించుచుండు అతని కుటుంబమునకు చెందిన ఎవరైన ఒక ఈడు వచ్చిన మనిషియొద్ద లేక, ఆయన నివసించుచుండు గ్రామముయొక్క గ్రామమునసబుయొద్ద నియ్యవలెను

4 సాక్ష్యమునిచ్చుటకు సమనుచేయబడక ఒక దస్తావేజును హాజరుపెట్టుటకు ఏ మనిషికిగాని సమను చేయవచ్చును ఒక దస్తా

వేజును మాత్రము హాజరు పెట్టుటకు సమను చేయబడిన ఏ మనిషి గాని వాటిని హాజరుపెట్టుటకు కట్టున కోర్టుకు వచ్చుటకు బదులుగా అట్టి దస్తావేజును హాజరుపరచినట్లు చేసినపక్షమున సమనుల ప్రకారము ప్రవర్తించినట్లు భావింపబడవలెను

5 ఎవరి సాక్ష్యము కోరబడినదో అట్టి మనిషి వ్యాధివలనగాని, ముసలితనమువలనగాని సమనులను జారీచేయు ఆఫీసరు సమక్షమున హాజరగుటకు సాధ్యముకానపుడు లేక హోదా లేక లింగభేదమును బట్టి సమనుచేయుటకు వీలులేనప్పుడు సమనులను జారీచేయు అధికారి తనంతట తాను లేక ఎవరిసాక్ష్యము కోరబడినదో ఆ కక్షిదారు దరఖాస్తు పెట్టుకొనినమీదట అట్టి మనిషి హాజరుకా నవసరములేదని చెప్పి సదరు కార్యముకొరకు అట్టి ఉద్యోగిచే నియోగింపబడిన ఒక తాబేదారువలన అతనిని పరీక్షించునట్లు ఉత్తరువు చేయవచ్చును

6 ఈ విధులక్రింద జారీచేయబడిన సమనుల ప్రకారము నడుచు కొనుటకు తప్పిపోవు ఏ మనిషియైనను వంద రూపాయలవరకు వ్యాపించగల జుల్మానాతో శిక్షింపబడతగియుండవలెను

7 ఈ విధులలోనున్న దేదియు ఈ ఆక్టుచే లేక దానిక్రింద ఇతర విధముగా ఏర్పాటుచేయబడియుండు సందర్భములకు వర్తించ కూడదు

సె 43 (1) ఇన్‌స్పెక్టరు, ఈ ఆక్టు ననుసరించి లేదా ఈ ఆక్టు నెపమున—

(a) అట్టి తీర్మానము, ఉత్తరువు, లైసెన్సు, అనుమతి లేదా పనిగాని న్యాయ సమ్మతముగా సాధకుచేయబడలేదని, జారి చేయబడలేదని, యివ్వబడలేదని లేదా అధికారపూర్వకమైనదిగా చేయబడలేదని, లేదా

(b) అట్టి తీర్మానము, ఉత్తరువు, లైసెన్సు, అనుమతి లేదా పనిగాని ఈ ఆక్టువలన లేదా ఏ ఇతర శాసనమువలననైన యివ్వబడిన అధికారములను అతిక్రమించి యున్నదని లేదా అట్టి అధికారములను దుర్వినియోగపరచుచున్నదని లేదా యితర విధముగా ఆక్షేపణీయమైనదని ఇన్‌స్పెక్టరు తలచుచున్నారని, లేదా

(c) అట్టి తీర్మానము లేదా ఉత్తరువునుగాని, అమలులో పెట్టుట, లేదా యెట్టి లైసెన్సును లేదా అనుమతిని అమలుజరిగించు చుండుట లేదా అట్టి పనిచేయుట, మనుష్యుల ప్రాణములకు, ఆరోగ్యమునకు లేదా రక్షణకు బహుశః హానిని కలుగజేయవచ్చునని లేదా ఒక దొమ్మీకి లేదా ఒక పోట్లాటకు బహుశః దారి తీయవచ్చునని

అభిప్రాయపడినయెడల వారు వ్రాతమూలకమైన ఉత్తరువు మూలమున

(i) సాదరుచేయబడిన అట్టి ఏ తీర్మానమునైన, జారీ చేయబడిన అట్టి ఏ ఉత్తరువునైన లేదా యివ్వబడిన అట్టిఏ లైసెన్సునైన, లేదా అనుమతినైన తాత్కాలికముగా నిలిపియుంచవచ్చును లేదా రద్దుచేయవచ్చును లేదా

(ii) జరుపబడనున్న లేదా జరుపబడుచున్న అట్టి ఏ పనినైన చేయుటను నిషేధింపవచ్చును

అయితే ఈ సబు సెక్షనులోనున్న దేదియును జరుపబడిన ఎట్టి ఎన్నికనుగాని ఇన్‌స్పెక్టరు రద్దుచేయుటకు వీలు కలుగజేయకూడదు

(2) (1) వ సబు సెక్షనులోని (a), (b) క్లాజులలో సూచింపబడిన కారణములలో దేనినైననుబట్టి ఇన్‌స్పెక్టరు చర్యతీసుకొనుటకు పూర్వము సంబంధించిన అధికారికి లేదా మనిషికి సంజాయిషి నిచ్చుటకు అవకాశము నివ్వవలెను

(2) (1) వ సబు సెక్షనుయొక్క (a) క్లాజుక్రింద ఇన్‌స్పెక్టరు కీయబడిన అధికారము, ఆ క్లాజుయొక్క నిబంధనల కనుగుణముగా కలెక్టరుచే చెలాయింప బడవచ్చును

సె 44 నిర్ణయింపబడగల పై అధికారమునకు లోబడి ఇన్‌స్పెక్టరు లేక కలెక్టరు అవసర సందర్భములలో, నెరవేర్చుటకుగాని జరిగించుటకుగాని ఒక పంచాయతీ లేక కార్యనిర్వాహక అధికారి అధికారమును కలిగియున్న బాపతుగా నుండునట్టిన్ని, జనుల క్షేమము నకు ఏది తక్షణము నెరవేర్చడము లేక జరిగించడము ఆవశ్యకమని ఆయన అభిప్రాయపడునో అట్టి ఏదైన పనిని నెరవేర్చుటకున్నూ ఏదైనా కార్యమును జరిగించుటకున్నూ ఆజ్ఞాపించవచ్చును. లేదా

ఏర్పాటు చేయవచ్చును మరియు ఆ పనిని నెరవేర్చుటకుగాని ఆ కార్యమును జరిగించుటకుగాని తగిలే ఖర్చు పంచాయతీ ద్రవ్యమును తన స్వాధీనములోగల మనిషి అనుమతింపబడిన ఋణములను చెల్లించుటకు ఏర్పడియుండు ఖర్చులు తప్ప, అట్టి ద్రవ్యముమీదగల ఏ యితర ఖర్చుకంటెను ముందుగా చెల్లించునట్లు ఆజ్ఞాపించవచ్చును

సెక్షను 44 క్రింద విధి

(జి. ఓ. నెం 520, ఎల్. ఎ తేదీ 24-3-1951)

విధి

ఇన్‌స్పెక్టరు మరియు కలెక్టరుయొక్క అత్యవసర అధికారములమీద కంట్రోలు

ఆక్టుయొక్క 44 వ సెక్షనుచే ఇవ్వబడిన అధికారములను చెలాయించు ప్రతి సందర్భము—

(i) అట్టి అధికారములు ఇన్‌స్పెక్టరువలన చెలాయించబడు సందర్భములో ఆయన వెంటనే ప్రభుత్వమువారికి,

(ii) అట్టి అధికారములు కలెక్టరువలన చెలాయించబడు సందర్భములో ఆయన వెంటనే ఇన్‌స్పెక్టరుకు,

అట్టి అధికారములు చలాయించుటకైన పూర్తి కారణములతో తెలియజేయవలెను మరియు తెలియజేసిన రిపోర్టుయొక్క నకలొక దానిని అదే సమయమందు పంచాయతీకి తెలియజేయుటకుగాను పంపవలెను

సె 45, విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేయు, ఒకచోటనుండి మరియొకచోటికి తీసుకొనిపోవు, సరఫరాచేయు లేదా ఉపయోగించు ఏ పనియొక్కయైన పంచాయతీ పరిపాలన, తత్కాలమందు అమలులోనున్నట్టి 1910 వ సం॥పు ఇండియాదేశపు ఎలక్ట్రిసిటీ ఆక్టుకును, లేక 1948 వ సం॥పు విద్యుచ్ఛక్తి (సరఫరా) ఆక్టుకును ఆ యాక్టుల నను సరిపడి చేయబడిన విధులకును, దాని ననుసరించి పంచాయితీకి ఇయ్యబడిన లైసెన్సుయొక్క షరతులకును విరుద్ధముకానట్టి నిర్ణయింపబడగల పై విచారణకు లోబడియుండవలెను

సంపాదకుని సూచన

విద్యుచ్ఛక్తికి సంబంధించిన పనులేవియు ప్రస్తుతము ఏపంచాయతీ నిర్వహించుటలేదు

46 (1) ఈ ఆక్టును లేదా ఏదైన యితర ఆక్టునుబట్టిగాని, దానిని అనుసరించిగాని విధింపబడియున్న ఏదైన పనిని ఒక పంచాయతి, ప్రెసిడెంటు లేదా కార్యనిర్వాహక అధికారి చేయుటకు తప్పిపోయెనని ఇన్‌స్పెక్టరుకు ఏ కాలమందైన కనపడినయెడల ఆయన వ్రాతమూలకమైన ఉత్తరువుద్వారా, అట్టి పనిని నెరవేర్చుటకై ఒక కాలపరిమితిని నిర్ణయించవచ్చును

(2) అట్టి పని అట్లు నిర్ణయించబడిన కాలపరిమితిలోపుగా నెరవేర్చబడనియెడల, ఇన్‌స్పెక్టరు దానిని నెరవేర్చుటకు ఎవరో ఒక మనిషిని నియమించి, దానిని నెరవేర్చుటకైన ఖర్చును పంచాయతి ద్రవ్యమును తన స్వాధీనమందుగల మనిషి అనుమతింపబడిన ఋణములను చెల్లించుటకుగాను యేర్పడియుండు ఖర్చులు తప్ప అట్టి ద్రవ్యముమీదగల ఏదైన ఇతర ఖర్చులకు ముందుగా చెల్లించునట్లు ఆజ్ఞాపించవచ్చును

సె 47 (1) ఇన్‌స్పెక్టరు, ఒక ప్రకటన మూలముగాను, దానిలో నిర్దేశింపబడిన ఒక తేదీనుండి ఈ ఆక్టుయొక్క నిబంధనలను లేదా దాని ననుసరించి చేయబడిన ఏదేని విధులను, ఉపవిధులను, రెగ్యులేషనులను లేదా న్యాయసమ్మతమైన ఉత్తరువులను బుద్ధిపూర్వకముగా నెరవేర్చకుండ విడిచిపెట్టెనని అధికారములను దుర్వినియోగము చేసెనని అభిప్రాయపడు ఏ ప్రెసిడెంటునుగాని లేదా వైసు ప్రెసిడెంటునుగాని తొలగించవచ్చును

(2) ఇన్‌స్పెక్టరు ఒక ప్రకటనమూలముగాను, దానిలో నిర్దేశింపబడిన ఒక తేదీనుండిన్ని ఏ మెంబరుగాని అట్టి మెంబరుగా అతని విధులను నెరవేర్చుటలో ఎట్టి నిర్లక్ష్యత నైన కలిగియుండునట్లు తాను అభిప్రాయపడునెడల తొలగించవచ్చును

(3) ఇన్‌స్పెక్టరు (1) వ లేదా (2) వ సబు సెక్షను ననుసరించి చర్యదీసుకొనుటకు ఉద్దేశించునప్పుడు సంబంధించిన ప్రెసిడెంటుకు లేదా వైసు ప్రెసిడెంటుకు లేక మెంబరుకు సంజాయిషీ

నిచ్చుటకు అవకాశమును యివ్వవలెను మరిన్ని తీసుకొనబడిన చర్యకుగల కారణములయొక్క వివరణము జారీచేయబడిన ప్రకటనలో ఉండవలెను

(4) గవర్నమెంటువారు (1) వ సబు సెక్షను లేదా (2)వ సబు సెక్షను ననుసరించి జారీచేయబడిన ఎట్టి ప్రకటననుగాని రద్దు చేయుటకు అధికారమును కలిగియుండవలెను మరిన్ని అట్లు రద్దు చేయు విషయమున ఒక తీర్పు చేయబడుసంతవరకు అట్టి ప్రకటనలో నిర్దేశింపబడిన తేదీని త్రోసిపెట్టవచ్చును

(5) ఏ మనిషి విషయమున అతనిని (1) వ లేదా (2)వ సబు సెక్షను ననుసరించి ప్రెసిడెంటు, వైసు ప్రెసిడెంటు లేదా మెంబరు ఉద్యోగమునుండి తొలగించుచు ఒక ప్రకటన జారీచేయబడ్డదో అట్టి ఏ మనిషిగాని (4) వ సబు సెక్షను ననుసరించి ఆ ప్రకటన రద్దుచేయ బడిననే తప్ప పంచాయతీకి జరుగు మరుసటి సాధారణ ఎన్నికలను గురించిన నోటీసు నిర్ణయింపబడిన విధముగా ప్రకటింపబడిన తేదీ లేదా (4) వ సబు సెక్షను ననుసరించి జారీచేయబడిన ఉత్తరువు, ఏదైన నున్న యెడల దానిచే వాయిదా వేయబడిన అట్టి ప్రకటనలో నిర్దేశింపబడిన తేదీనుండి ఒక సంవత్సరము అంతమగుట ఈ రెండింటిలో ఏది ముందుగా నుండునో అంతవరకు ప్రెసిడెంటుగా లేక వైసు ప్రెసిడెంటుగా ఎన్నుకొనబడుటకు లేక ఒక మెంబరుగా ఎన్నుకొనబడుటకు, లేక ఆ ఉద్యోగములో దేనినైన కలిగియుండు టకు అనర్హుడుగా నుండవలెను,

సంపాదకుని సూచన —

ఇన్‌స్పెక్టరుయొక్క యుత్తరువుపై అప్పీలున్నప్పటికి, లేనప్పటికి, 47 (4) వ సెక్షను క్రింద ప్రభుత్వమునకున్న అధికారములు వర్తింపజేయవచ్చును కాని, ఇంచు మించు, యీ విషయములలో అప్పీళ్లుండవనని, అనుభవమువల్ల తెలియుచున్నది

## పదవినుండి తొలగింపబడిన పంచాయతీ అధ్యక్షుల అప్పీళ్ల క్రమ నిర్వహణకు విధులు

(జి ఓ నెం 737, ఎల్ ఎ తేదీ 18-5-1956)

(112 వ సెక్షనుయొక్క, (2) వ యుప సెక్షనుయొక్క (XXXVI) వ క్లాజు క్రింద విధులు)

1 మద్రాసు గ్రామపంచాయతీల యాక్టు, 1950 (మద్రాసు యాక్టు x ఆఫ్ 1950) యొక్క 47 సెక్షనుయొక్క (1) వ లేక (2) వ సబ్ సెక్షను క్రింద, ఆంధ్ర గెజెటులో ప్రచురింపబడిన ప్రకటనవల్ల నష్టముపొందిన నేవ్యక్తి అయిన, ఆ ప్రచురింపబడిన తేదీ లగాయతు ఒక నెలలో ప్రభుత్వమునకు అప్పీలు చేసుకొనవచ్చును

2 అట్టి ప్రతి అప్పీలునున్ను, ఇన్‌స్పెక్టర్ జనరల్ ద్వారా ప్రభుత్వమునకు సమర్పింపబడవలెను మరియు నందులో అప్పీలుచేయు నాతడు ఆధారముగా చేసుకొను ముఖ్యమైన విజ్ఞాపనలు (మెటీరియల్ స్టేటుమెంట్లు), కారణములు విశదపరచి యుండవలెను కాని, అగౌరవమైన, ఆక్షేపణీయమైన (అనుచితమైన) వాక్కులుండరాదు

సె 48 (1) గవర్నమెంటువారియొక్క అభిప్రాయములో ఒక పంచాయతీ, చట్టమువలన విధింపబడిన పనులనుచేయుటకు అర్హాత కలిగి యుండనియెడల లేదా చేయుటలో పదేపదే తప్పిపోవు చుండు నెడల లేదా దాని అధికారములను అతిక్రమించుచున్న నెడల దుర్వినియోగపరచుచున్న యెడల వారు ప్రకటన ద్వారా—

(a) నిర్ణయింపబడిన ఒక తేదీనుండి పంచాయతీ తొలగింపబడి, (డిసాల్వు) వెంటనే లేదా నిర్ణయింపబడిన మరియొక తేదీనుండి అది పునర్నిర్మాణము చేయబడవలెనని ఆజ్ఞాపించవచ్చును, లేదా

(b) నిర్ణయింబడిన ఒక తేదీనుండి ఒక సంవత్సరమునకు మించని ఒక కాలపరిమితివరకు సదరు పంచాయతిని తాత్కాలికముగా రద్దు (సూపరుసీడు) చేయవచ్చును

(2) (ఈ సబుసెక్షను, 1955 సం॥లో ప్యాసుకాబడిన, XXII నం॥ గల ఆంధ్ర ఆక్టువల్ల రద్దు చేయుబడినది )

(3) (1) వ సబు సెక్షను ననుసరించి ఒక ప్రకటనను ప్రకటించుటకు పూర్వము గవర్నమెంటువారు ఏ కారణములనుబట్టి వారు అట్లుచేయుటకు ఉద్దేశించిరో ఆ కారణములను పంచాయతీకి తెలియజేసి, ఆ ఉద్దేశమునకు వ్యతిరేకముగా గల కారణమును పంచాయతీ తెలుపుటకు న్యాయమైన ఒక కాలపరిమితిని నిర్ణయించి

దాని సంజాయిషీలు, ఆక్షేపణలు ఏవైన ఉన్నయెడల వాటిని ఆలోచించవలెను

(4) (1) వ సబు సెక్షను ననుసరించి ఒక పంచాయతీని తీసి (డినాల్వ్) వేయుటకు లేదా తాత్కాలికపు రద్దు (సూపరుసీడు) చేయుటకు నిర్ణయింపబడిన తేదీన దాని మెంబర్లు అందరును, దాని ప్రెసిడెంటు వైసు ప్రెసిడెంటును కూడ తమ ఉద్యోగములను వెంటనే ఖాళీ చేసినట్లుగా తలంపబడవలెను

(5) (a) ఆయా సంగతికి తగినట్లు ఒక పంచాయతీ తీసివేయ బడుటకును, పునర్నిర్మాణము చేయబడుటకును మధ్య వ్యవధి ఏదైన ఉన్నయెడల ఆ కాలములో లేదా అది తాత్కాలికపు రద్దు చేయబడియుండు కాలపరిమితి దాని ప్రెసిడెంటు, గవర్నమెంటువారు ఆ విషయమున నిర్ణయించగల విధముగా సాధ్యమైనంతవరకును, అట్టి మేరకును పంచాయతి, అధికారములను ప్రెసిడెంటు ఎగ్జిక్యూటివు అధారిటియైయుండిన, సదరు అధారిటీ యధికారములతో సహా, గవర్నమెంటు నియమించిన వ్యక్తి చెలాయించవలెను విధులను నెరవేర్చవలెను అట్లు నియమింపబడిన వ్యక్తి, ఎగ్జిక్యూటివు అధారిటి కానట్టి ఏ యితర మనిషియైనను, గవర్నమెంటు అట్లు ఆజ్ఞాపించిన, ఆయన అట్లుకొలువుచేసి నందుకు పంచాయతీనుండి జీతమును పొంద వచ్చును

(b) (1) పై జెప్పబడిన వ్యక్తి, గవర్నమెంటు రూల్సు ద్వారా శాశించిన షరతులు అడ్డులకు లోబడి, తన విధ్యుక్తములను అధికారములను, వ్రాతమూలకముగా పంచాయతీ సిబ్బందిలో నొక ఉద్యోగి లేక నౌకరునకు దత్తత చేయవచ్చును

(11) (1) వ అంశము క్రింద దత్తత చేసిన, విధ్యుక్తములను, అధికారములను, సదరుపుద్యోగి లేక నౌకరు చెలాయించు విషయ ములో, ఆ వ్యక్తి ఏవైన అడ్డులు మరియు షరతులు విధించ వచ్చును అట్టి దత్తత చేయబడిన హక్కులను చెలాయించుచూ జారీచేసిన ఉత్తరువు నేదైన, ఆ వ్యక్తి మార్చవచ్చును లేక రద్దు చేయవచ్చును

(6) పునర్నిర్మాణము చేయబడిన పంచాయతీయొక్క మెంబర్లు, దాని పునర్నిర్మాణమునకు నిర్ణయింపబడిన తేదీన వారివారి వుద్యోగములలో ప్రవేశించవలెను మరిన్ని వారి వుద్యోగకాలము గవర్నమెంటువారు నిర్ణయించగలట్టి సంవత్సరములలోను, తేదీనను అంతము కావలెను అట్లు నిర్ణయింపబడిన సంవత్సరము, అదే జిల్లాలో ఏ పంచాయతీకైన మరుసటి సామాన్య ఎన్నికలు జరుపబడవలసిన సంవత్సరముగానో లేదా అట్టి ఎన్నికలకు అవ్యవహితముగా తరువాత సామాన్య ఎన్నికలు జరుపబడవలసిన సంవత్సరముగానో వుండవలెను అట్లు నిర్ణయింపబడిన తేదీ డిసెంబరు 31 వ తేదీకంటె ఆలస్యముగా నుండకూడదు

(7) ఈ సెక్షను ననుసరించి ఒక పంచాయతీ తీసివేయబడినప్పుడు లేదా రద్దుచేయబడినప్పుడు, అది పునర్నిర్మాణము చేయబడు తేదీవరకు, గవర్నమెంటువారును అటుతరువాత పునర్నిర్మాణము చేయబడిన పంచాయితీయును, క్రమముగా తీసివేయబడిన లేదా రద్దు చేయబడిన తేదీన మరియు పునర్నిర్మాణము చేయబడిన తేదీనను వున్న పంచాయతియొక్క ఆస్తులన్నిటికిని హక్కు కలిగియుండవలెను. మరిన్ని దాని బాధ్యతలన్నిటికిని లోబడియుండవలెను

సంపాదకుని సూచన,

సెక్షన్ 48 (1), (3) మరియు (6) క్రింద ప్రభుత్వముయొక్క అధికారములు ఇన్‌స్పెక్టరు జనరలు ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషనుకు దత్తత చేయబడినవి

(జి ఓ నెం 113 ఎల్ ఎ తేదీ 4-6-1951)

సె 49 గవర్నమెంటువారు, ఇన్‌స్పెక్టరు లేక ఈ ఆక్టు ననుసరించి ఒక పంచాయతి తరఫున అది తప్పిపోయినపుడుగాని చట్టసమ్మతముగా చర్య జరుపు ఏ యితర మనిషిగాని పదరు కార్యము నిమిత్తము అవసరమైన అధికారములన్నియు వారికి లేదా ఆయనకు వుండవలెను మరియు ఏదేని అధికారములు చెలాయింపబడుచున్నదో అట్టి పంచాయతికి లేదా దాని వుద్యోగులకు లేదా నౌకర్లకు వున్నట్టి ఈ ఆక్టు ననుసరించిన సంరక్షణకు వారు హక్కు కలిగియుండవలెను మరియు అట్టి అధికారములను చెలాయించుటచే

నష్టమును పొందు ఏ మనిషియైనను పంచాయతి నిధినుండి ఆచర్య ఆ పంచాయతీచే లేదా దాని వుద్యోగుఁచే లేదా నౌకర్లచే జరుపబడి యుండిన నెట్లో అట్లే అంతవరకే పరిహార ద్రవ్యము రాబట్టుకో దగి యుండును

3 వ అధ్యాయము—పంచాయతీలయొక్క పనులను, అధికారములును, ఆస్తియును

సె 50 ఈ ఆక్టుయొక్క నిబంధనలకును దాని క్రింద చేయబడిన విధులకును లోబడి ఒక పంచాయతీ నిధులయొక్క పరిమితి లోపుగా ఈ క్రింద విషయముల సందర్భములో గ్రామములకు అవసరమైన పనులను చేయుటకు న్యాయమైన ఏర్పాటును చేయుట పంచాయతీయొక్క విధియై యుండవలెను ఆ విషయము లేవనగా—

(a) (జిల్లా రోడ్లు మరియు జాతీయ మరియు రాజ్యమునకు చెందిన రహదారులుగా గవర్నమెంటువారు విభజించిన రోడ్డుగాని ఇతర) గ్రామములలోని యావత్తు పబ్లిక్ రోడ్లను అట్టి రోడ్లమీదనుండు యావత్తు వంతెనలను, కల్వర్టులను (తూములను) రోడ్డు డాములను, కాజ్ వేలను (మిట్టదార్లను) నిర్మించుటయును మరమ్మతు చేయుటయును, పోషించుటయును ,

(b) పబ్లిక్ రోడ్డులలోను, పబ్లిక్ స్థలములలోను దీపములను వెలిగించుటయును ,

(c) మురుగుకాల్వలను నిర్మించుటయును, మురుగు నీటిని, మురుగు పదార్థమును పరిష్కరించుటయును ,

(d) వీధులను శుభ్రపరచుట, కుప్పపోగులను, పొదలను, నాగజముడును తొలగించుట, వుపయోగింపని బావులను, అనారోగ్యమైన గుంటలను, మడుగులను, కిందకములను, పల్లములను లేదా బొందలను పూడ్చుట మరిన్ని గ్రామముయొక్క ఆరోగ్యస్థితికైన యితర అభివృద్ధులను చేయుటయును ,

(e) పబ్లిక్ పాయిఖానాలను ఏర్పాటుచేయుటయును, పబ్లిక్ పాయిఖానాలనైననుసరే ప్రైవేటు పాయిఖానాలనైననుసరే వాటిని శుభ్రపరచుటకు ఏర్పాటు చేయుటయును ,

(f) పూడ్చునట్టియు, దహనముచేయునట్టియు శ్మశానములను ఏర్పాటుచేసి వాటిని పోషించుటయును ,

(g) బావులను త్రవ్వుటయును, వాటిని మరమ్మతు చేయుటయును, కడుగుటకు, స్నానముచేయుటకు నీటిని మరియు త్రాగుటకు రక్షింపబడిన నీటిని సరఫరా చేయుటకుగాను గుంటలను లేక చెరువులను త్రవ్వుటయును, వాటిని మరమ్మతు చేయుటయును, పోషించుటయును, నీటి వరుక్కానలను నిర్మించుటయును, పోషించుటయును,

(h) ఏకకాలమందు అనేకులకు తగిలే ఏ వ్యాధినైనను లేక మలేరియా (చలిజ్వరము) రాకుండ ఆపుటకైనట్టిన్ని, పరిహార సంబంధమైనట్టిన్ని చర్యలు

రూల్సు 50 వ మరియు 112 (1) వ సెక్షనుల క్రింద పంచాయతి చేయదగు గరిష్ఠ, మరియు గనిష్ఠవ్యయము నిర్దేశించుటకు విధులు

(జి ఓ. నెం 1547, ఎల్ ఎ తేదీ 6-8-1951)

## విధులు

## కొన్నివిషయముల నిమిత్తము పంచాయతి విదులను ఏర్పాటు చేయుట.

1 క్రింది I వ షెడ్యూలుయొక్క (1) వ కలములో చెప్పబడిన పద్దులలో దేనికొఱకుగాని ఏ సంవత్సరమందైనను ఒక పంచాయతీచే చేయబడగల ఖర్చు, రీజనల్ (ప్రాంతీయ) ఇన్స్పెక్టరు యొక్క నిర్దిష్టమైన అంగీకారమును పొందక, దానిని సరియైన దానియొక్క (2) వ కలములోని సమూదులో నిర్దిష్టము చేయబడినకనీస పరిమితికి తక్కువ కాకూడదు

2 క్రింది II వ షెడ్యూలుయొక్క (1) వ కలములోచెప్పబడిన పద్దులలో దేనికొఱకగాని ఏ సంవత్సరమందైనను ఒక పంచాయతీచే చేయబడగల ఖర్చు, రీజనల్ ఇన్స్పెక్టరు యొక్క నిర్దిష్టమైన

అనుమతిని పొందక దానియొక్క (2) వ కలములోని దానికి సరియైన సమూదులో నిర్దిష్టముచేయబడిన గరిష్ఠపరిమితిని మించకూడదు

3 1 వ మరియు 2 వ విధులలో ఏమి చెప్పియున్నను దానితో నిమిత్తము లేకుండా—

(1) షెడ్యూళ్ళలోని (1) వ కలములో నిర్దిష్టముచేయబడిన కార్యములలో దేనినిమిత్తమైన, పంచాయతీ అదనపు పన్నును విధించునప్పుడు, రీజనల్ ఇన్‌స్పెక్టరు యొక్క ప్రత్యేక అనుమతిని పొందక, ఆ ప్రత్యేక కార్యము నిమిత్తము సామాన్యలెక్క (జనరల్ అకౌంటు) నుండి ఏ ఖర్చుగాని చేయబడకూడదు, మరియు

(3) ప్రైవేటు పాకీపని నిమిత్తము పంచాయతీ రుసుమును విధించునపుడు, అట్టి పనికగు ఖర్చు, రీజనల్ ఇన్‌స్పెక్టరు ప్రత్యేక అనుమతిని పొందక, అట్టి రుసుములనుండి వచ్చు ఆదాయమును మించకూడదు

## 1 వ షెడ్యూలు

| ఖర్చు పద్దు<br>(1) | ఖర్చుయొక్క కనీసపరిమితి<br>(2) |
|---|---|
| **రాకపోకలు** | |
| (a) గ్రామములోని (జిల్లా రోడ్లు, మరియు ప్రభుత్వమువారిచే జాతీయ మరియు రాజ్య రహదారులుగా విభజింపబడు రోడ్లు కానట్టి ఇతర) పబ్లిక్ రోడ్లన్నింటి మరియు అట్టి రోడ్లమీద వంతెనెల, చిన్న వంతెనెల, రోడ్డు డామ్స్ (ఆనకట్ట) ల మరియు కాజ్వేల నన్నింటి నిర్మాణము మరమ్మతు మరియు పోషణ | సాధారణముగా వచ్చు ఆదాయములోనూరింట 20 వంతులు |
| **నీటి సరఫరా** | |
| (b) బావులను త్రవ్వించుట మరియు వాటిని మరమ్మతు చేయుట, గుంటలను లేక చెఱువు లను త్రియుట, మరమ్మతు చేయుట మరియు పోషించుట, మరియు ఉతుకుటకు, స్నానము చేయుటకు నీటిని సరఫరా చేయు నిమిత్తము వాటర్ వర్క్సులను, మరియు త్రాగుటకొరకు రక్షిత నీటి సరఫరాను పోషించుట | సాధారణముగా వచ్చు ఆదాయము నూరింట 10 వంతులు, |

## II వ షెడ్యూలు

| ఖర్చు పద్దు (1) | ఖర్చుయొక్క గరిష్ఠ పరిమితి |
|---|---|
| **దీపములు వేయుట** | |
| (a) పబ్లికు రోడ్లలోను, పబ్లిక్ ప్రదేశములందు దీపములు వేయుట | సాధారణముగా వచ్చు ఆదాయములోనూరింట 15 వంతులు |
| **ప్రజారోగ్యము** | |
| (b) మురికిపీటి కాలువలను నిర్మించుట, మురికి నీటిని మరియు మురికిని పరిష్కరించుట<br>(c) వీధులను, పరిశుభ్రపరచుట, చెత్త కుప్పలను, చిట్టడవులను, నాగజెముడును తొలగించుట, ఉపయోగింపబడని బావులను, అపరిశుభ్రమైన గుంటలను, మడుగులను కందకములను, పల్లములను, తొర్రలను పూడ్పించుట, మరియు గ్రామ పారిశుద్ధ్యమునకైన ఇతర అభివృద్ధులు | సాధారణముగా వచ్చు ఆదాయములోనూరింట 30 వంతులు |
| (d) పబ్లికు పాయిఖానాలను ఏర్పాటు చేయుట మరియు పాయిఖానాలు ప్రభుత్వమునకు చెందినవైనను సరే లేక వ్యక్తులకు చెందినవైనను సరే, వాటిని శుభ్రపరచుటకు ఏర్పాట్లను చేయుట<br>(e) శ్మశానభూములను ఏర్పాటు చేయుట మరియు పోషించుట<br>(f) ఏ అంటువ్యాధి లేక చలిజ్వరము సంభవములలోనైన నివారక మరియు పరిహారపు చర్యలను చేయుట | సాధారణముగా వచ్చు ఆదాయములోనూరింట 30 వంతులు |

వివరణము —"సాధారణముగావచ్చు ఆదాయము" అనగా క్రితపు మూడు సంవత్సరములందును పంచాయతీకి "సామాన్య లెక్క—సాధారణమైనది" అను శీర్షిక క్రింద, ఆ లెక్కకు నిర్దిష్టమైన కార్యము నిమిత్తము జమకట్టబడిన గ్రాంటులు మరియు చందాలు మినహా, అందిన సరాసరి మొత్తపు ఆదాయములు అని అర్థము

సె 51 ఈ ఆక్టుయొక్క నిబంధనలకును, దాని క్రింద చేయ బడిన విధులకును లోబడి ఒక పంచాయతీ, ఈ క్రింది విషయములను గురించి గ్రామమునకు కావలసిన పనులను నెరవేర్చుటకు అది యుక్త మని తలచునట్టి ఏర్పాటును కూడ చేయవచ్చును ఆ విషయము లేవనగా —

(a) జిల్లా రోడ్లు కానట్టి లేక జాతీయ లేక రాజ్యమునకు చెందిన రహదారులుగా గవర్నమెంటువారు విభజించిన రోడ్లు కానట్టి గ్రామములోని పబ్లిక్ రోడ్ల ప్రక్కలలో చెట్లను నాటుటయును వాటిని రక్షించుటయును,

(b) జిల్లా మార్కెట్లుగా విభజింపబడిన మార్కెట్లు కానట్టి యితర పబ్లిక్ మార్కెట్లను ఏర్పాటుచేయుటయును, వాటిని పోషించుటయును,

(c) జిల్లా సంతలు, ఉత్సవములుగా విభజింపబడినవి కానట్టి యితర సంతల ఉత్సవములమీాద పై అధకారమును కలిగి యుండుటయును,

(d) పబ్లిక్ లాడ్జింగు (ప్రయాణీకుల దిగే) స్థలములను, ప్రయాణీకులు నిలిచే స్థలములను, బండ్లదొడ్లను మరిన్ని పబ్లిక్ పశు వుల కొట్టములను ఏర్పాటుచేయుటయును, పోషించుటయును,

(e) పబ్లిక్ జంతు వధశాలలను ఏర్పాటుచేయుటయును, పోషించుటయును,

(f) జిల్లా సత్రములుగా విభజించబడని ఇతర సత్రములను స్థాపించుటయును, పోషించుటయును,

(g) గ్రామకంఠములను విస్తరింప జేయుటయును, కట్టడ మును క్రమపరచుటయును,

(h) జనన మరణములను రిజిష్టరు చేయుటయును,

(i) వ్యవసాయమును, వ్యవసాయ జంతువులను అభివృద్ధి పరచుటయును, వ్యవసాయ ప్రదర్శనములను జరుపుటయును,

(j) గృహ పరిశ్రమలను వెంపొందించుటయును వాటిని ప్రోత్సహించుటయును,

(k) ప్రాథమిక పాఠశాలలను ఏర్పాటుచేయుటయును, వాటిని పోషించుటయును,

(l) పఠన మందిరములను, జిల్లా లైబ్రరీలు (పుస్తక భాండాగారములు) గా విభజింపబడని గ్రంథాలయములను ఏర్పాటు చేయుటయును పోషించుటయును,

(m) వైర్‌లెస్ రిసీవింగు సెట్లను, ఆట స్థలములను, వ్యాయామ క్లబ్బులను దేహపరిశ్రమను గురించి బోధించు కేంద్రములను స్థాపించుటయును వాటిని పోషించుటయును,

(n) ఔషధశాలలను స్థాపించుటయును, వాటిని పోషించుటయును, గ్రామ వైద్య వృత్తిదారులకు సహాయద్రవ్యమును చెల్లించుటయును,

(o) ప్రసూతి, శిశు సంరక్షణ కేంద్రములను స్థాపించుటయును, పోషించుటయును,

(p) పశువైద్య సహాయమును,

(q) గ్రామములో నివసించువారి క్షేమమును, ఆరోగ్యమును, సౌకర్యమును లేదా సౌఖ్యమును పెంపొందించుటకు ఉద్దేశింపబడిన జనోపయోగమైన యితర చర్యలను తీసికొనుటయును,

సంపాదకుని సూచన

ఈ విధులు పంచాయతీ అధీనములోనున్న రోడ్ల ప్రక్క పెరుగుచున్నట్టి కాని, నాటబడినట్టి గాని చెట్లకు సంబంధించినవి అగుటచేత, చెట్లవల్లవచ్చు ఆదాయమునకు చెట్లకు, పంచాయతీకిగల హక్కును వివరించు నీ క్రింది విధులను ఇచ్చుట ఉపయుక్తము

యాక్టుయొక్క 112 (2) (xix) వ సెక్షను క్రింద చేయబడిన విధులు.

పంచాయతీల అధీనములోనుండు రోడ్లమీద, పోరంబోకులమీదనున్న చెట్లపైన, వాటినుండివచ్చు ఫలసాయముపైని పంచాయతీలకుగల హక్కు గురించిన విధులు)

(జి ఓ నెం 1547 ఎల్ ఎ తేదీ 6-8-1951)

1 చట్టముయొక్క 56 (1) వ విభాగము ననుసరించి పంచాయతీకి అధీనము చేయబడిన ఏ రహదారి రోడ్డుపైగల చెట్లు (చెట్ల

పన్ను పద్ధతి ననుసరించి మంజూరు చేయబడినవి మినహా) పంచాయతీకి చెందవలెను

అయితే, అట్టి చెట్లయొక్క స్వామ్యము ప్రభుత్వమునకే యుండవలెను

ఇంతేకాకుండా, ప్రభుత్వమువారు పంచాయతీ ఈ విధుల క్రింది తన అధికారములను దుర్వినియోగము గావించినదని తలచునెడల, అట్టి ఏ చెట్టునైనను పంచాయతీయొక్క అధికారమునుండి తీసివేయవచ్చును

2 చట్టముయొక్క 56 (1) వ విభాగము ననుసరించి పంచాయతికి చెందిన ఏ రహదారి రోడ్డుయొక్కయైన ప్రక్కయందు, సదరు రహదారిపై ప్రజలకు గల అధికారమునకు లేక సదరు రోడ్డును అంటియుండు భూములయొక్క ఖామందుల లేక అనుభవదారుల సుఖమునకును సౌకర్యమునకును భంగము కలుగ జేయకుండ, చెట్లను నాటవచ్చును

3 ప్రభుత్వమువారు, చట్టముయొక్క 60 వ సెక్షను (2) వ సబుసెక్షను లేక (4) వ సబుసెక్షను ననుసరించి ఏ పోరంబోకుపైనైన పంచాయతీచే నాటబడిన ఏ చెట్టుయొక్కయైన వుపయోగము పంచాయతీచే క్రమపరుపబడునప్పుడు, దానిని నరకవచ్చును లేక తీసివేయవచ్చును అట్లు నరకబడి తీసివేయబడిన చెట్లకు యెట్టి నష్టపరిహారమను గాని ఇచ్చుటకు ప్రభుత్వమునకు బాధ్యతలేదు నరకబడి తీసివేయబడిన చెట్లను పంచాయతీకి అప్పగించవచ్చును లేక బహిరంగ వేలములో విక్రయించవచ్చును బహిరంగ వేలములో విక్రయించినప్పుడు అట్టి విక్రయముయొక్క రాబడిని పంచాయతీ నిధికి జమకట్టవలెను

4 చట్టముయొక్క 56 (1) వ సెక్షను క్రింద పంచాయతీకి చెందిన ఏ రహదారి రోడ్డుకైన లేక చట్టముయొక్క 60 వ సెక్షను లేక 61 వ సెక్షను క్రింద పంచాయతీచే ఉపయోగము క్రమపరుపబడుచున్న ఏ పోరంబోకుకైన అనుకొనియుండు భూములయొక్క

ఘములందులకు, పండ్ల చెట్లను, అవి కాపుకువచ్చు కాలమువరకును పెంచుటకు లైసెన్సులను మంజూరుచేయుటకు పంచాయతీ అధికారము కలిగియుండవలెను అట్టి పెర్మిట్లు, చెట్లను క్రమముగా పోషించి కాపాడుటకును మరియు తగినట్టి ఇతరషరతులకు మరియు నిర్బంధము లకును అధీనమై వారికి లైసెన్సు నియ్యవచ్చును

5 చట్టముయొక్క 56 (1) వ సెక్షను క్రింద పంచాయతీకి అధీనముచేయబడిన ఏరోడ్డుయొక్క ప్రక్కనగాని లేక చట్టముయొక్క 60 వ సెక్షను (2) లేక (4) వ ఉపసబుసెక్షను క్రింద లేక చట్టము యొక్క 61 (1) (a) సెక్షను క్రింద పంచాయతీచే ఉపయోగము క్రమపరుపబడుచున్న ఏ పోరంబోకులోనైన గల చెట్ల పన్ను పద్ధతి క్రిందివి మినహా, చెట్లయొక్క ఫలసాయము ననుభవించుటకు పంచా యతీ హక్కు కలిగియుండవలెను

6 చట్టముయొక్క 56 (1) వ సెక్షను క్రింద పంచాయ తీకి అధీనముచేయబడిన ఏ రోడ్డుయొక్కయైన ప్రక్కన లేక 5 వ విధిలో చెప్పబడినట్టి ఏ పోరంబోకులలోనైనగల, చెట్లపన్ను పద్ధతి క్రిందివి మినహా చెట్లయొక్క ఫలసాయానుభవహక్కును పంచాయతీ కవులునకు ఇయ్యవచ్చును అట్టి కవుళ్లనుండి పంచాయతీ రాబ డివి పొందుటను హక్కుకలిగియుండవలెను

7 5 వ విధిలో చెప్పబడిన రోడ్డు పక్కలలోగాని పోరంబో కులోగాని గల, చెట్ల పన్ను పద్ధతి క్రింద కవులు కీయబడినవి మినహా ఏ పండ్ల చెట్లనుగాని పంచాయతీ సదరు రోడ్డు ప్రక్కల లేక పోరం బోకులందు గల చెట్లయొక్క ఫలసాయము ననుభవించుటకు హక్కును కలిగి యుండునంతవరకు, పంచాయతీయొక్క సమ్మతిలేకుండా కలెక్టరు చెట్లపన్ను పద్ధతిపై వాటిని కవులు కీయకూడదు

8 (1) పంచాయతీ ఈ క్రింది చెట్లను నరకుటకు లేక వేల ములో విక్రయించుటకు అధికారములను కలిగియుండవలెను —

(a) పండ్ల చెట్లైననుసరే, పండ్లచెట్లు కాకున్నసరే, తుపా నుకు పడినచెట్లు మినహా, గాలికి పడిన మరియు ఎండిపోయిన చెట్లు,

(b) రాకపోకలకు అపాయకరమని లేక ప్రాణమునకు లేక ఆరోగ్యమునకు అపాయకరమని తలంపబడునట్టి రోడ్డు ప్రక్కల బ్రతికియున్న చెట్లు,

(c) మంచినీటి సముదాయమునకుగాను ఉపయోగపడు చిన్న చెరువులయొక్క గట్లమీదనున్న పచ్చని చెట్లు, ఆ చెట్ల యాకులు చెరువులోరాలి ఆ నీటిని త్రాగుటకు యోగ్యము కానట్లు చేయునెడల,

(2) (1) వ ఉప విధి క్రింద చెట్ల విక్రయము క్రింద పొంద బడిన ఆదాయమును పంచాయతీ వినియోగించుకొనవలెను

(3) (1) వ ఉపవిధియొక్క (d) లేక (c) క్లాజు క్రింద పంచాయతీ బ్రతికియున్న చెట్లను నరకుటకు లేక విక్రయించుటకు తలచునెడల, అది రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుయొక్క అనుమతిని పొందవలెను తహశీల్‌దారు స్వయముగా సదరు చెట్లను తనిఖీచేసిన మీదట చేయు రిపోర్టునుబట్టి పై ఆఫీసరు అనుమతిని ఇయ్యవచ్చును

9 పంచాయతీ ఆధీనము చేయబడిన లేక దానికి చెందియున్న రోడ్డు ప్రక్కలగల చెట్లను లేక ఇతర ఆస్తిని అక్రమముగా నరుకుట నుండి లేక తొలగించుటనుండి కాపాడుటకు చర్యతీసుకొనవలెను

సంపాదకుని సూచిక

రోడ్లను పోషించుటకొరకును, రోడ్ల ప్రక్కన మార్గ వృక్షములు నాటుట కొరకును, 4 వ విధి క్రింద అధికారములను పంచాయతీలు తమ ప్రయోజనమునకై, పూర్తిగా వినియోగించవచ్చును పడమటి గోదావరిజిల్లాలోని తణుకు తాలూకా లోని పాలమూరు గ్రామపంచాయతీ అట్లాచరించెనని తెలియుచున్నది ప్రయివేటు వ్యక్తులకు చెట్లపై స్వంత హక్కును లేక అట్టి చెట్లయొక్క ఫలసాయముపై స్వంత హక్కును, యావత్కాలము కలుగజేసే యెట్టి యేర్పాటున్నూ చట్ట విరుద్ధము, మరియు యాక్టు క్రింద రద్దు చేయబడవచ్చును

50, 51 వ సెక్షనులలో, (i) రోడ్లు, (ii) మార్కెట్లు, (iii) సంతలు, వుత్సవములు, (iv) సత్రము, మరియు (v) లైబ్రరీలు (గ్రంథాలయములు) వీటిని జిల్లాబోర్డునకు చెందినవి (అనగా జిల్లారోడ్లు, జిల్లామార్కెట్లు, జిల్లా సంతలు ఉత్సవములు, జిల్లా సత్రములు, జిల్లా లైబ్రరీలు) అనియు, అట్లు చెందక యున్న రోడ్లు, మార్కెట్టులు, సంతలు, ఉత్సవములు, సత్రములు, లైబ్రరీలు, అని సూచింపబడి యున్నవి పంచాయతీ హక్కులు, తేరుపడుట పోషించుట లేక

పరిపాలింపబడులో డిస్ట్రిక్టు బోర్డుకు చెందిన స్థలములపై మాత్రమే మార్కెట్లను, జిల్లా మార్కెట్లుగానూ లేక పంచాయతీ మార్కెట్లుగాను విభజించుటకు ప్రభుత్వమునకు అధికారమున్నది—ఆక్టుయొక్క 86 వ సెక్షను చూడుము రోడ్లను, సంతలను ఉత్సవములను, సత్రములను, మరియు గ్రంథాలయములను విభజించుటకు యిన్స్పెక్టరు జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషనుకు అధికారము యివ్వబడినది తత్సంబంధమయిన విధులను యీ క్రింద వివరించడమయినది

## విధులు

## పబ్లికు రోడ్లు, సంతలు, ఉత్సవములు మొదలైన వాటిని తరగతివారీగా విభజించుట

1 ఏ పంచాయతీ ప్రదేశమునకైనను చెందిన పబ్లిక్ రోడ్లు, సంతలు, ఉత్సవములు, సత్రములు, డిస్పెన్సరీలు గ్రంథాలయములను జిల్లాబోర్డుకు లేక పంచాయితీకి చెందినదిగా విభజనను గురించి,

(I) పబ్లిక్ రోడ్ల సందర్భములో కలెక్టరు మరియు చీఫ్ ఇంజనీర్ (హైవేస్) తో,

(II) సంతలు ఉత్సవములు సందర్భములో పబ్లిక్ హెల్తు డైరెక్టరుతో,

(III) సత్రముల సందర్భములో రెవెన్యూబోర్డుతో,

(IV) ఆధునిక వైద్య శాస్త్రమునకు చెందిన డిస్పెన్సరీల సందర్భములో డైరెక్టరు ఆఫ్ మెడికల్ సర్వీసెస్ తో

(V) ఆధునిక వైద్య శాస్త్రమునకు చెందని తదితర డిస్పెన్సరీల సందర్భములో దేశీయ వైద్యము యొక్క ఆనరరీ డైరెక్టరుతో,

(VI) గ్రంథాలయముల సందర్భములో పబ్లికు గ్రంథాలయముల డైరెక్టరుతో,

సంప్రదించి ఇన్స్పెక్టరు ఉత్తరువు చేయవలెను

2 1 వ విధి క్రింద ఏ విభజన నైనను ఉత్తరువు చేయుటకు పూర్వము సంబంధించిన జిల్లాబోర్డు, పంచాయతీ తమ అభిప్రాయమును తెలుపుటకు న్యాయమైన అవకాశమును ఈయవలెను

3 1వ విధి క్రింద ఇన్స్పెక్టరు ఉత్తరువుచేసిన ఏ తరగతివారి విభజననైనను సవరించుటకు ప్రభుత్వమునకు అధికారముండవలెను

సంపాదకుని సూచిక —

ఏ సంస్థలనయిన పునర్వ్యవస్థ చేయుటకు తగిన కారణములను నిరూపించుచూ, పంచాయతి ఇన్‌స్పెక్టరు జనరలును అట్లు చేయుమని అర్థించవచ్చును

మద్రాసుజిల్లా బోర్డుల యాక్టు, 1920 యొక్క 62 వ సెక్షను క్రింద, యే జిల్లాబోర్డు అయిన, తన అధీనములోనున్న ఆస్తిని పంచాయతీ అధీనము చేయవచ్చును జిల్లాబోర్డు రోడ్లు తమతమ హద్దులలో నెంతమేరకున్నవో, వాటిని తమవశము చేయుచు జిల్లాబోర్డుల నిధులనుండి అవసరమయిన ద్రవ్యము గ్రాంటుగా మంజూరుచేయుమనియు పంచాయతీలు జిల్లాబోర్డులను కోరవచ్చును ఈప్రకారముగానే, పంచాయతీ పర్యవేక్షణలోగాని, మైనగాని వున్నట్టి యే సంస్థయొక్క నిర్వహణనయిన లేక ఏ పనినయిన చేయుట భద్రపఱచుట, లేక యే అధికారము నయిన వినియోగించుట, లేక యే విధినయిన నిర్వర్తించుట ఆ యాక్టుయొక్క 65 వ సెక్షను క్రింద జిల్లాబోర్డు పంచాయతీకి వప్పగించ వచ్చును పంచాయతీ పాఠశాలలను, గ్రంథాలయములను, వాటికి యుచితమయిన గ్రాంటులు యిచ్చిన యెడల వాటి నిర్వహణ పంచాయతీలు తీసుకొనుటకని పంచాయతీలు కోరవచ్చును జిల్లాబోర్డుయొక్క ధనములు హీనదశలో నుండుటచేత, జిల్లాబోర్డు సంస్థలు పంచాయతీల అధికారమునకు పరివర్తన చేయుట ఆ సంస్థలకు క్షేమకరమని నుగువవచ్చును

## 51 వ సెక్షను క్రింద విధులు

## (జి ఓ నెం 125, ఎల్ ఎ తేదీ 22-1-1953)

## వైర్‌లెస్ రిసీవింగు సెట్లను స్థాపించుటకు మరియు పోషించుటకు అగు ఖర్చు

1 ఒకటికంటె ఎక్కువ వైర్‌లెస్ రిసీవింగు సెట్లను స్థాపించుటకు మరియు పోషించుటకు అగు ఏ ఖర్చునుగాని, సంబంధించిన రీజినల్ ఇన్‌స్పెక్టరుగారి లిఖితపూర్వకమైన పూర్వానుమతి లేకుండా ఏ పంచాయితీగాని చేయకూడదు

2 రీజినల్ ఇన్‌స్పెక్టరు 1 వ విధిక్రింద అనుమతి నిచ్చుటకు ముందుగా ఈ క్రిందివాటిని గుర్తించుకొనవలెను—

(i) ఆ గ్రామమందు ఒకటికంటె ఎక్కువ వైర్‌లెస్ రిసీవింగు సెట్లు స్థాపించుటకు మరియు పోషించుటకు నిజమైన అవసరము ఉన్నదా, మరియు

(ii) అదనపు సెట్టును లేక సెట్లను స్థాపించుటకును, పోషించుటకును అగు ఖర్చును భరించుటకు పంచాయతీకి చాలినంత ద్రవ్యమున్నదా

సె 52 ఈ ఆక్టుయొక్క నిబంధనలకును, దాని క్రింద చేయబడిన విధులకును లోబడి రెండు లేక ఎక్కువ పంచాయతీలు, ఉమ్మడి డిస్పెన్సరీలను, శిశు సంరక్షణ కేంద్రములను, నిర్ణయింపబడగల ఇతర విధమైన సంస్థలను స్థాపించి పోషించవచ్చును

52 వ సెక్షనుక్రింద విధులు

(జి ఓ నెం 1116 ఎల్ ఎ తేదీ 4-6-1951)

## రెండు లేక ఎక్కువ పంచాయతీలు పోషించవలసిన సముదాయమైన సంస్థలు

రెండు లేక ఎక్కువ పంచాయతీలు ఈ క్రింది సంస్థలను పొత్తుగా స్థాపించి పోషించవచ్చును —

(1) వ్యవసాయ స్టోరులును, మ్యూజియములును,

(2) వ్యవసాయ పనిముట్లను యంత్రములనుచేయు, మరమ్మతు చేయు కర్మాగారములు,

(3) పశుగణమును అభివృద్ధిచేయుటకు సంస్థలు (ఆబోతులను పోషించుట),

(4) కట్టెలు, కలప, పచ్చియాకుల సరఫరా నిమిత్తము అడవులు లేక అడవి భూములను అభివృద్ధిపరచుటకు సంస్థలు,

(5) ప్రాథమిక పాఠశాలలు లేక హయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలు,

(6) ఆస్పత్రులు, ఆరోగ్యమందిరములు, మరియు

(7) చలిజ్వరము, బోదకాలు వ్యాధులను నిరోధించుటకు కృషి సల్పుసంస్థలు

సంపాదకుని సూచిక

యాక్టుయొక్క 51 వ సెక్షను క్రింద పంచాయతీలు ఒకటితో మరియొకటి కలిసి, జాయింటు కమిటీలుగా వర్తించిన తప్ప, రెండు లేక అంతకెక్కువ పంచాయతీలు యొక్క ఉమ్మడి సంస్థలను క్రమముగా ఉపయోగకరముగాను నిర్వహించుట సాధ్యము కాకపోవచ్చును

సె 53 (1) (a) ఈ ఆక్టు ప్రారంభమైనపుడు గ్రామములోని రిజర్వుచేయని అడవులన్నియు పంచాయతీకి చెందవలెను మరియు అది గ్రామస్థుల లాభముకొరకు పరిపాలింపబడవలెను

(b) అట్లు అప్పచెప్పబడిన ప్రతి అడవి విషయములో కలెక్టరు అట్లు కోరునెడల రెవిన్యూబోర్డుయొక్క అధికారమునకు లోబడి కలెక్టరు అప్పుడప్పుడు, ఈ విషయమున నిర్ణయించగల అద్దెను పంచాయతీ ప్రభుత్వమునకు చెల్లించవలెను

(2) (a) (1) వ సబు సెక్షనుక్రింద ఒక పంచాయతీకి అప్పజెప్పిన ఒక అడవిని క్రమముగా అది పరిపాలించుటలేదని రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు అభిప్రాయపడునెడల ఈ విషయమున నిర్ణయింపబడిన కాలపరిమితి ఏదైననున్నయెడల దానికి మించకుండ ఉత్తరువులో నిర్దేశింపబడగల కాలపరిమితివరకు అట్టి అడవిని పంచాయతీ అధికారమునుండి ఆయన ఉత్తరువుచేయుట మూలముగా ఉపసంహరించవచ్చును.

(b) రెవిన్యూ డివిజనలు ఉద్యోగి అప్పుడప్పుడు ఉత్తరువుద్వారా ఏ సబు క్లాజుక్రింద జారీచేయబడిన ఏ ఉత్తరువులోనైన నిర్దేశింపబడిన కాలపరిమితిని వ్యాప్తిచేయవచ్చును

(c) (a) క్లాజు లేక (b) క్లాజుక్రింద ఒక ఉత్తరువును జారీచేయుటకు పూర్వము అట్లు జారీచేయుటకు వ్యతిరేకముగా కారణమును తెలుపుటకు పంచాయతికి న్యాయమైన అవకాశము నియ్యవలెను

(d) (a) క్లాజు లేక (b) క్లాజుక్రింద ఒక ఉత్తరువు జారీచేయబడిన విషయమున, సంబంధించిన పంచాయతీ, ఉత్తరువు అందచేయబడిన తేదీనుండి మూడు నెలల లోపల దానిమీాద కలెక్టరుకు అపీలు చేసికొనవచ్చును కలెక్టరు ఆ ఉత్తరువును ఖాయపరుచవచ్చును, సవరించవచ్చును, లేక రద్దుపరచ వచ్చును

(3) రెవెన్యూబోర్డువారు, వారి ఇష్టానుసారము ఏ కాలమందైనను, తమంతటతాముగాని దరఖాస్తు పెట్టుకొన్నమీాదటగాని (2) వ సబ్ సెక్షనుక్రింద రెవిన్యూ డివిజనల్ ఉద్యోగిచే లేక

కలెక్టరుచే జారీచేయబడిన ఏ ఉత్తరువుయొక్కయైన రికార్డును అట్టి ఉత్తరువు న్యాయమైనదా లేదా సరియైనదాయని వారు తృప్తిపడుట కొరకు తెప్పించి పరీక్షించవచ్చును మరియు వారు యుక్తమని తలంచు విధమున ఆ విషయము సందర్భమున ఉత్తరువు చేయ వచ్చును.

(4) నిర్ణయింపబడగల విధులకులోబడి, గవర్నమెంటు వారు, రెవిన్యూబోర్డువారు, కలెక్టరు లేదా రెవిన్యూ డివిజనలు ఆఫీసరు, జిల్లాబోర్డు లేక దాని కార్యనిర్వాహక అధికారి లేక ఎవరైన మనిషి లేదా మనుష్యుల సంఘముగాని పంచాయతీకి దాని అంగీ కారముతోను, ఒప్పుకొనబడగల షరతులకు లోబడిన్ని గ్రామము లోపలనైనను సరే వెలుపలనైనను సరే ఈ ఆక్టులో నిబంధింపబడి యున్ననుసరే లేకపోయినను సరే ఎట్టి సంస్థయొక్క నిర్వాహణము నైనను లేదా ఎట్టి పనిని చేయుటనైన లేదా పోషించుటనైన లేదా ఎట్టి అధికారమును చెలాయించుటనైన లేదా ఎట్టి విధిని నెరవేర్చుటనైన పరివర్తన చేయవచ్చును

సెక్షను 52 (2) (a) క్రింద జారీచేయబడిన విధి
(జి ఓ నెం 677, ఎల్ ఎ తేదీ 2-4-1952)

విధి

రిజర్వుచేయని అడవి, పంచాయతీయొక్క అధికారమునుండి ఏ కాలపరిమితిలోపల ఉపసంహరింపబడవచ్చునో ఆ కాలపరిమితి.

రిజర్వుకాని అడవి ఏదైనను పంచాయతీయొక్క పై అధి కారమునుండి 53 (2) సెక్షనుయొక్క (a) క్లాజు క్రింద రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు ఉపసంహరించు కాలపరిమితి సదరు విభాగము యొక్క (b) క్లాజు కింద పొడగింపబడిన కాలపరిమితు లేవైన నున్నయెడల వాటితోచేరి రెండు సంవత్సరములు మించకూడదు

సంపాదకుని సూచిక

ఇది చాలా ముఖ్యమయిన సెక్షను ప్రత్యేకింపబడని (ఫారెస్టు డిపార్టుమెంటు వలన రిజర్వు కాబడని) తమ హద్దులలోని అడవులను పంచాయతీలు ఆధీనము చేసు కొననియెడల, వాటిని వశపర్చుకొని ప్రజోపయోగముకొరకు నిర్వహింపవలెను.

ఈ సెక్షనుయొక్క (4) వ యుపసెక్షను దీర్ఘవ్యాప్తికలగి ఈ సెక్షను క్రింద ఆయకట్టుదారులు కొన్ని గ్రామములలో తమ ఆయకట్టుకు సంబంధించిన నీటి వనరులయొక్క మరియు పంటకాల్వలయొక్క కుడి మరామత్తును పంచాయతీలకు బదిలీచేసి, ఆయకట్టుక్రిందనున్న భూములపై పన్ను విధించుటకు అధికారము పంచాయతీలకు యిచ్చియున్నారు అట్టి పద్ధతులపైననే యీ సబ్ సెక్షనుక్రింద, గ్రామ రైతులు పంటలకు కాపలా రక్షణోపాయములు సమకూర్చుటకుకూడ పంచాయతీకి అధికారము యివ్వవచ్చును

ఈ సబ్ సెక్షను క్రింద పంచాయతీలు గ్రామములోని ఫలసాయమును భద్రపరచుకొనుటకు (నిల్వచేసుకొనుటకు) సగుపాయములు కలుగజేయవచ్చును. తమ యొక్క శ్రేయస్సుకు తమ ఉపయోగార్థము నెలకొల్పబడిన పంచాయతీని పూర్తిగా వినియోగించవలసినదిగా పంచాయతీలు ప్రోత్సహించుట కర్తవ్యము

సె 54 (1) (a) గవర్నమెంటువారి తనిఖీకి లోబడి, రెవిన్యూ బోర్డువారు ప్రకటనను ప్రకటించుట మూలముగా పంచాయతీ యొక్క అంగీకారముతో దానికి, 1817 వ సం॥పు మదరాసు ఎండోమెంట్లు ఎస్టేట్లు రెగ్యులేషనుయొక్క నిబంధనల ననుసరించి, దేని విషయమైన అధికారములను పనులును రెవిన్యూ బోర్డువారికి చెంది యుండునో అట్టి ఏదేని దానధర్మాదాయముయొక్క నిర్వాహణమును పై విచారణను యిచ్చివేయవచ్చును, మరియు అందుమీాదట దాని విషయమున రెవిన్యూ బోర్డువారికి చెందియుండు అధికారములు పనులు అన్నియు సదరు రెగ్యులేషనులో ప్రత్యేకముగా పేర్కొనబడియుండిన నెట్లో అట్లే పంచాయతీకి చెందియుండును మరియు అట్టి ధర్మాదాయమును పంచాయతీ నిర్వహించి పై విచారణ చేయవలెను

(b) రెవిన్యూ బోర్డువారు, ప్రకటనద్వారా, తమంతట తామే (a) క్లాజు ననుసరించి ఒక పంచాయతీకి అప్పజెప్పబడిన యేదేని ధర్మాదాయముయొక్క నిర్వాహణమును, పై విచారణను తిరిగి తీసుకొనవచ్చును మరిన్ని గవర్నమెంటువారు వుత్తరువు చేసినప్పుడు తిరిగి తీసుకొనవలెను మరిన్ని అట్లు తిరిగి తీసుకొనిన మీాదట, సదరు ధర్మాయము విషయమున పంచాయతీకి చెందిన యావత్తు అధికారములను పనులును నిలిచిపోయి అంతము కావలెను.

(2) గవర్నమెంటువారు, ఒక పంచాయతీకి దాని అంగీకారముతో గవర్నమెంటువారిచే లేదా యే యితర అధికారిచేగాని తిరిగి తీసుకొనబడిన ఒక ధర్మ యీనామును అప్పగించవచ్చును అయితే అట్టి యీనామునుండి వచ్చు నికరపు రాబడి అట్టి పంచాయతీయొక్క నిధులు ఏ కార్యము నిమిత్తము వినియోగింపబడవచ్చునో అట్టి యేదేని కార్యమునకు ప్రత్యేకముగా వినియోగించబడవచ్చును మరిన్ని అట్లు చేయబడిన ఎట్టి అప్పగింతనుగాని రద్దుచేయవచ్చును

సె 55 ఒక పంచాయతీయొక్క నిధులు ఏ కార్యము నిమిత్తము వినియోగింపబడవచ్చునో ఆ కార్యముయొక్క అభివృద్ధికి ప్రత్యేకముగా సంబంధించు విరాళములను లేక ట్రస్టులను అది అంగీకరింపవచ్చును

సె 56 (1) జిల్లా రోడ్లు, మరియు జాతీయ లేక రాజ్యమునకు చెందిన రహదారులుగా గవర్నమెంటు వారు నిర్ణయించిన రోడ్లు కాని, ఇతరమైన ఎట్టి గ్రామములోనైన యుండు యావత్తు పబ్లికు రోడ్లను, వాటిప్రక్కలనుండు మనుష్యులునడచు బాటలను, రాళ్లను వాటికి చెందిన యితర వస్తు సామగ్రియును, వాటికై ఏర్పాటు చేయబడిన యావత్తు వర్కులును, సామగ్రియును, యితర వస్తువులును, అట్టి రోడ్డులలోను, వాటి ప్రక్కలలోను లేదా వాటిక్రిందను పంచాయతీ ద్రవ్యముల ఖర్చుతో నిర్మింపబడినదైనను సరే, యితర విధముగా నిర్మింపబడినదైనను సరే, యావత్తు జలదారులును, మురుగు కాల్వలును, డ్రెయినేజి వర్కులును సొరంగములును, తూములును, వాటికిచెందిన యావత్తు వర్కులును వస్తు సామగ్రియును వస్తువులును పంచాయతీ వశమందుండవలెను

(2) గవర్నమెంటు వారు ప్రకటనద్వారా అట్టి ఏ పబ్లిక్ రోడ్డు, మురికి నీటి కాలువ, జలదారి, జలదారి వర్కు, సొరంగము లేక తూమును ఈ ఆక్టుయొక్క అమలునుండి మినహాయించవచ్చును మరియు అట్టి ప్రకటనను సవరించవచ్చును లేక రద్దుచేయవచ్చును

సె 57 ఈ ఆక్టు ననుసరించి ఒక పంచాయతీచే ప్రోగుచేయబడిన యావత్తు చెత్తచెదారమును, మురుగుడును, పెంటయును మరిన్ని యితర పదార్ధమును దానికి చెందియుండవలెను.

సె 58 సాధారణముగా గ్రామ భూమిని లేదా ప్రత్యేక రకపు భూములను లేదా ఒక ప్రత్యేక నీటి పారుదల ఆధారము క్రింది భూములను ఉమ్మడిగా కలిగియున్న గ్రామస్థులను ఆచారమునుబట్టి చెందియుండు లేదా వారి లాభము నిమిత్తము పరిపాలించ బడుచుండిన ఎట్టి ఆస్తిగాని లేదా రాబడిగాని పంచాయతీకి చెందవలెను అట్టి ఏ ఆస్తిగాని లేదా రాబడినైన చెప్పిన గ్రామస్థుల లేదా భూములను కలిగియుండు వారి లాభము నిమిత్తము పంచాయతీచే పరిపాలింపబడవలెను

సంపాదకుని సూచిక —

ఇది పంచాయతీచే గ్రామ ప్రజా శ్రేయస్సు కొరకు వినియోగింప బడవలసిన మరియొక ముఖ్యమయిన సెక్షను అనేక గ్రామములలో గ్రామముయొక్క కొటాము వుంచి, ఫలసాయమును అమ్మటకు తూచునపుడు మితమయిన చార్జి విధించుచున్నట్లు తెలియుచున్నది ఈ సొమ్ము వసూలుచేయు నధికారము కొలుకు కూడ యివ్వబడు చున్నది గ్రామములోని కొందరు పెద్దలు, పెత్తనదారులని పిలువబడుచున్నవారు, వారు యిట్లు వసూలయిన సొమ్మును అనేక గ్రామ కార్యములకు వినియోగించుచున్నారు ఆ కొటాము, ఆ సంస్థను, దానిపై రాబడిని, పంచాయతీ వశము చేయుమని పంచాయతీ పెత్తనదారులను ప్రోత్సహింప వచ్చును ఒక యుత్తమ పంచాయతీ అట్టి సంస్థను వశముచేసుకొనుట నిష్ప్రయోజనము కాదు

సె 59 (1) నిర్ణయించబడగల షరతులకును, పై అధికారమునకును లోబడి గ్రామ నీటిపారుదల పనిని రక్షించుటను పోషించుటను నీటి పారుదల వంతులను నిర్వహించడమును, లేక ఏ నీటిపారుదల వరుకనుండియైన, దానిమీద ఆధారపడియుండు పొలములకు నీటి పంపకమును క్రమపరచుటను ప్రభుత్వమువారు ఏ పంచాయతీకైనను పరివర్తన చేయవచ్చును

(2) నిర్ణయింపబడగల నిర్బంధములకు, తనిఖీకి లోబడి, గ్రామములోని ఏదైన నీటిపారుదల ఆధారము సందర్భములో కుడిమరామతును చేయుటకును నిర్ణయింపబడగల విధముగా సదరు కార్యములకునుగాను అట్టి రేట్లచొప్పున రుసుమును విధించుటకును పంచాయతీకి అధికారముండవలెను

అయితే, ఈ సెక్షనులోనున్న దేదియు, నీటిపారుదల ఆధారము సందర్భములో కుడి మరామతును చేయుటకు పంచాయతీ

తప్పిపోయిన విషయమున 1858 వ సం।పు మదరాసు కంపల్సరీ లేబరు ఆక్టు క్రింద గ్రామములోని ప్రైవేటు నీటిపారుదల ఆధారము యొక్క సందర్భములో గ్రామసంఘము లేక దాని ఏ మెంబర్లయొక్కయైన బాధ్యతనుండి దానిని లేక వారిని నివారణచేసినట్లు భావింప బడకూడదు

59 వ సెక్షను క్రింద విధులు

(జి ఓ నెం 520 ఎల్ ఎ తేదీ 24-3-1951)

(జి ఓ నెం 54, ఎల్ ఎ తేదీ 11-1-1956)

నీటి పారుదల పనులను పంచాయతీలకు పరివర్తన.

ఏ షరతులకు లోబడి ఆక్టుయొక్క 59(1)వ సెక్షనులో నిర్దేశింపబడిన గ్రామ నీటి పారుదలపనులు పంచాయతీలకు పరివర్తన చేయబడవచ్చునో అట్టి షరతులు ఈ క్రింది విధముగా నుండవలెను

(1) ఆయకట్టు దారులలో అత్యధిక సంఖ్యాకులు దానిని కోరిననేతప్ప పరివర్తన చేయబడకూడదు పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటువారి స్వాధీనములోని పనిని పరివర్తనచేయుట ఇరిగేషన్ చీఫ్ ఇంజినీరుతో సంప్రదించిన తర్వాత మాత్రము జరుపవలెను

(2) ఏ గ్రామ నీటి పారుదల పనులైనను పంచాయతీకి పరివర్తనచేయబడిన తేదీనుండి అది దానిని నెరవేర్చుటకు తనస్వంత ఏర్పాట్లను చేసికొనవలెను మరియు అవసరమైన పక్షమున దాని స్వంత సిబ్బందిని నియమించవలెను అట్టి పనులను నెరవేర్చుటలో ప్రభుత్వమువారిచే నియమింపబడిన సెర్వంటీలు ఎవరైననున్న వారి మీదగూడ పంచాయతీ సాధారణ అధికారము కలిగియుండవలెను అయినప్పటికిని రెవిన్యూ డిపార్టుమెంటువారికి నియమించు, శిక్షించి, బర్తరఫ్ చేయు అధికారము నిలిచియుండవలెను

(3) నీటి పారుదల పనికిచెందిన గ్రామములోని భూములకు ఏ విధముగా ఏ క్రమములో నీటి పారుదల చేయవలయునో దానిని నీటి సరఫరా ప్రారంభము కావలసిన కాలమును, నీటి సరఫరా కావలసియుండు కాలపరిమితిని సరఫరా చేయవలసిన నీటి

మొత్తము పరిమాణమును క్రమపరుచుటకు పంచాయతీ అధికారము కలిగియుండవలెను అయితే పంచాయతీ తన క్రమపరుచు అధికారమును చెలాయించునప్పుడు, యితరులకంటె ముందుగాగాని, దామాషాను బట్టిగాని నీటి సరఫరా చేయుబడుటకు, సుస్థాపితమైన లేక మామూలైన అధికార మేదైనను వుండిన యెడల అట్టి అధికారమునకు భంగముకాకుండా, తన క్రమపరుచు అధికారమును చెలాయించవలెను

(4) పంచాయతీ నీటిపారుదల పనులయొక్క తూములలో ఎట్టిమార్పులనుగాని చేయకూడదు లేక అట్టి పనియొక్క సందర్భములో చెరువు పునర్నిర్మాణ ప్రణాళికకు చెందిన రికార్డులలో వ్రాయబడియున్న ప్రమాణము మరియు వివరణములలో జోక్యము కలిగించుకొనకూడదు లేక ఆనకట్టలు, లేక కళంగులను ఎత్తు చేయకూడదు తగ్గించకూడదు లేక వ్యాప్తిచేయకూడదు, లేక కాలువలయొక్క హెడ్ వర్కులు యేదైన వున్నయెడల వాటిలో యెట్టి పెద్ద మార్పునైనను చేయకూడదు లేక వాటితో జోక్యము కలిగించుకొనకూడదు,

(5) పంచాయతీ వర్షాకాలమందు నీటిపారుదల పనియొక్క కట్టమీద కావలి ఉంచుటకు బాధ్యులైయుండవలెను

(6) దుర్వినియోగమువలన లేక చేయవలసిన కార్యమును చేయికపోవుటవలన కలిగిన నీటిపారుదల పనియొక్క భాగముగానుండు లేక దానికి సంబంధించిన తూములు ఆనకట్టలు, కలింగలు, పిల్ల కాలువలు, హెడ్డు వర్కులు, కట్ట లేక ఇతర పనులకు సంభవించిన ఏ నష్టమునైన పంచాయతి భర్తీచేయవలెను నష్టము యొక్క ఏ నిర్దిష్టమైన భాగముగాని పంచాయతీయొక్క దుర్వినియోగము లేక చేయవలసినకార్యము చేయకపోవుటవలన కలిగిన ఫలితమాయని జిల్లాకలెక్టరు చేసినతీర్పు ఆఖరైనదిగా నుండవలెను

(7) నీటి పారుదల పనియొక్క కట్టయొక్క అడుగు భాగమున కిరువైపుల ముప్పది అడుగులలోపల పంచాయతీ ఏ కార్యము కొరకైన ఏ కాలమందైనను గోతులు త్రవ్వకూడదు

(8) ఒక పంచాయతికి పరివర్తన చేయబడిన ఒక గ్రామ నీటిపారుదల పని సందర్భములో ఏ పనినైన ఎట్టి కార్యముకాని తెలుపకయే ఏ సమయమందైనను ప్రభుత్వమువారు లేక ఆక్టుయొక్క 127వ సెక్షను క్రింద అధికారము అప్పగించబడిన అధికారి మరల తీసుకొన వచ్చును.

(9) పంచాయతీపై షరతులన్నియు పూర్తిగా నెరవేర్చినది లేనిది కనుగొనుటకు, అసిస్టెంట్ యింజనీరుకంటె తక్కువ హోదాలోలేని పబ్లికువర్కు్స డిపార్టుమెంటుయొక్క ఉద్యోగి వొకరు ఈ నీటిపారుదల పనులను కనిసము సంవత్సరమున కొకమారు అయిన పరీక్షించవలెను

సె 59 (2) క్రింద, కుడిమరామతు చేయుటలో, అక్టులు షరతులు సూచిస్తూ చేసిన విధులు

(జి ఓ. నెం 1551 ఎల్ - తేదీ 6-8-1951)

1 ఏదైన ఇర్రిగేషను నీటిపారుదలపని పంచాయితీక రక్షణ పోషణలకై ఇవ్వబడిన, సదరు నీటి పారుదల క్రింద రిజిష్టరు కాబడిన భూస్వాములపై పంచాయతీ, జిల్లా కలెక్టరు వారి నిర్ణయము ప్రకారము రుసుము విధించ వచ్చును

సదరు రుసుము ప్రత్యేక పారుదలద్వారా నీటిని పొందు, మెట్ట మాగాణి భూములపై యకరమునకు ఒకే రేటు చొప్పున విధించ వచ్చును మరియు, నీరు ఎత్తు భూములకు, చెందజేయు సందర్భమున సదరు భూములపై, పైజెప్పిన రేటుకు సగము విధించవచ్చును.

వివరము—

సదరు రుసుము మాగాణి లేక మెరక భూములపై, నీటి రేటుతో సహా సర్కారు విధించిన రెవిన్యూ (సెస్ మొం॥) కు హెచ్చుగా (అనగా సదరు రెవిన్యూ చెల్లించవలెను మరియు యీ రుసుమును చెల్లించవలెను) యుండును

2 ఈ రుసుము గ్రామమునసబు ద్వారా వసూలు చేయించవలెను. సదరు గ్రామ మునసబు పంచాయతీ గ్రామము లేక దాని

భాగముపై నధికారముండ వచ్చును రుసుమునుండి వచ్చిన పైకము కలక్టరు వారిచ్చిన సాధారణ ఉత్తరువులు లేక ప్రత్యేక వుత్తరువులు మేరకు ఉపయోగించ వలెను సదరు రుసుముల జాబితా (అనగా ఎవరెవ రెంత నీయవలసినదో చూపించుచూ, తయారుచేసిన డిమాండుపట్టీ) కరణం తయారుచేసి మునసబున కివ్వవలెను మునసబు ఆ ప్రకారము వసూలు చేయవలెను అట్లు వసూలు చేసినందుకు, మద్రాసు గ్రామపంచాయతీ ఆక్టు 1950, సెక్షను 69 క్రింద కలక్టరు నిర్ణయించిన మేరకు, బత్తెము మునసబున కివ్వ వలెను

3 ఆ రుసుము, డిమాండు చేయగానే, రిజిష్టరు చేయబడిన భూస్వామి, లేక జాయింటుగా రిజిష్టరు చేయబడిన భూస్వాములలో నెవరో యొకరు, చెల్లించ వలెను అట్లు చెల్లించనిచో, ల్యాండు రెవిన్యూ బాకీలవలె, ఆ రుసుము బాకీ బలిష్ఠముగ రాబట్టుకొన బడును

4 ఈ రుసుమునుండి వచ్చిన పైకము ప్రత్యేకనిధిగా నుంచ వలెను సదరు నిధినుండి, పంచాయతీ తన నిర్ణయము మేరకు, నీటి పారుదల పనియొక్క మరామతులకు, పోషణకు ఖర్చుపెట్టవచ్చును మరి యేయితర పనులకు నుపయోగించ కూడదు

5 ఈ నిధికిగాను సరియైన అక్కౌంట్లు (అనగా జమాఖర్చులు మొదలగు లెక్కలు) ఉంచవలెను సదరు అక్కౌంట్లు, సెక్షను 74 (1) క్రింద నియమింపబడిన ఆడిటరుచే తనిఖీ చేయబడును

6 పంచాయతీకి స్వాధీనములో నుంచబడిన నీటి పారుదల పనులను తనిఖీ చేయుటకు రెవిన్యూ, పబ్లికు వర్కుల శాఖాధికార్లకు పంచాయతీ అనుమతించ వలెను

7 సదరు పనుల మరామతుకుగాను రెవిన్యూ లేక పబ్లికు వర్క్సు డిపార్టుమెంటువారు నిర్ణయించిన కంట్రాక్టరులకు, ఎల్ల వేళలందు తను పనిచేయుటకు ఉపకరణములు కలుగ జేయవలెను

సె 60 (1) ఈ సెక్షనుయొక్క నిబంధనలు రైతువారీ ప్రదేశములలో మాత్రము వర్తించవలెను

(2) నిర్ణయింపబడగల నిర్బంధములకును, పై అధికారము నకు లోబడి ఈ క్రింది పోరంబోకులను అనగా, పచ్చికబైళ్లు, కళ్ళములు, శవములను పూడ్చు కాల్చుస్థలములు, పశువుల దొడ్లు, బండ్ల దొడ్లు, తోపుల ఉపయోగములను క్రమపరచుటకు పంచాయతీ అధికారమును కలిగియుండవలెను అయితే ఆ పోరంబోకులు గవర్నమెంటువారి స్వాధీనములో నుండవలెను

(3) పంచాయతీతో ఆలోచించినమీదట కలెక్టరు ప్రకటనద్వారా, (2) వ సబు సెక్షనులో చెప్పబడిన ఏ పోరంబోకును గాని, ఈ ఆక్టు వర్తించకుండ మినహాయించవచ్చును మరియు అట్టి ప్రకటనను సవరించవచ్చును లేక రద్దుచేయవచ్చును

(4) నిర్ణయింపబడగల నిర్బంధములకును, పై అధికారమునకును లోబడి గవర్నమెంటువారి ఉత్తరువుచే ఆ విషయమున పంచాయతీకి అధికారమియ్యబడిన పక్షమున, గవర్నమెంటువారి స్వాధీనములోనుండు ఏ యితర పోరంబోకుయొక్కయైన ప్రయోగమును క్రమపరచుటకుకూడ పంచాయతీ అధికారమును కలిగియుండవలెను

(5) నిర్ణయింపబడగల నిర్బంధములకును, పై అధికారములకును లోబడి, దేనియొక్క ఉపయోగము (2) వ సబు సెక్షను లేక (4) వ సబు సెక్షను ననుసరించి పంచాయతిచే క్రమపరిచబడునో అట్టి ఏ పోరంబోకులోనైన చెట్లను వేయవచ్చును

60 వ సెక్షను క్రింది జారీచేయబడిన విధులు

(జి ఓ నెం 677, ఎల్ ఎ తేదీ 2-4-1952)

(సెక్షను 60 (2) (4) మరియు (5) క్రింద విధులు)

పోరంబోకుల నుపయోగించుటను క్రమపరచుటకైన నిర్బంధములు మరియు పై అధికారము

1 ప్రభుత్వమువారి యధీనమందుండి, దాని ప్రయోగము పంచాయతీచే క్రమపరచబడుచున్న ఏ పోరంబోకైనను-

(1) అది ఆక్టుయొక్క 60 (2) వ విభాగమందు పేర్కొనబడినట్టి పోరంబోకైనచో కలెక్టరుయొక్క, మరియు

(2) అది ఆక్టుయొక్క 60 (4) వ విభాగములో పేర్కొన బడిన పోరంబోకైనచో ప్రభుత్వముయొక్క అనుమతితో తప్ప, అది ప్రారంభమున ఏకార్యము నిమిత్తమై ఉద్దేశింపబడినదో ఆ కార్యమునకు కాక యితరమైన ఏ కార్యమునకుగాని ఉపయోగింపబడకూడదు

2 (1) ఆక్టుయొక్క 60 (2) వ విభాగములో చెప్పబడిన ఒక పోరంబోకు, అది ప్రారంభమున ఏకార్యము నిమిత్తమై ఉద్దేశింపబడినదో ఆ కార్యమున కది అవసరముకాదనియు, అది నిర్దిష్టమైన ఏ యితర సాముదాయక ప్రయోజనమునకైనను ఉపయోగింపబడ వచ్చుననియు పంచాయతీ అభిప్రాయపడునెడల, ఆ భూమి ఏ గ్రామములోకలదో ఆ గ్రామమందొక నోటీసు ప్రకటింపబడునట్లు చేయవలెను ఆ నోటీసులో ఆ భూమియొక్క సర్వేనెంబరును, అది ఏ కార్యమునిమిత్తము అవసరమైయున్నదో ఆ కార్యమును నిర్దిష్టము చేయవలెను సదరు ఉద్దేశమునకు ఆక్షేపణలను నిర్దిష్టమగు తేదీలోపల పంపవలెనని అందుకోరవలెను ఈ తేదీ నోటీసు ప్రకటింపబడిన తేదీ నుండి 30 దినములకు తక్కువకాకుండ నుండవలెను ఈ నోటీసును దండోరా వేయించుట మూలమునను, పంచాయతీయొక్క కార్యాలయమువున్న భవనమునందు ప్రాముఖ్యమైన ఏదో ఒక భాగమందు అంటించుట మూలమును ప్రకటించవలెను

(2) ఆక్షేపణలను స్వీకరించుటకైన తేదీ నిర్ణయింపబడిన మీదట పంచాయతీ దాని ప్రతిపాదనను, దాని విషయమైవచ్చు ఆక్షేపణలతో సహా, యుక్తమని భావింపబడు వుత్తరువులను జారీ చేయుటకుగాను కలెక్టరుకు పంపవలెను

3 ఆక్టుయొక్క 60 (4) వ విభాగమందు పేర్కొనబడిన పోరంబోకును ఉపయోగించుటను పంచాయతీ క్రమపరచ నిచ్ఛగించునెడల అది కలెక్టరుకు దరఖాస్తు పెట్టుకొనవచ్చును ఆ విషయమునుగూర్చిన తీర్మానముయొక్క నకలును దానితో పంపవలెను ఆ తీర్మానమందు (a) పోరంబోకుయొక్క సర్వేనెంబరు లేక నెంబర్లు దాని ఎల్లలు మరియు విస్తీర్ణమును, (b) పోరంబోకు ఏ ప్రయోజనము నిమిత్తము వుపయోగింపబడుచున్నదో ఆ ప్రయోజనమును,

మరియు (c) అందు చెట్లేవైననున్నచో వాటి జాబితాను, వివరములు-నిర్దిష్టము చేయవలెను పోరంబోకు ప్రభుత్వము వారి యధీనమందున్న దనియున్న సదరు తీర్మానమందు నిర్దిష్టము చేయబడిన వివరములు సరియైనవనియును కలెక్టరు తృప్తిచెందిన మీదట, దానిని ఆయన తన వరాలతో కూడ రెవిన్యూబోర్డుకు పంపవలెను బోర్డువారందుమీదట, వారి సిఫారసులతో పాటు ఆ కాగితములను ప్రభుత్వమునకు పంపవలెను

4 ఆక్టుయొక్క 60 (2) మరియు (4) వ విభాగము ననుసరించి పంచాయతీచే ఏ పోరంబోకుల వుపయోగము క్రమపరుపబడుచున్నదో ఆ పోరంబోకుల జాబితాను (సర్వేనెంబర్లు, ఎల్లలు, విస్తీర్ణము, ప్రతి పోరంబోకు ఏ ప్రయోజనము నిమిత్తము వుపయోగింపబడుచున్నదో ఆ ప్రయోజనము, ఆ పోరంబోకుయందున్న చెట్లను గూర్చిన వివరములతో సహా) వ్రాసియుంచవలెను

5 ఏ పోరంబోకుయొక్క వుపయోగము పంచాయతిచే క్రమపరుపబడుచున్నదో ఆ పోరంబోకును, దేనినైన గ్రామ మునసబు, కరణము మరియు రెవిన్యూ డిపార్టుమెంటుకు చెందిన ఏ తనిఖీచేయు వుద్యోగియైనను ఎప్పుడైనను తనిఖీ చేయుటకు పంచాయతి అనుమతించవలెను

6 ఏ పోరంబోకునైనను వుపయోగించుకొని నందుకు కలెక్టరుచే ఆమోదింపబడిన రేట్ల ననుసూచి ననుసరించి పంచాయతీ రుసుమును విధించవచ్చును

7 పంచాయతి, నూతులు కళ్ళములను, బండ్లదొడ్లను, పశువుల శాలలను, దహన మరియు ఖనన భూములను పరిశుభ్రముగనుంచవలెను ఈ విషయమును గురించి జిల్లా ఆరోగ్య శాఖాధికారి ఏ ఆజ్ఞలనైన నిచ్చునెడల వాటిని నెరవేర్చవలెను

8 పంచాయతి తోపులను మంచి దశయందుంచుటకును, గాలికి పడిపోయిన, ఎండిపోయిన లేక చనిపోయిన చెట్లస్థానే క్రొత్త చెట్లను నాటుటకును చర్యలన్నింటిని తీసికొనవలెను

9 తగిన షరతులకు లోబడి పంచాయతీ తోపులను ఇజారా కియ్యవలెను మరియు సదరు తోపులలోని చెట్ల ఫలసాయమునుండి వచ్చు రాబడిని అనుభవించవలెను

10 ఆక్టుయొక్క 112 (2) (XXX) వ విభాగము క్రింద చేయబడిన విధులు, ఏ పోరంబోకుయొక్క వుపయోగము పంచాయతీచే క్రమ పరుపబడుచున్నదో అట్టి ఏ పోరంబోకులోనైననున్న చెట్లను పంచాయతీ ఇజారా కిచ్చుట, నరకుట, నాటుటకు వర్తించవలెను

11 ఏ పోరంబోకుయొక్క వుపయోగము పంచాయతీచే క్రమ పరుపబడుచున్నదో అట్టి ఏ పోరంబోకు యొక్కనైన దురాక్రమణలను తొలగించుటకు పంచాయతీ చర్యతీసికోనవలెను పంచాయతీ అట్లు చేయుటకు వుపేక్షించినయెడల, సదరు దురాక్రమణ కనుగొనబడిన తేదీనుండి మూడు నెలలు గతించినమీదట రెవిన్యూడివిజనల్ ఆఫీసరు, ఆయన ఆక్షేపణీయమని భావించునట్టి దురాక్రమణలను తొలగించవలెనని వుత్తర్వు చేయుటకు అధికారము కలిగియుండవలెను రెవిన్యూ డివిజనలు ఆఫీసరుయొక్క అట్టి ఏ వుత్తరువుపైన కలెక్టరుకు అప్పీలుండవలెను ఒక దురాక్రమణ ఆక్షేపణీయమైనదా, కాదా అనుదానిపై కలెక్టరుయొక్క నిర్ణయము ఆఖరైనదిగా నుండవలెను

సంపాదకుని సూచిక

4 వ విధిలో సుదవారింపబడిన విరములతో, పోరంబోకులయొక్క రిజిష్టరుకు పంచాయతీ యుంచుట చాల ముఖ్యము

సె 61 (1) 1908 వ సం॥పు మదరాసు ఎస్టేట్ల భూమిఆక్టుచే పరిపాలింపబడు ఎస్టేట్లలో, ఆ యాక్టులో ఏదియున్నను దానితో నిమిత్తము లేకుండ నిర్ణయింపబడగల నిర్బంధములకును పై ఆధికారమునకును లోబడి—

(a) సదరు ఆక్టుయొక్క 3 వ సెక్షను (16) వ క్లాజు (b) సబ్ క్లాజులో చెప్పబడిన కార్యములలో దేని నిమిత్తముగాని ప్రత్యేకించబడిన భూములను అనగా కళ్లములు, పశువులదొడ్లు గ్రామ

వర్తిములు గ్రామస్థుల వుమ్మడి వుపయోగమునకు ప్రత్యేకించబడిన గ్రామములోనుండు యితర భూములు ఉపయోగమును క్రమపరచుటకు,

(b) సదరు ఆక్టుయొక్క 20-A సెక్షనుచే జిల్లాకలెక్టరుకు కలుగజేయబడిన అధికారమును చెలాయించుటకు అనగా, దాని అసలు కార్యము నిమిత్తము ఇకమీాద అవసరముగా నుండని (a) క్లాజులో చెప్పబడిన ఏ భూమిగాని నిర్దిష్టము చేయబడిన ఏ ఇతర సాముదాయక కార్యము నిమిత్తమైనను ఉపయోగించబడవలెనని ఆజ్ఞాపించుటకు, అయితే దాని నిమిత్తము జిల్లా కలెక్టరుయొక్క అనుమతిని పొందవలెను, మరియు ,

(c) ఏ భూమియొక్క ఉపయోగము (a) క్లాజు ననుసరించి పంచాయతీచే క్రమపరచబడునో అట్టి ఏ భూమిలోగాని చెట్లు వేయుటకు,

పంచాయతీ అధికారమును కలిగియుండవలెను

(d) క్లాజులో నున్న తేదీయును, సదరు 20-A సెక్షను యొక్క (1) వ సబుసెక్షను తాలూకు మినహాయింపు నిబంధనలు వర్తించుటను ఏ విధముగాగాని బాధించునట్లు భావింపబడకూడదు

(2) 1908 వ సం॥పు మదరాసు ఎస్టేట్లభూమి ఆక్టుచే పరిపాలింపబడుటకు 1 వ ఒక ఎస్టేటు నిలిచిపోయినతర్వాత, (1) వ సబుసెక్షనుయొక్క నిబంధనలు, నిర్ణయింపబడగల మేరకును, అట్టి సవరణలతోను ఆ సబ్ సెక్షనులో చెప్పబడిన భూములకు వర్తించవలెను

సంపాదకుని సూచిక

మద్రాసు ఎస్టేట్సు ల్యాండు యాక్టుయొక్క 20-A(1) వ సెక్షనులోని రెండు విధాయకములలో (ప్రొవిసోలు), ఆ యాక్టుయొక్క 20-A(1) వ సెక్షనుక్రింద కలెక్టరుచే స్వీకరించబడవలసి యుండు ఏవి యైనవో వక్కాణింపబడియున్నది కుప్ప పోయు స్థలములపైన (పశువులు నిలబడు స్థలములపైన, గ్రామ నివేశనములపైన గ్రామ పరిసరములపైన) మరియు గ్రామస్థులయొక్క సాముదాయక యుపయోగార్థమై ప్రత్యేకింపబడిన యితర స్థలములపైన భూస్వాములకుగాని, రైతులకుగాని ఏవయిన వాడుక హక్కులున్నయెడల, వాటిని అతి యుచితరీతిని పరిగణింపవలెనని, ఒకటవ విధాయకములో (ప్రొవిసోలో) నిర్దేశింపబడినది మద్రాసు గ్రామపంచాయతీలయాక్టు యొక్క 61(1)(b) వ సెక్షనుక్రింద కలెక్టరు ఈ భూములను గ్రామస్థుల యితర

సాముదాయక యుపయోగార్థము అనుమతించుటకు పూర్వము, అట్టి వాడుక హక్కుల విషయమును నిస్సందేహముగ విచారణ చేయును మద్రాసు ఎస్టేట్సు ల్యాండు యాక్టుయొక్క 21-A(1) వ సెక్షనులోని రెండవ (ప్రొవిసో) విధాయకము, చెరువు గర్భములకు టాంకు బెడ్లు చెరువుగట్లనె, మరియు, వ్యవసాయమునకు అవసరమైన నీరు పారునట్టి, మురుగునీరు పారునట్టి, పోస్తైన నీరుపారునట్టి, కాల్వలున్న భూములను చెందియున్నవి ఈ భూములేవియు యీ యాక్టు 61 వ సెక్షను క్రిందికి రావు.

మద్రాసు గ్రామపంచాయతీల యాక్టుయొక్క 61 వ సెక్షను క్రింద చెయ్యబడిన విధులు

(జి ఓ నెం 677 లోకల్ అడ్మినిస్ట్రేషన్ తేదీ 2-4-1952)

విధులు

ఎస్టేట్లలోని సాముదాయక భూములను పంచాయతీ ఉపయోగించుకొనుటకు క్రమపరచుట—నిర్బంధములు, అధికారము—

1 ఆక్టుయొక్క 60 వ సెక్షనులోని (2) వ సబ్ సెక్షను ననుసరించి ఏర్పరుపబడిన విధులు అవసరమైన మార్పులతో, ఆక్టుయొక్క 61 (1) (a) సెక్షనునందు తెలుపబడిన భూముల ఉపయోగమును క్రమపరచుటకు వర్తించవలెను

2 61 (1) (a) సెక్షను ననుసరించి ఏ భూమి సందర్భములోగాని యియ్యబడిన అధికారములను చెలాయించుటలో అట్టి భూమి విషయములో భూమి స్వాధీనదారునకు ఉత్తరాధికారపుహక్కు ఏదైన నున్నయెడల, ఆ హక్కును మరియు ఆ భూమి గ్రామ కంఠమైన పక్షమున, గ్రామస్తులు న్యాయసమ్మతమైన ఏకార్యమునకుగాని అందరు వాడుకొను భాగములో లేని ఖాళీస్థలమును దేనినైన ఇంటి స్థలముగ నిచ్చుటకు ఆయనకు గల హక్కును బాధించునట్టి ఏ పనిని గాని చేయకూడదు

3 ఏ భూమియైన 1908 వ సం॥రపు మదరాసు ఎస్టేట్ల భూమి ఆక్టుయొక్క 3 వ సెక్షను (16) వ క్లాజు (b) ఉపక్లాజు తెలుపబడిన వివరములు గలదియా కాదా యను ప్రశ్నయైన కలిగినప్పుడు, సదరు ప్రశ్న 1908 వ సం॥పు మదరాసు ఎస్టేట్ల భూమి

ఆక్టుయొక్క 20 వ విభాగము ననుసరించి పరిష్కరింపబడువరకు, పంచాయతీ 1950 వ సం॥పు మదరాసు గ్రామపంచాయతీ ఆక్టుయొక్క 61 (1) (a) సెక్షను క్రింద ఆ భూమి సందర్భములో అధికారములను చెలాయించకూడదు

4 ఆక్టుయొక్క 61 (1) (a) సెక్షను క్రింద తీసికొనబడిన ఏ చర్యయైనను జిల్లా కలెక్టరుయొక్క పై అధికారమునకు లోబడి యుండవలెను

5 (1) ఒక పంచాయతీ స్వయముగాగాని, దాని హద్దులలోపల నివసించు వ్యక్తులలో ఎవరైనను విన్నవించుకొన్న మీదటగాని 1908 వ సం॥పు మదరాసు ఎస్టేట్ల భూమి ఆక్టుయొక్క 3 వ సెక్షను (16) వ క్లాజు (b) ఉపక్లాజులో తెలుపబడిన ఏ కార్యము నిమిత్తమైన కేటాయించబడిన ఏ భూమియైన ఆ కార్యము నిమిత్తము యింక మీదట అవసరమై యుండదనియు, అది నిర్దిష్టమైన ఏ యితర నాము దాయక కార్యమునకైనను ఉపయోగింపబడవలెనని ఆజ్ఞాపించుచు 1950 వ సం॥రపు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టుయొక్క 61 (1) (b) సెక్షను క్రింద ఒక ఉత్తరువును జారీచేయుటకు జిల్లా కలెక్టరుయొక్క మంజూరును పొందవలెననియు, తలంచునెడల సదరు ఉద్దేశింపబడిన ఉత్తరువుకైన ఆక్షేపణలను నిర్దిష్టమగు తేదీలోపల పంపవలెనని కోరుచు సదరు భూమి ఉన్న గ్రామమందొక నోటీసును ప్రకటించవలెను ఆ నోటీసు దండోరా వేయించుట మూలమునను, పంచాయితి ఆఫీసు వున్నట్టి భవనమందు అతికించుట మూలమునను ప్రకటించవలెను నిర్దిష్టమగు సదరు తేదీ ఈ నోటిసు ప్రకటింప బడిన తేదీనుండి 30 దినములకు తక్కువ గాకుండ నుండవలెను ఆక్షేపణలు ఎప్పుడు మరియు ఏ తేదీన విచారింపబడునో కూడ నోటీసులో నిర్దిష్టము చేయవలెను నోటీసుయొక్క నకలొకదానిని భూమి అధీనదారుకు స్వయముగాగాని, తిరుగురసీదుతో కూడిన రిజిష్టరు పోస్టుద్వారాగాని పంపవలెను ఆక్షేపణలను దాఖలు చేసి కొనుటకుగాని ఈ నోటీసు అందజేయబడిన తేదీనుండి 30 దినముల గడువు నియ్యవలెను

(2) (1) వ సబు సెక్షను క్రింద విచారణకైన తేదీ, ఆక్షేపణలను దాఖలు చేసుకొనుటకు అనుమతింపబడిన గడువు గతించు తేదీనుండి పదునైదు దినములుగ నుండవలెను

(3) (1) వ ఉపవిధిలో నిర్ణయింపబడిన తేదీనగాని, అంతకు పూర్వముగాని అందిన ఆక్షేపణల నన్నింటిని పంచాయతీ విచారణ చేయవలెను అట్లు చేయునప్పుడు, అర్జీదారులు వారి యాక్షేపణలను ఋజువు పరచుటకుగాను వాఙ్మూలమైనట్టియు, లిఖిత పూర్వకమైనట్టి సాక్ష్యముల రెండింటిని హాజరుపరుచుటకు న్యాయమగు నవకాశము వారికి నియ్యవలెను

6 విచారణ పూర్తియైనమీదట, ఆక్షేపణలను త్రోసిపుచ్చవలెననియు, 61 (1) (b) విభాగము క్రింద అనుజ్ఞ యవసరమనియు పంచాయతీ నిశ్చయించునెడల, అట్లు ఒక నిర్ణయమును రికార్డు చేయవలెను దానిలో అందుకైన కారణములను పూర్తిగ తెలుపవలెను జిల్లా కలెక్టరు ఉత్తరువును సాదరు చేయుటకుగాను ఆయనకు ఒక దరఖాస్తును దాఖలు చేసికొనవలెను దానితోపాటు (i) దాని నిర్ణయముల యొక్క నకలును, (ii) 5 వ విధియొక్క (1) వ ఉపవిధిలో తెలుపబడిన నోటీసులు అందచేయబడుటను, జారీచేయబడుటను నిరూపించుటకైన దస్తావేజులతో సహా విచారణయొక్క రికార్డులను, (iii) అట్టి భూమిని లేక అందలి భాగమును ఉపయోగించుటలో భూమి అక్షీనదారునియొక్క లేక రైతులయొక్క ఇతర సాధారణ హక్కులన్నియు విచారణలోనికి తీసుకొనబడెననియు, అట్టి ఉత్తరువు నియ్యబడినచో సదరు అధికారములను చెలాయించుటకు తగునంతగ వేరు విధముగ నిబంధింపబడునని అది తృప్తిచెందెననియు తెలుపు ఒక సర్టిఫికేటును పంపవలెను

7 అట్టి ఒక దరఖాస్తు అందినమీదట జిల్లా కలెక్టరు, ఆయన తగునని భావించు విచారణను జరిపిన పిమ్మట, 1908 వ సం॥పు మదరాసు ఎస్టేట్ల భూమి ఆక్టుయొక్క 20-A సెక్షను (1) వ సబుసెక్షను (a) క్లాజు ననుసరించి ఒక ప్రకటనను జారీచేయవలెను దానిలో సదరు భూమి దాని అసలు కార్యమునకు యికమీదట అవసరము గాదని

తెలుపవలెను అది దరఖాస్తులో నిర్దిష్టమైన కార్యము నిమిత్తము వుపయోగింపబడవలెనని ఆజ్ఞాపించు మ 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టుయొక్క 61 (1) (b) వ సెక్షను క్రింద ఒక వుత్తరువును జారీచేయుటకు ఆయన పంచాయతీకి అనుమతి నొసంగవలెను పంచాయతీ అందుమీదట అట్టి వుత్తరువు జారీ చేయవలెను.

జిల్లా కలెక్టరు పంచాయతీతో ఏకీభవించనియెడల, ఆయన అట్లు ఏకీభవించనందులకైన కారణము రికార్డు చేయవలెను మరియు ఆయన సదరు దరఖాస్తును నిరాకరించి, తన వుత్తరువుయొక్క నకలొక దానిని పంచాయతీకి పంపవలెను

8 ఆక్టుయొక్క 112 (2) (XXX) వ విభాగము క్రింద చేయబడిన విధులు,* ఈ విధులకై పుట 293 చూడుడు ఆక్టుయొక్క 61 (1) (a) వ విభాగములో తెలుపబడిన భూములపై చెట్లనునాటుటను క్రమపరచుటకు అవసరమైన మార్పులతో వర్తించవలెను.

సె 62 ఈ ఆక్టుచే లేక దానిక్రింద చేయబడిన ఏ విధులచేనైన సంపాదించుటకు ఏ పంచాయతీకైనను అధికారము కలిగియుండు ఎట్టి స్థిరాస్థియైనను 1894 వ సం॥పు భూ సంపాదన ఆక్టుయొక్క నిబంధనల ననుసరించి సంపాదింపబడవచ్చును మరియు అట్టి ఆస్తి విషయములోను దానిని సంపాదించుటయందు తగిలిన ఇతర ఖర్చుల విషయములోను సదరు ఆక్టు ననుసరించి ఈయబడు పరిహార ద్రవ్యము చెల్లించినమీదట సదరు ఆస్తి పంచాయతీ వశమై యుండవలెను

4 వ అధ్యాయము—పన్ను విధింపును ద్రవ్యమును

63 (1) (a) ప్రతి పంచాయతీయును గ్రామములో ఇంటిపన్ను, వృత్తిపన్నును, విధించవలెను

(b) ఏ పంచాయతీయైన బండ్లపన్నును విధించవచ్చును

(2) 67 వ సెక్షనుయొక్క నిబంధనల ప్రకారము కొన్ని ఆస్తి పరివర్తనలమీద ప్రతి గ్రామమునందు సుంకమునూడ విధింపబడవలెను

(3) నిర్ణయింపబడిన విధులకు లోబడియు, ఇన్‌స్పెక్టరు యొక్క అంగీకారముతోను ఆయన అనుమతితోను, అనుమతిని యిచ్చు నప్పుడుగాని అటు తరువాతగాని ఆయన విధించగల నిర్బంధములు, షరతులు, ఏవైన నున్నయెడల వాటికి లోబడిన్ని పంచాయతీ గ్రామములో—

(a) కట్టడములచే ఆక్రమించబడనట్టియు, లేక కట్టడములకు ప్రక్కగాను, దానికి చెందినవియుగానట్టియు, ఆక్రమింపబడియున్న అన్ని భూములపై సంవత్సరవారీ విలువలో రూపాయకు మూడు పైసల రేటు వొప్పున భూమి సెస్సున్ను,

(b) నిర్దిష్టమైన ఒక కారణము కొరకు వ్యవసాయ భూములమీాద పన్నును,

(c) 1933 వ సం॥పు మదరాసు వ్యవసాయమున కనువగు ఫలసాయముల మార్కెట్టుల ఆక్టుయొక్క 11 వ సెక్షను ననుసరించి, ఒక మార్కెటు కమిటీవల్ల గ్రామములో రుసుము విధించబడు ఫలసాయము కానట్టి, గ్రామములో క్రయవిక్రయములు జరుగు వ్యాపారమున కనువగు ఏ ఫలసాయము మీాదనైన రుసుమును విధించవచ్చును

వివరణము—ఈ క్లాజుకొరకై కార్యముల నిమిత్తము వ్యాపారమున కనువగు ఫలసాయము అను మాటలు, 1933 వ సం॥పు మదరాసు వ్యాపారమున కనువగు ఫలసాయముల మార్కెటు ఆక్టుయొక్క 2 (1-a) సెక్షనులో ఏట్టి అర్థము కలిగియున్నదో అదే అర్థములను కలిగియుండవలెను

(4) (3) వ సబుసెక్షనుయొక్క (c) క్లాజు ఇండియా రాజ్యాంగముయొక్క 286 వ ఆర్టికల్‌యొక్క నిబంధనలకు లోబడి అమలు కలిగియుండవలెను

సంపాదకుని సూచిక —

మద్రాసు గ్రామ పంచాయతీల యాక్టు, 1950 యొక్క 13(3)(c) సెక్షను సందర్భములో, రాజ్యాంగముయొక్క 286 వ ఆర్టికల్‌లోని చట్ట నిబంధనలు క్లుప్తముగాని క్రింద తెలుపబడినవి —

ఆంధ్రప్రదేశ్ వెలుపల కొనబడినట్టిగాని, లేక అమ్మబడినట్టిగాని, లేక ఇండియను యూనియను ప్రదేశములోనికి దిగుమతుల సందర్భములోగా, లేక వాటి నుండి పైకి యెగుమతుల సందర్భములోగాని, వర్తక వ్యాపార పంటలపై సుంకము విధింపను ఆర్టికలుయొక్క (1) వ క్లాజు నిషేధించుచున్నది

యూనియను పార్లమెంటుయొక్క చట్టముచేత నిర్ణయింపబడినంతవరకు తప్ప, రాష్ట్రాంతర వ్యాపారములోగాని, వర్తకములోగాని కొనబడిన, లేక అమ్మబడిన వర్తక వ్యాపార పంటలపై సుంకము విధింపును, ఆర్టికల్ యొక్క (2) వ క్లాజు నిషేధించుచున్నది

యూనియన్ పార్లమెంటు యొక్క చట్టముచేత, ప్రజల జీవితమునకు ముఖ్యావసరమని ప్రకటింపబడిన వర్తక వ్యాపార పంటలపై సుంకము విధింపును, ఆర్టికల్ యొక్క (3) వ క్లాజు నిషేధించుచున్నది.

మద్రాసు పంటల మార్కెట్లయాక్టు, 1933, యొక్క 2(1)(a) సెక్షనుక్రింద, " వర్తక వ్యాపారపంటల "లో వేరుశెనగ, ప్రత్తి, పొగాకు, మరియు ప్రభుత్వముయాక్టుయొక్క అవసరముల నిమిత్తము యే పంటనయిన వర్తక వ్యాపారపంటగా ప్రకటించిన అట్టి పంటను చేర్చవలసినదిగా నిర్వచింపబడినది

ఈ క్రింద వచించిన జిల్లాలలో వాటి కెదురుగా చూపబడిన పంటలను వర్తక వ్యాపారపంటలుగా ప్రభుత్వము ప్రకటించియున్నారు —

| | జిల్లా పేరు | ప్రకటింపబడిన వర్తక వ్యాపారపంట |
|---|---|---|
| 1 | శ్రీకాకుళం | జనుము (జాబుమెస్తా) |
| 2 | విశాఖపట్నం | బెల్లం |
| 3 | తూర్పుగోదావరి | కొబ్బరి |
| 4 | చిత్తూరు | బెల్లం |
| 5. | కడప | నీరుల్లి, మిర్చి మరియు పసుపు |

## 63 వ సెక్షను క్రింది విధులు,

(జి ఓ నెం. 1116, ఎల్ ఎ తేదీ 4-6-1951)

### విధులు

### 1. వ్యాపార పంటలమీద రుసుమును విధించుట.

1 (ఇంగ్లీ నిటుతర్వాత మార్కెటు కమిటీ అని చెప్పబడు 1933 వ సం॥పు 20 వ మదరాసు ఆక్టు అగు) 1933 వ సం॥పు మదరాసు వ్యాపారమున కనువగు ఫలసాయముల మార్కెటుల ఆక్టు యొక్క 11 వ సెక్షను క్రింద ఒక మార్కెటు కమిటీవలన గ్రామములో రుసుము విధించబడు ఒక పంటకానట్టి గ్రామములో క్రయ విక్రయములు చేయబడు ఏ వ్యాపారపు పంటమీదనైన రుసుమును విధించుటకు అంగీకారము నిచ్చుటకు పూర్వము ఇన్‌స్పెక్టరు, ఈ క్రింది విషయములను గమనించవలెను —

(I) గ్రామములో లేక ప్రక్కన ఉండు ప్రదేశములో ప్రస్తుతము ఏ మార్కెట్లు కమిటీయైన నుండినయెడల దానికి సంబంధముగల వ్యాపారపు పంట లేక పంటల స్వభావము

(II) రుసుము రూపములో పంచాయతికి రాగల ఉజ్జాయింపైన ఆదాయము,

(III) రుసుమును వసూలుచేయుటకు ఖర్చు మరియు

(IV) సదరు రుసుమును విధించుటవలన స్థానిక నివాసులకు బహుశః కలుగగల కష్టము లేనైన నున్నయెడల, అవి

2 ఇన్‌స్పెక్టరు, రుసుమును విధించుటకు అంగీకారము నిచ్చుటకు పూర్వము వ్యవసాయ డైరెక్టరుయొక్క సలహానుకూడ పొందవలెను ప్రత్యేక సందర్భములలో ఎట్టి చిక్కుగాని కలిగిన యెడల ఉత్తరువుకొరకు ప్రభుత్వమును కోరవచ్చును

3 ఒక వ్యాపార పంటమీద రుసుమును విధించుటకు ప్రస్తుతముండు ఒక మార్కెట్టు కమిటీకి అధికార మియ్యబడినప్పుడును లేక గ్రామముమీద విచారణాధికారము కలిగిన ఒక మార్కెటు కమిటీ క్రొత్తగా ఏర్పాటుచేయబడి అదే వ్యాపార పంటమీద రుసుమును

విధించుటకు అధికార మియ్యబడినపుడు పంచాయతీ రుసుమును వసూలుచేయుటకు నిలిపివేయవలెను

4 ఏ వ్యాపార పంటమీదగాని ఒక పంచాయతీ విధించగల రుసుము రేట్లు, 1933 వ సం॥పు మదరాసు వ్యాపారమున కనువగు ఫలసాయముల మార్కెటుల అక్టు క్రింద రుసుము విధింపబడినయెడల, ఏ రేట్ల ప్రకారము విధింపనగునో ఆ రేట్లకు మించకూడదు

5 ఇన్‌స్పెక్టరు రుసుమును విధించుటకు అంగీకారము నిచ్చినపుడు ఆయనచే లిఖితపూర్వకముగా రికార్డు చేయబడవలసిన కారణములను బట్టి లేక పంచాయతీ కోరికమీదట ఆయనచే తగ్గించబడననేతప్ప లేక రద్దుచేయబడిననేతప్ప, అట్టి విధింపు అమలులోనుండవలసిన కాలపరిమితిని నిర్దేశించవలెను

(జి. ఓ , నెం 677 ఎల్ ఎ తేదీ 2-4-1952)

విధులు

## II వ్యవసాయ భూమిపై పన్ను

1 (1) ఏ గ్రామమందైనను వ్యవసాయ భూమిపై పన్ను దిగువ తెలుపబడిన వాటిని బోలిన నిర్దిష్ట కార్యముల నిమిత్తము ప్రతి అర్ధ సంవత్సరమునకును విధింపనగును —

(a) అక్టుయొక్క 59 (2) వ సెక్షను ననుసరించి వేటి విషయమై కుడి మరామ్మతు రుసుము విధింపబడెనో అట్టి నీటి పారుదల కాల్వల మరియు చెరువుల మరామ్మతు,

(b) నీటికి సంబంధించిన నిర్మాణముల లేక జలదారి నిర్మాణముల నిర్మాణము, పోషణ, మరామ్మతు, వ్యాప్తి లేక అభివృద్ధి,

(c) గ్యాస్‌వలన లేక విద్యుచ్ఛక్తిద్వారా దీపములను వెలిగించుట,

(d) బాట లేక వంతెన లేక చిన్నవంతెనను నిర్మించుట,

(e) సాంస్కృతిక, విద్యా విషయక లేక వైద్య సంబంధమైన మరియు తత్సంబంధమైన కార్యములకు ఉద్దేశింపబడిన భవనములను నిర్మించుట

(f) పశువులచే ధ్వంసము చేయబడకుండ, మరియు చిన్న చిన్న దొంగతనములనుండియు పంటలు రక్షణ,

అది సాదరు చేయబడిన అర్ధసంవత్సరము తరువాత అర్ధ సంవత్సరముయొక్క తొలి దినముల అమలు పొందవలెను

(2) పన్ను, రేటు, భూమియొక్క విస్తీర్ణమునుబట్టి యుండవలెను అయితే, పంచాయతీ, భూమియొక్క ధరకు తగినట్లు మాగాణి భూమికి ఒక రేటు చొప్పునను, మెట్టభూమికి వేరొక రేటు చొప్పునను పన్ను విధించవచ్చును

2 పన్ను విధింపుకైన ప్రతి ప్రతిపాదనను జిల్లా పంచాయతీ ఆఫీసరు మరియు కలెక్టరుద్వారా ఇన్‌స్పెక్టరుకు దాఖలు చేసికొనవలెను అందుతో ఈ క్రిందివానిని జత చేయవలెను —

(1) అందు నిమిత్తమై ప్రత్యేకముగా సమావేశ పరుపబడిన ఒక సమావేశమందు సాదరు చేయబడిన సంఖ్యగలవారిలో సగమునకు తక్కువకానివారిచే బలపరచబడిన పంచాయతీయొక్క తీర్మానము—దీనిలో పన్ను ఏ కార్యము నిమిత్తము, ఏ రేటు ప్రకారము మరియు ఏ కాలపరిమితికి విధింపబడెనో నిర్దిష్టము చేయబడవలెను,

(2) ప్రతిపాదన గావింపబడిన సంవత్సరమునకు క్రితము మూడు సంవత్సరములందు వివిధ శీర్షికల క్రింద జమాఖర్చులను చూపు వివరణము,

(3) ప్రతిపాదన గావింపబడిన సంవత్సరమునకైన ఆదాయ వ్యయపు అంచనా,

(4) ఏ పని విషయములో పన్ను విధించుట కుద్దేశింపబడినదో ఆ పనికి సుమారుగ అగు లేక అంచనా వేయబడిన ఖర్చు మరియు ఒక అర్ధసంవత్సరమందు బహుశః వసూలగు పన్నుయొక్క మొత్తమునుగూర్చిన వివరములు, మరియు

(5) సదరు పన్ను విధింపును నొప్పుకొను గ్రామస్తులలో ముఖ్యులైన వారివద్దనుండి మహజరు

3 కలెక్టరు, సదరు ప్రతిపాదనను ఇన్స్పెక్టరుకు పంపునప్పుడు ఉద్దేశింపబడిన పన్నుయొక్క రేట్లు సముచితముగనున్నవని లేక ఇతర విధముగనున్నవని ఆయన తన షరాలుగ వ్రాయవచ్చును

4 ఇన్స్పెక్టరు పన్ను విధింపున కనుమతి నొసంగునప్పుడు, పన్ను ఏ రేటు చొప్పున, ఏ కాలపరిమితివరకు విధింపబడవలెనో నిర్దిష్టము చేయవలెను మరియు పన్ను ఏ కార్యము నిమిత్తము విధింపబడినదో ఆ కార్యము నెరవేరుటకుగాను అవసరమైన పక్షమున అప్పుడప్పుడు, సదరు కాలపరిమితిని పొడగించవచ్చును

5 పన్నువలన వచ్చురాబడి, పన్ను ఏ కార్యము నిమిత్తము విధింపబడెనో ఆ కార్యము నిమిత్తము కేటాయించబడిన విధియందు భాగమైయుండవలెను మరియు ఆ పన్నుకు సంబంధించిన వ్యవహార ములకు ప్రత్యేకమైన లెక్కను వ్రాసియుంచవలెను

6 పన్నుల విధింపును మరియు వసూలును గురించి ఆక్టు యొక్క 112 (2) (XV) మరియు (XVII) వ సెక్షను క్రింద జారీ చేయబడిన విధులు పన్ను విధింపునకును వసూలునకును, అవసరమైన మార్పులతో వర్తించవలెను

(జి ఓ నెం 677, ఎల్ ఎ తేదీ 2-4-1952)

III సెక్షను 63 (3) క్రింద భూమిశిస్తు విధింపు

విధులు

III పంచాయతీయు భూమి సెస్సును విధించుట

1 (భూమి సెస్సువిధింపు నిమిత్తము దరఖాస్తు పెట్టుకొను సంవత్సరముతో చేరి) వరుసగా రెండు సంవత్సరములకు పైబడి ఆదాయపు లోటుతో పనిచేయుచున్న ఒక పంచాయతి, ఇన్స్పెక్టరు యొక్క అంగీకారముతో భూమి సెస్సును విధించవచ్చును

2 భూమి సెస్సు విధింపునకైన ప్రతిపాదన, అందు నిమిత్తమై ప్రత్యేకముగా సమావేశపరుపబడిన ఒక సమావేశమందు సాదరు

చేయబడిన సంఖ్యగలవారిలో సగమునకు తక్కువకానివారిచే బలపరచ బడిన ఒక తీర్మానముద్వారా అంగీకరించబడవలెను దానిని ఆర్థిక సంవత్సర సమాప్తికి పూర్వము మూడు మాసములు ముందుగా, జిల్లా పంచాయతీ ఆఫీసరు మరియు కలెక్టరుద్వారా ఇన్‌స్పెక్టరుకు పంపవలెను దానితోపాటు ఈ క్రిందివాటిని పంపవలెను

(1) సదరు ప్రతిపాదనను ఒప్పుకొను గ్రామస్థులలో ముఖ్యులైన వారివద్దనుండి మహజరు ,

(2) గత మూడు సంవత్సరములందు మరియు దరఖాస్తు పెట్టుకొనిన సంవత్సరమునందు వివిధ శీర్షికల క్రింద జమా ఖర్చులను చూపు వివరణము , మరియు

(3) ప్రతిపాదన చేయబడిన సంవత్సరమునకైన ఆదాయ వ్యయపు అంచనా

3 జిల్లా పంచాయతి ఆఫీసరు, పంచాయతియొక్క ఆర్థికస్థితి, శిస్తు విధింపు మూలమున పంచాయతికివచ్చు అంచనా వేయబడిన రాబడిని మరియు సదరు రాబడి పంచాయతీయొక్క ఆర్థికస్థితిని ఎంత వరకు వృద్ధిచేయుటకు ఉపయోగింపబడునో తెలుపు రిపోర్టుతో సదరు తీర్మానమును కలెక్టరుకు పంపవలెను

4 కలెక్టరు తన సిఫారసులతో సదరు ప్రతిపాదనను ఇన్‌స్పెక్టరుకు పంపవలెను అట్లు సిఫారసు చేయుటలో పంచాయతీ విస్తీర్ణములో (1920 వ సం॥ 14 వ మదరాసు ఆక్టు అను) 1920 వ సం॥పు మదరాసు జిల్లా బోర్డుల ఆక్టు మరియు (1920 వ సం॥పు 8 వ మదరాసు ఆక్టు అగు) 1920 వ సం॥పు మదరాసు ప్రాథమిక విద్యా చట్టము ననుసరించి ఇదివరకే వసూలుచేయబడిన భూమి సెస్సు రేటును, సదరు విధింపు మూలమున స్థానిక నివాసస్థులకు కష్టము లేవైన కలుగునెడల వాటిని ఆలోచించవలెను

5 భూమి సెస్సు విధింపు ఏసంవత్సరమందు అంగీకరింపబడెనో ఆ సంవత్సరము తరువాత సంవత్సరమునుండి అది అమలు పొంద వలెను మరియు ఇన్‌స్పెక్టరుచే నిర్దిష్టము చేయబడు రీతిగ మూడు సంవత్సరములకు మించని కాలపరిమితివరకు అది అమలునందుండ వలెను.

అయితే పంచాయతీయొక్క సిఫారసుపై సదరు విధింపు కాల పరిమితిని ఇన్‌స్పెక్టరు ఒక్కొక్కసారి మూడు సంవత్సరములకు మించని అదనపు కాలపరిమితులవరకు పొడిగించవచ్చును

6 ఇన్‌స్పెక్టరు లిఖితపూర్వకముగా రికార్డు చేయవలసిన కారణములనుబట్టి లేక పంచాయతీయొక్క కోరికపై, భూమి సెస్సు విధింపు అమలులోనున్న కాలపరిమితిలో ఎప్పుడైనను, సదరు విధింపును రద్దుచేయవచ్చును అట్టి రద్దు ఉత్తరువుచేయబడిన సంవత్సరము తరువాత సంవత్సరమునుండి అమలు పొందవలెను

7 ఈ విధుల ననుసరించి విధింపబడిన భూమి సెస్సు రెవిన్యూ డిపార్టుమెంటువారిచే వసూలు చేయబడవలెను మరియు 1920 వ సం॥పు మదరాసు జిల్లాబోర్డుల ఆక్టుననుసరించి వసూలు చేయబడు భూమి సెస్సుకువలెనే దీనిని పంచాయతి నిధులకు జమకట్టవలెను. పై చెప్పబడిన ఆక్టుయొక్క 79 నుండి 91 వరకుగల విభాగముల దెలుపు నిబంధనలు అట్టి విధింపునకును, వసూలునకును వర్తించవలెను

సె 64 (1) 63 వ సెక్షను 1 వ సబుసెక్షనులో చెప్పబడిన ఇంటిపన్ను గ్రామములోని గుడిసెలు తప్ప ఇతర అన్ని ఇండ్లమీదను ఈ క్రింద తెలుపబడిన ఆధారములలో ఏ ఒక ఆధారము ననుసరించియైన విధింపబడవలెను, అవేవనగా

(a) సంవత్సరి వారి విలువ, (b) మూలధనము యొక్క విలువ (c) నిర్ణయింపబడగల యే ఇతర ఆధారముగాని

(2) ఇంటిపన్ను, ఒ ఇంటి నివేశనము విషయమున గవర్నమెంటువారికి బాకీగా ఉండు భూమిశిస్తు ఏదైన నున్నయెడల దానిని ముందుగా చెల్లించుటకు లోబడి, ఇంటిమీదను, దానిలో లేక దానిమీద ఉంచునట్టివిన్ని, అట్టి పన్నును చెల్లించుటకు బాధ్యుడుగా నుండు మనిషికి చెందనట్టన్ని చరాస్తియేదైననున్న యెడల దాని మీదను మొదటి బాధ్యతగా నుండవలెను

(3) ఇంటిపన్ను ప్రతి అర్ధసంవత్సరమునకును పంచాయతీ నిర్ణయించగల రేట్లుచొప్పున విధించబడవలెను ఆ రేటు పంచా

యతీ అనుసరించిన పన్ను విధంపు ఆధారమును గురించి నిర్ణయింప బడిన కనీసపు రేట్లకు తగ్గియుండకూడదు మరియు గరిష్ట రేట్లను మించియుండకూడదు

(4) గవర్నమెంటువారు—

(i) నిర్దేశింపబడిన తరగతులకు చెందిన యిండ్లను పన్నునుండి మినహాయించు నిమిత్తము,

(ii) పన్నువిధించు కార్యముల నిమిత్తము ఇండ్ల యొక్క సంవత్సరవారి విలువను లేదా మూలధనపు విలువను లేదా అవి ఏ తరగతుల క్రింద వచ్చునో ఆ తరగతులను తెలుసుకొను విధము నిమిత్తము,

(iii) పన్నును చెల్లించుటకు ఎవరు బాధ్యులుగా నుందురో ఆ మనుష్యుల నిమిత్తమును, ఇండ్ల పరివర్తనను గురించి నోటీసుల నిచ్చునిమిత్తమును,

(iv) పేదరికము కారణముమీాద పన్నునుండి మినహాయింపులను చేయు నిమిత్తమున్ను,

(v) ఖాళీలకైనట్టి యితరమైనట్టి ముజరాలను యిచ్చు నిమిత్తమును ,

(vi) ఏయే సందర్భములలో, మరిన్ని ఏయే షరతులకు లోబడి, ఏ అర్ధ సంవత్సరములోనైనను నిర్మింపబడిన, పునర్నిర్మాణము చేయబడిన లేదా పడగొట్టబడిన లేదా గ్రామములో చేరియున్న లేదా దానినుండి మినహాయింపబడిన విస్తీర్ణములోని ఇండ్లు, పూర్తిపన్ను లేదా దానిలోని ఎట్టి భాగమునైన చెల్లింపవలసి యుండునో లేదా చెల్లింపవలసినదిలేదో ఆ సందర్భముల, షరతుల నిమిత్తమున ,

విధులను చేయవచ్చును

(5) ఇంటి అనుభవదారు, దానిఖామందు తరపున ఇంటి పన్నును చెల్లించినెడల, అట్టి అనుభవదారు ఖామందునుండి దానిని రాబట్టుకొనుటకు హక్కులు కలిగియుండవలెను మరియు ఖామందుకు ఆయన ఇప్పుడు లేక అటుతరువాత బాకీగానుండిన అద్దెనుండి దానిని తగ్గించుకొనవచ్చును

## 64 వ సెక్షనుక్రింద విధులు-ఇంటి పన్ను

I మూలాధారము, మరియు, గరిష్ఠ, కనిష్ఠ రేట్లు (వంతులు)

(జి ఓ నెం 520, లోకలు అడ్మినిస్ట్రేషను, తేదీ 24-3-1951)

### విధులు

### సంవత్సరవారి లేక మూలధనపు విలువకాని తదితర ఆధారముమీద ఇంటిపన్ను విధించుటయు, కనీసపు మరియు గరిష్ఠ రేట్లు.

1. ఒక పంచాయతీ ఇంటి పన్నును విధించుటను మంజూరు చేసి అట్టి విధింపు ఏ సంవత్సరమందైనను అమలులోనికి వచ్చినప్పుడు పన్ను రేట్లను లేక అవి ఏ తేదీనుండి విధింపబడవలెనో ఆ తేదీని మార్చుటకైన ఎట్టి వుద్దేశముగాని ఆ సంవత్సరమునకు సంబంధించి నంతవరకు రీజనలు ఇన్స్పెక్టరుయొక్క ప్రత్యేక అనుమతితో తప్ప లేక ఆయనచే జారీచేయబడిన ఒక వుత్తరువు ననుసరించి తప్ప పంచాయతి ఆలోచన లోనికి తీసికొనకూడదు

2 రీజనలు ఇన్స్పెక్టరుయొక్క అంగీకారము ముందుగా పొంది పంచాయతీ, మూలధనపు లేక సంవత్సరవారీ ఇండ్లవిలువ ఆధారముమీద ఇంటి పన్నును విధించుటకు బదులుగా వాటి అడుగు భాగపు విస్తీర్ణము ఆధారముమీద మరియు (I) డాబా కలిగినది, (II) కొంతవరకు డాబా, కొంతవరకు పెంకులు కలిగినది లేక ఆకులతో కప్పబడినది, (III) పెంకులతో మూయబడినది, (IV) కొంత వరకు పెంకులతో మూయబడినది, కొంతవరకు ఆకులతో కప్పబడి నది (V) ఆకులతో కప్పబడినది అని వాటిని తరగతివారీగా విభజించిన ఆధారముమీద దానిని విధించవచ్చును

3 పంచాయతీలు విధించు ఇంటిపన్ను రేట్లు క్రింది తక్తా యొక్క (2) వ గడిలో నిర్దేశింపబడిన కనీసపు రేట్లకంటె తక్కువగా నుండకూడదు మరియు సదరు తక్తాయొక్క (3) వ గడిలో నిర్దేశింపబడిన గరిష్ఠ రేట్లను మించకూడదు

తక్తా.

| వీధింపవలసిన ఆధారము | ప్రతి అర్ధ సంవత్సరమునకు కనీసపు రేటు | ప్రతి అర్ధ సంవత్సరమునకు గరిష్ఠ రేటు. |
|---|---|---|
| (1) | (2) | (3) |
| (a) మూలధనము విలువ యొక్క ఆధారముమీదపన్ను విధింపబడిన పక్షమున | మూలధనపు విలువలో 100 లో 1కి 1/16 వంతు | మూలధనం విలువలో 100 లో 1కి 1/2 వంతు |
| (b) సంవత్సర వారీ విలువ ఆధారముమీద పన్ను విధింపబడిన పక్షమున. | సంవత్సరవారీ విలువలో 100కి 1వంతు | సంవత్సర వారీ విలువలో 100కి 10వంతులు |
| (c) 2 వ విధిలో నిర్దేశింపబడిన ఆధారముమీద పన్ను విధింపబడిన పక్షమున | ... | ... |
| | రూ అ | రూ అ |
| (i) డాబా కలిగినది | 0-12-0 | 3-0-0 |
| | రూ అ<br>విస్తీర్ణములో ప్రతి 100 చదరపు అడుగులకు లేక అందలి భాగమునకు | విస్తీర్ణములో ప్రతి 100 చదరపు అడుగులకు లేక అందలి భాగమునకు |
| | రూ అ | రూ అ |
| (ii) కొంతవరకు డాబా కలిగినది మరియు కొంతవరకు పెంకులు లేక పూరి పై కప్పుగా కలిగినది | 0-8-0 డిట్టో | 1-8-0 డిట్టో |
| (iii) పెంకులను పై కప్పుగా కలిగినది | 0-6-0 డిట్టో | 1-0-0 డిట్టో |
| (iv) కొంతవరకు పెంకులు కొంతవరకు ఆకులను పై కప్పుగా కలిగినది. | 0-4-0 డిట్టో | 0-12-0 డిట్టో. |

(v) ఆకులచే పై కప్పుగా కలి 1—3—1 డిటో 0—9—0 డిటో
గిన

అయితే 50 చదరపు అడుగులకు మించని ప్లీస్తువిస్తీర్ణమును కలిగిన పూరి పై కప్పుగా కలిగిన ఇండ్లను ఇంటి పన్ను విధింపునుండి మినహాయించవలెను.

4 (1) 3 వ విధియొక్క కార్యముల నిమిత్తము ఇండ్ల యొక్క ప్లీస్తు విస్తీర్ణము ఇకముందు పంచాయతీ సర్వేయందు సర్వేడిపార్టుమెంటు వారిచే నిర్ణయింపబడవలెను

(2) అట్టి సర్వేలు చేయబడునపుడు భూమి విస్తీర్ణము—

(a) ఇండ్ల సంఖ్య మూడువందలను మించనపుడు గ్రామములలో గ్రామ కరణమువలన నిర్ణయింపబడవలెను కరణము నకు ప్రతియింటికిగాను అ 2 లు రేటు చొప్పున ప్రతి ఫలము పంచాయితీనిధినుండి చెల్లింపబడవలెను, మరియు

(b) ఇండ్లసంఖ్య 300 లకు మించిన గ్రామములలో సదరు కార్యము నిమిత్తము ప్రత్యేకముగా నియమింపబడిన ఒక రెవిన్యూ ఇనిస్పెక్టరువలన నిర్ణయింపబడవలెను సిబ్బంది ఖర్చు పంచాయతీ నిధినుండి పెట్టబడవలెను

5 ఒక పంచాయతీ తీర్మానముచేయుట మూలముగా గ్రామములోనుండు ఏ ఇంటిపైనా—

(1) ఇంటియొక్క మూలధనము లేక సంవత్సర వారీ విలువ లేక 2 వ విధిక్రిందికివచ్చు సందర్భములలో దానిపై కట్టిన పన్ను తీర్మానములో నిర్దేశింపబడిన పరిమితిని మించకయుండి అట్టి పరిమితి క్రింద నిర్దేశింపబడిన దానికంటె మించని యెడల

| పన్ను విధించుటకు ఆధారము | పరిమితి. |
| --- | --- |
| | రూ |
| (a) ఇంటియొక్క మూలధనము విలువ .. | 240 |
| (b) ఇంటియొక్క సంవత్సరవారీవిలువ . | 12 |
| (c) రెండవ విధిక్రింద ప్లీస్తు విస్తీర్ణము మరియు ఇంటియొక్క తరగతివారి విభజన ... | 6 |

మరియు (ii) (a) ఇంటి యజమాని ఆ గ్రామములో ఏ ఇతర ఇల్లుగాని కలిగియుండని పక్షమున, లేక

(b) ఆయన ఆ గ్రామములో కలిగియుండు అన్ని ఇండ్లయొక్క మొత్తము మూలధనము లేక సంవత్సరవారీ విలువ లేక వాటిపై విధింపబడిన పన్ను ఆయా సందర్భమునకు తగినట్లు రూ 240 లు లేక రూ 20 లు లేక రూ 6 లను మించని పక్షమున,

ఇంటి పన్నునుండి మినహాయించవచ్చును

## II పన్ను విధింపునకు, కాళీలకు పన్ను తగ్గింపునకు, పన్నునుండి మినహాయింపునకు పద్ధతులు

(జి ఓ నెం 520, లోకలు అడ్మినిస్ట్రేషను, తేదీ 23–3–1951)

### 1 ఇంటిపన్ను

విధులు

1 ఇంటిపన్ను

నిర్దేశింపబడినఇండ్ల తరగతులుగ ఇంటిపన్నునుండిమినహాయించుట

1 ఈ క్రింది కట్టడములు ఈ ఆక్ట్ క్రింద "ఇల్లు" అను నిర్వచనము క్రిందికి వచ్చిన పక్షమున ఇంటిపన్ను నుండి మినిహాయించవలెను —

(a) ప్రజలు దేవుని పూజించుటకొరకు ప్రత్యేకించి వాస్తవముగా అట్లు ఉపయోగింపబడు లేక ఇతర కార్యములకొరకు ఉపయోగింప బడని కట్టడములు,

(b) ఎట్టి అద్దెగాని పుచ్చుకొనని బాటసారులు కాపురముంచుటకైన సత్రములు మరియు కాపురముంచుటకై పుచ్చుకొనబడు అద్దె ధర్మ కార్యములకు మాత్రము వినియోగింపబడు సత్రములు,

(c) జన సామాన్యమున కందుబాటులోనుండు హాస్టళ్ళతో సహా విద్యాకార్యముల కొరకును గ్రంథాలయముల కొరకును ఉపయోగింపబడు కట్టడములు మరియు అనాథులకు లేక జంతువు

లకు ఆశ్రయమునిచ్చు ధర్మకార్యము కొరకు ఉపయోగింపబడు పబ్లికు కట్టడములు,

(d) నివాసయోగ్యమగు ఇండ్లుగా లేక సర్కారు ఆఫీసులుగ ఉపయోగింపబడని 1904 వ సం॥పు పురాతన కట్టడముల రక్షణ ఆక్టు క్రింద రక్షింపబడునట్టి పురాతన కట్టడములును అందలి భాగములును,

(e) ప్రత్యేకముగా ధర్మకార్యములకు వినియోగింపబడు ధర్మ ఆసుపత్రులు, డిస్పెన్సరీలు మరియు ఇతర కట్టడములు,

(f) ప్రభుత్వమువారిచే అప్పుడప్పుడు ప్రకటింపబడగల జాపతు రైల్వే పరిపాలక వర్గముచే పోషింపబడు ఆస్పత్రులును, డిస్పెన్సరీలును,

(g) పంచాయితీకి చెందిన కట్టడములు, మరియు

(h) లైటు హౌసులు,

అయితే (a), (c), (e) క్లాజులలో నున్న దేదియు, సదరు క్లాజులలో చెప్పబడిన కార్యముల నిమిత్తముకట్టడము నుపయోగించు మనిషి లేక మనుష్యులు దేనికొరకు అద్దెను చెల్లింతురో అట్టి ఏ కట్టడమునైన ఇంటిపన్నునుండి మినహాయించునట్లు భావించకూడదు

వివరణము —ఈ విధి క్రింద జారీచేయబడిన మినహాయింపు హాస్టళ్లు కానట్టి, పాఠశాలలకును కళాశాలలకును జత చేయబడిన వాసయోగ్యమగు గృహములకు లేక ఆస్పత్రులకు, డిస్పెన్సరీలకు గ్రంథాలయములకు జతచేయబడిన నివాసగృహములకు వ్యాప్తి చెందకూడదు

## ఇండ్లయొక్క సంవత్సరవారి లేక మూలధనపు విలువను కనుగొను విధము

2 (1) ఇంటిపన్నును లెక్కపెట్టు కార్యముల నిమిత్తము ఒక యింటియొక్క మూలధనపువిలువ, భూమియొక్క అంచనా వేయబడిన విలువయొక్కయు ఇంటిని కట్టుటకగు అంచనా వేయబడిన ప్రస్తుతపు ఖర్చుయొక్కయు మొత్తమునుండి అట్టి ఖర్చులో 100కి

10 వంతులకంటె తక్కువకాని ఒక న్యాయమైన మొత్తమును తరుగుదలకుగాను త్రోసివేసిన తరువాత మిగిలిన మొత్తముగా భావింపబడవలెను.

ఈ సబు విధి క్రింద విలువలనుండి యంత్రములను, కుర్చీబల్ల వగైరావంటి సామానులను మినహాయించవలెను

(2) (a) నెల నెల, లేక ప్రతి సంవత్సరముయింటిని ఏ రేటు చొప్పున న్యాయముగా అద్దెకు యియ్యబడవచ్చునో అట్టి మొత్తము సంవత్సర వారీ అద్దె చొప్పున యింటియొక్క సంవత్సరవారీ విలువగా భావింపబడవలెను అట్టి సంవత్సరవారీ అద్దెనుండి నూటికి పది వంతులకు తగ్గించవలెను మరియు సదరు తగ్గింపు, మరమ్మతుల నిమిత్తము లేక ఏ యితర కార్యము కొఱకైన తఱుగుకు బదులుగా నుండవలెను

(b) (i) ఈ ఆక్టు క్రింద "ఇల్లు" అను నిర్వచనము క్రిందికి వచ్చు ఏదైన ప్రభుత్వ లేక రైల్వే కట్టడము సందర్భములో, లేక

(ii) కార్యనిర్వాహక అధికారియొక్క అభిప్రాయములో దేని మొత్తము సంవత్సరవారీ అద్దె అంచనా వేయుటకు వీలు లేదో అట్టి సామాన్యముగా అద్దెకిచ్చుటకు వీలులేని ఒక తరగతికి చెందిన, పైన చెప్పిన నిర్వచనము లోనికి వచ్చు ఏ కట్టడము సందర్భములో నైన సంవత్సరవారీ విలువ, దాని మూలధనము విలువలో నూటికి ఆఱువంతులుగా భావింపబడవలెను

## ఇంటిపన్ను చెల్లింపవలసిన బాధ్యతగల మనుష్యులు

3 (1) ఇంటి ఖామందు ఇంటి పన్నును అర్ధ సంవత్సరము ప్రారంభమైన తరువాత ముప్పది దినములలోపల చెల్లించవలెను

(2) ఇంటి ఖామందు, నోటీసు జారీచేయబడిన తేదీనుండి పదునైదు దినములలోపల దానిపై బాకీగానుండు పూర్తి ఇంటి పన్నును లేక అందలి ఏ భాగమునైన చెల్లించుటకు తప్పిపోవు పక్షమున కార్యనిర్వాహక అధికారి 12 నెలలకంటె ఎక్కువగా చెల్లింపబడక వుండకపోయిన పక్షమున అట్టి ఇంటియొక్క తాత్కాలికపు

అనుభవదారుని 15 దినములకంటె తక్కువగాని ఒక నిర్దిష్టమైన కాల పరిమితిలోపల ఆ మొత్తము చెల్లించునట్లు కోరవచ్చును.

## పరివర్తనచేసిన మనిషియు, పరివర్తన పొందిన మనిషియు పరివర్తనను గురించి తెలియజేయుటకు బాధ్యత

4 (1) ఏ ఇంటికైన ఇంటిపన్నును చెల్లించుటకు ముఖ్యముగా బాధ్యతగల ఏ మనిషియొక్కయైన ఇంటికి లేక ఇంటిమీదగల హక్కు పరివర్తన చేయబడినప్పుడెల్లరు ఎవరిహక్కు పరివర్తన చేయబడినదో ఆ మనిషి మరియు ఎవరికి అది పరివర్తన చేయబడినదో ఆ మనిషి పరివర్తనకుచెందిన దస్తావేజు వ్రాయబడిన తర్వాత లేక అది రిజిష్టరు చేయబడిన పక్షమున దాని రిజిస్ట్రేషన్ తరువాత లేక ఎట్టి దస్తావేజుగాని వ్రాయని పక్షమున పరివర్తనచేసిన తరువాత 3 నెలల లోపల కార్య నిర్వాహక అధికారికి అట్టి పరివర్తనను గురించి తెలుపవలెను

(2) పైన చెప్పిన విధముగా ముఖ్యముగా బాధ్యతగల ఏ మనిషియైనను మరణించిన సందర్భములో, వారసుగా లేక ఇతర విధముగా మరణించిన మనిషియొక్క హక్కు పరివర్తన చేయబడిన మనిషి, మరణించిన మనిషి, మరణించినప్పటినుండి ఒక సంవత్సరము లోపల కార్య నిర్వాహక అధికారికి అట్టి పరివర్తనను గురించి లిఖిత పూర్వకముగా తెలియజేయవలెను

(3) ఈ విధి క్రింద పంపవలసిన నోటీసు కార్యనిర్వాహక అధికారి ఆజ్ఞాపించగల నమూనాలో నుండవలెను మరియు ఆయా సందర్భమునకు తగినట్లు పరివర్తనపొందిన మనిషి లేక హక్కు ఎవరికి చెందినదో ఆ మనిషి అట్లు కోరబడినయెడల పరివర్తనను లేక వారసత్వమును తెలుపు ఏ దస్తావేజులనైన కార్యనిర్వాహక అధికారి సమక్షమున హాజరు పెట్టుటకు బద్ధుడుగా నుండవలెను

(4) కార్యనిర్వాహక అధికారికి తెలియజేయకుండా పైన చెప్పిన విధముగా పరివర్తనచేయు ప్రతి మనిషి అట్టి ఉపేక్షవలన ఆయనకు కలుగగల ఏ యితర బాధ్యతకైనను అదనముగా ఆయన

నోటీసు నిచ్చునంతవరకు లేక పరివర్తన పంచాయతీ రిజిష్టర్లలో రికార్డు చేయబడునంతవరకు పరివర్తన చేయబడిన ఇంటిమీాద విధించబడిన ఇంటిపన్నును చెల్లించుటకు అటుతరువాతగూడ బాధ్యుడై యుండవలెను అయితే ఈ విధిలోనున్న దేదియు సదరు పన్నును చెల్లించు నిమిత్తము పరివర్తనను పొందిన మనిషియొక్క బాధ్యతను బాధించునట్లు తలంచగూడదు

బీదరికము కారణముగా మినహాయింపు

పంచాయతీ బీదరికమునుబట్టి గ్రామములోనున్న ఏ యింటియొక్కయైన కామందు పూర్తి పన్నును లేక అందలి ఏ భాగమునైన చెల్లించుటనుండి మినహాయించవచ్చును రీజినల్ ఇన్‌స్పెక్టరు అదే విధముగా ఏ ఇండ్ల తరగతియొక్కయైన కామందును మినహాయించవచ్చును

6 బీదరికమునుబట్టి పన్ను మినహాయింపు ఒక కాలమందు ఒక సంవత్సరము వరకు మాత్రము చేయవచ్చును

ఖాళీగా ఉండుటనుబట్టి యింటిపన్ను తగ్గించుట

7 (1) ఏ ఇల్లయినను ఏ అర్ధ సంవత్సరములో గాని అరువది దినములు లేక అంతకంటె ఎక్కువ దినములు వరుసగా ఖాళీగా నున్నప్పుడు కార్యనిర్వాహక అధికారి అర్ధసంవత్సరములో ఇల్లు ఖాళీగానుండిన దినముల సంఖ్యకు దామాషాలో పన్ను మొత్తములో సగమునకు మించని మొత్తమును ముజరా నియ్యవలెను

(2) (1) ఉపవిధి క్రింద ముజరా కొరకు చేయబడు ప్రతి ముజరా ఏ అర్ధ సంవత్సరమునకై కోరబడెనో ఆ అర్ధ సంవత్సరములో లేక అటుతరువాత వచ్చు అర్ధ సంవత్సరములో పెట్టుకొనబడవలెనేగాని అటుతరువాత పెట్టుకొనబడకూడదు

(3) (a) ఇంటియొక్క ఖామందు లేక అతని ఏజెంటు ఇల్లు ఖాళీగ నున్నదని కార్యనిర్వాహక అధికారికి ముందుగా నోటీసు నిచ్చిననే తప్ప అట్టి ముజరాకైని ఎట్టి అర్జీగాని అంగీకరింపబడకూడదు ముజరా యివ్వబడు కాలపరిమితి అట్టి నోటీసు అందచేయబడిన తేదీనుండి లెక్కింపబడవలెను

(b) అట్టి ప్రతినోటీసు అది ఏ అర్ధ సంవత్సరములో అందజేయబడినదో ఆ అర్ధ సంవత్సరముతో గడచిపోవలెను అటు తరువాత అది అమలును కలిగియుండకూడదు

కట్టడముయొక్క నిర్మాణము పునర్నిర్మాణము లేక పడగొట్టుటను గురించి నోటీసు నిచ్చుటకు ఖామందుయొక్క బాధ్యత

8 (1) (a) గ్రామములో ఏ ఇల్లయినను నిర్మింపబడిన లేక పునర్నిర్మాణము చేయబడిన పక్షమున ఇల్లు పూర్తియైన తేదీ లేక దానిని ఆక్రమించుకొనిన తేదీ ఈ రెండింటిలో ఏది ముందో అప్పటినుండి పదునైదు దినములలోపల ఖామందు దానినిగురించి కార్య నిర్వాహక అధికారికి నోటీసు నియ్యవలెను

(b) అట్టి తేదీ ఒక అర్ధ సంవత్సరములోని కడపటి రెండు నెలలలో వచ్చినయెడల ఖామందు (a) క్లాజుక్రింద నోటీసు నిచ్చుటకులోబడి ఆ అర్ధ సంవత్సరమునకు ఆ ఇంటికిగాను చెల్లింపబడగల ఆయా సందర్భమునకు తగినట్లు పూర్తి పన్నును లేక హెచ్చింపబడిన పన్నును ముజరా పొందుటకు హక్కు కలిగియుండవలెను

(c) ఆ తేదీ అర్ధ సంవత్సరములోని మొదటి నాలుగు నెలలలో వచ్చినయెడల, ఖామందు (a) క్లాజుక్రింద నోటీసు నియ్యబడుటకు లోనై, సదరు అర్ధ సంవత్సరమునకు ఆ యింటి విషయమున ఆయా సందర్భమునకు తగినట్లు చెల్లించవలసిన పన్నులో లేక హెచ్చింపబడిన పన్నులో ఆ తేదీకి పూర్వము ఆ అర్ధ సంవత్సరములోని దినముల సంఖ్యకు దామాషాగానుండునట్లు సదరు పన్ను లేక హెచ్చింపబడిన పన్నులో అర్ధభాగమునకు మించని మొత్తమును ముజరా పొందుటకు హక్కు కలిగియుండవలెను

(2) (1) వ ఉపవిధియొక్క (a) క్లాజు నిబంధనల నుల్లంఘించు ఏ ఖామందుగాని ఏబది రూపాయల వరకు వ్యాపించగల జుల్మానాతో శిక్షింపబడ తగియుండవలెను

(3) (a) గ్రామములోని ఏ ఇల్లయినను పడగొట్టబడిన పక్షమున లేక నాశనము చేయబడిన పక్షమున ఖామందు కార్య

నిర్వాహక అధికారికి దానిని గురించి నోటీసు నిచ్చునంతవరకు ఆ ఇల్లు పడగొట్టబడనియెడల లేక నాశనము చేయబడనియెడల చెల్లింప వలసియుండు పన్నును అతని యిష్టానుసారము చెల్లింప బాధ్యుడై యుండవలెను.

(b) అట్టి నోటీసు ఒక అర్థ సంవత్సరముయొక్క మొదటి రెండు నెలలలో నియ్యబడియుండిన పక్షమున ఆ అర్థ సంవత్సరముకైన ఇంటికిగాను చెల్లించవలసిన పూర్తిపన్నును ముజరా పొందుటకు ఖామందు హక్కు కలిగియుండవలెను

(c) అట్టి నోటీసు ఒక అర్థ సంవత్సరములో కడపటి నాలుగు నెలలలో ఇవ్వబడిన పక్షమున ఆయా సందర్భమునకు తగినట్లు పడగొట్టుటకు లేక నాశనముచేయుటకు తరువాత వచ్చు అర్థ సంవత్సరములోని దినముల సంఖ్యకు దామాషాలో ఆ అర్థ సంవత్సరము నిమిత్తము ఆ ఇంటికిగాను చెల్లించవలసిన పన్నులో సగమునకు మించని ముజరాను పొందుటకు ఖామందు హక్కు కలిగియుండవలెను

### ఒక అర్థ సంవత్సరము మధ్యలో చేర్చబడిన లేక మినహాయించబడిన విస్తీర్ణములో పన్ను ముజరా

9 (1) ఏ ప్రదేశముగాని ఒక గ్రామములో చేర్చబడిన పక్షమున అట్టి ప్రదేశములోని ప్రతి యింటి ఖామందు—

(a) అట్లు చేర్చిన తేదీ ఒక అర్థ సంవత్సరముయొక్క కడపటి రెండు నెలలలో వచ్చినయెడల ఆ అర్థసంవత్సరమునకుగాను సదరు ఇంటికి ఎట్టి ఇంటిపన్నుగాని చెల్లింపతగినవాడై యుండకూడదు, మరియు

(b) అట్టి తేదీ ఒక అర్థ సంవత్సరముయొక్క మొదటి నాలుగు నెలలలో వచ్చిన పక్షమున అట్టి తేదీకి పూర్వపు అర్థ సంవత్సరములో దినముల సంఖ్యకు దామాషాగా, ఆ అర్థ సంవత్సరములో ఇంటికి చెల్లించవలసిన ఇంటిపన్నులో సగమునకు మించని ముజరాను పొందుటకు హక్కు కలిగియుండవలెను.

(2) ఏ ప్రదేశమైనను ఒక గ్రామమునుండి మినహాయింప బడిన పక్షమున అట్టి ప్రదేశములోని ప్రతి ఇంటియొక్క ఖామందు—

(a) అట్లు మినహాయింపబడిన తేదీ ఒక అర్ధ సంవత్సరములో మొదటి రెండు నెలలలో వచ్చునెడల ఆ సంవత్సరమునకు దాని సందర్భములో చెల్లించవలసిన పూర్తి ఇంటిపన్ను ముజరాను పొందుటకు హక్కు కలిగియుండవలెను, మరియు

(b) అట్టి తేదీ ఒక అర్ధ సంవత్సరములో కడపటి నాలుగు నెలలలో వచ్చు పక్షమున, అట్టి తేదీకి తరువాత వచ్చు అర్థ సంవత్సరములోని దినముల సంఖ్యకు దామాషాగా ఆ అర్థ సంవత్సరమునకు దాని విషయమున చెల్లించగల ఇంటి పన్నులో సగమును మించని ముజరాను పొందుటకు హక్కు కలిగియుండవలెను

(3) ఇల్లు ఏ ప్రదేశములో నున్నదో ఆ ప్రదేశమును మినహాయించిన తేదీనుండి మూడు నెలల లోపల అట్టి ముజరా నిమిత్తము ఒక దరఖాస్తు కార్యనిర్వాహక అధికారికి పెట్టుకొనిననే తప్ప ఏ ఇంటికికాని (2) ఉపవిధి క్రింద ఏట్టి ముజరాగాని జారీ చేయబడకూడదు

III ఇండ్లపన్ను విధింపు రిజిష్టర్లలో యిండ్ల స్వహక్కు రిజిష్ట్రీని మార్చుట

(జి ఒ నెం 520 లోకల్ ఆడ్మినిస్ట్రేషన్, తేదీ 24-3-1951)

ఇండ్ల స్వామ్యపు రిజిష్ట్రీని పరివర్తన చేయుట.

1 జెనరల్ రివిజనప్పుడు గాని ఒక జనరలు రివిజనుకును మరియొక దానికిని మధ్యగాని ఏ కక్షిదారైన దరఖాస్తు పెట్టుకొనిన మీదట అసెస్మెంటు పుస్తకములలో ఆస్తుల స్వామ్యమునందు మార్పులు చేయునప్పుడు ఒక పంచాయితీయొక్క కార్యనిర్వాహక అధికారి ఈ క్రింది నిబంధనల ననుసరించవలెను అవేవనగా —

(1) యజమానులు తమ ఇష్టానుసారము ప్రవర్తించుట వలన చేయబడు పరివర్తనలు -హక్కును సర్వాధికారములతో పరి

వర్తనచేయు అన్ని సందర్భములలో పరివర్తనకు చెందిన రెండు కక్షి
దారులు లేక వారిలో ఎవరైనను దరఖాస్తు పెట్టుకొన్న మీదట
ఆస్తుల రిజిష్ట్రీదాని స్వామ్యపు పరివర్తనతో సరిపోవునట్లు మార్చ
బడవచ్చును అయితే మార్పుకు లేక రిజిస్ట్రీకి చెందిన దరఖాస్తు
ప్రతి సందర్భములో లిఖితపూర్వకముగానుండి దానిని చేసిన కక్షి
దారు లేక కక్షిదారులచే సంతకము చేయబడవలెను దానిని పోష్టు
ద్వారా పంపవచ్చును లేక ఖుద్దున లేక క్రమముగా అధికార మీయ
బడిన ఏజెంటుద్వారా అందజేయబడవచ్చును లేక రిజిస్ట్రేషన
డిపార్టుమెంటుకు చెందిన ఒక ఉద్యోగిద్వారా అందజేయబడవచ్చును
అట్టి ఒక దరఖాస్తును ఇద్దరు కక్షిదారులు అందజేసి వారిలో నొకరు
రిజిష్టరుకాబడిన ఖామందుగా ఉన్న పక్షమున కోరబడిన విధముగా
రిజిష్ట్రీని మార్చునట్లు వెంటనే ఉత్తరువు చేయవచ్చును అయితే పరి
వర్తనకు చెందిన కక్షిదారులలో ఒకరు మాత్రము దరఖాస్తు పెట్టు
కొన్న సందర్భములో మరియొక కక్షిదారునకు నోటీసును అందజేయ
వలెను రిజిష్టరు కాబడిన యజమాని ఈ వ్యవహారములో ఒకపార్టీ
కానపుడు రిజిష్ట్రీని పరివర్తనచేయుటకై దరఖాస్తు ఇద్దరు కక్షిదారుల
వలనగాని వారిలో ఒకరివలనగాని పెట్టబడినపుడు ఆయనకుగూడ
నోటీసు జారీచేయబడవలెను రిజిష్టరు కాబడిన యజమాని ఉద్దేశింప
బడిన పరివర్తన విషయమున ఆక్షేపించు నెడల తాను యజమానియని
చెప్పుకొను మనిషి తృప్తికరమైన చట్టబద్ధమైన సాక్ష్యమును హాజరు
పెట్టిననే తప్ప ఎట్టి మార్పునుగాని చేయకూడదు వ్యవహారమునకు
చెందిన ఒక కక్షిదారుమాత్రము దరఖాస్తు పెట్టుకొని మరియొకరు
ఆక్షేపించునెడల లేక ఊరకనుండునెడల కక్షిదారులు పూర్తి దస్తా
వేజులచే కలుపబడవలెను ఈ సంబంధము పూర్తిగానుండనప్పుడు
గౌరవనీయులైన మనుష్యులయొక్క వివరణములు, పన్ను రసీదుల
వంటి ఇతర సాక్ష్యములతో అది భర్తీ చేయబడవలెను ఆక్షేపణలను
తెలుపుటకు ఒక నెల వ్యవధి నియ్యవలెను ఎట్టి ఆక్షేపణగాని చేయ
బడిన పక్షమున ఒక విచారణ జరుపవలెను. ఆక్షేపణ చెల్లదగినదని
తెలిసిననేతప్ప రిజిష్ట్రీని పరివర్తన చేయవలెను.

(2) డిక్రీదారులకు పరివర్తనలు — ఒక సివిల్ కోర్టు డిక్రీని బట్టి డిక్రీదారుల పేరిట లేక సివిల్ కోర్టు డిక్రీలను అమలు జరుపుటలో జరిగిన వేలము విక్రయములలో క్రయదారుల పేరిట ఆస్తులయొక్క హక్కును పరివర్తనచేయు సందర్భములో వ్యాజ్యకక్షిదారులలో డిక్రీదారు లేక వేలపు విక్రయదారులలో ఎవరైననూ దరఖాస్తు పెట్టుకొనిన మీదట, మరియు ఆయా సందర్భమునకు తగినట్లు డిక్రీయొక్క లేక విక్రయ సర్టిఫికెట్టుయొక్క అధికారపూర్వకమైన నకలొక దానిని మరియు దానిని అనుసరించి స్వాధీనమును అప్పగించు ఒక సర్టిఫికేటును హాజరు పెట్టినమీదట రిజిస్ట్రీని వెంటనే మార్చవచ్చును అయితే పరివర్తన రిజిష్టరు కాబడిన యజమాని పేరనుండి చేయబడవలెను రిజిష్టరు చేయబడిన యజమాను కానట్టి ఒక మనిషివద్ద నుండి పరివర్తన చేయబడునపుడు రిజిస్ట్రీని మార్చుటకు పూర్వము (1) వ ఉపవిధిలో నిబంధింపబడిన విధముగా రిజిష్టరు కాబడిన యజమానికి నోటీసు నియ్యవలెను కాని స్వాధీనము అప్పగించిన సర్టిఫికేట్టు హాజరు పెట్టుటకు సాధ్యముకాని విషయమైన ఉదాహరణముగా జారీ వేయబడిన డిక్రీమీద ఎగ్జిక్యూషన్ వ్యవహారములు లేకుండా స్వాధీనమును మరియొకరికిచ్చి డిక్రీ ఆఖరుగానున్న పక్షమున పరివర్తనకైన కక్షిదారులలో ఒకరు మాత్రము రిజిస్ట్రీని మార్పు నిమిత్తము పెట్టుకొన్న దరఖాస్తుల సందర్భములో (1) వ ఉపవిధిలో నిబంధింపబడిన విధములు ప్రకారము కేసును పరిష్కారము చేయవచ్చును

(3) డిప్లరేటరీ డిక్రీల క్రింద పరివర్తనలు — ఎట్టి ఎగ్జిక్యూషనుగాని చేయుటకు వీలులేని ఒక డిక్లరేటరీ డిక్రీలక్రింద రిజిస్ట్రీని మార్చుటకు కోరబడిన సందర్భములలో అనగా ఏదో ఒక మనిషి రిజిస్ట్రేషనుకు హక్కునిచ్చుటకుగాను అతనికి చెందవలసిన హక్కును మాత్రము డిక్రీ ప్రసిద్ధపరచు సందర్భములో, కార్యనిర్వాహక అధికారి అట్టి డిక్రీయొక్క ఒక అధికారపూర్వకమైన నకలొక దానిని హాజరుపెట్టినమీదట వెంటనే రిజిస్ట్రీని పరివర్తన చేయవచ్చును.

(4) వారసత్వము ద్వారా సంక్రమించు పరివర్తనలు :—వారసత్వము ద్వారా సంక్రమించు పరివర్తన సందర్భములో కార్యనిర్వాహక అధికారి తృప్తికరమైన సాక్ష్యమున్నమీదట రిజిస్ట్రీని పరివర్తన చేయవలెనని ఉత్తరువు చేయవచ్చును

2 రిజిస్ట్రీయొక్క పరివర్తనను చేయలేక నిరాకరించు కార్యనిర్వాహక అధికారియొక్క ఉత్తరువులమీద పంచాయతీకి అపీలు చేసుకొనుటకు వీలుగా నుండవలెను ఏ ఉత్తరువుమీద అపీలు చేయబడుచున్నదో ఆ ఉత్తరువు అందిన తేదీ తరువాత ముప్పది దినముల తరువాత అట్టి అప్పీలు దాఖలు చేయబడవలెను

రిజిస్ట్రేషను డిపార్టుమెంటులో రిజిష్టరు చేయబడిన ఇండ్ల ఆస్తుల బదిలీలు (పరివర్తనలు) పంచాయతీలకు తెలియపరచుటకై, జి ఒ నెం. 4252 స్థానిక పరిపాలన తేదీ 1-11-1939 లో జారీ చేసిన ఉత్తరువులు

పన్నులు-ఆస్తి మరియు ఇల్లు-మునిసిపల్ కౌన్సిల్లు మరియు పంచాయతీలు-ఆస్తుల హక్కు బదిలీలు-రిజిస్ట్రేషను డిపార్టుమెంటు ఇవ్వవలసిన రిజిస్ట్రేషను వివరాలు

(ఆర్డరు నెం 4252 ఎల్ ఎ తేదీ 1 నవంబరు 1939 )

1920 వ మద్రాసు జిల్లా మునిసిపాలిటీల చట్టముయొక్క 88 వ సెక్షనుక్రింద మరియు, 1920 వ మద్రాసు స్థానిక సంస్థల చట్టముయొక్క 101-A వ సెక్షనుక్రింద*

ఏ వ్యక్తియైన ఏదైన ఇంటి ఆవరణములమీద లేక యింటిమీద లేక వాటికి సంబంధించిన హక్కును, బదిలీ చేయునప్పుడు అటువంటి బదిలీ గూర్చిన నోటీసు కార్యనిర్వాహక అధికారికి లేక స్థానిక సంస్థయొక్క అధ్యక్షునికి అందజేయవలెను సందర్భానుసారముగా ఆస్తి లేక ఇంటిపన్నును కట్టుటకు సదరు వ్యక్తి ప్రధానముగా బాధ్యుడై యుండవలెను

*టిప్పణి —1920 వ మద్రాసు స్థానిక సంస్థల చట్టముయొక్క నిర్వచనము మద్రాసు గ్రామ పంచాయతీల చట్టము మరియు దానిక్రింద ఈ సందర్భమున చేయబడిన విధులని ఊహింపవలయును

పై చెప్పబడిన నిబంధనలలోని పరిమిత కాలములో సదరు నోటీసును హక్కులను బదిలీచేయు వ్యక్తియును, హక్కులు స్వీకరించిన వ్యక్తియు అందజేయవలెను అయినను సంబంధించిన పార్టీలు చాలా విషయములలో నోటీసు లివ్వటము లేదని ప్రభుత్వమునకు తెలియవచ్చినది అందువలన స్థానిక సంస్థల పన్ను రిజిష్టరులో పొరపాట్లు గలుగుచున్నవి వాటి వలన ఓటర్ల జాబితాలు తయారు చేయుటలో చిక్కులు గలుగుచున్నవి ఈ పొరపాట్లను చిక్కులను తొలగించుటకై ఈ విధముగా ఉత్తరువు చేయడమైనది భూమి మీద ఇంటి ఆస్తులమీద లేక వాటికి సంబంధించిన హక్కుల బదిలీల విషయములు తన ఆఫీసులో రిజిష్టరైన వెంటనే ప్రతి సబ్ రిజిష్ట్రారు ప్రతి మునిసిపాలిటీ, పంచాయతి, కార్యనిర్వాహక అధికార్లకు ఇంటి ఆస్తులమీది, వాటికి సంబంధించిన విషయములు పంపవలెను

2 చేయవలసిన వ్రాతపని (గుమాస్తా) కగు ఖర్చును, తపాలా ఖర్చును భర్తీచేయుటకు ఈ విధముగా ఉత్తరువు చేయబడినది 200 రూపాయలకు మించిన సంవత్సర ఆదాయముగల ఇంటి పన్నును పంచాయతి వేయుచున్నయెడల ప్రభుత్వముకు 5 రూ॥లు సంవత్సర ఫీజు (రుసుము) చెల్లించవలెను దిగువ నుదహరించిన స్కేలు ప్రకారము మునిసిపల్ కౌన్సిళ్లు ఫీజు (రుసుము) చెల్లించవలెను —

| | క్రిందటి సెన్సస్ ప్రకారము జనాభా | చెల్లించ వలసిన సంవత్సర ఫీజు రూ. |
|---|---|---|
| 1 | 30,000 మరియు తక్కువ | 15 |
| 2 | 30,000 కు మించి మరియు 1,00,000 కంటె తక్కువ | 30 |
| 3 | 1,00,000 కంటె ఎక్కువ | 90. |

200 రూ॥లు మరియు తక్కువ సంవత్సరాదాయము గల పంచాయతీలు ఆ ఫీజు చెల్లించ నక్కరలేదు

3 స్థానిక సంస్థలచే చెల్లింపబడు ఫీజు "XI C రిజిస్ట్రేషను-వివిధమైన-ఇతర రాబడులు" కు జమకట్టవలెను

4 మునిసిపల్ కౌన్సిళ్లు మరియు స్థానిక సంస్థల ఇన్‌స్పెక్టరును ఇంటిపన్ను వేయును జిల్లాలోయున్న అన్ని పంచాయతులయొక్క పేర్లను, తాలూకావారిగాచేసి, వాటిలో 200/ రూ॥లు కు రాబడి మించని పంచాయతీలను తెలుపుచున్న యొక పట్టీని, ప్రతీ జిల్లాలోని జిల్లా పంచాయతి అధికారి జిల్లా రిజిస్ట్రారుకు యిచ్చుటకు ఆజ్ఞాపించవలెనని కోరుచున్నారు ఈ ప్రకారమున రిజిస్ట్రేషను ఇన్‌స్పెక్టరు జనరలు నిర్ణయించు నటువంటి తేదీ లేక తేదీలలో సంబంధించిన స్థానిక సంస్థలు ఫీజు చెల్లించవలెను రిజిస్ట్రేషను ఇన్‌స్పెక్టరు జనరలు నిర్ణయించిన ప్రకారము, రిజిస్ట్రేషను డిపార్టుమెంటు అధికారులు, స్థానిక సంస్థలు కట్టవలసిన సైకమును చెల్లించుటను కనిపెట్టు పనిని చూచుకొందురు ఉపేక్షించిన విషయములను, పంచాయతీ సంబంధములో మునిసిపల్ కౌన్సిల్సు మరియు స్థానిక సంస్థల ఇన్‌స్పెక్టరుకు, మరియు మునిసిపల్ కౌన్సిళ్ల సంబంధములో గవర్నమెంటుకు రిపోర్టు చేయవలెను

5 మద్రాసు జిల్లా మునిసిపాలిటీల చట్టము, 1920 యొక్క సెక్షను 88 క్రింద, లేక మద్రాసు స్థానిక సంస్థల చట్టము, 1920 యొక్క సెక్షను 101-ఎ క్రింద, సందర్భానుసారముగా, కార్యనిర్వాహక అధికారికిగాని, ప్రెసిడెంటుకుగాని, బదిలీ చేయువానిచే మరియు బదిలీ చేయబడినవానిచే చిరునామా వ్రాయునట్లు ఉద్దేశించు, రిజిష్టరు చేయబడిన బదిలీల సంబంధమైన విషయములు మునిసిపల్ కౌన్సిళ్ళకు మరియు పంచాయతీ బోర్డులకు యివ్వవలసినవి, నోటీసులు యీ వుత్తరువు లనుబంధమున చూపిన నమూనాలో నుండవలెను

6 ముందు చెప్పబడిన నోటీసు ఫారములు నింపబడి చేర్చబడలేదని రిజిస్ట్రేషను నిరాకరించరాదు అయినప్పటికి, సబ్ రిజిస్ట్రారువకు ఆస్తులమీద లేక సంబంధించిన హక్కుయొక్క బదిలీలను రిజిష్టరుచేయు నప్పుడు, సంబంధించిన పార్టీలను ఫారము నింపి సంతకము చేయుటకై ప్రోత్సహించుటకు నిలకునని గవర్నమెంటు అభిప్రాయ పడుచున్నారు

ఏ విషయములలోనైన పార్టీలు నోటీసులింపి చేర్చలేక పోవుదురో రిజిష్టరుచేయు అధికారులు అట్టి నోటీసులలో కావలసిన విషయములను చేర్చి, సంబంధించిన స్థానిక సంస్థలకు యివ్వవలెను ఆ మాదిరిగా తగు విధముగా నింపబడి సంతకము చేయబడిన ఫారములన్నియు కార్య నిర్వాహక అధికారికి లేక ప్రెసిడెంటుకు, రిజిస్ట్రేషను పూర్తిగావించబడిన వెంటనే పంపవలెను

ఈ ఫారములు ముట్టిన వెంటనే, సందర్భానుసారముగా కార్య నిర్వాహకాధికారి లేక పంచాయతీబోర్డు ప్రెసిడెంటుకు, ఏమైనంత వరకు ఆలస్యము లేకుండా, పన్ను రిజిష్టర్లను తగు విధముగా సవరణ చేయవలెను

7 గవర్నమెంటు ప్రెస్సు సూపరింటెండెంటుగారు సబ్-రిజిస్ట్రార్లకు కోరకపూర్వ, అనుబంధములో నిర్దేశించబడిన ఫారమును యింగ్లీషు, తమిళ, తెలుగు, కన్నడ మరియు మళయాళ భాషలలో ముద్రించి సప్లయి చేయవలెనని కోరుచున్నారు లోకల్ ఫండు ఎకౌంట్ల ఎగ్జామినరుయొక్క మరియు మునిసిపల్ కౌన్సిళ్లు మరియు స్థానిక సంస్థల ఇన్‌స్పెక్టరుయొక్క ఆలోచనతో సూపరింటెండెంటు ఏ భాషలో ఎన్ని ముద్రించవలెనో నిర్ణయించవచ్చును గవర్నమెంటు సీనియరు ట్రాన్సులేటరును నాలుగుభాషలలో ఫారముయొక్క అనువాదములు సూపరింటెండెంటుకు యివ్వవలెనని కోరుచున్నారు,

8 రిజిస్ట్రేషను ఇన్‌స్పెక్టరు జనరల్, పై స్కీము నడచుచున్నదానిమీద రిపోర్టును ప్రతి సంవత్సరము జూన్ 15 వ తారీఖుకల్లా అందజేయవలెనని కోరుచున్నారు

(ఎక్సలెన్సి గవర్నరు ఉత్తరువుచే)

యస్ జె మేక్కైవరు (ప్రభుత్వకార్యదర్శి)

అనుబంధము

మద్రాసు జిల్లా మునిసిపాలిటీలు/మద్రాసు లోకల్ బోర్డుల చట్టము, 1920 యొక్క సెక్షను 99/101-A క్రింద నోటీసు

టు, కార్యనిర్వాహకాధికార ప్రెసిడెంటు, మునిసిపాలిటీ/పంచాయతీబోర్డు, సబ్-రిజిస్ట్రారు ద్వారా

అయ్యా,

మేము ఇందుమూలముగా అనుబంధించిన షెడ్యూలులో వివరించిన ఆవరణముల/ఇంటి (ఇండ్ల) మీద లేక సంబంధించిన హక్కు ——————నుండి——————కు బదిలీ చేయబడినదని, సదరు బదిలీ సబ్-రిజిస్ట్రారు ఆఫీసు,———లో——————తేదీన రిజిష్టరు చేయబడినదని నోటీసు ఇచ్చుచున్నాము

(బదిలీ చేయువాని సంతకము)

(బదిలీచేయబడిన వాని సంతకము)

షెడ్యూలు

| భూములు లేక భవనముల యొక్క సర్వే లేక ఇంటి నెంబర్లు, | మునిసిపాలిటీ లేక పంచాయతీ పన్ను విధింపుల నెంబర్లు | క్లుప్తముగా ఆ స్థిరయొక్క వివరణ. |
|---|---|---|
| (1) | (2) | (3) |

పంపబడినది

సబ్-రిజిస్ట్రారు

సె 65 (1) 63 వ సెక్షను (1) వ సబ్ సెక్షనులోచెప్పబడిన వృత్తిపన్ను, నిర్ణయింపబడగల విధులకులోబడి ప్రతి అర్థసంవత్సరమునందు ప్రతిగ్రామములో—

(i) ఆ అర్థ సంవత్సరమునందు మొత్తములో, 60 దినములకంటె తక్కువకాకుండ అట్టి గ్రామములో వ్యాపారము చేయు ప్రతి కంపెనీకి విధింపబడవలెను, మరియు

(ii) ఆ అర్థ సంవత్సరములో—

(ఇ) (i) అట్టి గ్రామమునందు మొత్తముమీద 60 దినములకంటె తక్కువకాకుండ, లేక

(iii) అట్టి గ్రామమునకు వెలుపల అయితే మొత్తము మీద 60 దినములకంటె తక్కువకాకుండ కాపురముండి,

వృత్తిని, చేతిపనిని లేక పనినిచేయు లేక వ్యాపారముచేయు లేక ఏదైన పబ్లికు లేక ప్రైవేటుఉద్యోగమును కలిగిన ప్రతిమనిషికి విధింపబడవలెను,

(b) మొత్తములో, 60 దినములకు తక్కువ కాకుండ అట్టిగ్రామములో కాపురముండి, ఏదైనపింఛనును, లేక పెట్టుబడులనుండి ఆదాయమును పొందు ప్రతి మనిషికి విధింపబడవలెను

(2) పంచాయతీచే నిర్ణయింపబడగల రేట్లు చొప్పున వృత్తిపన్ను విధింపబడవలెను అట్టిపన్ను నిర్ణయింపబడగల కనీసపు రేట్లకంటె తక్కువకాకుండను, గరిష్ఠ రేట్లను మించకుండను యుండవలెను

(3) (1) వ సబ్ సెక్షనులో నిర్దేశింపబడిన ఆధారములన్నింటినుండి వచ్చిన అతని మొత్తము ఆదాయమునకు తగిన తరగతిక్రింద ఒక మనిషి పన్ను విధింపబడుటకు తగియుండునట్లు చార్జీ చేయబడవలయును

(4) ఒక కంపెనీ లేక మనిషి ఈ ఆక్టుక్రింద విధింపబడిన వృత్తిపన్ను నిమిత్తము, లేక 1919 వ సం॥పు మదరాసు మహా మునిసిపల్ ఆక్టుక్రింద లేక 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టుక్రింద విధింపబడిన కంపెనీ లేక వృత్తిపన్ను నిమిత్తము లేక 1924 వ సం॥పు కంటోన్మెంట్ల ఆక్టుక్రింద విధింపబడు వృత్తిపన్ను స్వభావముగల ఏదైన పన్ను నిమిత్తము అదే అర్థ సంవత్సరమునకు మదరాసు రాజ్యములోని ఏదైన పంచాయతీకి లేక మునిసిపల్ కౌన్సిల్లకు లేక కంటోన్మెంటు అధికారికి చెల్లించెనని ఒక కంపెనీ లేక వ్యక్తి రుజువుపరచిన పక్షమున, అట్టి కంపెనీ లేక వ్యక్తి

వ్యాపార స్థలమును, వృత్తిని, చేతిపనిని, పనిని, ఉద్యోగమును లేక కాపురస్థలమును మార్చినను, కారణములనుబట్టి మాత్రము, అట్టి మొత్తమునకును, ఈ ఆక్టు క్రింద లేక పైనచెప్పిన ఏ ఆక్టుల క్రింద నైనను, అర్థ సం॥నకు వృత్తి పన్ను లేక కంపెనిలను పన్నుకు ఆయన ఇతరవిధముగా బాకీగానుండు మొత్తమునకును, మధ్య గల వ్యత్యాసమునకు ఎక్కువగా, ఏదైన ఇతర పంచాయతీకి, మునిసిపల్ కౌన్సిలుకు, లేక కంటోన్మెంటు అధికారికి చెల్లించ నవసరము లేదు

(5) ఒక స్థానిక అధికారవర్గముయొక్క స్థానికసరిహద్దుల లోపల కాపురముండి, ఏదైన ఇతర స్థానిక అధికారవర్గము లేక అధికారవర్గములయొక్క సరిహద్దులలోపల అతని వృత్తిని, చేతి పనిని లేక పనిని చేయు, వ్యాపారముచేయు, లేక ఏదైన ఉద్యోగము కలిగియుండు ఒకమనిషి, ఏదైన స్థానిక అధికారవర్గములచే విధింపబడగల ఎక్కువ పన్ను మొత్తముకంటె ఎక్కువగా వృత్తి పన్నును, చెల్లించుటకు అతనిని బాధ్యునిగా చేయునట్లు ఈ సెక్షనులో నున్న దేదియు భావింపబడకూడదు అట్టి సందర్భములో గవర్నమెంటువారు, వారు యుక్తమని తలంచగల విధముగా, స్థానిక అధికారవర్గములమధ్య ఆ పన్నును విభజింపవలెను మరియు గవర్నమెంటువారి తీర్మానము ఆఖరైనదిగానుండవలెను

అయితే, సంబంధించిన స్థానికఅధికారవర్గములో నొకటి, ఒక కంటోన్మెంటు అధికార వర్గముగా లేక మేజరు పోర్టు యొక్క పోర్టు అధికారవర్గముగా నున్న విషయములో, గవర్నమెంటువారి తీర్మానము సెంట్రల్ గవర్నమెంటువారి, అంగీకారమునకు లోబడియుండవలెను.

(6) ఒక ఘరము అసోసియేషన్ లేక ఉమ్మడి హిందూ కుటుంబము మీద విధింపబడగల వృత్తిపన్ను సదరు ఘరము అసోసి

యోషన్ లేక కుటుంబముయొక్క ఈడువచ్చిన ఏ వ్యక్తిమీాదనైనను విధింపబడవచ్చును

(7) (a) ఒక కంపెని లేక మనిషి ఏ స్థానిక ప్రదేశములోనైనను వ్యాపారమునుచేయు నిమిత్తము, దానికి లేక ఆయనకు ప్రతినిధిగా వ్యవహరించుటకు ఒక సేవకుని లేక ఏజెంటును నియమించునెడల అట్టి కంపెని లేక మనిషి ఆ స్థానిక విస్తర్ణములో వ్యాపారమును చేయునట్లు భావింపబడవలెను మరియు అట్టి కంపెనీ లేక మనిషి తరపున అట్టి సేవకుడు లేక ఏజెంటు బాధ్యతకలిగించునట్టి కాంట్రాక్టులను చేయుటకు అధికారములు కలిగియున్నను, లేకున్నను అట్టి కంపెని లేక మనిషియొక్క వ్యాపారము సందర్భములో అట్టి మనిషి లేక ఏజెంటు వృత్తిపన్నును చెల్లించుటకు బాధ్యుడుగా నుండవలెను

(b) ఒక కంపెని లేక మనిషి మరియొక కంపెనీ లేక మనిషియొక్క ఏజెంటుగానున్న విషయములో, మొదట చెప్పిన కంపెని లేక మనిషి ప్రధానకంపెనీ లేక మనిషివలె అదే ఆదాయముమీాద ప్రత్యేకముగా వృత్తి పన్నును చెల్లించుటకు బాధ్యుడుగా నుండకూడదు

వృత్తిపన్ను నిర్ణయము విధింపు గురించి 65 వ సెక్షనుక్రింది విధులు

(జి ఒ నెం 520, లోకల్ అడ్మినిస్ట్రేషన్, తేదీ 24-3-1951)

విధులు

వృత్తిపన్ను-విధింపు మరియు గరిష్ఠ కనిష్ఠపు రేట్లు.

1 (1) వృత్తిపన్నుకై పన్ను విధించు నిమిత్తము మనుష్యులను కంపెనీలను విభజంపవలసిన తరగితులు, ప్రతి తరగతికి విధింపబడవలసిన గరిష్ఠ, కనిష్ఠపు అర్ధసంవత్సరపు పన్ను ఈ క్రింది విధముగా నుండవలెను —

| తరగతి. | అర్థ సంవత్సరవారి ఆదాయము. | గరిష్ఠ అర్థసంవత్సర పన్ను మొత్తము | కనీసపు అర్థ సంవత్సర పన్ను మొత్తము. | |
|---|---|---|---|---|
| | | రూ. | రూ. | అ. |
| I | రూ 15,000 లకు మించినది | 125 | 100 | 0 |
| II | రూ 12,000 లకు మించి రూ రూ 15,000 లకు మించనిది, | 100 | 75 | 0 |
| III | రూ 9,000 లకు మించి రూ 12,000 లకు మించనిది | 75 | 50 | 0 |
| IV | రూ 6,000 లకు మించి రూ 9,000 లకు మించనిది | 50 | 25 | 0 |
| V | రూ 4,800 లకు మించి రూ 6,000 లకు మించనిది | 25 | 12 | 0 |
| VI | రూ 3,000 లకు మించి రూ 4,800 లకు మించనిది | 12 | 6 | 0 |
| VII | రూ 1,800 లకు మించి రూ 3,000 లకు మించనిది | 6 | 4 | 0 |
| VIII | రూ 1,200 లకు మించి రూ 1,800 లకు మంచనిది | 4 | 2 | 0 |
| IX | రూ 600 లకు మించి రూ 1,200 లకు మించనిది | 2 | 1 | 0 |
| X | రూ 300 లకు మించి రూ 600 లకు మించనిది | 1 | 0 | 8 |

(2) పంచాయతీ, (1) వ ఉపవిధిలో నిర్దేశింపబడిన గరిష్ఠ మరియు కనీసపు మొత్తమునకులోబడి ప్రతితరగతికి విధింపబడగల పన్నును నిర్ణయించవలెను

అయితే ఏ తరగతికైన చెందిన పన్ను ఆ తరగతియొక్క కనీసపు ఆదాయమునకు ఏ దామాషాలోనుండునో అట్టి దామాషా, అంతకంటె తక్కువయైన ఏ తరగతికైన చెందిన పన్ను, అట్టి తక్కువ తరగతియొక్క కనీసపు ఆదాయమునకు ఏ దామాషాలో నుండునో ఆ దామాషాకంటె ఎట్టి సందర్భములోగాని తక్కువగా నుండకూడదు

(3) పంచాయతీ (1) వ ఉపస్థితిలోని తరగతులలో ఏ ఒక తరగతినైన లేక ఎక్కువ తరగతుల నైనను వృత్తి పన్ను చెల్లించు బాధ్యతనుండి మినహాయించవచ్చును అయితే ఏ తక్కువ తరగతి కైన పన్ను విధించియుండినపుడు అంతకు పైబడిన ఏ తరగతినైన అట్టి విధింపునుండి మినహాయించకూడదు

2 ఒక కంపెనీ లేక మనిషి ఒక గ్రామములోపల ఒక ఆఫీసును లేక ఉద్యోగము చేయు స్థలమును గలిగియున్న పక్షమున, అట్టి కంపెనీ లేక మనిషి అట్టి గ్రామములోపల వ్యాపారము చేయునట్లు, ఒక ఉద్యోగమును, వృత్తిని లేక పనిని చేసినట్లు, ఒక ఉద్యోగమును కలిగియున్నట్లు భావింపబడవలెను.

3 (1) ఒక కంపెనీ లేక ఒక మనిషి, అప్పిచ్చుటను మినహాయించి ఏ యితర వ్యాపారమునైన ఏ అర్ధ సంవత్సరములోనైన, ఏకైక పంచాయతీయొక్క విస్తీర్ణములో ప్రత్యేకముగా చేయుచున్న విషయములో అర్ధ సంవత్సరములో ఈ యాక్టు క్రింద వృత్తిపన్ను విధించు నిమిత్తము అట్టి వ్యాపారమును చేయుటవలన అట్టి కంపెనీ లేక మనిషియొక్క ఆదాయమును,

(a) ఆ అర్ధసంవత్సరము చేరిన సంవత్సరమునకు 1922 వ సం॥పు ఇండియాదేశపు ఇన్‌కంటాక్సు ఆక్టుక్రింద అట్టి కంపెనీ లేక మనిషిమీద ఆదాయపుపన్ను విధింపబడియున్న విషయములో ఆదాయపుపన్ను విధించుటకు 1922 వ సం॥పు ఇండియాదేశపు ఇన్‌కంటాక్సు ఆక్టుయొక్క 10 వ సెక్షనుక్రింద అట్టి వ్యాపారముయొక్క ఆదాయములు, లాభములు ఏ మొత్తమునుబట్టి లెక్కపెట్టుదురో ఆ మొత్తములో సగముగా భావింపబడవలెను, మరియు

(b) అట్టి ఆదాయములను లాభములను కనుగొనుటకు వీలులేనియెడల లేక అట్టి కంపెని లేక మనిషికి ఆదాయపు పన్ను విధింపబడనియెడల, ఆ అర్ధ సంవత్సరములో పంచాయతీ విస్తీర్ణము నందు జరిగిన వ్యాపారముయొక్క టర్నోవరు లేక దానిని కూడ తెలిసికొనుటకు సాధ్యముకాని విషయములో అంతకుపూర్వపు సంవత్సరములో దానికి సరిపోవు అర్ధసంవత్సరములోని టర్నోవరులో 4 వ విధినిబట్టి లెక్కింపబడిన శాతము లేక శాతములు

(2) ఒక కంపెనీ లేక మనిషి అప్పిచ్చు వ్యాపారముకానట్టి ఏ ఇతర వ్యాపారమునైన కొంతవరకు పంచాయతీ విస్తీర్ణములోను కొంతవరకు అట్టి విస్తీర్ణమునకు వెలుపలను చేయుచున్న సందర్భములో, ఈ ఆక్టు కింద వృత్తిపన్నును విధించు కార్యము నిమిత్తము ఆ పంచాయతీ విస్తీర్ణములో అట్టి వ్యాపారము చేయుటవలన అట్టి కంపెనీ లేక మనిషియొక్క ఆదాయము, ఆయా సందర్భమునకు తగినట్లు ఆ అర్ధసంవత్సరములో లేక అంతకు పూర్వపు సంవత్సరము యొక్క దానికి సరిపోవు అర్ధసంవత్సరములో అట్టి విస్తీర్ణములో చేయబడిన వ్యాపారముయొక్క టర్నోవరులో 4 వ విధినిబట్టి లెక్కింపబడిన శాతముగా భావింపబడవలెను

(3) (1) వ ఉపవిధి (b) క్లాజుయొక్క మరియు (2) వ యొక్క ఉపవిధి కార్యము నిమిత్తము ఏ గ్రామముయొక్కయైన వ్యాపారముయొక్క టర్నోవరు అనగా ఆ గ్రామములో ఉత్పత్తి చేయబడిన, తయారుచేయబడిన, కొనబడిన లేక విక్రయించబడిన సరుకులయొక్క లేక అప్పిచ్చు వ్యాపారముకాని ఏ ఇతర వ్యాపారము యొక్కయైన మొత్తము నగదు విలువ అని అర్ధము

వివరణము —ఈ సబ్ క్లాజుక్రింద వ్యాపారముక్రింద టర్నోవరును నిర్ణయించుటలో—

(a) ఏ కంపెనీ లేక మనిషివలన చేయబడిన కొనుగోలు ఫలితముగా ఏ సరుకుల అప్పగింతగాని మరియు అదే కంపెనీ లేక మనిషివలన వాటి విక్రయము ఫలితముగా జరుగు అప్పగింత—

ఈ రెండును మదరాసు రాజ్యములో జరిగినయెడల రెండవసారి చెప్పిన వ్యాపారమును మాత్రము లెక్కలోనికి తీసుకొనవలెను

(b) ఏదైన కంపెనీ లేక మనిషిమైన చేసిన కొనుగోలు ఫలితముగా ఏ సరుకులయొక్కనైన అప్పగింత సదరు రాజ్యమునకు వెలుపల ఏ స్థలమందైనను జరిగి అదే కంపెనీ లేక మనిషి దానిని విక్రయించినందువలన సదరు రాజ్యములో ఏస్థలమందైనను అప్పగింపబడిన విషయములో రెండవసారి చెప్పిన వ్యాపారమును లెక్కలోనికి తీసికొనవలెను

(c) ఏ కంపెనీ లేక మనిషివలనగాని చేయబడిన కొనుగోలు ఫలితముగా ఏ సరుకుల అప్పగింతగాని సదరు రాజ్యములో ఏ స్థలమందైనను చేయబడి అదే కంపెని లేక మనిషి వాటిని విక్రయించుటవలన సదరు రాజ్యమునకు వెలుపలనుండు ఏ స్థలమందైనను అప్పగింత జరిగిన విషయములో మొదట చెప్పిన వ్యాపారమును లెక్కలోనికి తీసికొనవలెను

4 వృత్తిపన్నును విధించుటకొరకు ఆదాయమును లెక్కించు కార్యము నిమిత్తము 3 వ విధియొక్క (1) వ ఉప విధియొక్క (b) క్లాజుక్రింద మరియు (2) వ ఉపవిధి క్రింది వ్యాపారముయొక్క టర్నోవరు శాతము ఈక్రింది తక్తాలోని (1) వ, (2) వ గడులలో నిర్దేశింపబడిన విధముగా నుండవలెను

ఐతే ఏ సందర్భములోనైన అట్లు లెక్కించబడిన ఆదాయము సదరు తక్తాయొక్క (3) వ గడిలో నిర్దేశింపబడిన కనీసపు మొత్తము కంటె తక్కువగా నున్నయెడల అట్టి కనీసపు మొత్తము వచ్చునట్లు శాతమును అట్టి రేటుకు హెచ్చించవలెను

తక్తా

| | శాతము | కనీస మొత్తము |
|---|---|---|
| (1) | (2) | (3) |
| | | రూ |
| వ్యాపారముయొక్క టర్నోవరు 12 లక్షలరూపాయలను మించునపుడు. | 1 | 18,000 |

| | | |
|---|---|---|
| వ్యాపారముయొక్క టర్నోవరు 6 లక్షల రూపాయలను మించి 12 లక్షల రూపాయలను మించనప్పుడు | 1 5 | 12,000 |
| వ్యాపారముయొక్క టర్నోవరు 3 లక్షల రూపాయలను మించి 6 లక్షల రూపాయలను మించనప్పుడు | 2 | 9,000 |
| వ్యాపారముయొక్క టర్నోవరు 1,50,000 రూపాయలను మించి 3 లక్షల రూపాయలను మించనప్పుడు, | 3 | 6,000 |
| వ్యాపారముయొక్క టర్నోవరు 1,50,000 రూపాయలను మించనప్పుడు, | 4 | ... |

5 (1) కార్యనిర్వాహక అధికారియొక్క అభిప్రాయములో ఏ అర్థ సంవత్సరమునకైన ఏ కంపెనీ లేక మనిషివద్దనుండిగాని వృత్తి పన్ను బాకీగానున్న పక్షమున లేక నుండగల పక్షమున ఆయన ఆ అర్ధసంవత్సరములోగాని అటుతరువాత వచ్చు అర్ధ సంవత్సరములోగాని అట్టి కంపెనికి లేక మనిషికి ఒక నోటీసును అందజేయవలెను సంబంధించిన అర్ధ సంవత్సరములో అట్టి కంపెనీ లేక మనిషి చెప్పినట్లు ఏ ఆధారమునుబట్టి వృత్తిపన్ను విధింపబడుటను అది లేక ఆయన బాధ్యుడై యుండునో అట్టి ఆదాయమును తెలుపుచు ఈవిధులకు జతచేయబడిన షెడ్యూలులో తెలుపబడియుండు ఒకనమూనాలో ఒక రిటరనను నోటీసులో నిర్దేశింపగల 30 దినములకంటె తక్కువగాని కాలపరిమితిలోపల పంపునట్లు ఆ కంపెనీ లేక మనిషిని కోరవలెను అందుమీదట అట్టి కంపెనీ లేక మనిషి వృత్తిపన్ను ఏ అర్థ సంవత్సరమునకు కోరబడినదో ఆ అర్థ సంవత్సరములో లేక అంతకు పూర్వపు సంవత్సరమునందు దానికి సరిపోవు అర్ధ సంవత్సరములో దానికి లేక ఆయనకు లభించిన ఆదాయమును తెలుపు ఒక రిటరనను పంపవలెను. మరియు అట్లు పంపిన రిటరనును ధృవపరచు

టకు కంపెని లేక మనిషి ఆధారపడగల ఏ సాక్ష్యమునైన హాజరు పెట్టవలెను

(2) (1) వ ఉపవిధి క్రింద కోరబడిన ఒక రిటరను పంపబడి కార్యనిర్వాహక అధికారి అది సరిగాను పూర్తిగాను వున్నదని తృప్తిపడిన పక్షమున అట్టి రిటరనుయొక్క ఆధారముమీద అట్టి కంపెనికి లేక మనిషికి ఆయన వృత్తి పన్ను విధించవలెను

వివరణము —(1) వ వుపవిధియొక్క (b) క్లాజు క్రిందికి లేక 3 వ విధియొక్క (2) వ ఉపవిధి క్రిందికి రాని సందర్భములలో సంబంధించిన అర్ధసంవత్సరమును కూడిన సంవత్సరము కొరకై 1922 వ సంవత్సరపు ఇండియా దేశపు ఆదాయపు పన్ను ఆక్టుయొక్క 29 వ సెక్షను క్రింద దానికి లేక ఆయనకు అందజేయబడిన ఆదాయపుపన్ను యొక్క డిమాండు నోటీసును కంపెని లేక మనిషి హాజరు పెట్టు పక్షమున ఏ ఆధారములనుండి ఈ ఆక్టు క్రింద వృత్తి పన్ను విధింప తగియుండునో ఆ ఆధారములనుండి లభించిన ఆదాయముగా అట్టి డిమాండు నోటీసులో చెప్పబడిన ఆదాయములోని సగభాగమును, వృత్తిపన్నును విధించు కార్యములకొరకు సదరు ఆధారములనుండి ఆదాయముగా తీసికొనుటకు కార్యనిర్వాహక అధికారి బద్ధుడై నుండవలెను

(3) (1) వ ఉపవిధి క్రింద కోరబడిన విధముగా ఎట్టి రిటరను గాని పంపబడని పక్షమున లేక అట్లు పంపబడిన ఎట్టి రిటరనుగాని సరియైనది కాదని లేక అసంపూర్ణమైనదని కార్యనిర్వాహక అధికారి తృప్తిపడిన పక్షమున అంచనావేసి అట్టి కంపెనీ లేక మనిషియొక్క అర్ధ సంవత్సర ఆదాయమునకు తగిన స్కేలుయొక్క తరగతిలో ఆయన ఆ కంపెనిని లేక మనిషిని వుంచవలెను

(4) కార్యనిర్వాహక అధికారి (3) వ వుపవిధి క్రింద ఏ కంపెని లేక మనిషినైన తరగతివారిగా విభజించునపుడు జరుగు వ్యాపారముయొక్క స్వభావమును, విలువనుబట్టి నివాసయోగ్యమగు వ్యాపారము జరుగు ఆవరణల పరిమాణము అద్దెనుబట్టి, వ్యాపారము చేయబడు వస్తువుల పరిమాణము సంఖ్యనుబట్టి, పనికి నియమింపబడి

యున్న మనుష్యుల సంఖ్యనుబట్టి చెల్లింపబడు ఆదాయపు పన్నునుబట్టి సాధారణముగా విభజించవచ్చును

(5) కార్యనిర్వాహక అధికారి ఏ కంపెనీ లేక మనిషియొక్కయైన లెక్కలను కోరుటకు హక్కు కలిగియుండకూడదు

6 ఏ కంపెనీ లేక మనిషివద్దనుండియైన బాకీగానుండు వృత్తిపన్ను చెల్లించబడని పక్షమున ఆ పంచాయతీయొక్క కార్యనిర్వాహకాధికారి నోటీసు అందజేసిన తేదీనుండి 15 దినములలోపల దానిని చెల్లించునట్లు అట్టి కంపెనీ లేక మనిషికి ఆయన ఒక నోటీసు పంపబడునట్లు చేయవలెను.

7 వృత్తిపన్ను విధింపబడుటకు ఏ కంపెనీ లేక మనిషిగాని పంపిన అన్ని స్టేటుమెంటులు, రిటరనులు లేక హాజరుపెట్టిన లెక్కలు లేక దస్తావేజులు రహస్యమైనవిగా భావింపబడవలెను మరియు వాటి నకళ్ళను జనసామాన్యమునకు జారీ చేయకూడదు

8 పంచాయతీయొక్క కార్యనిర్వాహకాధికారి, ఏ కట్టడము లేక భూమియొక్కయైన ఖామందు లేక అనుభవదారుని, హోటలు, బోర్డింగు లేక లాడ్జింగు గృహము, క్లబ్బు లేక వాసయోగ్యమగు గదులయొక్క ప్రతి కార్యదర్శిని లేక మేనేజరును అట్టి కట్టడము, భూమి. హోటలు, బోర్డింగు లేక లాడ్జింగు గృహము, క్లబ్బు లేక వాసయోగ్యమైన గదులలోనుండు అందరు మనుష్యుల యొక్క పేర్లుగల వ్రాతమూలకమైన ఒక జాబితాను అట్టి ప్రతి మనిషియొక్క వృత్తి వుద్యోగము లేక పని మరియు ఆయనచే చెల్లింపబడు అద్దె ఏదైన వున్నయెడల దానిని ఆయన ఆ స్థలములోనుండు కాలపరిమితిని నిర్దేశించుచు నిర్ణయింపబడిన కాలము లోపల పంపునట్లు నోటీసుద్వారా కోరవచ్చును

షెడ్యూలు

[5 (1) వ విధిని చూడుడు ]

తో అంత్యమగు అర్ధ సంవత్సరమునందు విధింపబడిన

వృత్తిపన్నుయొక్క ఆదాయముయొక్క రిటరును

(1) కంపెనీ లేక మనిషియొక్క పేరు.

(2) వ్యాపారము, వృత్తి, చేతిపని, లేక పని, లేక ఉద్యోగము యొక్క వివరము

(3) ఏవృత్తినైనా చేతిపనినైనా లేక ఏపనినైనా చేయుట వలన, లేక సర్కారు నౌకరి లేక ప్రయివేటు నౌకరి కలిగి యుండుట వలన, లేక అప్పిచ్చు వ్యాపారమునుండు అర్ధ సంవత్సరమునందు లేక అంతకు పూర్వము సంవత్సరముయొక్క దానికి సరిపోవు అర్ధ సంవత్సరమునందు పన్ను విధింపబడు మనిషికి లభించిన ఆదాయము—

(a) గ్రామములో అర్ధ సంవత్సరమునందు మొత్తములో అరువది దినములకంటె తక్కువగాకుండా,

(b) గ్రామమునకు వెలుపల ఆ అర్ధ సంవత్సరమునందు మొత్తములో అరవై దినములకంటె తక్కువగాకుండా పన్ను విధింపబడిన మనిషి గ్రామములో కాపురముండిన పక్షమున

(4) అప్పిచ్చు వ్యాపారము కానట్టి ఇతర వ్యాపారము గ్రామములో ప్రత్యేకముగా చేయబడిన పక్షములో—

(a) ఆ అర్ధసంవత్సరమునందు సంవత్సరమునకు కంపెనీకి లేక మనిషికి ఆదాయపన్ను విధింపబడిన సందర్భములో అట్టి ఆదాయపు పన్నును లెక్కపెట్టు కార్యము నిమిత్తము 1922వ సం॥పు ఇండియాదేశపు ఆదాయపన్ను ఆక్టుయొక్క 10వ సెక్షను ననుసరించి అట్టి కంపెనీ లేక మనిషియొక్క ఆదాయములు, లాభములు ఏ మొత్తము చొప్పున లెక్క కట్టబడినదో ఆ మొత్తము

(b) సదరు ఆదాయములను, లాభములను కనుగొనుటకు సాధ్యములేదని సందర్భము లేక ఆ అర్ధ సంవత్సరము చేరిన సంవత్సరముకొరకు ఆదాయపు పన్ను లెక్క విధింపబడిన సందర్భములో—

(i) ఆ గ్రామమునందు ఆ అర్ధ సంవత్సరములో జరిగిన వ్యాపారము యొక్క టర్నోవరు, లేక

(ii) అట్టి టర్నోవరును తెలుసుకొనుటకు వీలు లేని సందర్భములో అంతకు పూర్వపు సంవత్సరముయొక్క దానికి సరిపోవు అర్ధ సంవత్సరమునందు వ్యాపారముయొక్క టర్నోవరు.

(5) అప్పిచ్చు వ్యాపారము కానట్టి ఇతర వ్యాపారమును కంపెనీ లేక మనిషి కొంతవరకు గ్రామములోను కొంతవరకు అట్టి గ్రామమునకు వెలుపలను చేయుచున్న విషయమున—

(a) ఆ గ్రామమునందు ఆ అర్ధసంవత్సరములో జరుప బడిన వ్యాపారముయొక్క టర్నోవరు, లేక

(c) అట్టి టర్నోవరు కనుగొనుటకు సాధ్యము లేన పుడు అంతకు పూర్వపు సంవత్సరముయొక్క దానికి సరిపోవు అర్థ సంవత్సరములో గ్రామమునందు వ్యాపారముయొక్క టర్నోవరు

(6) పన్ను విధింపబడిన మనిషికి—

(a) గ్రామమునకు వెలుపల చేసిన వ్యాపారమునుండి, మరియు

(b) ఆ అర్ధ సంవత్సరమునందు మొత్తములో అరువది దినములకంటె తక్కువగాకుండా గ్రామములో పన్ను విధింపబడిన మనిషి కాపురముండిన పక్షమున, అర్ధ సంవత్సరములో ఏ పెన్షను లేక పెట్టుబడులనుండి లభించిన ఆదాయము

(7) కంపెనీ లేక మనిషి చెప్పిన ప్రకారము ఏ మొత్తము ఆదాయము ఆధారముమీద అది లేక ఆయన పన్ను విధింపబడ తగి వుండునో అట్టి మొత్తపు ఆదాయము

సంపాదకుని సూచిక —

యాక్టుయొక్క సెక్షను 65(5) క్రింద ప్రభుత్వముయొక్క అధికారములు ఇన్‌స్పెక్టరు జనరలుకు రీజినల్ యిన్‌స్పెక్టరులను (లోకలు అడ్మినిస్ట్రేషనుయొక్క) దత్తత చేయబడినవి

(జి ఒ నెం 1118, లోకల్ అడ్మినిస్ట్రేషన్ తేదీ 4-6-1951)

[అనుబంధము చూడుడు]

సె 66 63 వ సెక్షన్ (1) వ సబు సెక్షనులో చెప్పబడిన బండ్ల పన్ను నిర్ణయింపబడగల విధులకు లోబడియును మినహాయింపుల కును నిర్బంధములకును సంబంధించిన విధులతోసహా ప్రతి అర్ధ సంవత్సరము గ్రామములోపల ఉంచుకొనబడిన లేదా ఉపయోగింప

బడిన యావత్తు బండ్లమీదను, నిర్ణయింపబడిన కనిష్ఠపు రేట్లకు తక్కువ కాకుండను గరిష్ఠ రేట్లను మించకుండను పంచాయతి నిర్ణయించగల రేట్లు ప్రకారము విధింపబడవలెను

వివరణము — ఈ సెక్షనులో 'బండి' అనగా రోడ్డుమీద ఉపయోగమునకు తగినట్టి వాహనము అని అర్థము దీనిలో ఏ విధమైన ట్రాంబండి, బండి, మోటుబండి, వాగన్, బైసికిలు, ట్రైసికల్, రిక్షాగాని చేరియుండును అయితే దీనిలో 1939 వ సం॥పు మోటారు బండ్ల ఆక్టులో నిర్వచింపబడినట్లుండు మోటారుబండి చేరదు

66 వ సెక్షను క్రింద విధులు బండిపన్ను విధులు,

(జి ఒ నెం 520, లోకల్ అడ్మినిస్ట్రేషన్,
తేదీ 24-3-1951)

విధులు

బండిపన్ను—మినహాయింపులును, విధింపబడు గరిష్ఠ మరియు కనీసపు రేట్లు.

1 ఆక్టుయొక్క 63 (1) సెక్షను క్రింద బండిపన్ను—

(a) కేంద్ర లేక రాజ్య ప్రభుత్వములకు చెందిన మిలటరీ కార్యములకు ఉపయోగింపబడు బండ్లమీద,

(b) బండ్లను తయారుచేయు వారివలన బండ్ల వ్యాపారుల వలన విక్రయముకొరకు మాత్రము ఉంచబడియుండు బండ్లమీద ,

(c) అర్ధ సంవత్సరమునందంతయు మరమ్మత్తు చేయబడుచున్న లేక బండ్లను తయారుచేయువారి దగ్గరనున్న బండ్లమీద విధింపబడరాదు

(2) క్రింది తక్తాయొక్క (2) వ గడిలోని రేట్లకు ఎక్కువ గాకుండను (3) వ గడిలోని రేట్లకు తక్కువగాకుండగను ఉండు రేట్ల చొప్పున బండ్లపన్ను విధింపబడవలెను —

తక్తా

| బండియొక్క వివరము | గరిష్ఠ అర్థ సంవత్సరవారి పన్ను. | | | కనీసపు అర్థ సంవత్సరవారి పన్ను | | |
|---|---|---|---|---|---|---|
| (1) | (2) | | | (3) | | |
| | రూ | అ | పై. | రూ | అ | పై |
| (a) ఒకటి లేక ఎక్కువ జంతువులవలన లాగబడునట్లు నిర్మింపబడిన నాలుగుచక్రములుగల ప్రతి బండికి | 10 | 0 | 0 | 5 | 0 | 0 |
| (b) ఒకటి లేక ఎక్కువ జంతువులచే లాగబడునట్లు నిర్మింపబడని రెండు చక్రములుగల ప్రతి బండికి | 2 | 8 | 0 | 1 | 8 | 0 |
| (c) ప్రతి బైసిక్కిలుకు లేక ట్రయిసిక్కిలుకు | 2 | 0 | 0 | 1 | 0 | 0 |
| (b) బిడ్డను ఉంచి త్రోయబడు బండి లేక బిడ్డకు నడచుటను నేర్పు బండికానట్టి ఇతర ప్రతి బండి | 3 | 0 | 0 | 1 | 8 | 0 |

3 (1) పన్ను విధింపదగిన ఏ బండినైనను తనవద్ద, తన స్వాధీనములో లేక అధికారముక్రింద గలిగిన ప్రతి మనిషి ఆ బండి ఆ అర్థ సంవత్సరములో 60 దినములకంటె తక్కువగాని మొత్తము కాలపరిమితివరకు ఆ గ్రామములో ఉంచబడిన లేక ఉపయోగింపబడిన పక్షమున పూర్తి అర్థసంవత్సరవారి పన్ను విధింపబడుటకు అర్హుడై యుండవలెను.

(2) అట్టి మొత్తము కాలపరిమితి 15 దినములను మించి 60 దినములను మించని పక్షమున అర్ధ సంవత్సరవారీ పన్నులో కొంత భాగము మాత్రము విధింపబడ తగియుండవలెను

(3) అట్టి మొత్తము కాలపరిమితి 15 దినములకు మించని పక్షమున ఆ అర్ధ సంవత్సరమునకు ఎట్టి పన్నునుగాని విధించగూడదు

(4) పన్ను విధింపతగిన ఏ బండినిగాని ఆ గ్రామములో తనవద్ద స్వాధీనములో లేక అధికారము క్రింద కలిగిన ప్రతిమనిషి అందుకు వ్యతిరేకముగా తెలుపనంతవరకు దానిని ఆ గ్రామములో ఆ అర్ధ సంవత్సరములో 60 దినముల వరకు వుంచినట్లు లేక ఉపయోగించినట్లు ఊహించబడవలెను

(5) (1) వ (2) వ ఉపవిధులలో ఏదియున్నను దానితో నిమిత్తము లేకుండా ఎట్టి మనిషిగాని—

(a) ఏ బండి నిమిత్తము అదే అర్ధ సంవత్సరమునకు పూర్తి పన్ను అదివరకే పంచాయతీకి ఏ ఇతర మనిషిచేనైనను అదివరకే చెల్లింపబడి యుండునో అట్టి ఏ బండికొరకుగాని ఏ అర్ధ సంవత్సరములోనైన పంచాయతీకి పన్ను చెల్లించబడ తగియుండకూడదు.

(b) ఆయా సందర్భమునకు తగినట్లు, ఇతర పంచాయతీ, మునిసిపాలిటీ లేక కంటోన్మెంటు బోర్డుకు అదివరకే చెల్లించబడిన పన్నునుమించి అట్టి బండి సందర్భములో గ్రామములో చెల్లించవలసిన పన్నులో ఎక్కువ ఏదైన నున్నయెడల దానికి మించి, 1950 వ సం॥పు మదరాసు గ్రామపంచాయతీల ఆక్టు, 1920 వ సం॥పు మదరాసు జిల్లా మునిసిపాలిటీల ఆక్టు 1919 వ సం॥పు మదరాసు షహరు మునిసిపలుఆక్టు, లేక 1924 వ సం॥పు కంటోన్మెంటుల ఆక్టు ననుసరించి ఏ యితర పంచాయతీ లేక ఏ మునిసిపాలిటీ లేక కంటోన్మెంటు బోర్డులకైన ఏ బండి విషయములో అదివరకే చెల్లించబడినదో అట్టి ఏ బండి నిమిత్తమైన పంచాయతీకి చెల్లించుటకు బాధ్యుడై యుండకూడదు

4 ఆ అర్థ సంవత్సరము లోపల 2 వ విధిలో తెలుపబడిన తక్తాలోని అదే వివరము క్రిందికివచ్చు మరియొక బండిని ఏ బండికైనను బదులుగా ఒక వ్యక్తి వుంచుకొన్న పక్షమున సదరు వ్యక్తి బండి విరిగిపోవుటవలన మరియొక బండిని వుంచుకొనవలసిన సందర్భములో మరియు ఆ బండి విరిగిపోయిన సమయమందు దానికి బదులుగా వుంచుకొనిన బండిని ఆయన తనవద్ద తన స్వాధీనములో లేక తన అధికారము క్రింద కలిగియుండిన పక్షమున ఒక పన్నును ఒకసారి కంటె ఎక్కువ సారులు చెల్లించుటకు బాధ్యుడై యుండగూడదు మరియు అట్టి పన్ను చెల్లుబడి మొత్తము విరిగిపోయిన బండి మరియు అట్టి బండికి బదులుగా వుంచుకొనబడిన బండి ఆ అర్థ సంవత్సరములో ఎన్ని దినములవరకు వుంచుకొనబడినవో లేక ప్రయోగించుకొనబడినవో అట్టి మొత్తము దినముల సంఖ్యవలన క్రమపరుపబడవలెను.

5 పంచాయతీయొక్క అనుమతితో లేక ఆ సంస్థచే నిర్మింపబడిన విధుల కనుగుణముగా కార్యనిర్వాహకాధికారి ఒక సంవత్సరమునకు మించని ఏ కాలపరిమితికైనను, బండి పన్నుకు బదులుగా చెల్లింపబడు కొంత మొత్తమునకు, విక్రయమునకు లేక అద్దెకు బండ్లను వుంచుకొనియుండు నిర్ణయింపబడిన గుర్రపు శాలలను కాపాడు ఏ వ్యక్తితో లేక ఇతర మనిషితోనైనా రాజీ చేసికొనవచ్చును

సె 67 (1) ఆస్తి పరివర్తనలమీాద సుంకము—

(a) ఒక పంచాయతి విచారణాధికారము క్రింద ప్రదేశములో నుండు స్థిరాస్తికి సంబంధించిన ఈ క్రింద నిర్దేశింపబడిన వివరముగల ప్రతి దస్తావేజుమీాద, మదరాసు రాజ్యములో తత్కాలమందు అమలులోనున్న 1899 వ సం॥పు ఇండియా దేశపుస్టాంపు ఆక్టుచే విధింపబడిన సుంకముమీాద సర్చార్జి రూపములో, మరియు

(b) అట్టి దస్తావేజుకు ఎదురుగా క్రింద నిర్దేశింపబడిన మొత్తముమీాద నూటికి అయిదు వంతులకు మించని, గవర్నమెంటువారిచే నిర్ణయింపబడగల రేటు చొప్పున విధింపబడవలెను

| దస్తావేజుయొక్క వివరము | సుంకము ఏ మొత్తము మీాద విధింపబడవలెను. |
| --- | --- |
| (i) స్థిరాస్థి విక్రయము | దస్తావేజులో తెలుపబడినట్లుండు విక్రయము యొక్క ప్రతిఫలము తాలూకు మొత్తము లేక విలువ |
| (ii) స్థిరాస్థిని మార్పుకొనుట | దస్తావేజులో తెలుపబడినట్లుండు అత్యధిక విలువగల ఆస్తియొక్క విలువ. |
| (iii) స్థిరాస్థి దానము | దస్తావేజులో తెలుపబడినట్లుండు ఆస్తి విలువ |
| (iv) స్థిరాస్థియొక్క స్వాధీన తాకట్టు | దస్తావేజులో తెలుపబడినట్లుండు తాకట్టుచే రక్షింపబడిన మొత్తము |
| (v) స్థిరాస్థిని శాశ్వతముగా గుత్త కిచ్చుట | దస్తావేజులో తెలుపబడినట్లుండు మొత్తము విలువలో లేక గుత్తయొక్క మొదటి ఏబది సంవత్సరముల విషయమున చెల్లించబడు లేక అప్పగించబడు ఆస్తుల విలువలో ఆరవ భాగమునకు సమానమైన మొత్తము |

(2) పైన చెప్పిన పన్నును ప్రవేశపెట్టిన మీాదట —

(a) ఒక పంచాయతీయొక్క విచారణాధికారము క్రింద ప్రదేశములోనుండు అట్టి సందర్భములోను మరియు అట్టి ప్రదేశమునకు వెలుపలనుండు ఆస్థి సందర్భములోను వివరములను అది ప్రత్యేకముగా తెలుపబడవలెనని కోరబడిన నెట్లో అట్లే సదరు ఇండియా దేశపు స్టాంపు ఆక్టుయొక్క 27 వ సెక్షనును అర్థము చేసికొనవలెను,

(b) అదే ఆక్టుయొక్క 64 వ సెక్షను, పంచాయతీని గవర్నమెంటును సూచించినట్లు అర్థము చేసికొనవలెను

(3) పన్ను వసూలు క్రమపరచుటకున్ను, దానిని క్రింద (4) వ సబ్ సెక్షనులో వివరించిన ప్రకారము పంచాయతీకి, జిల్లా బోర్డుకు, పంచుటకున్ను వసూలు నిమిత్తము ప్రభుత్వమునకగు ఏదైన ఖర్చును అందునుండి మినహాయించుటకున్ను, యీ యాక్టుకు ప్రతికూలము కాని విధులను ప్రభుత్వము చేయవచ్చును

(4) పన్నును పంచాయతీకి, జిల్లా బోర్డుకు ఈ క్రింది విధముగా పంచబడును —

(a) 3/5 (అయిదింట మూడువంతులు) పన్ను పంచాయతీకి యివ్వవలెను

(b) 2/5 (అయిదింట రెండు వంతులు పన్ను జిల్లా బోర్డున) కియ్యవలెను

## సెక్షను 67 క్రింద జారీచేసిన ఆస్తి పరివర్తనపై విధించు పన్ను రేటు నిర్ణయించుచూ జారీచేసిన గవర్నమెంటు ఆర్డర్.

(జి ఒ, నెం 468 ఎల్ ఏ తేదీ 6–5–1955)

1950 వ సం॥ మద్రాసు విలేజీ పంచాయితీ ఆక్టు, సెక్షను 67 (1) (b) క్రింద, ఫోర్టుసెంటు జార్జిగెజెటు, 1-A భాగము 282 పేజీలో ప్రచురణచేయబడి లోకలు అడ్మినిస్ట్రేషను శాఖ వారి నోటిఫికేషను రద్దుచేస్తూ, ఆంధ్ర గవర్నరుగారు అధికారములు చెలాయించు యీ క్రింది విధమున ఉత్తరువులు జారీచేయుచున్నారు

సెక్షను 63 (2) క్రింద, స్థిరాస్థి విక్రయము మార్పు, దానము, అనుభవముతో తాకట్టు శాశ్వతముగ గుత్తకు నిచ్చుటలో దస్తావేజులమీాద పన్ను, దస్తావేజులో చెప్పబడిన ఏ మొత్తముపై పన్ను విధింపబడునో, ఆ మొత్తములో రూపాయలు 100 పైన అయిదు రూపాయలు

## ఆస్తి పరివర్తనపై పన్ను వసూలుజేయు విధానములు మొదలగు విషయముల గురించి జారీచేసిన విధులు

(జి ఒ నెం 677 ఎల్ ఎ తేదీ 2-4-52)

### విధులు

### ఆస్తి పరివర్తనలపై సుంకము

1 సంగ్రహనామము —ఈ విధులను 1951 వ సం॥పు మదరాసు పంచాయతీల (ఆస్తి పరివర్తనలపై సుంకము) విధులు అని చెప్పవచ్చును.

2 నిర్వచనములు—ఈ విధులలో విషయమునుబట్టిగాని, పూర్వోత్తర సందర్భమునుబట్టిగాని ఏదైన వ్యతిరేకముగ నున్ననే తప్ప—

(1) 'ఆక్టు' అనగా 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టు అని అర్థము

(2) 'దస్తావేజు' అనగా 67 వ సెక్షను ననుసరించి పరివర్తన సుంకము విధింపబడనగు స్థిరాస్థియొక్క విక్రయము, మార్పు, బహుమానము శాశ్వతముగా స్వాధీనమునకుగాని కౌలుకు గాని తణఖాకు సంబంధించిన దస్తావేజు అని అర్థము

(3) 'విభాగము' అనగా ఆక్టుయొక్క ఒక సెక్షను అని అర్థము

(4) 'స్టాంపు ఆక్టు' అనగా మదరాసు రాజ్యమందములులో నున్న 1899 వ సం॥పు ఇండియా దేశపు స్టాంపు ఆక్టు అని అర్థము.

(5) 'పరివర్తన సుంకము' అనగా 67 వ సెక్షను ననుసరించి విధింపనగు స్థిరాస్తియొక్క పరివర్తనలపై సుంకము అని అర్థము, మరియు

(6) ఈ విధులలో నిర్వచింపబడనిమాటలు, ప్రయోగములు అన్నియు స్టాంపుఆక్టునందును దాని క్రిందచేయబడిన విధుల యందును క్రమముగ వాటికి నొసంగబడిన అర్థములనే కలిగియుండవలెను.

3 స్టాంపు ఆక్టుయొక్క నిబంధనలు పరివర్తన సుంకమునకు వర్తించుట—

(1) స్టాంపు ఆక్టుయొక్కయు, దాని క్రిందచేయబడిన విధుల యొక్కయు నిబంధనలన్నియు ఆ ఆక్టుక్రింద విధింపనగు సుంకము విషయములో వర్తించుచున్నట్లుగనే వీలగునంతమేరకు పరివర్తన సుంకము విషయములోగూడ వర్తించవలెను

(2) పరివర్తన సుంకము లేక అందలి ఏదైన భాగము రెండు అణాలకంటె తక్కువగ నున్నయెడల, అట్టి సుంకము లేక భాగము వసూలు చేయబడకూడదు.

4 దస్తావేజులలో వ్రాయవలసిన వివరముల విషయములో రిజిష్టరుచేయు ఉద్యోగులయొక్క కర్తవ్యములు—(1) ఏ రిజిష్టరు చేయు వుద్యోగికైనను రిజిష్టరుచేయు నిమిత్తము ఏ దస్తావేజైనను అర్పింపబడినప్పుడెల్లను, స్టాంపు ఆక్టుయొక్క 27 వ సెక్షనులో తెలుపబడిన వివరములు, 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టుయొక్క 67 (2) (a) వ సెక్షనుతో చదువబడినట్లుండు స్టాంపు ఆక్టుయొక్క 27 వ సెక్షనుచే కోరబడిన ప్రకారము, సదరు దస్తావేజులో ప్రత్యేకముగా వ్రాయబడియున్నవా అని చూడవలయును మరియు సదరు ఆస్తి ఏ పంచాయతీయొక్క విచారణాధికారము లోపలగలదో అని వ్రాయబడియున్నదాయని కచ్చితముగా తెలిసికొనవలెను

(2) పై జెప్పబడిన వివరములు అట్లు దస్తావేజులో వేర్వేరుగా తేలుపబడనియెడల, రిజష్టరుచేయు ఉద్యోగి దానిని నిలిపిపెట్టి, అసలుప్రతిని కలెక్టరుకు పంపవలెను 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టుయొక్క 67 (2) (b) సెక్షనులో చదువబడినట్లుగు స్టాంపు ఆక్టుయొక్క 64 వ సెక్షనును చూడవలెనని కలెక్టరును కోరవలెను

(3) మార్పు దస్తావేజుపై విధింపనగు సుంకము ఈ క్రింది విధముగా క్రమపరుపబడవలెను—

(a) మార్పుచేసికొనబడిన ఆస్తుల విలువలు అసమానముగ నున్నయెడల వాటిలో ఎక్కువ విలువగల ఆస్తియొక్క ధరపై సుంకము విధింపబడవలెను

(b) మార్పు చేసుకొనబడిన ఆస్తుల విలువలు సమానముగ నున్నయెడల విధింపనగు ఎక్కువ సుంకపు మొత్తమును విధించవలెను

5 పరివర్తన సుంకము విషయమైన లెక్కలను వ్రాసియుంచుట మరియు ఒకటిగ చేర్చుట—(1) (a) ప్రతి రిజిష్టరుచేయు ఉద్యోగియును, ఆయనచే రిజిష్టరుచేయబడిన ప్రతి దస్తావేజు విషయము

లోను చెల్లింపబడిన సుంకమునుగూర్చి లెక్కను వ్రాసియుంచ వలెను అందు స్టాంపు ఆక్టుచే విధింపబడిన సుంకమును, పరివర్తన సుంకమును విడి విడివిగా చూపవలెను సంబంధించిన ఆస్తి ఏ పంచా యతీకియొక్క విచారణాధికారమందుగలదో అట్టి ప్రతి పంచాయతీకివి కూడ ప్రత్యేకముగ లెక్కను వ్రాసియుంచవలెను ఏ మొత్తముపై పరివర్తన సుంకము విధింపబడవలెనో అను విషయమును అవసరమై నప్పుడెల్లను, సంబంధించిన కక్షీదారువద్దనుండి, కచ్చితముగా తెలిసి కొనవలెను

(b) వినిమయ దస్తావేజుపై విధింపబడిన సుంకమును, సంబంధించిన స్థానిక అధికార వర్గముల మధ్య, ఆయా స్థానిక విస్తీర్ణ ములలోని ఆస్తులపై విధింపనగు సుంకపు మొత్తముయొక్క దామా షాలో పంపకము చేయవలెను

(c) పై చెప్పబడిన లెక్కను ఇన్‌స్పెక్టరు-జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషన్‌ను మూడుమాసముల కొకతూరి ప్రతి పంచాయతీ విషయ ములోను ఒకటిగ చేర్చవలెను

(d) ఇన్‌స్పెక్టరు-జనరల్, ఇందు నిమిత్తము రిజిస్టరు చేయు ఉద్యోగులు లెక్కలను వ్రాసియుంచుటను గురించియు, ప్రతి మూడు మాసములకు మదరాసులోని అక్కౌంటెంట్ జనరల్‌కు ఒక టిగా చేర్చబడిన లెక్కల ఏ నమూనాలో పంపవలెనో ఆనమూనాను గురించియు వారికి కార్యనిర్వాహక సలహాల నొసంగవచ్చును

(2) 1908 వ సం॥పు ఇండియాదేశపు రిజిస్ట్రేషను ఆక్టు యొక్క 17 వ విభాగము క్రింద తప్పని సరిగా రిజిస్టరుచేయబడ నవ సరము లేని కారణమున రిజిస్టరుచేయు ఉద్యోగికి పంపబడనట్టి దస్తా వేజుల సందర్భములో, అట్టి ఏ దస్తావేజునైన స్టాంపు ఆక్టుయొక్క 31 లేక 41 వ విభాగము ననుసరించి ఎవరి ఎగుట హాజరుపెట్టబడునో లేక పై చెప్పబడిన ఆక్టుయొక్క 33 వ విభాగము ననుసరించి అట్టి దస్తావేజును ఎవరు నిలిపి పెట్టుకొందురో లేక ఆక్టుయొక్క 38 వ విభా గము ననుసరించి అట్టి ఏ దస్తావేజు విషయములోనైన లేక అట్టి ఏ దస్తా

వేజుయొక్కయైన అసలు ప్రతి విషయములో చెల్లించబడిన సుంకమును లేక దండనను గూర్చిన సర్టిఫికేటు పొందుదురో ఆ కలెక్టరు అట్టి ప్రతి దస్తావేజు విషయమునందును చెల్లించబడిన సుంకమునకు లెక్కను వ్రాసియుంచవలెను అందు స్టాంపు ఆక్టువలన విధింపబడిన సుంకమును, పరివర్తన సుంకమును వేర్వేరుగాచూపవలెను. ఆయన ప్రతి మూడు మాసముల కాలపరిమితి ముగిసిన మీదట ఒక మాసము లోపున సంబంధించిన జిల్లా అస్యూరెన్సుల రిజిస్ట్రారుకు మూడు మాసముల కొకతూరి ఒకటిగ చేర్చబడిన లెక్కను పంపవలెను. దానిలో అట్టి ప్రతి దస్తావేజు సందర్భమునను, వ్రాసియిచ్చినమనషి, దావదారుయొక్క పేర్లను, వ్రాసియిచ్చిన తేదీని, వ్యవహారముయొక్క స్వభావమును, పరివర్తనసుంకము విధింపబడనగు మొత్తమునుగూర్చిన వివరములను, పంచాయతీయొక్క హద్దులలోపల లేక అట్టి హద్దులకు వెలుపలనున్న ఆస్తినిగూర్చిన తప్సీళ్లను తెలుపవలెను

(3) ఏ సందర్భములోనైన ఏ దస్తావేజుపైనను చెల్లింపనగు పూర్తిసుంకమును రాబట్టుకొనుట యసాధ్యమగునెడల, అట్టి దస్తావేజుపై రాబట్టుకొనబడిన సుంకమునందు స్టాంపు ఆక్టువలన విధింపబడిన సుంకముపోగా మిగిలిన భాగమునమాత్రమే ఈ విధులలో తెలుపబడిన లెక్కలందు పరివర్తన సుంకముగ పరిగణించవలెను

6 పరివర్తనసుంకము విషయమై వాపసు చేయుబడినమొత్తములను గూర్చిన త్రైమాసిక వివరణమును కలెక్టరు సంబంధించిన జిల్లా రిజిస్ట్రారుకు పంపుట-ఏ దస్తావేజుపైనైన చెల్లింపబడిన పరివర్తన సుంకమును వాపసు చేయుటకు సాదరుచేయు ప్రతి కలెక్టరు, ప్రతి మూడు నెలల కాలపరిమితి ముగిసినమీదట ఒక నెలలోపున, సంబంధించిన జిల్లా అస్యూరెన్సుల రిజిస్ట్రారుకు, ఆ మూడు నెలల కాలపరిమితియందు వేటి విషయములు అట్టి వాపసులు సాదరు చేయబడినవో ఆ దస్తావేజులనుగూర్చి ఒక్క వివరణమును పంపవలెను దానిలో వాపసుచేయబడిన పరివర్తన సుంకముయొక్క మొత్తమును

మరియు ప్రతి దస్తావేజు విషయములోను 5 (2) వ విధియందు తెలుప బడిన వివరములను వ్రాయవలెను

7. స్థానిక అధికారవర్గములకు చెల్లింపవలసిన సొమ్మునుగూర్చి అక్కౌంటెంట్ జనరల్‌కు ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషను సమాచారమును పంపుట -5 వ విధియొక్క (1) మరియు (2) వ ఉప విధులయందు తెలుపబడిన దస్తావేజుల విషయములో ప్రతి పంచాయతీకి త్రైమాసికముగ చెల్లించవలసిన మొత్తమును మరియు ప్రభుత్వమునకు జమకట్టబడవలసిన పరివర్తన సుంకపు వసూలుకుగాను తగ్గింపు చేయనగు మొత్తమునుగూర్చిన సమాచారమును ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషను ప్రతి మూడు మాసముల కాలపరిమితి ముగిసినమీదట రెండు మాసములలోపున మదరాసులోని అక్కౌంటెంట్ జనరల్‌కు పంపవలెను

సంబంధించిన పంచాయతీకి చెల్లించవలసిన మొత్తము, చెల్లింపబడిన పరివర్తన సుంకమునుండి పరివర్తన సుంకపు వసూలు నిమిత్తము అందు నూటికి మూడువంతుల సొమ్మును మరియు 6 వ విధియందు తెలుపబడిన వాపసు లేవైన నున్నయెడల వాటి మొత్తములను తగ్గించగావచ్చు మొత్తముగ నుండవలెను

ప్రతి పంచాయతీకిని చెల్లింపవలసిన నికరపుసొమ్మును లెక్కించుటలో, ఆరు పైసలు లేక అంతకుపై బడిన అణాయొక్క బిన్నములును ఒక అణాగ గ్రహింపబడవలెను, అంతకు తగ్గినవి వదిలిపెట్టబడవలెను

8 అకౌంటెంట్ జనరల్ స్థానిక అధికారవర్గములకు చేయు చెల్లింపులు-ప్రతి మూడు నెలల కాలపరిమితి ముగిసిన మీదట మూడు నెలలలోపున మదరాసులోని అకౌంటెంట్ జనరల్, 7 వ విధి ననుసరించి ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషనుయొక్క సమాచారము ప్రకారము చెల్లింపనగు మొత్తములను సంబంధించిన పంచాయతీకి చెల్లించుటకుగాను, ట్రెజరీలకు అవసరమగు అధికారములను నియ్యవలెను పరివర్తన సుంకపు వసూలు నిమిత్తమైన తగ్గింపు రుసుములను ప్రభుత్వమునకు జమకట్టవలెను.

పన్నుల విధింపు, మరియు వసూలుకు సంబంధించిన విధులు.

(జి .ఒ నెం 1116, లోకల్ అడ్మినిస్ట్రేషన్, తేదీ 4-6-1951)

(జి ఒ నెం. 495, లోకల్ అడ్మినిస్ట్రేషన్, తేదీ 14-5-1955)

(జి ఒ నెం 917 పి, మరియు ఎల్ ఎ తేదీ 28-6-60)

A పన్నులన్నింటికి వర్తించు విధులు

విధులు

పన్నుల విధింపును, వాటిని రాబట్టుకొనుటయును,

A పన్నులన్నింటికిని సంబంధించిన సామాన్యవిధులు

1 కార్యనిర్వాహక అధికారి, ఈ విధులలో ఇతర విధముగ నిబంధింపబడిన విధముగా తప్ప, ప్రతి మనిషిచే లేక ఆస్తిమీద చెల్లించవలసిన పన్నును నిర్ణయించవలెను

అయితే కార్యనిర్వాహక అధికారిచే చెల్లింపబడవలసినట్టి పన్నుల సందర్భములో, పన్ను విధింపు పంచాయతీచే చేయబడవలెను

2 (a) పంచాయతీకి, ఏ మనిషికిగాని లేక ఆస్తివిషయములోగాని అసంపూర్తిగ పన్ను విధింబడెననియు, లేక ఏ పన్నుకు సంబంధించిన విషయములోనైన పన్ను విధింపు పుస్తకములనుండి అజాగ్రత్తవలనగాని, అనుచితముగగాని విడిచిపెట్టబడెననియు లేక సదరు పుస్తకములో, ఏ ముసద్దీ తప్పుగాని, గణితలోపముగాని ఉన్నదనియు, ఏ సమయమందైనను పంచాయతీకి తెలియవచ్చినప్పుడు, అది తాను న్యాయమని, లేక అవసరమని తలచునట్టి విధముగ సదరు పుస్తకములను సవరించవలెనని కార్యనిర్వాహక అధికారిని ఆజ్ఞాపించవచ్చును

అయితే, పన్నువిధింపులో హెచ్చింపుకలుగు సందర్భములో సంబంధించిన మనిషికి సూచింపబడిన విధముగ పన్నువిధింపు పుస్తకములలో ఎందులకు సవరణలు చేయుబడకూడదో, దానినిగూర్చి

పంచాయతీకి కారణములను తెలుపుటకు, న్యాయమైనట్టి అవకాశ మును ఇచ్చిననేతప్ప అట్టి యే ఆజ్ఞగాని ఇవ్వబడకూడదు

(b) అట్టి సవరణ జరుగుముందు అర్ధ సంవత్సరములోగాని సవరణను న్యాయమని నిరూపించు పరిస్థితులుండు కాలమునకు అవ్యవహితముగా పూర్వమువచ్చు రెండు అర్ధసంవత్సరములలోగాని చాల ముందుగవచ్చు తేదీన అమలులోనికి వచ్చినట్లు భావింపబడవలెను.

3 (1) కార్యనిర్వాహక అధికారి పన్నును చెల్లించు ప్రతి మనిషికి ఒక రశీదు నియ్యవలెను అది ఆయనచేగాని, ఆ విషయములో ఆయనచే అధికారమియ్యబడిన ఏ ఇతరమనిషిచేగాని సంతకము చేయబడవలెను

(2) అట్టి రశీదు—

(a) అది జారీచేయబడిన తేదీని,

(b) అది ఎవరికి జారీ చేయబడినదో ఆ మనిషియొక్క పేరును,

(c) ఏ పన్ను విషయమై చెల్లింపు చేయబడినదో ఆ పన్నును,

(d) చెల్లింపు ఏ కాలపరిమితివరకు చేయబడినదో ఆ కాలపరిమితిని,

(e) చెల్లించిన పైకపు మొత్తములు,

నిర్దేశించవలెను

## B. ఇంటిపన్నును నిర్ణయించుట

4 పంచాయతి ఇంటిపన్నునిమిత్తము, ఇండ్లను వాటి సంవత్సరిక లేక మూలధనపు విలువనుబట్టి పన్నును నిర్ణయించుటకు నిశ్చయించినప్పుడు, దానిచే నిర్ణయించబడిన రేట్లు, ప్రతి ఇంటియొక్క విలువకు దామాషాలోనైన నుండవచ్చును, లేక ఇంటి విలువననుసరించి క్రమ క్రమముగా ఎక్కువకావచ్చును, అయితే, ఏ సందర్భములోగాని, ఇంటి విలువ ఎక్కువగుచుండగా అది తగ్గిపోకూడదు.

5 (1) పంచాయతీచే, దామాషా రేటు (పద్ధతి) అవలంభింప బడినసందర్భములో అది పన్నును లెక్కించు మరియు వసూలు చేయుపనిని సులభముగాచేయుటకు, గ్రామములోని ఇండ్లనన్నింటిని సమూహములుగా చేయవచ్చును

(2) పంచాయతీ క్రమక్రమముగా హెచ్చురేటును అవలంభించినపుడు అది (i) తరగతివారీగా విభజనచేయు సిద్ధాంతములను నిర్ణయించవలెను (అనగా, పన్నులేకుండ ఒక మొత్తము ప్రతి ఇంటి అసెస్మెంటునుండి తగ్గించబడవలెను లేక ఆ హెచ్చుదల తక్కువ తరగతిలోని ఒకానొక శాతమునుండి హెచ్చు తరగతిలో ఒకానొక శాతమువరకు ఉండవలెనని మరియు (ii) ప్రతి తరగతియొక్క సిసలైన సంఖ్యను పరిమితులను నిర్ణయించవలెను

(3) పంచాయతీ, ఏ విషయములోగాని దామాషా పద్ధతి పన్ను విధింపు సిద్ధాంతమును లేక క్రమక్రమమైన హెచ్చింపు పద్ధతి పన్నువిధింపు సిద్ధాంతమును ఎక్కువగా బాధించు విధముగా తరగతులను ఏర్పాటుచేయకూడదు మరియు తరగతుల సంఖ్య ఏ సందర్భములోగాని ఆరింటికి తక్కువగా నుండకూడదు

6 (1) గ్రామములోచేరిన ఏ విస్తీర్ణముమీదనైనను విచారణాధికారముగల కరణము, కార్యనిర్వాహక అధికారి కోరినమీదట అట్టి విస్తీర్ణములోనుండు అన్ని ఇండ్లజాబితాను తయారుచేసి ఆయనకు ఇవ్వవలెను మరియు ఆ జాబితాలో ఆ ఇండ్ల యజమానుల యొక్కయు వాటిని ఆక్రమించుకొనిన వారియొక్కయు పేర్లను నమూదుచేయవలెను

(2) కరణము అట్టి జాబితాను తయారుచేయుటకును, కలెక్టరు అంగీకారమునకు లోబడి, పంచాయతీచే నిర్ణయింపబడగలట్టి ప్రతిఫలము ఏదైననున్నయెడల దానిని పుచ్చుకొనుటకును హక్కు కలిగియుండవలెను

7. కార్యనిర్వాహక అధికారి, 6 వ విధిలో చెప్పబడిన జాబితాలు తనకు అందినమీదట, పన్ను విధింపు పుస్తకములను తయారు చేయించవలెను అట్టి పన్నువిధింపు పుస్తకములు,

స్పష్టమైన కాలములలో స్వంతదారు పేరును, ప్రతి ఇంటి అనుభవ దారు పేరును, అట్టి ఇల్లు ఏ తరగతి క్రిందనైన పన్ను చెల్లించు చున్నయెడల ఆ తరగతిని, బాకీగా రావలసియుండు పన్ను మొత్తమును పన్ను చెల్లింపబడవలసినట్టి తేదీని చూపవలెను

8 పన్నువిధింపు పుస్తకములు తయారుచేయబడిన వెంటనే, కార్యనిర్వాహక అధికారి ఆ విషయమునుగూర్చియు, ఆ పుస్తకములు ఏ స్థలము లేక స్థలములలో తనిఖీచేయబడవచ్చునో, దానినిగురించి యూ గ్రామములో దండోరా వేయుట మూలముగా బహిరంగపరచ వచ్చును

9 (1) కార్యనిర్వాహక అధికారి పన్నువిధింపు పుస్తకములను ఒక సాధారణ రివిజనుకు మరియొక సాధారణ రివిజనుకు మధ్య ఎప్పుడైనను వాటిలో ఏ ఇంటినైనను చేర్చుటద్వారా లేక వాటినుండి ఏ ఇంటినిగాని తీసివేయుటద్వారా లేక ఏ ఇంటియొక్కయైన విలువను లేక తరగతివారీ విభజనను లేక దానికైను చెల్లించవలసిన పన్ను మొత్తమును మార్చుటద్వారా లేక ఈ సందర్భమున రాజ్యప్రభుత్వమువారు చేయు ఏ ఇతర విధులకైనను లోబడి దానిలో యింటి ఖామందుయొక్కయైన పేరునకు బదులుగా పరివర్తనవలన లేక ఇతర విధముగా ఆ ఇంటిస్వామ్యమునకు వారసత్వపు హక్కుగల ఏ యితర వ్యక్తియొక్కయైన పేరును వ్రాయుటద్వారా సవరణ చేయవచ్చును

(2) అట్టి సవరణ ఏ అర్ధ సంవత్సరమందు చేయబడునో ఆ అర్ధ సంవత్సరముయొక్క మొదటిదినమునుండి అమలుకువచ్చునని భావింపబడవలెను

అయితే ఆ సవరణ ఏ అర్ధ సంవత్సరమందైనను ఆ అర్ధ సంవత్సరమునకు డిమాండునోటీసు ఇవ్వబడిన పిమ్మట చేయబడిన యెడల 1949 వ సం॥పు మదరాసు కట్టడములను అద్దెకిచ్చుటనైనను మరియు అద్దెను నిర్ణయించుటపైనను అధికారముగల చట్ట ననుసరించి యింటికి న్యాయమగు అద్దెను నిర్ణయించుటను ఆ సవరణ అమలు పరచు సందర్భములోతప్ప అది తరువాత అర్ధ సంవత్సరమునుండి మాత్రమే అమలు కలిగించవలెను.

ఇదియునుగాక, ఆ సవరణ 1949 వ సం॥పు మదరాసు కట్టడముల (అద్దెకిచ్చుటపైనను మరియు అద్దెను నిర్ణయించుటపైనను అధికారముగల) ఆక్టు ననుసరించి యింటికి న్యాయమగు అద్దె నిర్ణయించు కారణమునుబట్టి అవసరమగునెడల, ఆ సవరణ అట్లు న్యాయమగు అద్దె నిర్ణయింపబడిన తేదీనుండి అమలుకురావలెను

మరియు, ఒక యింటియొక్క స్వామ్యము పరివర్తనలో ఏ వివాద విషయమునగాని కార్యనిర్వాహక అధికారియొక్క తీర్మానము పరివర్తన పొందు వ్యక్తి ఇంటిపై చట్టబద్ధమైన హక్కు నియ్యకూడదు.

(3) ఒక సాధారణ రివిజనునకు మరియొక సాధారణ రివిజనునకు మధ్య కార్యనిర్వాహక అధికారి ఏ యింటికైనను మొదటిసారిగ పన్ను విధించు లేక ఏ యింటిమీదనైన విధింపబడిన పన్నును, ఏ రేట్లప్రకారము పన్నును విధింపనగునో ఆ రేట్లయొక్క సాధారణ హెచ్చింపు సందర్భములో గాక ఇతరవిధముగ, హెచ్చించు ప్రతి విషయములోను, కార్యనిర్వాహక అధికారి ప్రత్యేకనోటీసుద్వారా అట్టి ఇంటియొక్క ఖామందుకు లేక అనుభవదారునకు, పన్ను విధింపును పునర్విమర్శచేయుమని కోరు అర్జీ పంచాయతీ ఆఫీసుకు, ప్రభుత్వము, రైల్వేపాలనశాఖ లేక కంపెనివారి విషయములో నోటీసును పంపిన తేదీనుండి అరువది దినములలోపునను ఇతర సందర్భములలో అట్టి నోటీసును పంపిన తేదీనుండి ముప్పది దినములలోపునను అందినయెడల విచారింపబడునని తెలుపవలెను

10 ఏ వ్యక్తియైనను, ఒక అర్ధ సంవత్సర అంతరమునకు పూర్వము ముప్పది దినములకు తక్కువగాకుండ లేక అరువది దినములకు ఎక్కువ కాకుండ ఎప్పుడైనను, కార్యనిర్వాహక అధికారిని, ఆ వ్యక్తి రాబోవు అర్ధ సంవత్సరమునకు చెల్లించుటకు బాధ్యుడగు పన్నును ఏ యింటి విషయమై పన్ను విధింపబడెనో ఆ యింటియొక్క సంవత్సరిక లేక మూలధనపు విలువ కడపటగా ఆ యింటిపై పన్ను విధింపబడిన లేక పునర్విమర్శ చేయబడిన పిమ్మట తగ్గినదను ఆధారముపై తగ్గించవలెనని రివిజను అర్జీద్వారా కోరవచ్చును

11 9 (3) వ విధి లేక 10 విధి క్రింద ఒక రివిజను అర్జీ పరిష్కారము చేయబడినవెంటనే, కార్యనిర్వాహక అధికారి, అర్జీదారునకు లేక అధికారముపొందిన ఆయన ఏజెంటునకు దానిపై చేయబడిన ఉత్తరువులనుగూర్చి హక్కు-రూపమునగాని, లిఖితపూర్వకముగాగాని తెలియజేయవలెను. రివిజను చేయబడి నిర్ణయింపబడిన మొత్తమును, అట్టి సమాచారము అందిన తేదీనుండి పదునైదు దినముల లోపుగను లేక అది యింకను చెల్లింపబడవలసినది కానియెడల ఏ తేదీనుండి చెల్లింపబడవలసినదగునో ఆ తేదీనుండి పదునైదు దినములలోపుగను చెల్లించవలెనని ఆజ్ఞాపించవలెను మరియు అవసరమైనచో పన్ను విధింపు పుస్తకములు సరిదిద్దబడునట్లు చేయవలెను

12 కార్యనిర్వాహక అధికారి ప్రతి అర్ధ సంవత్సరమునకును క్రొత్త జాబితాలు లేక పన్ను విధింపు పుస్తకములు తయారుచేయబడునట్లు చేయుటకు బద్ధుడుకాడు క్రితి అర్ధ సంవత్సరమునకుగాను చేయబడిన లేక చేయబడగల సవరణలతో క్రితి అర్ధ సంవత్సరపు వాటిని గ్రహించవచ్చును

అయితే క్రొత్త సాధారణపన్ను విధింపు అయిదేండ్లకొక సారి చేయబడవలెను అంతేగాక ప్రభుత్వము ప్రచురణద్వారా క్రొత్తగా తయారుచేయబడు పన్ను జాబితా అమలులోనికి వచ్చు తేదీని ముందుకు తీసుకొనిరావచ్చును లేదా వెనుకకు పొడిగించవచ్చును లేక సదరు పన్ను జాబితా సవరణ ఏ కాలపరిమితులలో జరిపించవలెనో నిర్ణయింపవచ్చును

అట్టి సవరణలను మరియు సాధారణపన్ను విధింపునుగూర్చి 8 వ విధిలో నిబంధింపబడిన రీతిగా పబ్లికు నోటీసు నియ్యవలెను

సాధారణపన్ను విధింపు ఏ అర్ధ సంవత్సరములో అట్టి నోటీసు ఇయ్యబడునో ఆ అర్ధ సంవత్సర మొదటి దినమున అమలులోనికి వచ్చినట్లు భావింపబడవలెను

12-A (1) ఈ విధులలో నేమిశాసించినప్పటికి లోకలు అడ్మినిస్ట్రేషను రీజినల్ ఇన్‌స్పెక్టరు తన యధీనమునయున్న నే పంచా

యతినైన పన్ను జాబితా పరిపూర్ణసవరణకై సవరణోద్యోగి (రివిజనల్ ఆఫీసరు) నియామకమునకుగాను ప్రచురించవచ్చును సదరు రివిజను ఆఫీసరు నిర్ణయింపబడినకాలము నియమింపబడి 7 మరియు 8 వ విధులలో పన్ను జాబితా సవరణ విషయమై నిర్దేశింపబడిన కార్యనిర్వాహక అధికారి అధికారములను చెలాయించుట, పనులను చేయుట, మరియు విధులను నిర్వర్తించుటకు పూనుకొనవలెను పై చెప్పబడిన ప్రచురణకాగానే- ఈ విధులలో "కార్యనిర్వాహక అధికారి" అను పదము పన్ను జాబితా సవరణ లేక సదరు సవరణకు అన్వయించు నోటీసు విషయములలో "రివిజను ఆఫీసరు" అను పదముగా మార్చబడినట్లు ఊహింపబడవలెను

(2) (a) ఇన్‌స్పెక్టరు–జనరలు రివిజను ఆఫీసరుని నియమించవలెను మరియు సదరు రివిజను ఆఫీసరు తనవిధి నిర్వహింపజేయగల్గుటకు, ఇన్‌స్పెక్టరు–జనరలుకు అవసరమని తోచిన సిబ్బందిని, పంచాయతీనుండి ఇవ్వమని కార్యనిర్వాహక అధికారికి ఇన్‌స్పెక్టరు–జనరలు ఉత్తరువు జారీచేయవలెను

(b) రివిజను ఆఫీసర్ల జీతబత్యముల్, మరియు శెలవు బత్యములు ప్రావిడెంటుఫండు నిమిత్తము చందాలు పూర్తిగానో లేక కొంతభాగమునో పంచాయతీనుండి ఇన్‌స్పెక్టరు తన సాధారణ ఉత్తరువు లేక ప్రత్యేకపు ఉత్తరువు ప్రకారము వసూలుచేయవలెను.

(c) 7 విధిలోని సూచనలకు లొంగి, కార్యనిర్వాహక అధికారి ఇంటిపన్ను జాబితాను రివిజను ఆఫీసరు చేసిన విలువల కనుగుణ్యముగా సంచవలెను

(d) రివిజను ఆఫీసరు, తన అధికారములు చెలాయించుటకు లేక పనులు సాగించుటకు లేక విధులను నిర్వర్తించుటకు వలయు సిబ్బందిని కావలెనని కోరిన కార్యనిర్వాహక అధికారి సదరు సిబ్బంది నివ్వవలెను

C బండ్లపై పన్నులు

13 (1) కార్యనిర్వాహక అధికారి, బండ్ల పన్నును చెల్లించుటకు బాధ్యుడగునని భావింపబడునట్టి ప్రతి వ్యక్తికిని,

ఆ వ్యక్తి ఉంచుకొను లేక ఉపయోగించు బండ్లనుగూర్చి పన్ను విధింపుటకై అవసరమని కార్యనిర్వాహక అధికారి అవసరమని తలచు సమాచారములతో భర్తీచేయబడుటకై ఇచ్చివేయబడిన తక్తాలను పంపవలెను

(2) ఆ తక్తాలు అది ఎవరికి పంపబడెనో ఆ వ్యక్తి, లిఖిత పూర్వకముగా అట్టి సమాచారములతో భర్తీచేసి సంతకము జేసి, తేదీ వేసి అది అందిన తేదీనుండి ఒక వారములోపల పంచాయతీ ఆఫీసుకు త్రిప్పి పంపవలెను

(3) (2) వ ఉపవిధిలో నిర్దేశింపబడిన ఒక వారము కాలపరిమితి గడచినమీదట, కార్యనిర్వాహక అధికారి ఆ వ్యక్తికి నోటీసు పంపబడునట్లు చేయవలెను ఆ నోటీసులో అది అందిననాటినుండి పదునైదు దినములలోపుగ, బండ్లపన్ను క్రింద ఆ వ్యక్తి చెల్లించుటకు బాధ్యుడగునని కార్యనిర్వాహక అధికారి తలచు మొత్తమును చెల్లించవలెనని కోరవలెను

14 ఏ వ్యక్తియైనను ఏ బండి విషయమునగాని చెల్లించవలసిన మొత్తమును చెల్లించునెడల, అట్లు చెల్లించిన మొత్తము కాలపరిమితికి సంబంధించునో ఆ కాలపరిమితియందు ఆ బండిని ఉంచుకొనుటకు లేక ఉపయోగించుకొనుటకు కార్యనిర్వాహక అధికారి లైసెన్సును మంజూరు చేయవలెను

15 14 వ విధి క్రింద లైసెన్సు మంజూరుచేయబడిన ప్రతి బండికినీ ఒక పంచాయతీ సంఖ్యను వేయవలెను. ఆ సంఖ్యను పంచాయతీ ఆఫీసులో రిజిష్టరు చేసికొనవలెను

అయితే ఒక బండికి ఏ ప్రత్యేక చట్టముయొక్క నిబంధనల క్రిందనైన ఒక సంఖ్య అతికించవలసియున్నయెడల దానికి పంచాయతీ సంఖ్య వేయ అవసరములేదు

16 పంచాయితీ సంఖ్యగాని, 15 వ విధిచే కోరబడినట్లు ఏదైన ప్రత్యేక చట్టముయొక్క నిబంధనల క్రింద సంఖ్యగాని వేయబడని

యెడల కార్యనిర్వాహక అధికారి ఎప్పుడైనను ఆ బండిని పట్టుకొని యుండవచ్చును.

అయితే సైకిలు, ట్రైసైకిలు లేక రిక్షాకాక ఇతరమైన ఏ బండినిగాని, దానిలో ఏ ప్రయాణీకునిగాని లేక సరకులనుగాని గొని పోవుటకై వాస్తవముగ వినియోగించుకొనబడినప్పుడు, పట్టుకొన కూడదు లేక నిలిపి యుంచకూడదు

17 (1) పట్టుకొనబడిన బండిని అట్లు పట్టుకొనినప్పటినుండి పది దినములలోపుగ తమదని ఎవ్వరును కోరనియెడల మరియు దాని సందర్భమున చెల్లించవలసిన పన్ను చెల్లింపబడనియెడల, కార్య నిర్వాహక అధికారి, దానిని బహిరంగ వేలమందు విక్రయించవలె ననియు, అట్టి విక్రయ ఆదాయములు—

(1) విక్రయింపబడిన బండి విషయమున పన్ను ఏదైనను బాకీగానున్నయెడల ఆ పన్నును,

(ii) కార్యనిర్వాహక అధికారి ఆజ్ఞాపించగల పన్ను మొత్తమును మించని అపరాధమును, మరియు

(iii) పట్టుకొనుటకు నిలిపియుంచుట మరియు విక్రయించు సందర్భములో తగిలిన ఖర్చులకుగాని ఎనిమిదణాల మొత్తమును

చెల్లించుటకు వినియోగించవలెననియు ఆజ్ఞాపించవచ్చును

(2) పట్టుకొనిన తేదీనుండి పది దినములలోపుగ లేక విక్రయము లకు పూర్వమెప్పుడైనను బండియొక్క ఖామందు లేక దానిమీద హక్కుగల ఇతరవ్యక్తికి ఆ బండిని హక్కుగ కోరినయెడల—

(1) దానిపైగల పన్నును,

(ii) కార్యనిర్వాహక అధికారి ఆజ్ఞాపించగల పన్ను మొత్తమును మించని అపరాధమును, మరియు

(iii) పట్టుకొని నిలిపియుంచుట సందర్భములో తగిలే ఖర్చు లకుగాను నాలుగణాల మొత్తములు,

చెల్లించినమీదట అతనికి తిరిగి ఇచ్చివేయవలెను

## D. అప్పీళ్లు

18 ఈ క్రింది పన్నులను లెక్కపెట్టు మరియు విధించు విషయమున పంచాయతీకి అప్పీలు చేసికొనవచ్చును.

(a) 7 వ 12 వ విధుల ననుసరించి మరియు, రివిజను ఆర్జీపై 11 వ విధిక్రింద కార్యనిర్వాహక అధికారియొక్క, ఉత్తరువుల ననుసరించి లెక్కపెట్టబడిన మరియు విధింపబడిన ఇంటిపన్ను,

(b) కార్యనిర్వాహక అధికారి విధించు—

(1) ఏ బండిమీాదనైన పన్ను,

(11) ఏదైన వృత్తిపన్ను, మరియు

(c) ఈ ఆక్టుక్రింద వ్యవసాయభూమిపై ఏ పన్ను నిర్ణింపు ఇన్‌స్పెక్టరుచే మంజూరు చేయబడెనో అట్టి పన్నును విధించుట

19 పంచాయతీకి చేసికొనబడిన ఏ అప్పీలునుగాని—

(1) ఫిర్యాదుచేయబడిన పన్ను కోరబడిన పిమ్మట పదునైదు దినములలోపల అది పంచాయతీ ఆఫీసునకు చేరిననేగాని, మరియు

(11) కార్యనిర్వాహక అధికారి పేదరికమునుబట్టి ఇతర విధముగ ఆజ్ఞాపించునప్పుడు తప్ప, దేనివిషయమై అప్పీలు చేసికొనబడినదో ఆ పన్నును (1) వ క్లాజులో నిర్దిష్టముచేయబడిన కాలపరిమితి లోపుగ పంచాయతీ ఆఫీసునందు చెల్లించిననేగాని లేక డిపాజిటు చేసిననేగాని,

విచారణ చేయకూడదు

అయితే, (1) వ క్లాజులో నిర్దిష్టముచేయబడిన కాలము తరువాత పదునయిదు దినములలోపుగ ఒక అప్పీలును, పైన చెప్పబడిన కాలములోపుగ దాఖలు చేసికొనకుండుటకు దానికి తృప్తికరముగ కారణమును చూపబడిన యెడల, పంచాయతె అంగీకరించవచ్చును

20 పంచాయతీ తనంతట తానే లేక ఇతరవిధముగగాని కార్యనిర్వాహక అధికారి పన్నును తగ్గించుచు లేక ముదరాయిచ్చుచూ చేసిన ఏ ఉత్తరువునుగాని రద్దుచేయవచ్చును లేక మార్పు చేయవచ్చును

21 పన్నువిధింపు పుస్తకములను అప్పీలుపై పంచాయతి చేసిన ఏ ఉత్తరువుల ననుసరించియైనను సరిచేయవలెను పంచాయతీచే తగ్గింపబడుచున్న లేక మదరా ఇయ్యబడుచున్న ఏ పన్నుయొక్కయైన మొత్తము సందర్భములో ఆ ప్రకారముగనే సొమ్ము వాపసును కార్యనిర్వాహక అధికారి మంజూరుచేయవలెను

22 ఇంతకుపూర్వము నిబంధింపబడినట్లు ఎట్టి అప్పీలుగాని లేనప్పుడు పన్నుయొక్కయైన విధింపు లేక డిమాండు, మరియు అట్టి అప్పీలున్నయెడల దానిపై పంచాయతియొక్క తీర్పు అంత్యమైనదిగ నుండవలెను

అయితే, పన్నుయొక్క ఏ విధింపు లేక డిమాండుగాని పన్ను విధింపు పుస్తకము ననుసరించి యుండనియెడల, ఈ విధిలో చెప్పబడిన దేదియు, క్రొత్తగ పన్నుయొక్క విధింపు లేక డిమాండును దాని ననుసరించి చేయుటనుండి నిషేధించునట్లు భావింపబడకూడదు.

E పన్నుల పసూలు

23 (1) ఏ వ్యక్తియైనను ఇంటిపన్నును చెల్లించవలసి యున్నప్పుడు పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి, రావలసి యున్న మొత్తమునకుగాను, 24 వ విధియొక్క నిబంధనలను అమలు పరచబోవుటకు పూర్వము ఒక బిల్లును పంపవలెను

(2) (1) వ ఉపవిధి క్రింది బిల్లు కార్య నిర్వాహక అధికారిచే లేక ఆయనచే ఈ విషయమున క్రమముగా అధికారమియ్యబడిన వనిషిచే సంతకము చేయబడవలెను మరియు అది

(a) పన్ను విధింపబడిన కాలపరిమితి మరియు ఏ ఇంటి విషయములో అది విధింపబడెనో ఆ ఇంటిని గూర్చిన వివరములను గూర్చిన స్టేటుమెంటును ,

(b) చెల్లించక తప్పిపోయిన సందర్భములో తగిలిన బాకీలను గూర్చిన నోటీసును ,

కలిగియుండవలెను

(3) 24 వ విధిలో చెప్పబడియుండు విధముగా ఏ మనిషి నుండియైన, అట్టి మనిషిమీద ఆ అర్థ సంవత్సరములోపలగాని లేక

అటుతరువాత వచ్చు అర్ధ సంవత్సరములోపలగాని బిల్లు అందచేయ బడిననే తప్ప, ఏ అర్ధ సంవత్సరమునకైన ఎట్టి పన్నునుగాని రాబట్టు కొనకూడదు

అయితే 2 వ విధి ననుసరించి పన్ను విధింపు పుస్తకములు సవరింపబడిన సందర్భములో, సవరణ చేయబడిన అర్ధసంవత్సరములో లేక అటుతరువాత వచ్చు అర్ధ సంవత్సరములో బిల్లు అందచేయ బడవచ్చును

(5) ఈ విధిలో లేక 24 వ విధిలో ఏమియున్నను పంచాయతీ తనకు బాకీగా రావలసియుండు పన్నుకొరకు ఒక సివిలుకోర్టులో వ్యాజ్యము చేయుటను నిషేధించకూడదు

24 (1) బిల్లు అందచేయబడిన లేక 11 వ విధిలో చెప్పబడిన ఆజ్ఞ ఇవ్వబడినప్పటినుండి పది హేను దినములలోపల కోరబడిన పన్ను మొత్తము చెల్లింపబడని పక్షమున లేక పన్ను చెల్లించవలసిన మనిషి అది ఎందులకు చెల్లింపబడకూడదు దానికైన కారణమును కార్యనిర్వాహక అధికారికి తృప్తికరముగునట్లు చూపినచో, కార్యనిర్వాహక అధికారి చెల్లించుటకు తప్పిపోయిన మనిషియొక్క చరాస్థిని వారంటు క్రింద జప్తుచేసి విక్రయించుట మూలముగా, పన్ను క్రింద బాకీగా రావలసిన మొత్తమును, వారంటు రుసుము జప్తు రుసుములతో మరియు అట్లు జప్తుచేయబడిన ఆస్తియొక్క నిలుపుదల లేక విక్రయము విషయమై బహుశః తగులగలట్టి ఖర్చులను తృప్తికరముగ తీర్చగలట్టి అదనపు మొత్తమును రాబట్టుకొనవచ్చును

అయితే 1908 వ సం॥పు సివిల్ ప్రొసీజరుకోడు యొక్క 60 వ సెక్షనుకైన మినహాయింపు నిబంధనలో నివారింపబడిన చరాస్థి ఏ కాలమందైనను జప్తు చేయబడరాదు

(2) చెల్లించుటకు తప్పిపోయిన మనిషియొక్క చరస్థిరజప్తు చేయుటకు లేక తగినంతవరకు జప్తుచేయుటకు ఏ కారణమును బట్టి యైన సాధ్యముకాని యెడల, కార్యనిర్వాహక అధికారి ఒక మేజి స్ట్రేటు సమక్షమున చెల్లించుటకు తప్పిపోయిన మనిషిని ప్రాసిక్యూట్ చేయవచ్చును

(3) (1)వ ఉపవిధి క్రింద వారంటు, ఈవిధులకైన Aఅను భంధములో నుండు నమూనాలోగాని దానికి సమానమైన ఏ నమూనాలోగాని వుండవలెను, మరియు అట్టి ప్రతివారంటుకు రెండు అణాల రుసుము విధించబడవలెను

(4) కార్యనిర్వాహక అధికారియొక్క వ్రాతమూలకమైన ప్రత్యేక ఉత్తరువు ననుసరించి జప్తు వారంటును అమలు జరుపుటకు నియోగింపబడిన ఏ ఉద్యోగిగాని, తాను పట్టుకొనుటకు వీలుగానుండు నట్టి ఆస్థి బ్రాక కట్టడమున కలిగియున్నదని నమ్ముటకు తగినంత ఆధారము లున్నయెడల మరియు తన అధికారమును, తాను వచ్చిన కార్యమును తెలియజేసి ప్రవేశమును కోరిన మీదట, అట్టి ప్రవేశమును ఇతర విధముగా పొందని పక్షమున సూర్యోదయమునుండి సూర్యాస్తమయమునకు మధ్య ఏ ఇంటిలోని బయటి లేక లోపలి తలుపును లేక కిటికీని బలాత్కారముగ తెరువవచ్చును

అయితే అట్టి ఉద్యోగి స్త్రీలకు ప్రత్యేకింపబడిన చోట్లను, తన ఉద్దేశమును గూర్చి మూడు గంటల కాలము నోటీసునిచ్చి, అట్టి స్త్రీలు వేరొక చోటికి పోవుటకు తగినంత వ్యవధిని ఇచ్చునంతవరకు వారుండు ఏ గదిలోగాని ప్రవేశించకూడదు లేక గది తలుపును బలాత్కారముగ తెరువకూడదు

25 (1) వారంటును అమలు జరుపుటకు నియోగింపబడిన ఉద్యోగి జప్తుచేయుటకు పూర్వము బాకీగా రావలసియుండు పన్ను మొత్తమును వారంటు రుసుమును చెల్లించవలెనని కోరవలెను పన్ను మొత్తమును, రుసుమును చెల్లింపబడిన యెడల, ఎట్టి జప్తుగాని చేయబడకూడదు అయితే పన్నుగాని, రుసుముగాని చెల్లింపబడనప్పుడు, ఉద్యోగి—

(a) తాను యుక్తమని తలంచగల, చెల్లించక తప్పిపోయిన మనిషి చరాస్థిని పట్టుకొనవలెను,

(b) అట్లు పట్టుకొనిన ఆస్థి వివరముల జాబితాను తయారు చేయవలయును, మరియు

(c) అట్లు పట్టుకొనిన కాలమందు, అట్లుపట్టుకొనబడిన ఆస్థిని స్వాధీనమునందుగల మనిషి, ఈ నియమములకైన B అనుబంధము లోని నమోనాలో లేక అదే విధమైన ఏదో ఒక నమూనాలో వస్తువుల జాబితా నకలు నొకదానిని ఇయ్యవలెను

అయితే, బాకీ మొత్తములను చెల్లించుటకును, పట్టుకొనబడిన ఆస్థిని విడిపించుకొనుటకు ఏడు దినముల కాలపరిమితి ఇయ్యబడ వలెను

(2) జప్తు అత్యధికముగ నుండరాదు అనగా జప్తు చేయబడిన ఆస్థి, వారంటు, జప్తు, నిలుపదల, విక్రయము-వీటివల్ల కలిగిన అన్ని ఖర్చులతో చేరి, చెల్లించక తప్పిపోయిన మనిషిచే బాకీగా చెల్లించవలసిన పన్నును సాధ్యమైనంతవరకు సమాన విలువలో నుండవలెను

26 (1) పన్ను, వారంటు రుసుము, జప్తురుసుము మరియు ఆస్థిని నిలిపియుంచుకొనినందులకు సంబంధించిన ఖర్చులకొరకు, పైకము చెల్లించుటకు తప్పిపోయిన మనిషి బాకీపడిన మొత్తము 25 వ విధి ననుసరించి ఇయ్యబడిన నోటీసులో తెలుపబడిన ఏడు దినముల కాల పరిమితిలోపల చెల్లింపబడని పక్షమున, మరియు కార్యనిర్వాహక అధికారి జప్తువారంటును నిలిపియుంచని పక్షమునను కార్యనిర్వాహక అధికారియొక్క ఉత్తరువుక్రింద పట్టుకొనబడిన ఆస్థి లేక అందులో చాలినంత భాగము బహిరంగవేలముద్వారా విక్రయింప బడవలెను ఆయన విక్రయములవలన వచ్చిన పైకమును, పన్ను, వారంటు రుసుము, జప్తురుసుము, ఆస్థిని నిలిపియుంచుకొని విక్రయించుటకు సంబంధించిన ఖర్చులకుగాను బాకీగానుండు మొత్తమును చెల్లించుటకు వినియోగించవలెను పైన చెప్పబడిన విధముగా విక్రయము మరియు, దాని విక్రయ పైకమును వినియోగించిన తరువాత మిగిలియుండు ఏ ఆస్థి లేక మొత్తమునైన, పట్టుకొనబడిన కాలమునందు ఆస్థి ఎవరి స్వాధీనములో నుండెనో ఆ మనిషికి తిరిగి ఇచ్చివేయవలెను విక్రయమువలన లభించిన మొత్తముపన్ను, వారంటు రుసుము, జప్తు రుసుము ఆస్థిని నిలిపియుంచుటకు విక్ర

యుంచుటకు సంబంధించిన ఖర్చులను బట్టి బాకీగా ఏర్పడిన మొత్తము చెల్లించుటకు చాలక పోయిన పక్షమున, చెల్లించక నిలిపి యుంచు మొత్తము సందర్భములో కార్యనిర్వాహక అధికారి మరల 24 విధి క్రింద చర్య జరిగించవచ్చును

(2) బాకీగా ఉన్న మొత్తము ముందుగా చెల్లింపబడిననే తప్ప, పట్టుకొనబడిన ఆస్థి త్వరగా లేక స్వాభావికముగ చెడిపోవు సందర్భమున కార్యనిర్వాహక అధికారి సదరు ఏడు దినముల కాలపరిమితి పూర్తిగాక ముందే విక్రయించవచ్చును

(3) కార్యనిర్వాహక అధికారి సదరు ఏడు దినముల కాల పరిమితి లోపల ఏ ఆస్థియొక్క జప్తు విషయమున చేయబడిన ఏ ఆక్షేపణనైన ఆలోచించవలెను మరియు దానిని విచారణ చేయునంత వరకును విక్రయమును త్రోసిపుచ్చి ఉంచవచ్చును పట్టుకొనబడిన ఆస్థి జప్తు చేయబడుటకు తగినది కాదని కార్యనిర్వాహక అధికారి తీర్మానించు పక్షమున, ఆయన దానిని తిరిగి ఇచ్చివేయవలెను లేక అదివరకే విక్రయింపబడిన యెడల విక్రియ పైకమును దానికై హక్కు కలిగినట్లు అగపడు మనిషికి యిచ్చివేసి మరల 24 వ విధి క్రింద చర్య తీసికొనవలెను మొదటి జప్తు మరియు విక్రయమునకు సంబంధించిన అన్ని రుసుములు, ఖర్చులు అవి జప్తు చేయబడ తగదని అతనికి తెలిసియు ఆయన బుద్ధి పూర్వకముగ ఆస్థి జప్తు చేయబడుటకు అనుమతించెనని కార్యనిర్వాహక అధికారికి తెలిసిన పక్షమున, చెల్లించుటకు తప్పిపోయిన మనిషినుండి రాబట్టవలెను

27 (1) పంచాయతీ నిర్ణయించగల ఈ విధులకైన 'C' అనుబంధములో చెప్పబడిన రేట్లకు మించని రేట్ల చొప్పున జప్తు రుసుము చెల్లింపబడవలెను

(2) అట్టి రుసుములో జప్తు చేయబడిన ఏ ఆస్థినైన నిలిపి యుంచుటవలన కలిగిన ఖర్చులు చేరునట్లు భావించకూడదు

28 24 వ విధియొక్క (1) వ ఉపవిధి క్రింద చెల్లించుటకు తప్పిపోయిన మనిషియొక్క ఆస్థి పంచాయతీ ప్రదేశములో ఎచ్చట నుండినను దానిని జప్తు చేయవచ్చును.

29 24 వ విధియొక్క (1) వ ఉపవిధిలో నిర్దేశింపబడిన కాలపరిమితి చివర ఏ యింటియొక్క సందర్భములోనైనా బాకీగా నుండుపన్ను, పూర్తిగాగాని కొంతవరకుగాగాని చెల్లించబడక నిలిచి యున్న పక్షమున, కార్యనిర్వాహక అధికారి సదరు పన్ను పంద్రెండు నెలలకంటె ఎక్కువ కాలము చెల్లించక ఉండని పక్షమున తర్వాత మూడు అట్టి కట్టడముయొక్క అనుభవదారుని పన్నైను దినముల కంటె తక్కువగాని ఒక నిర్దిష్టమైన కాలపరిమితిలోపల ఆ మొత్తమును చెల్లించునట్లు కోరవచ్చును అనుభవదారు అట్టి కోరికను నెరవేర్చని పక్షమున, కట్టడములో కనుగొనబడిన ఏ చరాస్థినైన కార్యనిర్వా హక అధికారి జప్తుచేసి విక్రయించవచ్చును మరియు పైన చెప్ప బడిన విధులయొక్క నిబంధనలు అవసరమైన మార్పులతో ఈ విధి క్రింద చేయబడిన అన్ని జప్తులకును విక్రయములకును వర్తించవలెను. అయితే అనుభవదారు బుద్ధిపూర్వకముగ జప్తును లేక చాలినంత జప్తును ఆటంక పెట్టిననే తప్ప అతనినుండి రాబట్టుకొనబడవలసిన ఏ మొత్తము సందర్భములోగాని ఏ అనుభవదారునైన ప్రాసిక్యూట్ చేయకూడదు లేక అతనిమీద సివిల్ వ్యాజ్యమును జరుపకూడదు.

30 24 వ విధియొక్క (1) వ ఉపవిధిలో నిర్దేశింపబడిన కాలపరిమితి చివర ఏ మనిషివద్దనుండియైన బాకీగా రావలసిన ఏపన్ను గాని పూర్తిగా లేక కొంతవరకు చెల్లింపబడక నిలిచియున్న పక్షము నను అట్టిమనిషి ఇండియా దేశమును వదలిపెట్టిన పక్షమునను లేక కనుగొనబడని పక్షమునను చెల్లించక నిలిచియున్న సదరు పన్ను లేక అందలి భాగము, దాని సందర్భమున చెల్లించవలసిన మొత్త ముతోసహా, అవి భూమి శిస్తు బాకీవలె రాబట్టుకొనబడ తగియుండ వలెను.

31 (1) 24 వ విధియొక్క (2) వ ఉపవిధి క్రింద ప్రాసిక్యూట్ చేయబడిన ప్రతి మనిషీ, ఆయన బాకీపడిన మొత్తమును చెల్లించు టకు బుద్ధిపూర్వకముగ తప్పిపోయెనని లేక జప్తును లేక చాలినంత ఒక జప్తును ఆయన బుద్ధిపూర్వకముగా ఆటంక పెట్టెనని మాజిస్ట్రేటు నకు తృప్తికలుగునట్లు ఋజువుపరచిన మీాదట——

(a) పన్ను మరియు, వారెంటు రుసుము ఏదైననున్న దానివలన, మరియు

(b) జప్తుజరిగిన విధమున జప్తురుసుము మరియు జప్తు చేయబడిన ఆస్థిని ఉంచుకొనుటకును,

విక్రయించుటకును సంబంధించిన ఖర్చువలన

ఆయన బాకీపడిన మొత్తమునకు రెండు రెట్లకు మించిన జుల్మానాను చెల్లించుటకు బద్ధుడై యుండవలెను

(2) (1) వ సబు సెక్షను క్రింద నేరమునకు ఏ మనిషియైనను నేరస్థాపన చేయబడినప్పుడెల్లను, మాజిస్ట్రేటు, విధింపబడగల ఏ జుల్మానాకైన అదనముగా (1) వ ఉపవిధియొక్క (a), (b) క్లాజులలో నిర్దేశింపబడిన శీర్షికల క్రింద బాకీగానుండు మొత్తము లేవైన నున్నయెడల వాటిని తక్షణము వసూలుచేసి పంచాయతీకి చెల్లించవలెను ఆయన ఇష్టానుసారము, ప్రాసిక్యూషనుయొక్క ఖర్చులుగా ఆయన నిర్ణయించగల మొత్తమేదైన నున్నయెడల దానిని కూడ తక్షణమే వసూలుచేసి పంచాయతీకి చెల్లించవలెను

32 కార్యనిర్వాహక అధికారిగాని, పంచాయతీయొక్క ఏ ఉద్యోగి లేక నౌకరుగాని, పైనచెప్పిన విధుల క్రింద జరుగు జప్తుకు ఆస్తియొక్క ఏ విక్రయములోనైన ఏ ఆస్తినిగాని ప్రత్యక్షముగానైన పరోక్షముగానైన కొనగూడదు

33 ఆక్టుయొక్క 64 (1) (c) సెక్షను క్రింద చేయబడిన విధులలో చెప్పబడిన ఆధారముమీద విధింపబడిన ఇంటిపన్ను అసెస్‌మెంటుకు, అట్లు పన్నుకట్టుటయొక్క పునర్విచారణకు పన్నుకట్టుటకు గురించిచేసిన అప్పీళ్ళకు, అట్టి ఇంటిపన్నును రాబట్టుటకు పైన చెప్పిన విధులు, అవసరమైన మార్పులతో వర్తించవలెను

A అనుబంధము

జప్తు వారంటు

[24 (3) వ విధిని చూడుడు ]

వారంటు నె రు

....... .. . . . . . . కు

(వారంటును అమలుజరుపవలసిన ఉద్యోగి పేరు)

(ఏ ఆవరణ విషయములో పన్ను లేక పన్నులు బాకీగా నున్నదో అట్టి ఆవరణ ఏదైన నున్నయెడల అది మరియు దాని విష యమున బాకీగానుండు పన్ను లేక పన్నులను తెలుపుడు)

.. యొక్క ... . 19 , లో ఉంత్సవమగు నిమిత్తము పైన తెల్పినపన్ను లేక పన్నులకొఱకు బాకీగానుండు రూ. అ పై మొత్తము నుండి క్రమముగా కోరబడి నట్లు కోరినతర్వాత పదునైదు దినములు గడచిపోయినప్పటికిని సదరు మొత్తమును చెల్లించక పోయినందున, లేక అట్లు చెల్లించకపోయి నందుకు చాలినంత కారణమును తెలుపకపోయినందునను సదరు రూ అ పైల మొత్తమును, వారంటు రుసుముకొఱకు రెండు అణాలతోసహా కోరవలసినదని మిమ్ము ఆజ్ఞాపించడమైనది అట్లు చెల్లించుటకు తప్పిపోయిన పక్షమున, సదరు రూ అ పైల మొత్తమునకు, వారంటు రుసుము, జప్తు రుసుముకొఱకు రూ అ పైలతోసహా, రెండును చేరి రూ అ పైల మొత్తమునకు, మరియు అట్టి జప్తు సామానును ఉంచుకొని విక్రయించిన చార్జీలకు గాను చాలినంత అదనము పైకమునకు, సదరు . యొక్క సామానులు (లేక ఆయా సందర్భములకు, తగినట్లు, సూచింపబడిన ఆవరణలో అగపడిన ఏ సామానులు లేక గృహోపకరణములైన) మీరు జప్తుచేయవలెను అట్లు జప్తుచేయబడిన తర్వాత మరుసటి ఏడు దినములలోపల అట్లు జప్తుచేయబడిన వస్తువులను ఉంచినందుల కైన ఖర్చులకుగాను చాలినంత అదనపు మొత్తముతోచేర్చి, సదరు పన్ను లేక పన్నులకొఱకు బాకీగానుండు మొత్తము మరియు రుసుములు చెల్లింపబడనిపక్షమున, నాచే ఇకమీద జారీచేయబడు ఉత్తరువుల ననుసరించి సదరు సామానులను, గృహోపకరణములను అమ్మి, జప్తు ఆస్తిని విక్రయించగా వచ్చిన పైకమును పంచాయతి ఆఫీసులో చెల్లించవలెను ఈ విక్రయపైకమునుండి సదరు పన్ను లేక పన్నులకై బాకీగానుండు మొత్తము, మరియు రుసుము అనగా రూ అ. పై మరియు జప్తు వస్తువులను ఉంచుకొని అమ్మి నందులకైన చార్జీలు, తగ్గించుకొని నిధికి జమకట్టబడును మిగతా ఏదైన నున్నయెడల అది జప్తుచేయబడిన సరుకుల, గృహోప

కరణముల ఖామందుకు తిరిగి యిచ్చివేయబడును సదరు .. యొక్క సరుకులు, గృహోపకరణములనుండి జప్తు లేక చాలినంత జప్తు చేయజాలకపోయిన యెడల ఈ వారంటుతో సహా దానిని మీరు నాకు సర్టిఫై చేయవలెను

(కార్యనిర్వాహక అధికారియొక్క సంతకము.)

స్థలము
19 వ సం॥ . . తేది

B అనుబంధము

జాబితా నమూనా మరియు విక్రయ నోటీసు వస్తువుల
[25 (1) (c) విధిని చూడుడు ]
(పట్టుకొనబడిన సరకుల మరియు చరాస్తుల వ్రాయుడు )

19 సం॥ముతో అంతమగు నిమిత్తము చెల్లించవలసిన వివరములను మార్జినులో పేర్కొనబడినపన్ను లేక పన్నులకుగాను బాకీగానుండు రూ ల మొత్తము క్రింద, పై జాబితాలో నిర్దేశింపబడిన సకలకును మరియు గృహోపకరణములను నేను ఈదినమున పట్టు కొంటిననియు, మీరు. పంచాయతీ ఆఫీసులో వారంటు రుసుము, జప్తు రుసుము, సరకులను గృహోపకరణములను నిలిపి యుంచుటకగు ఖర్చులతోసహా చెల్లించవలసిన మొత్తమును, ఈ నోటీసుయొక్క తేదీనుండి వారము దినములలోపుగ మీరు చెల్లించి ననేతప్ప, సరుకులు మరియు గృహోపకరణములు.... 19...... యొక్క.... . దినమున పంచాయతీ ఆఫీసునందు కార్య నిర్వాహక అధికారి అజ్ఞాపించగల ఇతర స్థలమందు విక్రయింపబడు ననియు, మరియు ఆ సరుకులు మరియు గృహోపకరణములు త్వరితము గాను, స్వాభావికముగాను పాడైపోవునట్టి వైన యెడల అవి అంతకు పూర్వమే విక్రయింపబడుననియు తెలిసికొనుట

స్థలము
తేదీ 19

(జప్తువారంటును అమలుజరుపు అధికారియొక్క సంతకము.)

# C అనుబంధము

## జప్తులపై చెల్లింపనగు గరిష్ఠ రుసుముల పట్టీ

[27 (1) వ నిబంధన ననుసరించి]

| ఎంతకు జప్తుచేయబడెనో ఆ సొమ్ము, | | | | రుసుము | | |
|---|---|---|---|---|---|---|
| | | | | రూ | అ | పై |
| 1 రూపాయకి తక్కువ | | | | 0 | 4 | 0 |
| 1 రూపాయి మరియు అంతకు మించి కాని 5 రూపాయలకు తక్కువగ | | | | 0 | 8 | 0 |
| 5 రూపాయలు మరియు అంతకుమించి కాని, 10 రూపాయలకు తక్కువగ | | | | 1 | 0 | 0 |
| 10 | డిటో | 15 | డిటో | 1 | 0 | 0 |
| 15 | డిటో | 20 | డిటో | 2 | 0 | 0 |
| 20 | డిటో | 25 | డిటో | 2 | 8 | 0 |
| 25 | డిటో | 30 | డిటో | 3 | 0 | 0 |
| 30 మించి, కాని, | | 35 | డిటో | 3 | 8 | 0 |
| 35 | డిటో | 40 | డిటో | 4 | 0 | 0 |
| 40 | డిటో | 45 | డిటో | 4 | 8 | 0 |
| 45 | డిటో | 50 | డిటో | 5 | 0 | 0 |
| 50 | డిటో | 60 | డిటో | 6 | 0 | 0 |
| 60 | డిటో | 80 | డిటో | 7 | 8 | 0 |
| 80 | డిటో | 100 | డిటో | 9 | 0 | 0 |
| 100 | రూపాయలు మరియు అంతకుమించి | | | 10 | 0 | 0 |

ఈ పై చార్జీలలో, జప్తుచేయబడిన ఆస్తిని భద్రపరచుటకు జవాను లుంచబడిన విషయములోతప్ప అన్నిఖర్చులు చేరియున్నవి అట్లు ఉంచబడిన సందర్భమున దినము 1కి ప్రతి జవానుకు మూడణాల రొక్కమును చెల్లించవలెను

## పన్ను చెల్లించువారిచే పన్ను విధింపు పుస్తకముల (పరీక్ష) తనిఖీగురించి విధులు

జి ఒ నెం. 1116 లోకల్ అడ్మినిస్ట్రేషన్ తేదీ 4-6-1951.

### పుస్తకములను లెక్కలను పన్ను చెల్లించువారిచే తనిఖీ చేయబడుట

1 పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి ఈ ఆక్టు క్రింద పన్ను చెల్లించుటకు బాధ్యులైన మనుష్యులను, ఆస్తులను తెలుపుచు అప్పుడప్పుడు ప్రభుత్వమువారిచే విధింపబడగలట్టి నమూనాలో పన్ను విధింపు పుస్తకములను తయారుచేసి ఉంచవలెను

2 పన్ను విధింపు పుస్తకములును, ఏ పన్ను విధింపుకైనను సంబంధించిన పూర్తి వివరములు ప్రత్యేక రికార్డులలో నుంచబడిన సందర్భములో అట్టి వివరములు గల అందలి భాగమును, పంచాయతీకి ఏ పన్నునైనను చెల్లించు ఏ మనిషినిగాని లేక అతనిచే అధికారమియ్యబడిన ఏజెంటుగాని ఎట్టి రుసుమునుగాని చెల్లించక పనిచేయు దినములలో ఆఫీసు జరుగుచుండు గంటలలో తనిఖీ చేయుటకు వీలుగా నుండిన ఏజెంటుగాని సదరు పుస్తకముల నుండియు, రికార్డులనుండియు ఎట్టి రుసుమునుగాని చెల్లించక ఎక్స్ట్రాక్టులను తీసికొనుటకు హక్కు కలిగియుండవలెను

3 పంచాయతీయొక్క లెక్కల పుస్తకములు, పంచాయతీకి ఏ పన్నునైనను చెల్లించు ఏ మనిషిచేగాని, ఆయనచే అధికారమియ్యబడిన ఏజెంటుచే గాని, పంచాయతీచే నిర్ణయింపబడగలట్టి ప్రతి మాసములోని దినము లేక దినములలో, ఎట్టి రుసుమునుగాని చెల్లించకయే తనిఖీ చేయుటకు వీలుగా నుండవలెను

సె 68 నిర్ణయింపబడగల నిర్బంధములకును పై విచారణకును లోబడి ఒక పంచాయతీ ఒక కంట్రాక్టును (ఒడంబడికను) బట్టియైనను లేదా ఇతర విధముగానైనను దానికి రావలసియుండు ఏదైన పన్నును రుసుమును లేదా ఏ యితర మొత్తమునైనను, లేదా దాని సందర్భమున చెల్లింపబడవలసియుండు ఏ పైకమునైనను అట్టి పన్ను,

రుసుము మొత్తము లేక సొమ్ము రాబట్టుకొనుటకు వీలులేదని అది అభిప్రాయపడినయెడల, వసూలుచేయుటకు వీలుకానిదిగా కొట్టివేయవచ్చును.

అయితే పంచాయతీకి రావలసిన ఎట్టి పన్నునైన రుసుమునైన లేదా ఇతర మొత్తమునైన వసూలు చేయుటకు కలెక్టరు లేదా ఆయన తాబేదారులు ఎవరైన బాధ్యులైయుండు సందర్భములో అట్టి పన్నును, రుసుమును లేదా మొత్తమును లేదా వాని సందర్భమున చెల్లింపబడవలసియుండు ఏ భాగమునైనను అది రా[illegible]ట్టుకొనబడజాలదను కారణముచేనట్టి కొట్టవేయుటను గల అధికారము రెవిన్యూ బోర్డువారిచే లేదా వారి పై విచారణకు లోబడి కలెక్టరుచే లేదా ఆయన అధికారమిచ్చు ఏ ఉద్యోగిచేనైన చెలాయించబడవలెను.

68 వ సెక్షనుక్రింద విధులు.

(జి ఒ నెం 520 ఎల్ ఏ తేదీ 24-3-1951)

రాబట్టుకొనుటకు వీలులేని పన్నులు, రుసుములు వగైరాను రద్దు చేయుటకు అధికారము-నిర్బంధములును పై అధికారమును.

ఒక ఒడంబడిక క్రిందనైనను పరే లేక ఇతరవిధముగానైనను పరే ఒక పంచాయతీకి బాకీగానుండు ఏదైన పన్ను, రుసుము లేక ఇతర మొత్తము, రాబట్టుకొనుటకు వీలులేనిదిగా రద్దుచేయుటకు ఆక్టు యొక్క 68 వ సెక్షనుక్రింది పంచాయతీ యొక్క అధికారము ఈ క్రింది నిర్బంధములకును పై విచారణకును లోబడి యుండవలెను. అవేవనగా

(1) రాబట్టుకొనుటకు వీలులేనివిగా కనుగొనబడిన మొత్తములు, ఆక్టుయొక్క 60 వ సెక్షనుక్రింద పన్నులను లేక రుసుములను వసూలుచేయు పని ఆయన కప్పగింపబడినపుడు, బిల్లు కలెక్టరు లేక గ్రామ మునసబు రాబట్టుకొనుటకు వీలులేని కారణములతో, రిపోర్టు చేయవలెను వానిని కార్యనిర్వాహకాధికారి సరిచూడవలెను. అట్టి మొత్తము లన్నిటియొక్క జాబితాను మూడు నెలల కొకసారి తయారుచేసి దానిని రద్దుచేయుటకు కార్యనిర్వాహకాధికారియొక్క కారణములతోను సిఫారసులతోను పంచాయతీయొక్క మరుసటి

సమావేశమందు మంజూరీ చేయునిమిత్తము దాఖలు చేయవలెను కార్యనిర్వాహకాధికారి మొత్తమును రద్దుజేయవలెనని సిఫారసు చేయుటకు పూర్వము పన్నును చెల్లించుటకు తప్పిపోయిన మనిషికి ఆ గ్రామములో జప్తుచేయబడతగిన ఎట్టి ఆస్థిగాని లేదనియు రాబట్టు కొనుటకు అన్ని ప్రయత్నములు చేయబడి అవి ఫలవంతము కాలేదనియు తెలుపవలసియుండును

(2) రద్దుచేసిన అన్నిపద్దులను రికార్డుచేయుటకొక రిజిష్టరును ప్రభుత్వమువారిచే నిర్దేశింపబడగల నమూనాలో వ్రాయవలెను

(3) ఒక పంచాయతీ రద్దులను సాదరువేసినపుడు ఆ పద్దులను రద్దు రిజిష్టరులో నమూదుచేయవలెను మరియు పన్ను రుసుము లేక ఇతర మొత్తముయొక్క స్వభావము (పద్దులు పన్నుకు సంబంధించిన పక్షములో అసెస్మెంటు సంఖ్యతో సహా) రద్దుచేయబడిన మొత్తము, ఆ మొత్తమునకు సంబంధించిన కాలపరిమితులయొక్క వివరములు చర్యల పుస్తకములో వివరముగా తెల్పవలెను లేక పంచాయతీ అట్లు సమ్మతించినయెడల రద్దు రిజిష్టరులో వరుస సంఖ్యమాత్రము సూచించవచ్చును ప్రతిసారి రద్దుచేయుటకు అధికారమియ్యబడిన గరిష్ఠ మొత్తము ఏ సందర్భములోగాని మాటలలో తెలుపబడవలెను

(4) పన్నులు, రుసుములు లేక ఇతర మొత్తములయొక్క బిల్లులు వారెంటులమీద (అసలు ప్రతి ఎదురు ప్రతి రెండును) రద్దు చేయుటకు వుత్తరువు చేయబడిన తర్వాత సాధ్యమైనంత త్వరలో రద్దుచేయబడెనని స్టాంపు వేయబడవలెను మరియు అవసరమైన నమూదులను డిమాండు రిజిష్టరులలో అదే కాలమందు వ్రాయబడవలెను

(5) రాబట్టుకొనుటకు వీలులేనిదిగా రద్దుచేయబడినపన్ను రుసుము లేక ఇతరమొత్తముయొక్క ఏ ఒక పద్దయినను రూ 50 లను మించినపుడు రీజనల్ ఇన్స్పెక్టరుయొక్క అనుమతిని అందు నిమిత్తము పొందవలెను.

సె 69 నిర్ణయింపబడగలట్టి విధులకులోబడి, కార్యనిర్వాహకాధికారి, గ్రామముమీద లేక అందలి ఏభాగముమీదనైన విచారణాధికారము గల గ్రామమునసబును, పంచాయతీకి బాకీగా రావలసియుండు ఎట్టి పన్నునుగాని, లేక రుసుమునుగాని మునసబుచే వసూలు చేయబడిన మొత్తము పైకములో నూటికి $6\frac{1}{4}$ వంతులకు మించకుండ కలెక్టరు సామాన్య లేక ప్రత్యేక ఉత్తరువు మూలముగా నిర్ణయించగల ప్రతిఫలమును చెల్లించినమీదట వసూలుచేయుమని కోరుటకు అధికారమును కలిగియుండవలెను

69 వ సెక్షనుక్రింద విధులు

(జి. ఒ నెం 520, లోకల్ అడ్మినిస్ట్రేషను తేదీ 24-3-1951)

(జి ఒ నెం 345, లోకల్ అడ్మినిస్ట్రేషను తేదీ 3-3-1956)

విధులు

గ్రామ మునసబులు పన్నులను వసూలు చేయుట

1 ఒక పంచాయతియొక్క కార్యనిర్వాహక అధికారి పంచాయితీకి రావలసినపన్నులను రుసుములను వసూలుచేయుటకుఎట్టి సిబ్బందినిగాని పంచాయతీ నియమించని సందర్భములో అట్లువసూలు చేయుటకు గ్రామముమీద లేక దాని యే భాగము మీదనైన విచారణాధికారమును కలిగిన ఆయా సందర్భమునకు తగినట్లు గ్రామ మునసబుయొక్క లేక గ్రామ మునసబులయొక్క సహాయమును కోరుచు కలెక్టరుకు దరఖాస్తు పెట్టుకొనవలెను

2 కలెక్టరు, పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి దరఖాస్తు పెట్టుకొన్నమీదట గ్రామముమీద లేక అందలి ఏ భాగము మీదనైన విచారణాధికారము కలిగిన ఆయా సందర్భమునకు తగినట్లు గ్రామ మునసబుకు పంచాయతికి ఏ మనిషియైనను చెల్లించవలసిన ఏదైన పన్ను లేక రుసుమును అట్టి మనిషినుండి వసూలు చేయుటకు ఉత్తరువు నియ్యవలెను

3 కలెక్టరు, రెండవ విధిక్రింద నుత్తరువు నొసంగినపుడు అవసరముకాగల షరతులను నిర్దేశించవచ్చును

4 69 వ సెక్షను క్రింద కలెక్టరుచే నిర్ణయింపబడిన ప్రతి ఫలము పంచాయతీ నిధినుండి ఆయా సందర్భమునకు తగినట్లు గ్రామ మునసబుకు కార్యనిర్వాహక అధికారి చెల్లించవలెను

సెక్షను 112 (2) (xvi) క్రింది విధులు

పన్నులను పరిశ్రమ రూపములో చెల్లించుట

(జి ఒ నెం 954, లోకల్ అడ్మినిస్ట్రేషను

తేది 30-6-1956).

మద్రాసు గ్రామ పంచాయతీల యాక్టు 1950 (మద్రాసు యాక్టు X ఆఫ్ 1950) యొక్క 112 వ సెక్షను యొక్క (2) వ సబుసెక్షనుయొక్క (xvi) క్లాజుచే నీయబడిన అధికారములను నిర్వహించుచు ఆంధ్ర గవర్నరుగారు యీ క్రింది విధులను చేయుచున్నారు.

విధులు

1 ఈ యాక్టు క్రింద నేవ్యక్తి అయిన పంచాయతీకి పన్ను చెల్లించవలసిన యెడల, పంచాయతీయొక్క స్వేచ్ఛానుసారముగ, పన్నుకు బదులుగా అతను పంచాయతీ పనులలో శ్రమ రూపమున తోడ్పడ వచ్చును

2 ఆ వ్యక్తులను యే పనులమీద, యే గంటల కాలములో ఏ పనిలో నియమింపవలెనో మరియు వారిశ్రమను ఏ రేటు చొప్పున విలువచేయబగునో పంచాయతీ నిర్ణయింపవలెను

3 పంచాయితీ ఓవరుసిర్లు, సూపరువైజర్లు, పంచాయతీల తాలూకుపనులు చేయబడుచున్నపుడు వాటిని తనిఖీ చేయనపుడు, యీ శ్రమ రూపమున పన్నులుచెంల్లిచు ఆకౌంట్లను సరిచూచి, అట్టి చెల్లింపులు సక్రమముగాను, సరిగాను వున్నవో లేదో అను విషయము పరీక్షచేయవలెను

4 పంచాయతి నిర్ణయించిన పనిమీద, ఆ కాలములోను యీ విధుల క్రింద యేవ్యక్తి అయిన శ్రమచేయనియెడల, ఈ విధుల క్రింద నెంతశ్రమ యివ్వవలసియున్నదో దానికి రెట్టింపు శ్రమ యివ్వవలసియుండును.

అయితే యీ విధాయకమునుండి విముక్తుడగుటకు, శ్రమ రూపమున యీ విధుల క్రింద పన్నులు చెల్లించుటకు బదులు, నగదు రూపమున పన్నులు చెల్లించుటకు యీ విధులు ఎట్టి అంతరాయము కలిగింపవు

5 ఈ విధుల క్రింద ఏ పన్నయిన రాబట్టు కొనుటకు, సివిల్ కోర్టులో పంచాయతీ దావావేసి రాబట్టు కొనుటకు యీ విధులలో వివరించిన దేదియు నిషేధించదు

సె 70. (1) పంచాయతీకివచ్చు యావత్తు పైకములును పంచాయతీనిధి అని చెప్పబడు ఒక నిధిగా యేర్పాటు చేయవలెను. మరియు వాటిని ఈ ఆక్టుయొక్కయు, ఇతర చట్టములయొక్కయు నిబంధనల కనుగుణముగా వినియోగించవలెను మరియు పరిష్కారము చేయవలెను

అయితే నిర్ణయింపబడగల విధులకు లోబడి ఈఆక్టు ననుసరించి విధించబడిన ఎట్టి పన్ను లేదా అదనపు పన్నునుండియైన వచ్చిన పైకము నిర్దిష్టమైన ఏదేని పబ్లిక్ అభివృద్ధికి ద్రవ్యసహాయము చేయుటకు ప్రత్యేకించబడవలెనని ఉత్తరువుచేయుటకు పంచాయతీ అధికారము కలిగియుండవలెను అట్టి ప్రతి పన్నునుండి లేదా అదనపు పన్నునుండి వచ్చిన జమలకు వాటియొక్క ఖర్చును తెలుపు ఒక ప్రత్యేక లెక్కను వ్రాసియుంచవలెను.

(2) పంచాయతీ నిధికి జమకట్టవలసిన ఆదాయములలో—

(i) ఈ ఆక్టుయొక్క 63 వ సెక్షను క్రింద విధింపబడిన ఇంటి పన్ను, వృత్తి పన్ను, బంగ్లపన్ను మరియు ఏదైన ఇతర పన్ను లేక ఏ సెస్సుగాని లేక రుసుముగాని,

(ii) ఈ ఆక్టుయొక్క 67 వ సెక్షను క్రింద విధించబడిన ఆస్థి పరివర్తనలమీద పన్నులనుండి వచ్చిన ప్రతిఫలము,

(iii) 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టుబోర్డుల ఆక్టుయొక్క 78 వ సెక్షను ననుసరించి గ్రామములో విధించబడిన భూమి సెస్సులో నాలుగింట ఒక భాగము,

(iv) యాత్రా కారణము ఒక జిల్లా ఉత్సవముగా ఏర్పరుపబడిన ఉత్సవముగా నుండునప్పుడు తప్ప 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు బోర్డుల ఆక్టుయొక్క 110 వ సెక్షను ననుసరించి గ్రామ విషయమున విధింపబడు యాత్రీకుల పన్ను ,

(v) 1933 వ సం॥పు మదరాసు వ్యాపారమున కనువగు ఫలసాయముల మార్కెటుల ఆక్టుయొక్క 11 వ సెక్షను, (3) వ సబు సెక్షను ననుసరించి ఒక మార్కెటు కమిటీచే పంచాయతీకి చేయబడిన ఏ చెల్లుబళ్లుగాని ,

(vi) 1939 వ సం॥పు మదరాసు జనసామాన్యము యొక్క ఆరోగ్యమును గురించిన ఆక్టుయొక్క 117 వ, 118వ సెక్షనుల ననుసరించి గ్రామములో విధింపబడు పన్నులును, హాసీళ్ళును ,

(vii) జిల్లా మార్కెట్లుగా తరగతివారి విభజన చేయబడని గ్రామములోని మార్కెట్ల విషయములోను, జిల్లాబోర్డు నిర్వాహణ క్రిందనుండు ఫెర్రీల విషయములోను గవర్నమెంటువారిచే నిర్ణయింపబడిన స్కేలుమీాద జిల్లాబోర్డుచే చెల్లింపబడిన వంతు పైకము ,

(viii) గ్రామములోని గ్రామకంఠములను, రోడ్లను అదే విధముగానుండు యితర పబ్లిక్ స్థలములకు లేదా వాటిభాగములను తాత్కాలికముగా ఆక్రమించినందుకు రుసుములు ,

(ix) ఈ ఆక్టులోని ఏ నిబంధననైన లేదా దాని క్రింద చేయబడిన ఏ విధినైన లేక ఉత్తరువునైన అనుసరించి పంచాయతీచే విధింపబడిన రుసుములు ,

(x) గ్రామములో ప్రాథమిక పాఠశాలలను స్థాపించి వాటిని పోషించుటకుగాను గవర్నమెంటువారికి నిర్ణయింపబడిన స్కేలు ప్రకారము జిల్లాబోర్డువారిచే చెల్లింపబడు సహాయద్రవ్యము, ఏదైన నున్న యెడల అది ,

(xi) పంచాయతీయొక్క నిర్వాహణము క్రింద నుండు ధర్మాదాయములనుండి ట్రస్టులనుండి వచ్చిన ఆదాయము ,

(XII) ఈ ఆక్టు ప్రారంభమైన తరువాత గవర్నమెంటువారిచే మక్కల తీసుకోనబడిన సొకపు ఇనాములమీాద నికరపు పన్ను విధింపు,

(XIII) గ్రామములో చేపలు పట్టుటనుండి వచ్చిన ఆదాయము,

(XIV) పంచాయతీ నిర్వాహణనుక్రిందనుండు క్రీల నుండి వచ్చిన ఆదాయము,

(XV) హక్కుగా కోరబడని డిపాజిట్లను దంపు క్రింద చెందిన సైకములును,

(XVI) గ్రామములో రోడ్డు ఎనికిగాను కావలసిన వస్తువులను గనులనుండి త్రవ్వుటకు అనుమతింపబడిన మనుష్యులవద్ద ప్రతి సంవత్సరము గవర్నమెంటువారిచే వసూలుచేయబడు సీనియరేజి రుసుమునకు సమానమైన మొత్తము,

(XVII) అనుభవపు హక్కు పంచాయతీలకు సంక్రమింప చేయబడిన బాపతు పోరంబోకులనుండి వచ్చిన ఆదాయము అంతయును,

(XVIII) గ్రామము ఒక రైతువారి ప్రదేశములో నుండు సందర్భములో, పోరంబోకుల అనుభవము పంచాయతీకి సంక్రమింప చేయబడియుండనప్పటికిని ఆ పోరంబోకులలోనుండు చెట్ల నుండి వచ్చిన ఆదాయమంతయును,

(XIX) పంచాయతీ పొందిన గవర్నమెంటు ఆస్తి యొక్క గుత్తలనుండి వచ్చిన ఆదాయము,

(XX) ఈ ఆక్టుక్రింద లేదా దాని ననుసరించి చేయబడిన ఏదైన విధి లేక ఉపవిధిక్రింద లేక ఈ విషయమున నిర్ణయింపబడిన చట్టముయొక్క ఏ యితరనిబంధన క్రిందనైన గ్రామములో చేయబడిన నేరముల విషయములో మాజిస్ట్రేటు విధించిన జుల్మానాలనుండి ప్రతి సంవత్సరము గవర్నమెంటువారికి వచ్చు మొత్తము ఆదాయములో పదింటతొమ్మిది వంతులకు సమానమైన మొత్తము,

(XXI) గవర్నమెంటువారి వద్దనుండి పొందిన గ్రాంటులు,

(XXII) పంచాయతీ నిధినుండి పోషింపబడు లేదా ధన సహాయము చేయబడు లేదా పంచాయతీచే నిర్వహింపబడు ఎట్టి సంస్థలు లేదా సర్వీసులనుండియైన రాగల లేదా వాటి సహాయార్థము లేదా వాటిపై ఖర్చుపెట్టుటకుగాను అందిన పైన వివరింపబడిన పైకపు మొత్తములు కానట్టి యావత్తు యితర పైకపు మొత్తములును చేరవలెను

70 వ సెక్షను క్రింద విధులు.

విధులు

(జి ఒ నెం. 520, ఎల్ ఎ తేదీ 24-3-1951)

పంచాయతీల విధులను నిర్ణయమైన కార్యములకు ప్రత్యేకించుట

ఎట్టి పంచాయతీగాని రీజనల్ ఇన్‌స్పెక్టరుయొక్క అంగీకారమును ముందుగా పొందక ఈ క్రింద తెలుపబడిన ప్రత్యేకింపబడిన విధులలో దేనినైనా అవి ఏకార్యములకొరకు వసూలు చేయబడినవో ఆ కార్యములకు గాకుండా ఇతరకార్యములకొరకు తాత్కాలికముగా కూడ ఖర్చు పెట్టకూడదు —

(1) నీటిపనుల నిర్మాణము, పోషణ, మరమ్మతు, వ్యాప్తిలేక అభివృద్ధికి సంబంధించినఖర్చులను ఏర్పాటుచేయుటకొరకు 1939 వ సం॥పు మదరాసు పబ్లిక్ హెల్తుఆక్టుక్రింద విధింపబడిన నీటిపన్నునుండి లభించిన మొత్తము

(2) నీటిపనుల నిర్మాణము, పోషణ, మరమ్మతు, వ్యాప్తిలేక అభివృద్ధికి సంబంధించిన ఖర్చులనిమిత్తము లేక పంచాయతీలో గ్యాస్ లేక విద్యుచ్ఛక్తి దీపములను వేయుటకు సంబంధించిన ఖర్చుల నిమిత్తము ఏర్పాటుచేయు నిర్దిష్టమైన కార్యముకొరకు ఆక్టు యొక్క 63 (3) (b) సెక్షను క్రింద విధింపబడిన వ్యవసాయ భూములమీాది పన్నుద్వారా లభించిన మొత్తము.

(3) ప్రాథమిక పాఠశాలలను స్థాపించి వాటిని పోషించుటకు వసూలుచేయబడిన విధులు

(4) ఋణముల నిధులు

(5) నిర్దిష్టమైన కార్యములకొరకు మంజూరుచేయబడిన ప్రత్యేక ప్రభుత్వగ్రాంటులు

(6) మూలధనపు ఆస్తుల విక్రయమునుండి పొందబడిన ఆదాయములు

(7) ధర్మాదాయములనుండి, ట్రస్టులనుండి వచ్చిన ఆదాయము

(8) డిపాజిటులు (ప్రావిడెంటు ఫండుతో సహా)

పంచాయతి నిధులను, భద్రపరచుట, పెట్టుబడి చేయుట, మరియు వాటిని తీయు విధానముగురించి

విధులు.

(జి ఒ నెం 520, ఎల్ ఎ తేదీ 24-3-1951)
(జి ఒ. నెం 900, ఎల్ ఎ తేదీ 5-5-1952)
(జి ఒ నెం 161, ఎల్ ఎ తేదీ 7-2-1955)
(జి ఒ నెం 1066, ఎల్ ఎ తేదీ 30-7-1956)
(జి ఒ నెం. 92, ఎల్ ఎ తేదీ 7-12-1956)

సెక్షను 112 (2) (vi) క్రింద విధులు.

విధులు.

పంచాయతీ నిధులను దాచిపెట్టుట, పెట్టుబడిచేయుట, మరియు ఆ నిధులనుండి పైకమును తీయు విధము

1 పంచాయతీకి వచ్చిన పైకమంతయు అత్యంత సమీపమునుండి గవర్నమెంటు ట్రెజరీలోగాని లేక అత్యంత సమీపములోనుండు పోస్టాఫీసులోని సేవింగ్సుబ్యాంకులోగాని లేక ఈ రెండింటిలోగాని వుంచబడవలెను

2 (1) ఒక పంచాయతీ వెంటనే వుపయోగమునకు అవసరములేని ఏ మొత్తమునైన, సదరు కార్యము నిమిత్తము సహకార సంఘముల రిజిష్ట్రారువలన అంగీకరింపబడిన మదరాసు ప్రోవిన్షి

యల్ కో ఆపరేటీవ్ బ్యాంకులోను, జిల్లా సెంట్రల్ కో ఆపరేటివ్ బ్యాంకులలోను 3 సంవత్సరముల కాలపరిమితివరకు ఫిక్స్డ్ డిపాజిటులలో పెట్టవచ్చును

(2) ఏ పనికయిన నిర్దేశింపబడిన విధులలోని అదనపు మొత్తమును, పంచాయతీ గవర్నమెంటు సెక్యూరిటీలలోగాని, లేక ఆంధ్ర కో ఆపరేటివ్ సెంట్రల్ ల్యాండు మార్టుగేజ్ బ్యాంకుయొక్క డిబెన్చర్లలో (ఋణపత్రములలో) గాని పెట్టుబడి చేయవచ్చును

3 ప్రత్యేక సందర్భములలో ఒక పంచాయతీ రీజినల్ ఇన్ స్పెక్టరుయొక్క అంగీకారము పొంది రీజినల్ ఇన్ స్పెక్టరుచే నిర్దేశింపబడిన ఏ ఇతర బ్యాంకులోనైనా దాని నిధులను నుంచవచ్చును లేక పెట్టుబడి చేయవచ్చును

4. ఒక పంచాయతీ, రీజినల్ ఇన్ స్పెక్టరు అంగీకారముతోను హామీలి లేక ఇతర విషయములను గురించి ఆయన విధించగల షరతులకు లోబడియు, దాని పైకమును కార్యనిర్వాహక అధికారి యొక్క స్వాధీనములో నుంచవలెను

అయితే, 1 వ తరగతి పంచాయతీలయొక్క ఎగ్జిక్యూటివ్ అధికార్ల వద్ద రూ 100/-కు మించకుండను, II వ తరగతి పంచాయతీలయొక్క ఎగ్జిక్యూటివ్ అధికార్ల అధీనములో రూ 50/కు మించకుండను, పర్మనెంటు అడ్వాన్సు వుంచుటకు యెట్టి అనుమతి అవసరము లేదు

5 అట్లు పంచాయతీలచే భద్రపరుపబడిన నిధులనుండి, సొమ్మును ఎగ్జిక్యూటివు అధికారి సంతకముచేసిన ఆర్డర్లు లేక చెక్కులద్వారా తీయవలయును

5-A అయిదవ విధి ననుసరించి ఎగ్జిక్యూటివు అధికారి సొమ్మునుతీయుట, తత్సంబంధమయిన జిల్లా పంచాయతీ ఆఫీసరు విధించిన షరతులకు అధికారములకు లోబడియుండవలెను

5-B (1) ఒక పంచాయతీకి సంబంధించిన జిల్లా పంచాయతీ ఆఫీసరు, వ్రాతమూలకమయిన తగిన కారణములచేత, తన యుత్తరవుద్వారా, ఎగ్జిక్యూటివు అధికారిని ఆ యుత్తరవులో విన

రింపబడినంత కాలము, పంచాయతీసొమ్ములను తీయరాదని నిషేధించవచ్చును

అయితే తత్సంబంధమయిన ఎగ్జిక్యూటివ్ అధికారికి వ్రాతమూలకముగాగాని, లేక వాక్కుద్వారాగాని (స్వయముగా సముఖమునగాని) విజ్ఞాపన చేసుకొనుటకు సదవకాశము యివ్వకుండ అట్టి యుత్తరవు జారీచేయరాదు

(2) జిల్లా పంచాయతీ ఆఫీసరు (1) వ యుపవిధి క్రింద జారీచేసిన యుత్తరువు కారణమున బాధపడిన ఎగ్జిక్యూటివ్ అధికారి, తత్సంబంధమయిన రీజినల్ ఇన్‌స్పెక్టరుకు, ఆయుత్తరువు అందిన తేదీనుండి ఏడుదినములలోగా, వ్రాతపూర్వకముగ అపీలు చేయవచ్చును మరియు దానిపై తత్సంబంధమయిన రీజినల్ యినస్పెక్టరు నిర్ణయము నిర్వివాదమైనది

(3) (1) వ యుపవిధి క్రింద జారీచేయబడిన ప్రతియుత్తరవులోను, ఎగ్జిక్యూటివ్ అధికారిని సొమ్ము తీయకుండా నిషేధించినంత కాలములో, యే వ్యక్తి లేక యే అధికారి పంచాయతీ సొమ్మును తీయవలెనో నిర్దిష్టముగా పేర్కొనవలెను

(4) (1) వ యుపవిధి క్రిందగాని, లేక (2) వ యుపవిధి క్రిందగాని జారీచేయబడిన ప్రతి యుత్తరువుయొక్క నకలు, పంచాయతీ ద్రవ్యము యే బ్యాంకులలో లేక యే ట్రెజరిలలోనున్నదో వాటికి అన్నింటికి పంపవలెను

(5) అట్టి యుత్తరువు అందినతేదీ లగాయతు ఆ బ్యాంకుగాని, లేక ట్రెజరీగాని, అట్టి యుత్తరువునల్లనే యెగ్జిక్యూటివ్ అధికారి సొమ్ముతీయకూడదని నిషేధింపబడెనో, అతనికి ఆ యుత్తరవులో చెప్పబడినంతకాలము సొమ్ము యివ్వరాదు

6 పంచాయతీ నిధి వుంచబడియుండు ట్రెజరీ లేక బ్యాంకు పంచాయతీ జమకువుండు నిధులు అనుమతించువరకు 5 వ విధిచే కోరబడిన విధముగా సంతకముచేయబడిన బాపతు అన్ని వుత్తరువులను లేక చెక్కులకుగాని నిధినుండి చెల్లించవలెను

7 పంచాయతీ వ్రాతమూలకముగా ముందు అధికారమును ఇచ్చిన పక్షమున, అట్టి ట్రెజరీ, బ్యాంకు లేక కార్యనిర్వాహక అధికారి, అట్టి ఆర్డరు లేక చెక్కు లేకుండ, పంచాయతీ తరఫున గవర్నమెంటువారు చేసిన ఏ ఖర్చునైన, పంచాయతీ నిధులనుండి వెంటనే చెల్లించవచ్చును

సెక్షను 71

(ఆంధ్ర ఆక్టునెం XXII ఆఫ్ 1955 యొక్క 12 వ సెక్షను మూలముగా యీ సెక్షను రద్దుచేయబడినది)

సె 72 (1) పంచాయతీ నిధి వినియోగింపబడగల కార్యములలో ఈ ఆక్టుచే లేదా దీని ననుసరించి చేయబడిన్న విధులచే లేదా ఏ ఇతర చట్టములచేగాని విధులచేగాని విధిగా లేదా యిష్టానుసారముగా చేయవలసినట్లు స్పష్టముగా ప్రకటింపబడిన యావత్తు ఉద్దేశములను చేరియుండును మరిన్ని సదరు విధి దానికి గ్రామములోపల గవర్నమెంటువారు నిర్ణయించగల లేదా జారీచేయగల విధులకును ప్రత్యేక ఉత్తరువులకును లోబడి వర్తింప తగియుండవలయును మరిన్ని పైన చెప్పినవాటికి లోబడి గ్రామ వెలుపల అట్టి కార్యములకు ఆ ఖర్చు ఈ ఆక్టుచే అనుమతింపబడినయెడల లేదా ఇన్‌స్పెక్టరు ప్రత్యేకముగా మంజూరు చేయబడిన యెడల వర్తింప తగియుండవలెను

(2) (a) ఈ క్రింది వాటికి చెల్లించుటకు ఏర్పాటు చేయుట ప్రతి పంచాయతీకి విధిగా నుండవలెను —

(i) దానిచే చేయబడిన ఎట్టి ఋణములకొరకుగాని బాకీ పడిన ఏవేని మొత్తములు ,

(ii) ఎన్నికదారుల పట్టీని తయారుచేయుటకైనట్టిన్ని సవరించుటకైనట్టిన్ని, పంచాయతీకి ఎన్నికలను జరుపుటకైనట్టిన్ని, ఎన్నిక సిబ్బందిని పోషించుటకైనట్టిన్ని ఖర్చుతోచేరి ఎన్నిక ఖర్చులు

**వివరణము.**—ఎన్నిక సిబ్బందిని పోషించు ఖర్చులో ఎన్నికదారుల పట్టీని తయారుచేయుటకును, సవరించుటకును, ఎన్నికలను

జరుపుటకును నియమింపబడిన గవర్నమెంటువారి లేదా ఏ యితర అధికారివర్గముయొక్కయైన ఉద్యోగులు, నౌకరులు, ఎవరైన నున్న యెడల వారి జీతము, పింఛను, సెలవు అలవెన్సులుకూడ చేరియుండును

(III) దాని ఉద్యోగులయొక్కయు, నౌకరులయొక్కయు జీతములును, అలవెన్సులును, పింఛనులును, పింఛనుకైన వంతు పైకములును, ప్రావిడెంటుఫండుకైన వంతు పైకములును ,

(IV) కోర్టువారి ఏట్టి డిక్రీ లేదా ఉత్తరువు ననుసరించి యైన బాకీగా నుండు పైకపు మొత్తములు , మరియు

(V) ఈ ఆక్టుచే లేదా దాని ననుసరించి లేదా యితర చట్టముచేగాని లేదా దాని ననుసరించిగాని నిర్బంధపరచబడిన ఏయితర ఖర్చులుగాని,

(b) గవర్నమెంటువారు ప్రతి సంవత్సరము (a) క్లాజు తాలూకు (II) వ సబు క్లాజులో చెప్పబడిన ఎన్నిక ఖర్చుల మొత్తమును నిర్ణయించవలెను మరియు వారినిర్ణయము కడపటిది గాను పంచాయతిని నిర్బంధించునదిగాను ఉండవలెను అట్టి మొత్తమును, 76 వ సెక్షనులో చెప్పబడిన ఋణములతోను అడ్వాన్సులతోను 44 వ, 46 (2) సెక్షనులో నిర్దేశింపబడిన ఖర్చులతోను చేరి అనుమతింపబడిన ఋణములను తీర్చుటకైన ఖర్చులు తప్ప యావత్తు యితర ఖర్చులుకంటె ముందుగా చెల్లించవలయును

(3) పంచాయతీ గవర్నమెంటువారి అనుమతితో ఇండియా దేశ రక్షణకు సంబంధించిన ఏ నిధికైన చందా నియ్యవచ్చును

(4) ఇన్స్పెక్టరుయొక్క అనుమతితో పంచాయితీ—

(I) గ్రామములోని ఏదేని పబ్లిక్ ప్రదర్శనమునకు, శ్రమపు లేదా వినోదమునకైన ఖర్చుకొరకు ద్రవ్యసహాయము చేయవచ్చును ,

(II) ఏదేని ధర్మనిధికి లేదా బీదజనుల కష్టమును నివారణచేయు లేదా వ్యాధికి లేదా దౌర్బల్యమునకు చికిత్సచేయు లేదా వ్యాధిగ్రస్థులైన లేదా దుర్బలులైన వారిని చేర్చుకొను లేదా

వ్యాధికారణములను పరిశీలించు ఎట్టి సంస్థయొక్క నిధులకైన సహాయ ద్రవ్యమును ఇయ్యవచ్చును , మరియు

(111) ఏ యితర అసాధారణ ఖర్చులనైనా భరించవచ్చును

సంపాదకుని సూచిక

లోకలు అథారిటీస్ లోన్సు యాక్టు 1914 (ఇండియా యాక్టు IX ఆఫ్ 1914) క్రింద పంచాయతీ ఒక స్థానిక అధికారి (లోకల్ అథారిటీ), పంచాయతీలు యితర స్థానిక అధికార్లు ఋణములు చేయుటకు పద్ధతి యీ యాక్టులో నివరింపబడినది పంచాయతీలు స్థానికముగా ఋణములు చేయదలచినపుడు తమ దరఖాస్తును జిల్లా పంచాయతీ ఆఫీసరు ద్వారాను, ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషను ద్వారాను, ప్రభుత్వమునకు మంజూరు చేయుటకు పంపవలెను అట్లు అనుమతి పొందని యెడల, న్యాయప్రకారముగా ఆ ఋణము తీర్మానము కొజాలగు పంచాయతీలకు యీ విషయము సవిస్తరముగా తెలియుటకు యీ క్రంద లోకల్ అథారిటీస్ లోన్సు యాక్టు 1914 న్ను, దాని క్రింది విధులున్ను పొందు పరుపబడినవి

లోకల్ అధారిటీస్ లోన్సు యాక్టు, 1914
(యాక్టు నెం IX ఆఫ్ 1914)

స్థానిక సంస్థల ఋణ చట్టము, 1914
(1914 వ సంవత్సరములో ఇండియా తొమ్మిదవ చట్టము)

స్థానిక సంస్థలకు ఋణములు మంజూరుచేయు శాసనమును సవరించి, క్రమబద్ధముచేయ నుద్దేశించి చేయబడిన చట్టము

ఋణముచేయుటకు స్థానిక సంస్థలకుగల పలుకుబడికి సంబంధించిన శాసనమును సవరించి క్రమబద్ధముచేయ ఆవశ్యకమై, యీ క్రిందివిధముగా శాసింపబడినది

1 (1) ఈ చట్టము, 1914, స్థానిక సంస్థల ఋణచట్టము అని పిలువబడును

ఇవి సొంతల్ పరగణాలను (Sonthal Paraganas) కలుపుకొని భారతదేశముయొక్క అన్ని భాగములలోను వ్యాపింప చేయబడినవి

2 ఈ చట్టములో ‘ స్థానికసంస్థ ’ అనగా ఏ వ్యక్తియైనను న్యాయానుసారముగా స్థానిక లేక మ్యునిసిపల్ సంస్థల మూలధనముపై

అజమాయిషీ చేయు అధికారము కలిగియుండి సదరు సంస్థలలో సెస్సు, సేలు సుంకము (Duty) లేక పన్ను విధించుటకు అనుమతింపబడిన వ్యక్తి అని అర్థము

స్థానిక సంస్థలకు సంబంధించి నంతవరకు 'మూలధనము' అనగా, న్యాయానుసారముగా స్థానిక లేక మ్యునిసిపల్ సంస్థల మూలధనముపై అజమాయిషీ చేయు అధికారము కలిగియుండినట్టియు, న్యాయానుసారము సదరు సంస్థలయందు సెస్సు, సేలు సుంకము (Duty) లేక పన్ను (tax) విధించుటకు అధికారము కలిగియుండినట్టియు, సదరు సంస్థలకు సంబంధించిన ఆస్తులపై అధికారము కలిగియుండిన వ్యక్తియని అర్థము

'నిర్ణయింపబడెను' అనగా యీ చట్టముక్రింద చేయబడిన నిబంధనల ద్వారా నిర్ణయింపబడెను అని అర్థము, మరియు

ఏ పనికైనను సంబంధము ఉన్నప్పటికిని లేనప్పటికిని 'పని' అనగా సర్వే (survey) తో కూడినట్టి పని అని అర్థము

'ప్రభుత్వము' లేక 'తగిన ప్రభుత్వము' (appropriate Govt) అనగా కంటోన్ మెంటు (Cantonment) అధికారులకు పెద్ద ఓడ రేవుల (Major Ports) అధికారులకు సంబంధించి నంతవరకూ కేంద్ర ప్రభుత్వమనియు, యితర స్థానిక సంస్థలకు సంబంధించినంతవరకూ రాష్ట్రప్రభుత్వమని అర్థము

3 (1) ఈ క్రింది పనులకుగాను ప్రతి స్థానిక సంస్థ కొన్ని నిర్ణయింపబడిన షరతులకులోబడి వాటి మూలధనము లేక తత్సంబంధమైన భాగముయొక్క జామీనుపై యీ క్రింద కనుపరచిన విషయములకు ఋణము చేయవచ్చును —

(1) న్యాయానుసారముగా చేయవలసిన పనులకు,

(11) కఱువు కాటకములందు ప్రజలకు సహాయార్థముగా పనులు (ఫెమిన్ రిలీఫ పనులు) కల్పించుటకు,

(111) అంటువ్యాధుల వ్యాపకము నిరోధించుటకు,

(1V) పై (11) (111) క్లాజులలో నుదహరింపబడిన తత్సంబంధమైన పనులకు,

(v) తత్పూర్వము చట్టబద్ధముగా చేసిన ఋణములు తీర్చుటకుగాను

అయితే, ఏ స్థానికసంస్థగాని పూర్వము తీసికొనిన ఋణమును చెల్లుచేయుటకు, (v) వ క్లాజు క్రింద తిరిగి ఋణము తీసుకొనిన పక్షమున, సదరు తీర్మానమైన ఋణము తీర్చుటకైన కాలమును, మరియు యీ క్లాజు క్రింద తీసుకొనిన ఋణతీర్మానమునకు పట్టిన కాలమును కలిపిన మొత్తము కాలము, ఏ చట్టము క్రిందనైన ఋణ తీర్మానమునకై నిర్ణయింపబడిన కాలపరిమితిని మించకూడదని భావింపవలెను

ఇంతేకాకుండా తగిన ప్రభుత్వము మంజూరుచేయు ఋణములు కాక తదితర ఋణముల మొత్తము 25 లక్షల రూపాయలకు మించిన, సదరు ఋణమునకు సంబంధించిన షరతులు, తేదీ మొదలగు విషయములలో తగిన ప్రభుత్వ అనుమతిని పొందవలెను

(2) ఈ సెక్షనులో నుదహరించిన ఏ విషయము కూడా యీ క్రింది విషయములపై స్థానిక సంస్థలకు అధికారము యిచ్చునని ఎంచరాదు

(a) ఏదైన అమలులోనున్న శాసనప్రకారము ఏ పనికైన ఋణముచేయుటగాని తద్వారా వ్యయము చేయుటగాని నిషేధింపబడినచో స్థానికసంస్థలు అట్టి పనులకైన ఋణముచేయుటగాని వ్యయపరచుటగాని ,

(b) ఒక సంవత్సరములోగా ఋణ తీర్మానముచేయ సంకల్పించి బిల్లులద్వారాగాని, ప్రామిసరీనోట్లు ద్వారాగాని అప్పులుచేయుట ,

4 (1) ఈ క్రింది విషయములపై తగిన ప్రభుత్వము యీ చట్టమునకు విరుద్ధముకాకుండా విధులు చేయవచ్చును ,

(i) ఏరీతిగా మూలధనములయొక్క జామీనుపై ఋణము చేయవచ్చును ,

(ii) ఏ పనులకుగాను ఋణములు చేయవచ్చును,

(III) ఏవిధముగా ఋణముచేయుటకై అనుమతికి దరఖాస్తు పంపవలెను

(IV) ఏవిధముగా ఋణములగూర్చి వివరములు తెలుసుకొనవలెను సదరు ఋణములగూర్చి తెలిసికొనుట కవలంబించు విధానములు ,

(V) దరఖాస్తుయొక్క వివరములు, తుది నిర్ణయములు, వాటిపై ఉత్తరువులతోకూడిన విషయములు, నమూనాలు యే విధముగా ప్రచురింపబడవలెనో ,

(VI) ఏ విషయములలో తగిన ప్రభుత్వము ఋణములు మంజూరు చేయవచ్చునో ,

(VII) ఏ పనులకుగాను స్థానిక సంస్థలు తగిన ప్రభుత్వముతప్ప మరే యితర వ్యక్తులవద్ద ఋణములు పుచ్చుకొనవచ్చునో ,

(VIII) ఏ షరతులపై ఋణములు తీసుకొనవచ్చునో తెలియజేయు పత్రము వ్రాసి దాని ప్రకారము అమలుజరుపుట ,

(IX) ఏ విధముగా యే సమయమందు ఋణములు చేయవచ్చునో లేక కల్పించవచ్చునో ,

(X) ఏ విధముగా ఋణముల మంజూరుద్వారా చేయబడిన పనులు తనిఖీ చేయవలెనో ,

(XI) ఎన్నివాయిదాలలో ఋణము చెల్లించవలెనో, ఎంత పైకము వడ్డీరూపేణా వసూలుచేయవలెనో మరియు యేవిధముగా యెప్పుడు ఋణము సదరు వడ్డపైకము చెల్లించవలెనో ,

(XII) జామీనుగానుండు మూలధనముమీద ఋణము చేయుటకు అగుఖర్చుల మొత్తము గూర్చిగాని ,

(XIII) మూలధనము జప్తులు, సదరుజప్తుల పైకము వసూలు పరిష్కారములయొక్క విధానము గూర్చిగాని ,

(XIV) ఋణసంబంధమైన ఖాతాలు వుంచవలసిన విధానము గూర్చిగాని ,

(xv) స్థానికసంస్థలయొక్క అప్పులు తగ్గించుటలో గాను, చట్టసమ్మతముగా అనుమతింపబడిన పనులు నిర్వర్తించుట లోను ఉపయోగింపబడిన ఋణముల మిగుళ్లగూర్చి, మరియు యీ చట్టమును కార్యాచరణలో పెట్టుటకు సంబంధించు తదేతర విషయ ములగూర్చిగాని,

(3) ఈ చట్టానుసారము చేయబడిన విధులు ప్రభుత్వ గెజిట్‌లో ప్రచురింపబడును తదుపరి ఆ విధులు చట్టములో శాసింప బడినట్లు చెల్లును

5 ఈ చట్టానుసారముచేసిన ఋణము లేక తత్సంబంధమైన వడ్డీ లేక తదితర సంబంధమైన ఖర్చులు షరతుల ప్రకారము సకాల ములో చెల్లించనిచో, ఋణదాత తగిన ప్రభుత్వమైనచో ఋణము నకు జామీనుగానున్న మూలధనమును జప్తు చేయవచ్చును ఋణ దాత తగిన ప్రభుత్వముకానిచో సదరు ఋణదాతయొక్క దరఖాస్తుపై తగిన ప్రభుత్వము జామీనుగానున్న మూలధనమును జప్తు చేయ వలెను ఆ విధముగా జప్తు చేయబడిన తదుపరి తగిన ప్రభుత్వముచే నియమింపబడిన ఉద్యోగి మినహా ఏ వ్యక్తి సదరు జప్తు చేయబడిన మొత్తముపై ఎట్టి హక్కులుగాని సంబంధములుగాని వుండవు సదరు ఉద్యోగి, ఆవిధముగా జప్తుచేయబడిన పక్షమున స్థానికసంస్థలు ఋణము చెల్లించు నిమిత్తమై చేయుచర్యలందు బాధ్యత వహించవలెను మరియు ఆ వుద్యోగి జప్తుచేయగా వచ్చిన మొత్తమును ఋణము తత్సంబంధమైన వడ్డీ తదితర జప్తుకు సంబంధమైన ఖర్చుల తీర్మా నము నిమిత్తమై వుపయోగించవలెను

కాని యీ జప్తుకు పూర్వము ఏ అప్పునైనా చట్టానుసారము జప్తు చేయబడిన మూలధనముపై జప్తు యే విధముగా రద్దు కాబడదు లేక అంతరాయము కల్గించదు మరియు సదరు ఋణమును రాబట్టు నిమిత్తమునకై జప్తుచేయగావచ్చిన సొమ్ములో ఏ భాగమై నను వినియోగించక పూర్వము, సదరు ధనముపైనున్న పూర్వ బాకీలు చెల్లుచేయవలెను.

6. (1) 1910, ఇండియన్ పేపర్ కరెన్సి (Indian paper Currency Act) చట్టము, 26 వ సెక్షనునందలి అంశములకు లోబడి, ప్రథమ షెడ్యూలులో నుదహరించిన స్థానికసంస్థలు లేక తగిన ప్రభుత్వముచే అనుమతింపబడిన స్థానికసంస్థలకు ప్రభుత్వ గెజెట్‌లోని ప్రకటనద్వారా ఈ సెక్షనులోని అంశములను వర్తింపచేయవచ్చును సదరు సంస్థలు తగిన ప్రభుత్వానుమతితో పన్నెండు నెలలు మించని కాలములో తీర్చబడు బిల్లులు లేక ప్రామిసరీనోట్లుద్వారా ఋణములు చేయవచ్చును సదరు ఋణము అమలులోనున్న ఏ శాసనముక్రింద నైన క్రమముగా నిర్వర్తించగల ఏ విషయము గురించియైన చేయ వచ్చును మరియు

కాని సదరు బిల్లులు ప్రామిసరీనోట్ల మొత్తమును అప్పటికి అమలులోనున్న ఋణముల మొత్తమునకలిపి చట్టానుసారము ఋణము చేయుటకు అనుమతింపబడిన మొత్తమునకు మించరాదు.

(2) తగిన ప్రభుత్వము సాధారణ లేక ప్రత్యేక ఉత్తరవు ద్వారా ఈ సెక్షను ననుసరించి ఋణముచేయుటకు తిరిగి చెల్లించుటకు సంబంధించిన షరతులను క్రమబద్ధము చేయవచ్చును

7 చట్టవిరుద్ధముగా ఏ స్థానికసంస్థ అప్పుపుచ్చుకొనుటగాని ధనము ఖర్చుపెట్టుటగాని చేయరాదు ఆ విధముగా చేసినచో తత్సంబంధమైన ఒడంబడికలు చెల్లనేరవు

కాని, యిందులో యేమున్నప్పటికీ—

(a) ఇప్పుడుగాని, యికముందెప్పుడుగాని ఏదైనా ప్రత్యేక శాసనముద్వారా స్థానికసంస్థకి ఋణము తీసుకొనుటకుగాను యివ్వబడిన హక్కులను సదరు సంస్థ వినియోగించుటలో పై చెప్పబడిన అంశములు ఆటంకముగా నుండవు

(b) అట్టి హక్కుద్వారా స్థానికసంస్థ చట్టప్రకారము యేదేని నొకపనికై తెసుకొనిన పైకముమీద వడ్డీని చెల్లించుటకై హామీ యిచ్చినయెడల, సదరు డబ్బును దాచుటకై స్థానికసంస్థకు యివ్వబడిన హక్కునకు పై జెప్పిన అంశములు ఆటంకముకావు.

8. సెక్రటరీ ఆఫ్ స్టేటు ఇన్ కౌన్సిలువారు, ఏ స్థానికసంస్థకైనా 1871 సంవత్సరము సెప్టెంబరునెల 5 వ తేదీకి పూర్వము రుణము యిచ్చి సదరు రుణమొత్తము సకాలములో చెల్లించనిచో 5వ సెక్షను ననుసరించి రుణమొత్తము వడ్డీతో సహా వసూలుచేయువచ్చును

9 2 వ విభాగము మరియు షెడ్యూలు, 1927 రద్దుల చట్టము (1927 లో ఇండియా ఆక్టు XII) ద్వారా రద్దుచేయబడెను

## 1937 మద్రాసు స్థానిక సంస్థల రుణములకు సంబంధించిన విధులు

1914 స్థానిక సంస్థల రుణచట్టము (1914 లో తొమ్మిదవ చట్టము) 4 వ సెక్షను ననుసరించి ప్రభుత్వము యీ విషయముపై తత్పూర్వము అమలులోనున్న నిబంధనలను రద్దుచేస్తూ, యీక్రింద నుదహరించిన విధులు చేయడమైనది కాగా యీ విధులు అమలు లోనికి రాక పూర్వముచేసిన రుణములకు ఇవి వర్తించవు —

1 సంగ్రహ నామము- ఈ విధులు 1937, మద్రాసు స్థానిక సంస్థల రుణముల విధులు అని వ్యవహరింపబడును

2 నిర్వచనము-యీ నిబంధనలలో-

(1) 'చట్టము' అనగా 1914, స్థానిక సంస్థల రుణ (1914 లో తొమ్మిదవ) చట్టము,

(2) 'ప్రభుత్వము' అనగా మద్రాసు ప్రభుత్వము,

(3) 'ప్రభుత్వ రుణము' అనగా ప్రభుత్వ ఖజానానుండి తీసుకొనబడిన రుణము,

(4) 'రుణము' అనగా చట్టానుసారము చేసికొనిన, లేక తీయబడిన రుణము,

(5) 'ప్రభుత్వేతర రుణము' అనగా ప్రభుత్వానుమతితో ప్రభుత్వ ఖజానానుండి కాక వేరే తీయబడిన రుణము,

(6) 'రుణ కాలము' అనగా రుణము పూర్తిగా చేసిన, తీసుకొనిన లేక తీయబడిన తేదీకి తిరిగి పూర్తిగా చెల్లించిన తేదీకి నుండు మధ్య కాలము.

3 ఋణము చేయుటలో, హద్దులు

3 వ, సెక్షను, (1) వ సబు సెక్షను, (i), (ii), (iii) or (v) క్లాజులలో నుదహరించిన పనులకుగాను, యీ క్రింద నుదహరింపబడిన విషయములకు తప్ప, నితర విషయములకుగాను అప్పుచేయరాదు –

(a) స్థానిక సంస్థల అజమాయిషీకిలోబడి స్థానిక హద్దులలో నిర్వహించు పనులకుగాను లేక

(b) సదరు సంస్థల హద్దులలో నివసించు ప్రజోపయోగములైన పనులకు

4 దరఖాస్తు – స్థానిక సంస్థ ఋణముచేయ నుద్దేశించి ప్రభుత్వమునకు పంపు దరఖాస్తులలో యీ క్రింది విషయములగూర్చి తెలియపర్చవలెను –

(1) ఏ కారణమునకుగాను ఋణము కావలసి వచ్చెనో మరియు సదరు ఋణము 3 వ సెక్షను (1) వ సబు సెక్షను (i), (ii), (iii) లేక (v) క్లాజులలో నుదహరించిన పనుల నిర్వహణకుగాని చేయబడినచో, సదరు పనులు పూర్తిగా చేయుటకో లేక దానిలో నెంత భాగము చేయుటకు ఋణము కావలసినదో, ఆ భాగమునకు, అగు ఖర్చులు తెలుపు అంచనా (Estimate) పంపవలెను,

(2) ఋణము చేయదల్చుకొన్న మొత్తము,

(3) ఏ మూలధనముయొక్క జామీనుపై ఋణముచేయ నిశ్చయింపబడెను,

(4) సదరు మూలధనము యే శాసనము క్రింద వసూలు చేయబడెనో గ్రహించబడెనో లేక ఉంచబడెనో,

(5) ఏ తేదీలోగా ఋణము కావలెను. సదరు ఋణము వాయిదాలవారీ కావలసిన యెడల, ప్రతివాయిదాయొక్క మొత్తమును, మొదటి వాయిదాయొక్క మొత్తమును యే తేదీలలో కావలెనో, యెన్ని సంవత్సరములలోగా మిగతా వాయిదాలు కావలెనో,

(6) ఎంత వడ్డి రేటుకు ఋణము తీయుటకు నుద్దేశింపబడినదో,

(7) పైకము యెన్ని సంవత్సరములకై అప్పు కావలెనో అది యే పద్ధతులతో తీర్చి వేయబడునో (అప్పును సింకింగు ఫండు పద్ధతిని తీర్చివేయ నుద్దేశించిన యెడల, సదరు సింకింగు ఫండు యే వడ్డీ రేటు చొప్పున అభివృద్ధి అగునో), మరియు

(8) దాని మూల ధనము మీద అంతకుముందుండిన చార్జీ యొక్క పట్టికతోసహా స్థానిక సంస్థలయొక్క ఆర్థిక పరిస్థితిని

5 అప్పుడు అవసరమగు దర్ఖాస్తు చేసినతరువాత ప్రభుత్వము నకు స్థానికసంస్థకు కావలసిన పైకమునకు తప్పక అప్పు అవసరమని తలంచినచో వారు దరఖాస్తు యొక్క నకలును, వారికి అవుసరమని తోచిన తదితరవివరములను ఫోర్టుసెంటు జార్జిగెజిట్‌లో ప్రకటిం చెదరు

6 5 వ నిబంధనక్రింద కడపటి ప్రకటన నుంచి ఒక మాసము గడచిన తరువాత, వారికింకను కావలసిన సమాచారము లుండిన, వాటిని సేకరించినపిదప, ఏవైన ఆక్షేపణ వచ్చిన, వాటిని పరిశీలించి, ప్రభుత్వము—

(1) దరఖాస్తు నిరాకరింప వచ్చును, లేక

(2) ఈ క్రిందనుదహరింప బడిన నిబంధనలకు లోబడి అప్పులను నిచ్చుటకో లేక తెచ్చుకొనుటకో మంజూరు చేయ వచ్చును —

(a) సామాన్యముగా ఋణకాలము 30 సంవత్సరములకు మించరాదు కాని మంచి నీటి మురుగు కాలవలస్కీములకు మంజూరుచేయబడిన ఋణములు తీర్చుటలో గడువు 40 సంవత్సరము లకు లోబడి 30 సంవత్సరములకు మించవచ్చును, మరియు

(b) ప్రభుత్వముచే నిర్ణయింపబడిన రేటు చొప్పున ఋణముపై వడ్డీ యివ్వవలసియుండును, మరియు

(c) రూ 25 లక్షలకు మించు ప్రభుత్వేతర ఋణమైన, ఋణమునకై మార్కెట్టులో ప్రవేశించు తేదీ ప్రభుత్వముచే ఆమోదింప బడవలెను

7 ఒక స్థానికసంస్థ తనదరఖాస్తులో చట్టములో 3 వ సెక్షను లోని 1 వ సబ్ సెక్షను యొక్క (ii) (iii) లేక (iv) క్లాజులలో నుదహరింపబడిన కార్యములకై ధనము త్వరలో కావలసినప్పుడు, సత్వరముగా అప్పును మంజూరు చేయుటగాని లేక అప్పును సేకరించు టకు అనుమతినిగాని కోరినపుడు, ప్రభుత్వము దరఖాస్తును స్వీకరించిన పిదప, వారు యెప్పుడైనను అందులోని ఒక కార్యమునకై ధనము సత్వరముగా కావలయునని వారు భావించినపుడు, 5 లేక 6 వ విధులలో యేవి ఉన్నప్పటికిన్ని దర్యాప్తుచేసిన పిమ్మట వారు రుణమును మంజూరుచేయుటగాని లేక సేకరించుటకు అనుమతి నిచ్చుటగాని చేయవచ్చును

8 విధించబడిన షరతులు—

(1) ప్రభుత్వము రుణము మంజూరు చేయునపుడుగాని, సేకరించుటకు అనుమతి యిచ్చునపుడుగాని వారికి ఉచితమని తోచిన విధముగా చట్టమునకుగాని, వాని నిబంధనలకుగాని విరుద్ధముకాని విధమున యింకనూ యేషరతులనైననూ విధింప వచ్చును

(2) (1) వ ఉపవిధిలోని అంశముల సామాన్యమునకు భంగము లేకుండా యీ క్రింద నుదహరింపబడిన షరతులను విధింప వచ్చును —

(i) ప్రతి ఋణ విషయములోను ప్రభుత్వము నిర్ణయముమేరకు, స్థానిక సంస్థ యీ క్రింద ఖర్చులను చెల్లింప వలయును.—

(a) 5 వ విధిక్రింద చేయబడిన దర్యాప్తునకు, ప్రకటనకు అగుఖర్చు,

(b) తనిఖీలు మరియు, 9 వ విధిక్రిందచేయు శిక్షకై చేసిన చర్యల ఖర్చు, మరియు

(c) ఈ విధులుక్రింద, ప్రభుత్వ అధికారముతో జారీచేయబడిన తెర్మానములకగు ఖర్చును,

(ii) ప్రతి రుణము విషయములోను స్థానిక సంస్థ అకౌంటెంట్ జనరల్, మద్రాసు వారికి ప్రభుత్వమువారికి దాని

మూలధనము (Fund) గురించి, ఋణమునుండి ఖర్చులను గురించి వారికి కావలసిన సమాచారము అందచేయవలెను

(III) ప్రభుత్వ ఋణమైనచో :—

(a) దరఖాస్తులో చెప్పబడిన తేదీకి స్థానిక సంస్థ కోరిన ఋణము జమాచేయుటయో, లేక ఆ తేదీనుండి ఋణము మీాద చెల్లించమని కోరుటకు, ప్రభుత్వమున కధికారమున్నది

(b) స్థానిక సంస్థ ఋణవిషయములో విధింపబడిన యే షరత్తైననూ లేక ని విధులలోని యే అవసరములనైనను మన్నింపలేదని ప్రభుత్వము భావించినచో, వారు యెప్పుడైననూ ఆ ఋణమునకుగాను, ఏ మొత్తమును సదరు సంస్థకు నివ్వకుండా చేయువచ్చును మరియు, ఇచ్చిన మొత్తమును, వడ్డీతో సహా వెంటనే తిరిగి చెల్లింపవలయునని, ఉత్తరువును చేయవచ్చును మరియు

(IV) ప్రభుత్వఋణము కానిచో ప్రభుత్వానుమతి ముందే పొందక, సదరు ఋణమునుగాని, లేక దాని ప్రథమ భాగమునుగాని, సేకరించుటకు గాను ప్రభుత్వమువలన నిర్దేశింపబడిన, తేదీ లేక తేదీలను, స్థానిక సంస్థ మార్పుచేయకూడదు సదరు ఋణము వాయిదాలగా సేకరించు పక్షమున, స్థానిక సంస్థ తక్కిన భాగములను, ఏ యే తేదీల సేకరింప నుద్దేశించునో, ఆ తేదీలకు ముందుగా ప్రభుత్వాంగీకారము ను బడయవలెను.

9 ఖాతాల పనుల తనిఖీ, అజమాయిషీ — ప్రభుత్వము యీా క్రింది విషయములలో వారికి అవసరమని తోచిన విధముగా యేర్పాటు చేయవచ్చును

(a) అప్పు తీసుకొనిన ధనము యే కార్యమునకై తీసుకోనబడినదో, దానికై వినియోగింపబడుచున్నదో, లేదా, అప్పులో ఖర్చు పెట్టబడిన భాగము నిబంధనలకు విరుద్ధముగా లేకుండా ఖర్చు పెట్టబడు చున్నాదా లేదా విచారించుటకు, మరియు

(b) (3) వ సెక్షను యొక్క (2) వ సబ్ సెక్షను లోని (I), (II), (III) లేక (IV) క్లాజులలో చెప్పబడిన యే కార్య

మున్నకైనా ఋణము తీసుకొనినప్పుడు సదరుపని తనిఖీ చేయుటకు అయితే, సదరుపని లేక సంబంధించిన ఖాతాలు, యీ క్రింది ఆఫీసర్ల తనిఖీకి సిద్ధముగ నుంచవలెను —

(1) దానికి పనికి సంబంధించిన Superintending లేక Executive Engineer ల యొక్క గాని, మరియు

(2) స్థానిక సంస్థయొక్క ఖాతాలను పరీక్ష చేయుటకు నియమింపబడిన యే వ్యక్తియైనను, మరియు

(3) ఇందుకొరకై ప్రత్యేకముగా ప్రభుత్వముచే అధికార మియ్యబడిన యే వ్యక్తి అయినను

10 జప్తుకు సంబంధించిన కార్యక్రమము-చట్టములోని 5 వ సెక్షను క్రింద, ప్రభుత్వము యే మూలధనములనైనను (Funds) జప్తుచేయవలయునని నిర్ణయించినచో యీ క్రింది కార్యక్రమమును నిర్వర్తించవలెను —

(a) ప్రభుత్వము, స్థానిక సంస్థకు దానిచే (సంస్థ) మూలధనముల వసూలుగాని లేక నిర్వహణగాని బహిష్కరిస్తూ ఒక నోటీసును జారీ చేయవలెను తద్వారా ప్రభుత్వము వాటి (Funds) యొక్క పరిపాలనకై ఒక ఉద్యోగిని నియమింప వచ్చును ఈ విధమైన నోటీసును ప్రభుత్వము స్థానిక అధికార గెజిట్‌లోగాని, మరియు స్థానిక సంస్థ అధికార సరిహద్దులలో వారికి (ప్రభుత్వ) ఉచిత మని తోచిన విధముగా ప్రచురింపచేయ బడవచ్చును

(b) ప్రభుత్వమువారిచే సదరుచట్టముయొక్క 5 వ సెక్షను క్రింద నెలకొల్పబడిన ఉద్యోగి పై చెప్పిన జప్తు ప్రకారము వసూలుచేసినట్టిగాని, తెసుకొనునట్టిగాని పైకము ను అప్పు యిచ్చిన వారికి చెల్లించవలెను , లేక అది ప్రభుత్వ ఋణమైనయెడల సర్కారువారి ఖజానా (Treasury) లో చెల్లించవలయును

(c) అట్లు వసూళ్ళు చేయబడిన మొత్తము అట్టి సందర్భములో అయిన ఖర్చులనుగురించి పై చెప్పబడిన ఉద్యోగి ప్రభుత్వము వారిచే నియామకము చేయబడిన యొక నమూనాలో ఖాతాలను తయారుచేయవలెను అట్లు తయారు

చేసిన జాబితానకలు నొకదానిని స్థానికాధికారి కొసగి, మరియొక నకలును పోర్టుసెంటు జార్జి గెజిట్‌లో ప్రచురింప చేయవలెను

11 ఖర్చుకాని మొత్తములు ఏ పనికైతే అప్పు నొక స్థానిక సంస్థ తీసుకొనునో ఆ పని పూర్తిఅయిన తదుపరిగాని, ఆ పని బాపతు ఖాతాలు పూర్తియైనతరువాత సదరు పైకము అంతయు వాడబడి యుండలేదని ప్రభుత్వమునకు తోచిన పక్షమున వారు యీ క్రింద చూపిన రీతిని చర్య తీసుకొనవచ్చును —

(a) ప్రభుత్వ రుణమైనయెడల, (i) ఖర్చుగాక మిగిలి పోయిన నిల్వ మొత్తమును వెంటనే ప్రభుత్వము వారికి తిరిగి చెల్లించ వేయబడవలెనని ప్రభుత్వము ఉత్తరువు జారీచేయవచ్చును అప్పుడు అప్పు తీసుకొన్న అసలునుండి ప్రభుత్వమునకు తిరిగి చెల్లింప బడినఖర్చుగాక మిగిలిపోయిన నిల్వను మినహాయింపబడు నట్లున్ను, అప్పుపూర్తిగా తీర్చుటకై నియమింపబడిన వాయిదా లను ప్రభుత్వము వారు అవసరమని తోచిన విధము మార్పుచేయ వచ్చును, లేదా

(ii) అట్టి మిగిలిని మొత్తమును, సదరు స్థానికసంస్థ చట్టముక్రింద మరియే యితరపనులు చేయు నధికారమున్నదో, ఆ పనుల దేనికైన వినియోగించవచ్చును

(b) ప్రభుత్వేతర రుణవిషయమున — సదరు ఖర్చు కాబడిన నిల్వ, రుణము తగ్గించుటకైనా, లేక సదరు స్థానికసంస్థ న్యాయముగా మరి యేయితర పనులు చేయనగునో అట్టిపని దేనికైన నుపయోగించవచ్చును

12 ప్రభుత్వము వారిచ్చిన రుణములమీద వడ్డీ —ప్రభు త్వమువారు మంజూరుచేయు ఋణముల విషయములలో యీ క్రింద నుదహరించిన నిబంధనలు (Provisions) అమలుపరుపబడును అవేవనగా —

(1) సాలు సాలుకు తీసిన ఋణములు, అవి ఒకేఋణము యొక్క భాగములై ఒకే యుత్తరువున జారీచేయబడియుండ వచ్చును. అయినప్పటికి సదరు రుణములు లేక రుణభాగము

లోకొక్కటి, వేరే రుణముగ నెంచబడి, ఆ రుణము లేక రుణ భాగము ఏ సంవత్సరమున కాబడినదో ఆ సాలున నిర్ణయమైన వడ్డీకి లోబడియుండును. సదరు వడ్డీ ప్రభుత్వమువల్ల నిర్దేశింపబడి సంవత్సర వారీగానో లేక అర్ధసంవత్సరవారీగానైన నుండవచ్చును.

(2) తమకు చిత్తమని తోచిన నిర్ణీతమైన తేదీకి చెల్లామణి కాక నిల్వయున్న వడ్డీలు వాయిదాలమీదగాని, అసలు వడ్డీలమీద గాని నూటికి 7½ రూ॥ - రేటుకు తక్కువగాకుండ కాంపౌండు వడ్డీ వసూలు చేయబడులాగున ప్రభుత్వమువారు ఉత్తర్వులు జారీచేయ వచ్చును

13 ప్రభుత్వము మంజూరుచేయు ఋణములను తీర్చు విధానము ప్రభుత్వమువారి పూర్వానుమతిలో అప్పు షరతులలో నియమింపబడిన తేదీకి ముందుగానే యెప్పుడైనను స్థానికసంస్థ ప్రభుత్వమువారు మంజూరుచేసిన అప్పు అంతటినిగాని లేదా దానిలో కొంత భాగముగాని, ప్రభుత్వమువారి పూర్వానుమతితో చెల్లించవచ్చును

14 ప్రభుత్వ ఋణముల యొక్క ఖాతాలు — ప్రభుత్వమువారు మంజూరుచేయు ఋణములకు సంబంధించిన ప్రతి ఖాతాను, ఎకౌంటెంట్ జనరల్ మద్రాసువారిచే నుంచబడవలెను

15 ప్రభుత్వేతర ఋణములకు సాలీనా చెల్లామణికిగాను నిర్దేశింపబడిన మొత్తము (ఏన్యూయిటీ) ప్రకారముగాగాని, సంవత్సరమువారీగా ఋణమును తీర్చువిధాన ప్రకారముగాగాని సదరు అప్పు తీర్చబడనియెడల, స్థానికసంస్థ ఈ క్రిందచూపిన రీతిగా సింకింగుఫండు స్థాపించవలెను —

(1) సదరు స్థానికసంస్థ తన రాబడినుండి అప్పు తిరిగిచెల్లింపవలసిన నియమితకాలములో అప్పుయిచ్చు అధికారి నిర్ణయించిన చక్ర (కాంపౌండు) వడ్డీవొప్పున అభివృద్ధియగునట్లు సదరు నియమిత కాలమున అప్పుతీర్చుటకు వీలుగానుండుటకు సరిపోవునట్టి మొత్త

ముసు సాలునకొకసారో, లేక రెండు దఫాలువంతునో చెల్లించ వలెను

(2) అట్లు చెల్లించుటలో మొదటి మొత్తమును, అప్పు మంజూరుచేయు నధికారి మరియొక విధము నిర్ణయించినతప్ప, అప్పు తీసిన లేక సేకరించిన తేదీకి సంవత్సరములోపల చెల్లించవలెను.

(3) సదరు సింకింగు ఫండుయొక్క లెక్కలకు ప్రతిసంవత్సరము మద్రాసు అకౌంటెంటు జనరల్‌వారికి పంపవలెను. సదరు సింకింగుఫండు గురించి అక్కౌంటెంట్ జనరల్ లోపించినదని తెలియ (సర్టిఫై) చేసిన ఆ లోపమును స్థానికసంస్థ తన రాబడినుండి భర్తీ చేయవలెను

సంపాదకుని సూచిక

ఆదాయ వ్యయములను గురించిన విధులను యిచ్చుట కనుపర్చుట యుక్తమము.

## పంచాయతీల యొక్క ఆదాయ వ్యయములను క్రమపరచుటకు విధులు

(జి ఓ నెం 520 లోకల్ అడ్మినిస్ట్రేషన్ తేదీ 24-3-1951)
సెక్షను 96, మరియు 112 (1) మరియు (2) (VI)
(X) మరియు (XIX) క్రింద విధులు

## విధులు

### 1 వ భాగము – ఆదాయములు.

1. లైసెన్సులకును అనుమతులకును రుసుము—(1) ఈ ఆక్టు క్రింద లేక దానిక్రింద చేయబడిన ఏ విధి లేక ఏ ఉపవిధి క్రింద నైనను చేయబడు ప్రతి లైసెన్సు లేక అనుమతి ప్రభుత్వము వారు అప్పుడప్పుడు ఈ విషయమున విధించగల నమూనాలో జారీచేయ బడవలెను

(2) అట్టి ప్రతి లైసెన్సు లేక అనుమతి సందర్భములో చెల్లించవలసిన రుసుము, లైసెన్సు లేక అనుమతికొరకు దరఖాస్తు పెట్టుకొనబడు నప్పుడు ముందుగా వసూలు చేయబడవలెను.

(3) రుసుమును వసూలు చేయుటకును అట్టి లైసెన్సును లేక అనుమతిని మంజూరు చేయుటకును సంబంధించిన వివరములను లైసెన్సులు మరియు అనుమతుల రిజిష్టరులో వరుసగా నమోదు చేయవలెను ఈ రిజిష్టరును అప్పుడప్పుడు ప్రభుత్వమువారు నిర్ణయించగల నమూనాలో వ్రాయవలెను

(4) అట్టి లైసెన్సు లేక అనుమతి జారీచేయబడిన ప్రతి మనిషికి అది ఏ షరతులకు లోబడి యియ్యబడినదో అట్టి షరతుల యొక్క నకలొకటి ఇయ్యబడవలెను

2. ధర్మాదాయముల నుండియు ట్రస్టులనుండియు ఆదాయము—

(1) పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి పంచాయతీ ఆఫీసులో దానిచే నిర్వహింపబడు ప్రతి ధర్మాదాయము లేక ట్రస్టుయొక్క నేటివరకు రికార్డును వ్రాసియుంచవలెను లేక వ్రాసియుంచబడునట్లు చేయవలెను అట్టి రికార్డు—

(a) ధర్మాదాయము లేక ట్రస్టుయొక్క నిర్వహణ పంచాయతీలో ఎవరి అధికారమునకు అప్పగించబడెనో ఆ అధికారిని

(b) సదరు ధర్మాదాయము లేక ట్రస్టుయొక్క ఆస్తులను మరియు ఆదాయముయొక్క ఆధారములను మరియు

(c) సదరు ధర్మాదాయము లేక ట్రస్టుకు ఖర్చు వ్రాయతగిన ఖర్చును

తెలియచేయవలెను

(2) పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి (1) వ ఉపవిధిలో చెప్పబడిన రికార్డుకు అదనముగా ప్రతి ధర్మాదాయము లేక ట్రస్టుకు సంబంధించిన సంవత్సరవారీ లావాదేవీలను ప్రత్యేక పుటలలో తెలుపుచూ ధర్మాదాయము ట్రస్టుల యొక్కయు రిజిష్టరునొకదానిని పంచాయతీ ఆఫీసులో వ్రాసియుంచవలెను లేక వ్రాసియుంచబడునట్లు చేయవలెను

3 సహాయ ద్రవ్యములు —ప్రభుత్వము, ఇతర పంచాయతీలు, జిల్లాబోర్డులు, మునిసిపల్ కౌన్సిళ్ళు ఇతర స్థానిక అధికార

వర్గముల పై ఇవేటు వ్యక్తులు పంచాయతీకి చెల్లించవలసిన ఆదాయమును లేక సహాయద్రవ్యములను మిస్‌లేనియస్ డిమాండ్ రిజిష్టరు ద్వారా గమనించుచుండవలెను

4. దారి ప్రక్కనసుండు చెట్లనుండి వచ్చు ఆదాయము:—చెట్ల ఫలసాయమును విక్రయించగా వచ్చిన ఆదాయమును కార్యనిర్వాహక అధికారి మిస్‌లేనియస్ డిమాండ్ రిజిష్టరు ద్వారా గమనించుచుండవలెను

5 టూల్సు మరియు ప్లాంటు, చెత్త చెదారము పాతస్టోర్లు వస్తువులను విక్రయించగా వచ్చిన పైకము — ఉపయోగము లేని పాత టూల్సు ప్లాంటు, స్టోర్లు వస్తువులు, చెత్త చెదారములను పరిష్కారము చేయుటకు పంచాయతీయొక్క ఉత్తరువులను పొందవలెను రికార్డు చేయవలసిన నిర్దిష్టమైన కారణముల నిమిత్తము పంచాయతీ ఇతర విధముగా ఆజ్ఞాపించిననే తప్ప అట్టి టూల్సు, ప్లాంటు, స్టోర్లువస్తువులు చెత్త చెదారములను బహిరంగ వేలములో విక్రయించవలెను అట్టి విక్రయములు పంచాయతీచే ధృవపడుటకు లోబడి యుండవలెను అట్టి విక్రయములన్నిటినుండి వచ్చిన ఆదాయములు నానా విధ విక్రయ రిజిష్టరులో తెలుపబడవలెను

6. మార్కెట్ బండ్లు నిలుచు స్థలములు, దిగునట్టి లేక ఆగునట్టి స్థలములు పశువధశాలలు మత్స్యాలయములు బల్లకట్టునుండి లభించిన రుసుము —(1) ఏదైన మార్కెట్లు బండ్లు నిలుచు స్థలము దిగుటకైన లేక ఆగుటకైన స్థలము, పశువధశాల, మత్స్యాలయము లేక బల్లకట్టును ఉపయోగించుకొను సందర్భములో రుసుమును వసూలుచేయు హక్కును పంచాయతీ ఇజారా కిచ్చుటకు నుద్దేశించు నెడల కార్యనిర్వాహక అధికారి ఇజారా ఏ షరతులకు, ఒడంబడికలకు లోబడి జారీచేయబడ వలెనో వాటిని తెలుపుచు ఒక ప్రారంభపు నోటీసును తయారుచేయవలెను

(2) ఈ ప్రారంభపు నోటీసులో తెలుపబడిన షరతులను ఒడంబడికలను పంచాయతీ అంగీకరించవలెను.

అయితే దాని షరతులలోను ఒడంబడికలలోను ఏవైన మార్పు లున్ననే తప్ప ఆ నోటీసును ముందుగా అంగీకరింపబడిన పక్షమున అట్టి అంగీకారము అవసరములేదు

(3) సదరు ప్రారంభపు నోటీసు కౌలు జారీచేయబడగల బాపతు ఈ క్రింది షరతులకు ఒడంబడికలకు తెలుపవలెను. అవేవనగా—

(a) ఏ వ్యక్తిగాని నోటీసులో నిర్దేశింపబడిన మొత్తమును హామీగా డిపాజిట్ చేసిననే తప్ప లేక అంతకు పూర్వము ఏ కౌలు సందర్భములోనైన పంచాయతీకి ఆయన బాకీ పడియుండు నెడల వేలములో పాటపాడుటకు అనుమతింపబడకూడదు

(b) కౌలుయొక్క కాలపరిమితి ఒక సంవత్సరమునకు మించని యెడల—

(i) కౌలుకు పుచ్చుకొనువాడు తన పేరిట గుత్త ఖాయపరుపబడిన తేదీనుండి ఒక వారములోపల (a) వ క్లాజులో చెప్పబడిన హామీతోగూడ గరిష్ఠ గుత్త మొత్తములో నాల్గవవంతుగా నుండు ఒక మొత్తమును హామీగా నుంచవలెను ఈ మొత్తము సంవత్సరమునందు కడపటి మూడు నెలలకు బాకీగానుండు గుత్త మొత్తముయొక్క వాయిదాలుకు సాధారణముగా సరిపుచ్చబడవలెను కాని ఆ మొత్తము కౌలుకు పుచ్చుకొన్న మనిషినుండి రావలసిన గుత్త మొత్తముయొక్క ఏ వాయిదాకైనను సరిపుచ్చబడవచ్చును మరియు పునర్విక్రయము లేక డిపాజిట్టుమొత్తుబువారి నిర్వాహణము వలన నష్టమేదైన కలిగినయెడల దానికిగాను సరిపుచ్చవచ్చును, మరియు

(ii) గుత్త మొత్తములో మిగిలిన భాగము కౌలు పత్రములలో నిర్దేశింపబడిన తేదీలలో లేక అంతకు పూర్వము ప్రతి సంవత్సరము ఏప్రిల్ 1 వ తేదీన ఆరంభమగు 9 నెలల కాలపరిమితి లోపల చెల్లించబడవలెను

(c) గుత్తయొక్క కాలపరిమితి ఒక సంవత్సరమును మించు నెడల

(1) కౌలుకుపుచ్చుకొను మనిషి తన సేరిట గుత్త దృఢపరుపబడిన తేదీనుండి ఒక వారములోపల (a) క్లాజులో చెప్ప బడిన హామీతో సహా గుత్తమొత్తముయొక్క మూడు వాయిదాలకు సమానమైన మొత్తమును డిపాజిటు చేయవలెను ఈ మొత్తము బాకీగానుండు గుత్తమొత్తములో కడపటి మూడువాయిదాలకు సాధా రణముగా సరిపర్చబడవలెను కాని కౌలుకు పుచ్చుకొనువారినుండి బాకీగానుండు గుత్తమొత్తముయొక్క ఏ వాయిదాకొరకైనను పునర్వి క్రయము లేక డిపార్టుమెంటువారి నిర్వహణమువలన సంభవించిన ఏదైన నష్టముకొరకు అది సరిపర్చబడవచ్చును మరియు

(ii) గుత్తమొత్తములోని మిగిలిన భాగము పంచాయతీ నిర్ణయించగల తేదీ లోపల పూర్తిగా చెల్లించబడవలెను

అయితే అట్లు నిర్ణయించబడిన తేదీ గుత్త కాలపరిమితి గడచి పోవుటకు పూర్వము మూడు నెలలకంటె ఆలస్యముగా నుండకూడదు.

(b) కౌలుపత్రము సాధారణముగా, పంచాయతి గుత్తను ధృవపరచిన తేదీనుండి 15 దినములలోపల వ్రాయబడి రిజిష్టరుచేయ బడవలెను

(c) గుత్తక్రింద రావలసిన ఏ వాయిదాయైనను అది చెల్లించవలసిన తేదీనుండి ఒక నెలలోపల చెల్లించబడనియెడల కార్య నిర్వాహక అధికారి ఆ విషయమును వెంటనే పంచాయతికి తెలుప వలెను అందుమీదట అది గుత్తను అంత మొందించవలెను మరియు పునర్విక్రయముకొరకు ఉత్తరువుచేయబడిన యెడల అట్లు పునర్విక్రయింపబడు నంతవరకు కౌలుకు పుచ్చుకొన్నవారికి నష్టము కలుగుటతో నిమిత్తము లేకుండా దానిని డిపార్టుమెంటువారు నిర్వ హించులాగున ఉత్తరువు చేయవలెను

(4) ప్రారంభపు నోటీసు పంచాయతీ అంగీకరించిన తరువాత జిల్లా గెజిటులో ప్రకటించ బడవలెను నోటీసుయొక్క నకలొకటి పంచాయతీ ఆఫీసు నోటీసు బోర్డులోను గ్రామ సరిహద్దులలోపల ప్రాముఖ్యమైన స్థలములందును అతికించ బడవలెను

అయితే పంచాయతీ గుత్తయొక్క స్వభావమును దానినుండి బహుశః రాగల ఆదాయమునుబట్టి ప్రారంభపు నోటీసు ఈ ఉప విధిలో చెప్పబడినవిధముగా ప్రకటింపబడవలెను లేక ఏ ఇతరవిధ ముగానైన ప్రకటింపబడవలెనా యని నిర్ణయించవలెను ఇతర విధముగా నైనచో ప్రకటింపబడవలసిన విధము లేక విధములను స్పష్టముగా తెలుపవలెను

(5) కార్యనిర్వాహక అధికారి లేక ఆయనచే క్రమముగా అధికారమీయబడిన ఒక మనిషి వేలమును జరుపవలెను. ప్రారంభపు నోటీసులో తెలుపబడిన మొత్తమును హామీగా డిపాజిట్ చేయుటకు తప్పిపోయిన ఏమనిషినిగాని లేక అంతకు పూర్వపు ఏ గుత్త సందర్భ ములోనైన పంచాయతీకి బాకీగానుండు ఏ మనిషినిగాని వేలములో పాటపాడుటకు అనుమతించకూడదు

(6) కార్యనిర్వాహక అధికారి వేలము పూర్తియైనతరువాత వేలములోని పాటలయొక్క జాబితాను పంచాయతీ సమక్షమున నుంచవలెను పంచాయతీ వేలములోని పాటలలో అంగీకరించ వలసిన దానిని నిర్ణయించవలెను అంగీకరింపబడిన పాట అత్యధిక మైన పాటగానుండని పక్షమున అంగీకరింపబడిన దానికంటె ఎక్కు వగా నుండు పాటను లేక పాటలను నిరాకరించినందులకు గల కారణములను వ్రాతమూలకముగా రికార్డుచేయవలెను

(7) కార్యనిర్వాహక అధికారి పంచాయతీ తరపున, ప్రారం భపు నోటీసులోని షరతులు ఒడంబడికల ననుసరించి ఎవరిపాట అంగీకరించబడినదో అట్టి మనిషితో ఒక లిఖిత పూర్వకమైన ఒడం బడికను చేసికొనవలెను

(8) బాకీగా రావలసిన మొత్తముల వసూళ్లను మిస్ లేని యస్ డిమాండ్ రిజిష్టరుద్వారా గమనించుచుండవలెను

(9) ప్రతి గుత్త సందర్భములో ఒక కౌలు పత్రము వ్రాయ బడ వలెను, మరియు దానిలో—

(a) గుత్తయొక్క కాలపరిమితి,

(b) అద్దెయొక్క ప్రతివాయిదా మొత్తము మరియు అది ఏ తేదీన లేక తేదీకి పూర్వము చెల్లించబడవలెనో ఆ తేదీ

(c) గడువు తేదీకి తరువాత ఏ వాయిదాగాని చెల్లింపబడని సందర్భములో చెల్లించవలసిన పరిహారము.

(d) ఒడంబడికయొక్క షరతులను గుత్తదారు నెరవేర్చుటకు తప్పిపోవుటవలన పునర్విక్రయము చేసిన మీదట లేక డిపార్టుమెంటు వారి నిర్వహణ మరియు పునర్విక్రయము ద్వారా పంచాయతీకి కలిగిన ఏ నష్టమునైన అచ్చుకొనుటకు గుత్తదారునియొక్క బాధ్యత

(e) మార్కెట్లు దిగుమతి చేయబడు స్థలములు, ఆగునట్టి స్థలములు, బండ్లు నిలుచు స్థలములు, పశువధశాలలు, మత్స్యాలయములు, బల్లకట్ల సందర్భములలో, గుత్తదారుచే విధింపబడ గల రుసుముల రేట్లు నిర్దేశింపబడవలెను

(10)(a) గుత్తదారు కలెక్టరు అప్పుడప్పుడు నిర్ణయించగలట్టి నేలఅద్దెను చెల్లించవలెను ఒక స్పష్టమైన షరతు ప్రతి కౌలు పత్రములో నుండవలెను

(b) ఒక సంవత్సరమునకు మించిన కాలపరిమితులకు పంచాయితీకి చెందిన స్థిరాస్థియొక్క ఎట్టి కౌలుగాని కలెక్టరుయొక్క అంగీకారమును ముందుగా పొందిననేగాని చేయబడ కూడదు

(c) ఎట్టి మనిషిగాని కౌలు పత్రమును వ్రాసి ఇచ్చునంత వరకు కౌలు క్రింద అధికారములను చెలాయించుటకు అనుమతింపబడ కూడదు

7 (1) ఏదైన మార్కెటు బండ్లు నిలుచు స్థలము ఎగుమతి దిగుమతి లేక ఆగు స్థలము, పశువధశాల, మత్స్యాలయము లేక బల్లకట్టులను డిపార్టుమెంటువారు నిర్వహించు విషయమున వాటిని ఉపయోగించు సందర్భములో విధింపబడు రుసుములన్నియు కార్య నిర్వాహక అధికారిచే ముద్రింపబడి అంద జేయబడు టికెట్లద్వారా వసూలు చేయబడవలెను.

(2) టిక్కెట్లు వేరువేరు కుసుములచేట్లకు వేరు వేరురంగులలో అసలుప్రతి ఎదురు ప్రతులలో టికెట్లు ముద్రింపబడవలెను ప్రతి సందర్భములోను రేట్లు ముద్రింపబడవలెను ప్రతి రకమునకు చెందిన టికెట్లు నూటిని కలిపి ఒక పుస్తకముగ బైండు చేయవలెను మరియు వాటికి వరుసగా యంత్రముతో అంకెలు వేయవలెను. వసూలుచేయు ఉద్యోగులకు వాటిని జారీచేయుటకు పూర్వము కార్య నిర్వాహక అధికారి సమక్షమున లేక ఈ విషయమున ఆయనచే అధికార మీయబడిన ఏ మనిషి సమక్షమునైన పంచాయతీయొక్క కామన్ సీలుతో అవి ముద్రవేయబడవలెను

(3) ఈ టిక్కెట్ల సందర్భములో పంచాయతీ ఆఫీసునందు రెండు భాగములుగా ఒక రిజిస్టరును వ్రాసియుంచవలెను

మొదటి భాగము స్టాకు రిజిస్టరుగా నుండవలెను ఆదాయ మును తెలుపు నమోదులు కార్యనిర్వాహక అధికారివలన లేక ఆయనచే అధికార మీయబడిన ఉద్యోగివలన సాక్షి సంతకము చేయబడవలెను జారీచేయుటకైన నమూదులకు సంబంధించిన వసూలుచేయు ఉద్యోగివలన సాక్షి సంతకము చేయబడవలెను

రెండవ భాగము ఈ టికెట్లద్వారా అదాయమును వసూలు చేయుపని అప్పగించబడిన ప్రతి ఉద్యోగికిగాను వ్యక్తిగత (పర్సనల్) లెడ్జరు అక్కౌంటుగా నుండవలెను దానిలో ప్రతి వసూలుచేయు ఉద్యోగికి జారీచేయబడిన ప్రతి విధమైన టికెట్లయొక్క సంఖ్యను విలువను డెబిట్ చేయువలెను (ఖర్చు వ్రాయవలెను) మరియు పంచాయతీ ఆఫీసులో ఆయన చెల్లించిన వసూళ్ళ మొత్తమును జమకట్టవలెను ప్రతి దినము వసూలుచేయు ఉద్యోగి పైకమును ఇరసాలు చేయువలెను మరియు అతనికి జారీచేయబడిన ప్రతి రకమైన టికెట్ల సంఖ్యలను విలువను సంబంధించిన వివరములను దానితో తెలుపవలెను

(4) ఏ టిక్కెట్టు పుస్తకమైనను పూర్తిగా ఉపయోగింపబడి నప్పుడు పదరు ప్రతులను వాస్తవమైన జమలతో సరిచూచుటకు పంచాయతీ ఆఫీసుకు పంపబడవలెను.

(5) వసూలుచేయు ఉద్యోగికూడ తనకు అప్పగించబడిన టిక్కెట్లయొక్కయు అతనిచే చేయబడిన వసూళ్ళయొక్కయు లెక్కను వుంచుకొనవలెను ప్రతి రకమునకు చెందిన టికెట్లవలన లభించిన దినసరి వసూళ్ళను అట్టి లెక్కలో వ్రాసుకొని ప్రతి దినముయొక్క అంత్యమున నిల్వలను వ్రాయవలెను లెక్కలను టిక్కెట్లయొక్క నిల్వలను క్రమమైన నియమిత కాలపరిమితులలో కార్య నిర్వాహక అధికారివలన లేక అతనిచే అధికార మీయబడిన ఏ ఉద్యోగి వలన గాని సరిచూడబడవలెను వారు అట్లు సరిచూచినట్లు సర్టిఫై చేయవలెను

8 కట్టడములు, భూములు మరియు ఇతర స్థిరాస్థినుండి ఆదాయము—(1) పంచాయతీకి చెందిన ఏ కట్టడమైనను అద్దె కియ్యబడిన పక్షమున లేక అట్టి పంచాయతీకి చెందిన ఏ భూమియైన లేక ఇతర స్థిరాస్థియైనను కౌలు కీయబడిన పక్షమున అట్టి కౌలు క్రింద రావలసిన మొత్తము లేక అట్టి కట్టడముయొక్క అద్దె ఎట్టి ఆలస్యము గాని లేక రాబట్టబడుచున్నదా యని మిస్ లేనియస్ డిమాండ్ రిజిష్టరు ద్వారా గమనించుచుండవలెను.

(2) ప్రభుత్వమువారు అప్పుడప్పుడు నిర్ణయించగల నమూనాలో రిజిష్టరు పంచాయతీ అధికారము క్రింద ప్రతి ట్రావిలర్సు బంగళా విశ్రాంతి గృహము లేక సత్రములో ఉంచబడవలెను. అట్టి ట్రావెలర్సు బంగళా విశ్రాంతి గృహము లేక సత్రమును ఆక్రమించుకొను మనుష్యులు రిజిష్టరులో నిర్దేశింపబడిన వివరములను నమూదు చేయునట్లు కోరవలెను అట్లు ఆక్రమించుకొనుటకు పంచాయతీ నిర్ణయించగల రేట్ల చొప్పున రుసుము వసూలు చేయబడవలెను

9 చేసిన సేవలకు రాబట్టుకొనవలసిన సొమ్ము—ఈ ఆక్టులో ఇతరవిధముగానే నిబంధింపబడిన తప్ప ఏవ్యక్తికైనను లేక సంఘమునకైనను ఎట్టి పనిగాని, దానికగు అంచనా వేయబడిన ఖర్చును ముందుగా చెల్లించిననేతప్ప పంచాయతీచే చేయబడకూడదు.

10 మిస్ లేనియస్ బిల్లు రిజిష్టరు—మిస్ లేనియస్ బిల్లులు జారీ చేయబడిన బిల్లుల బాకీలకు సంబంధించిన అన్ని వ్యవహారములు మిసలేనియస్ బిల్లు రిజిష్టరులో వ్రాసి యుంచబడవలెను

11 ఆదాయమును తిరిగి ఇచ్చివేయుట—ఒక పంచాయతీకి ముట్టిన ఆదాయములోని ఎట్టి పద్దుగాని పంచాయతి అనుమతిలేకుండా తిరిగి ఇచ్చివేయబడగూడదు పంచాయతి ఇచ్చిన అనుమతి అది జారీచేయబడిన తేదీనుండి ఒక సంవత్సరము తరువాత చెల్లకూడదు. ఆ తరువాత క్రొత్త అనుమతిని పొందుట అవసరము భూమిశిస్తును తిరిగి ఇచ్చివేయుట అట్టి శిస్తులను వాపసుచేయుటకు సంబంధించిన విధులకు లోబడియుండవలెను

రెవిన్యూ వాపసులకైన బిల్లులు ప్రభుత్వమువారు అప్పు డప్పుడు నిర్ణయించగల నమూనాలో వ్రాయబడవలెను వాపసు చేయబడిన వెంటనే దానిని ఇచ్చినందుకై సంబంధించిన లెక్కలలో ఒక షరా అసలు జమ నమూదుకు ఎదురుగా వ్రాయబడవలెను

12 (1) (a) చెట్లయొక్క ఫలసాయము లేక వాటినుండి లభించు ఇతర ఉపయోగ పదార్థములు

(b) గాలికి పడిన మరియు ఎండిపోయిన చెట్లు

(c) ఊడ్చిన చెత్త

(d) యంత్రము మరియు పనిముట్లు

(e) పాత నిల్వలు మరియు పదార్థములు

(f) పంచాయతీకి చెందిన భవనములను మరియు వీటివిక్రయము స్థలములను కౌలుకిచ్చుట వంటి విక్రయములన్నియు, బహిరంగ వేలము మూలముగ జరుగవలెను ఈ వేలములను కార్య నిర్వాహక అధికారి లేక అతనిచే అధికారమియ్యబడిన వ్యక్తి జరుప వలెను ఆయన యుక్తమని తలచు విధముగా ఈ వేలమును గురించి అందరికి తెలియునట్లు చేయవలెను వేలములో పాడిన పాట లను కార్యనిర్వాహక అధికారి పంచాయతి సమక్షమున ఉంచవలెను. ఈపాటలలో దేనిని అంగీకరించవలసిన దానిని పంచాయతీ నిర్ణయించ వలెను అంగీకరింపబడిన పాట అత్యధికమైన పాట కానియెడల

అంగీకరింపబడిన దానికంటె ఎక్కువగానుండు పాటను లేక పాటలను నిరాకరించినందునకైన కారణములను వ్రాతమూలముగ రికార్డు చేయువలెను

అయితే (f) క్లాజులో చెప్పబడిన నేలల, కట్టడముల సందర్భములో మొదట అది ఎవరికి ఇయ్యబడినదో ఆ వ్యక్తికే గుత్తకు మరల ఇచ్చుట లాభకరముగ నున్నప్పుడు పంచాయతీ కలెక్టరు యొక్క అంగీకారమును ముందుగా పొంది బహిరంగ వేలమును ఏర్పాటుచేయ నవసరము లేదు

(2) వేలములో జయము గాంచిన వ్యక్తి ఆయన చెల్లించవలసిన పూర్తి మొత్తమును చెల్లించువరకు విక్రయింపబడిన వస్తువులను అతనిని స్వాధీన పరుచుకొన నీయకూడదు.

(3) విక్రయముల నన్నిటిని మిస్ లేనియస్ సేల్సు రిజిష్టరులో చూపవలెను అందిన విక్రయ మొత్తముల నన్నిటిని అందులో నమూదుచేయవలెను

18 చెట్లయొక్క ఫలసాయముయొక్క లేక వాటినుండి లభించు ఇతర ఉపయోగ పదార్థములయొక్క గుత్తకుచెందిన షరతులను లేక మార్కెట్లు, బండ్లు నిలుచు స్థలములు, ఎగుమతి దిగుమతుల స్థలములు లేక ఆగునట్టి స్థలములు, పశువధశాలలు, మత్స్యాలయముల సందర్భములలో రుసుములను వసూలు చేయుటకైన హక్కుయొక్క లేక అదేవిధమైన ఏ ఇతర హక్కుయొక్కయైన షరతులను క్రమముగా నెరవేర్చుటకు కార్యనిర్వాహక అధికారియొక్క అభిప్రాయములో చాలినంత హామీని అన్ని సందర్భములలో తీసికొనవలయును అట్లు తీసికొనబడిన హామీ గుత్తదారు, గుత్తయొక్క షరతుల నన్నిటినీ తృప్తికరముగానే నెరవేర్చిననేతప్ప మరియు నెరవేర్చునంతవరకు గుత్తదారునకు తిరిగి చెల్లింపబడకూడదు అయితే హామీయొక్క మొత్తమును, గుత్తక్రింద బాకీగానుండు కడపటి వాయిదాకుగాను సరిపుచ్చవచ్చును

14 కార్యనిర్వాహక అధికారివలన లేక అతని అధికారము క్రింద పంచాయతీయొక్క ఒక ఉద్యోగి లేక నౌకరువలన ఎవరి

సేవలు పంచాయతీకి అప్పగింపబడినవో అట్టి ప్రభుత్వనౌకరుతో చేరి) అట్టి హోదాలో పొందబడిన పైకమంతయు అది అందిన వెంటనే లెక్కలో వ్రాయబడవలెను అట్లు ముట్టిన పైకమునంతయు ప్రతిదినము పంచాయతీ ఆఫీసులో చెల్లించవలెను

15 పంచాయతీ తరఫున అందిన ఎట్టి పైకముగాని, మొదట లెక్కలలో వ్రాయకుండ మరియు పంచాయతీ నిధి ఉంచబడియుండు ట్రెజరీ, బ్యాంకు లేక సహకారసంఘములో చెల్లించబడక లేక ఇరసాలు చేయబడక దానిని ఖర్చుకై ఉపయోగింపబడకూడదు

16 ఒక ట్రెజరీ, బ్యాంకు లేక సహకారసంఘములో చేయబడు ప్రతి చెల్లింపులో ఒక చలానును పంపవలెను ఆ చలానులో చెల్లింపబడిన మొత్తమును దాని స్వభావమును అది ఎవరి లెక్కన చేయబడినదో అట్టి మనిషి లేక ఆఫీసును తెలుపవలెను

17 ఎట్టి పంచాయతీగాని భూమి, కట్టడములు లేక యంత్రములను విక్రయించగా వచ్చిన ప్రతిఫలమువంటి మూలధనపు ఆదాయములను రీజినల్ ఇన్‌స్పెక్టరుయొక్క అంగీకారమును ముందుగా పొందకుండ సాధారణ ఖర్చులకు వినియోగించకూడదు

18 పంచాయతీ ఆఫీసులో ముందుగా జారీచేయబడిన బిల్లుల మీద పంచాయతీ ఆదాయమును వసూలు చేయుపని అప్పగింపబడిన ప్రతి పంచాయతీ నౌకరు లేక గ్రామమునసబుకు వసూళ్ళ పుస్తకమును సరఫరా చేయవలెను

19 బిల్లుకలెక్టర్లు లేక ఇతర బయట పనిచేయు తాబేదారులు, లేక గ్రామమునసబులు వసూలుచేసిన పన్నులను ఇతర పంచాయతీ ఆదాయములను పంచాయతీ ఆఫీసులో ఉంచబడు ఒక కలెక్షను రిజిష్టరుద్వారా పంచాయతీ ఆఫీసులో ఇరసాలు చేయవలెను

20 ఆఫీసు కలెక్షను రిజిష్టరులో పుచ్చుకొన్నట్లు వ్రాయబడిన మొత్తముల సందర్భములోతప్ప జనసామాన్యమునుండి పంచాయతీ ఆఫీసులో పుచ్చుకొనబడిన అన్ని మొత్తముల కొరకు ప్రభుత్వము వారిచే నిర్ణయించబడిన నమూనాలో రసీదులను ఇయ్యవలెను అట్టి

రసీదులు కార్యనిర్వాహక అధికారివలన లేక అతనిచే అధికారమీయబడిన ఏ ఇతర మనిషివలననైన సంతకము చేయవలెను

21 నగదుపుస్తకము మరియు సబ్సిడియరీరిజిష్టర్లు—ప్రభుత్వము వారు అప్పుడప్పుడు నిర్ణయించగల నమూనాలో కార్యనిర్వాహక అధికారి ఈక్రింది లెక్కలను రిజిస్టర్లను పంచాయతీ ఆఫీసులో ఉంచవలెను లేక ఉంచబడునట్లు చేయవలెను—

(1) నగదు పుస్తకము
(2) బండ్లపన్ను వసూలు రిజిష్టరు
(3) లైసెన్సుల యొక్కయు అనుమతుల యొక్కయు రిజిస్టరు
(4) మిస్‌లేనియస్ డిమాండ్ రిజిస్టరు
(5) ఆదాయమునిచ్చు ఆస్తుల రిజిస్టరు
(6) వసూళ్ళ పుస్తకము
(7) చెల్లించుటకు మంజూరు చేయబడిన బిల్లుల రిజిస్టరు.
(8) నానావిధమైన విక్రయముల రిజిస్టరు
(9) నానావిధములైన బిల్లు రిజిస్టరు
(10) ధర్మాదాయములయొక్కయు ట్రస్టులయొక్కయు రిజిస్టరు
(11) చిట్టా
(12) అక్విటెన్సు రిజిస్టరు
(13) నానావిధములైన రసీదులు
(14) ఆడిటు రిజిస్టరు

II వ భాగము—ఖర్చు

22 పంచాయతీ కియ్యబడిన బిల్లుల సందర్భములో పంచాయతీ నిధినుండి చేయబడు చెల్లుబళ్ళన్నియు, కార్యనిర్వాహక అధికారివలన లేక కార్యనిర్వాహక అధికారిచే ఈ విషయమున క్రమముగా అధికారమీయబడిన ఎవరో ఒక మనిషిచే బిల్లులు మంజూరు చేయబడిన తరువాత మాత్రమే చేయబడవలెను.

23 పంచాయతీనిధులు ఉంచబడియుండు ట్రెజరీ, బ్యాంకు లేక సహకార సంఘముమీద పార్టీలపేరిట వ్రాయబడిన చెక్కుల ద్వారా మాత్రమే చెల్లుబడ్లు చేయవలెను తనకున్ను, సిబ్బందికిన్ని చేయవలసిన చెల్లింపులకు మాత్రము కార్యనిర్వాహక అధికారి సెల్ఫుచెక్కులను వ్రాయవలెను పంచాయతీనిధులు పోస్టాఫీసు సేవింగ్సుబ్యాంకులో ఉంచబడిన సందర్భములో కార్యనిర్వాహక అధికారి చెల్లించుటకు వలసిన మొత్తమును తీసి సంబంధించిన పార్టీలకు చెల్లించవలెను

24 కొలదిపాటి చిల్లర ఖర్చులకుగాను పంచాయతీ, కార్య నిర్వాహక అధికారికి పర్మనెంటు అడ్వాన్సును జారీచేయవచ్చును లావాదేవీలను కంటింజెంటు చార్జీల రిజిష్టరులో రికార్డుజేయబడి పర్మనెంటు అడ్వాన్సు ఖర్చయిపోయినప్పుడెల్లా అది భర్తీ చేయబడ వలెను

25 ఒక గవర్నమెంటు ట్రెజరీ, లేక బ్యాంకు లేక సహకార సంఘములో ఉంచబడిన పంచాయతీ నిధులనుండి చెక్కులను వ్రాయు టకు అధికారమీయబడిన కార్యనిర్వాహక అధికారి లేక పంచా యతీయొక్క ఇతర ఉద్యోగి తన ఉద్యోగమును తాత్కాలికముగా లేక శాశ్వతముగా ఇంకొకరికి అప్పగించునప్పుడు ఆయన రిలీవింగు ఉద్యోగియొక్క సంతకముయొక్క మచ్చును క్రింద తెలుపబడిన నమూనాలో ఒక సర్టిఫికెట్టుతో సహా ఆయా సందర్భమునకు తగినట్లు ట్రెజరీ ఆఫీసరుకు లేక బ్యాంకుయొక్క స్థానిక ఉద్యోగికి లేక పోస్టు మాస్టరుకు లేక సహకార సంఘముయొక్క కార్యదర్శికి పంప వలెను

సర్టిఫికెట్టు నమూనా.

AB

రిలీవింగు ఉద్యోగియొక్క సంతకమును హోదాయును

పైన తెలుపబడిన సంతకము నా ఉద్యోగమును, 19 సం॥ (నెల) తేదీ ఉదయము మధ్యాహ్నమునుండి నేను ఎవరికి

అప్పగించితినో ఆ ఉద్యోగియొక్క సంతకమని నేను సర్టిఫై చేయుచున్నాను

C D.

ఉద్యోగమును అప్పచెప్పు ఉద్యోగియొక్క సంతకము, తేదీ

26 చెక్కుపుస్తకములు డబ్బును పుచ్చుకొను ఉద్యోగియొక్క స్వాధీనములో నుండవలెను ఉద్యోగములో మార్పు లేర్పడినపుడు, ఉద్యోగమును వదలిపోవు మరియు ఉద్యోగమును స్వీకరించు ఉద్యోగులు యిచ్చిన మరియు పుచ్చుకొన్న ఉపయోగింపబడని చెక్కులు, చెక్కుపుస్తకముల సంఖ్యను తెలుపుచు ఇద్దరు ఉద్యోగుల సంతకముల క్రింద నగదు పుస్తకములో ఒక షరా వ్రాసి యుంచవలెను

27 (1) పంచాయతీ నిధిమీద ఏ హక్కయినను గలిగిన ప్రతి మనిషి పంచాయతీ ఆఫీసుకు ఒక బిల్లును హాజరుపెట్టవలెను సాధ్యమైనప్పు డెల్లను ఈ బిల్లు ఆ కార్యముకొరకు ఏ నమూనా నైనను ఏర్పాటు చేయబడియున్న పక్షమున ఆ నమూనాలో ఉండవలెను హక్కుదారు దానిలో క్రమముగా సంతకముచేసి తేదీని వేసి అవసరమైనపుడు స్టాంపు అతికించవలెను

(2) సాధ్యమైనపుడెల్లను బిల్లులను తయారుచేయుటలో అచ్చు నమూనాలను ఉపయోగించవలెను

(3) ఒక హక్కుదారు ఆ కార్యము నిమిత్తము ఏర్పాటు చేయబడిన నమూనాకు భిన్నముగానుండు ఒక నమూనాలో ఒక బిల్లును హాజరుపెట్టునపుడు ఖర్చును భరించు ఉద్యోగి సరియైన నమూనాలో ప్రత్యేకముగా ఒక బిల్లును తయారుచేసి హక్కుదారు బిల్లును దానికి ఒక సబు వోచరుగా జతచేయవలెను

(4) ప్రతి బిల్లును పంచాయతీయొక్క ప్రధాన మినిస్టీరియల్ ఉద్యోగికి ఇయ్యవలెను ఆయన దానిని బిల్లుల రిజిష్టరులో నమోదు చేసికొని అంగీకారమును లేక ఇతర దస్తావేజులు హక్కుయొక్క క్రమత, అంకెల క్రమమునుబట్టి బిల్లును అంగీకరింపవచ్చునాయని సరిచూచి పరీక్షించవలెను అట్లు సరిచూచి పరీక్షించినమీదట

బిల్లు సరిగాను క్రమమైనదిగాను నున్నట్లు కనుగొనబడిన పక్షమున బిల్లులోని పే ఆర్డరులో సంతకము చేయుటకు కార్యనిర్వాహక అధికారియెదుట దానిని ఉంచవలెను

28 (1) బిల్లును తయారుచేయుమనిషియే డబ్బుపుచ్చుకొను మనిషియై బిల్లుమీాద ఒక రసీదును (అవసరమైనయెడల స్టాంపుతో కూడిన) అదివరకే పంపియున్న విషయములోతప్ప, ఏదైన జీతము లేక బత్తెము చెల్లింపబడిన పంచాయతీయొక్క ప్రతి ఉద్యోగి లేక నౌకరునుండి అక్విటెన్సు రిజిష్టరులో పుచ్చుకొన్నట్లు ప్రత్యేక సంతకములను (అవసరమైనయెడల స్టాంపుతో కూడిన) తీసికొనవలెను

(2) ఒక పంచాయతీయొక్క ఏ ఉద్యోగి లేక నౌకరైనను అతను పుచ్చుకొన్న ఏ పైకమునుండియైన ఏ మొత్తమునైనను చెల్లించిన విషయములో బిల్లుమీాద (అవసరమైనయెడల స్టాంపుతో కూడిన) ఒక రసీదు ఇయ్యబడినవే తప్ప ఆయన (అవసరమైనపుడు) స్టాంపుతోకూడిన ఒక ప్రత్యేక రశీదును పొంది బిల్లుకు జతపరచవలెను

29 బిల్లును తయారుచేయు ఉద్యోగి లేక నౌకరుకంటె పెద్దగానుండు ఏ అధికారియొక్కయైన అనుమతి ఏ ఖర్చు పద్దుకైనను కావలసినపుడు అట్టి అనుమతిని పొంది దానియొక్క వరతులను బిల్లుమీాద తెలుపవలెను

30 (1) ఎట్టిఖర్చు పద్దునుగాని, దానివిషయమున ఈ క్రింది నమూనాలో ఒక సర్టిఫికేట్టును ఇచ్చినవేతప్ప ఒక పంచాయతీ మంజూరుచేయకూడదు

మొత్తము—————శీర్షిక క్రింద— ————రూపాయల బడ్జెట్టు ఎలాట్ మెంటునుండి తీసికొనవచ్చును

| | రూ | అ | పై. |
|---|---|---|---|
| ఈ శీర్షిక క్రింద ఈ దినమువరకు ఖర్చుచెట్ట బడిన మొత్తము | | | ... |
| ఈ దినమువరకు మంజూరుచేయబడి అయితే ఖర్చుచేయబడని మొత్తము | . | . . | ... |

ఇప్పుడు మంజూరుచేయబడవలసిన మొత్తము ... ... ..

మొత్తము

మిగిలిన మొత్తము

సంబంధించిన శీర్షిక క్రింద బడ్జెట్టులో దానికై ఎట్టి ఏర్పాటు గాని లేక మరియొక శీర్షికనుండి రీ అప్రోప్రియేషన్ ద్వారా ఆ మొత్తమును పొందుటకు పంచాయతీ తీర్మానించిన పక్షమున 'తీసుకొనవచ్చును' అనుమాటకు ముందు 'రీ అప్రోప్రియేషన్ ద్వారా' అను మాటలను చేర్చవలెను

సర్టిఫికేటును కార్యానుక్రమణికలో నమూదుచేసి, సమావేశమునకు పూర్వము సభ్యులకు పంపబడవలెను అదే పంచాయతీచే అంగీకరింపబడినయెడల, మినిట్సు పుస్తకములో దానిని తీర్మానముయొక్క భాగముగా వ్రాయనక్కరలేదు కాని పంచాయతీ ఖర్చుమొత్తములోగాని ఖర్చుచేయబడు శీర్షికలోగాని ఏ మార్పునుగాని చేసినయెడల సవరింపబడిన సర్టిఫికేటు పంచాయతీయొక్క తీర్మానములో ఒక భాగముగా ఏర్పడి మినిట్సు పుస్తకములో అట్లు వ్రాయబడవలెను

(2) ఏ క్రొత్త చార్జికైన ఈయబడిన ఒక అనుమతి ఒక సంవత్సరమువరకు అమలు జరుపబడని పక్షమున, అది మరల స్పష్టముగా పునరుద్ధరింపబడిననేతప్ప అంతరించినట్లు భావింపబడవలెను. ఐతే ఈ ఉపవిధి—

(a) ఒక ఉద్యోగుల తరగతియొక్క నియామము కొరకు మంజూరుచేయబడిన బత్తెము ఆ నియమమునకు చెందిన ఒక నిర్దిష్టమైన వ్యక్తిచే లేక నిర్దిష్టమైన ఉద్యోగుల సమూహముచే పొందబడిన సందర్భమునకు,

(b) క్రమమైన అధికారివలన మంజూరుచేయబడిన ఒక సామాన్య ప్రణాళిక ననుసరించి శాశ్వతమైన సిబ్బందికి ప్రతి సంవత్సరము క్రమముగా చేయబడిన చేర్పులకు, మరియు

(c) (3) వ ఉపవిధిలో విధింపబడిన నిబంధనలవలన పరిపాలింపబడు పనులకు చేయబడు ఖర్చులకు

వర్తించకూడదు

(3) (a) సాధారణ సంవత్సరవారీ పోషణకైన అంచనాకు ఇయ్యాయబడిన అంగీకారము అది ఏ ఆర్థిక సంవత్సరమునకు సంబంధించినదో ఆ సంవత్సరముయొక్క కడపటిదినమున చెల్లిపోవును కాని ఆ తేదీన పనిని ఆపివేయుటవలన ఏ ప్రత్యేక సందర్భములోగాని ఇబ్బందికలుగునెడల మరమ్మతులను పూర్తిచేయవచ్చును ఆ తేదీకి తర్వాత అయినఖర్చులు, మరుపటి సంవత్సరమునకైన మరమ్మతులకుగాను చేయబడు క్రొత్త అంచనానుండి చేయుబడు ఖర్చుగా భావింపబడవలెను

(b) ప్రత్యేక మరమ్మతులకైన అంచనాలు ఒరిజనల్ పనుల కొరకైన అంచనాలవలె, మరమ్మతులు పూర్తియగునంత వరకు, అమలును కలిగియుండవలెను

(c) సంవత్సరవారీ పోషణకానట్టి ప్రజోపయోగమునకైన ఏ పనియొక్కయైన అంచనాకు చెందిన అనుమతి లేక అంగీకారము అట్టిపని ప్రారంభింపబడిననే తప్ప అమలు నియ్యబడిన తేదీనుండి 3 సం॥ల కాలపరిమితి తర్వాత అమలు కలిగియుండకూడదు

31 (పంచాయతీయొక్క ఏ ఉద్యోగి లేక నౌకరుకు సంబంధించిన హక్కు కానట్టి ఇతర) పంచాయతీ మీాది ఏట్టి హక్కుగాని (ఉద్యోగి లేక నౌకర్లకు సంబంధించిన హక్కును, దానికై ప్రత్యేకముగా ఏర్పాటు చేయబడిన విధులచే పరిపాలింపబడును) (1) దానికి చెందిన బిల్లు కార్యనిర్వాహక అధికారియొక్క ఉత్తరువు లేకుండ హక్కు బాకీగా ఏర్పడిన తేదీనుండి ఆరు నెలలకు మించియు, ఒక సంవత్సరమునకు మించకుండ హాజరు పెట్టబడిన విషయములో, (2) పంచాయతీ ఉత్తరువు లేకుండ హక్కు బాకీగా ఏర్పడిన తేదీనుండి ఒక సంవత్సరముకంటె ఎక్కువ కాలములో అట్టి బిల్లు హాజరు పెట్టబడిన విషయములో చెల్లింపబడకూడదు.

32 ఎక్కువగా చెల్లించినందుకైన బాధ్యత ముఖ్యముగా బిల్లును వ్రాయువారిమీాద ఉండును అట్లు ఎక్కువగా చెల్లింపబడిన మొత్తమును అతనివద్దనుండి రాబట్టవలెను అతనివద్దనుండి రాబట్టుటకు వీలు లేని పక్షమున అట్లు ఎక్కువగా చెల్లింపబడిన మొత్తమును కౌంటర్ సైనింగు లేక పాసింగ్ ఉద్యోగినుండి రాబట్టవలెను వారిద్దరిలో ఎవరియొక్కయైన నేరముగల అజాగ్రత్త మూలమున అట్లు జరిగియున్ననే మాత్రము రాబట్టవలెను

33 (1) పంచాయతీకి చెందిన ఏ పైకముగాని స్టాంపులుగాని అపహరింపబడినయెడల లేక నష్టమైపోయిన యెడల అది కనుగొనబడిన వెంటనే ఆక్టుయొక్క 74 వ సెక్షను క్రింద నియమింపబడిన ఆడిటరుకు రిపోర్టుచేయవలెను ఆ విషయమున పూర్తి విచారణ జరిగిన తరువాత సాధ్యమైనంత త్వరలో అట్టి ఆడిటరుకు అదనముగా ఒక పూర్తి రిపోర్టునుకూడ పంపవలెను ఆ రిపోర్టులో అపహారణము లేక నష్టముయొక్క స్వభావమును వ్యాప్తిని దేనివలన అట్టి అపహారణము లేక నష్టము కలుగుటకు సాధ్యముగ నుండెనో అట్టి విధులలోని తప్పులు లేక ఉపేక్ష మరియు పోయినది రాబట్టుకొనుటకు సాధ్యముగానున్నదా యని ఆ రిపోర్టులో తెలుపవలెను

(2) ఒక పంచాయతీయొక్క ఇతర ఆస్తికి దొంగతనము వలన ఇతరవిధముగా కలిగిన నష్టము, ఆ స్తియొక్క విలువ పది రూపాయలను మించునెడల దానినికూడ ఆడిటరుకు రిపోర్టు చేయవలెను

(3) (1) వ, (2) వ ఉపవిధిచే నిర్ణయింపబడిన రిపోర్టులను పంపుట, అవసరముగా నుండగల ఇతర చర్యలను తీసికొనుట నుండి పంచాయతీని లేక కార్యనిర్వాహక అధికారిని ఆటంక పెట్టినట్లు భావింప బడకూడదు

34. ఎస్టాబ్లిష్మెంటు (సిబ్బందికైన) బిల్లులు — అప్పుడప్పుడు ప్రభుత్వమువారిచే నిర్ణయింపబడగల నమూనాలో జీతపు బిల్లులను తయారు చేయవలెను సిబ్బందులయొక్క నెలసరి జీతపు

బిల్లు అప్పుడప్పుడు ప్రభుత్వమువారు నిర్ణయించగల నమూనాలో ఒక ఆబ్ సెంటీస్ స్టేట్ మెంటు (హాజరు కాని వారి వివరణము) తోనైన సిబ్బందికి చెందిన ఏవ్యక్తికైనను శెలవు ఇయ్యబడలేదని బిల్లులో ఒక సర్టిఫికెట్టుద్వారా బలపరుపవలెను

35 పీరియాడికల్ ఇంక్రిమెంటు (నియమిత కాలపరిమితులలో జీతపు పెరుగుదల) వ్రాయబడు మొదటి పేబిల్లుకు అప్పుడప్పుడు ప్రభుత్వమువారిచే నిర్ణయించబడిన నమూనాలో ఇంక్రిమెంటు సర్టిఫికెట్టును జతచేయవలెను

36 ఒక పంచాయతీకి ప్రభుత్వమువారిచే పంపబడిన లేక ఏ ఇతర స్థానికసంస్థనుండియైన దానికి మార్చబడిన ఉద్యోగి లేక నౌకరియొక్క జీతము అతని పూర్వపు ఆఫీసు అధికారి జారీచేసిన లాస్టుపే సర్టిఫికెట్టు ఇది అప్పుడప్పుడు ప్రభుత్వమువారిచే విధింపబడు నమూనాలో నుండవలెను అందిన తరువాత మాత్రము తీయవలెను అట్టి సర్టిఫికెట్టు అట్లు పంపిన లేక మార్చిన తరువాత వ్రాయబడు మొదటి పేబిల్లుకు జతచేయబడవలెను

37 (1) ఒక మనిషి మరణించిన దినమునకుగాను జీతము, సెలవు జీతము, బత్తెములను తీయువచ్చును మరణము సంభవించిన గంట ఈ హక్కును బాధించకూడదు

(2) ఒక పంచాయతీయొక్క మరణించిన ఉద్యోగి లేక నౌకరుకు రావలసిన సైకము, 1925 వ సం॥పు ఇండియా వారసత్వపు ఆక్టుయొక్క 214 సెక్షనుయొక్క తాలూకు (1) వ సబు సెక్షనుయొక్క (i), (ii), (iii), (iv) లేక (v) వ క్లాజులలో నిర్దేశింపబడిన స్వభావముగల ఒక అధికారమును హాజరు పెట్టిననే తప్ప చెల్లించబడకూడదు

అయితే అట్టి అధికారమును హాజరు పెట్టకుండా—

(i) హక్కుదారునిఅధికారము, హక్కునుగురించి పంచాయతీ అవసరమని తలంచగల విచారణను చేసిన మీదట అది తృప్తిపడిన పక్షమున పంచాయతీ ఉత్తరువు ననుసరించి 25 రూపాయలవరకు, మరియు

(11) హక్కుదారుని అధికారము, హక్కునుగురించి రీజినల్ ఇన్‌స్పెక్టరు సరిపోవునని తలంచగల విచారణనుచేసిన తరువాత ఆయన తృప్తిపడి అట్టి అధికారమును హాజరుపెట్టుమని కోరుట వలన చాల ఆలస్యము కష్టము కలుగునని ఆయన తలంచినయెడల ఆయన కోరగల హామీ లేక హామీలతో ఒక ఇండెమ్నిటీబాండును వ్రాసియిచ్చిన మీదట రీజినల్ ఇన్‌స్పెక్టరుయొక్క ఉత్తరువుల ననుసరించి రూ 25 లకు పైబడి

పై బిల్లు చెల్లింపబడవచ్చును

38 బాకీ జీతమును నెలసరి బిల్లులో కాకుండా ఒక ప్రత్యేక బిల్లులో వ్రాయవలెను ఏ బిల్లుతో నుండి చార్జి విడిచిపెట్టబడినదో లేక నిలిపియుండబడినదో లేక దేనిమీద తగ్గించుట వలన అది వాపసు చేయబడినదో అట్టి బిల్లును సదరు ప్రత్యేక బిల్లులో సూచించవలెను

39 పేబిల్లులలో కార్య నిర్వాహక అధికారి సంతకము చేసి వానిని పారితము చేయవలెను

40. జీతముల మరియు నిర్ణీత బత్తెముల చెల్లుబడి, ఆ చెల్లుబడి ఏ నెలకు సంబంధించినదో ఆ నెలకు తరువాతవచ్చు నెలయొక్క మొదటి పనిదినమునకు పూర్వము చేయబడకూడదు

అయితే పంచాయతీయొక్క కొలువును ఆఖరుగా విడిచిపెట్టి లేక మరియొక స్థానిక సంస్థయొక్క లేక ప్రభుత్వముయొక్క కొలువుకు బదిలీయైపోవు ఒక ఉద్యోగి లేక నౌకరు సందర్భములో అట్టి సందర్భముయొక్క తేదీన చెల్లుబడి చేయబడవచ్చును

ఇంతే కాకుండా ఒక నెలయొక్క మొదటి ఆరు రోజులు పబ్లికు సెలవు దినములుగానుండి ఆ దినములలో ట్రెజరీ లేక బ్యాంకులో చెల్లుబళ్లు చేయని పక్షమున ఆ సెలవులకు పూర్వము కడపటి పనిచేయు దినమున మొత్తములను తీసి చెల్లించవచ్చును.

41 జీతములకు, బత్తెములకు బిల్లును వ్రాయు మనిషి అది సరియైన మనిషి లేక మనుష్యులకు చెల్లింపబడి ముట్టినట్లు వారిచే వ్రాసి తీసుకొనునంతవరకును ఆ మొత్తమునకు ఆయన స్వయముగా

బాధ్యుడై యుండవలెను. డబ్బుతీసిన తేదీనుండి 30 దినములలోపల పైకమును పుచ్చుకొనవలసినమనిషి హాజరుకాని పక్షమున అతనికై తీసికొనబడిన మొత్తము మరుసటి బిల్లులో దానిని తక్కువగా వ్రాయుటవలన వాపసు చేయబడవలెను తీయుబడిన జీతము మరియు బత్తెముల మొత్తము ఏ పరిస్థితులలోగాని డిపాజిటుక్రింద నుంచకూడదు

42 సిబ్బందికగు చార్జీలు, ఇంటి అద్దె, వాహనభృతివంటి మరల మరల అయ్యేడు ఖర్చులకొఱకైన మాసవారీ బిల్లులను సులభముగా తనిఖీచేయుటకు, ప్రతీ పంచాయతీయొక్క ఆఫీసులో ఒక ఆడిటు రిజిష్టరును ఉంచవలెను

43 నిశ్చిత ప్రయాణపు బత్తాలుకానట్టి ఇతర ప్రయాణపు బత్తాలు ప్రభుత్వమువారు అప్పుడప్పుడు నిర్ణయించగల నమూనాలో ప్రత్యేక బిల్లులో వ్రాయబడవలెను

44 వాహనభృతి సంబంధించిన ఉద్యోగి లేక నౌకరు యొక్క పేబిల్లులో వ్రాయవలెనేగాని ప్రయాణపు బత్తా బిల్లులలో వ్రాయకూడదు జీవనభృతికైన ప్రతి బిల్లుకు వాహనము మంచి స్థితిలో పోషింపబడుచున్నదనియు ఆ నెలలో అది ఉపయోగించబడుననియు ఒక సర్టిఫికేటును జతచేయవలెను

45 పంచాయతీ అనుమతితోగాని దాని అనుమతి లేకుండగాని ఒక నెలలో చేయబడిన ఖర్చులకైన అన్నిబిల్లులు, పంచాయతీ అవసరమని తలంచగల తనిఖీచేసిన తర్వాత పారితను చేయబడుటకు సాధ్యమైనంత త్వరలో దాని సమక్షమున ఉంచబడవలెను

లైసెన్సుయొక్క నమూనా వాటికి అనుమతులు నియమించుటకు

విధులు

(జి ఒ నెం 520, లోకల్ అడ్మినిస్ట్రేషను తేదీ 24-3-1951)

విధులు

లైసెన్సులు, అనుమతులు మొదలగు వాని నమూనాలును **వాటిలోని విషయములు.**

1 ఈ ఆక్టు క్రింద లేక దాని క్రింద చేయబడిన ఏ విధి లేక ఉపవిధి క్రిందనైన యీయబడిన లేక జారీచేయబడిన అన్ని లైసెన్సులు అనుమతులు, నోటీసులు వ్రాతమూలకముగా నుండవలెను

2 ఈ ఆక్టు క్రింద లేక దాని క్రింద చేయబడిన ఏదైన విధి లేక ఉపవిధి క్రిందనైన జారీచేయబడిన ప్రతిలైసెన్సు లేక అనుమతి అది ఏ కాల పరిమితికి జారీచేయబడినదో అట్టి కాలపరిమితిని ఏ నిర్బంధములు, పరిమితులు షరతులకు లోబడి అవి జారీచేయబడినవో వాటిని నిర్దేశించవలెను దానిలో కార్యనిర్వాహక అధికారి లేక ఆ విషయమున ఆయనచే క్రమముగా అధికారమీయబడిన ఎవరిచేనైన సంతకము చేయబడవలెను మరియు అట్టి లైసెన్సును లేక అనుమతిని జారీచేయు ప్రతిఉత్తరువు పంచాయతియొక్క నోటీసుబోర్డు మీద ప్రకటింపబడవలెను.

3 (1) ఈ ఆక్టు క్రింద లేక దాని క్రింద చేయబడిన ఏ విధి లేక ఉపవిధిననుసరించియైన జారీచేయబడిన ఏదైన లైసెన్సు లేక అంగీకారముగాని దాని యే నిర్బంధములు పరిమితులు లేక షరతులైనను అనుసరించుటకు దానిని పొందిన మనిషి తప్పించుకొనునెడల లేక ఉల్లంఘించునెడల లేక దానిని పుచ్చుకొన్నమనిషి ఆక్టు యొక్క నిబంధనలలో దేనినైన ఉల్లంఘించినందులకై నేరస్థాపన చేయబడినయెడల లేక పుచ్చుకొనిన మనిషి సంగతిని తప్పుగా చెప్పగా తెలుపుటమూలముగా లేక మోసముగా దానిని పొందిన యెడల కార్యనిర్వాహక అధికారి ఏ కాలమందైనను దీనిని సవరించవచ్చును తాత్కాలికముగా నిలిపియుంచవచ్చును లేక రద్దు చేయవచ్చును ఒక లైసెన్సును సవరించుచు తాత్కాలికముగ నిలిపియుంచుచు లేక రద్దుచేయుచు కార్యనిర్వాహక అధికారిచే ఈ విధి క్రింద చేయబడిన ఏ ఉత్తరువుమీదనైన పంచాయతీకి ఒక అపీలుండవలెను ఏ ఉత్తరువుమీద అపీలుచేసికొన బడినదో ఆ వుత్తరువు పుచ్చుకొన్న మనిషికి అందినతేదీ తరువాత పది దినములలోపల పంచాయతీ ఆఫీసుకు అది అందిననే తప్ప అట్టి ఏ అపీలుగాని విచారణ జేయబడకూడదు.

(2) ఏ ఉత్తరువుమీద అపీలు చేసికొనబడినదో ఆ ఉత్తరువు పుచ్చుకొన్న మనిషికి ఉత్తరువు అందిన తేదీనుండి 30 దినముల లోపల (1) వ ఉపవిధి క్రింద పంచాయతీ ఉత్తరువులమీద జిల్లా పంచాయతీ ఆఫీసరుకు రెండవ అపీలును పెట్టికొనవచ్చును

4 ఒక లైసెన్సును లేక అంగీకారమును నిరాకరించుచు సవరించుచు తాత్కాలికముగా నిలిచియుంచుచు లేక రద్దు చేయుచు ఒక ఉత్తరువును జారీచేయుటకు ఆక్టు క్రింద లేక దాని క్రింద చేయబడిన ఏదైన విధి లేక ఉపవిధి ననుసరించియైన అర్హతగల అధికారియొక్క ప్రతి ఉత్తరువు వ్రాతమూలకముగనుండి అది ఏ ఆధారములనుబట్టి జరుపబడునో వాటిని తెలుపవలెను

5 ఏ లైసెన్సుగాని అంగీకారముగాని తాత్కాలికముగా నిలిపి యుంచబడినపుడు లేక రద్దు చేయబడినపుడు లేక ఏ కాలపరిమితి వరకు జారీచేయబడునో లేక ఏ కాలపరిమితిలోపల పునరుద్ధరణకై దరఖాస్తును పెట్టుకొనవలెనో ఆ కాలపరిమితి గడచిపోయినపుడు ఈ రెండింటిలో ఏది ఆలస్యముగా గడచిపోయినప్పటికిని పుచ్చుకొను మనిషి, ఆక్టుయొక్క లేక దాని క్రింద జేయబడిన ఏ విధి లేక ఉప విధియొక్కయైన కార్యముల నిమిత్తము ఆయా సందర్భములకు తగి నట్లు లైసెన్సును లేక అంగీకారమును తాత్కాలికముగా నిలిపి యుంచు లేక రద్దుచేయు ఉత్తరువు రద్దుచేయబడునంతవరకును లేక లైసెన్సు లేక అంగీకారము పునరుద్ధరింప బడునంతవరకును ఒక లైసెన్సును లేక అంగీకారమును కలిగియుండునట్లు భావింపబడ వలెను

6 ప్రతి లైసెన్సు లేక అంగీకారము సేయబడిన మనిషి న్యాయమైన అన్ని సమయములందును అట్టి లైసెన్సు లేక అంగీ కారము అమలులోనున్నపుడు కార్యనిర్వాహక అధికారి దానిని కోరినపుడు హాజరు పెట్టవలెను

7 ఏ నోటీసైనను ఆక్టువలనగాని దాని క్రింద చేయబడిన ఏ విధి, ఉప విధి, రెగ్యులేషనువలనగాని ఏ మనిషికైనను అందచేయ బడవలెనని లేక పంపబడవలెనని కోరబడినపుడు అట్లు దానిని అంద జేయుట లేక పంపుట—

(I) అట్టి నోటీసును అట్టి మనిషికి ఇచ్చుట మూలముగా, లేక

(II) అట్టి మనిషి కనపడని పక్షమున ఆయన కడపటగా నివసించుచుండిన లేక వ్యాపారము చేయుచుండినట్లు తెలిసిన స్థలమునందు అట్టి నోటీసు ఇచ్చుట మూలముగా తన కుటుంబములోని ఈడువచ్చిన మనిషికి లేక పనివానికి ఇచ్చుట మూలముగా లేక,

(III) అట్టి మనిషి ఆ గ్రామములో నివసించక యుండి ఇతర చోటున అతని పై విలాసము కార్యనిర్వాహక అధికారికి తెలిసియున్న పక్షమున రిజిష్టరు పోస్టుద్వారా దాని నాయనకు పంపుట మూలముగ లేక,

(IV) పైన చెప్పిన విధములలో నేదిగాని సాధ్యము కాని పక్షమున అట్టి నివాసస్థలము లేక వ్యాపారస్థలము యొక్క ఏదో ఒక ప్రాముఖ్యమైన స్థలమందు అతికించుట మూలముగా చేయబడవచ్చును

8 ఆ మనిషి ఏ కట్టడము లేక భూమియొక్కయైన స్వొంతదారుగా లేక అనుభవదారుగా నున్నప్పుడు నోటీసులో స్వొంతదారుని లేక అనుభవదారుని పేరును పేర్కొన అవసరము లేదు మరియు వారు ఉమ్మడి స్వొంతదారులు లేక అనుభవదారులుగనున్న సందర్భములో, అట్టి స్వొంతదారులు లేక అనుభవదారులలో నొకరికి దానిని అందజేసిన లేక పంపిన చాలును

9 ఈ ఆక్టు క్రింద అందజేయబడిన లేక పంపబడిన ఏ బిల్లు లేక నోటీసు, నమూనా లేక ఇతర దస్తావేజులలోనైన, ఏ పన్ను లేక ఇతర మొత్తములనైన చెల్లించుటకు లేక ఏ పనినినైన చేయుటకు లేక ఏ ఏర్పాటునైనను చేయుటకు కాలపరిమితి నిర్ణయింపబడియున్నప్పుడెల్లను, అట్టి కాలపరిమితి, ఆక్టులోగాని దాని క్రింద నిర్మింపబడిన విధులలోగాని అందుకు వ్యతిరేకముగా స్పష్టమగు ఏ నిబంధనగాని లేనపుడు అట్లు అందజేయబడిన లేక పంపబడిన తేదీనుండి లెక్కింపబడవలెను

10. 6 వ విధి క్రింద కోరబడినమీదట లైసెన్సును లేక అంగీకారమును హాజరుపెట్టుటకు తప్పిపోయిన ఎవరైనను, ఐదు రూపాయల వరకు వ్యాపించగల జుల్మానాతో శిక్షింపబడ తగియుండవలెను.

సె 73 (1) కార్యనిర్వాహకోద్యోగి రాబోవు సంవత్సరములో, బహుశః రాగల జమలను తగులగల ఖర్చులను కనబరచు ఒక బడ్జెట్టును ప్రతి సంవత్సరములోను తయారుచేసి పంచాయతీ ఎదుట పెట్టవలెను మరిన్నీ పంచాయతీవారికి ఉచితమని తోచిన సవరణలు ఏవైన నున్నయెడల అట్టి సవరణలతో బడ్జెట్టును మంజూరు చేయవలయును

(2) ఒక పంచాయతీయొక్క బడ్జెటు అట్లు మంజూరు చేయబడిన తర్వాత నిర్ణయింపబడగల తేదీన లేదా అంతకు పూర్వము నిర్ణయింపబడగల అట్టి ఆఫీసరుకు పంపబడవలెను మరిన్నీ దానిలో ఎట్టి అవసరమైన పని లేదా పనులనుగాని చేయుటను గురించి చాలినంత యేర్పాటు చేయబడలేదని ఆయన తృప్తిపడినయెడల, అట్టి ఏర్పాటును చేయుటకు అవసరముగా నుండగల విధమున బడ్జెటును మార్చుటకు ఆయన అధికారమును కలిగియుండవలెను.

(3) ఒక పంచాయతీయొక్క జమల విషయములోగాని, అది చేయ పూనుకొను వివిధ పనులమీద ఖర్చు చేయవలసిన మొత్తములను పంపకముచేయు విషయములోగాని, బడ్జెటులో చూపియుండు అంకెలను మార్చుట అవసరమని ఒక సంవత్సరములోనే అది తెలుసుకొనినయెడల, (1) వ, (2) వ సబు సెక్షనులలో నిబంధింపబడిన విధముగా ఒక సప్లిమెంటలు (అనుబంధపు) బడ్జెటుగాని రివైజుడు (సవరింపబడిన) బడ్జెటుగాని తయారుచేయబడవచ్చును మంజూరు చేయబడవచ్చును, పంపబడవచ్చును మరిన్ని సవరింపబడవచ్చును. అయితే అట్టి మార్పు ఏదిగాని నిర్ణయింపబడిన ఉద్యోగియొక్క అంగీకారములో తప్ప అమలులో పెట్టబడకూడదు

ఆదాయవ్యయ పట్టిక (బడ్జెటు), మరియు అందులోని ఒక అంశమునుండి మరియొక అంశమునకు

## పరివర్తనలను గురించిన విధులు

(జి. ఒ. నం 1547 ఎల్ ఎ తేదీ 6-8-1951)

## వి ధు లు.

పంచాయతీకి సంబంధించిన బడ్జటును మరియు కేటాయింపు మరియు పరివర్తనలు

### బడ్జటును తయారుచేయుట

1. ప్రతి పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి ప్రతి సంవత్సరమునను రాబోవుసంవత్సరమందు పంచాయతీకి కానగు జమా ఖర్చులును తెలుపుచు బడ్జటును తయారుచేయవలెను

2 వర్కింగు నిలువ బడ్జెటులు ఏర్పాటుచేయవలసిన సదరు సంవత్సరమందు ఎండోమెంట్లు రాజ్యముయొక్క గ్రాంట్లు మరియు రుణశీర్షికల క్రింద వసూళ్ళయినవి అంచనా వేయబడిన జమలలో నూటికి అయిదువంతులకు తక్కువగ నుండకూడదు

3. ప్రతి పంచాయతీయొక్క బడ్జెటు మరియు దాని సంగ్రహము ప్రభుత్వమువారిచే అప్పటప్పటికి తెలుపబడు నమూనాలో నుండవలెను.

4 (1) పంచాయతీ సదరు బడ్జెటును విచారణచేయుటకై నిర్ణయింపబడిన తేదీకి పూర్వమే పంచాయతీ సభ్యులు సదరు తేదీకి ముందుగనే దానిని పరిశీలించుటకు తగిన అవకాశము కలిగియుండు టకుగాను, సదరు గ్రామముయొక్క భాషలో బడ్జెటుయొక్క ప్రతులను పంచాయతీ సభ్యులకు పంపవలెను

(2) (1) వ ఉప విధిలో ఉపబంధింపబడిన విధముగ బడ్జెటు అందరకు పంపబడిన పిమ్మటను పంచాయతీయొక్క బడ్జెటు కమిటీ ఏదైన నున్న యెడల సదరు కమిటీ దానినిలోతుగ పరిశీలించిన మీదటను పంచాయతీ ప్రెసిడెంటు పంచాయతీ యెదుట నుంచవలెను,

## బడ్జెటును మంజూరీచేయుట

5 పంచాయతీ ఈ క్రింది విషయములనుగూర్చి తృప్తి చెందిన మీదట బడ్జెటులో అది అవసరమని భావించు మార్పులను చేసి బడ్జెటును మంజూరుచేయవలెను, ఆ విషయము లేవనగా :—

(I) జమలయొక్క అంచనా సమగ్రముగాను జాగ్రత్తతోను చేయబడవలెను,

(II) అవసరమైన ఖర్చులన్నిటికి తగిన ఏర్పాటు చేయబడవలెను,

(III) పంచాయతీచే ఒడంబడిక చేసికొనబడిన విషయములో అన్ని బాధ్యతలను క్రమముగా పరిష్కరించుటకును ఇతర కార్యములన్నిటికిని తగిన ఏర్పాటు చేయబడవలెను,

(IV) బడ్జెటు సంవత్సరమునందలి అంకెలకును, దానికిపూర్వము సంవత్సరమునందలి బడ్జెటు అంకెలకునుగల వ్యత్యాసము లన్నియు తగునట్లు వివరింపబడవలెను, మరియు

(V) వర్కింగు బ్యాలెన్సు 2 వ విధిలో నిర్ధారణ చేయబడిన కనీసపు సొమ్ముకంటె తక్కువగ నుండకూడదు.

6 మంజూరైన బడ్జెటుయొక్క మూడునకళ్లను $\frac{\text{1 వ తరగతి}}{\text{2 వ తరగతి.}}$ పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి $\frac{\text{రీజినల్}}{\text{జిల్లా}}$ $\frac{\text{ఇన్‌స్పెక్టరు}}{\text{పంచాయతీ ఆఫీసరు}}$కు సంబంధించిన $\frac{\text{జిల్లా పంచాయతీ ఆఫీసర్లు}}{\text{డిప్యూటీ పంచాయతీ ఆఫీసరు}}$ ద్వారా బడ్జెటు సంవత్సరమునకు పూర్వము నవంబరు 30 వ తేదీన లేక ఆ తేదీకి పూర్వము దాఖలుచేయవలెను అదేసమయమందు ఒక నకలును ఆడిటరుకు పంపవలెను $\frac{\text{జిల్లా పంచాయతీ ఆఫీసరు}}{\text{డిప్యూటి పంచాయతీ ఆఫీసరు}}$ ఒక

నకలును తనవద్ద ఉంచుకొని మిగిలిన రెంటిని తన షరాలతో కూడ $\frac{\text{రీజినల్ ఇన్‌స్పెక్టరు}}{\text{జిల్లా పంచాయతీ ఆఫీసరు}}$ కు పంపవలెను. $\frac{\text{రీజినల్ ఇన్‌స్పెక్టరు}}{\text{జిల్లా పంచాయతీ ఆఫీసరు}}$ పంచాయతీచే మంజూరు చేయబడినట్లుగానే సదరు బడ్జెటును అంగీకరించుచు లేక 73 వ సెక్షనుయొక్క (2) వ ఉప సెక్షనుచే కలుగజేయబడిన అధికారములను చెలాయించుచు సదరు బడ్జెటు మార్పు చేయుచు ఉత్తరువులను జారీ చేయవలెను ఆ ఉత్తరువులయొక్క నకలును కార్యనిర్వాహక అధికారికి, $\frac{\text{జిల్లా పంచాయతీ ఆఫీసరు}}{\text{డిప్యూటీ పంచాయతీ ఆఫీసరు}}$ కు మరియు ఆడిటరు పంపవలెను కార్యనిర్వాహక అధికారి $\frac{\text{రీజినల్ ఇన్‌స్పెక్టరు}}{\text{జిల్లా పంచాయతీ ఆఫీసరు}}$ జారీచేసిన ఉత్తరువులను పంచాయతీకి తెలియునిమిత్తము దానికి నివేదించవలెను

7. బడ్జెటులో చేర్చబడిన లేక బడ్జెటు కేటాయింపుకు ఎక్కువగ నున్నట్టి వ్యయముయొక్క ఏ పద్దునుగాని పంచాయతీ, అట్లు తలంపబడిన వ్యయమునకు కావలసిన ద్రవ్యము ఏ ఆధారము మూలమున వచ్చునో ఆ ఆధారమును సూచించకుండ అంగీకరించకూడదు.

8 బడ్జెటును మంజూరుచేసిన మాత్రముననే అందులో ఏర్పాటు చేయబడిన వ్యయముల నన్నింటిని చేయుటకు పంచాయతీకి అధికార మియ్యబడినట్లు భావింపబడకూడదు. ఏ వ్యయమునకుగాని బడ్జెటులో ఏర్పాటుచేయబడిన ఏఖర్చునైనను చేయుటకు ప్రభుత్వముయొక్క లేక యితర ఏ అధికారముయొక్కయైన అంగీకారము అవసరమగు నెడలను దానికై వలసిన ఏర్పాటు బడ్జెటులో చేర్చబడియుండు నెడలను మరియు అట్టి అంగీకారము ప్రత్యేకముగా చేయబడని యెడల సదరు వ్యయమును చేయుటకు పూర్వమే అట్టి అంగీకారమును పొందుట పంచాయతీయొక్క కర్తవ్యమై యుండవలెను.

9 బడ్జెటు కేటాయింపుతో పోల్చిచూడగా వ్యయము విషయములో ఆడిటరు రిమార్కులను వేటినైనను చేసినయెడల వాటిని గూర్చి కార్యనిర్వాహక అధికారి వెంటనే శ్రద్ధవహించవలెను.

కేటాయింపులు మరియు పరివర్తనలు.

10 బడ్జెటులో చేయబడిన కేటాయింపులన్నియు ఆ సంవత్సరాంతమున అంతరించవలెను సంవత్సరాంతమున వ్యయముకాక మిగిలియున్న కేటాయింపులలోని భాగములు సంవత్సరాంతమునకు పిమ్మట చెల్లింపులకై ప్రత్యేకించకూడదు లేక అట్లు అంతరించి పోకుండునట్లు చేయుటకుగాను డిపాజిట్లుకు లేక ఇతర శీర్షికలకు పరివర్తనద్వారా ప్రత్యేకింపు చేయకూడదు లేక ముందుగా పొందకూడదు.

11 ఆ సంవత్సరమునందలి వ్యయమాత్రయు ఒకటవ తరగతి పంచాయతీల విషయములో రీజినల్ ఇన్స్పెక్టరు లేక రెండవతరగతి పంచాయతీల విషయములో జిల్లా పంచాయతీ ఆఫీసరు మార్పుచేసిన విధముగానుండు నటు సంవత్సరమునకైన బడ్జెటులో కేటాయింపుల ప్రకారము క్రమపరుపబడవలెను

12 (1) ఏదైన లెక్కయొక్క శీర్షికక్రింద దరిమిలా ఒక కేటాయింపు లేక అదనపు కేటాయింపు అవసరమగునెడల అట్టి కేటాయింపును లేక అదనపు కేటాయింపును ఆయాసందర్భమునకు తగినట్లు రీజినల్ ఇన్స్పెక్టరుయొక్క లేక జిల్లా పంచాయతీ ఆఫీసరుయొక్క అనుమతితో ఈ విధులకు జతచేయబడిన A నమూనాలో ఖర్చుకై ప్రత్యేకింపు (రీఅప్రోప్రియేషన్) కొరకు అన్ని దరఖాస్తులను పెట్టుకొనవలెనను షరతునకు లోబడి, ఇతర శీర్షికలనుండి ఖర్చుకై తిరిగి ప్రత్యేకించుటద్వారా చేయవచ్చును పై చెప్పిన దరఖాస్తులు సకాలములో పంచాయతీయొక్క అంగీకారము పొందిన పిమ్మట సంవత్సరాంతమునకు పూర్వము దరఖాస్తులపై ఉత్తరువులను జారీచేయుటకును అంగీకరించుటకై కార్యనిర్వాహక అధికారిచే దాఖలు చేయబడవలెను

అయితే ఒక శీర్షికనుండి మరియొక్క శీర్షికకు 100 రూ॥లకు మించని కేటాయింపుల పరివర్తనకు పంచాయతీయొక్క అంగీకారమే చాలును.

ఇంతేకాకుండా ప్రత్యేక పరిస్థితులలోను మరియు కార్య నిర్వాహక అధికారి తగినంత సంజాయిషీని అందచేసిన మీదటను ఆయా సందర్భమునకు తగినట్లుగా రీజినల్ ఇన్‌స్పెక్టరు లేక జిల్లా పంచాయతీ ఆఫీసరు సదరు వ్యవహారము సంబంధించియుండు సంవత్సరము గడచిపోయినమీదట వ్యవహారము సంబంధించిన ఒక శీర్షికనుండి మరియొకదానికి కేటాయింపుల పరివర్తనను మంజూరు చేయుటకు అధికారమును కలిగియుండవలెను

(2) అట్టి దరఖాస్తును మంజూరుచేయుచు ఆయా సందర్భమునకు తగినట్లు రీజినల్ ఇన్‌స్పెక్టరు లేక జిల్లా పంచాయతీ ఆఫీసరు చేసిన ఉత్తరువుయొక్క నకలును సదరు ఉత్తరువు అందిన తేదీనుండి ఒక వారములోపుగా కార్యనిర్వాహకాధికారి ఆడిటరుకు పంపవలెను

13 ఏ విధమైనట్టి నిల్వలనుండిగాని ఇతర ఆధారములనుండిగాని కేటాయింపులను లేక అదనపు కేటాయింపులను చేయుట అవసరమని కనుగొనబడినపుడు అట్టి కేటాయింపులు లేక అదనపు కేటాయింపులు ఈక్రింది షరతులకును పరిమితులకును లోబడి ఆయా సందర్భమునకు తగినట్లు రీజినల్ ఇన్‌స్పెక్టరుయొక్క లేక జిల్లా పంచాయతీ ఆఫీసరుయొక్క అంగీకారము చేయబడవలెను

(1) ఖర్చునకై ఉంచబడిన మొత్తము 2 వ విధిలో నిర్దిష్టము చేయబడిన కనిష్ట మొత్తమునకు తగ్గకూడదు,

(11) కేటాయింపులకు లేక అదనపు కేటాయింపులకు దరఖాస్తులు B నమూనాలో నుండవలెను కార్యనిర్వాహక అధికారి వీటిని, సకాలములో పంచాయతీయొక్క అంగీకారమును పొందిన పిమ్మట సంవత్సరాంతమునకు పూర్వము దరఖాస్తులపై

(పుట 449 చూడుము)

అనుబంధము

A నమూనా

(12 వ నిధిని చూడుడు)

పంచాయతీకి అవసరమైనట్టి ఖర్చుకై తిరిగి ప్రత్యేకించుటద్వారా నిధులయొక్క కేటాయింపుకై లేక అదనపు కేటాయింపుకై దరఖాస్తు

| (1) ప్రత్యేకమైనట్టి పని లేక కార్యము | (2) అదనపు కేటాయింపు దేనిక్రింద అవసరమైనదో అట్టి లెక్కయొక్క శీర్షిక లేక దేనికిగాను అవసరమైనదో ఆ పనియొక్క పేరు | (3) బడ్జెటులో పని లేక కార్యముకొరకుగాను ఏర్పాటు చేయబడిన మొత్తము | (4) పరివర్తించబడిన లేక పరివర్తన చేయబడిన మొత్తము | (5) ఇప్పటివరకు ఖర్చుచేయబడిన మొత్తము | (6) ఉద్దేశింపబడిన వ్యయమునకుగాను సంవత్సరాంతమువరకు అవసరమైన మొత్తము | (7) (5) వ, (6) వ కలములయొక్క మొత్తము | (8) ప్రస్తుతము పునర్వినియోగము చేయుటకు కావలసిన మొత్తము, అనగా (7) వ కలమునుండి [(3), (4) కలములను కలిపి] తీసివేయగా వచ్చిన మొత్తము | (9) మొదటి కేటాయింపును మించుటకు కారణములు | (10) దేనినుండి పరివర్తనకై దరఖాస్తు పెట్టుకొనబడినదో ఆ లెక్కయొక్క శీర్షిక లేక ఆధారము | (11) ఏ మిగుళ్ళనుండి నిధులు కేటాయింపబడవచ్చునని భావింపబడినదో ఆ మిగుల్లు | (12) వివరాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి మార్పులకు లోబడి ............ లో మంజూరు చేయబడినవి.

రీజినల్ ఇన్‌స్పెక్టరు

జిల్లా పంచాయతీ ఆఫీసరు.

ఉత్తరువులను జారీచేయుటను అంగీకరించుటకై దాఖలు చేయవలెను మరియు

(iii) అట్టి దరఖాస్తును మంజూరుచేసిన ఉత్తరువు యొక్క నకలును సదరు ఉత్తరువు అందిన తేదీనుండి ఒక వారము లోపుగా కార్యనిర్వాహక అధికారి ఆడిటరుకు పంపవలెను

సె 74 (1) పంచాయతీ నిధియొక్క జమాఖర్చు లెక్కల ఆడిటర్లను (తనిఖీ దారులను) గవర్నమెంటువారు నియమించవలెను అట్టి ఆడిటర్లు ఇండియన్ పీనల్ కోడుయొక్క 21 వ సెక్షనుయొక్క తాత్పర్యము ప్రకారము "సర్కారు నౌకర్లు" గా భావింపబడవలెను

(2) అట్టి ఆడిటర్ల జీతము, మరియు బత్తెము, మరియు పంచాయతీ అకౌంట్లను ఆడిటుచేయు సందర్భములోనయిన ఏదయిన ఇతర ఖర్చు నిమిత్తము అగు మొత్తమును, ఇన్‌స్పెక్టరు నిర్ణయించిన ప్రకారము, పంచాయతీ తన ద్రవ్యమునుండి ప్రభుత్వమునకు చెల్లించవలయును

74 వ సెక్షను క్రింద ఆడిటర్లను నియమించు విధులు.

(I జి ఒ నెం 589, ఫైనాన్సు తేదీ 9-8-1956)

మద్రాసు గ్రామ పంచాయతీల యాక్టు, 1950 (మద్రాసు యాక్టు X ఆఫ్ 1950) యొక్క 74 వ సెక్షను యొక్క (1) వ సబు సెక్షను క్రిందను మరియు * 18-6-1951 తేదీగల ఫోర్టుసెంట్ జార్జి గెజెట్ యొక్క 927 వ పేజిలో ప్రచురింపబడిన, మద్రాసు ప్రభుత్వముయొక్క పైనాన్సు శాఖ ప్రకటన నెం 55, తేదీ 11-6-1952 సవరించుచూ ఆంధ్ర గవర్నరు యిందు మూలముగా, నిర్మాణమయిన మూడు సంవత్సరములకు పైగా వున్నట్టి II వ తరగతి పంచాయతీలకు కూడ, 1951-52 అటుతరువాత సంవత్సరములయొక్క ఆదాయ వ్యయములకు ఆడిటు చేయుటకు,

* జి ఒ నెం 702 ఫైనాన్సు తేదీ 11-6-1952 1-వ తరగతి పంచాయతీలకు ఎగ్జామినరుకు, అతని సహాయ సిబ్బందిని ఆడిటర్లుగా నియమించిన జి. ఒ.

లోకలు ఫండు అకౌంట్సుయొక్క ఎగ్జామినరును అతని సహాయ సిబ్బందిని ఆడిటర్లుగాని నియమించుచున్నారు

(II జి. ఒ నెం 946, లోకల్ అడ్మినిస్ట్రేషను తేదీ 29-6-1956)

సారాంశము.

ఆడిటు -II వ తరగతి పంచాయతీలు—II వ తరగతి పంచాయతీల ఆడిటు—1951-52 వ సంవత్సరమునుండి అంతకు పైగా పంచాయతీ నిధియొక్క ఆదాయ వ్యయములను ఆడిటుచేయుటకు ఆడిటర్లను నియమించుట-జారీ చేయబడినది —

(ఈ క్రింది వానిని చదవడమైనది —

(జి ఒ ఎమ్ ఎస్ నెం 1155, లోకలు అడ్మినిస్ట్రేషను తేదీ 11-6-1952)

(జి ఒ ఎమ్ ఎస్ నెం 2344, లోకలు అడ్మినిస్ట్రేషను తేదీ 27-11-1952)

సంయుక్త మద్రాసు స్టేట్ యొక్క లోకలు బోర్డ్సు యిన్స్పెక్టరునుండి—

ఉత్తరము నెం ROC 40075-A-4/53 తేదీ 4-7-1953

లోకలు బోర్డ్సు యిన్స్పెక్టరు (ఆంధ్ర) నుండి ఉత్తరము నెం. ROC 8603/53 తేదీ 11-2-1954

లోకలు ఫండు అకౌంట్సుయొక్క ఎగ్జామినరునుండి, వుత్తరము నెం L F 22 (క్యాంపు) తేదీ 20-3-1954

లోకలు ఫండు అకౌంట్సుయొక్క ఎగ్జామినరునుండి వుత్తరము నెం L F 1307 తేదీ 6-7-1954

లోకలు అడ్మినిస్ట్రేషనుయొక్క యిన్స్పెక్టరు జనరల్ నుండి, వుత్తరము నెం ROC 8961/54-B-5, తేదీ 15-10-1954

లోకలు అడ్మినిస్ట్రేషనుయొక్క యిన్స్పెక్టరు జనరల్ నుండి, వుత్తరము నెం 8961/54-G -1 తేదీ 7-2-1955

లోకలు అడ్మినిస్ట్రేషనుయొక్క యిన్స్పెక్టరు జనరల్ నుండి వుత్తరము నెం ROC 43031/55-G-2 తేదీ 22-9-1955

లోకలు ఫండు అకౌంట్సుయొక్క ఎగ్జామినరునుండి వుత్తరము నెం 6822 తేదీ 19-3-1956.

ఆ ర్డ ర్

II. వ తరగతి పంచాయతీయొక్క నిధియొక్క ఆదాయవ్యయ అకౌంట్లవిషయములో, 1951-52 సంవత్సరమునకు, అటు తరువాత సంవత్సరములకు, జిల్లా పంచాయతీ ఆఫీసర్లను, డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లను మ్యునిసిపాలిటీల లోకలు బోర్డుల రీజినలు యిన్‌స్పెక్టర్లను, ఆడిటర్లుగా, జి ఒ ఎమ్ ఎస్ నెం 1155 ఎల్ ఎ తేదీ 11-6-1952, మరియు జి ఒ ఎమ్ ఎస్ నెం. 2344, ఎల్ ఎ తేదీ 27-11-1952 మూలముగాను, ప్రభుత్వము నియమించియుండిరి కాని II వ తరగతి పంచాయతీలు అకౌంట్లు ఆడిటు 1951-52 సంవత్సరమునుండి వెనుకబడిపోయినది. క్రొత్తయాక్టు అమలులోనికి వచ్చినపిదప ప్రస్తుతమున్న జిల్లాలోని డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లయొక్క పరిపాలనపని మిక్కుటం క్రొత్త యాక్టు అమలులోనికి వచ్చినపిదప, ఆయా జిల్లాలలో ప్రస్తుతమున్న డిప్యూటీ పంచాయతీ అఫీసర్లయొక్క పరిపాలక సంబంధమయిన పని మిక్కుటమగుటచేత వారు ఆడిటుపని చేయలేకుండ నున్నారు అదికాక పంచాయతీల ఎన్నికలు యీలోగా వచ్చినందున, ఆ యుద్యోగులు అడిటుపని ఎంతమాత్రము చేయలేకుండ నున్నారు

2 1951-52 వ సంవత్సరమునుండి ప్రస్తుతమువున్న II వ తరగతి పంచాయతీల ద్రవ్యముయొక్క ఆదాయవ్యయములను ఆడిటుచేయుట, లోకలు ఫండు అకౌంట్సుయొక్క ఎగ్జామినరు అతని సహాయ సిబ్బందికి యీ క్రింది కారణములచేత అప్పగించవలసినదని ప్రభుత్వమునకు సూచింపబడినది —

(1) ఆడిటు విషయములో లోకలు ఫండు ఆడిటు శాఖకు ప్రత్యేక నిపుణతవున్నది మరియు

(2) అభ్యంతరములుచేయు ఆఫీసర్లకు ఆ యభ్యంతరములను వదలివేయు అధికారము వుండుట శ్రేయస్కరము కాదని ఆలోచింపబడినది నూతనముగా నిర్మాణింపబడిన II వ తరగతి పంచాయ

తీల విషయములో వాటినిర్మాణ తేదీ (ii) నూతనముగా నిర్మాణింప బడిన II వ తరగతి పంచాయతీల విషయములో వాటి నిర్మాణ తేదీనుండి మూడు సంవత్సరముల వరకు వాటియొక్క ఆడిటు ప్రస్తుతమున్న జిల్లా పంచాయతీ ఆఫీసర్లు డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లు, మరియు మ్యునిసిపాలిటీల, లోకలుబోర్డుల రీజినలు యిన్ స్పెక్టర్లు జరుపవలెనని, అటు పిమ్మట యీ పంచాయతీలను కూడ లోకలు ఫండు ఆడిటుశాఖకు ఆడిటుచేయు నిమిత్తము ఒప్పగించ వలెననియు విచారింపబడినది

3 ఆంధ్ర స్టేటుకు అన్వయించిన విధానము, మద్రాసు గ్రామ పంచాయతీల యాక్టు 1950 (మద్రాసుయాక్టు X ఆఫ్ 1950) యొక్క 74 (1) వ సెక్షను క్రింద యివ్వబడిన అధికారములను వహించుచూ వినియోగించుచూ, II వ తరగతి పంచాయతీల విషయములో, ఆదాయవ్యయములను ఆడిటుచేయుటకు 1951–52 వ సంవత్సరము నుండి యీ క్రింది విధముగా ఆడిటర్లుగా నియమించుచున్నారు —

(i) వాటియొక్క నిర్మాణ తేదీనుండి మూడు సంవత్సరములు అమలులోనున్న II వ తరగతి పంచాయతీల విషయములో, లోకలు ఫండు అకౌంట్లయొక్క ఎగ్జామినరు మరియు అతని సహాయులు, మరియు

(ii) నూతనముగా నిర్మాణింప బడిన II వ తరగతి పంచాయతీల విషయములో, వాటి నిర్మాణ తేదీనుండి మూడు సంవత్సరముల వరకు, యిన్ స్పెక్టరు జనరల్ ఆఫ్ లోకలు అడ్మినిస్ట్రేషనుయొక్క పర్యవేక్షణ క్రింద, జిల్లా పంచాయతీ ఆఫీసర్లు, డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లు, మరియు మ్యునిసిపల్ కౌన్సిలులు, లోకలు బోర్డుల రీజినలు యిన్ స్పెక్టరు అటుపిమ్మట (అనగా సదరు మూడు సంవత్సరముల తరువాత) లోకలుఫండు అకౌంట్ల ఎగ్జామినరు, అతని సహాయకులు యీతరగతి పంచాయతీలను కూడ ఆడిటు చేయుదురు

4 లోకలు ఫండు అకౌంట్సుయొక్క ఎగ్జామినరును, అతని సహాయులను I వ తరగతి పంచాయతీలకు మాత్రమే ఆడిటర్లుగా నియమించుచు జారీచేయబడిన జి ఒ నెం. ఎం ఎస్. 702, ఫైనాన్సు

తేదీ 11-6-1952 కు సవరణచేయుచు వేరుగా యుత్తరవులు ఫైనాన్సు శాఖనుండి జారీచేయబడును

(గవర్నరుగారి యుత్తరువుపై)

కె ఎన్. అనంతరామన్.

ప్రభుత్వ కార్యదర్శి

సంపాదకుని సూచనలు -

ఫైనాన్సు శాఖవారి వుత్తరువులు, యీ అర్డరుకు ముందు అచ్చు వేయ బడినది

ఆంధ్ర ప్రదేశ గవర్నమెంటు దరిమిలాను, జి ఒ నెం 946 ఎల్ ఎ. తేదీ 29-6-1956 లోని యుత్తరువులను మార్చిరి జి ఒ (రొటీను) నెం 241 ఎల్ ఎ తేదీ 18-3-1958 లో క్రొత్తగా స్థాపించిన పంచాయతీల లెక్కల ఆడిటుకూడ అనగా, మూడు సంవత్సరములకాలమునకు తక్కువ కాలమునుండి పని చేయుచున్న పంచాయతీ లెక్కల ఆడిటు, లోకలుఫండు ఎగ్జామినరు, వారి సిబ్బందితో చేయబడవలసినదిగా ప్రభుత్వము ఆజ్ఞాపించినది దీనిని బట్టి సర్వపంచాయతీల ఆడిటు ఎల్ ఎఫ్ ఆడిటు డిపార్టుమెంటువారిచే చేయవలసినదిగా తీర్మానమైనట్లు భావింపవలెను

(జి ఒ నెం 241, ఎల్ ఎ తేదీ 18-3-1958)

ఆడిటు-IIవ తరగతి పంచాయతీలు-ఎల్ ఎఫ్. ఆడిటు డిపార్టు మెంటుకు హెచ్చుపని నిచ్చుట-ఉపాదన-ప్రభుత్వ సమ్మతి

చదువబడినవి

జి ఒ నెం 946, ఎల్ ఎ తేదీ 29-6-1956 , ఇన్స్పెక్టరు జనరల్ వారి ఆర్డర్ ఓ. సి నెం 5158-C2/58 తేదీ 2-1-1958

ఆర్డరు

పైన చదువబడిన జి ఒ. లో II వ తరగతి పంచాయతీల ఆడిటు లోకలుఫండు ఆడిటు డిపార్టుమెంటుకు మార్చబడినది కాని, క్రొత్తగా స్థాపింపబడిన పంచాయతీల ఆడిటు, మొదటి మూడు సంవత్సరములవరకు, జిల్లా పంచాయతీ ఆఫీసర్లవల్ల చేయబడ వలసినదిగా తీర్మానించబడినది పై చెప్పబడిన లేఖలో లోకలు ఎడ్మినిస్ట్రేషన్ ఇన్స్పెక్టరు జనరల్, డెప్యూటీ పంచాయతీ ఆఫీసర్ల

ఆడిటు పని గట్టిగా చేయలేక పోవుచున్నారనియు కనుక ఈ పని అంతయు లోకలు ఫండు ఎగ్జామినరునకు ఒప్పగింత చేయవలసినదిగా కోరిరి. ఈ సందర్భమున డెప్యూటీ పంచాయతీ ఆఫీసర్ల గుమాస్తాలను తీసివేయవచ్చును ఎందుకనగా, లోకల్‌ఫండు ఆడిటు డిపార్టుమెంటుకు ఆడిటుపని ఒప్పగింత అయినవెనుక ఈ గుమస్తా లనవసరమని సెలవిచ్చిరి

గవర్నమెంట్ ఇన్‌స్పెక్టరు జనరల్ వారిచ్చిన సలహాను జాగ్రత్తగ నాలోచించి, క్రొత్తగాస్థాపితమైన పంచాయతుల ఆడిటు కూడ, లోకలుఫండు ఎగ్జామినరు వలననే చేయబడవలెనని నిర్ధారణ చేయుచున్నారు డెప్యూటీ పంచాయతీ ఆఫీసర్లు, జిల్లా పంచాయతీ ఆఫీసర్లు పంచాయతులు క్రమ లెక్కలను సరీగా యుంచునట్లు చూడవలెను మరియు నిందువిషయమై, తగిన హెచ్చరిక చేయవలసినదని ప్రభుత్వము ఉత్తరువు చేయుచున్నది

ఆడిటు, సర్చార్జి మరియు ఆడిటు రిపోర్టుగురించి విధులు

(జి ఒ నెం 520, లోకల్ అడ్మినిస్ట్రేషను తేదీ 23-2-1953)

(జి ఒ నెం 348, లోకల్ అడ్మినిస్ట్రేషన్ తేదీ 24-3-1951)

I సర్చార్జి, నిరాకిరణ విధులు

విధులు

పద్దులను సర్చార్జి చేయుటయు, త్రోసివేయుటయు—
విచారణ చేయుటకు ఆడిటర్లకుగల అధికారములును

1 ఒక పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి, ఆడిటర్లచే కోరబడిన విధముగ, ఆక్టుయొక్క 74 వ సెక్షను క్రింద నియమింపబడిన ఆడిటర్లకు లెక్కలనంతయు దాఖలుచేయవలెను

II ఆడిటర్లు—

(a) దేనిని చదువుట లేక పరిశీలించుట వారు అవసరమని తలంతురో అట్టి ఏదైన పుస్తకము, దస్తావేజు, ఒడంబడిక, లెక్కలు వోచరు రసీదు లేక ఇతర పత్రమును హాజరు పెట్టునట్లు లిఖితపూర్వకమైన సమనులద్వారా కోరవచ్చును

(b) అట్టి ఏ పత్రమునైన తన స్వాధీనములో లేక అధికారములో కలిగియుండు లేక దాని విషయమున బాధ్యత కలిగి యుండు ఏ మనిషినయిన హాజరు కావలెనని లిఖిత పూర్వకమైన సమనులద్వారా కోరవచ్చును

(c) అట్లు హాజరగు ఏ మనిష్షినైన అట్టి దస్తావేజు సందర్భములో ఒక రూఢీవచనమును వ్రాసి సంతకము చేయునట్లు లేక ఏ ప్రశ్నకైన జవాబు చెప్పునట్లు లేక దానికి సంబంధించిన ఏ స్టేటుమెంటునైన పంపునట్లు కోరవచ్చును

ఈ విధి ననుసరించి చట్టబద్ధముగా కోరబడిన ఏ విషయము ప్రకారమైనను నడుచుకొనుటకు తప్పిపోవు ఏ మనిష్షియైనను ఏబది రూపాయలవరకు వ్యాపించగల జుల్మానాతో శిక్షింపబడ తగియుండ వలెను

III ఆడిటర్లు—

(a) ఖర్చులో లేక పంచాయతీకి బాకీగానున్న పైకములను రాబట్టుకొనుటలో లేక పంచాయతీయొక్క లెక్కలలో వారు కనుగొను ఏపెద్ద తప్పును లేక క్రమరాహిత్యమునైనను పంచాయతీకి రిపోర్టు చేయవలెను

(b) పంచాయతీకి స్వంతమైన లేక పంచాయతీకిచెందిన ద్రవ్యము లేక ఇతర ఆస్తి నష్టమగుట వృథాగాపోవుట దుర్వినియోగపరచుట అతని అశ్రద్ధ లేక దుష్ప్రవర్తనవలన కలిగిన పక్షమున అట్టి నష్టము వృథాగాపోవుట లేక దుర్వ్యయమునకు ప్రత్యక్షముగా లేక పరోక్షముగా బాధ్యులుగానుండు మనుష్యుల పేర్లతో పంచాయతీకి కలిగినట్టి ఏ నష్టము వృథాయైపోవుట లేక దుర్వ్యయమును గురించి పంచాయతీకి రిపోర్టు చేయవలెను.

IV కార్యనిర్వాహక అధికారి, ఆడిటర్లు సూచించిన ఏ లోపములు లేక క్రమరాహిత్యమైన విషయమునైనను వెంటనే సరిచేసి దానిని పంచాయతీకి రిపోర్టు చేయవలెను

V (1) ప్రభుత్వమువారిచే అధికార మివ్వబడిన ఏ ఆడిటరుగాని చట్టవిరుద్ధముగా నుండు ప్రతి పద్దును త్రోసివేయువచ్చును.

చట్టవిరుద్ధమైన చెల్లుబళ్లుచేయు లేక చేయుటకు అధికారమిచ్చు మనిషి మీాద దానిని సర్చార్జి చేయవచ్చును ఆ మనిషియొక్క ఉపేక్ష లేక దుష్ప్రవర్తనవలన కలిగిన ఏదైనలోపము నష్టము లేక లాభసాటి కాని పెట్టుబడి లేక ఆ మనిషిచే లెక్కలోనికి తీసికొని రావలసిన, అయితే తీసికొనిరాని, ఏ మొత్తమునైన—దానికి బాధ్యుడైన ఏ మనిషి వద్దనుండియైనను చార్జి చేయవచ్చును మరియు అట్టి ప్రతి సందర్భములోను అట్టి మనిషినుండి రావలసిన ఏ మొత్తమును సర్టిఫై చేయవలెను

వివరణము — ఎవరి అజాగ్రత్త లేక దుష్ప్రవర్తనవలన అట్టి ఏ లోపము లేక నష్టముగాని కలిగెనో అట్టి ఏ మనిషికైనను ఎవరో ఇతర మనిషియొక్క అజాగ్రత్త లేక దుష్ప్రవర్తనవలన కానియెడల అతని అజాగ్రత్త లేక దుష్ప్రవర్తనలతో నిమిత్తము లేకుండా అట్టి లోపము లేక నష్టము కలిగియుండదని వాదించుటకు వీలుగానుండ కూడదు.

(2) ప్రతి త్రోసివేత, సర్చార్జీ లేక చార్జీ సందర్భములో ఆడిటరుయొక్క నిర్ణయమునకు కారణములను ఆయన వ్రాతమూలక ముగా తెలియచేయవలెను మరియు అది ఎవరిమీాద చేయబడినదో ఆ మనిషికి దాని నకలును రిజిస్టరుపోస్టుద్వారా పంపవలెను

(3) ఆడిటరుయొక్క తీర్మానము తాలూకు నకలు ఎవరికి పంపబడినదో ఆ మనిషి దానిని పుచ్చుకొనుటకు నిరాకరించు పక్ష మున (2) వ ఉపవిధియొక్క అర్థములో అట్టి నిర్ణయముయొక్క నకలు అతనికి క్రమముగా పంపబడినట్లు భావింపబడవలెను (VI), (VII) వ విధులలో నిర్ణయింపబడిన 14 దినముల కాలపరిమితి, అట్లు నిరాకరింపబడిన తేదీనుండి లెక్కింపబడవలెను

VI (1) త్రోసివేత, సర్చార్జీ లేక చార్జీవలన బాధింపబడు ఏ మనిషిగాని ఆడిటరుయొక్క తీర్మానము ఆయన పుచ్చుకొనిన తరు వాత లేక అతనికి అందచేయబడిన తరువాత పదునాలుగు దినముల లోపల,

(a) అట్టి ప్రోసిపేత సర్ఛార్జీ లేక చార్జీని కొట్టివేయు నట్లు ఒరిజినల్ విచారణాధికారము కలిగిన ప్రధాన సివిల్ కోర్టుకు దరఖాస్తు పెట్టుకొనవలెను మరియు కోర్టువారు అవసరముగా నుండు సాక్ష్యమును తీసికొనిన మీదట, ఆ పరిస్థితులలో వారు యుక్తమని తలంచు విధముగా ఖర్చులను గురించి అట్టి వుత్తరువులతో సహా అట్టి ప్రోసిపేత, సర్ఛార్జీ లేక చార్జీని ఖాయపర్చవచ్చును సవరించవచ్చును లేక తగ్గించవచ్చును

(b) అట్టి దరఖాస్తు బదులుగా క్లాసు I పంచాయతీ సంబంధమయిన గవర్నమెంటుకు క్లాజు II పంచాయతీ సంబంధమయిన ఇన్‌స్పెక్టరుకు అపీలు చేసికొనవచ్చును ఆయన యుక్తమని తలంచు ఉత్తరువును దానిమీద చేయవచ్చును సదరు అపీలుపై గవర్నమెంటు లేక ఇన్‌స్పెక్టరు జారీచేసిన ఏ ఉత్తరమైనను ఆఖరైనదిగా ఉండవలెను

(2) (1) వ ఉపవిధియొక్క (a) క్లాజుక్రింద కోర్టువారి ఏ తీర్మానము మీదనైన హైకోర్టుకు అపీలు చేసికొనవచ్చును

(a) క్లాజు క్రింద కోర్టుకు దరఖాస్తు పెట్టుకొనబడిన విషయమున ఆడిటరు దానికి ఏకైక ప్రతివాదిగా నుండవలెను దరఖాస్తుదారు ప్రభుత్వమువారినిగాని ఏ ఇతర మనిషినిగాని ఈ వ్యవహారములకు ఒక కక్షిదారుగా చేయుటకు హక్కు కలిగియుండ కూడదు

VII ఈవిధుల క్రింద ఏమనిషియొద్దనుండియైన రావలసినట్లు ఆడిటరుచే ప్రోసిపేతవేయబడిన ప్రతి మొత్తము ఆడిటరుయొక్క తీర్మానము అతనికి తెలియజేయబడిన తరువాత పదునాలుగు దినముల లోపల పంచాయతీ నిధులు ఉంచబడియుండు ట్రెజరీలో లేక బ్యాంకిలో ఆ మనిషి చెల్లింపబడవలెను కాని ఆ కాలపరిమితి లోపల అట్టి మనిషి ఆ తీర్మానములమీద కోర్టుకు లేక ఇన్‌స్పెక్టరుకు అపీలు చేసికొనియుండినయెడల అట్లు చెల్లించనవసరములేదు అట్టి మొత్తము చెల్లించబడని పక్షమున లేక బాకీగా నుండునట్లు కోర్టు లేక ఇన్‌స్పెక్టరు ప్రసిద్ధపరచినట్టి మొత్తము, కోర్టుచే డిక్రీచేయబడిన మొత్తము

ఏ విధముగా రాబట్టుకొనబడునో అట్లే జిల్లా పంచాయతీ ఆఫీసరు కోర్టుకు దరఖాస్తు పెట్టుకొన్నమీదట రాబట్టవలెను

VIII. ఈ విధులలో ఏదియున్నను దానితో నిమిత్తము లేకుండా ప్రభుత్వమువారు ఏ కాలమందైనను ఈ విధుల క్రింది ఆడిటరుచే ఏ మనిషియొద్దనుండియైన బాకీగానున్నట్లు సర్టిఫై చేయబడిన పూర్తిమొత్తమును లేక అందలి యే భాగమునసైన రాబట్టుకొనుటను, ఆ కేసుయొక్క అన్ని సందర్భములను ఆలోచించి వారి అభిప్రాయములో అట్టి చర్య అవసరమైన పక్షమున వదలివేయవలెనని ఆజ్ఞాపించవలెను

II ఆడిటురిపోర్టులు జారీచేయుట, వాటిపరిష్కారము గురించిన విధులు

(జి. ఒ నెం 1116 లోకలు అడ్మినిస్ట్రేషను తేదీ 4-6-1951)
(జి ఒ నెం 1292 లోకలు అడ్మినిస్ట్రేషను తేదీ 15-6_1953)

విధులు

I ఆడిటు రిపోర్టులను జారీచేయుటయు, పరిష్కరించుటయు.

1. ప్రతి ఆర్థిక సంవత్సరమునకైన ఒక పంచాయతీలెక్కలయొక్క ఆడిటుమీాద రిపోర్టు ఆడిటు పూర్తియైన తర్వాత ఆక్టుయొక్క 74(1) వ సెక్షను ననుసరించి గవర్నమెంటువారిచే నియమింపబడిన ఆడిటరుచే పంచాయతీ కార్యనిర్వాహక అధికారికి పంపబడవలెను అట్టి రిపోర్టుయొక్క నకలును రీజనల్ యిన్‌స్పెక్టరుకును, మరియు II వ తరగతి పంచాయతీ విషయములో, తత్సంబంధమయిన జిల్లా పంచాయతీ ఆఫీసరుకు కూడ ఆడిటరు పంపవలెను

అయితే యే II వ తరగతి పంచాయతీయొక్క అకౌంట్లు అయిన జిల్లా పంచాయతీ ఆఫీసరుచే ఆడిటుచేయబడిన యెడల అట్టి ఆడిటు రిపోర్టుయొక్క నకిలు రీజనల్ యిన్‌స్పెక్టరుకు మాత్రమే పంపబడవలెను

3 పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి ఆడిటు రిపోర్టును అందులోని ప్రశ్నలకైన తన సమాధానములతో సహా పంచాయతీ సమక్షమున ఉంచవలెను మరియు ఆడిటు రిపోర్టు

అందిన తేదీనుండి రెండు మాసముల లోపున దానికి సంబం
ధించిన జిల్లా పంచాయత్రీ ఆఫీసరుకు తాను ఇచ్చిన సమాధానములు
వాటిని అంగీకరించుచు పంచాయతీ చేసిన తీర్మానములయొక్క రెండు
నకళ్ళతో డిస్ట్రిక్టు పంచాయతీ ఆఫీసరుకు దాఖలు చేయవలెను

అయితే II వ తరగతి పంచాయతి విషయములో దాని
యొక్క అక్కౌంట్లు జిల్లాపంచాయతీ ఆఫీసరు ఆడిటు చేసియుండిన
యెడల, అట్టి పంచాయతీయొక్క ఎగ్జిక్యూటివు అధికారి, ఆడిటు
రిపోర్టును, దానికి తనయొక్క జవాబులు, పంచాయతీ తీర్మానము
లతో సహా (రెండునకళ్లు) రీజనలు ఇన్‌స్పెక్టరుకు పంపవలెను

3 I వ తరగతి పంచాయతీల సందర్భములో జిల్లా పంచా
యతీ ఆఫీసరు సదరు జబాబులను తనయొక్క షరాలు ఏదైననున్న
యెడల వాటితో సహా రీజనల్ ఇన్‌స్పెక్టరుకు దాఖలు చేసుకొన
వలెను ఈ పంచాయతీల ఆడిటు రిపోర్టు, రీజనల్ ఇన్‌స్పెక్టరుచే
పరిశీలింపబడవలెను ఆ పరిశీలన రిపోర్టుయొక్క నకలు, కార్య
నిర్వాహక అధికారి సమాధానములయొక్కయు, పంచాయతీయొక్క,
తీర్మానము యొక్కయు నకలుతో సహా ఆడిటరుకు పంపబడవలెను.

II వ తరగతి పంచాయతీల విషయములలో (వాటియొక్క
అకౌంట్లు సాధారణముగా డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లు ఆడిటు
చేసిన యెడల) ఆడిటురిపోర్టును ఆ సంబంధమయిన జిల్లా పంచా
యతీ ఆఫీసరు పరిశీలించవలెను మరియు ఆ పరిశీలన రిపోర్టు
యొక్క నకలు ఆడిటరుకు పంపబడవలెను ఏ II వ తరగతి
పంచాయతీయొక్క అకౌంట్లనయిన జిల్లా పంచాయతీ ఆఫీసరు
స్వయముగా ఆడిటుచేసిన యెడల అట్టి పంచాయతీయొక్క ఆడిటు
రిపోర్టును రీజనలు ఇన్‌స్పెక్టరు పరిశీలించవలెను మరియు ఆపరి
శీలన రిపోర్టు నకలును జిల్లా పంచాయతీ ఆఫీసరుకు పంపవలెను

సె 75 ఈయాక్టుచే లేదా దీని ననుసరించి అధికారమియ్యబడిన
యేదేని కార్యము నిమిత్తము గవర్నమెంటువారు లేదా యే ఇతర
పంచాయతీ లేదా జిల్లాబోర్డు లేదా రాజ్యములోని యే యితరస్థానిక
అధికారవర్గముగాని తగిలిన ఖర్చు గ్రామములో నివసించువారికి

లాభము కలుగ జేయునదిగా నున్న యెడల ఆ పంచాయతీ, ఇన్‌స్పెక్టరు యొక్క అనుమతితో నియ్యవచ్చును, మరిన్ని ఆయన అట్లు ఉత్తరువు చేయు నెడల అట్టి ఖర్చువిషయమై వంతు పైకమును యియ్యవలెను.

సె 76 (1) 1914 వ సం॥పు స్థానిక అధికారము వర్గముల రుణముల ఆక్టులో యేదియున్నను దానితో నిమిత్తము లేకుండ గవర్నమెంటువారు—

(a) ఈ ఆక్టుక్రింద పంచాయతీ నిధులను వినియోగించు ఏ కార్యము నిమిత్తమైనను దానికి ప్రభుత్వము ఇచ్చిన ఏదైన రుణము లేక అడ్వాన్సుకుగాను, అధికార మియ్యబడిన ఋణముల సేవకులకుగాను అయిన చార్జీలు తప్ప, అట్టి నిధియొక్క ఏదైన ఇతర చార్జీలుకంటె ముందుగా వారికి చెల్లించునట్లు పంచాయతీ నిధిని స్వాధీనమనందు కలిగిన ఏ మనిషినైనను ఉత్తరువు మూలముగా ఆజ్ఞాపించవచ్చును

(b) అట్టి ఏదైన ఋణమును లేక అడ్వాన్సును వ్యాజ్యము చేసి రాబట్టుకొనవచ్చును

(2) (1) వ సబు సెక్షనుయొక్క (a) క్లాజులో చెప్పబడిన ఉత్తరువు ఎవరికి పంపబడినదో ఆ మనిషి, అట్టి ఉత్తరువును నెరవేర్చుటకు బద్ధుడై యుండవలెను

## 5 వ అధ్యాయము—ప్రజాభద్రత, సౌకర్యము, ఆరోగ్యము

### జనోపయోగకరమైన జల ప్రవాహములు, ఊటలు వగైరా.

సె 77 (1) ఈ ఆక్టు ప్రారంభమున ఉన్నదైనను లేదా తరువాత చేయబడినదైనను, వేయబడినదైనను లేదా నిర్మింపబడినదైనను మరిన్ని పంచాయతీ ఖర్చుతోనైనసరే యితరవిధముగానైనాసరే చేయబడిన వేయబడిన లేదా నిర్మింపబడిన (వాటినివుపయోగించుటకు అనాది హక్కును కలుగ జేయునంత మేరకు జనసామాన్యముచే ఉపయోగింపబడు వాటితోచేరి) యావత్తు పబ్లిక్ జలప్రవాహములుకు ఊటలును, రిజర్వాయరులును, చెరువులును, తొట్లను, చెలమలును, బావులును, స్టాండు పైపులును యితర నీటి పనులును, వాటిని

సంబంధించిన (ఖానిగీఆస్తి కానట్టి) వాటికి ప్రక్కన ఉండు ఏదేని భూమికూడ పంచాయతీ వశమందుండి దానిపై విచారణకు లోబడి యుండవలెను

అయితే యీ సబు సెక్షనులోనున్న దేదియును ఒక నీటి పారు దల వర్కుగానుండు లేదా దానికి సంబంధించియుండు యే వర్కుకు గాని లేదా అట్టి యే వర్కుకైన సంబంధించిన ప్రక్కనుండు యెట్టి భూమికిగాని వర్తించకూడదు

(2) గవర్నమెంటువారు ప్రకటన మూలముగా అట్టిపై విచారణను నిర్వచింపవచ్చును లేదా మితపరుపవచ్చును లేదా పంచా యతీతో ఆలోచించినమీదటను దాని ఆక్షేపణలు యేవైన నున్న యెడల వాటిని బాగుగా గమనించి యెట్టి పబ్లిక్ నీటి సరఫరా ఆధారముయొక్కయు, దానికి ప్రక్కనుండునట్టిన్ని దానికి సంబం ధించినట్టిన్ని పబ్లిక్ భూమియొక్కయు నిర్వాహణమును వహించ వచ్చును

సెక్షను 112 (2) (XXIV) క్రింద జారీచేయబడిన విధులు.

(జి ఒ నెం 520, ఎల్ ఎ తేదీ 24-3-1951)

## విధులు.

### జనసామాన్యమునకు చెందిన లేక వ్యక్తులకు చెందిన ఊటలు మొదలగువాని ఉపయోగమును నిషేధించుట లేక క్రమపరచుట.

1 పంచాయతీ జనసామాన్యముయొక్క ఆరోగ్యముకొరకు ఏదైన పబ్లికు ఊట, చెరువు లేక బావి లేక ఏదైన పబ్లికు కాలువ లేక అందలి భాగములో జంతువులను కడుగుట లేక గుడ్డలను ఉతు కుట, ఇతర వస్తువులను కడుగుట లేక చేపలను పట్టుటను క్రమ పరుచవచ్చును లేక నిషేధించవచ్చును, మరియు అట్టి ఏ స్థలమునైన త్రాగుటకు లేక స్నానముచేయుటకు లేక జంతువులను కడుగుటకు లేక గుడ్డలను ఉతుకుటకు, లేక నిర్దిష్టమైన ఏ ఇతర కార్యమునకైనను ప్రత్యేకించవచ్చును

2 1 వ విధివలన నియ్యబడిన అధికారములు ఏదైన ప్రైవేటు ఊట, చెఱువు, బావి లేక కాలువ సందర్భములో అట్టి

స్థలముయొక్క కామందు అనుమతితో పంచాయతీచే చెలాయించ బడవచ్చును

3. పంచాయతీ జనసామాన్యముయొక్క ఆరోగ్య రక్షణ నిమిత్తము జనసామాన్యము త్రాగుటకుగాను నీళ్ళను తెచ్చుటకు హక్కుగల ఏదైన ప్రైవేటు ఊట, చెరువు, బావి, లేక కాలువలో జంతువులను కడుగుటను గుడ్డలను ఉతుకుటను ఇతర వస్తువులను శుభ్రముచేయుటను క్రమపరుచవచ్చును లేక నిషేధించవచ్చును

4 పంచాయతీయొక్క కార్యనిర్వాహ అధికారి ప్రభుత్వము యొక్క, పంచాయతీయొక్క లేక జిల్లాబోర్డుయొక్క వుద్యోగములో నుండు ఏ మెడికల్ ఆఫీసరైనను గ్రామములో ప్రజలకు అందు బాటులోనుండు ఏదైన బావి, చెరువు, ఊట లేక ఇతర నీటి సరఫరా ఆధారములోని నీరు ఏదైన అపాయకరమైన వ్యాధిని బహుశః కలి గించును లేక వ్యాపింపచేయునని తెలుపు ఒక సర్టిఫికేట్టు అందిన మీదట బహిరంగమైన నోటీసుద్వారా అట్టి నీటిని ఉపయోగించు టను నిషేధించవచ్చును అట్టి నోటీసు నీటి ఆధారమునకు సమీప మున దాని నకలును అతికించుట మూలముగా లేక అట్టి నిషేధము ఎన్ని దినములుండునో ఆ దినముల సంఖ్యను తెలుపుచు దండోరా వేయుట మూలముగా తెలుపబడవలెను కార్యనిర్వాహక అధికారి అదనపు సర్టిఫికేట్టును హాజరు పెట్టక సదరు నోటీసును వ్యాప్తిచేయ వచ్చును లేక సవరించవచ్చును

5 ఏ మనిషిగాని—

(a) ఒక పంచాయతీవలన లేక ప్రైవేటు ఆస్తి సంద ర్భములో దాని ఖామందు వలన, త్రాగుటకొరకు లేక వంటచేయు కార్యము నిమిత్తము ప్రత్యేకించబడిన ఏ స్థలములోని నీటి ఊటలో నైన స్నానము చేయకూడదు లేక మురికి చేయకూడదు

(b) త్రాగుటకుపైన చెప్పిన విధముగా ప్రత్యేకింపబడిన ఏ స్థలముయొక్కనైన పొడిగానుండు జలాశయ గర్భములో అసహ్యా కరమైన లేక హానికరమైన ఏ పదార్థమునుగాని ఉంచకూడదు, లేక

(c) త్రాగుటకొరకు లేక స్నానముచేయుట కొరకు పైన చెప్పిన విధముగా ప్రత్యేకించబడిన ఏ స్థలమందైన గుడ్డలను ఉతుక కూడదు, లేక

(d) త్రాగుటకు లేక స్నానము చేయుటకు లేక గుడ్డల నుతుకుటకు పైనచెప్పిన విధముగా ప్రత్యేకించబడిన ఏ స్థలములో నైన ఏ జంతువునైన లేక వంటపాత్రను లేక ఉన్ని, తోళ్ళు లేక దుర్గంధముతోకూడిన లేక వుపద్రవకరమైన ఇతర పదార్థమును కడుగ కూడదు లేక త్రాగుటకు స్నానము చేయుటకు లేక బట్టల నుతుకుటకు ప్రత్యేకించబడిన ఏ స్థలములోగాని ఉపద్రవమును కలిగించు లేక హానిని కలిగించు ఏ పదార్థమునుగాని ఉంచకూడదు, లేక

(e) అతనికి చెంది లేక అతని అనుభవములోనుండు ఏ కట్టడము నుండియైన ప్రవహించు మురుగుగుంట, మురుగుకాలవ, జలదారి ఇంజను లేక బాయిలరునుండి నీటిని లేక అతనికి చెందిన ఏ ఇతర అసహ్యాకరమైన పదార్థమునయిన, త్రాగుటకు లేక స్నానము చేయుటకు లేక గుడ్డల నుతుకుటకు పైన చెప్పినవిధముగా ప్రత్యేకించ బడిన ఏ స్థలములోనికిగాని వచ్చునట్లు చేయకూడదు

6 1 నుండి 3 వరకు గల విధుల నిబంధనలలో దేనిక్రింద నయిన జారీచేయబడిన ఏ వుత్తరువునుగాని, లేక 4 వ విధిక్రింద ఒక నోటీసును, లేక 5 వ విధియొక్క నిబంధనలలో దేనినిగాని ఉల్లం ఘించు లేక ఈ విధులలో దేనిక్రిందనయిన ఆయనకు చట్టసమ్మత ముగా నియ్యబడిన యే ఆజ్ఞప్రకారముగాని, చట్టసమ్మతముగా ఆయనను కోరిన ప్రకారముగాని నడుచుకొనుటకు తప్పిపోయినయెడల, ఏబది రూపాయలవరకు వ్యాపించగల జుల్మానాతో, మరియు ఉల్లం ఘన పదేపదే జరుగుచుండు సందర్భములో, మొదటి ఉల్లంఘన కొరకు నేర స్థాపన చేయబడినతర్వాత ఉల్లంఘన జరుగుచుండు ప్రతి దినమునకు పది రూపాయలకు మించని జుల్మానాతో శిక్షింపబడతగి యుండవలెను

**పారిశుద్ధ్యపు యేర్పాట్ల విషయమున యివ్వబడు వంతు పైకములు.**

సె 78. ఒక మసీదు, దేవాలయము, మఠము లేదా యెట్టి మత సంబంధమైన ఆరాధన స్థలము లేదా బోధనాస్థలము లేదా సంతలను, ఉత్సవములను జరుపుటకు లేదా అదే విధమైన యితర కార్యముల కొరకు వుపయోగింపబడు ఏ యితర స్థలముగాని గ్రామ హద్దులలోపుగా లేదా దాని చుట్టుప్రక్కలలోనుండి సంవత్సరము నందంతటను లేదా ప్రత్యేక సమయములలోను చాలమంది మనుష్యులు అచ్చటికి వచ్చుచుండు సందర్భములో, జనసామాన్యము యొక్క ఆరోగ్యమునకు భద్రతకు లేదా సౌకర్యమునకు అవసరమగు శాశ్వతమైన లేదా తాత్కాలికమైన యెట్టి ప్రత్యేక యేర్పాట్లుగాని, పంచాయతీ చేయవలెను. అయితే గవర్నమెంటువారు అట్టి స్థలము మీద అధికారమును కలిగియున్న ట్రస్టీతో లేక యితర మనిషితో ఆలోచించిన మీదట, వారు నిర్ణయించగల విధముగా మరల మరల ఇయ్యవలసిన లేక అట్లు ఇయ్యనవసరములేని వంతు పైకమును పంచాయతీయొక్క నిధుల కియ్యవలసినదిగా ఆయనను కోరవచ్చును

సంపాదకుని సూచిక

ప్రభుత్వముయొక్క అధికారములు ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషనుకు దత్తత చేయబడినవి (జి ఒ నెం 1118, లోకలు అడ్మినిస్ట్రేషను, తేదీ 4-6-1951)

## రోడ్లు

సె 79 ఈ ఆక్టు ననుసరించి చేయబడిన విధులచే అనుమతింపబడునట్లు తప్ప మరిన్ని అట్టి విధులచే అగత్యముగా చేయబడిన యెట్టి లైసెన్సుచేగాని విధింపబడిన షరతులకు అనుగుణముగా నుండునట్లు తప్ప యే మనిషిగాని—

(a) ఏదేని పబ్లిక్ రోడ్డులోనైనను దానిమీదనైనను శాశ్వతమైనదైనను సరే తాత్కాలికమైనదైనను సరే యెట్టి గోడను గాని కట్టగూడదు లేదా కంచెను లేదా యితర ఆటంకమును లేదా ముందుకు పొడుచుకొనివచ్చు దానినిగాని నిర్మించగూడదు లేదా యే దేని ఆక్రమణనుగాని చేయకూడదు ,

(b) ఏదేని పబ్లిక్ రోడ్డులోగాని, దానిమీదగాని యెట్టి రంధ్రమునైన చేయకూడదు లేదా యెట్టి పదార్థమునుగాని ఉంచకూడదు,

(c) ఒక పంచాయతి వశమందుండు లేదా దానికి చెందియుండు ఒక పబ్లిక్ రోడ్డుకుగాని యితర స్థిరాస్తికిగాని యిరువది గజముల లోపలనున్న యెట్టి స్థలములోనైన ఒక క్వారీని త్రవ్వకూడదు లేదా దానినుండి రాళ్లను, మట్టిని లేదా యితర పదార్థములను తొలగించకూడదు అయితే ఈ క్లాజులో నున్నదేదియు వాస్తవమైన వ్యవసాయ కార్యము సందర్భములో చేయబడినదని ఇన్‌స్పెక్టరు అభిప్రాయపడు ఏ పనికిగాని వర్తించునట్లు భావింపబడకూడదు,

(d) ఎట్టి మురుగుకాలువమీద లేదా జలాదారిమీద లేదా దానియొక్క యేదేని భాగముమీదగాని యెట్టి కట్టడమునుగాని కట్టకూడదు,

(e) ఒక పంచాయతీ స్వాధీనమందున్న లేదా దానికి చెందియున్న యే పబ్లికు రోడ్డుమీదగాని లేదా యితర ఆస్తిమీదగాని యెట్టి చెట్టునైన నాటకూడదు,

(f) అట్టి యే పబ్లిక్ రోడ్డుమీదగాని లేదా యితర ఆస్తిమీదగాని లేక దేని ఉపయోగము 60 వ సెక్షను లేక 61 సెక్షనుననుసరించి పంచాయతీ క్రమపరచబడునో అట్టి బాపతు ఏ పోరంబోకుమీదగాని, భూమిమీదగాని పెరుగుచున్నట్టిన్ని, దానికైన హక్కు తనకు ఉన్నదని లేదా తనకు చెందియున్నదని అట్టి మనిషిచే స్థిరపరచబడనట్టిన్ని యెట్టి చెట్టుగాని పడగొట్టకూడదు, తొలగించకూడదు, నాశనము చేయకూడదు, నరుకకూడదు లేదా దానినుండి బెరడును లేదా ఆకులను లేదా కాయలను తీయకూడదు లేదా యితర విధముగా దానికి నష్టము కలుగజేయకూడదు

పబ్లిక్ రోడ్లమీద (రాజబాటలమీద) లేక పంచాయతీ ఆస్తులమీద, లేక పోరంబోకులమీద ఆక్రమణలకు లైసెన్సు యిచ్చుట, మరియు దురాక్రమణలను

తీసివేయుట గురించి విధులు
(జి ఒ నెం 125, ఎల్ ఎ తేదీ 23-1-1953)

విధులు.

## పబ్లిక్ రోడ్లలోపలగాని, మీదుగాగాని ఆటంకములు కలుగజేయుటను నిషేధించుట - ఆక్రమణలయొక్క తొలగింపు వగైరా.

1 (1) ఏ మనిషిగాని పంచాయతీ వశమందుండు లేక దానికి చెందియుండు పబ్లిక్ రోడ్డుకుగాని, యితర స్థిరాస్తికిగాని యిరువది గజములలోపలనున్న ఎట్టిస్థలములోనైన పంచాయతీచే జారీచేయబడిన ఒక లైసెన్సుక్రింద తప్ప ఒక క్వారీని త్రవ్వకూడదు లేదా అచ్చట నుండి రాళ్లను మట్టిని లేదా యితర పదార్థములను తొలగించకూడదు పంచాయతీ ఒక లైసెన్సును జారీచేయుటకు అనుమతించవచ్చును లేక నిరాకరించవచ్చును మరియు నిరాకరించిన సందర్భములో సంబంధించిన వ్యక్తి లేక వ్యక్తులకు నిరాకరించుటకు గల కారణము లను తెలియజేయవలెను

(2) పంచాయతీయొక్క అభిప్రాయములో ఏ క్వారీనైనను త్రవ్వుట లేక ఏ స్థలమునుండియైన రాళ్లు, మట్టి లేక ఇతర పదార్థ మును తొలగించుట దాని చుట్టుప్రక్కల కాపురముండు లేక చుట్టు ప్రక్కలకు పోవుటకు చట్టరీత్యా హక్కుగల మనుష్యులకు అపాయ కరముగానున్న పక్షమున లేక వారికి ఉపద్రవము కలిగించు పక్షమున లేక బహుశః కలుగజేయుగల పక్షమున సదరు క్వారీని లేక స్థలము యొక్క ఖామందును లేక దానిమీాద అధికారము కలిగిన మనిషిని దానిని త్రవ్వుటను చాలించవలసినదిగా లేక అట్టిస్థలములనుండి రాళ్లు మట్టి లేక ఇతర పదార్థమును తీయుటను చాలించవలసినదిగా పంచాయతీ కోరవచ్చును. లేక దానినుండి ఏర్పడు లేక బహుశః ఏర్పడగల అపాయమును ఆపుటకు లేక ఉపద్రవమును నివారించుటకు అది అవసరమని తలంచగల ఉత్తరువును అట్టి క్వారీ లేక స్థలము విషయమును పొందవలసినదిగా కోరవచ్చును.

2. (1) ఎట్టి తలుపు, గేటు, ఇనుపకడ్డీ లేక క్రింది అంతస్తు కిటికీగాని కార్యనిర్వాహక అధికారినుండి ఒక లైసెన్సు పొందక పంచాయతీకి చెందిన ఏ పబ్లిక్ రోడ్డుమీదకుగాని వచ్చునట్లుంచ కూడదు లేక దానిమీదికి వెలుపలి వైపుగా తెరచుకొన్నట్లు ఉంచ కూడదు

(2) కార్యనిర్వాహక అధికారి అట్టి తలుపు, గేటు, కడ్డీ లేక కిటికీయొక్క ఖామందును దానిభాగ మేదైనను తెరువబడి నపుడు పబ్లికు రోడ్డుమీదకు పోనుచుకొని రాకుండునట్లు మార్చవలసి నదిగా నోటీసు ద్వారా కోరవచ్చును

3 (1) కార్యనిర్వాహక అధికారి ఏ ఆవరణయొక్కయైన ఖామందునుగాని అనుభవదారునిగాని అట్టి ఆవరణకు ఎదురుగా లేక ముందుగానున్న మరియు పంచాయతీకి చెందిన ఏ పబ్లికు రోడ్డులో గాని లేక మీదగాని ఉండు (తలుపు, గేటు, కడ్డీ లేక క్రింద అంతస్తు యొక్క కిటికీ కానట్టి ఇతర) ఏదైన ముందుకు పొడుచుకొని వచ్చి యుండు వస్తువును ఆక్రమణను లేక ఆటంకమును తొలగించునట్లు లేక మార్చునట్లు నోటీసుద్వారా కోరవచ్చును

(2) అట్టి ముందుకు వచ్చియుండు వస్తువు, ఆక్రమణ లేక ఆటంకము ఏదైనను కాలదోష చట్టముక్రింద ఏ మనిషికైనను దాని విషయమున చిరకాలానుభవ హక్కును కలుగచేయుటకు చాలినంత కాలపరిమితివరకు ఉన్నదని లేక ఆ విషయమున క్రమముగా అధి కారమీయబడిన ఏ స్థానిక అధికారి వర్గముయొక్కయైన అనుమతితో లేక లైసెన్సుతో అది నిర్మింపబడెనని లేక చేయబడెనని అట్టి అను మతి లేక లైసెన్సు ఏ కాలపరిమితి వరకు చెల్లునో ఆ కాలపరిమితి ఏదైన నున్నయెడల అది ఇంకను గడిచిపోలేదని సదరు ఆవరణ యొక్క ఖామందు లేక అనుభవదారు ఋజువుపరచునెడల, దానిని తొలగించుటవలన లేక మార్చుటవలన నష్టపడిన ప్రతి మనిషికి పంచాయతీ న్యాయమైన పరిహారమును ఈయవలెను

4 (1) కార్యనిర్వాహక అధికారి పంచాయతీయొక్క అనుమతితో పంచాయతీ వశమందు పబ్లిక్ రోడ్డుమీద ముందుకు

పొడుచుకొని వచ్చునట్లు వరండాలు, బాల్కనీలు, సన్ షేడులు, నెదర్ ఫ్రేములు వగైరాను నిర్మించుటకు లేక ఆ ఆవరణలోనికి పోవుటకు అవసరముగానుండు ఏదైన సోపానము లేక మురుగుకాల్వమీద మూతను నిర్మించుటకు ఏ ఆవరణ యొక్కయైన ఖామందుకు లేక అనుభవదారుకు ఆయన యుక్తమని తలంచు షరతులకును, నిర్బంధములకును లోబడి లైసెన్సును జారీచేయవచ్చును

(2) (1) వ ఉపవిధి క్రింది లైసెన్సుకైన ప్రతి దరఖాస్తులో అది ఏ పదార్థములలో నిర్మించుట కుద్దేశింపబడినదో ఆ పదార్థములను గురించియు, లైసెన్సు అవసరమునుండు కాలపరిమితిని గురించియు సమాచారమును తెలియజేయవలెను

(3) తాటిఆకులు లేక కొబ్బరిఆకులు, వెదుళ్ళు లేక ఇతరచాపలు లేక గోతము, గుడ్డ లేక అదేవిధమైన ఇతర పదార్థము వంటి తాత్కాలికపు పదార్థములతో లేక ప్రతిదినము ఒకచోటు నుండి మరియొక చోటకు కొనిపోవుటకు వీలుగానుండు స్వభావమును గల పదార్థముతో ఆ కట్టడమును నిర్మింపబడి మరియు లైసెన్సు యొక్క కాలపరిమితి 12 నెలలను మించకుండ ఉండిన పక్షమున పంచాయతీ లైసెన్సును జారీచేయవచ్చును లేక పునరుద్ధరింపవచ్చును.

(4) కలెక్టరుయొక్క అనుమతిని ముందుగా పొందిననే తప్ప (3) వ ఉపవిధిలో తెలుపబడిన వివరము ప్రకారము లేని నిర్మాణమునకు లేక 12 నెలలకు మించిన కాలపరిమితికి ఒక పంచాయతీ లైసెన్సును జారీచేయకూడదు కలెక్టరు అంగీకారము నిచ్చుటలో, పంచాయతీ ఎట్టి షరతులకు లోబడి లైసెన్సులు జారీచేయనగునో అట్టి తానవసరమని భావించు షరతులను విధించవచ్చును లైసెన్సును జారీచేయుటకు పూర్వము దానిలో అట్టి షరతులకు పంచాయతీ పొందుపరచవలెను

ఈ ఉపవిధి క్రింది జారీచేయబడిన లైసెన్సు సందర్భములో, లైసెన్సుయొక్క పునరుద్ధరణ 3 సం॥లకు మించిన కాలపరిమితికి

లైసెన్సుయొక్క కాలపరిమితి వ్యాప్తిచెందని పక్షమున దాని పున రుద్ధరణకు కలెక్టరుయొక్క అంగీకారము పొందనవసరము లేదు

(5) ఆవరణలోనికి పోవుటకు అవసరమైయుండు మెట్లు లేక మురుగుకాల్వలపై మూతలు నిర్మించుటకైన లైసెన్సులను ఈ క్రింది అదనపు షరతులకు లోబడి జారీచేయవలెను మరియు ఆ షరతులను లైసెన్సులలో స్పష్టపరుపవలెను :—

(i) మురుగు కాల్వలమీది మెట్లు లేక స్లాబులు (రాళ్ల పలకలు), మురుగుకాల్వయొక్క గోడకు ఆవల రోడ్డు పక్కగా ముందుకు పొడుచుకొని రాకూడదు రోడ్డుమీదికి ప్రత్యక్షముగా ముందుకు వచ్చియుండు బాపతు ఆవరణలోనికి పోవుటకు దారి నిచ్చు మురుగు కాల్వమీది మెట్టు లేక రాతిపలక ఇంటికి సంబంధించిన ఆవరణ సందర్భములో 3 అడుగుల పొడవుకంటె ఎక్కువగ నుండకూడదు అంగళ్ళు లేక వ్యాపారసంబంధమైన ఆవరణ సందర్భములో 5 అడుగుల పొడవుకుమించి యుండకూడదు అయితే 20 అడుగుల పొడవుకంటె తక్కువ ముందుభాగముగల అంగళ్ల లేక వ్యాపార సంబంధమైన ఆవరణల సందర్భములో ఒక మెట్ల వరుసను మాత్రము నిర్మించుటకు అనుమతించవచ్చును మురుగు కాల్వలమీదుగా బండ్ల రాకపోకలు బహుళః జరుగగల ముందు ప్రహరిగోడ ఉండు ఆవరణ సందర్భములో పంచాయతీయొక్క కార్య నిర్వాహక అధికారి సదరు పైమూతయొక్క పొడుగును నిర్ణయించ వలెను

(ii) మురుగు కాల్వలమీద మూతలు మురుగు కాల్వలయొక్క రివైనింగు గోడల పై భాగమునకు సమముగా నుండ వలెను అయితే అట్టి పై మూతల క్రింద మురుగు కాల్వయొక్క లోతు వాననీరు ప్రవహించుటకు చాలినదని పంచాయతీవారు ఒప్పుకొనవలెను మురుగు కాల్వలో నీరు నిరాటంకముగా ప్రవ హించుటకు అట్లు చేయుట అవసరముగానుండు అసాధారణమైన సందర్భములలో లేక లైసెన్సు నిచ్చు అధికారి ఆక్షేపణచేయని సందర్భములో రివైనింగు గోడల పై భాగములను మూసివేయుటకు

రాతి పలకలను వేయవచ్చును అయితే కలెక్టరుయొక్క అనుమతిని ముందుగా పొందవలెను మరియు రాతిపలకల పై భాగపు మట్టము నుండి రోడ్డు మట్టమునకుపోవు రోడ్డు వైపుగానుండు ఎత్తుగా ఉంచబడిన రాతిపలకమీాద తగిన విధముగా సిమెంటు కాంక్రీటు రాంపు (చిన్న స్లోపు) ను నిర్మించవలెను

(III) రోడ్లమీాద ముందుకువచ్చియుండు ఆవరణల సందర్భములో మురుగు కాల్వలమీాద వేసినమూత మురుగుకాల్వ యొక్క ప్రమాణము ననుసరించి 6 నుండి 36 అంగుళములు వరకుగల మురుగుకాల్వలకు 2 మొదలు 4 అంగుళముల దళసరిగా నుండవలెను మురుగు కాల్వలమీాద బరువైన బండ్లు రాకపోకలు ఉండగలచోట్లలో ముందువైపు ప్రహరీగోడతో గూడిన ఆవరణల సందర్భములలో ఈ క్రింది దళసరులను కలిగిన నల్లరాతి పలకలు లేక రీఇన్ ఫోర్స్డు కాంక్రీటు పలకలను మూతలుగా వేయవచ్చును —

| | అంII లు | రీఇన్ ఫోర్స్డు కాంక్రీటు పలకలు. అంII లు | పైన ఎట్టిమూతలేని పక్షమున ఒక్కొక్కటి 18 అంII ల వెడల్పుగల నల్లరాతి పలకలు అంII లు. |
|---|---|---|---|
| మురుగు కాల్వమీాద | 6 మొదలు 12 వరకు | 4 | 5 |
| డిటో | 15 మొదలు 24 వరకు | 6 | 7 |
| డిటో | 27 మొదలు 36 వరకు | 7 | 9 |

ఇంకను పెద్ద మురుగు కాల్వల సందర్భములలో పై మూత యొక్క దళసరి మరియు పదార్థము ప్రతిసందర్భములో ఈ క్రింది

విషయములకు తగినట్లు పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధి కారి నిర్ణయించిన విధముగా నుండవలెను—

(a) ఉపయోగింపబడిన రాతియొక్క తరగతి లేక మూయుటకైన ఇతర పదార్థము.

(b) బరువును మోయు ప్రతిపలకయొక్క వెడల్పు,

(c) అపేక్షించిన కేంద్రీకరింపబడిన బరువు, మరియు

(d) పలకను మూసివేయుటకు ఏ పదార్థమునైన ఉంచ గోరినపుడు దానిలోతు

ఈ షరతును ప్రత్యేక సందర్భములలో కలెక్టరుయొక్క అంగీ కారమును ముందుగాపొంది సడలింపవచ్చును

(IV) మురుగు కాల్వను పరీక్షించుటకు లేక మర మ్మత్తుచేయుట కవసరమైనపుడెల్లను లైసెన్సుదారుని ఖర్చుతో అవి తొలగింపబడ తగియుండవలెను

(V) ఒక పంచాయతియొక్క కార్యనిర్వాహక అధి కారి యుక్తమని తలంచునపుడెల్లను లిఖితపూర్వకమైన వుత్తరువు ద్వారా, నష్టపరిహారము చెల్లించకియే ఆక్రమణను పూర్తిగా తొల గించునట్లు ఆజ్ఞాపించవచ్చును,

అయితే పైన చెప్పిన ఉత్తరువు చేయ నుద్దేశించిన చర్యకు గల కారణములను తెలుపవలెను , మరియు సంబంధించిన మనుష్యులకు ముందుగా తెలుపక జారీ చేయబడకూడదు,

(VI) మురుగు కాల్వమూతయొక్క పై భాగమును అంగడియొక్క భాగముగా ఉపయోగించరాదు లేక దానిని ఇతర విధముగా ఆక్రమించరాదు

(6) లైసెన్సు నీయబడిన బాపతు ముందుకు వచ్చియుండు భాగము, నిర్మాణము లేక కట్టడము కలెక్టరుయొక్క అభిప్రాయ ములో ఆక్షేపణకరమైనదిగానున్న పక్షమున లేక జనసామాన్యము యొక్క సౌకర్యమునుబట్టి ముందుకు వచ్చియుండు భాగము, నిర్మా ణము లేక కట్టడము తొలగింపబడవలెనని తలంచిన పక్షమున (3) (4) లేక (5) వ వుపవిధి ననుసరించి జారీచేయబడిన ఏ లైసెన్సు

నైనను రద్దుచేయుటకై వుత్తరువు నిచ్చుటకు కలెక్టరుకు అధికార ముండవలెను. మరియు అట్టి వుత్తరువును జేసినమీదట పంచాయతీ వెంటనే లైసెన్సు రద్దుచేసి ముందుకు వచ్చియుండు భాగమును, నిర్మాణముచు లేక కట్టడమును తొలిగించవలెను.

(7) (3) (4) లేక (5) వ ఉపవిధుల క్రింద జారీచేయబడిన ప్రతి లైసెన్సు ఈ క్రింది షరతులకు లోబడియుండవలెను— (1) (6) వ ఉపవిధిలో చెప్పబడిన పరిస్థితులందు ఎప్పుడైనను అది రద్దు చేయబడ తగియుండవలెను, మరియు

(11) సంవత్సరవారీ రుసుము విధింపబడిన పక్షమున లైసెన్సు అమలులో నుండునంతవరకు పంచాయతీకి ముందుగా చెల్లింప బడవలెను అట్టి రుసుము చెల్లించుటకు తప్పిపోయిన పక్షమున లైసెన్సు రద్దుచేయబడ తగియుండవలెను

5 పంచాయతీ స్వాధీనమునందుండు పబ్లిక్ రోడ్డులో లేక పంచాయతీ అధికారము క్రిందనుండు ఏ ఇతర పబ్లిక్ స్థలములోనైన తాత్కాలికముగా పందిళ్ళను, ఇతర నిర్మాణములను వేయుటకు కార్యనిర్వాహక అధికారియుక్తమని తలంచు షరతులకును నిర్బంధము లకును లోబడి సదరు అధికారి ఒక లైసెన్సు జారీచేయవచ్చును.

6 కార్యనిర్వాహక అధికారి, పంచాయతీ అనుమతితో పంచాయతీ వశమందు రోడ్డుపార్శ్వములను పంచాయతీ నిర్ణయించ గల షరతులమీదను, ఒడంబడికలమీదను, అట్టి కాలపరిమితి వరకునూ అద్దెకిచ్చుటను అధికారము కలిగియుండవలెను

7 ఆయా సందర్భమునకు తగినట్లు ముందుకు వచ్చియుండు భాగము, నిర్మాణము లేక ఆక్రమణ ఆరోగ్యమునకు బహుశః భంగకరముగానుండు పక్షమున లేక జనసామాన్యమునకు అసౌ కర్యము కలిగించు పక్షమున లేక ఆ రోడ్డును అట్లు ఉపయోగించుటకు వస్తుతః ఇతర విధముగా ఆటంకము కలుగుపక్షమున 4 వ విధి క్రింద ఒక లైసెన్సుగాని 6 వ విధి క్రింద గుత్తగాని జారీచేయబడకూడదు.

8 ఏ పంచాయతీగాని లేక పంచాయతీల ఏ తరగతిగాని 4 వ, 6 వ విధుల క్రింద అధికారములను చెలాయించుటను ప్రభుత్వము

వారు ప్రకటనద్వారా సంకుచితపరచవచ్చును మరియు వారు యుక్తమని తలంచగల పై తనిఖీక్రింద ఉంచవచ్చును

9 4 వ 6 వ విధులక్రింద ఏకాల పరిమితి కొరకు లైసెన్సు లేక గుత్త జారీ చేయబడినదో అట్టి ఏ కాలపరిమితియైనను గడిచి పోయినమీదట కార్యనిర్వాహక అధికారి నోటీసు లేకుండగనే 4 వ విధి లేక 5 వ విధిక్రింద ఏర్పరుపబడిన ముందుకు పొడుచుకొనివచ్చి యుండు ఏభాగమునైన లేక వేయబడిన ఏ నిర్మాణమునైన తొలగించునట్లు చేయవచ్చును అట్లు చేయుటకైన ఖర్చు లైసెన్సు ఎవరికి జారీచేయబడినదో ఆ మనిషివద్దనుండి రాబట్టుకొనవలెను.

10 (1) కార్యనిర్వాహక అధికారియొక్క లేక కార్యనిర్వాహక అధికారిచే అంగీకరింపబడిన ఏ ఇతర మనిషియొక్కయైన వ్రాతమూలకమగు అంగీకారము లేకుండా ఏదైన స్యూయరు లేక మురుగు కాలువమీద లేక స్యూయరు లేక మురుగు కాలువయొక్క ఏభాగము మీదనైన లేక రోడ్డును చిమ్మగా లభించిన కుప్ప లేక ఇతర చెత్త చెదారమువలన మూయబడిన, ఎత్తుచేయబడిన లేక పూర్తిగానో కొంతవరకో చదునుచేయబడిన ఏ భూమిమీదనైన ఎట్టి కట్టడమునుగాని నిర్మింపబడకూడదు.

(2) సదరు కార్యనిర్వాహక అధికారి లేక మనిషి నోటీసు మూలముగా అట్టి అంగీకారములేకుండ లేక అట్టి అంగీకారము యొక్క షరతులకు వ్యతిరేకముగా లేక అసంగతముగా ఒక కట్టడమును నిర్మించిన ఏ మనిషినైన దానిని పడగొట్టునట్లు కోరవచ్చును.

11 కార్యనిర్వాహక అధికారి, నోటీసుద్వారా పంచాయతీకి చెందిన ఒక పబ్లిక్ రోడ్డుకు ప్రక్కననున్న లేక ఇతర భూమి లేక సిటిపనరుకు ప్రక్కననున్న ఏ భూమియొక్కయైన ఖామందును లేక అనుభవదారును, నాగజెముడు, పాటిల్, లాంటానా లేక ఇతర ఉపద్రవకరమైన మొక్కలు అట్టి ఆస్తిమీద ఆక్రమించియుండిన పక్షమున అట్టి భూమిని అట్టి ఆస్తికి అది వ్యాపించియుండు నంతవరకు తీసివేయునట్లు కోరవచ్చును

12 (1) కార్యనిర్వాహక అధికారియొక్క అనుమతిని ముందుగాపొంది ఆయన విధించగల షరతులకు లోబడి నడచుకొనిననే తప్ప ఏ మనిషియైనను పంచాయతీకి చెందిన ఏ పబ్లిక్ రోడ్డులో నైన గోతిని త్రవ్వకూడదు లేక ఎట్టి ఆటంకమునైన కలిగించ కూడదు

(2) అట్టి అనుమతిని ఈయబడినప్పుడు, ఆ మనిషి తన స్వంత ఖర్చుతో అట్టి గోయి లేక ఆటంకము నింపివేయునంతవరకు లేక తొలగింపబడునంతవరకు అట్టిగోతికి లేక ఆటంకము చుట్టు బాగుగా కంచెవేయించి ఆవరణ యేర్పరచవలెను, మరియు రాత్రు లందు అట్టి గోతికి లేక ఆవరణకు చాలినన్ని దీపములను ఏర్పాటు చేయవలెను

(3) ఏమనిషియైనను ఈవిధియొక్క నిబంధనలను ఉల్లం ఘించు పక్షమున, కార్యనిర్వాహక అధికారి ఆయా సందర్భమునకు తగినట్లు సదరు గోతిని పూడ్చివేయవలెను లేక ఆటంకమును తొల గించవలెను లేక గోతికి లేక ఆటంకమునకు దీపములు ఏర్పాటు చేయవలెను మరియు అట్లుచేయుటకై ఖర్చును ఆ మనిషివద్దనుండి రాబట్టుకొనవచ్చును

13 (1) కార్యనిర్వాహక అధికారి పంచాయతీకి చెందిన ఏ పబ్లికు రోడ్డు లేక ఇతర ఆస్తిమీదనైన, ఆయన విధించగల షర తుల ననుసరించి ఏ చెట్టునైన నాటుటకు ఒక మనిషికి అనుమతి నిచ్చుటకు అధికారము కలిగియుండవలెను

(2) కార్యనిర్వాహక అధికారి విదించగల షరతులకు లోబడి ఆక్టుయొక్క 79 (f) విభాగములో చెప్పబడిన ఏ చెట్టు నైన నరకుటకు, తొలగించుటకు, నాశనముచేయుటకు, కొమ్మలను కొట్టుటకు లేక బెరడును తీయుటకు లేక ఆకులను కోయుటకు లేక ఇతర విధముగా దానికి నష్టము కలిగించుటకు ఒక మనిషికి అనుమతి నిచ్చుటకు కార్యనిర్వాహక అధికారి అధికారము కలిగియుండవలెను.

14 (1) ఏ మనిషియైనను పంచాయతీయొక్క అనుమతిని ముందుగా పొందక ఏదైన ప్రజోపయోగముకొరకు ప్రత్యేకించి

ఉంచబడిన మరియు పంచాయతీ వశమందుండు లేక దానికి చెందిన ఏ భూమినైనను ఆక్రమించుపక్షమున, అట్టి ఆక్రమణ సందర్భములో అపరాధముగా పంచాయతీ కోరగల మొత్తమును ఆయన చెల్లించుటకు బద్ధుడై యుండవలెను.

(2) కార్యనిర్వాహక అధికారి నోటీసుద్వారా (1) ఉపవిధిక్రింద అపరాధము విధించబడిన లేక విధింపబడగల ఏ మనిషినైన అట్టి భూమిని ఖాళీచేయునట్లును, ఏదైన కట్టడము లేక ఇతర నిర్మాణమును లేక దానిమీద ఉంచబడిన దేనినైన తొలగించునట్లు కోరవచ్చును, లేక

(3) దేని నిమిత్తము (1) వ ఉపవిధిక్రింద అపరాధమును చెల్లించుటకు ఏమనిషియైన బాధ్యుడై యుండునో, అట్టి ఏ భూమినైన తన అనుభవములోగల ఏ మనిషిగాని పంచాయతీయొక్క ఆస్తికి ఎట్టి నష్టముగాని కలుగజేసినయెడల అతనికి విధించగల లేక అతని నుండి రాబట్టుకొనబడు ఏ అపరాధమునకైనను అదనముగా మరియు దానితో నిమిత్తములేకుండా అట్టి నష్టముకొరకు పంచాయతీకి పరిహారము చెల్లించుటకు బాధ్యుడై యుండవలెను.

(4) ఈ విధిక్రింద ఏమనిషినుండియైన రావలసిన నష్టపరిహారము మరియు అపరాధము బిల్లుమూలముగా కోరబడి పంచాయతీయొక్క ఆదాయ వ్యయములకు సంబంధించిన విధుల ప్రకారము చిల్లర బాకీలవలె రాబట్టుకొనబడవలెను

## మార్కెట్లు.

సె. 80 (1) పంచాయతీ పబ్లిక్ మార్కెటుగా ఉపయోగించుటకు స్థలములకు యేర్పాటుచేయవచ్చును మరిన్ని ఇన్ స్పెక్టరుయొక్క అనుమతితో అట్టి యే మార్కెటుగాని లేదా అందలి ఏ భాగమును మూసివేయవచ్చును

(2) నిర్ణయింపబడగల విధులకులోబడి పంచాయతీ యేదేని పబ్లిక్ మార్కెటులో ఆ విషయములో గరిష్ఠ రేట్లు ఏవైన నిర్ణయింపబడియుండినయెడల వాటికిమించని పంచాయతీకి యుక్తముగా

తోచగల రేట్ల ప్రకారము ఈ క్రింది రుసుములలో యేదైన ఒకదానిని యెక్కువవాటిని విధించవచ్చును —

(a) అట్టి మార్కెట్లను ఉపయోగించుటకు లేదా వానిలో సరకులను విక్రయమునకు ప్రదర్శించు హక్కుకొరకు రుసుములు,

(b) అట్టి మార్కెటులో అంగళ్ళను, దుకాణములను, దొడ్లను లేదా స్టాండులను ఉపయోగించుటకు రుసుములు,

(c) అట్టి మార్కెట్టులో విక్రయమునకుగాను యెట్టి సరకులనైన తీసికొనివచ్చు (1939 వ సం॥పు మోటారుబండ్ల ఆక్టులో నిర్వచింపబడినట్లుండు మోటారు బండ్లతో చేరి) బండ్లమీద లేదా మూటలుమోయు జంతువులమీద లేదా మనుష్యులమీద రుసుములు,

(d) అట్టి మార్కెట్టులోనికి విక్రయమునకుగాను తీసుకొని రాబడునట్టిగాని విక్రయింపబడునట్టిగాని జంతువులమీద రుసుములు,

(e) అట్టి మార్కెట్టులో తమ వృత్తిని జరుపుకొను బ్రోకర్ల (దళారీల) మీద, కమీషను యేజంట్లమీద, తూనిక తూచే వారిమీద కొలత కొలిచే వారిమీద లైసెన్సు రుసుములు

సంపాదకుని సూచిక

జిల్లా మార్కెట్టుగా విభజింపబడిన పబ్లికు మార్కెట్టులో పంచాయతీ మార్కెటు రుసుములు విధింప వీలుకాదు జిల్లాబోర్డు మాత్రమే యీపనిచేయ గలదు మార్కెట్టుయొక్క రాబడిలో కొంత వంతును జిల్లాబోర్డునుండి రాబట్టుకొను హక్కును సంపాదించ నవకాశమున్నది పంచాయతీ తనద్రవ్యము ఖర్చుచేసి, మార్కెట్టుకు పోవురోడ్లను మంచి స్థితిలోనుంచి, మార్కెట్టు ప్రదేశముల పరిశుభ్రతను పంచాయతీ కాపాడినయెడల అట్టి హక్కును కోరుట సమంజసముగా నుండును

ఈ హక్కును పూర్తిగా సరియైన కారణములచేత బలపరుచుచు ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషనుద్వారా ప్రభుత్వమునకు నివేదించవచ్చును

సమర్థతగల బాగుగా నడుపబడుచున్న పంచాయతీ పబ్లికు మార్కెట్టును, జిల్లాబోర్డుకంటె యెక్కువ లాభదాయకముగాను మపయోగకరముగాను స్వాభావసిద్ధముగా జరపించగలదు అందుచేత పంచాయతీ, జిల్లాబోర్డుకు గత అయిదు సంవత్సరముల రాబడియొక్క సగటు ప్రకారము మార్కెట్టు రాబడి చెల్లించగల షరతుపై తన ప్రదేశములోని జిల్లాబోర్డు మార్కెట్టును కవులుకు తీసుకొనుట మిక్కిలి సముచితమయిన యేర్పాటు

## ప్రయివేటు మార్కెట్టుకు లైసెన్సు

సెక్షను 81

(1) పంచాయతీనుండి లైసెన్సు పొందకుండ యే వ్యక్తియు క్రొత్త ప్రయివేటు మార్కెట్టును స్థాపించరాదు, లేక ఇదివరకున్న ప్రయివేటు మార్కెట్టును నడుపరాదు

(2) ఏ ప్రదేశమునకు అట్టి లైసెన్సు కోరబడునో, ఆ ప్రదేశముయొక్క భాగమందు, ఆ ప్రదేశమును మార్కెట్టుగా నుపయోగించు కాలమునాటికిగాని లేక ఏ సంవత్సరమునకు లైసెన్సు తిరిగి పొందవలసియున్నదో ఆ సంవత్సర ప్రారంభమునకు 30 దినములకు లోపల కాకుండ 90 దినములకు మించకుండ లైసెన్సుకు దరఖాస్తు పంపవలెను

(3) పర్యవేక్షణకు, తనిఖీకి సంబంధించినట్టి రెగ్యులేషనులకు (నిబంధనలకు) పారిశుద్ధ్యము, మురుగునీటి పారుదల, నీటి వసతి, బాటలు, మార్గములయొక్క వెడల్పు, వుపయోగింపబడు బరువులు, కొలతలు, వీటికి సంబంధించిన షరతులకు కట్టుబడిచేసి మరియు పంచాయతీకి యుచితమని తోచినట్టి మార్కెట్టులోని అద్దెలు రుసుములు చెల్లించుట గుర్తించి షరతులపైన పంచాయతీ ఇదివరకే చట్టబద్ధముగా స్థాపింపబడిన ప్రయివేటు మార్కెట్లకు లైసెన్సు తప్పక నీయవలెను మరియు క్రొత్తగా స్థాపింపబడనున్న ప్రయివేటు మార్కెట్లకు లైసెన్సు నీయవచ్చును, లేదా వ్రాత మూలకమయిన కారణములచేత పంచాయతీ ఏదయిన క్రొత్త ప్రయివేటు మార్కెట్టుకు లైసెన్సు నిరాకరించవచ్చును పంచాయతీ ఎప్పుడయిన లైసెన్సులోని షరతుల యుల్లంఘనమునకు ఈ సెక్షను క్రింద యీయబడిన లైసెన్సును సస్పెండు చేయవచ్చును లేదా రద్దు చేయవచ్చును

(4) ఈ సెక్షను క్రింద ఒక లైసెన్సు మంజూరుచేసినపుడు గాని, తిరస్కరించినపుడుగాని, సస్పెండు చేసినపుడుగాని, రద్దుచేసినపుడుగాని, లేక సవరణ చేసినపుడుగాని, అట్టి మంజూరు తిరస్కరణ, సస్పెన్షను, రద్దు లేక మార్పు గురించిన నోటీసును, యింగ్లీషు

లోను, మరియు ఆ ప్రదేశముయొక్క భాషలో నొక దానిలో, యే ప్రదేశమునకు యీ లైసెన్సు కోరబడినదో, లేక పొందబడినదో, ఆ ప్రదేశమునకు ప్రవేశ మార్గమునగాని, దగ్గరగాగాని, ముఖ్య ప్రదేశములో పంచాయతీ అంటింపించవలెను

(5) యీ సెక్షను క్రింద జారీచేయబడిన ప్రతి లైసెన్సు ఆ సంవత్సరాంతమున అంతమగును.

(6) (3) వ సబ్ సెక్షను క్రింద పంచాయతీ యిచ్చిన యుత్తరువువల్ల ఏ వ్యక్తి అయిన నష్టపడిన యెడల అతను ఇన్‌స్పెక్టరుకు అట్టి యుత్తరువుపై అప్పీలు చేసుకొనవచ్చును ఇన్‌స్పెక్టరుకు వుచితమనితోచిన యెడల, అప్పీలు పరిష్కార మగువరకు ఆ యుత్తరువు అమలు కాకుండ నిలుపు చేయవచ్చును.

## లైసెన్సుకు రుసుము

సెక్షను 82

సె 81 వ సెక్షనుక్రింద ఒకి లైసెన్సు యివ్వబడి నప్పుడు, 80 వ సెక్షనుయొక్క (2) వ సబుసెక్షనులో వివరింపబడిన విధాన ము.గ రుసుములునేదైన విధింపబడుటకు అనుమతించిన యెడల క్రిందటి సంవత్సరము ఆమార్కెట్టునుండివచ్చిన మొత్తము ఆదాయములో నూటికి 15 వంతుకు మించకుండ, ఆలైసెన్సుకు పంచాయతీ లైసెన్సుకు రుసుము వసూలు చేయవలెను

సంపాదకుని సూచిక —

ఒక ప్రయివేటు మార్కెట్టుయొక్క లైసెన్సునుసస్పెండు లేక రద్దు చేయుట లేక లైసెన్సులోని షరతులేవైన సవరణచేయుటకు ముందుగా, పంచాయతీ ఆ లైసెన్సు దారుకు యీ విషయములో నోటీసుయిచ్చి, అట్టిచర్య ఏల తీసుకొనరాదో కారణము మాపమని యతనికి అవకాశమిచ్చి, అతని సముజాయిషీ విచారించి, తరువాత యుత్తరవు జారీచేయుట మిక్కిలి యుచితము ఆ యుత్తరువులకు సంబంధించి తీర్మానములో, లైసెన్సుదారుకు పూర్తిగా తెలియునట్లు, ఏకారణములపై నాయుత్తరువులు జారీచేయబడుచున్నవో వాటిని తగినంత వివరముగాను, నిర్దిష్టముగాను, పొందుపరచవలెను. చట్టములో నీ పద్ధతి నిర్ణయింప బడకపోయినప్పటికి, యిట్లుచేయక పోవుట స్వాభావసిద్ధ న్యాయ నియమముల విరుద్ధముగా నుండును గనుక కోర్టులు ఇట్లు చేయక పోవుటను అంగీకరించవు

"ప్రయివేటు మార్కెట్టుయొక్క రాబడినుండి నిర్వహింపవలసిన సాధారణ (సాదరు) ఖర్చుల విషయమై, జి ఒ నెం 520 ఎల్ ఎ తేది 24-3-1951 కు అనుబంధముగానున్న (XXIV) వ ప్రకటనలోని విధి క్రమముకాలేదు ఎందుచేతననగా, ప్రథమములోనున్న యాక్టుయొక్క 81వ సెక్షను క్రింద ఆవిధి జారీచేయబడెను సదరు 81 వ సెక్షనుకు బదులుగా, పైనివ్వబడిన 81 వ సెక్షను, ఆంధ్రయాక్టు XXII ఆఫ్ 1953 చే మార్చబడినది

## ఆక్టుయొక్క 112 (2) (XII) సెక్షను క్రింద జారీ చేయబడిన విధులు

(జి ఒ నెం. 1547, లోకలు అడ్మినిస్ట్రేషను తేదీ 6-8-1951)

## వి ధు లు

ప్రయివేటు మార్కెట్లయొక్క లెక్కలు—పోషణ, ఆడిటు మరియు తనిఖీ

1 ప్రైవేటు మార్కెట్లయొక్క ఖామందులు, అనుభవదార్లు లేక గుత్తదార్లు అట్టి అంగళ్ళను ఉపయోగించుకొన్నందుకు ప్రతి దినముచేయు వసూళ్ళకు టిక్కెట్లను ఇయ్యవలెను. మరియు అప్పుడప్పుడు చేయు వసూళ్ళకు రసీదులను ఇయ్యవలెను

2 రసీదులు మరియు టిక్కెట్టు పుస్తకములను అనుబంధములో చెప్పబడిన 1 మరియు 2 వ నమూనాలలో ముద్రించవలెను.

3 టిక్కెట్టు పుస్తకములను విధింపబడు రుసుముయొక్క ప్రతి రేటునకు వేరువేరుగా ముద్రించవలెను

4 సదరు అంగళ్ళయొక్క ఖామందులు, అనుభవదార్లు లేక గుత్తదార్లు సదరు అంగళ్ళమూలమున వచ్చు జమయొక్క మరియు వాటిని పోషించుటకగు ఖర్చుయొక్క సత్యమైన మరియు సంపూర్ణమైన లెక్కలను వ్రాయవలెను పంచాయతీ కార్యనిర్వాహక అధికారి లేక ఇందు నిమిత్తము ఆయనచే అధికారమీయబడినట్టి ఇతర వ్యక్తి తనిఖీ, పరిశీలన లేక ఆడిటుకొరకు సదరు లెక్కలను కోరునప్పుడెల్లను వాటిని హాజరుపెట్టవలెను

5. వసూళ్ళయొక్కయు బట్వాడాలయొక్కయు రిజిష్టరు అనుబంధములో తెలుపబడిన 3, 4 వ నమూనాలలో నుంచవలెను పంచాయతి కార్యనిర్వాహక అధికారి లేక ఇందునిమిత్తము ఆయనచే

(పుట 482 చూడుము)

## అనుబంధము.

### 1 వ నమూనా
[2 వ విధిని చూడుడు.]

**ఎదురు ప్రతి**

... ... . ... . . . . . . అంగడి

.19 . . . . . . కి

. . రు గది/చావడి కి అద్దె

రూ అ. పై.

19 ...... న ముట్టినది

బిల్లు కలెక్టరు

**వెలుపలి ప్రతి**

శ్రీ. . . . . . గారినుండి రూ

మొత్తము . . ......అంగడిలోని నె . . రు గది/చావడి

కైగాను . . . 19 వ అద్దె క్రింద ముట్టినది.

రూ. అ. పై.

. . . . . . . . . న ముట్టినది.

బిలు కలెక్టరు.

### 2 వ నమూనా
[2 వ విధిని చూడుడు ]

**ఎదురు ప్రతి**

వరుస సంఖ్య

టికెట్టు.

... . . అంగడి.

దినము ఒకటికి

(ఇచ్చట రేటును నమూదుచేయుడు)

**వెలుపలి ప్రతి**

టికెట్టు

వరుస సంఖ్య

... . . . . ...అంగడి.

(ఇచ్చట రేటును నమూదు చెయుడు)

అధికారమియ్యబడిన వ్యక్తి రిజిష్టర్లను టిక్కెట్టు పుస్తకములను మరియు రసీదు పుస్తకములను ప్రతి నెలకు ఒకసారికి తక్కువకాకుండ పరిశీలన చేయవలెను మరియు అవసరమైనట్టి రిమార్కులను వ్రాయవలెను. లెక్కలు సరిగా నున్నవని కనుగొనినయెడల సదరు లెక్కలు ఆ విధముగా నున్నవని సదరు రిజిష్టర్లలో ఒక సర్టిఫికేటును వ్రాయవలెను

6. అంగళ్లకు సంబంధించి క్రిందటి సంవత్సరము (లేక లైసెన్సుకై ధరఖాస్తు పెట్టుకొను తేదీకి పండ్రెండు నెలల క్రితము వరకు అగు కాలపరిమితి) లోని జములను, ఖర్చులను చూపు వివరణను, అంగడిని తెరచియుంచుటకైన లైసెన్సును తిరిగి పొందుటకు పెట్టుకొను ధరఖాస్తుతోకూడ పంపవలెను పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి సదరు లైసెన్సను తిరిగి యిచ్చుటకు పూర్వము, పైన నిర్దేశింపబడిన వివరణను అంగళ్లయొక్క ఖామందు, అనుభవదారు లేక గుత్తదారుయొక్క పుస్తకములతో సరిచూడవలెను

యాక్టుయొక్క 112 (2) (XXXII) వ సెక్షను క్రింది విధులు
పబ్లిక్ మరియు ప్రయివేటు మార్కెట్లు సందర్భములో
పంచాయతీయొక్క అధికారములు

(జి ఒ నెం 520, లోకల్ అడ్మినిస్ట్రేషన్
తేది 24-3-1951)

విధులు

ఏదైన పబ్లికు లేక ప్రయివేటు మార్కెటు సందర్భములో, లేక దానిని ఉపయోగించుకొను వ్యక్తి సంబంధములో, పంచాయతీచే లేక వాని కార్యనిర్వాహక అధికారిచే చెలాయింపబడగల అధికారములు

1. ఒక పంచాయతీయొక్క కార్యనిర్వాహకాధికారి, ఏపబ్లికు మార్కెటులోనైన తత్కాలమందు అమలులోనున్న ఏ ఉపవిధులనైన ఉల్లంఘించినందుకు నేరస్థాపన చేయబడిన ఏ మనిషినైనను లేక అతని సేవకునైనను అట్టి మార్కెటునుండి వెడలగొట్టవచ్చును మరియు అట్టి మార్కెటులో ఏ వ్యాపారము లేక వర్తకమునైన అతడే స్వయముగా లేక అతని సేవకుడు లేక ఏజంట్లద్వారా అటుతరువాత

చేయుటనుండి అట్టి మనిషిని ఆటంకపెట్టవచ్చును లేక ఆ మార్కెటు లోని ఏ అంగడిని, కొట్టును, లేక ఇతర చోటును ఆక్రమించుకొనకుండ ఆటంకపెట్టవచ్చును. మరియు అట్టి ఏ అంగడి, కొట్టు లేక స్థలములోనైన అట్టి మనిషి కలిగియుండగల ఏ గుత్త లేక భూస్వామ్యమునైన నిర్ణయించవచ్చును

2 పంచాయతీ నోటీసు నిచ్చుటమూలముగా ఏ ప్రైవేటు మార్కెటుయొక్క ఖామందు, అనుభవదారు లేక కవులుదారునైన-

(a) అట్టి మార్కెటులోనికి ప్రవేశించుటకు రోడ్లు, ప్రవేశములు, దారులు, గేట్లు, మురుగు కాలువలు మురుగు నీటి గుంటలు నిర్మించునట్లు. పంచాయతీ యుక్తమని తలంచు రకమునకు చెందిన మరియు అట్టిస్థలములో, అట్టి సంఖ్యగల పాయిఖానాలను దానిలో ఏర్పాటు చేయునట్లు ,

(b) దానికి పూర్తిగా లేక అందలి ఏ భాగమునకైన పైకప్పు వేయునట్లు లేక గచ్చువేయునట్లు తళవరుసలోని ఏ భాగమునకైన, నీళ్లు యింకక ఊరకునట్లు వెంటనే శుభ్రపరచుటకు వీలుగా నుండునట్లును పంచాయతీవారి అభిప్రాయములో అనుకూలమైన పదార్థముతో గచ్చువేయునట్లు ,

(c) గాలి వెలుతురు సరిగా ప్రసరించునట్లు చేసి నీటి సరఫరాను ఏర్పాటు చేయునట్లును,

(d) కొట్లమధ్య చాలినంత వెడల్పుగల త్రోవలను ఏర్పాటుచేయునట్లను పంచాయతీ ఆజ్ఞాపించగల విధముగా కొట్లలో, త్రోవలలో, అంగళ్ళలో, తలుపులలో లేక మార్కెటుయొక్క ఇతర భాగములలో మార్పులను చేయునట్లును,

(e) దానిని శుభ్రముగాను, క్రమమైన స్థితిలోనుంచి, దానిలోనున్న చెత్తచెదారము త్రోపుడు పదార్థమునంతయు తొలగించి పంచాయతీ ఆజ్ఞాపించగల స్థలమందును విధముగను వాటిని పరిష్కరించునట్లును,

(f) పంచాయతీ అవసరమని తలంచగల ఇతర పారిశుద్ధ్య ఏర్పాట్లను చేయునట్లును,

కోరవచ్చును

3 ఏ మనిషిగాని, పంచాయతీ ఆ విషయమున అతనికి నోటీసు నిచ్చిన తరువాత, సదరు నోటీసులో చెప్పియుండు కాలపరిమితిలోపల, విధముగా రెండవ విధిలో నిర్దేశింపబడిన పనులలో దేనినైన చేయుటకు తప్పిపోయిన పక్షమున, పంచాయతీ ఆ మనిషి యొక్క లైసెన్సును తాత్కాలికముగా నిలిపియుండవచ్చును లేక అట్టి పనులు పూర్తియగునంతవరకు ఒక లైసెన్సు నిచ్చుటకు నిరాకరించవచ్చును

4. అట్లు లైసెన్సు నిలిపియుంచబడిన కాలములో లేక లైసెన్సు పునరుద్ధరింపబడునంతవరకు ఏ మనిషియైనను ప్రయివేటు మార్కెటునుగాని తెరచియుంచుట చట్టసమ్మతముగా నుండకూడదు

5 ఏ ప్రైవేటు మార్కెటుమీదటనైన లేక అందలి ఏ అంగడి కొట్టు, పాక లేక ఇతర స్థలముమీదనైన అధికారము కలిగిన ఎట్టి భూమందు, అనుభవదారు, ఏజంటు లేక మేనేజరుగాని అది ఉపద్రవకరముగా నుండునట్లు దానిని ఉంచకూడదు. లేక ఉపద్రవకరముగానుండు దేనినైనను పంచాయతీ నిర్దేశించు ఒక స్థలమునకు వెంటనే తొలగింపబడునట్లు చేయుటకు తప్పిపోకూడదు

6 (1) 2 విధి క్రింద ఒక నోటీసు షరతుల ప్రకారము నడుచుకొనుటకు తప్పిపోవు లేక, క్రింది 1 వ షెడ్యూలుయొక్క మొదటి గడిలో నిర్దేశింపబడిన ఇతర విధులయొక్క ఏ నిబంధనలను గాని ఉల్లంఘించు ఏ మనిషియైన, సదరు షెడ్యూలుయొక్క రెండవ గడిలో ఆ విషయమున చెప్పబడిన మొత్తమువరకు వ్యాపించగల జుల్మానాతో శిక్షింపబడవలెను

(2) (1) వ ఉపవిధిలో చెప్పబడిన నేరములలో దేనికొఱకైనను నేరస్థాపన చేయబడిన తరువాత అట్టి నేరమును పదే పదే చేయుచుండు ఏ మనిషియైనను, అట్లు నేరస్థాపన చేయబడిన తేదీకి తరువాత అట్లు నేరమును చేయుచుండు ప్రతిదినమునకు క్రింది II వ షెడ్యూలుయొక్క రెండవగడిలో ఆ విషయము సందర్భములో చెప్పబడిన మొత్తమువఱకు వ్యాపించగల జుల్మానాతో శిక్షింపబడితగియుండవలెను

## I వ షెడ్యూలు

[6 (1) వ విధిని చూడుము]

### సాధారణ అపరాధములు

| నేరము (1) | విధింపబడగల అపరాధము. (2) |
|---|---|
| 2 వ విధి క్రింది నోటీసుయొక్క షరతుల ప్రకారము నడచుకొనుటకు తప్పిపోవుట | నూరు రూపాయలు |
| 4 వ విధిని ఉల్లంఘించుట | ఏబది రూపాయలు |
| 5 వ విధిని ఉల్లంఘించుట ... | ఇరువది రూపాయలు |

## II వ షెడ్యూలు

[6 (2) వ విధిని చూడుము]

### ఎడతెగక జరుగుచుండు ఉల్లంఘనలకు అపరాధములు

| నేరము (1) | విధింపబడగల దినసరి జుల్మానా (2) |
|---|---|
| 2 వ విధి క్రింద నోటీసుయొక్క షరతుల ప్రకారము నడచుకొనుటకు తప్పిపోవుట. | పది రూపాయలు |
| 4 వ విధియొక్క ఉల్లంఘన | ఇరువది రూపాయలు |
| 5 వ విధియొక్క ఉల్లంఘన | పది రూపాయలు |

## సెక్షను 112 (2) (xiii) క్రింద విధులు

### పంచాయతీ ప్రకటనలను ప్రచురించుట

(జి. ఓ. నెం. 520, ఎల్. ఎ. తేదీ 24-3-1951)

### విధులు 1 మరియు 2

(ఇవి ప్రకటనలకు సంబంధించిన విధులగుటచేత, వీటిని 3 వ సెక్షను క్రింద చేర్చడమయినది—11 వ పుట చూడుము)

3 ఏ స్థలమునుగాని, ఏ కార్యము కొరకైనను ఒక పంచాయతీ ప్రత్యేకించినపుడెల్ల, లేక ఏ స్థలములోనైన దేనినైన చేయుటను నిషేధించునపుడెల్లను కార్య నిర్వాహక అధికారి అట్టి స్థలము ఏ కార్యముకొరకు ప్రత్యేకింపబడినదో దానిని నిర్దేశించుచు లేక అట్టి స్థలములో నిషేధింపబడిన కార్యమును తెలుపుచు ఆ ప్రదేశము యొక్క ప్రధాన భాషలో అట్టి స్థలమునందు ఒక నోటీసు ప్రకటింపబడునట్లు చేయవలెను.

4. ఆక్టులో లేని దాని క్రింద చేయబడిన విధులలో ఇతర విధముగా స్పష్టముగా నిబంధింపబడిన విధముగా తప్ప, ఆక్టు క్రింద ప్రజా బాహుళ్యమునకు ప్రకటింపబడు ప్రతి నోటీసు —

(a) (i) పంచాయతీ ఆఫీసులోను,

(ii) గ్రామములోని చావడి లేక చావడీలు ఏదైన నున్న యెడల వాటిలో,

ప్రాముఖ్యమైన ఏదో ఒక స్థలమునందు దానియొక్క నకలొక దానిని అతికించుటమూలముగాను,

(b) గ్రామములో దండోరా వేయుటమూలముగాను, ప్రకటింపబడవలెను

సంపాదకుని సూచిక —

ఇందు రూపింపబడిన విధులు 3 వ సెక్షను క్రింద పొందుపరచిన విధులతో సహా, మార్కెట్ల విషయమైన ప్రకటనలకేకాక, యీ యాక్టుక్రింద జారీచేయబడు అన్ని ప్రకటనలను, మరియు నోటీసులకు వర్తించును

సె 83 ఏదేని స్థలము ఒక మార్కెట్టా కాదా అను విషయమున ఎట్టి వివాదముగాని బయలుదేరినయెడల పంచాయతీ దానినిగురించి గవర్నమెంటువారికి తెలుపవలెను మరియిన్ని వారి తీర్పు కడపటిదిగా నుండవలెను

సంపాదకుని సూచిక

ఈ సెక్షనుక్రింది ప్రభుత్వముయొక్క అధికారములు, ఇన్‌స్పెక్టరు జనరలు ఆఫ్ లోకలు అడ్మినిస్ట్రేషనుకు దత్తము చేయబడినవి (జి ఒ నెం 1118, లోకలు అడ్మినిస్ట్రేషను తేదీ 4-6-1951)

సె 84 ఏ మనిషిగాని—

(a) ఆయా సంగతికి తగినట్లు కార్యనిర్వాహక అధికారియొక్క లేదా లైసెన్సుపొందిన మనిషియొక్క లేదా ఆయనచే అధికారమియ్యబడిన ఎట్టి మనిషియొక్కయైన అనుమతిలేకుండా ఎట్టి పబ్లికు లేదా లైసెన్సుపొందిన ప్రైవేటు మార్కెట్లోగాని, లేదా

(b) లైసెన్సుపొందని ఎట్టి ఖాసిగీ మార్కెట్టులోగాని, ఎట్టి జంతువునుగాని వస్తువునుగాని విక్రయించకూడదు, లేదా విక్రయమునకుగాను బహిరంగపరచకూడదు

సె 85 కార్యనిర్వాహక అధికారి పంచాయతీయొక్క అనుమతితో పబ్లికు నోటీసుద్వారా ఏదేని పబ్లికు రోడ్డులో లేదా స్థలములో లేదా అందలి భాగములో లేదా దానిమీద ఎట్టి జంతువులనుగాని లేదా వస్తువులనుగాని విక్రయించుటకు లేదా విక్రయమునకుగాను బహిరంగపరచుటను పబ్లిక్ నోటీసు లేక లైసెన్సు ద్వారా నిషేధించవచ్చును లేదా క్రమపరచవచ్చును

సె 86 ఒక గ్రామములోనుండు పబ్లిక్ మరియు ఖానిగీ మార్కెట్లను జిల్లా మార్కెట్లుగాను, పంచాయితీ మార్కెట్లుగాను తరగతి వారి విభజనచేయుటకును, అట్టి ఏ మార్కెట్టుమీదనైన విచారణను ఏర్పాటుచేయుటకును, దానినుండి వచ్చిన ఆదాయమును డిస్ట్రిక్టుబోర్డుకును పంచాయతీకి మధ్య పంచిపెట్టుటకును లేదా దాని విషయమున ఆయా సంగతికి తగినట్లు పంచాయతీకి లేదా డిస్ట్రిక్టుబోర్డుకువంతు సైకమును చెల్లించుటను ఏర్పాటు చేయుటకును గవర్నమెంటువారు అధికారమును కలిగియుండవలెను

జిల్లా మార్కెట్లుగా తరగతివారి విభజన చేయబడిన మార్కెట్ల విషయములో పంచాయతీయును దాని కార్యనిర్వాహక అధికారియును, 80 నుండి 85 వరకు గల సెక్షనులచే వారికి యియ్యబడిన అధికారములలో దేనినిగాని చెలాయించకూడదు

సంపాదకుని సూచిక

ఈ సెక్షనుక్రింది ప్రభుత్వముయొక్క అధికారములు, ఇనస్పెక్టరు జనరలు ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషనుకు వత్తత చేయబడెనవి. (జి ఒ. నెం 1118, ఎల్. ఎ. తేది 4-6-1951)

## పబ్లికు నిలుపు స్థలములు

సె. 87. నిర్ణయింపబడగల విధులకు లోబడి పంచాయతీ—

(a) జనసామాన్యము దిగు స్థలములను, నిలిచే స్థలములను, బండ్ల స్థానములను (ఈ కడపటి మాటలలో జంతువులకైనట్టిన్ని మోటారుబండ్లతో చేరి ఏ విధమైన బండ్లకైనట్టిగాని స్థానములు చేరును) ఏర్పాటు చేయవచ్చును మరిన్ని వాటిని ఉపయోగించినందుకై రుసుములను విధింపవచ్చును మరిన్ని

(b) అట్టి ఏదేని స్థలము లేదా స్థానము ఏర్పాటు చేయబడియుండు నప్పుడు అదే కార్యము నిమిత్తము ఏమనిషియైన దానికి ఇన్‌స్పెక్టరుయొక్క పై అధికారమునకు లోబడి పంచాయతీ నిర్దేశించగలట్టి దూరములోపల ఏదేని పబ్లిక్ స్థలముగాని, ఏదేని పబ్లిక్ రోడ్డుయొక్క ప్రక్కలనుగాని వాడుకోకుండునట్లు నిషేధించవచ్చును

87 వ సెక్షను క్రింద విధులు బండ్లు నిలుచు తావులు,

(జి ఓ నెం 520 ఎల్ ఎ. తేదీ 24-3-1951)

(జి. ఓ నెం 140 ఎల్ ఎ తేదీ 31-1-1952)

### వి ధు లు

### పబ్లికు నిలుపు స్థలములు, బండ్లు నిలుపు స్థలములు మొదలైనవి.

1 (1) ఒక పంచాయతీ జనసామాన్యము నిలుచుటకైన లేక బండ్లు నిలుచుటకైన స్థలములను ఏర్పాటుచేయుట కుద్దేశించినపుడు, అది రీజనల్ ఇన్‌స్పెక్టరుకు దరఖాస్తును పెట్టుకొనవలెను సదరు దరఖాస్తులో—

(a) ఏ భూమిలో పంచాయతీ ఆగుటకైన స్థలము లేక బండ్లు నిలుచుటకైన స్థలము నేర్పాటుచేయుటకు ఉద్దేశించుచున్నదో అట్టి భూమియొక్క సర్వేనెంబరు వ్యాప్తి తరగతివారీ విభజన ఉండవలెను మరియు పరిసర ప్రాంతములలోని ముఖ్యమైన రోడ్లు ఇతర భూములనుబట్టి సదరు భూమియుండు స్థలములను తెలుపు పటమును దానితో పంపవలెను. మరియు

(b) రీజనల్ ఇన్‌స్పెక్టరు ప్రత్యేకముగా కోరగల ఏ ఇతర వివరములనైనను కలిగియుండవలెను

(2) అనుమతి నిచ్చుటకు పూర్వము మోటారు బండ్ల కొరకు ముఖ్యముగా లేక కొంతవరకు ఉద్దేశింపబడి స్టాండుల సందర్భములో సంబంధించిన రోడ్డు ట్రాఫిక్ బోర్డుయొక్క సలహాను రీజనల్ ఇన్‌స్పెక్టరు పొందవలెను మరియు దాని అభిప్రాయమును గౌరవించవలెను

2 (1) ఒక బాటను లేక బాటకు అంచును పబ్లిక్ నిలుచు స్థలముగా లేక బండ్లు స్థలముగా సాధారణముగా ప్రశిద్ధపరుపకూడదు

అయితే ప్రత్యేక సందర్భములలో రీజనల్ ఇన్‌స్పెక్టరు బాట ఎవరికి చెందినదో అట్టి అధికారవర్గముతో సంప్రదించి, అట్టిఏర్పాటు చేసిన తరువాత రోడ్డు నిమిత్తము చాలినంత స్థలము కలదని ఆయన అభిప్రాయ పడునెడల ఆగుటకైన స్థలమును లేక బండ్లు నిలుచు స్థలమును ఏర్పాటుచేయుటకు పంచాయతీకి అనుమతి నొసంగవచ్చును.

(2) ఎట్టి పంచాయితీ గాని పూర్తి గ్రామమును పబ్లికు స్థలముగా లేక బండ్లు నిలుచు స్థలముగా ప్రసిద్ధ పరచి దానికై రుసుమును వసూలు చేయకూడదు

3. ఒక పంచాయతీ జనముకొరకు ఒక స్థలమును లేక బండ్లు నిలుచు స్థలమును ఏర్పాటుచేసిన విషయములో, దానికి అర్ధ మైలు లోపలనుండు ఏ పబ్లికు స్థలమునైన లేక ఏ పబ్లికు రోడ్డుయొక్క ప్రక్కలనైన ఏ మనిషిగాని అదే కార్యము కొరకు ఉపయోగించుటను అది నిషేధించవచ్చును,

అయితే ఈ విధిలోనున్న దేదియు 1939 వ సం॥పు మోటారు బండ్ల ఆక్టుయొక్క అర్థములో ఒక స్టేజి కేరేజి (అంచెలమీద పోవు బండి) కానట్టి ఏ మోటారు బండికిగాని వర్తించకూడదు

వివరణము — ఒక పబ్లికు స్థలము లేక ఒక పబ్లికు రోడ్డు యొక్క ప్రక్కలందు ప్రజలను కొనిపోవు బండి ప్రయాణీకులు దిగుటకు లేక ఎక్కుటకు లేక వారి సామానులను ఎక్కించుటకు లేక

దించుటకు రెండు నిమిషములకు మించని కాలపరిమితివరకు ఆగు నెడల లేక సరకులను తీసికొనిపోవుటకు ఉపయోగింపబడు ఒక బండి సదరు స్థలములో లేక ప్రక్కలలో సరకులను ఎక్కించుటకు లేక దించుటకు కావలసిన కాలపరిమితివరకు మాత్రము ఆగు నెడల సదరు స్థలమును లేక ప్రక్కలను పబ్లికు నిలుపు స్థలము లేక బండ్లు నిలుచు స్థలముగా ఉపయోగించునట్లు భావించకూడదు

4 ఒక పంచాయతీ పబ్లికు నిలుపు స్థలము లేక బండ్లు నిలుచు స్థలమును ఏర్పాటుచేసినపుడు అది ఎచ్చట స్థాపించబడినది దాని ఉపయోగించుకొనుటకై చెల్లించవలసిన రుసుముయొక్క రేట్లను గురించిన సమాచారముతో సంబంధించిన గ్రామము మరియు జిల్లా గెజెటులో దానిని ప్రకటించవలెను పంచాయతీచే నిర్ణయింపబడిన రేట్లు, అందులో రుసుమును వసూలు చేయుటకు అధికార మీయ బడిన మనిషియొక్క పేరు, నిషేధింపబడిన దూరము తెలుపు ఒక నోటీసును అట్టి జనసామాన్యము ఆగు స్థలములో లేక బండ్లు నిలుచు స్థలములో ఒక ప్రాముఖ్యమైన స్థలమందు నోటీసు బోర్డులో అతి కించవలెను

5 జనసామాన్యము ఆగుటకైన స్థలమును లేక బండ్లు నిలచు స్థలము నుపయోగించుటకైన రుసుమును ఈ క్రింది రేట్లకు మించని రేట్లచొప్పున విధింపబడవలెను—

| | ఎట్టి సౌకర్యములుగాని ఏర్పాటు చేయబడ నపుడు ఒక దినము నకు గరిష్ఠ రేటు, | సౌకర్యములు ఏర్పాటు చేయ బడినయెడల ఒక దినమునకు గరిష్ఠ రేటు |
|---|---|---|
| | | రూ అ. పై |
| (1) మనుష్యులు లాగు ప్రతి బండికి | 6 పైసలు | 0 1 0 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| (2) ఒకటి లేక ఎక్కువ జంతువులచే లాగబడు ప్రతి మోటు బండికి లేక ఇతర బండికి | 9 పైసలు | | | 0 | 1 | 6 |
| (3) ప్రతి మోటారు బండికి | 0 | 3 | 0 | 0 | 4 | 0 |
| (4) ప్రతి గుఱ్ఱము కంచరగాడిద, ఎద్దు, ఆబోతు, ఆవు లేక గేదెకు | 6 పైసలు | | | 0 | 1 | 0 |

షరా —ఏర్పాటుచేయవలసిన వసతు లేవనగా ప్రయాణీకు లకు బండ్లు జంతువులు ఉండుటకు స్థలము, త్రాగుటకు నీటివసతి మొదలైనవి

6 ఈ విధులు, సెక్షను 87 క్లాజు (a) తో చేర్చి, నీటిక్రింద నొక బండి లేక జంతువు గురించి చెల్లించవలసిన రుసుము, అడిగిన వెంటనే చెల్లించనియెడల రుసుము వసూళ్లకుగాను నధికారమివ్వ బడిన వ్యక్తి, సదరు బండి లేక జంతువులపైనున్న సామానులు (ఇవి తగిలించబడినవైన వాహనసామానులై యుండవచ్చును) లేక బరు వులో, నెంతభాగము రావలసిన మొత్తమునకు సరిపోవునో నంత భాగము, ఆబండి లేక జంతువుమీదనే సామానులుగాని బరువుగాని లేని పక్షమున లేక వాటివిలువ రావలసిన మొత్తమునకు సరిపోని పక్షమున సదరు బండిని లేక జంతువునే జప్తు చేయవచ్చును

7 విధి 6 క్రింది జప్తు చేయబడిన ఆస్తి కార్యనిర్వాహకారికి గాని లేక ఆయనవల్ల సదరు ఆస్తి అందుకొని అమ్ముటకు నధికారమీయ బడిన వ్యక్తికి, జప్తుచేసిన ఇరువది నాలుగు గంటలలో పంపబడవలెను మరియు కార్యనిర్వాహకాధికారి తక్షణమే జప్తుకాబడిన ఆస్తికామం దుకు లేక ఆ కామందెవరని తెలియకపోయిన, లేక నతడు ఆ గ్రామ నివాసి కాని పక్షమున, సదరు ఆస్తి ఎవరియాధీనమునుండి జప్తుచేయ బడినదో వానికి లేక నట్టి వ్యక్తి కనుబడనియెడల బహిరంగ దండోరా మూలమున జప్తుకాబడిన ఆస్తి నోటీసు అందజేసిన లేక ప్రచు

రణకాబడిన తేదీనుండి, ఆదివారముకాకుండా, రెండు దినముల తరు వాత బహిరంగ వేలమున, నోటీసులో చెప్పబడిన స్థలమున విక్రయింప బడునని నోటీసు నివ్వవలెను

8 వేలము మొదలు పెట్టుటకు ముందు ఎప్పుడైన, రుసుమును జప్తు నిలుపుదల ఖర్చులకుగాను నాలుగు అణాలు, కార్యనిర్వాహ కాధి కారికిగాని లేక అమ్మకమునకై అధికారమివ్వబడిన వ్యక్తికిగాని నిచ్చివేయబడిన జప్తుకాబడిన ఆస్తి వెంటనే వాపసు చేయబడవలెను

9 అట్లు పైకము చెల్లించనిచో సదరు ఆస్తి అమ్మవచ్చును అమ్మక మువలన వచ్చిన పైకమును యీక్రిందివిషయములకు చెల్లించవలెను -

(i) రుసుము మొత్తమునకు,

(ii) రుసుము మొత్తమును మించని, కార్యనిర్వాహకాధికారి నిర్ణయించిన జుల్మానా (పెనాల్టీ), మరియు

(iii) జప్తు, నిలుపుదల అమ్మకములకైన ఖర్చుల నిమిత్తము ఎనిమిదణాలు

పై మొత్తములు చెల్లించగా మిగిలిన పైకము జప్తుచేయబడి ఆస్తి కామందునకు లేక జప్తు సమయమున సదరు ఆస్తి ఎవరి యాధీనమునయున్నదో ఆ వ్యక్తికి అందచేయ వలెను.

సంపాదకుని సూచిక —

నూతనముగా స్థాపితమయిన బందెల దొడ్లు నిలుచు తావునుగురించిన నోటీసుల ప్రకటన, 82 వ సెక్షనుక్రింద విధింపబడిన ప్రకటనల ప్రచురణ గురించిన విధుల నను సరించియే చేయబడవలెను

సె 88 (1) అట్లు చేయుటకు ఒక లైసెన్సును పంచాయతీ నుండి పొందియున్ననే తప్ప ఏ మనిషిగాని ఒక క్రొత్త ఖానిగీ బందెల స్థానమును స్థాపించకూడదు. లేదా ఖానిగీ బందెల స్థానమును తెరచి యుంచుటకు జరుపుచుండకూడదు. అట్టి లైసెన్సు ప్రతి సంవత్స రము పునరుద్ధరింపబడవలెను

(2) పంచాయతీ, పైవిచారణ, తనిఖీ, కన్సర్వెన్సీ (పారి శుద్ధ్యము), మరియు నిర్ణయింపబడగలట్టి యితర విషయములు—విటి విషయమున అది యుక్తమని తలచగల షరతులకులోబడి అదివరకే చట్ట సమ్మతముగా ఏర్పాటు చేయబడిన ఖానిగీబందెల స్థానముల విషయమున కోరబడిన లైసెన్సు నీయవలెను మరియు క్రొత్త ఖానిగీ బందెల స్థానముల విషయమున కోరబడిన లైసెన్సును దాని

యిష్టానుసారము యియ్యవచ్చును లేదా ఎట్టి క్రొత్తబండ్ల స్థానమున కైన అట్టి లైసెన్సును యిచ్చుటకు పంచాయితీ నిరాకరించవచ్చును.

(3) పంచాయతీ లైసెన్సుయొక్క షరతులను ఒక నిర్దిష్టము చేయబడిన తేదీ నుండి అమలులోనికి వచ్చునట్లు సవరించ వచ్చును

(4) పంచాయతీ, ఏ కాలమందుగాని (2) వ సబు సెక్షను ననుసరించి జారీచేయబడిన ఎట్టి లైసెన్సునుగాని దాని షరతులను ఉల్లంఘించినందుకుగాను తాత్కాలికముగా నిలిపియుంచవచ్చును లేదా రద్దుచేయవచ్చును

(5) పంచాయతీ ఈ సెక్షను ననుసరించి ప్రతిసారి ఒక లైసెన్సును యిచ్చుటకు లేదా పునరుద్ధరించుటకు రెండువందలరూపాయలను మించని ఒక రుసుమును విధించవచ్చును.

సంపాదకుని సూచిక —

ప్రయివేటు మార్కెట్ల యొక్క లైసెన్సుల సస్పెన్షను, రద్దు సందర్భములో '73 ఆక్టులోని సూచికలోనివచ్చుచున్న బండ్లుండుచు ప్రయివేటు తావులకు సంబంధించిన లైసెన్సుల సస్పెన్షను, లేక రద్దును ఉన్నాయించుము

## జంతువధశాలలు.

సె 89 పంచాయతీ, పబ్లిక్ పశువధ శాలలుగా ఉపయోగించుటకు స్థలములను ఏర్పాటుచేసి వాటిని ఉపయోగించుటకుగాను అద్దెలను, రుసుములను పుచ్చుకొనవచ్చును

సె 90, గవర్నమెంటు వారు—

(a) పబ్లిక్ పశువధశాలలు కానట్టి యితర స్థలములలో విధులలో వినహాయింపబడని అన్ని సమయములందును, వాటిలో నిర్దేశింపబడిన జంతువులను వధించుటను, కోయుటను లేదా తోలు ఒలుచుటను నిషేధించుటను గురించి లేదా క్రమపరచుటనుగురించి,

(b) జనసామాన్యమునకు విక్రయించు కార్యముల నిమిత్తము విధులలో నిర్దేశింపబడిన జంతువులను వధించుటకు మనుష్యులకు లైసెన్సు నిచ్చుటను గురించి, మరియు

(c) పశువధశాలలను, వాటిలోని మాంసమును తనిఖీ చేయుటను, అట్టి తనిఖీ నిమిత్తము పనికి నియమించబడిన ఉద్యోగులకు ప్రతిఫలమును చెల్లించుటను గురించి

విధులను చేయుటకు అధికారమును కలిగియుండవలెను

90 వ సెక్షను క్రింద విధులు

కమేలాల (జంతువధశాలల) యుపయోగము సక్రమ నిర్వహణకు విధులు

(జి. ఓ. నెం 677 ఎల్ ఎ తేదీ 2-4-1952)

విధులు

జంతువధకుగాను స్థలములను ఉపయోగించుటను నిషేధించుట లేక క్రమపరచుట, మరియు వధచేయువారికి లైసెన్సు నిచ్చుట.—

1. ఏ వ్యక్తిగాని, కార్య నిర్వాహకాధికారియొక్క లిఖిత పూర్వకమైన అనుమతి లేకుండ లేక అట్టి లిఖితపూర్వకమైన అనుమతికి అనుగుణముగ కాకుండ పంచాయతీచే బహిరంగవధ స్థలము ఏదైన ఏర్పాటు చేయబడియున్నచో అట్టి స్థలములోకాక గ్రామములో ఏ ఇతరచోటుగాని, ఏదైన పశువు, గుఱ్ఱము, గొర్రె మేక లేక పందిని వధించకూడదు, నరకకూడదు లేక చర్మము తీయకూడదు లేక చంపుటను, నరకుటను, లేక చర్మము తీయుటను అనుమతించకూడదు

అయితే కార్యనిర్వాహకాధికారి, ఉత్సవములు మరియు సంబరములు జరుగు సమయములందు లేక ప్రత్యేక సందర్భముగ నెంచి గ్రామమందు దేవాలయములు లేక వాటి ఆవరణలు కాక ఆయన యుక్తమనితలచు ఇతర స్థలములందు ఏ జంతువైనను వధింపబడుట కనుమతించవచ్చును

ఇంతేకాకుండ ఈ విధిలోనున్నదేదియు, విక్రయమునకు కాక స్వంత ఉపయోగమునకై జంతువుల వధను నిషేధించునట్లు గ్రహింపబడకూడదు

2 ఏ వ్యక్తిగాని కార్యనిర్వాహకోద్యోగినుండి లైసెన్సు పొందకుండ లేక ఆ లైసెన్సుకు అనుగుణముగ కాకుండ ఇతర విధ

ముగ ప్రజలకు విక్రయము నిమిత్తమై గ్రామములోపల ఏ పశువు, గుఱ్ఱము, మేక లేక పందినిగాని వధించకూడదు లేక వధించుటను అంగీకరించకూడదు

అయితే కార్యనిర్వాహకాధికారి దేవాలయములు లేక వాటి ఆవరణలుగాక ఇతర స్థలములందు ఏ వ్యక్తియైన మతకర్మ నిమిత్తమై ఏ జంతువునైనను, లైసెన్సు లేకుండను, ఎట్టి రుసుమునుగాని చెల్లింపకుండను, వధించుటకు లేక వధించుటను అంగీకరించుటకు అధికారము నొసంగవచ్చును

3 పై విధులయొక్క నిబంధనలు, కేంద్రప్రభుత్వమువారిచే లేక రాజ్యప్రభుత్వమువారిచే ఈ విధులలో నుదహరింపబడిన కార్యముల నిమిత్తము వుపయోగింపబడు స్థలములకు వర్తించకూడదు

4 ఒక పంచాయతీచే ఏర్పాటుచేయబడిన వధశాలయందు వధింపబడు జంతువులన్నియు వధింపబడు సమయమందు, వాటికి అంటువ్యాధులు లేవని అర్హతపొందిన వెటరినరీ అసిస్టెంటు సర్జను చే సర్టిఫై చేయబడునట్లు చూచుట పంచాయతీ కర్తవ్యమై యుండవలెను ఆయన వధశాలలను తనిఖీచేయు నిమిత్తము పంచాయతీచే పనికి నియమింపబడిన వ్యక్తిగాని, దాని విచారణాధికార భాగమునకు సమీపమునందుండు ప్రభుత్వ పశువైద్య సంస్థయందు నియమింపబడి ఆ కార్యము నిమిత్తమై ఆయన సేవ పొందబడిన వ్యక్తిగాని నుండవలెను అట్లు పనికి నియమింపబడిన వెటరినరీ అసిస్టెంటు సర్జను వధింపబడిన జంతువుల కళేబరములను పరీక్షించి, అవి మానవ భోజ్యయోగ్యములగుటను గూర్చి సర్టిఫై చేయుట ఆయన కర్తవ్యము. అర్హతగల వెటరినరి అసిస్టెంటు సర్జనును పై తెల్పిన కార్యము నిమిత్తము పనికి నియమించు పంచాయతీ పరాయిగ గ్రాంటు లేకుండ అట్లు నియమింపబడిన వెటరినరీ అసిస్టెంటు సర్జనుకు, ఇందు నిమిత్తము ప్రభుత్వమువారిచే అప్పుడప్పుడు నిర్ణయింపబడు రేటును మించని రేటు ప్రకారము ప్రతి ఫలమును చెల్లించవలెను.

అయితే అర్హతగల వెటరినరీ అసిస్టెంటు సర్జను అందుబాటుకాని యెడల లేక అది ఆయన సేవకు చెల్లింపుచేయలేనియెడల,

పంచాయతీయొక్క శానిటరీ ఇన్‌స్పెక్టరు, పంచాయతీచే ఏర్పాటు చేయబడిన వధశాలయందు వధింపబడు జంతువులన్నియు అంటు వ్యాధులు లేనివని సర్టిఫై చేయువలెను మరియు ఆయన వధింప బడిన జంతువుల కళేబరములను పరీక్షించి అవి మానవ భోజ్య యోగ్యము లగుటనుగూర్చికూడ సర్టిఫై చేయవలెను

5. ఈ విధులలోనున్న దేదియు, (1950 వ సం॥పు 32 వ మదరాసు ఆక్టు అగు) 1950 వ సం॥పు మదరాసు జంతువుల మరియు పక్షుల బలినిషేధ చట్టముయొక్క నిబంధనల అమలును బాధించు నదిగ అర్థము చేసికొనబడకూడదు

## పరిశ్రమలను, ఫ్యాక్టొరీలును

సె 91 కార్యనిర్వాహక అధికారిచే జారీచేయబడిన ఒక లైసెన్సు లేకుండను అట్టి లైసెన్సులో నిర్దేశింపబడిన షరతులను అను సరించి తప్ప బహుశః అసహ్యాకరముగా నుండునవి లేదా మనుష్య ప్రాణమునకు లేదా ఆరోగ్యమునకు లేదా ఆస్తికి అపాయకరముగ నుండగలదని గవర్నమెంటువారు అభిప్రాయపడగల కార్యములుగా నుండు ఈ విషయముగా చేయబడిన విధులలో నిర్దేశింపబడిన కార్య ములలో దేనికైనను గ్రామముయొక్క సరిహద్దుల లోపలనుండు ఏ స్థలమైన ఉపయోగింపబడకూడదని నిర్ణయింపబడిన అధికారియొక్క అంగీకారమును ముందుగా పొంది పంచాయతీ ప్రకటింపవచ్చును

అయితే అట్టి ఏ ప్రకటనగాని అది ప్రకటించబడిన తేదీనుండి అరువది దినములవరకు అమలులోనికి రాకూడదు

### 91 వ సెక్షను క్రింద విధులు

### లైసెన్సు పొందవలసిన (అపాయకరమయిన-అసహ్యాకర మయిన మరియు హానికరమయిన) వ్యాపారములకు లైసెన్సులు గురించిన విధులు

(జి ఒ. నెం 520, లోకలు అడ్మినిస్ట్రేషను, తేదీ 24-3-1951)

(జి ఓ నెం 895, లోకలు అడ్మినిస్ట్రేషను, తేదీ 3-5-1952)

(జి ఓ. నెం 1400, హెల్తు, తేదీ 20-8-1956)

## విధి

## పరిశ్రమలును, ఫ్యాక్టొరీలును

పంచాయతీ సంబంధించిన రీజినల్ ఇన్‌స్పెక్టరు అంగీకారము ముందుగా పొంది గ్రామముయొక్క సరిహద్దుల లోపలనుండు ఏ స్థలమునుగాని, ఆక్టుయొక్క 91 వ సెక్షను క్రింద లైసెన్సులేకుండా క్రింద తెలుపబడిన కార్యములలో దేనికొరకైనను ఉపయోగించకూడదని ప్రకటించవచ్చును —

(a) కర్పూరమును లేక ధాన్యమును ఉడకబెట్టుట

(a a) మురికిబట్టలను వుతుకుట, లేక మురికిబట్టలను వుతుకుటకు నిల్వచేయుట, లేక వుతికిన బట్టలను నిల్వచేయుట

(b) క్రొవ్వును లేక గంధకమును కరగించుట

(c) ప్రేవులు మొదలైన పదార్థములను, రక్తము, ఎముకలు, చర్మములు, చేపలు లేక తోళ్ళను నిల్వయుంచుట లేక ఇతర విధముగా పరిష్కారము చేయుట

(d) తోళ్ళను లేక చర్మములను టానుచేయుట.

(e) ఉన్ని లేక వెంట్రుకలను శుభ్రపరచుట లేక ఎండబెట్టుట.

(f) చేప చమురును తయారుచేయుట

(g) సబ్బును తయారుచేయుట

(h) సగ్గు బియ్యమును తయారుచేయుట లేక బట్టీపెట్టుట, కృత్రిమ ఎరువును తయారుచేయుట, పంచదారను తయారుచేయుట లేక శుభ్రపరచుట, కల్లు గీతగాండ్రు లేక చెట్ల అనుభవదారులు గృహపరిశ్రమగా కాక ఇతర విధముగా వారి సొంత ఆవరణలలో బెల్లమును పటికబెల్లమును, సిరపును తయారుచేయుట, బీడీలు లేక చుట్టలను తయారుచేయుట

(i) తుపాకిమందు లేక బాణసంచాలను తయారుచేయుట

(j) ఇటుకలను, పెంకులను, కుండలు మొదలగు వానిని, సున్నమును కాల్చుట.

(k) (ప్రభుత్వమువారి లేక అంగీకరింపబడిన అధికార వర్గముయొక్క తనిఖీక్రిందనున్న విద్యార్థుల హాస్టలును మినహాయించి) హోటలు, రెస్టారెంటు, భోజన గృహము, కాఫీ గృహము, బోర్డింగు గృహము లేక లాడ్జింగు గృహములు స్థాపించుట

(l) మానవాహారమును పిండిని లేక పిండితో చేయబడిన వస్తువులను లేక మిఠాయిని తయారుచేయుట.

(m) ఐసు లేక సోడా వగైరాలను తయారుచేయుట

(n) బీరును కాచుట (డినేచర్డ్ అయినను డినేచర్డ్ కాకపోయినను) మద్యసారమును కలిగిన సారాయిని లేక ఇతర స్పిరుటును బట్టీపెట్టి తయారు చేయుట.

(o) కలపను విక్రయించుట లేక విక్రయముకొరకు దానిని నిల్వయుంచుట

(p) ఎలుకలకు బహుశః ఆహారముగనుండు ధాన్యము, వేరుశెనగ, చింతపండు, మిరపకాయలు, బెల్లము, కాయధాన్యములును, పిండి, పొట్టు, గానుగపిండి లేక వ్యవసాయ ఫలసాయమును, పండ్లు, మరియు ఇతర ఫలవృక్షముల ఫలసాయముతో సహా, టోకుగా గాని చిల్లరగాగాని విక్రయించుట లేక టోకు లేక చిల్లర వ్యాపారమునకు లేక ప్రయివేటుగా లేక గృహోపయోగమునకు కాక యితర కార్యముల కొరకు నిల్వయుంచుట

(q) వద్దైన ప్రేలుడు లేక సులభముగా నిప్పంటుకొను పదార్థములను నిల్వయుంచుట

అయితే 1934 వ సం॥పు పెట్రోలియం ఆక్టుయొక్క నిబంధనలవలన లేక దానిక్రింద జారీచేయబడిన విధుల లేక ప్రకటనవలన ఈ ఆక్టుయొక్క అమలు ఏ పరిమాణములకు మితపరుపబడినదో వాటిని మించిన పరిమాణములలో పెట్రోలియం లేక దానికి సంబంధించిన పదార్థములను నిల్వయుంచుటకు ఎట్టి లైసెన్సునుగాని అవసరములేదు

(r) ప్రత్తిని టోకుగా లేక చిల్లరగా విక్రయించుట లేక టోకు లేక చిల్లర వ్యాపారమునకు లేక నూలుగా మార్చుటకు ప్రత్తిని నిల్వయుంచుట,

(s) ఉపద్రవకరమైన లేక అసహ్యమైన వాసనలు కలుగు దేనినైనను తయారుచేయుట,

(t) ప్రభుత్వమువారిచే అప్పుడప్పుడు ప్రకటనవలన మినహాయింపబడగల ఏదైన వంట చెరకు లేక అట్టి యంత్రములుకాని యంత్రములను ఏ పారిశ్రామిక కార్యము కొరకైనను ఉపయోగించుట;

అయితే నిల్వయుంచుట లేక ఉడకపెట్టుట ప్రయివేటు ఉపయోగమునకైనపుడు కలప వంట చెరకు ఇంటికి కప్పువేయు వస్తువులు, కసువు, గడ్డి, ఎండుగడ్డి, నార లేక బొగ్గు నిల్వయుంచు నిమిత్తము లేక వడ్లను ఉడకపెట్టు నిమిత్తము ఎట్టి లైసెన్సుగాని అవసరము లేదు.

ఇంతేగాకుండా ఒక లాడ్జింగు గృహముయొక్క స్వంతదారు దానిని 1939 వ సంఃపు మదరాసు జనసామాన్యముయొక్క ఆరోగ్యమును గూర్చిన ఆక్టులో నిర్వచింపబడిన విధముగా ఒక లాడ్జింగు గృహము నిమిత్తము ఎట్టి లైసెన్సుగాని అవసరములేదు

సె 92 పంచాయతీయొక్క అనుమతి లేకుండగను అట్టి అనుమతితో నిర్దేశింపబడిన షరతులకు అనుగుణముగాను తప్ప, ఏ మనిషిగాని—

(a) ఆవిరి శక్తి, నీటిశక్తిలేదా యితర యంత్ర సంబంధమైన శక్తి లేదా విద్యుచ్ఛక్తి వినియోగించుటకు ఉద్దేశింపబడిన ఎట్టి ఫ్యాక్టరీనిగాని, కర్మాగారమునుగాని, పనిచేయు స్థలమునుగాని నిర్మించకూడదు లేదా స్థాపించకూడదు లేదా

(b) ఈ విధులచే మినహాయింపబడిన యంత్రము లేదా తయారుచేయు ప్లాంటు కానట్టి పైన చెప్పబడినట్లు ఏ శక్తిచేనైన నడుపబడు ఎట్టి యంత్రమునైనను లేదా తయారుచేయు ప్లాంటునైనను ఎట్టి ఆచరణలోగాని స్థాపించకూడదు

92 సెక్షను క్రింద విధులు

(జి ఒ నెం 520 ఎల్ ఎ. తేదీ 24-3-1951)

వి ధి.

యంత్రములను స్థాపించుట—అనుమతి పొందుటనుండి మినహాయింపు

ఈ క్రిందివి ఆక్టుయొక్క 92 వ సెక్షన్ నిబంధనల నుండి మినహాయింప బడవలెను

(1) గృహోపయోగము, లేక వ్యక్తిగతమైన లేక సౌఖ్యము నిమిత్తము మాత్రమే ఉపయోగింపబడుట కుద్దేశింపబడిన ఎలక్ట్రిక్ సామానులు మరియు అట్టి సౌకర్యములకును పనులకును నుపయోగింప బడుట కుద్దేశింపబడిన ఎలక్ట్రిక్ యంత్రములును

(2) ఇంటిలో ఉపయోగించుకొనుటకు లేక స్వంతపనులకు సౌకర్యముల నిమిత్తము మాత్రముపయోగింపబడుట కుద్దేశింపబడిన ఎలక్ట్రిక్ కానట్టియు రెండుహార్సు ఫవరుకంటె మించని సామానుల మరియు రెండు హార్సుఫవర్ కు మించనట్టియు మరియు అదేవిధమైన పనులకు లేక సౌకర్యములకొరకు ఉపయోగించుట కుద్దేశింపబడిన యంత్రములును.

(3) యదార్థమైన వ్యవసాయపు పనుల కుపయోగించెడి మోటార్లతో కూడిన విద్యుత్తుస్థాపితములు

(4) వ్యవసాయపు పనుల సందర్భములో స్థాపించబడిన రెండు హార్సుపవర్ కు మించని విద్యుత్తు ఇతరములైన స్థాపితములు

(5) మామూలుగా ఎవరు ఉండనవసరములేనట్టి కదలని ట్రాన్సు ఫార్మరు స్టేషనులు

(6) మామూలుగా ఎవరు ఉండనవసరములేనట్టి కండెన్సరు స్టేషనులు

(7) మామూలుగా ఎవరు ఉండనవసరములేనట్టి రెక్టి ఫయిర్ స్టేషనులు.

సె. 93. (1) గవర్నమెంటు—

(a) 91 వ సెక్షను ననుసరించి లైసెన్సుల నిచ్చుటను లేక పునరుద్ధరించుటను నిషేధించుచు లేదా క్రమపరచుచు మరియు అట్టి లైసెన్సును చెల్లతగియుండు కాలమును గురించి,

(b) అట్టి లైసెన్సులకైన లేక వాటి పునరుద్ధరణకైన దరఖాస్తులు ఏ కాలములోపల పెట్టుకొనబడవలెనో దానిని గురించి, మరియు

(c) 92 వ సెక్షను క్రింద అనుమతుల నిచ్చుటను నిషేధించుచు లేక క్రమపరచుచు

విధులను చేయవచ్చును

(2) (1) వ సబు సెక్షను (c) క్లాజు ననుసరించి చేయబడిన విధులు. పారిశ్రామిక కార్యముల నిమిత్తము గ్రామములో నిర్దేశింపబడిన ప్రదేశములను ప్రత్యేకించుటకును, అట్టి ప్రదేశముల వెలుపలి యెట్టి ఫ్యాక్టరీ, కర్మాగారము పనిచేయు స్థలము లేదా ఆవరణ విషయములోనైన 92 వ సెక్షను ననుసరించి అనుమతిని నిరాకరించు నిమిత్తము ఏర్పాటు చేయుటకును మరిన్ని నిర్ణయింపబడిన అధికారవర్గము యొక్క అనుమతికి లోబడి, అట్టి ప్రదేశములకు వెలుపలనుండు ఏ స్థలమందైన అదివరకే ఏర్పాటుచేయబడిన ఎట్టి ఫ్యాక్టరీగాని, కర్మాగారముగాని, పనిచేయు స్థలమునుగాని ఏ ఆవరణలోనైన అదివరకే స్థాపించబడిన ఎట్టి యంత్రమునుగాని, అట్టి ప్రదేశములకు తీసికొనిపోవుటను గురించి ఏర్పాటు చేయుటకును కూడ పంచాయతీకి అధికారము నివ్వవచ్చును,

అయితే అట్టి ఏవిధిగాని కేంద్ర లేక రాజ్య ప్రభుత్వముయొక్కయు 1933 వ సం॥పు మదరాసు వ్యాపారమున కనువగు ఫలసాయముల మార్కెట్టుల ఆక్టు ననుసరించి స్థాపింపబడిన ఒక మార్కెట్టు కమిటీ యొక్క అనుభవములో లేక వారి విచారణ క్రిందనుండు ఏఆవరణలోగాని స్థాపించబడిన ఎట్టి ఫ్యాక్టరీగాని, కర్మాగారముగాని, పనిచేయు స్థలమును గాని లేక యంత్రమునుగాని తొలిగించుటను అనుమతించకూడదు.

(3) గవర్నమెంటువారు, సామాన్యముగాగాని లేక ఏ ప్రత్యేక సందర్భములో గాని 91 వ సెక్షను లేక 92 వ సెక్షను క్రింద తీసుకొనిన లేక తీసుకొనుటకు తప్పిపోయిన ఏ చర్య విషయ

ములోనైన వారు యుక్తమని తలచు ఉత్తరువును చేయవచ్చును లేక ఆజ్ఞల నివ్వవచ్చును.

91 మరియు 92 సెక్షనుల క్రింద లైసెన్సులకు, అనుమతులకు సంబంధించినట్టి 93 (2) వ సెక్షను క్రింద జారీచేయబడిన విధులు

(H & L A ,)

(జి. ఒ. నెం 203, హెచ్ అండ్ ఎల్. ఎ. తేదీ 3-2-1956)

మద్రాసు గ్రామ పంచాయతీల యాక్టు 1950 (మద్రాసు యాక్టు X ఆఫ్ 1950) యొక్క 93 వ సెక్షను యొక్క (1), (2) వ సబు సెక్షనులచే నీయబడిన అధికారములు నిర్వహించుచు, ఆంధ్ర గవర్నరు ఈ క్రింది విధులను చేయుచున్నారు

I. 91 వ సెక్షను క్రింద లైసెన్సు మంజూరు చేయుటకు దరఖాస్తు

1. గ్రామ సరిహద్దులలో నేప్రదేశము యొక్క యజమానిగాని, అందు నివసించు నతడుగాని, యాక్టుయొక్క 91 వ సెక్షను క్రింది విధులచే నిర్ణయింపబడిన ఏ పనికిగాని, అట్టి స్థలము నుపయోగించుటకొరకు, లైసెన్సుకొరకుగాని, లేక లైసెన్సును పునరుద్ధరించుటకుగాని, యాక్టుయొక్క 96 వ సెక్షనులో నిర్వచింపబడిన కాలపరిమితిలోగా పంచాయతీయొక్క ఎగ్జిక్యూటివు అధికారికి దరఖాస్తు పంపవలెను

2 ఎగ్జిక్యూటివు అధికారి అతనికి యుక్తమని తోచిన నిబంధనలలో, రెగ్యులేషనుల క్రింద తన యుత్తరువు మూలముగా అట్టి లైసెన్సు నీయవచ్చును లేదా నిరాకరింపవచ్చును నిరాకరించు విషయములో అట్టి నిరాకరణకు కారణముల నతడు వ్రాసి, ఆ వ్యక్తికిగాని, వ్యక్తులకుగాని తెలియజేయవలెను

3 అట్టి ప్రతి లైసెన్సును సంవత్సరాంతమున అంతమగును కాని ఎగ్జిక్యూటివు అధికారి, వ్రాత మూలకమయిన ప్రత్యేక కారణములచేత నా లైసెన్సు అంతకంటె శీఘ్రకాలములో అంతము

కావలెనని యోచించినయెడల, అట్టి ముందు తారీకుననే ఆ లైసెన్సు ఆఖరగును

II 92 వ సెక్షను క్రింద అనుమతికొరకు దరఖాస్తు—

4 ప్రతివ్యక్తియు, తాను (a) ఒక ఫ్యాక్టరీనిగ్గాని, వర్కుషాపుగాని లేక పనిచేయు స్థలముగాని నిర్మించి లేక స్థాపించి, అందులో ఆవిరి, నిరు, మిషనుల లేక విద్యుచ్ఛక్తిని యుపయోగింపదలచినపుడు, లేక (b) యే ప్రదేశములో నైన (ఇంటిలోనైన) మిషనులనుకాని, లేక వస్తువులను తయారుచేయు యంత్రములనుగాని, పై చెప్పబడిన యే శక్తిచే నడుపబడునదైన, ఈ విధులచే తప్పింపబడిన మిషనులు, లేక తయారుచేయు యంత్రములు తప్ప, స్థాపించదలచినపుడు, అట్టి నిర్మాణము స్థాపించుట లేక యంత్రస్థాపన ప్రారంభించుటకుపూర్వము వ్రాతమూలకముగ పంచాయతీకి అట్టి పనిచేయుటకు అనుమతికొరకు దరఖాస్తు చేయవలెను

5 4 వ విధిక్రింద దరఖాస్తుతో ఈక్రింద నుదహరింపబడిన విషయముల వివరములకూడ జతపరుపవలెను—

(i) ఫ్యాక్టరీ, వర్కుషాపు, పనిచేయు స్థలము లేక యిల్లు యొక్క ప్లానుయొక్క నకళ్ళు నాలుగు—ఒకటి జిల్లా ఆరోగ్యాధికారికి (డిస్ట్రిక్టు హెల్తు ఆఫీ రుకు) పంపుటకు, ఒకటి డైరెక్టరు ఆఫ్ టౌను ప్లానింగుకు పంపుటకు, ఒకటి పంచాయతీ ఆఫీసులో రికార్డుగా నుంచుటకు, మరియొకటి పంచాయతీ యుత్తరువులలో దరఖాస్తుదారునికి తిరిగి పంపుటకు ,

(ii) ఈ సందర్భములో చేయబడిన బైలాల ప్రకారము పంచాయతీ కోరిన శక్తికి, మిషనులకు, యంత్రములకు లేక యింటికి సంబంధించిన వివరములు ,

(iii) ఫ్యాక్టరీల యాక్టు 1948 మరియు ఆంధ్ర ఫ్యాక్టరీ రూల్సు 1950 అన్వయించిన విషయములలో, ఫ్యాక్టరీల యాక్టు 1948 విధించిన ప్రకారము ఫ్యాక్టరీల చీఫ్ ఇన్‌స్పెక్టరుచే ఆమోదింపబడినట్టి, ఫ్యాక్టరీ, వర్కుషాపు, పనిచేయు స్థలము (వర్కుప్లేసు) లేక ఇంటియొక్క ప్లానులు.

(6) (1) ఫ్యాక్టరీలయాక్టు, 1948, మరియు ఆంధ్ర ఫ్యాక్టరీలరూల్సు, 1950 అన్వయించని ఫ్యాక్టరీల విషయములో, ఫ్యాక్టరీనిగాని, వర్కు-షాపునుకాని, పనిచేయు స్థలముగాని, లేక యిల్లుగాని, నిర్మించుటకుగాని లేక పునర్నిర్మించుటకుగాని, లేదా క్రొత్తమిషనులను, లేక అదనపు మిషనులను స్థాపించుటకుగాని, లేక మిషనులను మార్చుటకుగాని ముందుగా, అట్టి ప్లానుల కన్నింటికి, తత్సంబంధమయిన ఫ్యాక్టరీ యినస్పెక్టరుయొక్క అనుమతిని, ఏగ్జిక్యూటివు అధికారి పొందవలెను ఫ్యాక్టరీ యినస్పెక్టరు తన అంగీకారము నిచ్చునపుడు ఈ క్రింది అంశములను గమనింపవలెను —

(i) గాలికి, వెలుతురుకు చాలినన్ని యేర్పాట్లు చేయబడిన వివరము

(ii) గదులు, తలుపులు క్షేమమునకు చాలినంతఎత్తు, కొలతలు కలిగియున్న వివరము,

(iii) అగ్ని ప్రమాదకాలములో ద్వారము లుపయోగమునకు సరిగానున్న వివరము

(2) ఫ్యాక్టరీలయాక్టు, 1948, మరియు ఆంధ్ర ఫ్యాక్టరీలరూల్సు, 1950, అన్వయించిన ఫ్యాక్టరీల విషయములో, ఛీఫ్ యిన్‌స్పెక్టరు ఆఫ్ ఫ్యాక్టరీలచే సంగీకరింపబడిన ప్లానులయొక్క, మరియు యే వుత్తరములోనట్టి యంగీకారము తెలుపబడెనో నాయుత్తరము ఆధారముపై, యెగ్జిక్యూటివ్ అధికారి, అనుమతికై దాఖలు చేయబడిన దరఖాస్తుపై చర్యతీసికొనవచ్చును

(3) దరఖాస్తు తన కార్యాలయములో అందిన ముప్పది దినములలోగా ఫ్యాక్టరీల యిన్‌స్పెక్టరు, (1) వ యుపవిధిలో సూచింపబడిన అనుమతిని యివ్వవలెను లేదా యిచ్చుటకు నిరాకరించవలెను.

7 దరఖాస్తు అందిన తేదీ తర్వాత సాధ్యమయినంత శీఘ్రకాలములో, అరువది దినములలోగా పంచాయతీ—

(a) అనుమతిని, నిరాటంకముగాగాని, లేక యుక్తమని తనకు తోచిన షరతులపైగాని, మంజూరు చేయవలెను, లేదా,

(b) అక్కడనున్న జనసమృద్ధి ఎక్కువగుటచేగాని, లేక దానివల్ల ప్రజల కనారోగ్యము (కలుషము) కలుగుననిగాని అభ్యంతరమున్నదని భావింపబడినయెడల నట్టి కట్టడమునకు స్థాపనకు లేక యంత్రస్థాపనకు అనుమతి నిరాకరింపవలెను

8 పై చెప్పబడిన 7 (a) విధి క్రింద అనుమతి యిచ్చుటకు ముందుగా, పంచాయతీ —

(a) (i) ఫ్యాక్టరీకి, వర్కుషాపునకు, పనిచేయు స్థలమునకు (వర్కుప్లేసునకు), లేక ఆవరణకు (యింటికి) నియమింపబడిన స్థలము (నివేశనము) ఆ పనికి అనుకూలతను, మరియు సరిపోవుటను గురించియు, (ii) మరియు కట్టడములయొక్క ఏర్పాటును, మరియు శిల్పమును గురించియు, డైరక్టరు ఆఫ్ టౌన్ప్లానింగుయొక్క అంగీకారము పొందవలెను,

(b) ఫ్యాక్టరీకొరకు, వర్కుప్లేసుకొరకు, లేక ఆవరణ కొరకు నిర్దేశింపబడిన ప్రదేశము, ప్రజారోగ్య దృష్టిద్వారా, దరఖాస్తులో వివరింపబడిన పనులకు అనుకూలమగునా కాదా యను విషయములో జిల్లా ఆరోగ్యఅధికారితో (జిల్లా హెల్తుఆఫీసరుతో) సంప్రదించి అతని అభిప్రాయమును తగినట్లు పరిగణింపవలెను

ఈ సందర్భములో తమకు జాబుచేరిన తేదీ లగాయతు నలుబది దినములలోగా డైరక్టరు ఆఫ్ టౌన్ప్లానింగు కాని, లేక జిల్లా ఆరోగ్యాధికారిగాని తమ అంగీకారమునుగాని, లేక అభిప్రాయమునుగాని తెలుపవలెను

9 పంచాయతీకి జిల్లా ఆరోగ్యాధికారితో ఆ స్థలముయొక్క అనుకూలతను గురించి భేదాభిప్రాయము కలిగినయెడల, ఆ విషయమును పంచాయతీ లోకలు అడ్మినిస్ట్రేషనుయొక్క యినస్పెక్టరు జనరలుకు తెలుపవలెను అతనపుడు డైరక్టరు ఆఫ్ పబ్లికు హెల్తుతో (ప్రజారోగ్యశాఖ డైరక్టరుతో) సమాలోచించి, యుత్తరువులు జారీచేయును ఇన్స్పెక్టరు జనరలుయొక్క అట్టి యుత్తరువు నిర్వివాదమగునది

10 యీ క్రింది సందర్భములలో అనుమతి యివ్వరాదు:—

(i) యిదివరకే, ఫ్యాక్టరీల ఇన్‌స్పెక్టరుగాని, లేక ఫ్యాక్టరీల ఛీఫ్ ఇనస్పెక్టరుగాని, ఎవరైనను, అభ్యంతరముచేసిన కట్టడములలో వుండిన ఫ్యాక్టరీలకు, లేక

(ii) అతనిచే ఫ్యాక్టరీయొక్క ప్లాను అంగీకరింప బడిన పుడు, లేక

(iii) ఫ్యాక్టరీల యాక్టు, 1948 లో విధించిన షరతుల ప్రకారము, వెలుతురు, గాలి ఉష్ణోగ్రతల విషయములలో ఫ్యాక్టరీని స్థాపించుటకు కావలసిన మేరకు సదుపాయములు లేని కారణముచే అనుకూలము కాని యిండ్లలో ఫ్యాక్టరీలకు, లేక

(iv) నివేశనస్థలము, కట్టడములయొక్క నిర్మాణము, పునర్నిర్మాణము, లేక వృద్ధి, మరియు అందులోని యంత్ర స్థాపనలు, డైరక్టరు ఆఫ్ టౌనుప్లానింగు అంగీకరించిన ప్లానుల ప్రకారము, లేనపుడు

11 ఈ సెక్షను క్రింద అనుమతి యివ్వబడినందున, యాక్టుయొక్క 112 వ సెక్షనుయొక్క సబు సెక్షను (2) క్రింది, (xxviii) క్లాజు క్రింద జారీచేయబడిన విధులు ఏవయినవున్న వాటిని, లేదా, ఆ పంచాయతీ పర్యవేక్షణ క్రింద నున్న ప్రదేశములో నేదైన కట్టడముల విధులు (బిల్డింగు రెగ్యులేషనులు) అమలులోనున్న యెడల వాటిని, అనుసరింపవలసిన అగత్యము లేదని భావింపరాదు

12. (i) ఆవిరిశక్తిగాని, నీటి శక్తిగాని, లేక యితర యంత్ర శక్తిగాని లేక విద్యుచ్ఛక్తిగాని యుపయోగింపబడు నేఫ్యాక్టరీ, వర్కుషాపు లేక వర్కుప్లేసు (పనిస్థలము) మూలమున నయిన, అందులో నుపయోగించు ఇంధనమువల్లగాని లేక దానివల్ల నుత్పత్తి అయ్యే శబ్దము, లేక వణకువల్లగాని, కలుషము, ప్రజలక్షేమమునకు అంతరాయము, కలిగినయెడల, అట్టి కలుషమును, అంతరాయమును, అందుకు నిర్దేశింపబడిన సకాలములోగా, తగ్గించుటకుగాను, పంచాయతీకి యుక్తమని తోచిన, ఆదేశముల నీయవచ్చును.

(ii) అట్టి ఆదేశముల ఆచరణలో బుద్ధిపూర్వకమయిన (ఉపేక్ష) నేరమున్న యెడలగాని, లేక అట్టి తగ్గింపునకు ఎట్టి అవకాశము లేనపుడుగాని, పంచాయతీ—

(a) ఆ ప్రత్యేక తరగతి ఇంధనముల యుపయోగము నిషేధింపవచ్చును, లేదా

(b) ఫ్యాక్టరీనిగాని, వర్కు-షాపునుగాని, పని స్థలమునుగాని రాత్రి 9-30 గంటలు లగాయతు పుదయం 5-30 గంటలు మధ్య పనిచేయుట నిషేధించి, శబ్దమును, వణకును తగ్గింపచేయవచ్చును

13 (1) ప్రతి I తరగతి పంచాయతీయును, డైరెక్టరు ఆఫ టౌను ప్లానింగు, మరియు డైరెక్టరు ఆఫ్ పబ్లికు హెల్తుయొక్క అనుమతితో, ఆ గ్రామములోని కొంత భాగమును పరిశ్రమల నిమిత్తము నిర్దేశించి కేటాయింపవలెను మరియు, II తరగతి పంచాయతీలు, తాము స్వయముగాగాని లేక తత్సంబంధమయిన రీజినలు ఇన్‌స్పెక్టరు ఆదేశించిన యెడలగాని నట్లుచేయవచ్చును

(2) (1) వ యుపవిధి క్రింద పరిశ్రమలకు క్షేత్రములు కేటాయించినపుడు, అట్టి క్షేత్రముల వెలుపల, ఒక ఫ్యాక్టరీని వర్కు-షాపును, లేక వర్కు ప్లేసును నిర్మించుటకుగాని, స్థాపించుటకుగాని, లేక యంత్రములకు, లేక తయారుచేయు యంత్రములను స్థాపించుటకుగాని (20 హెచ్ పి (H P) కి మించని విద్యుద్యంత్రములు తప్ప) అనుమతి నిరాకరించవలెను

అయితే ఫ్యాక్టరీల యాక్టు 1948 యొక్క (6) (1) (a) సెక్షను క్రింద నీయబడిన విధుల ననుసరించి స్థాపింపబడియున్న ఫ్యాక్టరీలకు యీ విధి వర్తించదు

14 ఈ పై విధులన్నియు, పదిమందికి తక్కువ కాని మనుష్యులను వినియోగించు, యితర శక్తి నుపయోగింపని ఫ్యాక్టరీలకు కూడ తదను గుణ్యముగ వర్తించును

సంపాదకుని సూచిక

సెక్షను 93 (3) క్రింది ప్రభుత్వము యొక్క అధికారములు లోకలు అడ్మినిస్ట్రేషనుయొక్క ఇన్‌స్పెక్టరు జనరలుకు దత్తత చేయబడినవి.

(జీ ఒ నెం 1118, లోకలు అడ్మినిస్ట్రేషను)
తేదీ 4-6-1951)

## 1888 వ సం॥పు జనవిహార స్థలములను గురించిన ఆక్టును వర్తింపజేయుట.

సె 94. 1888 వ సం॥పు జనవిహార స్థలమును గురించిన ఆక్టులో ఏదియున్నను దానితో నిమిత్తము లేకుండ, గవర్నమెంటు వారు ఆ యాక్టును ఎట్టి గ్రామమునకైనను లేదా అందలి భాగమునకైనను వ్యాప్తిజేసినప్పుడు—

(a) సినిమోటోగ్రాపు ప్రదర్శనములను జరుపుటకు కాకుండ ప్రత్యేకముగా యితర కార్యముల నిమిత్తము ఉపయోగింపబడు ఎట్టి స్థలము లేదా కట్టడము విషయములోనైన ఆ యాక్టు ననుసరించి లైసెన్సుకుగాను దరఖాస్తు ఏ అధికారికి పెట్టుకొనవలెనో మరిన్ని అట్టి లైసెన్సును ఏ అధికారి యియ్యవచ్చునో లేదా నిరాకరించవచ్చునో ఆ అధికారి కార్యనిర్వాహక అధికారిగా నుండవలెను. , మరిన్ని

(b) ఆ యాక్టు ననుసరించి ఒక లైసెన్సును యిచ్చు, నిరాకరించు, రద్దుచేయు లేక తాత్కాలికముగా నిలిపియుంచు కార్యనిర్వాహక అధికారియొక్క ఉత్తరువుమీద అప్పీలు పంచాయతీకి చేసుకొనవలెను

## 6 వ అధ్యాయము—సామాన్య విషయములు, నానావిధములైన విషయములు

## కట్టడములకు అంకెలు వేయుట.

సె 95. (1) ఈ యాక్టు వర్తించు ఏ ప్రదేశములోనైన, ఈ విషయముగా నిర్ణయింపబడిన అధికారి ఏ కట్టడముయొక్కయైన ప్రక్కలో లేక వెలుపలి తలుపుకు లేక ఆ ఆవరణలోనికి పోవు ప్రదేశమునందలి ఏదో ఒక స్థలమందు ఒక అంకె వేయబడునట్లు చేయవలెను

(2) ఎట్టి మనిషిగాని, చట్టసమ్మతమైన అధికారము లేకుండ, అట్టి ఏ అంకెను గాని, లేక 1948 లేక 1949 వ సం॥లో

ప్రయోజన ఎన్నికాధికారము ననుసరించి ఎన్నికదారుల పట్టీలను తయారుచేయు సందర్భములో అట్టి ఏ ప్రదేశమందైనను గల ఏ కట్టడమునకైన యియ్యబడిన ఏ సంఖ్యనుగాని నాశనముచేయకూడదు, తీసివేయకూడదు లేదా తుడిచివేయకూడదు

(3) (1) వ సబు సెక్షనుక్రింద ఒక అంకె వేయబడినపుడు ఆ కట్టడముయొక్క యజమాని ఆ అంకెను అలాగే ఉంచుటకును, అది తొలగింపబడినయెడల లేక తుడిచివేయబడినయెడల దాని స్థానమున మరల ఆ అంకెను వేయుటకును బద్ధుడుగానుండవలెను. ఆయన అట్లుచేయుటకు తప్పిపోయిన పక్షమున (1) వ సబు సెక్షనులో చెప్పబడిన అధికారి, ఆ అంకెను తిరిగివేయునట్లు, నోటీసు నిచ్చుట మూలముగ అతనిని కోరవచ్చును

కట్టడములకు అంకెలు వేయించుటకు అధికారిని నిర్ణయించుటకు, 95 వ సెక్షనుక్రింద విధులు

(జి ఓ. నెం. 520, లోకలు అడ్మినిస్ట్రేషను తేదీ 24-3-1951).

విధి

కట్టడములకు అంకెలను వేయుటకు అధికారి

ఆక్టుయొక్క 95 (1) వ సెక్షనుయొక్క కార్యముల నిమిత్తము నిర్ణయింపబడిన అధికారి—

(1) ఏ విస్తీర్ణమునకు ఒక పంచాయతీ ఏర్పాటు చేయబడెనో ఆ విస్తీర్ణము సందర్భములో సంబంధించిన పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారిగా నుండవలెను , మరియు

(ii) ఒక పంచాయతీ ఏ విస్తీర్ణముకొరకు ఇంకను ఏర్పాటుచేయబడలేదో అట్టి విస్తీర్ణములో విచారణాధికారమును కలిగిన డిప్యూటీ తహశీల్దారు లేక తహశీల్దారుగా నుండవలెను

లైసెన్సులు - అనుమతులు.

సె 96 (1) ఈ ఆక్టులో స్పష్టముగా యితర విధముగా నిబంధింపబడియున్నట్లు తప్ప లేదా ఈ యాక్టు ననుసరించి నిర్ణయింపబడగలట్లు తప్ప ఈ యాక్టు లేదా దీనిననుసరించి చేయబడిన ఎట్టి విధి ఉపవిధి లేదా రెగ్యులేషను ననుసరించిన ఎట్టి లైసెన్సునకైన లేదా

అనుమతికైన లేదా దాని పునరుద్ధరింపుకైన ప్రతి దరఖాస్తు లైసెన్సు లేదా అనుమతి కోరబడిన అతి శీఘ్రముగానుండు తేదీకి పూర్వము లేదా ఏ కాలపరిమితి, దరఖాస్తులో పేర్కొనబడిన సంవత్సరము లేదా అంతకు తక్కువ కాలపరిమితి, ప్రారంభమగుటకు పూర్వము ముప్పది దినములకు తక్కువకాకుండను, తొంబది దినములకు ఎక్కువ కాకుండను పెట్టుకొనబడవలెను

(2) పైన చెప్పబడినట్లు తప్ప, అట్టి ప్రతి లైసెన్సుకును లేదా అనుమతికిని పంచాయతీచే నిర్ణయింపబడగల యూనిట్లమీాదను రేట్ల చొప్పున రుసుములు విధింప బడవచ్చును అయితే ఆ రేట్లు, గరిష్ఠ మొత్తము ఏదైన నిర్ణయింపబడినయెడల, దానిని మించకూడదు

(3) పైన చెప్పబడినట్లు తప్ప, అట్టి ఏ లైసెన్సుకైన లేదా అనుమతికైన దరఖాస్తుమీాద ఉత్తరువు, దరఖాస్తు కార్య నిర్వాహక అధికారికి అందిన తర్వాత ముప్పది దినములలోపుగా లేక ఏ తరగతి సందర్భములలోగాని నిర్ణయింపబడగల అంతకంటె ఎక్కువ కాలపరిమితి లోపుగా దరఖాస్తుదారునికి తెలియజేయబడని యెడల, దరఖాస్తు అది సాధారణముగా అనుమతింపబడియుండు కాలము ఏదైన నున్నయెడల ఆ కాలమునకును, చట్టమునకును, విధులకు, ఉపవిధులకు, రెగ్యులేషనులకు మరియు సాధారణముగా విధింపబడు షరతులన్నిటికి లోబడియును అనుమతింపబడునట్లు భావింప బడవలెను

(4) అట్టి ఏ లైసెన్సుకుగాను లేదా అనుమతికిగాను రుసుమును ముందుగా చెల్లించియుండుటకు అంగీకరించుట, అట్టి ముందుగా చెల్లించు మనిషికి లైసెన్సును లేదా అనుమతిని పొందుటకు హక్కు నియ్యకూడదు కాని లైసెన్సు లేదా అనుమతి నిరాకరింపబడు నెడల రుసుము వాపసు పొందుటకు మాత్రము హక్కును నియ్యవలెను

(5) ఏ కార్యము చేయుటకు అట్టి ఏ లైసెన్సుగాని, అనుమతిగాని అవసరముగా నుండునో ఆ కార్యము అట్టి లైసెన్సు లేదా

అనుమతి లేకుండ, లేదా పొందబడిన లైసెన్సు లేదా అనుమతి యొక్క షరతులకు అనుగుణముగా నుండని విధమున చేయబడిన యెడల అప్పుడు—

(a) కార్యనిర్వాహక అధికారి నోటీసు మూలముగా అట్టి కార్యమునుచేయు మనిషి అట్టి నోటీసులో నిర్దేశింపబడవలసిన కాలములోపుగా అందువలన బాధింపబడిన చరాస్తిగా నుండునట్టి లేదా స్థిరాస్తిగా నుండునట్టి లేదా పబ్లిక్ లేదా ప్రైవేటు ఆస్తిగా నుండునట్టి ఏ ఆస్తినిగాని పూర్తిగా లేదా దానిలోని ఏ భాగమును గాని మార్చునట్లు, తొలగించునట్లు లేదా సాధ్యమైనంతవరకు దాని మొట్టమొదటి స్థితికి తీసుకొని వచ్చునట్లు కోరవచ్చును, మరిన్ని యింకను

(b) అట్టి కార్యమును అట్లు చేయుటకు ఈ ఆక్టులో ఎట్టి అపరాధముగాని ప్రత్యేకముగా ఏర్పాటు చేయబడియుండని యెడల, దానిని అట్లు చేయు మనిషి అట్టి ప్రతి నేరమునకును ఏబది రూపాయలకు మించని జరిమానాతో శిక్షింపబడతగియుండవలెను

(6) అట్టి ఏ లైసెన్సునుగాని అనుమతినిగాని పొందుటకు తప్పిపోయినందుకు ఏ మనిషిమీదగాని నేరస్థాపన చేయబడినపుడెల్ల, మేజిస్ట్రేటు, విధింపబడగల యేదైన జరిమానాకు అదనముగా సదరు లైసెన్సుకు లేదా అనుమతికి కట్టతగిన రుసుము మొత్తమునుగూడ వెంటనే రాబట్టి పంచాయతీకి చెల్లించి వేయవలెను మరిన్ని ప్రాసిక్యూషను ఖర్చులుగా ఆయన నిర్ణయించగల మొత్తము ఏదైన నున్నయెడల తన యిష్టానుసారము అట్టి మొత్తమును కూడ, వెంటనే వసూలుచేసి పంచాయతీకి యిచ్చివేయవచ్చును.

వివరణము — ఈ సబు సెక్షను ననుసరించి ఒక లైసెన్సుకైన లేదా అనుమతికైన రుసుమును వసూలు చేసియుండుట లైసెన్సును లేదా అనుమతిని పొందుటకు నేరస్థాపన చేయబడిన మనిషికి హక్కును కలుగజేయకూడదు.

సెక్షను 96 (2) క్రింద విధులు గరిష్ఠ లైసెన్సు రుసుము విధింపు

(జి. ఒ. నెం 677, ఎల్ ఎ తేదీ 2-4-1952)

విధులు

విద్యుచ్ఛక్తితోగాని, ఇతర శక్తితోగాని నడుపబడు యంత్రములకు గరిష్ఠ లైసెన్సు రుసుము

1 విద్యుచ్ఛక్తితో నడుపబడు యంత్రములు

1 విద్యుచ్ఛక్తిచే నడుపబడు ఏదైన యంత్రమును లేక ఉత్పత్తి సాధన యంత్రమును ఏ ఆవరణయందైనను సంస్థాపన చేయుటకై ఆక్టుయొక్క 92 వ విభాగము క్రింద నొసంగబడిన అనుమతికిగాని విధింపబడనగు రుసుము, ఈ విధులకు అనుబంధముగ జేర్పబడిన 1 వ అను సూచియందు నిర్దిష్టము చేయబడిన గరిష్ఠ మొత్తమును మించియుండకూడదు,

అయితే ఈ విధి ననుసరించి విధింపబడనగు రుసుము విద్యుచ్ఛక్తిచేగాక ఇతరమైనదానిచే నడుపబడు అదే అశ్వశక్తి (హార్స పవర్) గల ఏదైన యంత్రము లేక ఉత్పత్తిసాధన యంత్రముయొక్క సంస్థాపనకు విధింపబడు మొత్తమును మించియుండకూడదు.

2 విద్యుచ్ఛక్తిచే నడుపబడు ఏదైన యంత్రము లేక ఉత్పత్తి సాధనయంత్రము ఉపయోగింపబడు స్థలమునకు ఒక సంవత్సర కాలమువరకు ఆక్టుయొక్క 91 వ విభాగము ననుసరించి జారీచేయబడు లేక పునరుద్ధరింపబడు లైసెన్సుకుగాను విధింపబడనగు రుసుము ఈ విధులకు అనుబంధముగా జేర్పబడిన 1 వ అను సూచియందు నిర్దిష్టము జేయబడిన గరిష్ఠ మొత్తమును మించియుండ కూడదు

అయితే అట్టి లైసెన్సు ఏదైనను ఒక సంవత్సరముకంటె తక్కువగు కాలపరిమితులకు జారీచేయబడిన లేక పునరుద్ధరింపబడిన సందర్భమున, ఏ సంవత్సరమందయిననను అది యే యంత్రము లేక ఉత్పత్తిసాధన యంత్రము విషయములో అది యేస్థలమునకు విధింపబడు వెరశి లైసెన్సు రుసుము, దానివిషయములో ఒక సంవత్సర

కాలమునకు జారీచేయబడు లేక పునరుద్ధరింపబడు లైసెన్సుకుగాను విధింపబడు రుసుమును మించియుండకూడదు

ఇంతేకాకుండ, ఈ విధి ననుసరించి విధింపబడనగు రుసుము, విద్యుచ్ఛక్తిచేగాక ఇతరమైనదానిచే నడుపబడు అదే అశ్వశక్తి (హార్సుపవర్) గల ఏదైన యంత్రము లేక ఉత్పత్తిసాధన యంత్రమునకుగాను విధింపబడు మొత్తమును మించియుండ కూడదు

3 ఈ విధులకు అనుబంధముగా జేర్పబడిన 1 వ అనుసూచి యందు నిర్దిష్టము చేయబడియున్న గరిష్ఠ మొత్తము, సకాలములో దాఖలు చేయబడు దరఖాస్తుల విషయమునందు మాత్రమే వర్తించవలెను ఆలస్యముగా దాఖలుచేయబడు దరఖాస్తు విషయములో, ఆ అనుసూచియందు నిర్దిష్టము చేయబడిన గరిష్ఠరుసుమునందు నాల్గవ వంతును మించని అదనపు రుసుమును విధింపవచ్చును.

## II. విద్యుచ్ఛక్తికాని ఇతర శక్తితో నడుపబడు యంత్రములు.

4 విద్యుచ్ఛక్తికాని ఇతరశక్తితో నడుపబడు ఏదైన యంత్రమును లేక ఉత్పత్తిసాధన యంత్రమును ఏ ఆవరణయందైనను సంస్థాపన జేయుటకై ఆక్టుయొక్క 92 వ విభాగము క్రింద నొసంగబడిన అనుమతికిగాను విధింపబడనగు రుసుము ఈ విధులకు అనుబంధముగా జేర్పబడిన 2 వ అనుసూచియందు నిర్దిష్టము చేయబడిన గరిష్ఠ మొత్తమును మించి యుండకూడదు

5 విద్యుచ్ఛక్తి కాని ఇతరశక్తిచే నడుపబడు ఏదైన యంత్రము లేక ఉత్పత్తిసాధన యంత్రము ఉపయోగింపబడు స్థలమునకు ఒక సంవత్సర కాలమువరకు ఆక్టుయొక్క 91 వ విభాగము ననుసరించి జారీచేయబడు లేక పునరుద్ధరింపబడు లైసెన్సుకుగాను విధింపబడనగు రుసుము. ఈ విధులకు అనుబంధముగా జేర్పబడిన 2 వ అనుసూచియందు నిర్దిష్టముచేయబడిన గరిష్ఠమొత్తమును మించి యుండకూడదు

అయితే అట్టి లైసెన్సు ఏదైనను ఒక సంవత్సరముకంటె తక్కువగు కాలపరిమితులకు జారీచేయబడిన లేక పునరుద్ధరింపబడిన

సందర్భమున ఏ సంవత్సరమందైనను అది యేయంత్రము లేక ఉత్పత్తిసాధన యంత్రము విషయములో అది యే స్థలమునకు విధింప బడు వేరశీ లైసెన్సు రుసుము, దాని విషయములో ఒక సంవత్సర కాలమునకు జారీచేయబడు లేక పునరుద్ధరింపబడు లైసెన్సుకుగాను విధింపబడు రుసుమును మించియుండకూడదు ,

6 ఈ విధులకు అనుబంధముగా జేర్పబడిన 2 వ అనుసూచి యందు నిర్దిష్టము చేయబడియున్న గరిష్ఠమొత్తము సకాలములో దాఖలుచేయబడు దరఖాస్తు విషయములో మాత్రమే వర్తించవలెను ఆలస్యముగా దాఖలుచేయబడు దరఖాస్తు విషయములో, ఆ అను సూచియందు నిర్దిష్టము చేయబడిన గరిష్ఠ రుసుమునందు నాల్గవ వంతును మించని అదనపు రుసుమును విధింపవచ్చును.

## III సాధారణమైనవి.

7 ఈ విధులలోనున్న తేదీయు, ఆక్టుయొక్క 92 వ విభాగము యొక్క లేక ఆక్టుయొక్క 91 వ విభాగముక్రింద జారీచేయబడి 1951 వ సం॥ మార్చి 27 వ తేదీగల ఫోర్టుసెంటు జార్జి గెజెటు యొక్క 1-A భాగమునకైన విధుల అనుబంధము నందలి 59-60 వ పుటలయందు 1951 వ సం॥ మార్చి 24 వ తేదీగల లోకల్ అడ్మిని స్ట్రేషన్ డిపార్టుమెంటువారి నెం 26 రు ప్రకటనతో ప్రకటింపబడిన విధిలోని (t) పద్దుయొక్క అమలునుండి మినహాయింపబడిన యంత్రి ముల లేక ఉత్పత్తిసాధన యంత్రముల సంస్థాపనల *విషయములో ఆయా సంగతికి తగినట్లు అనుమతికి లేక లైసెన్సుకుగాను ఏదైన రుసుమును విధించుటకు అధికారమిచ్చునట్లు భావింపబడకూడదు

## అనుబంధము

### 1 వ అనుసూచి.

| సంస్థాపనల అశ్వశక్తి (హార్సుపవర్) | విధింపనగు గరిష్ఠ రుసుము రూ. | అ. | పై |
|---|---|---|---|
| అశ్వశక్తితో నిమిత్తము లేకుండ సినిమా కార్యములకై రెక్టిఫయిర్ల సంస్థాపకులు | 1 | 0 | 0 |

( * పుట చూడుము)

| | | | |
|---|---|---|---|
| 1 అశ్వశక్తికి మించని ఇతర సంస్థాపనలు | 1 | 0 | 0 |
| 1 అశ్వశక్తిని మించి, 5 అశ్వశక్తిని మించని ఇతర సంస్థాపనలు | 5 | 0 | 0 |
| 5 అశ్వశక్తిని మించి 10 అశ్వశక్తిని మించని ఇతర సంస్థాపనలు | 15 | 0 | 0 |
| 10 అశ్వశక్తికి మించి 50 అశ్వశక్తిని మించని ఇతర సంస్థాపనలు. | 75 | 0 | 0 |
| 50 అశ్వశక్తినిమించి 100 అశ్వశక్తిని మించని ఇతర సంస్థాపనలు | 100 | 0 | 0 |
| 100 అశ్వశక్తిని మించిన ఇతర సంస్థాపనలు . | 125 | 0 | 0 |

2 వ అనుసూచి

సంస్థాపనల అశ్వశక్తి,

| | | | |
|---|---|---|---|
| అశ్వశక్తితో నిమిత్తములేకుండ కేవలము గృహ కార్యమునకైన సంస్థాపనలు | 0 | 8 | 0 |
| 1 అశ్వశక్తిని మించని ఇతర సంస్థాపనలు. | 1 | 8 | 0 |
| 1 అశ్వశక్తిని మించి 5 అశ్వశక్తిని మించని ఇతర సంస్థాపనలు | 7 | 8 | 0 |
| 5 అశ్వశక్తిని మించి 10 అశ్వశక్తిని మించని ఇతర సంస్థాపనలు | 22 | 8 | 0 |
| 10 అశ్వశక్తినిమించి 20 అశ్వశక్తిని మించని ఇతర సంస్థాపనలు | 35 | 0 | 0 |
| 20 అశ్వశక్తిని మించి 30 అశ్వశక్తిని మించని ఇతర సంస్థాపనలు. | 60 | 0 | 0 |
| 30 అశ్వశక్తిని మించి 40 అశ్వశక్తిని మించని ఇతర సంస్థాపనలు | 75 | 0 | 0 |
| 40 అశ్వశక్తిని మించి 50 అశ్వశక్తిని మించని ఇతర సంస్థాపనలు | 100 | 0 | 0 |
| 50 అశ్వశక్తిని మించి 100 అశ్వశక్తిని మించని ఇతర సంస్థాపనలు | 125 | 0 | 0 |
| 100 అశ్వశక్తిని మించిన ఇతర సంస్థాపనలు | 150 | 0 | 0 |

సంపాదకుని సూచిక

లైసెన్సు మంజూరు చేసినపుడే లైసెన్సు రుసుము చెల్లింప బాధ్యతయుండునని గమనించవలెను ఆదాయ వ్యయములయొక్క విధులలోని 1 (2) వ విధిక్రింద, లైసెన్సుకు దరఖాస్తుతోనే రుసుము ముందుగా వసూలు చేయబడవలెను. కాని లైసెన్సుపొందని వ్యక్తికి రుసుము యివ్వవలసిన బాధ్యతలేనట్లున్నది కాని ఆవ్యక్తికి ప్రాసిక్యూటు చేయవలెను, మరియు మాజిస్ట్రేటు, జరిమానా విధించుటయేకాక, అతనినుండి లైసెన్సుకు యివ్వవలసిన రుసుముకూడ వసూలుచేసి, పంచాయతీకి చెల్లించ వలెను. ఈ షరాలు అనుమతులకుకూడ వర్తించును లైసెన్సుగాని, అనుమతిగాని పొందని విషయములలో మాజిస్ట్రేటుకు ఫిర్యాదుచేయుటకు నిర్ణయింపబడిన కాలము నకు, యాక్టుయొక్క 103 వ సెక్షను చూడుము

## సెక్షను 96 (3) క్రింద విధి

## (జి. ఒ, నెం 520 ఎల్ ఎ తేదీ 24-3-1951)

## విధి

## లైసెన్సులు మరియు అనుమతులకొరకు పెట్టుకొన్న ధరఖాస్తులమీద ఉత్తరువులను పంపుటకు కాలపరిమితి.

ఈ యాక్టు, లేక దానిక్రింద చేయబడిన ఏ విధి లేక ఉపవిధి క్రిందనైన, లేక రెగ్యులేషనుక్రిందనైన ఏ లైసెన్సు లేక అంగీకారము కొరకుగాని లేక దాని పునరుద్ధరణకొరకు పెట్టుకొనబడిన ఒక దరఖాస్తుమీద ఉత్తరువులను జారీచేయుటకు పూర్వము, జిల్లా హెల్తు ఆఫీసరు, లేక ఫ్యాక్టరీల ఇన్‌స్పెక్టరు లేక ఏ యితర ఉద్యోగి వంటివైన ఏ అన్య అధికారియొక్కయైన సలహాను పుచ్చుకొనవలసిన సందర్భములో, అట్టి దరఖాస్తు సందర్భములో ఉత్తరువులు, పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారిచే, దరఖాస్తు అందిన తర్వాత అఱువది దినములలోపల, దరఖాస్తుదారునికి పంపబడవలెను

సె 97 ఈ ఆక్టులో లేదా దీని ననుసరించి చేయబడిన ఎట్టి విధిలో, ఉపవిధిలో లేదా రెగ్యులేషనులో నున్నదేదియును కేంద్ర లేక రాజ్య ప్రభుత్వమువారి లేదా 1933 వ సం॥పు మదరాసు వ్యాపారమునకు కనువగు ఫలసాయముల మార్కెట్ల ఆక్టు ననుసరించి ఏర్పరచబడిన ఒక మార్కెటు కమిటీ అనుభవములో లేదా పై విచారణ క్రిందనున్న ఎట్టి స్థలము విషయములోగాని, లేదా కేంద్ర

లేక రాజ్య ప్రభుత్వముయొక్క ఏ ఆస్తి విషయములోగాని లేదా అట్టి మార్కెటు కమిటీకి చెందిన ఎట్టి ఆస్తి విషయములోగాని, ఈ ఆక్టు లేదా అట్టి ఏదేని విధి ఉపవిధి లేదా రెగ్యులేషను ననుసరించి అట్టి ఏ లైసెన్సునుగాని పుచ్చుకోవలసినట్లు లేదా ఎట్టి అనుమతినైన పొందవలసినట్లు కోరుచున్నట్లు భావింపబడగూడదు

## నోటీసులును, ఉత్తరువులు వగైరాలు అమలు జరుపుటకు అధికారము

సె 98 (1) ఈ ఆక్టు ననుసరించి లేదా దాని ననుసరించి చేయబడిన ఎట్టి విధినిగాని, ఉపవిధినిగాని లేదా రెగ్యులేషనుగాని అనుసరించి ఎట్టి నోటీసు, రిక్విజిషను (ఆజ్ఞ) లేదా ఉత్తరువుచేనైన ఏ మనిషిగాని ఏ పనినైన చేయుటకు లేదా ఏ చర్యలనైన తీసికొనుటకు లేదా దేనినిగాని చేయుటకు కోరబడినప్పుడెల్ల ఏ కాలములోగా సదరు పనిని చేయవలెనో, చర్యలను తీసికొనవలెనో లేదా పనిని చేయవలెనో అట్టి న్యాయమైన ఒక కాలమును అట్టి నోటీసులో, ఆజ్ఞలో లేదా ఉత్తరువులో తెలుపవలెను

(2) అట్లు తెలుపబడిన కాలములోపుగా అట్టి నోటీసు, ఆజ్ఞ లేదా ఉత్తరువు ప్రకారము నెరవేర్చని యెడల—

(a) కార్యనిర్వాహక అధికారి అట్టి పని చేయబడునట్లు చేయవచ్చును లేదాసదరు నోటీసును, ఆజ్ఞను లేదా ఉత్తరువును క్రమముగా అమలు జరుపుటకు అగత్యమని తాను అభిప్రాయపడగలయే చర్యలనైన తీసికొనవచ్చును లేదా ఏదైన చేయవచ్చును ఇది గాక

(b) అట్టి నోటీసు, ఆజ్ఞ లేదా ఉత్తరువు ప్రకారము జరుపుటకు తప్పినందుకు ఈ యాక్టులో ఎట్టి అపరాధముగాని ప్రత్యేకముగా ఏర్పరుపబడియుండిన యెడల, సదరు మనిషి అట్టి ప్రతి నేరమునకును ఏబది రూపాయలకు మించని జరిమానాతో శిక్షింపబడతగియుండవలెను.

ప్రవేశించుటకును, తనిఖీ చేయుటకును అధికారములు.

సె. 99 (1) నిర్ణయింపబడగలట్టి నిర్బంధములకును, షరతులకును లోబడి కార్యనిర్వాహక అధికారి లేదా ఆయనచే అధికారమియ్యబడిన ఏ మనిషిగాని, నోటీసు యిచ్చిన మీదటను లేదా యివ్వకుండగను, అసిస్టెంటులను లేదా పనివాండ్రను వెంటబెట్టుకొనిగాని వెంటబెట్టుకోకుండగాని—

(a) ఈ ఆక్టుయొక్క లేదా దీని ననుసరించి చేయబడిన ఎట్టి విధియొక్కయైన, ఉపవిధియొక్కయైన, రెగ్యులేషనుయొక్కయైన లేదా ఉత్తరువుయొక్కయైన నిబంధనలచే అధికారమివ్వబడిన లేదా ఈ యాక్టుయొక్క ఎట్టి కార్యములకొరకుగాని లేదా సదరు నిబంధనలలో వేటినిబట్టియైన చేయుట లేదా అమలు జరుపుట అవసరముగానుండు ఏదేని విచారణను చేయునిమిత్తము, తనిఖీచేయు నిమిత్తము, పరిశీలనచేయు నిమిత్తము, పరీక్షచేయు నిమిత్తము, సర్వేచేయు నిమిత్తము, కొలుచు నిమిత్తము లేదా మదింపు వేయునిమిత్తము లేదా యేదేని ఇతర పనిని జరిపించు నిమిత్తము లేదా

(b) సదరు నిబంధనలలో దేనినిబట్టియైన ఒక లైసెన్సు లేదా అనుమతి అవసరముగానుండు ఏదిగాని అట్టి లైసెన్సు లేదా అనుమతి లేకుండా లేదా పొందబడిన లైసెన్సు లేదా అనుమతి యొక్క షరతుల ప్రకారము కాకుండ ఇతర విధమున ఒక స్థలములో, కట్టడములో లేదా భూమిలో ఏదియు జరుపబడుచుండుట లేదని తనకు తాను తృప్తిపడు నిమిత్తము

అట్టి స్థలములో, కట్టడములో లేదా భూమిలో ప్రవేశించవచ్చును

(2) (1) వ సబు సెక్షను ననుసరించి అధికారములను చెలాయించుటవలన లేదా ఆ సబు సెక్షను ననుసరించి ప్రవేశము చేయుటకు అవసరముగానుండు ఎట్టి బలమును ఉపయోగించుటవలన, కలుగజేయబడిన ఎట్టి నష్టమునకుగాని లేదా ఆ సౌకర్యమునకుగాని ఎట్టి మనిషిమీదగాని ఏ హక్కు ఉంచకూడదు

## 99 వ సెక్షనుక్రింద విధులు.
(జి. ఒ నెం 1116 ఎల్. ఎ తేదీ 4-6-1951)

### విధులు

### ప్రవేశించి తనిఖీచేయు అధికారములకు సంబంధించిన నిర్బంధములును, పై విమర్శయును.

1 99 వ సెక్షను, (1) వ సబు సెక్షను, (a) క్లాజుయొక్క కార్యముల విమిత్తము—

(a) కార్యనిర్వాహక అధికారి లేక ఆయనచే అధికారమియ్యబడిన ఏ మనిషిగాని సూర్యాస్తమయమునకును సూర్యోదయమునకును మధ్య ప్రవేశించకూడదు

(b) నివాస గృహముయొక్క అనుభవదారునకు, నివాస గృహములో ప్రవేశించు వుద్దేశమును గురించి కనీసము ఆరు గంటలకు పూర్వమే తెలియబరుచబడిననేతప్ప, అట్టి అనుభవదారు అనుమతి లేకుండ, ఎట్టి నివాసగృహములోనైనను, నివాసగృహముగా ఉపయోగింపబడు ఒక పబ్లికు కట్టడముయొక్క ఏ భాగములలోనైనను, కార్యనిర్వాహక అధికారి లేక అతనిచే అధికారమియ్యబడిన ఏ మనిషిగాని ప్రవేశించకూడదు ,

(c) ప్రతి సందర్భములో [2 (b) విధిక్రింద ముందుగా తెలియజేయకుండ ఏ కట్టడములోనైన ఇతర విధముగా ప్రవేశించు నపుడుకూడ] స్త్రీలకై ప్రత్యేకించబడిన ఏ గదిలోనైన నుండువారిని ఏకాంతముగా నుంచుటకు కట్టడములోని ఏదో ఒక భాగమునకు స్త్రీలను కొనిపోవుటకు సాధ్యమగునట్లు, కార్యనిర్వాహక అధికారి లేక ఆయనచే అధికారమీయబడిన ఏ మనిషియైనను చాలినంత ముందుగా తెలియజేయవలెను

(d) ప్రవేశమునకు అనుకూలముగా నున్నంతవరకు, కట్టడముయొక్క అనుభవదారుల సాంఘిక, మత ఆచారములకు కార్యనిర్వాహక అధికారి లేక అతని అధికారమును పొందిన ఇతర మనిషి క్రమమైన మర్యాద చూపవలెను.

2 99 వ సెక్షనుయొక్క (1) వ సబు సెక్షను, (b) క్లాజు యొక్క కార్యముల నిమిత్తము—

(a) కార్యనిర్వాహక అధికారి లేక అతని అధికార మును పొందిన ఏ మనిషియైనను సూర్యోదయమునకును, సూర్యా స్తమయమునకును మధ్య ఏ కట్టడములోనైన ప్రవేశించవచ్చును, మరియు కట్టడములో జనులు పోవుటకు వీలుగానున్న యెడల లేక ఆ కాలమందు దానిలో ఏ పరిశ్రమగాని సాగుచుండిన పక్షమున సూర్యాస్తమయము, సూర్యోదయమునకు మధ్యకూడ ప్రవేశించ వచ్చును

(b) ఆక్టువలన లేక దాని ననుసరించి ఒక లైసెన్సు లేక అనుమతి అవసరమైయుండి అవి లేకుండ క్రింద తెలిపిన కార్య ములలో దేనికొరకైన ఏ కట్టడమైన ఉపయోగింపబడుచున్నదని లేక అట్టి లైసెన్సు లేక అనుమతియొక్క షరతులకు విరుద్ధముగా అట్టి కట్టడములో ఏదైన చేయబడుచున్నదని నమ్ముటకు కారణమున్న యెడల, కార్యనిర్వాహక అధికారి లేక అతని అధికారమును పొందిన ఏ మనిషియైనను, పగలుగాని రాత్రిగాని ఏ సమయమందైనను, ముం దుగా తెలుపకయే, చట్టము, విధులు, ఉపవిధులు, రెగ్యులేషనుల యొక్క ఏ నిబంధనయైన, లైసెన్సు లేక అనుమతియొక్క ఏ షర తైనను, లేక ఏదైన చట్టబద్ధమైన ఆజ్ఞ లేక నిషేధము ఉల్లంఘింప బడుచున్నదని తృప్తిపడు కార్యము నిమిత్తము అట్టి కట్టడములో ప్రవేశించవచ్చును —

(i) చర్మములు లేక తోళ్లను పదును చేయుట,

(ii) తుపాకీమందు లేక బాణాపంచా తయారు చేయుట,

(iii) బీరును బట్టిపెట్టి కాచుట, బట్టీమూలముగా (డినేచర్డ్ అయినను కాకపోయినను) మద్యసారమును కలిగినసారాయి లేక ఇతర స్పిరుటును తయారుచేయుట, మరియు

(iv) ప్రేలుడు లేక సులభముగా నిప్పంటుకొను పదార్థములను నిల్వయుంచుట.

సె 100. కార్యనిర్వాహక అధికారి లేదా ఆయనచే అధికార మియ్యబడిన ఏ మనిషిగాని, ఇండియన్ పీనలుకోడుయొక్క 13వ అధ్యాయము ననుసరించి తూనిక రాళ్ళకును, కొలతపాత్రలకును సంబంధించిన నేరములను ఆపునట్టిన్ని, శిక్షించునట్టిన్ని ఉద్దేశముతో గ్రామములోని మార్కెట్లలోను, అంగళ్ళలోను ఉపయోగింపబడు తూనిక రాళ్ళను, కొలతపాత్రలను పరీక్షచేయవచ్చును మరిన్ని తనిఖిచేయవచ్చును,

సె 101 (1) కార్యనిర్వాహక అధికారి వ్రాతమూలకమైన ఉత్తరువుద్వారా, పంచాయతీ విచారణాధికారములోపల చేరియున్న ఏ రెవిన్యూ గ్రామముయొక్కయైన గ్రామాధికారినిగాని, కరణమును గాని వారిద్దరినిగాని అట్టి గ్రామము లేక అందలి ఏ భాగముయొక్కయైన లేక అందలి ఏ మనిషి లేక ఆస్తివిషయములోనైన నిర్ణయింప బడగల వర్గములలోనికి వచ్చు ఏ విషయము గురించియైన సమాచారమును తనకు తెలుపవలసినదిగా కోరవచ్చును

(2) ఆ ఉత్తరువు ఏ కాలపరిమితిలోపల దానిని నెరవేర్చ వలెనని నిర్దేశించవలెను కాని కార్యనిర్వాహక అధికారి అప్పు డప్పుడు అట్టి కాలపరిమితిని పొడిగించవచ్చును

సెక్షను 101 (1) క్రింద విధులు

(జి ఓ నెం. 520, లోకలు అడ్మినిస్ట్రేషను తేదీ 24-3-1951)

విధి

గ్రామోద్యోగులనుండి కోరబడగల సమాచారము

ఒక పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి, వ్రాత మూలకమైన ఉత్తరువుద్వారా, పంచాయతీయొక్క విచారణాధికార ములో చేరియున్న ఏ రెవిన్యూగ్రామములయొక్కయైన గ్రామ మున సబు లేక కరణమును లేక ఇరువురను అట్టి గ్రామము లేక అందలి ఏ భాగముయొక్కయైన లేక అందలి ఏ మనిషి లేక ఆస్తియొక్కయైన సందర్భములో ఈ క్రింది రకములకు చెందిన ఏ విషయమును గురించియైన సమాచారమును తెలుపునట్లు గోరవచ్చును —

(1) గ్రామ రికార్డులలో దొరకగల పంచాయతీ సరిహద్దులలోని ఏ భూమియొక్కయైన సర్వే నెంబరు సబు డివిజను తరగతివారీ విభజన భూమి మెరకయా మాగాణియా, విస్తీర్ణము, పన్ను వంటి వివరములు, రిజిష్టరుకాబడిన వ్యక్తి లేక అనుభవదారును గురించిన వివరములు

(2) పంచాయతీ పరిపాలన నిమిత్తము గ్రామోద్యోగులు వ్రాసియుంచు రిజిష్టర్లలోను లెక్కలలోను లభించగల ఇతర వివరములు.

## లిమిటేషన్ (కాలపరిమితి).

102 ఈ ఆక్టు లేదా దీని ననుసరించి చేయబడిన ఎట్టివిధినైన ఉపవిధినైన, రెగ్యులేషనునైన లేదా ఉత్తరువునైన ననుసరించి పంచాయతీకి బాకీగా రావలసియుండు ఏ పన్ను లేదా యితర పైకపు మొత్తము విషయములోగాని, అట్టి పన్ను లేక పైకము విషయములో, ఆయా సందర్భమునకు తగినట్లు జప్తు మొదట చేసియుండవలసిన, దావా మొదట దాఖలు చేసియుండవలసిన లేదా ఫిర్యాదు చర్య మొదట ప్రారంభింపవలసియుండిన తేదీనుండి మూడు సంవత్సరముల కాలము గడచిపోయినమీదట, జప్తు ఏదియు చేయబడకూడదు, దావా ఏదియు దాఖలు చేయబడకూడదు మరియు ఫిర్యాదు చర్య ఏదియు ప్రారంభింపబడకూడదు

## ఫిర్యాదు చర్యలు, దావాలు వగైరా

సె 103 ఆ ఆక్టులో యితరవిధముగా స్పష్టముగా నిబంధింపబడియున్నట్లు తప్ప, ఈ ఆక్టుకు లేదా దీనిననుసరించి చేయబడిన ఎట్టి విధికిగాని, ఉపవిధికిగాని వ్యతిరేకముగా చేయబడిన ఎట్టి నేరమునకైన ఏ మనిషిగాని, పోలీసువారు, కార్యనిర్వాహక అధికారి లేదా పంచాయతీచే లేదా కార్యనిర్వాహక అధికారిచే ఈ విషయమున స్పష్టముగా అధికార మియ్యబడిన ఒక మనిషి, నేరముచేసిన మూడు నెలలలోపల ఫిర్యాదుచేసిననేతప్ప విచారణ చేయబడకూడదు , కాని యిందులోనున్నదేదియు అందిన సమాచారమునుబట్టి లేదా తమకు

స్వంతముగా తెలిసిన దానినిబట్టి లేదా అనుమానమునుబట్టి నేరము లను విచారణకు పట్టుటకు కొందరు మేజిస్ట్రేటులకుగల అధికారము విషయములో, 1898 వ సం॥పు క్రిమినలు ప్రొసీజరు కోడుయొక్క నిబంధనలను బాధించగూడదు

కాని ఈ ఆక్టు ననుసరించి లైసెన్సు తీసికొనుటకు లేదా అనుమతిని పొందుటకు తప్పిపోవుట, ఈ సెక్షనుయొక్క కార్యముల నిమిత్తము లైసెన్సు లేదా అనుమతి కావలసియుండు కాలము, ఏదైన నున్న యెడల, అది గడచువరకు ఎడతెగకుండ జరుగు నేర ముగా భావింపబడవలెను మరిన్ని కాలము ఏదియు నిర్దేశింపబడని యెడల నేరము ప్రారంభమైనప్పటినుండి పండ్రెండు నెలలలోగా ఎప్పుడైనను ఫిర్యాదు చేయబడవచ్చును

సె 104 కార్యనిర్వాహక అధికారి నిర్ణయింపబడగలట్టి సందర్భ ములకును పై విచారణకును లోబడి విధులచే రాజీచేసికొనబడతగిన విగా ప్రకటింపబడిన ఈ ఆక్టుకు లేదా దీనిననుసరించి చేయబడిన ఏదేని విధి లేదా ఉపవిధిక వ్యతిరేకముగా చేయబడిన ఏ నేరము విషయమునగాని రాజీచేసుకొనవచ్చును

104 వ సెక్షను క్రింద విధులు, నేరములను రాజీచేసుకొనుట

(జి. ఒ. నెం. 520, లోకల్ అడ్మినిస్ట్రేషన్ తేదీ 24-3-1951)

విధి

నేరములను రాజీ చేసుకొనుట —క్రింది షెడ్యూలుయొక్క మొదటిగడిలో నిర్దేశింపబడిన ఆక్టుయొక్క సెక్షను క్రింద శిక్షింప దగిన నేరములు రాజీచేసికొనవచ్చును, లేక షెడ్యూలుయొక్క 4 వ గడిలో చెప్పబడిన విధముగ ఏ కోర్టు సమక్షమున అట్టి నేరము కొరకైన ఏ ఫిర్యాదు చర్యగాని తీర్మానింపబడక నున్నదో అట్టి కోర్టుయొక్క అనుమతితో రాజీచేసికొనబడవచ్చును కార్యనిర్వా హక అధికారి అట్టి ఏ నేరము సందర్భములోనైన రాజీ చేసికొను టకు రీజనల్ ఇన్స్పెక్టరుయొక్క అనుమతిని ముందుగా పొందవలెను.

# షెడ్యూలు

| సెక్షను మరియు సబు సెక్షను లేక క్లాజు. (1) | నేరము (2) | ఆక్టు క్రింద శిక్ష (3) | రాజీ చేసుకొన తగినదా లేక కోర్టుయొక్క అనుమతితో రాజీ చేసుకొన తగినదా. (4) |
|---|---|---|---|
| 79 (a) | పబ్లికురోడ్డులో లేక మీద చట్ట విరుద్ధముగా గోడను కట్టుట లేక కంచెను నిర్మించుట మొదలైనది | నూరు రూపాయలు | రాజీ చేసుకొన తగినది. |
| 79 (c) | పబ్లికురోడ్డు మొదలగువాని సమీపమున ఏ స్థలములో నైన చట్ట విరుద్ధముగా మన్ను, రాళ్లు మొదలగు వానిని త్రవ్వుట | ఏబది రూపాయలు | డిటో |
| 79 (d) | మురుగు కాలువమీద చట్ట విరుద్ధముగా కట్టడమును కట్టుట | రెండు వందల రూపాయలు | అట్టి నేరమునకు ఏ కోర్టు సమక్షమున ఏ ఫిర్యాదు చర్యగాని తీర్పుచేయ బడకున్నదో అట్టి కోర్టుయొక్క అనుమతితో రాజీ చేసుకొనవచ్చును. |
| 81 (1) | లైసెన్సు లేకుండా, లేక లైసెన్సుకు వ్యతిరేకముగా ఒక క్రొత్త ప్రైవేటు మార్కెట్టును తెరచుట లేక ఒక ప్రైవేటు మార్కెట్టును తెరచి యుంచుట | ఐదు వందల రూపాయలు | రాజీ చేసుకొన తగినది. |
| 82 (3) | సర్టిఫికెట్టు లేకుండ ప్రైవేటు మార్కెట్టులో రుసుమును విధించుట. | నూరురూపాయలు. | రాజీ చేసుకొన తగినది. |

| | | | |
|---|---|---|---|
| 84 | అనుమతి లేకుండా ఏ జంతువు లేక వస్తువునైన పబ్లికు లేక ప్రైవేటు మార్కెట్టులో విక్రయించుట లేక విక్రయమునకు ప్రదర్శించుట | ఇరువది రూపాయలు. | రాజీ చేసుకొన తగినది |
| 85 | నిషేధింపబడిన తరువాత లేక లైసెన్సు లేకుండా లేక విధులకు విరుద్ధముగా పబ్లికు రోడ్లలో లేక స్థలములలో వస్తువులను విక్రయించుట మొదలైనవి | పది రూపాయలు. | అట్టి నేరమునకు ఏ కోర్టు సమక్షమున ఏ ఫిర్యాదు చర్యగాని తీర్పు చేయబడకున్నదో అట్టి కోర్టుయొక్క అనుమతితో రాజీ చేసికొన వచ్చును. |
| 87 (b) | నిషేధింపబడిన దూరము లోపల ఏ పబ్లికు స్థలము లేక రోడ్డు ప్రక్కనగాని ఎగుమతి దిగుమతి స్థలములుగ ఆగు స్థలములుగ లేక బండ్లు నిలుచు స్థలములుగ ఉపయోగించుట | ఏబది రూపాయలు. | డిటో |
| 88 (1) | లైసెన్సు లేకుండా లేక లైసెన్సు వ్యతిరేకముగ క్రొత్త ప్రైవేటు బండ్లు నిలుచు స్థలమును తెరచుట లేక ప్రైవేటు బండ్లు నిలుచు స్థలమును తెరచియుంచుట. | రెండు వందల రూపాయలు. | డిటో. |
| 90. (a) | విధులకు విరుద్ధముగా పబ్లికు పశువధశాలలకు వెలుపల జంతువులను వధించుట కోయుట లేక చర్మము తీయుట మొదలైనవి. | డిటో. | డిటో. |

| | | | |
|---|---|---|---|
| 90 (b) | లైసెన్సు లేకుండా లేక లైసెన్సుకు వ్యతిరేకముగా విక్రయము నిమిత్తము జంతువులను వధించుట | ఇరువది రూపాయలు | డిటో. |
| 91 | లైసెన్సు లేకుండా లేక లైసెన్సుకు విరుద్ధముగ నిర్ణయింపబడిన ఏ కార్యము కొరకైనను ఒక స్థలము నుపయోగించుట | నూరు రూపాయలు | రాజీ చేసుకొనతగినది. |
| 95 (2) | కట్టడములకు వేసియున్న అంకెలను చట్టవిరుద్ధముగా తుడిచివేయుట మొదలైనవి | ఐదు రూపాయలు | అట్టి నేరము కొరకు ఏ కోర్టులో ఫిర్యాదు చర్యగాని తీర్మానము చేయబడక యున్నదో ఆ కోర్టుయొక్క అంగీకారముతో రాజీ చేసుకొనవచ్చును |
| 95 (3) | సంఖ్యను తిరిగి యుంచమని కోరబడినప్పుడు అట్లు చేయుటకు తప్పిపోవుట | ఇరువది రూపాయలు | రాజీ చేసుకొనతగినది |

సె 105 కార్యనిర్వాహక అధికారి దాఖలుచేసిన ప్రతి ఫిర్యాదు చర్యను లేక రాజీ చేసుకొనిన ప్రతినేరమును గురించి ఆయన పంచాయతీకి దాని మరుసటి సమావేశములో రిపోర్టు చేయవలెను

సె 106 ప్రెసిడెంటు కార్యనిర్వాహక అధికారి లేక ఏ దేని మెంబరు ఆయన తన ఉద్యోగధర్మమును నిర్వహించుటలో వ్యవహరించునప్పుడు లేక వ్యవహరించునట్లు భావము నిచ్చునప్పుడు అతడు చేసినట్లు చెప్పబడు యెట్టి నేరముగాని అతనిమీద మోపబడినప్పుడు గవర్నమెంటువారి అనుజ్ఞను ముందుగా పొందిననేతప్ప ఎట్టి కోర్టుగాని అట్టి నేరమును విచారించకూడదు

సంపాదకుని సూచిక

106 వ సెక్షను క్రింది ప్రభుత్వముయొక్క అధికారములు లోకలు అడ్మినిస్ట్రేషనుయొక్క ఇన్స్పెక్టరు జనరలుకు దత్తత చేయబడినవి.

(జి ఓ. నెం. 1118. లోకలు అడ్మినిస్ట్రేషన్ తేదీ 4-6-1951)

సె 107 (1) 108 వ సెక్షనుయొక్క నిబంధనలకు లోబడి ఈ ఆక్టు ననుసరించి చేయబడిన లేక చేయబడినట్లు అర్థమునిచ్చు ఎట్టి చర్య విషయమునగాని లేదా ఈ ఆక్టును లేదా దాని ననుసరించి చేయబడిన ఏదేని విధిని, ఉపవిధిని, రెగ్యులేషనును లేదా ఉత్తరువును అమలునందు పెట్టుటలో ఆరోపించబడిన ఏదైన ఉపేక్ష లేదా చేయుటకు తప్పిపోయిన విషయములో చర్యతీసుకొనుటకుగల కారణమును, కోరబడిన ప్రతిఫలముయొక్క స్వభావమును, కోరబడిన నష్టపరిహారముయొక్క మొత్తమును, వాదిగా నుండుటకు ఉద్దేశించిన మనిషియొక్క పేరును, నివాసస్థలమును తెలియజేయు వ్రాతమూలకమైన నోటీసు పంచాయతీ ఆఫీసువద్ద దాఖలుచేయబడిన తర్వాత మరిన్ని సదరు చర్యలు ఒక పంచాయతీయొక్క ప్రెసిడెంటుమీద, కార్యనిర్వాహక అధికారిమీద, మెంబరుమీద, ఉద్యోగిమీద, నౌకరుమీద లేదా మనిషిమీద తీసికొనిరాబడుటకు ఉద్దేశించినప్పుడు ఆయనకుకూడ అది అందజేయబడిన లేదా ఆయనయొక్క నివాసస్థలమువద్ద దాఖలుచేయబడిన తరువాత రెండు నెలలు గడుచు నంతవరకును అట్టి ఏ పంచాయతీమీదగాని లేదా దాని ప్రెసిడెంటుమీదగాని లేదా కార్యనిర్వాహక అధికారిమీదగాని లేదా దాని తాలూకు ఎట్టి మెంబరుమీదగాని ఉద్యోగిమీదగాని, లేదా నౌకరుమీదగాని లేదా అట్టి పంచాయతీ ప్రెసిడెంటుయొక్క కార్యనిర్వాహక అధికారియొక్క మెంబరుయొక్క ఉద్యోగియొక్క లేదా నౌకరుయొక్క ఉత్తరువు ననుసరించి వ్యవహరించు ఎట్టి మనిషిమీదగాని ఎట్టి దావాగాని లేదా ఇతర చట్టసమ్మతమైన చర్యగాని తీసుకొని రాబడకూడదు , మరిన్ని అట్టి నోటీసు ఋజువు చేయబడిననే తప్ప కోర్టువారు ప్రతివాది పక్షమున తీర్పు చెప్పవలెను

(2) అట్టి ప్రతిచర్యయు, అది స్థిరాస్థిని రాబట్టుటకైన చర్యగా లేదా దాని హక్కుయొక్క ప్రకటనకైన చర్యగానున్ననే తప్ప, చర్యకుగల కారణము బయలుదేరిన తేదీ తరువాత ఆరు నెలల లోపుల లేదా జరుగుచునేయున్న అపాయము లేదా నష్టము విషయములో అట్లు జరుగుచున్న కాలములో లేదా అది ఆగిపోయిన తరువాత ఆరు నెలల లోపల ప్రారంభింపబడవలెను.

(3) (1) వ సబు సెక్షను ననుసరించి నోటీసు యియ్య బడిన ఎట్టి పంచాయతీగాని, మనిషిగాని చర్య ప్రారంభింపబడుటకు ముందు వాదికి నష్టపరిహార మివ్వ జూపినప్పుడు, మరిన్ని అట్లు ఇవ్వజూపబడిన మొత్తముకంటె ఎక్కువ మొత్తమును వాది అట్టి చర్యలో రాబట్టుకొనిన పక్షమున, అట్లు యివ్వజూపబడిన తర్వాత ఆయనకు తగిలిన ఎట్టి ఖర్చులకుగాని ఆయన తిరిగి రాబట్టుకొన కూడదు , మరిన్ని అట్లు యివ్వజూపబడిన తర్వాత ప్రతివాదికి తగిలిన యావత్తు ఖర్చులనుకూడ వాది చెల్లింపవలెను.

సె. 108 ఈ ఆక్టు ననుసరించి చేయబడిన లేదా చేసినట్లు తాత్పర్యమునిచ్చు ఏ చర్య విషయములోనైన లేదా ఈ ఆక్టును లేదా దీని ననుసరించి చేయబడిన ఎట్టి విధినిగాని, ఉపవిధినిగాని, రెగ్యులేష నునుగాని లేదా వుత్తరువునుగాని అనుసరించి అమలులో పెట్టునపుడు, ఆయన చేసినట్లు ఆరోపింపబడిన ఎట్టి వుపేక్ష లేదా లోపము విషయ ములో అట్టి చర్య సదుద్దేశముతో చేయబడినయెడల లేదా అట్టి ఉపేక్ష లేదా లోపము సదుద్దేశమువలన కలిగినయెడల, ఒక పంచా యతీయొక్క ప్రెసిడెంటుమీాద లేదా కార్యనిర్వాహక అధికారిమీాద, దానియొక్క ఏ మెంబరుమీాదనైన ఉద్యోగిమీాదనైన లేదా నౌకరు, మీాదనైన లేదా ఒక పంచాయతీయొక్క లేదా అట్టి ప్రెసిడెంటు యొక్క, కార్యనిర్వాహక అధికారియొక్క మెంబరుయొక్క,వుద్యోగి యొక్క లేదా నౌకరుయొక్క ఉత్తరువు ననుసరించి వ్యవహరించు ఎట్టి మనిషిమీాదనైన యిట్టి దావా లేదా ఇతర చట్టసంబంధమైన చర్యగాని తీసుకొని రాబడకూడదు, కాని అట్టి యే చర్యయైనను అది ఒక కోర్టులో నిలువగలుగు నంతవరకు, 110 వ సెక్షను ననుసరించి తేబడిన దావాల విషయములో తప్ప, పంచాయతీపై తీసుకొని రాబడవలెను

సె. 109 1908 వ సంllపు సివిలు ప్రొసీజరు కోడులో లేదా తత్కాలమందు అమలులోనుండు ఏ యితర చట్టములోనైన ఏది యున్నను దానితో నిమిత్తము లేకుండ, ఎట్టి ఎన్నికదారుల పట్టీనైన తయారుచేయుటకు లేదా ప్రకటించుటకు లేదా ఎట్టి ఎన్నికనైన జరుపుటకు ఈ ఆక్టు ననుసరించి తీసుకొనబడుచుండు లేదా తీసుకొన

బడబోవు ఎట్టిచర్యనైనను నిలిపియుంచుటకు ఎట్టికోర్టుగాని ఎట్టి శాశ్వతపు లేదా తాత్కాలికపు నివారణాజ్ఞనుగాని యివ్వకూడదు లేదా ఎట్టి ఇంటరిమ్ (మధ్యకాలమునకైన) ఉత్తరువునుగాని చేయకూడదు

సె 110. (1) పంచాయతీయొక్క ప్రెసిడెంటును, కార్యనిర్వాహక అధికారియును, ప్రతిమెంబరును, పంచాయతీ దైనట్టి లేదా దాని వశమందుండునట్టి ఎట్టి పైకమైనను లేదా యితర ఆస్తి అయినను నష్టమగుటకు, వృథా వ్యయమగుటకు లేదా దుర్వినియోగ మగుటకు ఆయనయొక్క అజాగ్రత్త లేదా దుర్నడత ప్రత్యక్షకారణముగా నుండిన యెడల, అట్టి నష్టమునకు, వృథా వ్యయమునకు లేదా దుర్వినియోగమునకు బాధ్యుడుగా నుండవలెను మరిన్ని ఇన్‌స్పెక్టరుయొక్క అనుమతిని ముందుగా పొంది పంచాయతీ, తగిన విచారణాధికారముగల ఏ కోర్టులోనైన ఆయనమీాద పరిహారము కొరకు వ్యాజ్యమును దాఖలు చేయవచ్చును

(2) అట్టి ప్రతి వ్యాజ్యమును వ్యాజ్యకారణము కలిగిన తేదీనుండి మూాడు సంవత్సరముల లోపల ప్రారంభింపబడవలెను

సె 111 (1) ఈ యాక్టుయొక్క అధికారమునుబట్టి ఎట్టపన్ను కట్టుట, లేక డిమాండు చేయుట లేక చార్జి (ఖర్చు) విధించుట గాని (a) ఏ మనిషి యొక్కయైన పేరును గురించి, నివాసస్థలమును గురించి, వ్యాపారస్థలమును గురించి, లేక వృత్తి స్థలమును గురించి లేక (b) ఏదయినఆస్తిని లేక వస్తువులనువివరించుటను గురించి, లేక (c) కట్టబడిన, డిమాండుచేయబడిన లేక విధింపబడిన మొత్తమును గురించి, ఏ దయిన వ్రాతపొరపాటు సంభవించినదనెడి కారణము వలన లేక ఏదయిన తప్పు సంభవించినదనెడి కారణమువలన నేరము మోప బడకూడదు లేక బాధింపబడకూడదు అయితే ఈ ఆక్టు యొక్క నిబంధనలప్రకారము ముఖ్య విషయములలోను ఫలితము లోను జరిగింపబడి యుండవలయును మరియు ఈ యాక్టును బట్టి జరిగింపబడిన యే చర్యలుగాని వాని రూపమందలి లోపముచేత మాత్రము ఏ న్యాయస్థానము వలన నయిన కొట్టి వేయబడకూడదు లేక రద్దు చేయబడకూడదు

(2) ఈ యాక్టుయొక్క అధికారమునుబట్టి వసూలుచేయబడిన యేపైకపు మొత్తమునయినను రాబట్టుకొనుటకు లేక సదరు అధికారమును అనుసరించి పన్ను మొదలైనవి కట్టినందువలనగాని, పైకము వసూలుచేసినందువలనగాని, కలుగు నష్టమునకుగాను నష్టపరిహారము రాబట్టుకొనుటకు ఏ దావాగాని ఏ కోర్టులోనైన తేబడకూడదు,

అయితే, ఈ యాక్టుయొక్క నిబంధనలు ముఖ్య విషయములలో ఫలితములోను జరిగింపబడియుండవలయును

(3) ఈ యాక్టుయొక్కయు, దాని క్రింద చేయబడిన విధుల యొక్కయు, ఉపవిధులయొక్కయు, నిబంధనలు ముఖ్య విషయములలో ఫలితములలోను జరిగించ బడినయెడల ఈ యాక్టు ననుసరించి చేసిన జప్తుతో లేక విక్రయముతో సంబంధము కలిగియుండు బిల్లు, నోటీసు, షెడ్యూలు, నమూనా, సమ్మనులు, డిమాండు నోటీసు, జప్తు వారంటు, వస్తువుల జాబితా లేక యితర చర్యలలో ఏ పొరపాటు లోపము లేక క్రమలోపము అయినను ఉన్నందువల్ల అట్టి జప్తు లేక విక్రయము చట్టసమ్మతముకానిదిగా భావించబడకూడదు మరియు దానిని చేయు ఏమనిషియైనను హద్దుమీరి నడచిన మనిషిగా తలంపబడకూడదు.

అయినను ఏదేని క్రమరాహిత్యమువల్ల అన్యాయము పొందిన ప్రతిమనిషియు అతనికి కలిగిన ఏ విశేష నష్టమును గురించియయిన పరిహారమును పొందవచ్చును

## 7 వ అధ్యాయము—విధులును, ఉపవిధులును, శిక్షలును,

### విధులు

సె 112. (1) గవర్నమెంటువారికి ఈ యాక్టులోనున్న, ఏ ఇతర నిబంధనల వలననైన వారికియ్యబడిన విధులను చేయుటకైన అధికారముతోపాటు సామాన్యముగా ఈ యాక్టుయొక్క కార్యములను నెరవేర్చుటకైన విధులను చేయుటకు అధికారము ఉండవలెను

(2) ముఖ్యముగాను పైన చెప్పబడిన సామాన్య అధికారమునకు భంగము లేకుండను గవర్నమెంటువారు—

(i) మెంబర్లుగా ఎన్నికకు నిల్చు అభ్యర్థులు చేసిన డిపాజిట్లును, అట్టి డిపాజిట్లు ఏ షరతుల క్రింద దండుగక్రింద తీసికొన

బడవచ్చునో అట్టి షరతులును, ఎన్నికదారుల పట్టీలకు లేదా ఎన్ని కలకు సంబంధించిన విచారణలను నడుపుటయును, వివాదములను గురించి తీర్పు చెప్పుటయును చేరి ఈ యాక్టులో స్పష్టముగా నిబం ధింపబడని, ఎన్నికదారుల పట్టీలకు, లేదా, ఎన్నికలకు సంబంధించిన యావత్తు విషయములను గురించి,

(ii) ప్రెసిడెంట్లయొక్క, వైసు ప్రెసిడెంట్లయొక్క మరియు మెంబర్లయొక్క రాజీనామాలను, అట్టి రాజీనామాలు ఏ తేదీలనుండి అమలులోనికి రావలెనో ఆ తేదీలను గురించి,

(iii) మెంబర్లు ప్రెసిడెంటును ప్రశ్న వేయుటను, మీటింగులలో తీర్మానములను ప్రవేశపెట్టుటనుగురించి

(iv) పంచాయతీలయొక్క కమిటీలను ఏర్పరచుటను వాటిలో, బయటి వారిని చేర్చుటను, మరియు అట్టి కమిటీలకు పను లను అప్పజెప్పుటను గురించి,

(v) ఒక పంచాయతీయొక్క ఎట్టి పనినిగాని ప్రెసి డెంటుకు, మెంబరుకు, పంచాయతీయొక్క ఏ ఉద్యోగికైనలేదా కేంద్ర లేక రాజ్య ప్రభుత్వమునకు చెందిన నౌకరుకైన అప్పజెప్పుటనుగురించి

(vi) పంచాయతీయొక్క పైకములను ఉంచుటను, వడ్డీకి వేయుటను, అట్టి నిధులనుండి పైకము ఏవిధముగా తీసుకొనబడ వచ్చునో ఆ విధమును గురించి,

(vii) ఒక పంచాయతీయొక్క మంజూరుచేయబడిన బడ్జెటులో నమూదు చేయబడిన అలాట్మెంటులను (ప్రత్యేకింపబడిన మొత్తములను) ఒక శీర్షికనుండి మరియొక శీర్షికకు మార్చుటను గురించి

(viii) పంచాయతీలు పంపవలసిన జమాఖర్చుల అంచనాలను, రిటరునులను, స్టేటుమెంట్లను, రిపోర్టులను గురించి,

(ix) వర్కులకైన ప్లానులను, అంచనాలను తయారు చేయుటను గురించియు, ఎస్టిమేట్లకు వృత్తి సంబంధమైన లేదా పరి పాలనా సంబంధమైన శాంక్షను ఇచ్చుటకు పంచాయతీలకును, కేంద్ర లేక రాజ్యప్రభుత్వమునకు చెందిన నౌకర్లకును గల అధికారమును గురించియు,

(x) పంచాయతీలు వ్రాసియుంచవలసిన లెక్కలను గురించియును, అట్టి లెక్కలను ఆడిటు (తనిఖీ) చేయుటను ప్రకటించుటను గురించియును, ఏ షరతుల ననుసరించి పన్ను చెల్లించువారు ఆడిటర్ల ఎదుట హాజరై, పుస్తకములను, లెక్కలను తనిఖీచేసి వాటిలో నమూదుచేయబడిన లేదా విడిచిపెట్టబడిన పద్దులను ఆక్షేపించవచ్చునో ఆ షరతులను గురించియును,

(xi) (ఖర్చు) పద్దులను నిరాకరించుటకు, సర్ చార్జి చేయుటకు ఆడిటర్లకు గల అధికారమును గురించి, నిరాకరించిన లేదా సర్ చార్జి వేసిన ఉత్తరువుమీద అపీళ్లను గురించి, మరిన్ని నిరాకరింపబడిన, లేదా సర్ చార్జిచేయబడిన పైకములయొక్క వసూలునుగురించి

(xii) విచారణలను జరుపుటకును సాక్షులను సమ్మను చేసి పరీక్షించుటకును, ఆడిటు, తనిఖీ, పై విచారణకు సంబంధించిన అన్ని దస్తావేజులను ఇతర విషయములను హాజరు పెట్టునట్లు బలవంత పెట్టుటకును, ఆడిటర్లు, తనిఖీచేయు, పై విచారణచేయు ఉద్యోగులకు గల అధికారములను గురించి ,

(xiii) పంచాయతీ ఏ షరతులమీద ఆస్తిని సంపాదించవచ్చునో ఆ షరతులను గురించి, లేదా పంచాయతీ వశమందుండు లేదా దానికి చెందిన ఆస్తి ఏ షరతులమీద విక్రయము, తాకట్టు, గుత్తకిచ్చుట మూలముగా, ఒకదానికి బదులు మరియొకటి మార్చుకోవడము మూలముగా లేదా ఇతర విధముగా పరివర్తన చేయబడవచ్చునో ఆ షరతులను గురించిన్ని ,

(xiv) పంచాయతీలచే లేదా వాటి తరఫున కాంట్రాక్టులు (ఖరారులు) ఏ షరతుల మీద, ఏ పద్ధతి ప్రకారము చేయబడవచ్చునో ఆ షరతులను గురించిన్ని, ఆ పద్ధతిగురించిన్ని ,

(xv) ఈ యాక్టు ననుసరించి పన్నులను విధించుటకు గురించిన్ని అట్టి పన్ను విధింపులను పునర్విమర్శ గురించిన్ని, వాటి మీద అపీళ్ళను గురించిన్ని

(xvi) ఈ యాక్టు ననుసరించి రావలసియుండు ఎట్టి పన్నుకు బదులుగానైన పని, సరకులను బండిలో తీసికొనిపోవుట, లేదా ఇతర విధముగానుండు ఎట్టి సేవనైన అంగీకరించుటను గురించి ,

(XVII) ఈ యాక్టు ననుసరించి లేదా ఏ ఇతర చట్టము నయిన అనుసరించి, లేదా ఎట్టి విధులనైన, ఉపవిధులనైన అనుసరించి ఒక పంచాయతీకి రావలసియుండు ఎట్టి పన్నునుగాని లేదా ఇతర పైకపు మొత్తమునుగాని, చరాస్తిని జప్తుచేసి విక్రయించుట మూలముగానైన, ఒక మేజిస్ట్రేటు యెదుట ఫిర్యాదుచర్య జరిగించుట మూలముగానైన లేదా వ్యాజ్యము మూలముగానైన లేదా ఇతర విధముగానైన రాబట్టుకొనుటను గురించి ,

(XVIII) బండ్లస్థానములు అట్టి వాటిని ఉపయోగించు విషయమున రావలసియుండు రుసుములను, సంబంధముగల బండిని లేదా జంతువును లేదా దాని మీదనుండు బరువులో ఎట్టి భాగము గాని పట్టుకొని విక్రయించుట మూలముగానైన, లేదా ఇతర విధముగానైన రాబట్టుకొనుటను గురించి ,

(XIX) ఈ యాక్టు ననుసరించి ఇయ్యబడిన లేదా జారీచేయబడిన లైసెన్సులయొక్క, అనుమతులయొక్క మరిన్ని నోటీసులయొక్క నమూనాను గురించియును, వాటిలోని విషయములను గురించియును, వాటిని జారీచేయు విధమును లేదా వాటిని అందజేయు పద్ధతిని గురించియును, వాటిని సవరించుటను తాత్కాలికముగా నిలిపియుంచుటను లేదా రద్దుచేయుటను గురించియును ,

(XX) ఏ విషయమును గురించియైన సమాచారమును తెలుపుమని కోరుటకు, సాక్షులను సమ్మనుచేసి పరీక్షించుటకు మరిన్ని దస్తావేజులను హాజరు పెట్టమని నిర్బంధపరచుటకు కార్యనిర్వాహక అధికారుల అధికారములను గురించి ,

(XXI) పంచాయతీలయొక్క కార్యనిర్వాహక అధికారులయొక్కయు, ఉద్యోగులయొక్కయు సంతకముల ముద్రలను ఉపయోగించుటను గురించి ,

(XXII) గవర్నమెంటువారిచే, లేదా వారిచే అధికారమివ్వబడిన ఎట్టిఅధికారవర్గముచేగాని రహస్యమైనదిగా ఏర్పరుపబడిన ఎట్టి విషయమునకైన సంబంధించని పంచాయతీయొక్క ఎట్టి చర్య (ప్రొసీడింగు) యొక్కయైన, లేదా రికార్డు యొక్కయైన నకళ్ళను జనసామాన్యమునకు ఇచ్చుటను గురించియు, అట్టి నకళ్ళను ఇచ్చుటకు విధించవలసిన రుసుములను గురించియు,

(xxiii) ప్రాథమిక పాఠశాలలను, తెరచుటను, పోషించుటను, నిర్వహించుటను, వాటిపై తనిఖీచేయుటను గురించి,

(xxiv) ఎట్టి పబ్లికు ఊటనుగాని, చెఱువునుగాని భావినిగాని, లేదా నీటి ప్రవాహమునుగాని, లేదా ఎట్టి ఖానిగీ ఊటనుగాని, చెఱువునుగాని, భావినిగాని, లేదా నీటి ప్రవాహమును గాని, దాని ఖామందుయొక్క అనుమతితో లేదా అట్టి అనుమతి లేకుండా ఎట్టి నిర్దేశింపబడిన కార్యములకుగాని ఉపయోగించుటను నిషేధించుటను గురించి లేదా క్రమపరచుటను గురించి,

(xxv) పంచాయతీకిని ఖానిగీ ఆవరణల ఖామందుల కును లేదా అనుభవదారులకు మధ్య వాటిలోనుండి చెత్త చెదార మును లేదా మురికిని లేదా ఏవిధమైన చెత్త చెదారమునుగాని లేదా మురికినిగాని తొలగించుటకై చేసికొనబడు కాంట్రాక్టులను క్రమపర చుటను గురించి,

(xxvi) ఖనన, దహన, స్థలములను ఏర్పాటుచేయు టను గురించి, ఖానిగీ దహన ఖనన స్థలములకు లైసెన్సును ఇచ్చు టను గురించి, అట్లు ఏర్పాటు చేయబడిన లేదా లైసెన్సు ఇవ్వ బడిన యావత్తు స్థలముల ఉపయోగమును క్రమపరచుటను గురించి, అట్టి ఏ స్థలములనుగాని మూసివేయుటను గురించి, మరిన్ని అట్టి స్థలములలో లేదా ఇతర అనుమతింపబడిన స్థలములలో తప్ప శవము లను పరిష్కరించుటను, నిషేధించుటను గురించి,

(xxvii) పందులకును, కుక్కలకును లైసెన్సుల నిచ్చుట ను, లైసెన్సుపొందని పందులను, కుక్కలను నాశనముచేయుటనుగురించి,

(xxviii) కట్టడములను కట్టుటను, కట్టడమునకైన నివేశముల ఉపయోగమును క్రమపరచుటను గురించి లేదా నిర్బంధ పరచుటను గురించి,

(xxix) పంచాయతీల వశమందుండు పబ్లికు రోడ్ల నుండి ఏవిధమైన ఆక్రమణలనుగాని తొలగించుటను గురించి, అట్టి రోడ్లను కలిగిన ఎట్టి నష్టమును ఆ నష్టమును కలుగజేయు మనిషిచే లేదా అతని ఖర్చుతో మరమ్మతు చేయుటను గురించి,

(xxx) పంచాయతీల వశమందుండు లేదా వాటికి చెందియుండు పబ్లికు రోడమీదగాని ఇతర ఆ సిమీదగాని 60 వ

సెక్షను లేక 61 వ సెక్షను క్రింద వేటి ఉపయోగము వాటిచే క్రమపరుచబడునో అట్టి పోరంబోకులమీద లేక భూములమీద పెరుగు చెట్లయొక్క ఎట్టి హక్కునుగాని నిర్ణయించుటకును, అట్టి చెట్ల స్వామ్యమును గురించి చేయబడగల ఊహలను గురించి,

(xxxi) పంచాయతీల వశమందుండు లేదా వాటికి చెందియుండు పబ్లికు రోడ్లను లేదా ఇతర భూమిని అధికారములేకుండా ఆక్రమించినందుకుగాను అపరాధమూ‌ను విధించుటను వాటిని రాబట్టుటను గురించిన్ని, అట్టి ఆక్రమణలవలన కలిగిన ఎట్టి నష్టమునగాని నష్టపరిహారమును విధించుటను గురించిన్ని, రాబట్టుటను గురించిన్ని,

(xxxii) ఎట్టి పబ్లికు లేదా ప్రైవేటు మార్కెటు విషయమున లేదా దానిని ఉపయోగించుకొను మనిషి విషయమున పంచాయతీచే లేదా కార్యనిర్వాహక అధికారిచే చెలాయింపబడగల అధికారములను గురించిన్ని, అట్టి అధికారముల ననుసరించి జారీచేయబడిన ఎట్టి వుత్తరువులనైన అమలు జరుపుటను గురించి, మరిన్ని 1933 వ సం॥పు మదరాసు వ్యవసాయమున కనువగు ఫలసాయముల మార్కెట్ల ఆక్టు ననుసరించి ఎట్టి వ్యాపారమున కనువగు పంట విషయములో ప్రకటింపబడిన ఎట్టి విస్తీర్ణము లోపలనైన ఉండు అట్టి ఏ మార్కెటులోగాని అట్టి వ్యాపారమున కనువగు పంటయొక్క విక్రయమును లేదా కొనుగోలును నిషేధించుటను గురించి,

(xxxiii) పశువుల ఖామందులను పంచాయతీచే ఏర్పాటు చేయబడిన పశువుల దొడ్లలో వాటిని నిలిపియుంచునట్లు నిర్బంధపరచుటకును దాని విషయమున విధింపతగిన రుసుములను గురించిన్ని

(xxxiv) గ్రామములోని ఇండ్లు, దొడ్లలోని త్రోపుడు పదార్థమును పరిష్కారము చేయుటను గురించి, నివేశనములను ఏర్పాటు చేయు నిమిత్తమును అట్టి త్రోపుడు పదార్థమును వేయుటకు గోతులను త్రవ్వు నిమిత్తమును పంచాయతీలు భూమిని సంపాదించుటను గురించి అట్టి ఏ నివేశనములనైన గ్రామములోని మనుష్యులకు అప్పగించుటను గురించి చార్జిచేయవలసిన అద్దెతోచేరి ఏ షరతులకు లోబడి అట్లు అప్పగింత చేయవచ్చునో ఆ షరతులను గురించి,

(XXXV) పంచాయతీలకును వాటి కార్య నిర్వాహక అధికారులకును సంబంధించి నంతవరకు గ్రామ ఉద్యోగస్థులు నెర వేర్చవలసిన విధులను గురించి,

(XXXVI) (లైసెన్సులను లేక అనుమతులను ఇచ్చు లేక నిరాకరించు ఉత్తరువులతో చేరి) ఈ యాక్టుక్రింద చేయబడిన ఉత్తరవుల మీాద అపీళ్ళను గురించిన్ని, ఈ యాక్టుచే లేక విధులచే అనుమతింపబడినను సరే, ఇతరవిధముగానైనను సరే, అపీళ్లు దాఖలు చేసుకొనవలసిన కాలమును గురించి,

(XXXVII) జిల్లా బోర్డుకు లేదా పంచాయతీకి చెంది నట్లుగా పబ్లికు రోడ్లను, సంతలను, ఉత్సవములను, సత్రములను, ఔషధ శాలలను, గ్రంధాలయములను తరగతివారిగా విభజన చేయుటకు గురించి,

(XXXVIII) ఈ యాక్టు ననుసరించి, లేదా ఏ ఇతర ఆక్టునైన ననుసరించి విధింపబడిన ఏ పన్నునుండియైన లేక ఆదాయము నుండియైన వచ్చిన పైకములను రాజ్యములోని స్థానిక అధికార వర్గ ములమధ్య పంచుకొనుటకు క్రమపరచుటకు,

(XXXIX) రెండు లేదా అంతకంటె ఎక్కువయైనట్టిన్ని వాటిలో ఒకటి పంచాయతీయై యుండునట్టిన్ని స్థానిక అధికార వర్గ ముల మధ్యకలిగిన వివాదములను తీర్పు చేయుటకొరకు,

(XXXX) ఈయాక్టుకు వ్యతిరేకముగాచేయబడిన నేరము లను ఎట్టి తరిగతి మేజిస్ట్రేటులు విచారణ చేయవలెనో దానిని గురించి,

(XXXXI) ప్రైవేటు మార్కెట్ల ఖామందులు అనుభవ దాహలు, కవులు దారులు, ఉంచవలసిన లెక్కలను గురించియు, అట్టి లెక్కలను ఆడిటు, తనిఖీ చేయుటను గురించియు,

(XXXXII) ఈ యాక్టు ననుసరించి జనసామాన్యమునకు తెలియుటకై ప్రకటింపబడు ఎట్టి ప్రకటనలు, లేదా నోటీసులుగాని ప్రకటింపబడవలసిన విధమును గురించి,

విధులను చేయవచ్చును

## సె. 112 (1) క్రింద చేయబడిన విధులు.

### కోర్టు ఖర్చులు-పంచాయతీల అధికారములు.

(జి ఒ నెం 2707, లోకల్ అడ్మినిస్ట్రేషన్
తేదీ 24-12-1957)

ఏ పంచాయతీయుకూడ, ఒక్క దావా విషయములోగాని, లేక ఒక్క కోర్టు (న్యాయసంబంధమయిన) చర్యలోగాని, మొత్తము రూ 10/- మించినట్టి కాని రూ 100/- మించనట్టి ద్రవ్యమును జిల్లా పంచాయతీ ఆఫీసరు అనుమతిలేకుండగను, రూ. 100/- మించిన మొత్తము సొమ్మును రీజినల్ యినస్పెక్టరు అనుమతి లేకుండగను, వెచ్చించ రాదు.

వివరణము కోర్టు ఆజ్ఞచేగాని, లేక డిక్రీవల్లగాని పంచాయతీ యివ్వవలసిన సొమ్మునకు యిట్టి అనుమతి అవసరమని భావింపరాదు.

సెక్షను 112 (2) (i) క్రింద విధులు 15-73, 79, 91 పేజీలలో నున్నవి.

112 (2) (ii) వ సెక్షను క్రింద విధులు రాజీనామాలు
(జి ఒ నెం 520, ఎల్ ఎ, తేదీ 24-3-1951)

### విధులు

### ప్రెసిడెంట్లు, వైసు-ప్రెసిడెంట్లు సభ్యుల రాజీనామా

ప్రెసిడెంటు, కానట్టి ఏ సభ్యుడైనను మరియు వైసు-ప్రెసిడెంటు, ప్రెసిడెంటుకు వ్రాతమూలకమైన నోటీసునిచ్చి తన వుద్యోగమునకు రాజీనామా యియ్యవచ్చును అట్టి రాజీనామా ప్రెసిడెంటుకు ఏ తేదీ నందునో ఆ తేదీనుండి అమలులోనికి రావలెను

(2) ప్రెసిడెంటు పంచాయతీకి వ్రాతమూలకముగా నోటీసు నిచ్చి తన వుద్యోగమునకు రాజీనామా యియ్యవచ్చును అట్టి రాజీనామా పంచాయితీయొక్క సమావేశములో ఏ తేదీన ఉంచ బడినదో ఆ తేదీనుండి అమలులోనికి రావలెను

112 (2) (iii) వ సెక్షను క్రింద విధులు 112-117 పేజీలలో నున్నవి

112 (2) (iv) వ సెక్షను క్రింద విధులు 253-254 పేజీలలో నున్నవి

112 (2) (v) వ సెక్షనుక్రింద విధులు యిక చేయబడవలెను.

112 (2) (vi) వ సెక్షను క్రింద విధులు 397-400 పేజీలలో నున్నవి
112 (2) (vii) వ సెక్షను క్రింద విధులు 441-449 పేజీలలో నున్నవి
112 (2) (viii) వ సెక్షను క్రింద విధులు యింక చేయబడవలెను
112 (2) (ix) వ సెక్షను క్రింద విధులు పంచాయతీ పనులకు ప్లానులు, ఎస్టిమేట్లు (అంచనాలు) గురించి

(జి ఒ నెం 772, ఎల్ ఎ, తేదీ 13-8-1955)
(జి ఒ నెం 1321, ఎల్ ఎ, తేదీ 26-9-1956)

1 యీ విషయములో యిదివరకు జారీచేయబడిన యుత్తరవుల నధిగమించుచు, (త్రోసివేయుచు), పంచాయతీ పనులయొక్క కొలతలు, చెక్కు-కొలతలు మరియు ఆ పనులకు పరిపాలక, మరియు టెక్నికల్ అనుమతియిచ్చు సమర్థతకల అధికార్లు యీ క్రింద వివరించబడిన రీతిగా నుండవలెను —

(ఈ విధుల శేషమును 539-540 పేజీలలో చూడుము)
(సె 112 (2) యొక్క ఐటములు (x) (xi) (xii), 541 పుటను చూడుము)

సెక్షను 112 (2) (xiii) క్రింది విధులు
ఆస్తిని సంపాదించుట (కొనుట) మరియు పరివర్తనలు చేయుట
(జి ఒ నెం 125 ఎల్ ఎ, తేదీ 22-1-1953)

స్థిరాస్తి సంపాదన.
విదులు

స్థిరాస్తిని సంపాదించుటయు, పరివర్తన చేయుటయు,
స్థిరాస్తిని సంపాదించుట.

1 (1) ఒక పంచాయతీ ఈ క్రింది షరతులు తృప్తియైననే తప్ప ఏ స్థిరాస్తినిగాని సంపాదించకూడదు, అవేవనగా —

(a) రోడ్లు, వంతెన, తూములు, క్వారీలకొరకు కాక ఏ ఇతర కార్యము కొరకైనను ఆస్తి నిర్దేశింపబడిన పక్షమునఅదియే కార్యముకొరకు వుద్దేశింపబడినదో ఆ కార్యమునకై ఆరోగ్య రక్షణ రీత్యా అది తగియున్నదని జిల్లా హెల్తు ఆఫీసరు అంగీకరింపబడవలెను,

[పుట 541 త్రిప్పుము]

| పనుల యొక్క విలువ | ఎస్టిమేట్లను (అంచనాలను) తయారుచేయు వారు | ఎస్టిమేట్లను పాలక అనుమతి నిచ్చువారు | టెక్నికల్ అనుమతి నిచ్చువారు | ప్రతిబిల్లు ననుసరించి పనియొక్క మొత్తము విలువ | కొలుచు అధికారి | చెక్కు - కొలత చేయు అధికారి. |
|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
| రూ 500 కు మించని ఎస్టిమేట్లు | పంచాయతీ ఎగ్జిక్యూటివు అధికారి | పంచాయతీ | పంచాయతీ | రూ. 500 | పంచాయతీ ఎగ్జిక్యూటివు అధికారి | పంచాయతీ ఓవరుసీరు |
| రూ 500 మించిన, కాని రూ 2,000కు మించని ఎస్టిమేట్లు. | పంచాయతీ ఓవరుశీరు | డిటో | పంచాయతీ ఓవరుసీరు | రూ. 500 కు మించినట్టి, కాని, రూ 2000 లోపున నున్న | పంచాయతీ ఓవరుసీరు | పంచాయతీ సూపరువైజరు |

కాని, రూ 1,500 కు మించని విలువగల రోడ్ల మరమ్మత్తులు, వంతెనలను, యిండ్లను, (తూములు) చిన్నవంతెనలను, మరమ్మత్తులను, మరియు, రూ 750 కు మించని విలువగల వంతెనలు, చిన్న వంతెనలు, (తూములు) మొదలగు అసలు పనులను, మరియు సిమ్మెంటు-కాంక్రీటు పనులను, రోడ్లు తారువేయుటను, జిల్లా పంచాయతీ ఆఫీసరు

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
|---|---|---|---|---|---|---|
| రూ 2,000 మించిన కాని రు 10,000కు మించని ఎస్టిమేట్లకు | పంచాయతీ సూపరు వైజరు. | జిల్లా పంచాయతీ ఆఫీసరు | అసిస్టెంటు ఇంజనీరు | రు 5,000 మించిన రు 10,000 లోపున | పంచాయతీ ఓవరుసీరు | అసిస్టెంటు యింజనీరు |
| రు 10 000 కు మించిన ఎస్టిమేట్లు | అసిస్టెంటు యింజనీరు | రీజినలు యిన్ స్పెక్టరు | డివిజనలు ఇంజనీరు | రు 10,000 కు మించిన | పంచాయతీ సూపర్ వైజర్ | అసిస్టెంటు యింజనీరు |

షరా —(1) I వ తరగతి, II వ తరగతి పంచాయతీల మధ్య భేదమునుంచ నవసరములేదు

(ii) అసలు (Original) లేక మరమ్మతు పనుల మధ్య భేదమునుంచ నవసరములేదు

2 అన్ని డివిజనులలోను, ఒక సంవత్సరములో డివిజనలు యింజనీరు 30 పనులకు తక్కువకాకుండ టెస్టు-చెక్కు చేయవలెను ఆ పనికి నిర్ణయింపబడిన తగిన అధికారి ఏ పనినయిన చెక్కు కొలతచేసియున్నపుడు, అతనిపై అధికారి, పని జరుగుచున్నపుడుగాని, పని పూర్తి అయిన పిమ్మటగాని, ఎప్పుడయిన అతనికి అవసరమని తోచిన యెడల, దానిపై మరల చెక్కు-కొలత చేయవచ్చును

సెక్షను 112 (2) (x) క్రింద విధులు 436-437 పేజీలలో నున్నవి

సెక్షను 112 (2) (xi) మరియు (xii) క్రింద విధులు 454-459 పేజీలలో నున్నవి

(b) అంచనా వేయబడిన ఖర్చు రూ 1,000 లను మించిన సందర్భములలో ఆస్తి ఏ కార్యముకొరకు ఉద్దేశింపబడినదో ఆ కార్యమునకు అది తగియున్నదని డివిజనల్ ఇంజనిరు (హైవేస్) యొక్క అనుమతిని పొందవలెను

(c) ఆ ఆస్తియొక్క విలువ రు 1,000 లను మించిన పక్షమును అది విద్యా సంబంధమైన కార్యములకొరకు ఉద్దేశింపబడిన పక్షమునను జిల్లా ఎడ్యుకేషనల్ ఆఫీసరుయొక్క అనుమతిని కూడ పొందవలెను

(d) సదరు ఆస్తి విలువ రు 1,000 లను మించిన ఆస్పత్రులు డిస్పెన్సరీల కొరకు ఉద్దేశింపబడిన పక్షమున దానివి జిల్లా మెడికల్ ఆఫీసరుకూడ అంగీకరించవలెను.

(e) ఆస్తిని సంపాదించుటకు కలెక్టరుయొక్క అనుమతిని ముందుగా పొందిననేతప్ప, 1894 వ సం॥పు భూ సంపాదన ఆక్టు ననుసరించి తప్ప ఇతర విధముగా అది సంపాదింపబడకూడదు

(f) 1894 వ సం॥పు భూసంపాదన ఆక్టు క్రింద కాక ఇతర విధముగా సంపాదింపబడిన భూముల సందర్భములో రెవిన్యూ డిపార్టుమెంటు నుండి దానియొక్క కిమ్మతును తెలిసికొనవలెను. అట్టి కిమ్మతుకంటె ఎక్కువ మొత్తమును, ఆ విషయమున కలెక్టరుయొక్క నిర్దిష్టమైన అంగీకారమును పొందకుండా చెల్లించకూడదు,

(g) కట్టడముల సందర్భములో విలువను కట్టడము దృఢముగా నున్నదని ఒక సర్టిఫికేటును డివిజనల్ ఇంజనీర్ (హైవేస్) లేక డివిజనల్ ఇంజనీర్ యొక్క ఉత్తరవు క్రింద వ్యవహరించు అసిస్టెంటు ఇంజనీర్ (హైవేస్) నుండి పొందవలెను, అట్టి విలువకు మించిన ఏ మొత్తమునుగాని ఆ విషయమున కలెక్టరుయొక్క నిర్దిష్టమైన అనుమతిని పొందక చెల్లించకూడదు, మరి

(h) ఆస్తి ప్రతిఫలము రూ 200 ల కంటె తక్కువ కాని ప్రతి సందర్భములో అట్టి ఆస్తి విషయముల రిజిస్ట్రేషన్ ఆఫీసు నుండి ఒక ఎంకంబ్రన్సు సర్టిఫికేటును పొందవలెను, మరియు సదరు లావాదేవి స్వభావము చట్టమువలన ఎట్టి ఎంకంబ్రెన్సుగాని లేకయే

ఆస్తి వచ్చు సందర్భములో తప్ప పంచాయతీయొక్క న్యాయసంబంధమైన సలహాదారుచే అది పరీక్షింపబడవలెను

(2) పంచాయతీకి ఆస్తిని పరివర్తనచేయు దస్తావేజు ఈ విధులకు జతచేయబడిన 1 వ (అనుచూచి షెడ్యూలు) లోని సరియైన నమూనాలో పరిస్థితులు కోరగల మార్పులతో నుండవలెను, మరియు

(3) పంచాయతీ పొందిన ఒక డిక్రీని అమలు జరుపుటలో విక్రయమునకు కొనిరాబడిన స్థిరాస్తిని పంచాయతీ కొనవలసిన విషయములో (1) వ (2) వ ఉపవిధులయొక్క నిబంధనలు వర్తించకూడదు.

## స్థిరాస్తియొక్క పరివర్తన

2 పంచాయతీ వశమందుండియు దానికి చెందిన స్థిరాస్తిని గుత్త కిచ్చుట మూలముగా కాక ఇతర విధమైన పరివర్తనలు—

(1) పంచాయతీ వశమందుండినప్పటికిని దానికి చెందని స్థిరాస్తి, అట్టి ఆస్తి ఏ షరతులకు లోబడి పంచాయతీ వశమందుండబడినదో ఆ షరతులకు వ్యతిరేకముగా పరివర్తన చేయబడకూడదు బాకీ వసూలుచేయుటకు హక్కు కలుగజేయబడకూడదు

(2) పరివర్తనచేయు దస్తావేజు ఈ విధులకు జతచేయబడిన రెండవ అనుసూచిలోని సరియైన నమూనాయందు పరిస్థితులు కోరగల మార్పులతో ఉండవలెను

3 ఒక పంచాయతికి చెందిన స్థిరాస్తిని గుత్త కిచ్చుట ద్వారా కాకుండ ఇతర విధముగా పరివర్తన జేయుట —(1) ఒక పంచాయతీ కలెక్టరుయొక్క అంగీకారమును ముందుగా పొందక దానికి చెందిన ఏ స్థిరాస్తినిగాని గుత్త రూపముగా తప్ప ఏ విధముగానైన పరివర్తన చేయకూడదు లేక మంజూరు చేయకూడదు, లేక అట్టి ఏ ఆస్తి మీదనైన బాకీ వసూలుచేయుటకు హక్కును కలుగజేయకూడదు లేక అట్లు కలుగజేయుటను మంజూరుచేయకూడదు అట్లు పరివర్తన చేసిన ఆస్తియొక్క విలువ లేక బాకీ వసూలుచేయుటకు,

కలుగజేయబడిన హక్కు మొత్తము పదివేల రూపాయలను మించని పక్షమున సదరు వ్యవహారమునకు ప్రభుత్వాను వారి అంగీకారమును కూడ ముందుగా పొందవలెను

(2) పరివర్తన చేయుటకైన దస్తావేజు పరిస్థితులు కోర గల విధముగ మార్పులతో ఈ విధులకు అనుబంధముగా చేర్చబడిన రెండవ అనుసూచిలోని తగిన నమూనాలో నుండవలెను

4 పంచాయతీకి చెందిన స్థిరాస్తిని గుత్తమూలముగా పరివర్తన జేయుట—(1) ఒక పంచాయతీ దానికి చెందిన ఏ స్థిరాస్తిని గాని గుత్తకీయవచ్చును

అయితే అట్టి ఏ గుత్తగాని, గుత్త కాలపరిమితి 3 సం॥లను మించు సందర్భములో లేక తాపీపని, ఇటుకలు, కలప, మట్టి లేక ఏ ఇతర పదార్థముతోనైన ఏదైన కట్టడము లేక నిర్మాణము చేయుటకు, దానికొరకు ఇన్‌స్పెక్టరుయొక్క అంగీకారమును పొందిననేతప్ప, గుత్తదారునకు అనుమతి నీయబడిన విషయమున, చెల్లగూడదు.

(2) గుత్త దస్తావేజు సందర్భానుసారముగ అవసరమైన మార్పులతో ఈ విధులకు జత చేయబడిన 3 వ అనుసూచిలోని III (a) నమూనాలో నుండవలెను

5 పంచాయతీ వశమందుండినప్పటికినీ దానికి చెందని స్థిరాస్తిని గుత్తద్వారా పరివర్తనచేయుట—(1) రోడ్డు పార్శ్వములు మరియు వీధి అంచులు కానట్టి ఇతర పంచాయతీ వశమందుండియు దానికి చెందని ఏ ఆస్తినైన అది గుత్తకీయవచ్చును

అయితే అట్టి ఏ గుత్తనుగాని—

(a) ఏ షరతులకు లోబడి అట్టి ఆస్తి పంచాయతీ వశము లోనికి వచ్చినదో దానికి విరుద్ధముగా, లేక

(b) ఇన్‌స్పెక్టరుయొక్క అనుమతిని ముందుగా పొందక 12 నెలలకు మించిన ఒక కాలపరిమితికి,

ఈయకూడదు

ఇంతేకాకుండ తాపీ పని, ఇటుకలు, కలప, మట్టిలేక ఏ యితర పదార్థముతోనైన ఏదైన కట్టడము లేక నిర్మాణమును కట్టుటకు,

దాని నిమిత్తము ఇన్‌స్పెక్టరుయొక్క అంగీకారమును ముందుగా పొందిననేతప్ప, గుత్తదారుకు అంగీకారము ఈయబడిన పక్షమున అట్టి ఏ గుత్తగాని చెల్లకూడదు

(2) గుత్తదస్తావేజు సందర్భానుసారముగా అవసరమైన మార్పులతో ఈ విధులకు జతచేయబడిన 3 వ అనుసూచిలోని III (a) నమూనాలో నుండవలెను

6 (1) రోడ్డు పార్శ్వములను, వీధి అంచులను గుత్తకిచ్చుట-పంచాయతీ వశమందుండు రోడ్డు పార్శ్వములను వీధి అంచులకు. ఈ క్రింది నిర్బంధములకును, పై అధికారమునకును లోబడి గుత్తకీయ బడవలెను —

(i) గుత్తకొరకు పెట్టుకొనబడు ప్రతి దరఖాస్తు ఆ భూమి దేనికొరకు ఉపయోగింపబడునని, ఏ కాలపరిమితి వరకు గుత్తకు కోరబడుచున్నదను సమాచారమును తెలుపవలసినదిగా ప్రతి పంచాయతీ కోరవలెను దానిలో ఎట్టి కట్టడమునైన నిర్మించుటకు ఉద్దేశింపబడిన పక్షమున నిర్మాణములో ఉపయోగింపబడు పదార్థములను గురించి సమాచారములనుకూడ తెలుపవలెను

(ii) తాటాకులు లేక కొబ్బరి ఆకులు, వెదుళ్ళు లేక ఇతర చాపలు లేక గోనెలు లేక అదేవిధమైన ఇతర పదార్థములు లేక ప్రతిదినము ఒక చోటనుండి మరియొక చోటకు కొనిపోవుటకు వీలుగల స్వభావముగు కలిగిన పదార్థములవంటి తాత్కాలిక స్వభావముగల పదార్థములతో ఆ నిర్మాణము కట్టుటకు ఉద్దేశింపబడిన పక్షమునను, గుత్తయొక్క కాలపరిమితి 12 నెలలను మించని పక్షమునను పంచాయతీ గుత్త కీయవచ్చును ప్రతి గుత్తకు రుసుమును ముందుగా విధించి, వసూలు చేయవలెను

(iii) (ii) వ పద్దులో చెప్పబడిన పదార్థములు కాని ఇతర పదార్థములతో నిర్మాణమును కట్టుటకు లేక 12 నెలలకు మించిన కాలపరిమితికి, కలెక్టరుయొక్క పూర్వానుమతితో తప్ప, పంచాయతీ ఎట్టి గుత్తనుగాని జారీచేయకూడదు అట్లు అంగికారము నిచ్చుటలో కలెక్టరు పంచాయతీ ఏ షరతుల ననుసరించి

గుత్తను జారీ చేయవచ్చునో అట్టి ఆయన అవసరమని తలంచగల షరతులను విధించవచ్చును గుత్తను జారీచేయుటకు పూర్వము పంచాయతీ దానిలో అట్టి షరతులను పొందుపరచవలెను గుత్త అమలులో నుండునంతవరకు గుత్త మొత్తము పంచాతీకి ముందుగా చెల్లింపబడవలెననియు, అట్టి మొత్తమును చెల్లించుటకు తప్పిపోయినయెడల గుత్త రద్దుచేయబడ తగియుండవలెననియు ప్రతి సందర్భములోను స్పష్టముగా నిబంధింపబడవలెను

(IV) ఒకే సమయమందు 3 సం॥లకు మించిన కాల పరిమితికి ఎట్టి గుత్తనుగాని సాధారణముగా జారీ చేయకూడదు ఈ విధుల ననుసరించి జారీ చేయబడిన గుత్తను పునరుద్ధరించుటకు కలెక్టరుయొక్క అనుమతి అవసరములేదు

(V) (II) లేక (III) పద్దుక్రింద ప్రతి గుత్త, పంచాయతీ లేక కలెక్టరుయొక్క అభిప్రాయములో జన సామాన్యము యొక్క లాభముకొరకు, నేలమీద కట్టబడిన ఏ నిర్మాణమునైన తొలగించుట అవసరమైన పక్షమున గుత్తదారునకు నష్టపరిహార మును చెల్లించకయే గుత్తయొక్క కాలపరిమితిలోపల ఏ కాలమందైనను గుత్త అంతమొందింపబడ తగియుండవలెనని స్పష్టముగా నిబంధించవలెను

(VI) ఎట్టి రోడ్డు అంచునుగాని వ్యవసాయము చేయుటకు గుత్తకీయకూడదు

(2) గుత్త దస్తావేజు సందర్భాను సారముగా అవసరమైన మార్పులతో ఈ విధులకు అనుబంధముగా చేర్చబడిన 3 వ అనుసూచిలోని III (b) నమూనాలో నుండవలెను

7. చేయ నుద్దేశించిన పరివర్తనలు, గుత్తలను గురించి ప్రకటించుట —(1) 3, 4, 5 లేక 6 వ విధిక్రిందికి వచ్చు పరివర్తన లేక గుత్తయొక్క ప్రతి సందర్భములో పరివర్తన చేయబడు లేక గుత్తకీయబడు ఆస్తియొక్క పూర్తివివరములను, పరివర్తనపొందుట కుద్దేశించిన మనిషి లేక గుత్త తీసికొనుటకు ఉద్దేశించిన మనిషి యొక్క పేరు, పరివర్తనకైన ప్రతిఫలము లేక గుత్తక్రింద ప్రత్యేకింపబడిన అద్దెయొక్క వివరములను తెలుపుచు—

(a) పరివర్తన కొఱకైన ప్రతిఫలము రూ 1,000 లను మించునెడల లేక గుత్తక్రింద ప్రత్యేకించబడిన అద్దె సంవత్సరము నకు రూ 200 లను మించునెడల జిల్లా గెజెటులో, మరియు

(b) (1) పంచాయతీ, కలెక్టరు లేక రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుయొక్క ఆఫీసులో,

(ii) తాలూకా ఆఫీసులో,

(iii) ఆస్తియుండు గ్రామముయొక్క గ్రామచావడిలో

(iv) పరివర్తన చేయబోవు లేక గుత్తకియ్యబోవు ఆస్తిమీద,

ప్రాముఖ్యమైన స్థానములో అతికించుటద్వారా,

పంచాయతీ, చేయ నుద్దేశించిన పరివర్తన లేక గుత్తయొక్క నోటీసును ప్రకటించవలెను

(2) అట్టి పరివర్తన లేక గుత్త బహిరంగ వేలముద్వారా జరుగు ప్రతి సందర్భములో, పరివర్తన చేయబడు లేక గుత్త కియ్య బడు ఆస్తియొక్క పూర్తివివరములతో కూడిన ఒక నోటీసు—

(a) పరివర్తనకైన ప్రతిఫలము రూ 1,000 లను మించు నెడల లేక గుత్తకై ప్రత్యేకింపబడిన అద్దె సంవత్సర మొకటికి రూ 200 లను మించునెడల, జిల్లా గెజెటులోను, పంచాయతీ విచారణాధికార ప్రదేశములోపల ప్రచారముగల ప్రాముఖ్యమైన స్థానిక దినపత్రికలు ఒకటి లేక రెండింటిలో,

(b) (1) వ ఉపవిధియొక్క (b) క్లాజులో నిర్దేశింపబడిన విధముగా, మరియు

(c) తగిన స్థలములలో దండోరావేయుట మూలముగా ప్రకటించబడవలెను,

(3) మొదట గుత్తతీసుకొన్న మనిషి, అతని గుత్త షర తులను నెరవేర్చుటకు తప్పిపోవుటవలన ఆర్థిక సంవత్సరము జరుగు చున్నపుడు జారీచేయబడిన గుత్తల సందర్భములో (1) మరియు (2) ఉపవిధులవలన కోరబడినట్లు జిల్లా గెజెటులో పంచాయతీ ప్రకటించ నవసరములేదు.

8 పరివర్తన పొందిన మనిషి లేక గుత్తకు తీసుకొన్న మనిషి ప్రభుత్వమునకు పన్ను, నేలఅద్దె, పేష్కష్ లేక క్విట్ రెంటును చెల్లించవలెనను షరతుకు పరివర్తనలును, గుత్తలును లోబడి యుండుట —

(1) ఈ విధియొక్క (3), (4) వ ఉపవిధుల క్రిందికివచ్చు సందర్భములలో తప్ప, ఆస్తిసందర్భములో కలెక్టరు చెల్లించవలసి నదిగా నిర్ణయించగల పన్ను, నేలఅద్దె, పేష్కష్ లేక క్విట్ రెంటును పరివర్తన పొందిన మనిషి లేక అద్దెకు పుచ్చుకొన్న మనిషి ప్రభుత్వమునకు చెల్లించ బాధ్యుడుగా నుండవలెనుట, మరియు విడుదల చేయబడిన ఇనాం భూములమీది క్విట్ రెంటు సందర్భములోను, ప్రైవేటు ఏర్పాటుద్వారా పంచాయతీ సంపాదించిన ప్రొప్రైటరీ గ్రామములలోని భూములమీద పేష్కష్ సందర్భములోను తప్ప, అప్పుడప్పుడు తత్కాలమందు అమలులోనున్న విధుల ప్రకారము చేయబడు మార్పుకు సదరు పన్ను నేలఅద్దె, పేష్కష్ లేక క్విట్ రెంటు లోబడి యుండవలెనుట దానియొక్క ఒక షరతుగా నుండి ననేతప్ప, పంచాయతీచేసిన ఏ స్థిరాస్తియొక్కయైన ఎట్టి పరివర్తన లేక గుత్తగాని చెల్లకూడదు

(2) ఈ విధిలోనున్నదేదియు, విక్రయము లేక మార్చుకొనుటవలన, పరివర్తన చేయబడని లేక ఇతరవిధముగ శాశ్వతముగా అన్యాక్రాంతము చేయబడని భూములమీద విధింపబడగల పన్ను, నేలఅద్దె, పేష్కష్ లేక క్విట్ రెంటును పంచాయతీనుండి రాబట్టుటకు ప్రభుత్వముయొక్క అధికారమును బాధించకూడదు

(3) పరివర్తన చేయబడిన తర్వాత భూమిమీద విధింపబడగల పన్ను, నేలఅద్దె, పేష్కష్ లేక క్విట్ రెంటును, పంచాయతీ అదివరకే చెల్లించుచుండిన నేల విక్రయమువలనగాని, మార్చుకొనుట వలనగాని పరివర్తనచేయబడని సందర్భములో, శాశ్వతముగా గుత్త కివ్వబడని లేక ఇతర విధముగా శాశ్వతముగా అన్యాక్రాంతముచేయ బడని సందర్భములలో, పంచాయతీ అట్టి పన్ను, నేలఅద్దె, పేష్కష్ లేక క్విట్ రెంటును చెల్లించుచునే యుండవలెను ఆ బాధ్యతను, పరివర్తన పొందిన మనిషిమీద విధించకూడదు.

(4) 6 వ విధి క్రిందికి వచ్చు గుత్తల సందర్భములో పంచాయతీ, అట్టి గుత్తలయొక్క రిటరనును కలెక్టరుకు పంపవలెను. అందుమీదట కలెక్టరు, రిటరనులోని సమాచారములను ఆధారముగా చేసికొని పన్నులేక నేల అద్దెను నిర్ణయించి, దానిని పంచాయతీనుండి వసూలుచేయును

## 1 వ అనుసూచి

[1 (2) వ విధిని చూడుడు ]

### I (a) నమూనా

### విక్రయము మూలమున పరివర్తనలు

ఒక వైపున (ఇందు నిటు తర్వాత "విక్రయదారు" అని చెప్పబడు, ఈ మాటలో సందర్భానుసారముగా అతని వారసులు, ఎక్జిక్యూటరులు, అడ్మినిస్ట్రేటర్లు, చట్ట సంబంధమైన ప్రతినిధులు చేరుదురు)
లో కాపురముండు కుమారుడైన

కును మరియొక వైపున (ఇందు నిటు తర్వాత "కొనుగోలుదారు" అని చెప్పబడు, ఈ మాటలలో సందర్భానుసారము గా దాని వారసులును, అసైనులును చేరుదురు) 1950 వ సం॥పు 10 వ మదరాసు ఆక్టు క్రింద ఏర్పాటుచేయబడిన పంచాయతీకని మధ్య,
19 వ సం॥ దినమున చేసికొనబడిన ఒడంబడిక

విక్రయదారు ఇందుకు జతచేయబడిన అనుసూచిలో వివరింపబడిన భూమి, ఆవరణ విషయమున బాగుగాను మరియు చాలినంత హక్కును కలిగియున్నందునను,

సదరు భూమి, ఆవరణ సందర్భములో చెల్లింపగల క్విట్ రెంటు (ఏదైననున్న) కు లోబడి, అయితే యితర విధముగ అప్పావగైరా చిక్కులు లేనట్టియు ఇందుమూలమున జారీచేయబడుటకు, ఇతరుల పరముచేయుటకు మరియు అసైనుచేయుటకు ఉద్దేశింపబడిన సదరు భూమి ఆవరణను రూ ల ధర చొప్పున, కొనుటకు, కొనుగోలుదారు, దాని అధికారములను చెలాయించుచు విక్రయదారులో ఒడంబడిక చేసికొన్నందునను,

ఇప్పుడు ఈ ఒడంబడిక ఈ క్రింది విషయములకు సాక్షీభూతముగా నున్నది —సదరు ఒడంబడిక ననుసరించియు, ఈ దస్తావేజు వ్రాసిన మీదటగాని అంతకు పూర్వముగాని కొనుగోలుదారు విక్రయదారునికి చెల్లించిన రూ                    ల మొత్తము ప్రతిఫలముగా (సదరు మొత్తము అందినట్లు విక్రయదారు ఇందుమూలముగా ఒప్పుకొనుచున్నాడు ) విక్రయదారు కొనుగోలుదారునికి                    లో నుండునట్టియు క్రింద వ్రాయబడియుండు అనుసూచిలో ఎక్కువ వివరణములతో వివరింపబడియుండినట్టియు భూఖండము లేక భాగము సంతయు,                    అని సాధారణముగా పిలువబడు లేక చెప్పబడు దానిమీద కట్టబడియుండు కాపురముండెడిస్థానము లేక బాడుగ ఇంటితో సహా, సదరు భూఖండము లేక భాగమునకు కాపురముండెడి ఇంటికి మరియు ఆవరణకు వాటిలో దేనికైనను లేక ఏ విధముగానైన చెందిన లేక ఇంతకు పూర్వము ఆక్రమింపబడిన లేక దానితో అనుభవింపబడుచుండిన అన్ని కట్టడములు, గిడ్డంగులు, చెట్లు బంజరు భూములు, కంచెలు, పల్లములు, వెలుగులు, త్రోవలు, వసరులు, నీటి కాలువలు, స్వాతంత్రములు, విశేష హక్కులు, సదుపాయపు హక్కులు, అనుకూలములు, ఉపకరణము లేవియున్నను, వాటితో సహా, మరియు ఆ యావరణలో విక్రయదారుకు సదరు ఆవరణలో మరియు మీదగల యావత్తు ఎస్టేటు అధికారముకైటిలు, బాధ్యత, ఆస్తి, హక్కుడిమాండు ఏదిగాని కొనుగోలుదారునికి ఇందు మూలముగా ఇచ్చుచున్నాడు, అతని పరము చేయుచున్నాడు, మరియు అప్పగించుచున్నాడు కొనుగోలుదారునికి ఇందుమూలముగా ఇయ్యబడిన, అతని పరము చేయబడిన లేక అప్పగించబడిన సదరు భూభాగము లేక ఖండము, కాపురముండెడి ఇల్లు మరియు ఆవరణను ఎల్లప్పుడు కలిగియుండి, ఉంచుకొనవలెను మరియు పైనచెప్పిన విధముగా కనుగోలుదారునికి ఇందుమూలముగా యియ్యబడిన, అతని పరము చేయబడిన లేక అప్పగించబడిన ఆవరణను ఇచ్చుటకు ఒకరి పరము చేయుటకు అస్సైనుచేయుటకు విక్రయదారైన అతనికి ఇప్పుడు మంచి అధికారముగలదనియు, మరియు కనుగోలుదారు ఇకమీదట ఎల్లప్పుడు సదరు ఆవరణను ఎట్టి అప్పు వగైరా చిక్కులేవిగాని లేకుండా శాంతి

యుతముగాను నెమ్మదిగాను స్వాధీనములో నుంచుకొని, అనుభవించ వలెను మరియు వచ్చుననియు, మరియు విక్రయదారునివలనగాని ఏ యితర మనిషి లేక మనుష్యులవలనగాని ఏ విధముగానైన చట్ట సమ్మతముగా వెడలగొట్టుట, అడ్డు ఆటంకము కలుగజేయుట, హక్కును కోరుట, డిమాండుచేయుట లేకుండ దానియొక్క అద్దెలను లాభములను పుచ్చుకొనవలెను మరియు వచ్చుననియు, ఇంతే కాకుండ విక్రయదారైన ఆ వ్యక్తియు, సదరు ఆవరణలోగాని, వాటిలో దేనియందుగాని విక్రయదారుని కొరకైన ట్రస్టునుండి, ట్రస్టు ననుసరించి లేక ట్రస్టులో లేక అతని పూర్వీకులలో ఎవరినుండి యైన లేక ఎవరి క్రిందనైన దానియొక్క ఏ భాగములోగాని ఏ స్టేటు నైన లేక హక్కునైన కలిగిన లేక చట్ట సమ్మతముగా లేక ధర్మ ముగా హక్కునుకోరు యావన్మంది మనుష్యులును, ఇకమీదట అప్పు డప్పుడు మరియు అన్ని సమయములందు కొనుగోలుదారు కోరిన మీదటను, అతని ఖర్చుతోను, న్యాయముగా కోరిన లేక కోరగల విధమున సదరు ఆవరణ మరియు దాని ప్రతిభాగము విషయమున కొనుగోలుదారునికి అదనముగాను పరిపూర్ణముగాను నమ్మకము కలి గించుటకు అట్టి యావత్తు పనులను, పత్రములను మరియు ఏ కార్య మునుగాని చేయవలెను, వ్రాయవలెను మరియు రిజిష్టరు చేయవలెను లేక చేయించవలెను, వ్రాయించవలెను మరియు రిజిష్టరు చేయించ వలెను ఇట్లు విక్రయదారు కొనుగోలుదారునితో ఇందుమూలముగా ఒడంబడిక చేసికొనుచున్నాడు

ఇందుకు సాక్షీభూతముగా విక్రయదారు, మొదట పైన వ్రాయబడిన దినమునను సంవత్సరమునను దీనిలో సంతకముచేసి సిలు వేయుచున్నాడు

పైన తెలుపబడిన షెడ్యూలు

రిజిస్ట్రేషను జిల్లాలో రిజిస్ట్రేషను సబు జిల్లా గ్రామములో నున్నట్టియు, ఉత్తరమున దక్షిణమున తూర్పున పడమట ఎల్లలుగా కలిగినట్టియు,

రీ సర్వే నెం          రును          ప్రాత సర్వే నెంబరును కల్గినట్టియు,
మొత్తముమీద కొలతలను (ఇది కొంత ఎక్కువగా నున్ననుసరే
తక్కువగా నున్నను సరే) కలిగిన భూమియొక్క యావత్తు భూఖం
డము లేక భాగము మరియు ఆవరణ

పైన పేర్కొనబడిన వారివలన ఈ క్రింది వ్యక్తుల సమక్షమున
సంతకము వేయబడి, సీలువేయబడి అప్పగించడమైనది.

I (b) నమూనా

కౌలు మూలమున పరివర్తనలు.

ఒక వైపున (ఇందు నిటుతర్వాత "కౌలు ఇచ్చు మనిషి"
అని చెప్పబడు ఈ మాటలలో సందర్భానుసారముగా అతని వార
సులు, ఎగ్జిక్యూటర్లు, అడ్మినిస్ట్రేటర్లు, చట్ట సంబంధమైన ప్రతినిధులు
మరియు అస్సైనులు చేరుదురు)          లో కాపురముండునట్టిన్ని
          లో వ్యాపారము చేయునట్టిన్ని          కును
మరియొకవైపున (ఇందునిటుతర్వాత "కౌలుదారు" అని చెప్పబడు,
ఈ మాటలో సందర్భానుసారముగా వుద్యోగమునందు వెనుక వచ్చు
వారును, అస్సైనులును చేరుదురు) 1950 వ సం॥పు 10 వ మదరాసు
ఆక్టు క్రింద ఏర్పాటు చేయబడిన          పంచాయతుకును మధ్య 19
వ సం॥          తేదీన చేయబడిన ఒడంబడిక
ఈ క్రింది విషయములకు సాక్షీభూతముగా నున్నది —

1. ఇందుమూలముగా ప్రత్యేకించబడిన అద్దె కారణముగాను,
ఇందులోనున్న కౌలుదారు చేసిన ఒడంబడికల కారణముగాను,
సర్వే నెంబరును కలిగిన          రిజిస్ట్రేషను జిల్లాలోను
          రిజిస్ట్రేషను సబు జిల్లాలోను ఉన్న
ఇందుకు జతచేయబడిన షెడ్యూలులో ఎక్కువ వివరముతో
వివరింపబడినట్టియు, అని చెప్పబడు కట్టడము, ఆవరణతో సహా
భూభాగము లేక ఖండమునంతయు, 19 వ సం॥          తేదీ
నుండి          సంవత్సరముల కాలపరిమితివరకు, కౌలుకిచ్చు
మనిషి, కౌలుదారునకు ఇచ్చుచున్నాడు అందునిమిత్తము అన్ని
తగ్గింపులు పోయి రూ          ల మాసవారీ అద్దెను

ముందుగా చెల్లించవలెను. అట్టి చెల్లుబడులలో మొదటిది 19 వ సం॥ తేదీన చేయబడవలెను

2 కౌలుదారు కౌలుకిచ్చు మనిషితో ఈ క్రిందివిధముగ ఒడంబడిక చేసికొనుచున్నాడు —

(1) ప్రత్యేకించబడిన అద్దెను ప్రతి నెల మొదటితేదీన లేక అంతకు పూర్వము, ముందుగాను, పైనచెప్పిన విధముగాను చెల్లించవలెను

(2) సదరు ఆవరణ సందర్భములో చెల్లింపును భరించవలెను మరియు ప్రస్తుతపు, ఇకమీద ఏర్పడగల పన్నులు, ఖర్చులు, అసెస్‌మెంటులు, వ్యయములన్నింటిని చెల్లించవలెను.

(3) కౌలు కియ్యబడిన ఆవరణయొక్క లోపలి, వెలుపలి భాగములను, దానికి చేర్చబడిన అన్నిభాగములు, ప్రహరీగోడ, దానికి చెందిన కంచెలు, కాలువలు, నేల ఇతర గొట్టములు, ఆరోగ్యరక్షణ సంబంధమైన, మరియు నీటి పరికరములు, విద్యుచ్ఛక్తి అమర్పులు, అందలి ఇతర అమర్పులను మంచిస్థితిలోను, అద్దెకియ్యబడుటకు తగిన విధముగా మరమ్మతుచేసి ఉంచవలెను

(4) కౌలుకిచ్చు మనిషియొక్క లిఖిత పూర్వకమైన అనుమతిని ముందుగా పొందకుండ, కౌలుకీయబడిన కట్టడములకు, ఏపరిస్థితులలోనైన ఎట్టిమార్పులుగానిచేర్పులుగానిచేయకూడదు లేక చేయుటను అనుమతించకూడదు అయితే ఎల్లప్పుడు కౌలుదారు, ఏ మార్పులనైన చేసినట్లు కౌలుదారునికిఅనుమతి నిచ్చినయెడల దానికై ఎట్టి నష్టపరిహారమునైన పొందుటకు హక్కుకలిగి యుండకూడదు

(5) కౌలు కియ్యబడిన ఆవరణలో ప్రవేశించి దాని పరిస్థితిని తనిఖీచేయుటకు ఒకదినమునకు పూర్వము నోటీసు నిచ్చినమీదట, పనివారితో లేక ఇతరులతో గాని పనివారు లేక ఇతరులు లేకుండగాని కౌలు ఇచ్చుమనిషిని న్యాయమైన అన్ని సమయములందు అనుమతించవలెను కౌలు ఇచ్చినమనిషి నోటీసు ఇచ్చినమీదట, నోటీసు అంద చేయబడినప్పటినుండి ఒక నెలలోపల, దానిప్రకారము మరమ్మతు చేయవలెను

(6) కౌలు ఇచ్చు మనిషియొక్క లిఖితపూర్వకమైన అంగీకారమును ముందుగా పొందక కౌలు కియ్యబడిన ఆవరణము లేక అందలి ఏభాగమునైన అస్సైను చేయకూడదు, లోగుత్తకియ్యకూడదు లేక దానిస్వాధీనమును ఇతరుల కియ్యకూడదు,

(7) కౌలుదారీ హక్కు అంత్యమైనపుడు కౌలు కిచ్చిన ఆవరణ, దానికి చెందిన యావత్తు అమర్పులు, చేర్పులతో సహా, ఇందులోనున్న ఒడంబడికల ప్రకారము అద్దెకిచ్చుట కర్హ్మముగానుండగల విధమున, మరమ్మతుచేసి అప్పగించవలెను.

3 కౌలు ఇచ్చుమనిషి కౌలుదారునితో ఈ క్రింది విధముగ ఒడంబడిక చేసికొనుచున్నాడు —

(1) కౌలుదారు, ఇందుమూలముగా ప్రత్యేకించబడిన అద్దెను చెల్లించుచు, దానిలోనుండు వివిధ ఒడంబడికలను షరతులను అనుసరించుచును నెరవేర్చుచును ఉండినపక్షమున, కౌలుఇచ్చుమనిషి వలనగాని, వారిక్రింద లేక వారికి ట్రస్టుగా న్యాయముగా హక్కు కోరు ఏమనిషి వలనగాని ఎట్టి ఆటంకమైనను లేకుండ సదరు కాలపరిమితిలో కౌలుకిచ్చిన ఆవరణను శాంతితో కలిగియుండి అనుభవించవచ్చును

(ii) కాలము చెల్లుటవలనను, వాడు కొనుటవలనను యావత్తు ప్రధాన గోడలు, పైకప్పు, పునాదులకు కలిగినశిథిలమును మరమ్మతు చేయవలెను అట్లు మరమ్మతుచేయు విషయమున డివిజనుకు తత్కాలమందుండు ఎగ్జిక్యూటివు ఇంజనీరుయొక్క తీర్పు, ఆఖరుగా నుండవలెను

4 అయితే ఎల్లప్పుడు, దీనికి పార్టీగానుండువారిచే మరియు వారిమధ్య ఈ క్రింద విధమును ఇందుమూలముగా స్పష్టముగా సమ్మతింప బడినది —

(1) ఇందుమూలముగా ప్రత్యేకించబడిన అద్దె లేక అందలి ఏభాగమైనను (నియమితముగా కోరబడినను లేక కోరబడకపోయినను) చెల్లించవలసినదిగా ఏర్పడిన తర్వాత 14 దినములవరకు చెల్లింపబడక పోయినయెడల, లేక ఇందులోనున్న ఏ ఒడంబడికయైనను

కౌలుదారు నెరవేర్చబడక పోయినయెడల అప్పుడుగాని సదరుసందర్భములలో ఎప్పుడుగాని లేక అనుసరింపబడక పోయినయెడల, కౌలు ఇచ్చుమనిషి, అటుతర్వాత ఏకాలమందైనను, కౌలు కియ్యబడిన ఆవరణలో లేక అందలి ఏ భాగములోగాని, పూర్తి ఆవరణపేరిట తిరిగి ప్రవేశించుట చట్టసమ్మతముగా నుండవలెను అందుమీదట, ఇందులోనున్న కౌలు దారుని ఒడంబడికలలో దేనినైన ఉల్లంఘించిన సందర్భములో కౌలు ఇచ్చు మనిషికి చర్యతీసికొనుటకైన అధికారమునకు భంగములేకుండ ఈ కౌలు కిచ్చుట సంపూర్ణముగా నిలిచి పోవలెను.

(2) కౌలుదారు ప్రస్తుతపు కౌలు ఇయ్యాడమును అంతమొందించుటకు కోరునెడల, అట్టికోరికను గురించి కౌలు ఇచ్చు మనిషికి వ్రాతమూలకమైన నోటీసును మూడు క్యాలెండరు నెలకు ముందు ఇచ్చినయెడల, సదరు మూడుక్యాలెండరు నెలలు పూర్తియైన వెంటనే ప్రస్తుతపు కౌలు కిచ్చినది మరియు దానిలోనుండు ప్రతి విషయము ఆగిపోయి చెల్లకూడదు. అయితే ఏదైన పూర్వహక్కు లేక ఒడంబడిక ఉల్లంఘన సందర్భములో కక్షిదారులో నెవరైనను మఱియొక కక్షిదారుని పరిహారము కోరుటకు భంగకరముగ నుండకూడదు.

(3) ఇందుమూలముగా నియ్యబడిన కాలపరిమితి గడచి పోవుటకు పూర్వము మూడు క్యాలెండరు నెలలలోపల కౌలుదారు, కౌలు ఇచ్చిన మనిషిని లిఖితపూర్వకముగా కోరినమీద, పునరుద్ధరణకైన ఒడంబడికను మినహాయించి / తో సహా దీనిలోనున్న విధముగనే ఒడంబడికలు, మినహాయింపు నిబంధనలు కలిగిన          సంవత్సరముల అదనపు కాలపరిమితికి కౌలుకియ్యబడిన ఆవరణను కౌలుదారునకు కౌలు కియ్యవలెను

ఇందుకు సాక్షిభూతముగా మొదట పైన వ్రాయబడిన దినమునను సంవత్సరమునను          కౌలు ఇచ్చు మనిషి దీనిలో అతని సంతకమును సీలును వేయడమైనది మరియు కౌలుదారగు

పంచాయతీయొక్క కామన్ సీలు దీనికి వేయబడినది.

పైన చెప్పబడిన షెడ్యూలు

రిజిస్ట్రేషన్ జిల్లాలోని రిజిస్ట్రేషన్ సబు జిల్లాలోని గ్రామములోనున్నట్టిన్ని ఉత్తరమున దక్షిణమున తూర్పున పడమట సరిహద్దులుగా కలిగినట్టిన్ని, రి సర్వే నె రును, పాత సర్వే నె రును కలిగినట్టిన్ని, కొలువగా మొత్తము (ఇది కొంచెము ఎక్కువగానైన లేక తక్కువగానైన ఉండవచ్చును) కలిగియున్నట్టిన్ని యావత్తు భూఖండము లేక భాగమును, ఆవరణయును

సమక్షమున పైన చెప్పిన వారిచే సంతకము చేయబడి, సీలు వేయబడి, అప్పగింపబడినది

సమక్షమున పంచాయతీ యొక్క కార్య నిర్వాహక అధికారిచే సంతకము చేయబడినది సమక్షమున పంచాయతీయొక్క కామన్ సీలు దీనికి వేయబడినది

I (c) నమూనా

తాకట్టు మూలముగా పరివర్తనచేయుట.

ఒకవైపున (ఇందునిటుతర్వాత "తాకట్టు ఉంచిన మనిషి" అని చెప్పబడు—ఈ మాటలో సందర్భమును బట్టి అతని వారసులు, ఎగ్జిక్యూటర్లు, అడ్మినిస్ట్రేటర్లు, చట్టసమ్మతమైన ప్రతినిధులు చేరుదురు) లోకాప్పురముండునట్టిన్ని కుమారుడైనట్టిన్ని కిని మరియొకవైపున (ఇందునిటుతర్వాత తాకట్టుపెట్టుకొన్నమనిషి అని చెప్పబడు, ఈ మాటలో సందర్భమును బట్టి దాని వారసులు అసైనులు చేరుదురు) 1950 వ సం॥పు 10 వ మదరాసు ఆక్టుక్రింద ఏర్పాటు చేయబడిన పంచాయతీకిని మధ్య 19 వ సం॥ దినమున చేసికొన్న ఒడంబడిక

తాకట్టు ఉంచిన మనిషి ఇందుకు జతచేయబడిన షెడ్యూలులో వివరింపబడిన భూఖండము లేక భాగముకు మరియు ఆవరణకు చక్కగాను నిజముగాను హక్కుగలిగి దానిని స్వాధీనమున కలిగి యున్నందునను,

ఇందు నిటుతర్వాత అగపడు విధమున రూ          ల మొత్త
మును తిరిగి చెల్లించునను షరతుమీాద తాకట్టు ఉంచుకొన్న మనిషి
సదరు మొత్తమును తాకట్టు ఉంచిన మనిషికి అప్పుగానిచ్చుటకు
సమ్మతించి వందునను

ఇప్పుడు ఈ ఒడంబడిక ఈ క్రింద విషయములకు సాక్షీ
భూతముగానున్నదని, ఈ దస్తావేజు వ్రాసిన దినమునగాని, అంతకు
పూర్వముగాని, తాకట్టు ఉంచుకొన్న మనిషి, తాకట్టు ఉంచిన మని
షికి చెల్లించిన రూ          ల మొత్తము ప్రతిఫలముగా (సదరు
మొత్తము అందినట్లు తాకట్టు ఉంచిన మనిషి ఇందుమూలముగా
ఒప్పుకొను చున్నాడు) తాకట్టు ఉంచిన మనిషి, తాకట్టు ఉంచు
కొన్న మనిషికి                    లో ఉండు నట్టియు, దిగువ వ్రాయ
బడియుండు షెడ్యూలులో ఇంకను స్పష్టముగా వివరింపబడినట్టియు
యావత్తు భూఖండము లేక భాగమును, మరియు
అవి సాధారణముగా చెప్పబడు లేక పిలువబడు దానిమీాద నిర్మింప
బడియుండు నివాసస్థానము లేక బాడుగ ఇంటితోను, సదరు
భూఖండము లేక భాగము నివాసస్థానము లేక ఆవరణకు చెందిన అన్ని
కట్టడములు, గిడ్డంగులు, చెట్లు ఉమ్మడిబంజరు భూములు, వెలు
గులు, పల్లములు, కంచెలు, త్రోవలు, వనరులు, నీటికాలువలు,
స్వతంత్రములు, విశేషహక్కులు, సదుపాయపు హక్కులు, అనుకూల
ములు, ఉపకరణము లేవియున్నను వాటితో సహా లేక ఏవిధముగానైన
సంబంధించి వాటిలో ఏమైన లేక దానితో ఇంతకు పూర్వముగాని,
ఇకముందుగాని అనుభవములోనున్న లేక దానితో అనుభవింపబడు
చుండు దేనితోనైన సహా మఱియు సదరు ఆవరణలోను, దానిమీాదను
తాకట్టు ఉంచిన మనిషియొక్క యావత్తు ఎస్టేటు, అధికారము,
హక్కు-బాధ్యత, ఆస్తి, స్వతంత్రము, ఏడిమాండుతోనైన సహా,
బోగ్యపు తాకట్టును, తాకట్టు ఉంచుకొన్న మనిషికి ఇదుమూల
ముగా ఇచ్చుచున్నాడు, జారీచేయుచున్నాడు, అస్సైను చేయుచున్నాడు
ఇందు నిటుతర్వాత చెప్పబడిన తాకట్టును వదిలించుకొనుటకైన ఒక
మినహాయింపు నిబంధనకులోబడి, ఎల్లప్పటికి తాకట్టు ఉంచుకొన్న
మనిషికి ఇందుమూలముగా ఇయ్యబడిన, జారీచేయబడిన మరియు

అస్సైను చేయబడిన లేక ఆలాగని చెప్పబడిన సదరు భూఖండము లేక భాగము, నివాసస్థానము లేక ఆవరణను కలిగియుండి, ఉంచుకొనవలెను తాకట్టు ఉంచిన ఆస్తిని తాకట్టు ఉంచుకొన్న మనిషికి, తాకట్టు ఉంచిన మనిషి స్వాధీనపరచెననియు, సదరు రూ ల మొత్తము తాకట్టు ఉంచుకొన్న మనిషికి చెల్లించునంతవరకు ఆస్తిని అట్లు స్వాధీనములో ఉంచుకొని యుండవలెననియు, తాకట్టు పైకము సందర్భములో రావలసిన వడ్డీకి బదులు ఆస్తినుండివచ్చు అద్దెలను లాభములను తాకట్టువుంచుకొన్న మనిషి అనుభవించవచ్చుననియు తాకట్టు ఉంచిన మనిషి ఇందుమూలముగా ప్రసిద్ధపరచుచున్నాడు ఈ దస్తావేజు హామీమీద ఏపైకముగాని బాకీగాఉన్నంతవరకు, తాకట్టు ఉంచిన మనిషి, ఇందుమూలముగా జారీచేయబడినట్లును, ఇవ్వబడినట్లును అస్సైను చేయబడినట్లును ఇంతకుపూర్వము తెలుపబడిన సదరు ఆవరణలో ప్రస్తుతముండు లేక ఇకముందు నిర్మింపబడగల అన్ని నివాసస్థానములు మరియు కట్టడములను చక్కగాను, సొంతముగాను మరమ్మతు చేసి ఉంచునట్లును, అగ్నిప్రమాదమువలన కలుగగలనష్టము లేక హానికొఱకు కనీసము రూ ల మొత్తమునకు తాకట్టు ఉంచుకొన్న మనిషి పేరిట, అతనిచే అంగీకరించబడిన ఏదో ఆఫీసు లేక ఆఫీసులలో భీమాచేసి ఉంచునట్లును, అట్టి కార్యము కొఱకును, అట్టి భీమా అమలులోనుంచుటకును అవసరమైన యావత్తు ప్రీమియములు, పైకపు మొత్తములు, మరియు సదరు ఆవరణ లేక వాటిలో దేనిమీదనైన తత్కాలమందు చెల్లించవలసిన లేక చార్జిచేయబడు యావత్తు క్విట్ రెంటు, అసెస్‌మెంటు రేట్లు, పన్నులు ఇతరవ్యయములు క్రమముగాను, సకాలములో చెల్లించునట్లును, మరియు భీమాపాలిసీ లేక పాలిసీలను, పైనచెప్పిన విధముగా చెల్లించవలసిన ప్రతి మొత్తమునకు రసీదును తాకట్టు ఉంచుకున్న మనిషికి వెంటనే అప్పగించునట్లును సదరు కట్టడములను అట్లు మరమ్మతుచేసి ఉంచుటలో లేక అట్టి భీమాలు చేయుటలోగాని, అమలునందు ఉంచుటలోగాని, పైన చెప్పిన విధముగా ఏదైన అట్టి క్విట్ రెంటు, అసెస్‌మెంటు రేట్లు, పన్నులు మరియు ఇతర వ్యయములు చెల్లించుటలో లేక పైనచెప్పిన విధముగ ఏదైన పాలిసీగాని పాలిసీలనుగాని, రసీదులను

గాని అట్లు అప్పగించుటలో తప్పిపోవుట జరిగినయెడల తాకట్టు ఉంచుకొన్న మనిషి ఆ కట్టడమునకు చక్కని, సౌష్ఠవమైన మరమ్మతు చేయుట లేక (ఆయాసంగతికి తగినట్లు) పైన చెప్పిన మొత్తమునకును మించని ఏమొత్తమునకైన సదరు కట్టడములనుభీమా చేయుటకు భీమాచేసి యుంచుటకు అట్లు చేయుటలో తగిలిన ప్రీమియములను అగ్నిఖర్చులను (ఆయా సందర్భమునకు తగినట్లు)పైనచెప్పిన విధముగ అట్టి ఏ క్విట్ రెంటు, అసెస్‌మెంటు రేట్లు పన్నులు లేక ఇతరవ్యయములను చెల్లించుట న్యాయముగా నుండవలెనేగాని పై విషయములు అతని కర్తవ్యముగా నుండకూడదని తాకట్టు ఉంచిన మనిషి, తాకట్లు ఉంచుకొన్న మనిషితో యిందుమూలముగా ఒడంబడిక చేసికొనుచున్నారు ఇంతేకాకుండ తాకట్టు వుంచిన మనిషి అట్టి యావత్తు ప్రీమియములు, ఖర్చులు, ఇతర పైకములు, ప్రతిచెల్లుబడి కాలమునుండి సంవత్సర మొకటికి నూటికి రేటు చొప్పున దానిమీద వడ్డీతో వెంటనే తిరిగి చెల్లించవలెను అట్లు తిరిగిచెల్లించునంతవరకు ఇందుమూలముగా తాకట్టు పెట్టబడిన ఆవరణపైన తిరిగి చెల్లించవలసిన మొత్తమును, పైన చెప్పిన రేటుచొప్పున దానిమీద వడ్డీని వసూలు చేయుటకు హక్కు కలుగజేయబడును ఏ భీమావిషయముకగాని అందిన పైకమంతయు, తాకట్టు ఉంచుకొన్నమనిషి ఇష్టానుసారము, భీమాచేసిన కట్టడమును పునఃస్థాపనచేయుట లేక బాగుచేయుటకు లేక ఈ దస్తావేజమీద హామీమీద తత్కాలమందుండు పైకమును చెల్లించుటలో లేక చెల్లుబడికిగాను వినియోగింపబడును మరియు తాకట్టు వుంచిన మనిషి ఈ భోగ్యపు తాకట్టును, తాకట్టు వుంచుకొన్న మనిషికి ఇచ్చుటకును, జారీచేయుటకును ఇప్పుడు అధికారము కలదని తాకట్టు వుంచుమనిషి, తాకట్టును వుంచుకొన్న మనిషితో ఇందుమూలముగా ఒడంబడిక చేసికొనుచున్నాడు మరియు రూ ల మొత్తమునున్ను, ఈ దస్తావేజు ననుసరించి బాకీగానుండు ఏవైన ఇతర పైకములను తాకట్టు వుంచిన మనిషి తాకట్టు వుంచుకొనుమనిషికి యేకాలమందైనను చెల్లించినమీదట, తాకట్టు వుంచినమనిషి కోరినమీదటను అతని ఖర్చుతోను, జారీచేసి

నట్లును, ఇచ్చినట్లును లేక అస్సైను చేసినట్లును ఇందుమూలముగా తెలుపబడిన యావత్తు భూభాగము లేక భూఖండము మరియు ఆవరణ నంతయు తాకట్టు పెట్టిన మనిషికిగాని లేక ఆయన చెప్పగల విధముగాగాని తాకట్టు వుంచుకొన్న మనిషి మరల ఇచ్చివేయవలెను మరియు తిరిగి అస్సైను చేయవలెనని ఇందుమూలమున స్పష్టముగా సమ్మతింపబడి, ప్రసిద్ధపరచడమైనది

ఇందుకు సాక్షీభూతముగా తాకట్టు వుంచుమనిషి మొదట పైన వ్రాసిన సంవత్సరమునను, దినమునను దీనిలో సంతకముచేసి, సీలు వేయడమైనది

## పైన చెప్పబడిన షెడ్యూలు.

రిజిస్ట్రేషన్ జల్లాలోని రిజిస్ట్రేషన్ సబు జిల్లాలోని గ్రామములోనున్నట్టియు ఉత్తరమున దక్షిణమున తూర్పున పడమట ఎల్లలుగా కలిగినట్టియు రి. సర్వే నె రును, పాత సర్వే నె రును, కలిగినట్టియు, కొలువగా మొత్తము కలిగిన (అది కొంత ఎక్కువగా నుండవచ్చును లేక తక్కువగా నుండవచ్చును) యావత్తు భూభాగము లేక ఖండమును ఆవరణయును

సమక్షమున పైన పేర్కొనబడినవారిచే సంతకము చేయబడి, సీలువేయబడి అప్పగించడమైనది

## I (d) నమూనా

## దానముమూలముగా పరివర్తనలు.

ఒక వైపున (ఇందు నిటుతర్వాత దానము ఇచ్చు మనిషి అని చెప్పబడు ఈ మాటలలో సందర్భమునకు తగినట్లుగా అతని వారసులు, ఎగ్జిక్యూటర్లు, అడ్మినిస్ట్రేటర్లు మరియు చట్టసంబంధమైన ప్రతినిధులు చేరుదురు) లో కాపురముండు యొక్క కుమారుడైన కును, మరియొకవైపున (ఇందు నిటుతర్వాత "దానముపుచ్చుకొను మనిషి" అని చెప్పబడు

ఈ మాటలలో సందర్భానుసారముగా దానివారసులు, అస్సైనులు చేరుదురు) 1950 వ సం॥పు 10 వ మదరాసు ఆక్టు ననుసరించి నిర్మించబడిన పంచాయతీకిని మధ్య వెయ్యిన్ని తొమ్మిది వందల సంవత్సరం దినమున చేసుకొన్న ఒడంబడిక

ఇందు నిటుతర్వాత వివరింపబడినట్టియు ఇందుమూలమున జారీ చేయుటకు, ఇచ్చుటకు మరియు అస్సైనువేయుటకు ఉద్దేశింపబడనట్టియు భూభాగము లేక ఖండము మరియు ఆవరణను అప్పు వగైరా చిక్కులు లేకుండా కలిగియుండుటకు దానమిచ్చిన మనిషి చక్కగా, చాలినంత హక్కు కలిగియున్నందున ,

సదరు భూభాగము లేక ఖండము మరియు ఆవరణ సందర్భములో ప్రస్తుతం, భావికాలపు పన్నులు, చార్జీలు ఎసెస్‌మెంట్లు నేల అద్దె యావత్తును దానము పుచ్చుకొను మనిషి చెల్లించుటకు లోబడి ఆ భూమిని ఆవరణను దానము పుచ్చుకొను మనిషికి దానముగా పరివర్తన చేయుటకు దానముఇచ్చు మని సమ్మతించినందునను, దానము పుచ్చుకొను మనిషి అట్టి షరతులకు లోబడి సదరు భూమిని ఆవరణను అంగీకరించుటకు సమ్మతించినందునను

స్టాంపు డ్యూటీ నిమిత్తము సదరు భూభాగము లేక ఖండము మరియు ఆవరణయొక్క విలువ రూ. లు అయినందునను,

ఇప్పుడు ఈ ఒడంబడిక ఈ క్రింది విషయములకు సాక్షీభూతముగా నున్నది

రిజిస్ట్రేషను జిల్లాలో రిజిస్ట్రేషన్ సబు జిల్లాలో గ్రామములోనుండు సర్వే నెంబరును కలిగినట్టియు, దిగువ షెడ్యూలులో ఎక్కువ వివరములతో వివరింపబడినట్టియు యావత్తు భూభాగము లేక ఖండమును సదరు భూభాగము లేక ఖండమునకును ఆవరణకును చెందిన అన్ని కట్టడములు చెట్లు, ఉమ్మడి భూములు, విశేషహక్కులు, స్వతంత్రములు, సదుపాయపు హక్కులు, అనుకూలములు మరియు ఉపకరణము లేవియున్నను వాటితో సహా లేక దానికి ఏవిధముగానైన సంబంధించిన లేక దానితో ఇంతకు పూర్వము ఆక్రమించబడు లేక అనుభవించ

బడు వాటిలో దేనినైన మరియు సదరు ఆవరణలోను దానిమీదను దానము ఇచ్చు మనిషియొక్క యావత్తు ఎస్టేటు, అధికారము, హక్కు, బాధ్యత, ఆస్తి, స్వతంత్రము మరియు ఏ డిమాండుగాని దానముఇచ్చు మనిషి దానము పుచ్చుకొను మనిషికి ఇందుమూలముగా ఇచ్చుచున్నారు, జారీచేయుచున్నారు, అతనిపరము జేయుచున్నారు, మరియు అస్సైను జేయుచున్నారు దానము పుచ్చుకొను మనిషికి ఇందుమూలముగా జారీచేయబడి అందజేయబడి మరియు అస్సైను చేయబడిన సదరు భూభాగము లేక ఖండమును మరియు ఆవరణను ఎల్లప్పటికి కలిగియుండి పెట్టుకొనుటకు, దానము పుచ్చుకొను మనిషి ఇందుమూలముగా అంగీకరించుచున్నాడు, మరియు దానము ఇచ్చు మనిషి దానము పుచ్చుకొను మనిషితో ఇందుమూలమున ఇట్లు ఒడంబడిక చేసికొనుచున్నాడు పైనచెప్పిన విధముగా దానము పుచ్చుకొను మనిషికి ఇందుమూలముగా జారీచేయబడి, అందజేయబడి అస్సైను చేయబడిన ఆవరణను జారీచేయుటకు అందజేయుటకు మరియు అస్సైనుచేయుటకు దానమిచ్చు మనిషికి ఇప్పుడు మంచి అధికారము కలదు అప్పు మొదలైన చిక్కులేవియు లేకుండను, దానమిచ్చు మనిషినుండిగాని, వలనగాని లేక అతనిక్రింద లేక అతనికి ట్రస్టీగా హక్కును కోరు ఏ మనిషినుండిగాని, వలనగాని ఏదైన చట్టసమ్మతమైన వెడలుగొట్టుట, ఆటంకము కలిగించుట, హక్కుగాకోరుట, లేక ఎట్టి డిమాండుగాని లేకుండ సదరు ఆవరణను దానము పుచ్చుకొను మనిషి ఇకముందు అన్ని వేళలందు శాంతముగాను, నెమ్మదిగాను కలిగియుండ అనుభవించవలయును మరియు వచ్చును ఇంతేకాకుండ దానముయిచ్చు మనిషి మరియు దానము ఇచ్చు మనిషినుండి లేక అతనిక్రింద లేక అతనికి ట్రస్టుగా లేక అతని పూర్వీకులలో ఎవరినుండిగాని లేక వారి క్రిందగాని సదరు ఆవరణలో లేక అందలి ఏ భాగములోనైన ఏదైన ఎస్టేటు లేక హక్కును కలిగిన లేక చట్టసమ్మతములు లేక న్యాయముగా హక్కుకోరు మనుష్యులందరు అప్పుడప్పుడును ఇకమీదట అన్ని సమయములందును దానము పుచ్చుకొన్న మనిషి కోరినమీదటను అతని ఖర్చుతోను పైనచెప్పిన విధముగా లేక న్యాయముగా కోర

బడగల విధమున సదరు ఆవరణయు దానికిచెందిన ప్రతి భాగమును దానము పుచ్చుకొను మనిషికి సంపూర్ణముగా చెందునట్లు అతనికి నమ్మకము కలిగించుటకు కావలసిన అట్టి యావత్తు పనులను చేయవలెను మరియు చేయును, దస్తావేజులను వ్రాయవలెను మరియు వ్రాయుటను, విషయములను రిజిష్టరు చేయవలెను మరియు చేయుటను లేక వాటిని చేయునట్లు వ్రాయునట్లు, రిజిష్టరు చేయునట్లు చేయవలెను, మరియు చేయును

ఇందుకు సాక్షీభూతముగా మొదట పైన వ్రాయబడిన దినమునను సంవత్సరమునను దానము ఇచ్చు మనిషి దీనిలో సంతకము చేసి తన సీలును వేయుచున్నారు దానము పుచ్చుకొను మనిషి యగు పంచాయతియొక్క కామన్ సీలు దీనిలో వేయబడినది.

## పైన చెప్పబడిన షెడ్యూలు.

రిజిస్ట్రేషను జిల్లాలో రిజిస్ట్రేషను సబు జిల్లాలో గ్రామములో నున్నట్టియు ఉత్తరమున ను దక్షిణమున ను తూర్పున ను పడమట ను ఎల్లలుగా కలిగినట్టియు రీసర్వే నెంబరును పాత సర్వే నె రును కలిగినట్టియు కొలువగా మొత్తముమీాద ను కలిగినట్టియు (ఇది కొంత ఎక్కువగా లేక తక్కువగా నుండవచ్చును) యావత్తు భూభాగము లేక ఖండము మరియు ఆవరణ

సమక్షమున పైన పేర్కొనబడినవారిచే సంతకము చేయబడి సీలువేయబడి అప్పగించడమైనది

సమక్షమున పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారిచే సంతకము చేయబడినది

సమక్షమున పంచాయతీయొక్క కామన్ సీలు దీనిలో వేయబడినది

## 2 వ షెడ్యూలు

[2 (2) వ మరియు 3 (2) వ విధులను చూడుడు ]

## II (a) నమూనా

## విక్రయము మూలముగా పరివర్తన

ఒక వైపున (ఇందు నిటు తర్వాత "విక్రయదారు" అని చెప్పబడు ఈ మాటలో సందర్భానుసారముగా దాని వారసులును అస్సైనులును చేరుదురు) 1950 వ సం॥ పు 10 వ మదరాసు ఆక్టు ననుసరించి ఏర్పాటుచేయబడిన పంచాయతీకిని మరియొక వైపున (ఇందు నిటుతర్వాత "కొనుగోలుదారు" అని చెప్పబడు ఈ మాటలో సందర్భానుసారముగా అతని వారసులు, ఎగ్జిక్యూటర్లు, అడ్మినిస్ట్రేటర్లు, చట్ట సంబంధమైన ప్రతినిధులు మరియు అస్సైనులు చేరుదురు) లో కాపురముండు కుమారుడైన కి/కు ను మధ్య 19 వ సం॥ దినమున చేసుకొనబడిన ఒడంబడిక

విక్రయదారు, ఇందుకు జతచేయుబడిన షెడ్యూలులో వివరింపబడిన భూభాగము లేక ఖండమును మరియు ఆవరణను కలిగి సొంతముగా కలిగియుండి దాని విషయమున హక్కును కలిగియుండి, దాని సందర్భములో చెల్లించవలసిన క్విట్ రెంటుకు (ఏదైన నున్న దానికి) లోబడి అయితే ఇతర విధమున తాకట్టు వగైరా చిక్కులు లేకుండ, దానిని రూ న మొత్తమునకు కొనుగోలుదారునికి విక్రయించుటకు ఆయన సమ్మతించినందునను ,

జిల్లాకలెక్టరు సం॥ తేదీని కలిగిన ఒక ఉత్తరవుద్వారా ఇందు నిటుతర్వాత చెప్పబడియుండు ఆస్తి విక్రయమును సాదరుచేసియున్నందునను

* మదరాసు ప్రభుత్వమువారు, సం॥ తేదీగల నె రు ఉత్తరువుద్వారాకూడ ఇందు నిటుతర్వాత చెప్పబడిన ఆస్తివిక్రయమును సాదరుచేసియున్నందునను

ఇందు నిటుతర్వాత చెప్పబడిన ఆస్తి విక్రయమును గురించి క్రమమైన నోటీసు దానికి సంబంధించిన విధులయొక్క నిబంధనల ప్రకారము యివ్వబడియున్నందునను

---

* విలువ పది వేల రూపాయలను మించిన పక్షమున నే వుంచవలెను.

ఇప్పుడు ఈ ఒడంబడిక ఈ క్రింది విషయములకు సాక్షి భూతముగా నున్నది సదరు ఒడంబడిక ననుసరించియు, ఈ దస్తావేజు వ్రాసిన మీదటగాని అంతకు పూర్వముగాని కొనుగోలుదారు విక్రయదారునికి చెల్లించిన రూ ల మొత్తము ప్రతిఫలముగాను (సదరు మొత్తమును పుచ్చుకొన్నట్లు విక్రయదారు ఇందు మూలముగా ఒప్పుకొనుచున్నారు) ప్రయోజనకరమైన సొంతదారు గాను దానికి అధికారమిచ్చు ప్రతిచట్టబద్ధమైన మరియు ఇతర అధికారము ననుసరించియు, లోనుండు నట్టియు, క్రింద వ్రాయబడియుండు షెడ్యూలులో ఎక్కువ వివరములతో వివరింప బడినట్టియు భూఖండము లేక భాగమునంతయు అని సాధారణముగా పిలువబడు లేక చెప్పబడు, దానిమీద నిర్మింపబడియుండు కాపురముండెడి స్థానములేక బాడుగ ఇంటితో సహా, సదరు భూఖండము లేక భాగము నివాసస్థానము, ఆవరణకును చెందిన యావత్తు కట్టడములు, గిడ్డంగులు, చెట్లు, సాముదాయక భూములు, కంచెలు, పల్లములు, వెలుగులు, త్రోవలు, జలాశయములు, నీటి కాలువలు, స్వాతంత్ర్యములు, విశేషహక్కులు, సదుపాయపు హక్కులు, అనుకూలతలు మరియు ఉపకరణము లేవియున్నను వాటితో సహా లేక వాటికి ఏ విధముగా నైన చెందిన లేక దానితో ఇంతకు పూర్వము ఆక్రమించబడిన లేక అనుభవించబడిన వాటిలో ఏవిగాని మరియు అదే ఆవరణలోగాని దానిమీదగాని విక్రయదారు యొక్క యావత్తు ఎస్టేటు, అధికారము, రైటులు, బాధ్యత, ఆస్తి హక్కు, డిమాండు యేదిగాని కొనుగోలుదారునికి ఇందుమూలముగా ఇచ్చుచున్నారు, అతనిపరము చేయుచున్నారు, మరియు అస్సైను చేయుచున్నారు కొనుగోలుదారునికి ఇందుమూలముగా ఇయ్యబడిన, అతనిపరము చేయబడిన మరియు అస్సైను చేయబడిన సదరు భూఖండము లేక భాగము నివాసస్థానము ఇల్లు, ఆవరణ ఎల్లప్పుడును కలిగియుండి, ఉంచుకొనవలెను మరియు పైనచెప్పిన విధముగా కొనుగోలుదారునికి ఇందుమూలముగా నీయబడిన అతని పరము చేయబడిన లేక అస్సైను చేయబడిన ఆవరణను ఇచ్చుటకు అతనిపరము చేయుటకు అస్సైను చేయుటకు విక్రయదారునకు ఇప్పుడు మంచి అధి

కోరము కలదనియు మరియు కొనుగోలుదారు ఇకమీదట అన్ని సమయములందు సదరు ఆవరణను అప్పువగైరా చిక్కులేవిగాని లేకుండా శాంతియుతముగాను, నెమ్మదిగాను స్వాధీనములో నుంచుకొని అనుభవించవలెననియు, అనుభవించ వచ్చుననియు మరియు విక్రయదారువలన లేక ఇతరమనిషి లేక మనుష్యులవలన గాని ఏ విధముగానైన చట్టసమ్మతముగా వెడలగొట్టుట, ఆటంకము కలుగ జేయుట, హక్కును కోరుట, డిమాండుచేయుట లేకుండ దానియొక్క అద్దెలను, లాభములను పుచ్చుకొన వచ్చుననియు ఇంతేకాకుండ విక్రయదారు మరియు విక్రయదారు నుండి విక్రయదారు క్రింద లేక విక్రయదారునికి ట్రస్టీగా సదరు ఆవరణయందుగాని లేక వాటిలో దేనియందుగాని లేక దానియొక్క ఏ భాగమునందుగాని ఏదైన ఎస్టేటును లేక బాధ్యతను కలిగియున్న లేక చట్టసమ్మతముగా లేక ధర్మముగా కోరు మనుష్యులందరును అప్పుడప్పుడును ఇకమీదట అన్ని సమయములందును కొనుగోలుదారు కోరినమీదటను అతని ఖర్చుతోను న్యాయముగా కోరిన లేక కోరగల విధమున సదరు ఆవరణ మరియు అందలి ప్రతిభాగము కొనుగోలు దారునకు చెందినది అని అదనముగాను, సంపూర్ణముగాను, నమ్మకము కలిగించుటకు అన్ని పనులను పత్రములను మరియు ఏ విషయములనైన చేయవలెనని, వ్రాయవలెనని, రిజిష్టరు చేయవలెనని మరియు చేయునని, వ్రాయునని లేక రిజిష్టరు చేయునని లేక చేయునట్లు వ్రాయునట్లు, రిజిష్టరు చేయునట్లు జేయవలయునని మరియు చేయునని విక్రయదారు కొనుగోలు దారునితో ఇందుమూలముగా ఒడంబడిక చేయుచున్నాడు. మరియు అదే స్వభావముగల భూములమీదను ఆవరణమీద ఇప్పుడు చెల్లింపబడుచున్న లేక అసెస్సుమెంటులు పన్నులు విధించుటకు ఇప్పుడు అమలులోనున్న లేక ఇకమీదట అమలులోనికి రాగల ఏ విధులక్రిందనైన ఇందుమూలముగా అతనిపరము చేయబడిన సదరు ఆవరణమీద మదరాసు ప్రభుత్వమువారు ఇకమీదట ఏకాలమందైనను విధించగల అన్ని అసెస్సుమెంట్లను, పన్నులను కొనుగోలుదారు పైనచెప్పిన విధముగా ఇకమీదట అన్ని సమయములందు చెల్లింతునని

కొనుగోలుదారు విక్రయదారుతో ఇందుమూలముగా ఒడంబడిక చేసి కొనుచున్నాడు

ఇందుకు సాక్షిభూతముగా పైన మొదట వ్రాసిన సంవత్సర మునను దినమునను పంచాయతీయొక్క ఉమ్మడి సీలు ఇందుకు వేయబడినది, మరియు . గారు దీనిలో సంతకముచేసి అతని సీలును వేసిరి.

పైన తెలుపబడిన షెడ్యూలు

రిజిస్ట్రేషను జిల్లాలో రిజిస్ట్రేషను సబు జిల్లాలో గ్రామములో నున్నట్టియు రి సర్వే నెంబరును ఓ ఎస్. నె రును కలిగినట్టియు ఉత్తరమున ను, తూర్పు ను, పడమట ను, దక్షిణమున ను సరిహద్దులుగా కలిగినట్టియు కొలిచినప్పుడు లేక ఆ సమీపపు సంఖ్యను కలిగినట్టియు యావత్తు భూఖండము లేక భాగము వారి సమక్షమున పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారిచే సంతకము చేయబడినది

సమక్షమున పంచాయతీయొక్క ఉమ్మడి సీలు దీనికి వేయబడినది

సమక్షములో పైన పేర్కొనబడిన వారిచే సంతకము చేయబడి సీలువేయబడి అప్పగించడమైనది

II (b) నమూనా

మార్చుకొనుట మూలమున పరివర్తన.

ఒక వైపు (ఇందు నిటుతరువాత పంచాయతీ అని చెప్ప బడు—ఈ మాటలలో సందర్భానుసారముగా దాని తరువాత ఆ స్థాన మునకువచ్చు సంస్థలును అసైనులును చేరుదురు) 1950 వ సం॥పు 10 వ మదరాసు ఆక్టు ననుసరించి ఏర్పాటుచేయబడిన పంచాయతీకిని మరియొక వైపున (ఇందు నిటుతరువాత రెండవ వైపుకు చెందినపార్టీ అని చెప్పబడు—ఈ మాటలలో సందర్భాను సారముగా అతని వారసులు, ఎగ్జిక్యూటర్లు, అడ్మినిస్ట్రేటర్లు, చట్ట సంబంధమైన ప్రతినిధులు, అసైనులు చేరుదురు) వద్ద

కొంపురముండు కుమారుడైన కును
మధ్య 19 వ సం॥ దినమున చేసుకొన్న ఒడంబడిక

పంచాయతీ, ఇందుకు జతచేయబడిన మొదటి షెడ్యూలులో ఎక్కువ స్పష్టముగా వివరింపబడిన భూభాగము లేక ఖండమునకు మరియు దానిమీదనుండి కట్టడములతో సహా తాకట్టు మొదలైన చిక్కు లేవియు లేకుండ చక్కగాను నిజముగాను హక్కు కలిగి యున్నందునను వాటిని స్వాధీనమునందు కలిగియున్నందునను మరియు రెండవవైపుకు చెందిన పార్టీకూడ ఇందుకు జతచేయబడిన రెండవ షెడ్యూలులో ఎక్కువ స్పష్టముగా వివరింపబడిన భూభాగము లేక ఖండము మరియు దానిమీదనున్న కట్టడములతో సహా తాకట్టు వగైరా చిక్కులు లేకుండ చక్కగాను నిజముగాను హక్కు కలిగి యున్నందునను స్వాధీనమునందు కలిగియున్నందునను ,

ఈ పార్టీలు వరుసగా ఇందుకు చేర్చబడిన మొదటి మరియు రెండవ షెడ్యూలులో ఎక్కువ స్పష్టముగా వివరింపబడిన సదరు భూభాగములను లేక ఖండములను ఇందు నిటుతరువాత చెప్పబడిన విధముగా ఒకదానికి బదులు మరియొకటి మార్చుకొనుటకు సమ్మతించినందునను జిల్లాయొక్క కలెక్టరు సం॥ తేదీ గల నె రు ఉత్తరువుద్వారా ఇందు నిటు తరువాత చెప్పబడిన విధముగా ఆస్థులను మార్చుకొనుటకు మంజూరు చేసినందునను ,

*మదరాసు ప్రభుత్వమువారుకూడ సం॥ తేదీ గల నె రు ఉత్తరువుద్వారా ఇందు నిటుతరువాత చెప్పబడిన విధమున ఆస్థులను మార్చుకొనుటకు మంజూరు చేసినందునను

మార్చుకొనుటకు క్రమమైన నోటీసు ఇందు నిటుతరువాత చెప్పబడిన విధముగా, దానికి సంబంధించిన విధులయొక్క నిబంధనల ప్రకారము ఇయ్యబడినందునను

ఈ ఒడంబడిక ఈ క్రింద విషయములకు సాక్షీభూతముగా నున్నది —

---

*విలువ రు. 10,000 లు మించినచో యుంచవలెను.

రెండవ పక్షమున చెందిన పార్టీ ఇందు నిటుతర్వాత చెప్పబడి యున్న దానిని ఇచ్చినందుకు ప్రతిఫలముగా పంచాయతీకి ఇందుకు అధికారము కలుగజేయు ప్రతి చట్టసంబంధమైన మరియు ఇతర అధికారము ననుసరించి నున్నట్టియు, క్రింద వ్రాయబడిన మొదటి షెడ్యూలులో ఎక్కువ స్పష్టముగా వివరింపబడినట్టియు, ఇందుకు జత చేయబడిన మ్యాపులో            రంగు వేయబడినట్టియు, ప్లానులో A అని గుర్తింపబడినట్టియు,            రూపాయలు లేక కొంత హెచ్చు తక్కువ విలువగల యావత్తు భూభాగమును లేక ఖండమును సదరు భూభాగము లేక ఖండమునకు మరియు ఆవరణకు చెందిన అన్ని కట్టడములు, చెట్లు, ఉమ్మడి బంజరు భూములు, వెలుగులు, పల్లములు కంచలు, త్రోవలు, జలాశయములు, నీటికాలువలు, స్వతంత్రములు, విశేషహక్కులు, సదుపాయపు హక్కులు, అనుకూలములు, ఉపకరణములు ఏవియున్నను వాటితో సహా లేక ఏ విధముగానైనను సంబంధించిన లేక ఇంతకు పూర్వము వాటితో ఆక్రమింపబడి, అనుభవింపబడుచున్న వాటిలో ఏదిగాని మరియు అదే ఆవరణలో లేక దానిమీద పంచాయతీయొక్క యావత్తు ఎస్టేటు, అధికారము, హక్కు, బాధ్యత, ఆస్తి, స్వతంత్రము మరియు డిమాండు ఏదిగాని. రెండవ వైపునకు చెందిన పార్టీకి ఇందు మూలముగా ఇచ్చుచున్నది, పరమ. చేయుచున్నది, అస్సైను చేయుచున్నది, రెండవ వైపుకు చెందిన పార్టీకి ఇందు మూలముగా ఈయబడిన మరియు అస్సైను చేయబడిన లేక అట్లు చేసినట్లు చెప్పబడిన సదరు భూభాగమును లేక ఖండమును మరియు ఆవరణను ఎల్లప్పుడు కలిగియుండి ఉంచుకొనవలెను మరియు రెండవ వైపునకు చెందిన పార్టీ ఇకమీదట ఎల్లప్పుడు            యొక్క అసెస్సుమెంటు లేక భూమి అద్దెను, లేక            యొక్క కలెక్టరు అప్పుడప్పుడు నిర్ణయించగల ఇతర మొత్తమును మరియు సదరు భూభాగము లేక ఖండముమీద లేక ఆవరణమీద కేంద్ర ప్రభుత్వము లేక మదరాసు ప్రభుత్వము లేక ఏదైనా స్థానిక లేక ఇతర అధికారవర్గము అప్పుడప్పుడు విధించిన లేక విధించగల ఏదైన ఇతర భూమి అద్దె, అసెస్సుమెంటును, పన్నులను చెల్లించునట్లు రెండవ వైపుకు చెందిన పార్టీ

పంచాయతీతో ఇందు మూలముగా ఒడంబడిక చేసుకొనుచున్నది మరియు ఈ ఒడంబడిక ఇంకను ఈ క్రింది విషయములకు సాక్షీ భూతముగా నున్నది ఇంతకు పూర్వము చెప్పబడిన పంచాయతీ వలన ఈయబడిన దానికి ప్రతిఫలముగా          తో నున్నట్టియు క్రింద వ్రాయబడియుండు రెండవ షెడ్యూలులో ఎక్కువ స్పష్టముగా వివరింపబడినట్టియు ఇందుకు జతచేయబడి B అని గుర్తు వేయబడిన మ్యాపు లేక ప్లానులో రంగు వేయబడినట్టియు

రూపాయలు విలువ లేక దానికి సమీపపు మొత్తము విలువ కలిగిన యావత్తు భూభాగము లేక ఖండమును, సదరు భూభాగము లేక ఖండము మరియు ఆవరణకు చెందిన యావత్తు కట్టడములు, చెట్లు, ఉమ్మడి బంజరు భూములు, వెలుగులు, పల్లములు, కంచలు, త్రోవలు, జలాశయములు, నీటి కాలువలు, స్వతంత్రములు, విశేష హక్కులు, సదుపాయపు హక్కులు, అనుకూలములు మరియు ఏవైనా ఉపకరణములతో సహా లేక దానికి ఏ విధముగానైన చెందిన లేక దానితో ఇంతవరకు ఆక్రమింపబడి లేక అనుభవింపబడుచున్న వాటిలో దేనినైనను మరియు కడపటగా చెప్పబడిన ఆవరణలోను మీదను రెండువైపునకు చెందిన పార్టీయొక్క యావత్తు ఎస్టేటు, అధికారము హక్కు, బాధ్యత, ఆస్తి, స్వతంత్రము మరియు డిమాండు ఏదిగాని రెండవ వైపునకు చెందిన పార్టీ పంచాయతీకి ఇందుమూల ముగా ఇచ్చుచున్నది, పరము చేయుచున్నది మరియు అస్సైను చేయు చున్నది పంచాయితీకి శాశ్వతముగా ఈయబడినట్లు పరము చేయ బడినట్లు అస్సైను చేయబడినట్లు ఇంతకుపూర్వము కడపటగా చెప్ప బడిన సదరు భూభాగము లేక ఖండము మరియు ఆవరణను కలిగి యుండి ఉంచుకొనవలెను మరియు పంచాయితీ కేంద్ర ప్రభుత్వము లేక మదరాసు ప్రభుత్వము లేక ఏదైన స్థానిక లేక ఇతర అధికార వర్గము సదరు భూభాగము లేక ఖండము లేక ఆవరణమీద అప్పు డప్పుడు విధింపబడు లేక బడగల ఆసెస్సుమెంట్లను పన్నులను, పంచా యతీ అన్ని సమయములందు ఇకమీదట చెల్లించునని రెండవ వైపుకు చెందిన పార్టీతో ఇందుమూలమున ఈ క్రింది విధముగా

ఒడంబడిక చేసుకొనుచున్నది. మరియు దీనికి చెందిన పార్టీలు ఒక్కొక్కరు ఇతరులతో పరస్పరముగా ఇట్లు ఒడంబడిక చేసికొని సమ్మతించుచున్నారు ఇందుకు వ్యతిరేకముగా చేసిన లేక వ్రాసిన లేక తెలిసి అనుమతించినవ్ ఫైన చర్య పత్రము లేక విషయముతో నిమిత్తము లేకుండా పైన చెప్పిన విధముదా ఇందుమూలముగా ఇవ్వ బడినట్లు, ఒకరిపరము చేయబడినట్లు అస్సైను చేయబడినట్లు తెలుప బడిన సదరు ఆవరణను క్రమముగా నిచ్చుటకు పరముచేయుటకు మరియు అస్సైను చేయుబకు వారికి ఇత్పుడు మంచి అధికారముకలదు

సదరు పార్టీనుండి క్రింద లేక వారిని ట్రస్టీగా చట్ట సమ్మత ముగా లేక ధర్మముగా ఇతర పార్టీ లేక ఏ మనిషి లేక మనుష్యుల నుండిగాని వారివలనగాని ఏదైన న్యాయముగా వెడలగొట్టుట ఆటంక పరుచుట, హక్కుకోరుట లేక డిమాండు చేయుట ఏదిగాని లేకుండ పార్టీలలో ఎవరుగాని లేక పైన చెప్పిన విధముగా చట్టసమ్మతముగా లేక ధర్మముగా హక్కుకోరు ఏమనిషి లేక మనుష్యుల వలనగాని చేయబడిన లేక అనుమతింపబడిన యావత్తు అప్పు వగైరా చిక్కులు లేకుండా కడపటగా చెప్పబడిన అట్టి ఆవరణను కక్షిదారులలో ఎవరు గాని ఇకముందు ఎల్ల సమయములందు శాంతియుతముగాను నెమ్మది గాను కలిగియుండి అనుభవింపవలెను, మరియు వచ్చును మరియు దానియొక్క అద్దెలను, లాభములను పొందవలెను మరియు పొందవచ్చును, పార్టీలలో ఎవరినుండిగాని, ఎవరిక్రిందగాని లేక ఎవరు ట్రస్టులోగాని సదరు ఆవరణలో లేక దానియొక్క ఏభాగములో నైన ఏదైన ఎస్టేటు లేక హక్కును కలిగిన లేక చట్టసమ్మతముగా లేక ధర్మముగా కోరు పార్టీలు మరియు మనుష్యులందరు ఇకమీాదట అప్పుడప్పుడును అన్ని సమయములందును మరియొక పార్టీ కోరిన మీాద టను దీని ఖర్చుతోను న్యాయముగా కోరగల లేక కోరిన విధమున పైన చెప్పిన విధముగా మరియొక పార్టీకి కడపటగా చెప్పబడిన ఆవరణ మరియు దానియొక్క ప్రతిభాగమును అతనిదని ఎక్కువ గాను, అదనముగాను, నమ్మకము కలిగించుటకు అట్టి అన్ని చర్య లను చేయవలెను పత్రములను వ్రాయవలెను విషయములను

రిజిష్టరు చేయవలెను లేక చేయబడునట్లు వ్రాయబడునట్లు, రిజిష్టరు చేయబడునట్లు చేయవలెను

ఇందుకు సాక్షీభూతముగా మొదట పైన వ్రాయబడిన దినమునను సంవత్సరమునను పంచాయితీయొక్క కామనుసీలు దీనికి వేయబడెను మరియు ఆయనచే దీనిలో సంతకముచేయబడి, సీలు వేయబడెను

## పైన చెప్పబడిన మొదటి షెడ్యూలు.

ఇందుకు జతచేయబడియుండి A అని గుర్తు వేయబడియుండు ప్లానులో రంగువేయబడినట్టియు రీసర్వే నె రు ను పాత సర్వేనె రును కలిగినట్టియు రిజిస్ట్రేషన్ జిల్లాలో సబు రిజిస్ట్రేషన్ జిల్లాలో గ్రామములోనున్న, ఉత్తరమున రి స నె రు తూర్పున రి స, నె రు దక్షిణమున రి స నె రు పడమట రి స నె రు ఎల్లలుగాకలిగినట్టియు, కొలిచినప్పుడు లేక అంతకు కొంచెము ఎక్కువగానో తక్కువగానో ఉండునట్టియు యావత్తు భూభాగము లేక ఖండము

## పైన చెప్పబడిన రెండవ షెడ్యూలు

ఇందుకు జతచేయబడిన B అను గుర్తువేయబడిన ప్లానులో రంగు వేయబడినట్టిన్ని రిజిస్ట్రేషను జిల్లాలో రిజిస్ట్రేషన్ సబు జిల్లాలో గ్రామములో నుండునట్టిన్ని, రీసర్వే నెంబరును పాత సర్వే నె రును కలిగినట్టిన్ని ఉత్తరమున తూర్పున దక్షిణమున పడమట ను ఎల్లలుగా కలిగినట్టిన్ని కొలిచినప్పుడు లేక అంతకు కొంచెము ఎక్కువగాని తక్కువగాని ఉన్నట్టిన్ని యావత్తు భూభాగము లేక ఖండము సమక్షమున పంచాయతీయొక్క కామన్ సీలు దీనికి వేయబడెను

సమక్షమున పంచాయతీ యొక్క కార్య నిర్వాహకోద్యోగిచే సంతకము చేయబడినది

సమక్షమున పైన తెలిపిన వారివలన సంతకము చేయబడి, సీలువేయుబడి అప్పగించబడినది

II (c) నమూనా

తాకట్టు మూలముగా పరివర్తన చేయుట,

ఒకవైపున (ఇందు నిటుతర్వాత "తాకట్టు ఉంచిన మనిషి" అని చెప్పబడు—ఈ మాటలో పూర్వోత్తర సందర్భమునుబట్టి దాని వారసులు, అస్సైనులు చేరుదురు) 1950 వ సం॥పు 10 వ మదరాసు ఆక్టుక్రింద ఏర్పాటుచేయుబడిన పంచాయతీకిని, మరియొకవైపున (ఇందు నిటుతర్వాత "తాకట్టు వుంచుకొన్న మనిషి" అని చెప్పబడు—ఈ మాటలలో పూర్వోత్తర సందర్భమునుబట్టి అతని వారసులు, ఎగ్జిక్యూటర్లు, అడ్మినిస్ట్రేటర్లు చట్టసంబంధమైన ప్రతినిధులు చేరుదురు) లో కాపురమున్నట్టియు యొక్క కుమారుడై కిని/కును మధ్య 19 వ సం॥ దినమున చేసికొనబడిన ఒడంబడిక

దీనికి జతచేయుబడియుండు షెడ్యూలులో వివరింపబడిన భూభాగము లేక ఖండము మరియు ఆవరణ విషయమున తాకట్టు ఉంచిన మనిషి చక్కగాను, నిజముగాను హక్కుకలిగి, దానిని తన స్వాధీనమునందు కలిగియున్నందునను,

ఇంను నిటుతర్వాత చెప్పబడిన రేటువొప్పున వడ్డీతో రూ॥ ల మొత్తమును తిరిగి చెల్లించవలెనను షరతులో, ఇందు నిటుతర్వాత అగపడు విధముగా పూచీతో తాకట్టు ఉంచుకొన్న మనిషి... . ...రూపాయల మొత్తమును తాకట్టు వుంచిన మనిషికి అప్పుగా నిచ్చుటకు సమ్మతించినందునను

జిల్లా కలెక్టరు 19 వ సం॥ తేదీగల నె రు వుత్తరువుద్వారా ఇందు నిటుతర్వాత చెప్పబడిన విధముగా ఆస్తులను తాకట్టుపెట్టుటకు మంజూరు చేసినందునను,

మదరాసు ప్రభుత్వమువారుకూడా సం॥ తేదీగల నె రు వుత్తరువుద్వారా ఇందు నిటుతర్వాత చెప్పబడిన విధమున ఆస్తులను తాకట్టు వుంచుటకు మంజూరు చేసినందునను

దానికి సంబంధించిన విధులయొక్క నిబంధనల ప్రకారము ఇందు నిటుతర్వాత చెప్పబడిన విధముగా తాకట్టును గురించి క్రమముగా నోటీసు ఈయబడినందునను,

*ఇప్పుడు ఈ ఒడంబడిక పత్రము ఈ క్రింది విషయములకు సాక్షీ భూతముగా నున్నది తాకట్టు వుంచిన మనిషికి, తాకట్టు వుంచుకొన్న మనిషి ఈ దస్తావేజు వ్రాసిన మీాదగాని అందుకు పూర్వము గాని రూపాయల మొత్తమును చెల్లించినందుకు ప్రతిఫలముగా దానిని పుచ్చుకొన్నట్లు తాకట్టు వుంచిన మనిషి ఇందుమూలముగా ఒప్పుకొనుచున్నారు సం॥ ఒకటికి నూటికి రూపాయల రేటుచొప్పున అసలుమీాద వడ్డీతో రూ॥ల మొత్తమును కోరినమీాదట తాకట్టుఉంచిన మనిషి తాకట్టు వుంచుకొన్న మనిషికి చెల్లించునని తాకట్టు వుంచినమనిషి ఇందుమూలముగా తాకట్టువుంచుకొన్న మనిషితో ఒడంబడిక చేసికొనుచున్నాను.

♦మరియు ఈఒడంబడిక ఈ క్రింద విషయములకుకూడా సాక్షీ భూతముగా నున్నది అదే ప్రతిఫలమునకుగాను లో నున్నట్టియు ఈ దిగువ వ్రాయబడిన షెడ్యూలులో ఎక్కువ స్పష్టముగా వివరింపబడినట్టియు లో నుండు యావత్తు భూభాగమును ఖండమును, అని సాధారణముగా పిలువబడు లేక చెప్పబడు దానిమీాద నిర్మింపబడియుండు నివాసస్థానము లేక బాడుగ ఇంటితోసహా సదరు భూభాగము లేక ఖండమునకు నివాసస్థానమునకు మరియు ఆవరణకు చెందిన అన్ని కట్టడములు, గిడ్డంగులు చెట్లు, ఉమ్మడి బంజరుభూములు, వెలుగులు, పల్లములు, కంచలు, త్రోవలు, వనరులు, నీటికాలువలు, స్వతంత్రములు, విశేష హక్కులు, సదుపాయపు హక్కులు అనుకూలములు ఉపకరణము లేవియున్నను వాటితో సహా లేక దానితో ఇంతకుపూర్వము ఏవిధమునగాని వాటికి సంబంధించినదానిలో ఏదియైనను లేక ఇకముందుదానితో ఆక్రమింపబడి అనుభవింపబడు దేనినైన మరియు అదే ఆవరణలోను

---

*విలువ రు 10,000 లు మించిననే యుంచవలెను

♦విలువ 10 వేల రూపాయలకు మించిన మాత్రమే ఉంచవలెను.

మరియు దానిమీదను తాకట్టువుంచిన మనిషియొక్క యావత్తు ఎస్టేటు, అధికారము, హక్కు, బాధ్యత, ఆస్తి, స్వతంత్రము మరియు ఏ డిమాండునుగాని తాకట్టు ఉంచిన మనిషి సామాన్య తాకట్టుగా తాకట్టు ఉంచుకొన్న మనిషికి ఇందుమూలముగా ఇచ్చుచున్నారు, మరియు జారీచేయుచున్నారు మరియు తాకట్టు ఉంచిన మనిషి, తాకట్టు ఉంచుకొన్న మనిషితో ఇందుమూలమున ఈ విధముగా ఒడంబడిక చేసికొనుచున్నారు తాకట్టు ఉంచిన మనిషి ఈ దస్తావేజుల హామీమీద ఏపైకమైనను బాకీగా నున్నంతవరకు ఇందుమూలముగా జారీచేయబడినట్లు, ఈయబడినట్లు, అస్సైన్ చేయబడినట్లు ఇంతకు పూర్వము చెప్పబడిన సదరు ఆవరణలో ప్రస్తుతముండు లేక ఇకమీదట నిర్మింపబడగల అన్ని నివాసస్థానములను కట్టడములను, చక్కగాను సౌష్టవముగాను మరమ్మత్తుచేసియు అగ్ని ప్రమాదమువలన దానికి నష్టములేక హానికలుగకుండా కనీసము రూపాయల మొత్తమునకు తాకట్టు ఉంచుకొన్న మనిషి అంగీకరించిన ఏదో ఆఫీసు లేక ఆఫీసులలోను, వారి పేరు లేక పేర్లమీదను భీమాచేసి యుంచవలెను మరియు అట్టి భీమాను అమలులోనుంచు కార్యముకొరకు, అవసరమైన ప్రీమియముల నన్నిటిని మరియు పైకము మొత్తముల నన్నిటిని సకాలములో చెల్లించవలెను మరియు సదరు ఆవరణ సందర్భములో తత్కాలమందు చెల్లించవలసిన లేదా చార్జిచేయబడిన యావత్తు క్విట్ రెంటు, అసెస్సుమెంటు రేట్లు పన్నులు మరియు ఇతరఖర్చులు లేక వాటిలో దేనినైనకూడ చెల్లించి ఆ భీమా పాలిసీ లేక పాలసీలను పైనచెప్పిన విధముగా చెల్లించిన ప్రతి మొత్తముయొక్క రసీదును తాకట్టు వుంచుకొన్న మనిషికి వెంటనే అప్పగించవలెను సదరు కట్టడములను అట్లు మరమ్మతుచేసి ఉంచుటకు లేక అట్టి భీమాను చేయుటకు లేక అమలులో నుంచుటకు లేక పైన చెప్పినట్లు ఏదైన క్విట్ రెంటు, అసెస్సుమెంటు రేట్లు, పన్నులు, ఇతరఖర్చులను చెల్లించుటకు లేక పైన చెప్పినవిధముగా ఏదైన పాలిసీ లేక పాలిసీలను లేక రసీదును అట్లు అప్పగించుటకు తప్పిపోయిన పక్షమున సదరు ఆవరణలో దానిమీద తాకట్టు వుంచుకొన్న మనిషి లేక ప్రవేశించి

(ఆయా సందర్భమునకు తగినట్లు) దానిని క్రమముగాను, సౌష్టవము గాను మరమ్మత్తు చేయుటకు లేక పైన చెప్పిన మొత్తమునకు మించని ఏ మొత్తమునకైనను సదరు కట్టడములను భీమా చేయుటకును భీమా చేసి వుంచుటకును, ఆయాసందర్భమునకు తగినట్లు అట్లు చేయుటకు తగిలిన యావత్తు ఖర్చులను, ప్రీమియములను చెల్లించుటకు లేక పైనచెప్పిన ఏదైన అట్టి క్విట్ రెంటు అసెస్సుమెంటు రేట్లు, పన్నులు లేక ఇతర ఖర్చులను చేయుటకును, చట్టసమ్మతముగా నుండవలెను అయితే అట్లు చేయుటకు అతని కెట్టి నిర్బంధముగాని ఉంచకూడదు ఇంతేకాకుండా అట్టి యావత్తు ప్రీమియం ఖర్చులను ఇతర ఖర్చులను ఒక్కొక్కటి చెల్లింపబడిన కాలమునుండి పైనచెప్పిన రేటువొప్పున దానికి వడ్డీతోసహా తాకట్టు వుంచిన మనిషి వెంటనే తాకట్టు వుంచుకొన్న మనిషికి తిరిగి చెల్లించవలెను అట్లు తిరిగి చెల్లింపబడు నంతవరకు ఇందుమూలముగా తాకట్టు ఉంచబడిన ఆవరణ తిరిగి చెల్లించవలసిన మొత్తముతోను పైనచెప్పిన రేటు వొప్పున దానిమీద వడ్డీతోను, బాకీ వసూలుచేయుటకు హక్కు కలుగజేయబడును మరియు ఏ భీమా సందర్భములోనైన అందిన యావత్తు పైకములు, తాకట్టు పెట్టుకొన్న మనిషి ఇష్టానుసారము, భీమా చేయబడిన కట్టడములను పునఃస్థాపితం చేయుటకుగాని, పునరుద్ధరణ చేయుటకుగాని లేక ఈ దస్తావేజు హామీమీద తత్కాలమందు బాకీగానుండు మొత్తములకు చెల్లించుటకుగాని వినియోగింపబడవలెను మరియు తాకట్టు పెట్టుమనిషి ఒక సాధారణ తాకట్టును తాకట్టు ఉంచుకొను మనిషికి ఇచ్చుటకును, జారీ చేయుటకును ఇప్పుడు అధికారము కలిగియున్నాడని తాకట్టు ఉంచుమనిషి ఇందుమూలముగా తాకట్టు ఉంచుకొను మనిషితో ఒడంబడిక చేసికొనుచున్నారు ఈ తాకట్టు క్రింద బాకీగానుండు మొత్తముకొరకు అమ్మినపుడు ఇందుకు జతచేయబడిన షెడ్యూలలో వివరింపబడిన ఆస్తులు చాలనట్లు రుజువైన పక్షమున తత్కాలమందు ఈ తనఖా క్రింద బాకీగానుండి చెల్లించవలసిన మొత్తమునను తాకట్టు ఉంచినమనిషి స్వయముగా బాధ్యుడుగా నుండునని ఇందుమూలముగా స్పష్టముగా సమ్మతింపబడి ప్రసిద్ధపరుపబడినది

ఇందుకు సాక్షీభూతముగా తాకట్టు ఉంచిన మనిషియొక్క కామన్ సీలు, పైన తెలుపబడిన దినము, సంవత్సరమున దీనికి వేయబడినది

పైనచెప్పబడిన షెడ్యూలు

రిజిస్ట్రేషన్ జిల్లాలోని రిజిస్ట్రేషన్ సబు జిల్లాలోని గ్రామములోనున్నట్టియు, ఉత్తరమున దక్షిణమున తూర్పున పడమట ఎల్లలుగా కలిగినట్టియు, రి సర్వే నె రును, పాతసర్వే నె . రును కలిగినట్టియు, కొలిచినపుడు మొత్తముమీద ఉన్నట్టియు (ఇదికొంత ఎక్కువగా నుండవచ్చును, లేక తక్కువగా నుండవచ్చును) యావత్తు భూభాగము లేక ఖండమును, ఆవరణయు.

సమక్షమున పంచాయతీయొక్క కార్యనిర్వాహకోద్యోగిచే సంతకము చేయబడినది.

సమక్షమున పంచాయతీయొక్క కామన్ సీలు ఇందుకు వేయబడినది

II (d)నమూనా

దానమిచ్చుటమూలముగా పరివర్తన చేయుట.

ఒకవైపున (ఇందు నిటుతర్వాత "దానము ఇచ్చు మనిషి" అని చెప్పబడు, ఈ మాటలలో సందర్భానుసారముగా దానితర్వాత వచ్చునవి, ఆస్సైను చేరుదురు) 1950 వ సం॥పు 10 వ మదరాసు ఆక్టుక్రింద ఏర్పాటుచేయబడిన పంచాయతీకినికి మఱియొకవైపున (ఇందు నిటుతర్వాత "దానము పుచ్చుకొను మనిషి" అని చెప్పబడు, ఈ మాటలలో సందర్భానుసారముగా అతని వారసులు, ఎగ్జిక్యూటర్లు, అడ్మినిస్ట్రేటర్లు, చట్టసంబంధమైన ప్రతినిధులు అస్సైనులు చేరుదురు) లో కాపురముండు కుమారుడైన కును కిని మధ్య 19 వ సం॥ తేదీన చేసికొనబడిన ఒడంబడిక.

ఇందు నిటుతర్వాత వివరింపబడినట్టియు, ఇందుమూలముగా జారీచేయుటకును, మరియొకరి పగము చేయుటకు అస్సైనుచేయుటకు ఉద్దేశింపబడినట్టియు భూఖండము ఆవరణ విషయమున తాకట్టు వగైరా చిక్కులు లేకుండ బాగుగాను, చాలినంతవరకును దానము ఇచ్చు మనిషి హక్కు కలిగి యున్నందునను

సదరు భూఖండము, ఆవరణ సందర్భములో ప్రస్తుతపు మరియు భావికాలపు అన్ని పన్నులు, చార్జీలు, అసెస్‌మెంట్లు, భూమి అద్దెను, దానము పుచ్చుకొను మనిషి చెల్లించుటకు లోబడి, దానము ఇచ్చు మనిషి సదరు భూఖండమును ఆవరణను కార్యముల కొఱకు ఉపయోగించుటకు దానముగా, దానము పుచ్చుకొను మనిషికి పరివర్తన చేయుటకు సమ్మతించినందునను మరియు సదరు షరతులకు లోబడి సదరు భూఖండము మరియు ఆవరణ అంగీకరించుటకు దానము పుచ్చుకొను మనిషి సమ్మతించినందునను,

సదరు భూఖండము ఆవరణయు, స్టాంపు డ్యూటీ కొరకు రూ            ల విలువను కలిగియున్నందునను,

జిల్లా కలెక్టరు,                    తేదీగల నెం          రు ఉత్తరువుద్వారా, ఇందు నిటుతర్వాత చెప్పబడిన ఆస్తిని దానముగా నిచ్చుటను సాదరు చేసినందునను,

ఈ దానమును గురించి, ఇందు నిటుతర్వాత చెప్పబడిన విధమున దానికి సంబంధించిన విధులయొక్క నిబంధనల ప్రకారము క్రమమైన నోటీసు ఇయ్యబడినందునను,

*మదరాసు ప్రభుత్వమువారుకూడ,
తేదీగల నెం                    రు ఉత్తరువుద్వారా, ఇందునిటు తర్వాత చెప్పబడిన ఆస్తిని దానముగా నిచ్చుటను సాదరు చేసినందునను,

ఇప్పుడు ఈ ఒడంబడిక ఈ క్రింది విషయములకు సాక్షీభూతముగా నున్నది —క్రింద వ్రాయబడిన షెడ్యూలులో ఎక్కువ స్పష్టముగా వివరింపబడినట్టియు,                    రిజిస్ట్రేషను జిల్లాలో                    రిజిస్ట్రేషను సబు జిల్లాలో

---

*విలువ 10 రూపాయలను మించిన మాత్రమే వుంచవలెను.

గ్రామములోనుండు                    సర్వే నెంబరును కలిగిన యావత్తు భూభాగమును లేక ఖండమును, సదరు భూభాగము లేక ఖండమునకును ఆవరణకును చెందిన అన్ని కట్టడములు, చెట్లు, వృక్ష్మాది భూములు, వెలుగులు, పల్లములు, కంచలు, త్రోవలు, జలాశయములు, నీటి కాలువలు, స్వాతంత్రములు, విశేషహక్కులు, సదుపాయపు హక్కులు, అనుకూలములు మరియు ఉపకరణము లేవియున్నను వాటితో సహా లేక దానికి ఏ విధముగానైన సంబంధించిన లేక ఇంతకుపూర్వము ఆక్రమించబడి లేక అనుభవించబడు వాటిలో దేనినైన, మరియు సదరు ఆవరణలోను, దానిమీదను దానము ఇచ్చు మనిషియొక్క యావత్తు ఎస్టేటు, అధికారము, హక్కు, బాధ్యత, ఆస్తి, స్వాతంత్రము మరియు ఏది డిమాండుగాని దానము ఇచ్చుమనిషి దానము పుచ్చుకొను మనిషికి ఇందుమూలముగా ఇచ్చుచున్నాడు, జారీచేయుచున్నాడు తనపరము చేయుచున్నారు మరియు అస్సైనుచేయుచున్నాడు దానము పుచ్చుకొను మనిషి దానిని ఇందుమూలముగా అంగీకరించుచున్నారు దానము పుచ్చుకొను మనిషికి ఇందుమూలముగా జారీచేయబడి, తనపరము చేయబడి, అస్సైను చేయబడిన, సదరు భూభాగము లేక ఖండమును, ఆవరణను ఎల్లప్పటికి కలిగియుండి వుంచుకొనవచ్చును. పైన చెప్పిన విధమున దానము పుచ్చుకొను మనిషికి ఇందుమూలముగా జారీచేయబడి, అతనిపరము చేయబడి, అస్సైను చేయబడిన ఆవరణను, జారీ చేయుటకు, ఒకరి పరము జేయుటకు, అస్సైను చేయుటకు దానము ఇచ్చుమనిషికి ఇప్పుడు మంచి అధికారము కలదనియు, దానము ఇచ్చు మనిషినుండిగాని వారిచేగాని ఏ విధముగానైన చట్ట సమ్మతముగా వెడలగొట్టబడక, ఆటంక పెట్టబడక హక్కు కోరబడక, డిమాండుచేయబడక, దానము పుచ్చుకొను మనిషి ఎల్ల సమయములందు ఇకమీదట శాంతియుతముగాను, నెమ్మదిగాను అప్పు వగైరా చిక్కు లేవియు లేకుండాను సదరు ఆవరణను కలిగియుండి అనుభవించ వలెననియు, వచ్చుననియు, ఇంతే కాకుండ దానము ఇచ్చు మనిషియు, సదరు అవరణలో లేక అందలి ఏ భాగములోనైన దానము ఇచ్చు మనిషినుండి,

లేక వారి క్రింద లేక వారికి ట్రస్టుగా ఏదైన ఎస్టేటు లేక హక్కును కలిగిన లేక చట్ట సమ్మతముగాగాని, ధర్మముగాగాని కోరుయావన్మంది మనుష్యులును, దానము పుచ్చుకొను మనిషి కోరిన మీాదటను, అతని ఖర్చుతోను, సదరు ఆవరణను దానియొక్క ప్రతిభాగమును, పైన చెప్పిన విధముగా లేక న్యాయముగా కోరబడిన లేక కోరబడగల విధముగ దానము పుచ్చుకొను మనిషికి చెందునని అదనముగాను, పూర్తిగాను నమ్మకము కలుగజేయుటకు ఇకముందు అప్పుడప్పుడు ఎల్లవేళలందు అట్టి యావత్తు కార్యములు, పత్రములు, విషయము లలో దేనినైన చేయవలెను, వ్రాయవలెను మరియు రిజిస్టరు చేయవలెను మరియు చేయుటను, వ్రాయుటను రిజిస్టరు చేయుటను లేక చేయించవలెను, వ్రాయించవలెను రిజిస్టరు చేయించవలెను, మరియు చేయించును, వ్రాయించును రిజిస్టరు చేయించును అని దానము ఇచ్చు మనిషి దానము పుచ్చుకొను మనిషితో ఇందు మూలముగా ఒడంబడిక చేసుకొనుచున్నాడు, మరియు కేంద్ర ప్రభుత్వము లేక మదరాసు ప్రభుత్వము తరఫున జిల్లాకలెక్టరుచే సదరు భూభాగము లేక ఖండముమీాద అప్పుడప్పుడు విధించబడు రూ...... ఆ నేల పన్ను లేక అసెస్‌మెంటు లేక ఏ ఇతర మొత్తముతోనైన సహా పైన చెప్పిన భూమి ఆవరణ సందర్భములో చెల్లించగల యావత్తు ప్రస్తుతపు మరియు భావికాలపు పన్నులను చార్జీలను లేక అసెస్‌మెంట్లను, దానము పుచ్చుకొను మనిషి ఇక మీాదట అన్ని సమయములందు భరించి, చెల్లించి, బాకీ తీర్మానము చేయునట్లు, దానము ఇచ్చు మనిషితో ఇందుమూలముగా ఒడంబడిక చేసికొనుచున్నాడు

ఇందుకు సాక్షీ భూతముగా మొదటపైన వ్రాయబడినదినము నను, సంవత్సరమునందును, దానము ఇచ్చునదగు ..... .. .. పంచాయతీయొక్క కామన్ సీలును దీనికి వేయబడెను దానము పుచ్చుకొను మనిషి దీనిలో సంతకముచేసి తన సీలును వేసెను

పైన చెప్పబడిన షెడ్యూలు.

...... .. ...రిజిస్ట్రేషన్ జిల్లాలోను . . . . రిజిస్ట్రేషన్ సబు జిల్లాలోను ........ . .........గ్రామములోను

ఉన్నట్టియు, ఉత్తరమున . .....దక్షిణమున ... ...
.. . . తూర్పున. ...... పడమట.. ...... ఎల్ల
లుగా కలిగినట్టియు . . . సర్వే నెంబరు కలిగినట్టియు,
కొలవగా మొత్తము ..... . లేక దానికి కొంత ఎక్కువగాని
తక్కువగాని కలిగినట్టియు యావత్తు భూభాగము లేక ఖండము
మరియు ఆవరణ,

. . సమక్షమున ...... పంచాయతీయొక్క
కార్యనిర్వాహకోద్యోగిచే సంతకము చేయబడెను

. . సమక్షమున పైన పేర్కొనబడిన వారిచే
సంతకము చేయబడి, సీలు వేయబడి, అప్పగించబడెను ..
.. సమక్షమున . . పంచాయతీ యొక్క కామన్
సీలు దీనికి వేయబడెను

3 షెడ్యూలు

III (a) నమూనా

[4 (2) మరియు 5 (2) వ విధులను చూడుడు ]

కౌలు మూలముగా పరివర్తన.

ఒక వైపున (ఇందు నిటుతర్వాత "కౌలు ఇచ్చు మనిషి" అని చెప్పబడు, ఈ మాటలలో సందర్భానుసారముగా దానికి తరువాత వచ్చునవి, అసైనులు చేరుదురు) 1950 వ సం॥పు 10 వ మదరాసు ఆక్టు క్రింద ఏర్పాటుచేయబడిన—————పంచాయతీకిని, మరియొక వైపున (ఇందు నిటుతర్వాత "కౌలుదారు" అని చెప్పబడు ఈమాటలలో సందర్భానుసారముగా అతని వారసులు ఎగ్జిక్యూటర్లు, అడ్మినిస్ట్రేటర్లు, చట్ట సంబధమైన ప్రతినిధులు, అనుమతించబడిన అసైనులు చేరుదురు) —————లో కాపురముండు—————గా వ్యాపారముచేయు—————కుమారుడైన—————కిని/కును మధ్య 19 వ సం॥—— —————తేదీన జేయబడిన ఒడంబడిక

ఇందు నిటుతర్వాత తెలుపబడియున్న కాలపరిమితికిని అద్దె రేటు చొప్పునను షరతులకును ఒడంబడికలకును లోబడియు దీని

యొక్క మొదటి షెడ్యూలులో ఎక్కువ స్పష్టముగా వివరింపబడిన ఆ స్తిని కౌలు కిచ్చు నిమిత్తము కౌలుదారు కౌలుకిచ్చు మనిషిని కోరి యున్నందునను కౌలుకిచ్చు మనిషి ఇందు నిటుతర్వాత తెలుపబడిన విధమున సదరు ఆ స్తిని కౌలుకిచ్చుటకు, సమ్మతించినందునను.

*(—————ఇన్‌స్పెక్టరు————తేదీగల ——— నెంబరు ఉత్తరవువలన దీనియొక్క 2 వ షెడ్యూలులోనున్న ప్రత్యేక షరతులమీద, షరతులకులోబడియు ఆ స్తిని కౌలుకిచ్చు టను సాదరు చేసినందునను )

ఆ స్తిని కౌలు కిచ్చుటను గురించి, దానికి సంబంధించిన విధుల యొక్క నిబంధనల ప్రకారము క్రమమైన నోటీసు ఈయబడినందున నను,

ఇప్పుడు ఈ ఒడంబడిక ఈ క్రింది విషయములకు సాక్షీ భూతముగా నున్నది

1 ఇందుమూలముగా నిష్కర్ష చేసికొనబడిన అద్దె, కార ణముగాను ఇందులో చెప్పబడిన కౌలుదారు చేసుకొన్న ఒడంబడికల కారణముగాను ... ...రిజిస్ట్రేషను జిల్లాలోను. రిజి స్ట్రేషను సబు జిల్లాలోను, ఉన్నట్టియు..... ... సర్వే నెంబరును కలిగినట్టియు యావత్తు భూభాగము లేక ఖండమును...... .. అని చెప్పబడు కట్టడము మరియు ఆవరణతో సహా. . సంవత్సర ముల కాలపరిమితి వరకు 19 వ సం॥..... ... తేదీనుండి అన్ని తగ్గింపులు మినహాయించి . ...రూపాయల మాసవారి అద్దెను ముందుగా దానికై చెల్లించవలెను అట్టి చెల్లింపులలో మొదటి 19 వ సం॥ . . .దినమున చేయబడవలెను

2 కౌలుదారు కౌలు ఇచ్చు సంస్థతో ఈ క్రింది విధముగా ఒడంబడిక చేసికొనుచున్నారు —

(1) నిష్కర్ష చేసుకొనబడిన అద్దెను ముందుగా ప్రతినెల యొక్క మొదటి తేదీన లేక అంతకు పూర్వమున్ను పైన చెప్పిన విధముగాను చెల్లించవలెను

*అవసరమైన యెడల దీనిని ఉంచవలెను.

(2) సదరు ఆవరణ సందర్భములో చెల్లించవలసినయావత్తు ప్రస్తుతపు మరియు భావికాలపు చార్జీలను అసెస్సు మెంట్లను,వ్యయములను మరియు కేంద్రప్రభుత్వము లేక మదరాసు ప్రభుత్వముతరఫున .. ... జిల్లా కలెక్టరు వలన భూభాగము లేక ఖండముమీాదఅట్లు అప్పుడప్పుడు విధించగల . రూపాయల భూమి శిస్తు లేక ఏ ఇతర మొత్తముతోనైన సహా భరించి చెల్లించి తీర్చవలెను

(3) కౌలు కీయబడిన ఆవరణయొక్క వెలుపలి మరియు లోపల భాగమును దానికి చెందిన అన్ని చేర్పులను, దానియొక్క ప్రహారిగోడలను కంచెలను వాన నీటిని కొనిపోవు మురికి నీటిని కొనిపోవు మరియు ఇతర గొట్టములను, పారిశుద్ధ్య సంబంధమైన, నీటి సంబంధమైన పరికరములను, విద్యుచ్ఛక్తి అమర్పులను దానికి సంబంధించిన స్థావరమైన వస్తువులను చక్కని మరియు కాపురముండుటకు తగిన మరమ్మతుచేసి మరియు అట్టి స్థితిలో ఉంచవలెను

(4) కవులుయిచ్చు సంస్థయొక్క లేక దాని అధికారమును క్రమముగా పొందిన ఉద్యోగులయొక్క లిఖితపూర్వకమైన అంగీకారమును ముందుగా పొందక కౌలుకీయబడిన కట్టడములో ఎట్టి మార్పులను కాని లేక చేర్పులను కాని ఏ పరిస్థితులందైనను చేయకూడదు, లేక చేయుటను అంగీకరించకూడదు, అయితే కౌలు ఇచ్చు సంస్థ లేక దాని అధికారమును క్రమముగా పొందిన ఉద్యోగులు ఏ మార్పులైనను చేయుటకు కౌలుదారునికి అనుజ్ఞ నిచ్చిన పక్షమున కౌలుదారు దానికై ఎట్టి నష్టపరిహారమును పొందుటకుగాని హక్కు కలిగి యుండకూడదు

(5) ఒక దినము నోటీసును ముందుగా ఇచ్చినమీాదట న్యాయమైన అన్ని సమయములందు కౌలుఇచ్చు సంస్థను దాని అధికారము పొందిన ఉద్యోగులను లేక ఏజెంట్లను పని మనుష్యులు లేక ఇతరులలో గాని వారు లేకుండగాని గుత్తకీయబడిన ఆవరణలో ప్రవేశించి దానిస్థితిని కనుగొనుటకు అనుమతించవలెను మరియు కౌలుకిచ్చు సంస్థ లేక దాని అధికారము పొందిన ఉద్యోగులు నోటీసు యిచ్చిన మీాదట నోటీసు అందజేయబడినప్పటినుండి ఒక నెలలోపల దాని ప్రకారము మరమ్మతు చేయవలెను.

(6) ఇన్‌స్పెక్టరుచే నిర్ణయింపబడినట్టిని ఇందుకు జతచేయ బడిన 2 వ షెడ్యూలులో నుండునట్టిన్ని షరతులను ఒడంబడికలును గమనించి వాటిని నెరవేర్చవలెను

(7) కవులుకిచ్చు సంస్థయొక్క లేక దాని అధికారము పొందిన ఉద్యోగులయొక్క లిఖిత పూర్వకమైన అంగీకారము మొదట పొందక గుత్తకియ్యబడిన ఆవరణను లేక అందలి ఏ భాగమునైనను అస్సైను చేయకూడదు మరియొకరికి గుత్త కివ్వకూడదు లేక దాని స్వాధీనమును విడిచిపెట్టకూడదు

(8) కౌలుదారీ హక్కు నిలిచిపోయినప్పుడు కౌలుకిచ్చిన ఆవరణను దానికి చెందిన యావత్తు స్థావరమైన వస్తువులు మరియు చేర్పులతో సహా ఇందులో చెప్పబడిన ఒడంబడికల ప్రకారముచక్క గాను కాపురముండుటకు తగిన మరమ్మతుచేసి ఆట్టిస్థితిలో అప్పగించ వలెను

3 కౌలుకిచ్చు సంస్థ కౌలుదారుతో ఈ క్రింది విధముగా ఒడంబడిక చేసుకొనుచున్నది —

కౌలుదారు ఇందుమూలముగా నిష్కర్ష చేసికొనబడిన అద్దెను చెల్లించుచును, ఆయన చేయవలసినదిగా దీనిలో నున్న వివిధ ఒడంబడికలను, షరతులను నెరవేర్చుచును, చేయుచును, కౌలుకిచ్చిన సంస్థవలనగాని, అతనిక్రింద లేక అతనికి ట్రస్టుగా న్యాయముగా హక్కునుకోరు ఏ మనిషివలనగాని ఎట్టి ఆటంకమైన లేక సదరు కాల పరిమితియందు కౌలుకీయబడిన ఆవరణను శాంతియుతముగా కలిగి యుండి అనుభవించవలెను

(2) ప్రధాన గోడలకు, పైకప్పుకు, పునాదులకు చాల కాలము ఉపయోగించినందులవలన కలుగు శిథిలము లన్నిటిని మరమ్మతు చేయవలెను అట్లు మరమ్మతు చేయు అవసరమును గురించి... .. .డివిజనులో తత్కాలమందున్న ఎగ్జిక్యూటివ్ ఇంజ నీరుయొక్క తీర్మానము ఆఖరైనదిగా ఉండవలెను

4 అయితే ఎల్లప్పుడు మరియు ఇందుకు కక్షిదారులవలనను వారి మధ్యను ఇందుమూలమున ఈక్రిందివిధముగా స్పష్టముగా సమ్మ తింప బడినది :—

(1) ఇందుమూలముగా నిష్కర్ష చేసుకొన్న అద్దె లేక అందలి ఏభాగమైనను (నియమితముగా కోరబడినను సరే, కోరబడకున్నను సరే) చెల్లించవలసిన తేదీ తరువాత 14 దినములకు చెల్లించనపక్షమున లేక ఎందులోనున్న కౌలుదారుయొక్క ఏ ఒడంబడికనైన నెరవేర్చని పక్షమున లేక అనుసరించని పక్షమున లేక ఇందుమూలముగా సృష్టించబడిన హరతు తత్కాలమందు ఎవరికి చెందవలెనో అట్టి కౌలుదారు లేక ఇతరమనిషి దివాలాదారైన పక్షమున అప్పుడు మరియు సదరు ఏ సందర్భములో దేనియందైనను కౌలుఇచ్చు సంస్థ లేక దాని యొక్క అధికారము పొందిన ఆఫీసర్లు అటుతరువాత ఏ కాలమందైనను కౌలుకీయబడిన ఆవరణ లేక అందలి ఏ భాగములోనైన పూర్తి ఆస్తిపేరిట తిరిగి ప్రవేశించుట చట్టసమ్మతముగా నుండవలెను అందుమీదట ఈ కౌలు పూర్తిగా ఆగిపోవలెను. కాని, ఇందులో చెప్పబడిన కౌలుదారుయొక్క ఒడంబడికలో దేనినైన ఉల్లంఘించిన సందర్భములో కౌలుకిచ్చు సంస్థ చర్యతీసికొనుటకైన హక్కుకు భంగముగా నుండకూడదు

(2) ఏ కాలమందైనను, ప్రజాహితమునుబట్టి కౌలును అంతమొందించుట అవసరమని ఇన్‌స్పెక్టరుకు లేక కౌలుకిచ్చిన సంస్థకు తోచిన పక్షమున (వీరి తీర్పు ఆఖరైనదిగా నుండవలయును) కౌలుదారు కడపటిగా నివసించుచుండిన స్థలమునకు లిఖితపూర్వకమైన నోటీసును పంపుటద్వారా సదరు ఇన్‌స్పెక్టరు లేక కౌలుఇచ్చు సంస్థ కౌలును వెంటనే రద్దుచేయవలెను అందుమీదట ఈ కౌలుపూర్తిగా నిలిచిపోవలెను బయానాగా కౌలుదారు చెల్లించియుండగల ఏదైన అద్దెలో ఒక దామాషాగా చేయబడు త్రోసివేత తప్ప అట్లు నిలచిపోవు సందర్భములో కౌలుదారు ఎట్టి పరిహారమునైన పొందుటకు హక్కు కలిగియుండకూడదు

ఇందుకు సాక్షీభూతనుగా మొదట పైన వ్రాయబడిన దినమునను సంవత్సరమునను కౌలుయిచ్చు సంస్థయగు.. .. పంచాయతీ యొక్క కామన్ సీలు దీనికి వేయబడెను మరియు కౌలుదారు దీనిలో సంతకముచేసి అతని సీలును వేసెను

## పైన తెలుపబడిన మొదటి షెడ్యూలు

రిజిస్ట్రేషన్ జిల్లాలో రిజిస్ట్రేషన్ సబుజిల్లాలో గ్రామములో నున్నట్టియు ఉత్తరమున——దక్షిణ మున————పడమట —— తూర్పున——ను ఎల్లలుగా కలిగినట్టియు—— సర్వే నెంబరును —— తలుపు నెంబరును కలిగి నట్టియు, కొలువగా మొత్తము—కొంత ఎక్కువగా నైనను, తక్కువగా నైనను కలిగినట్టియు యావత్తు భూభాగము లేక ఖండమును ఆవరణయు

## పైన తెలుపబడిన రెండవ షెడ్యూలు

ఇన్ స్పెక్టరు విధించిన షరతులు

——సమక్షమున——పంచాయతీయొక్క కార్యనిర్వాహకోద్యోగి వలన సంతకము చేయబడెను, ————————

——సమక్షమున ——పంచాయతీయొక్క కామన్ సీలు దీనిలో వేయబడెను——సమక్షమందు పైన పేర్కొనబడినవారిచే సంతకము చేయబడి సీలువేయబడి అప్పగించబడెను.

## III (b) నమూనా

[6 (2) వ విధిని చూడుడు]

## కౌలుమూలముగా పరివర్తన.

ఒకవైపున (ఇందు నిటుతర్వాత "కవులునిచ్చు సంస్థ"—అని చెప్పబడు ఈ మాటలలో సందర్భానుసారముగా దానికి తరువాత వచ్చునవియును, అస్సైనులును చేరుదురు) 1950 వ సం॥పు 10 వ మదరాసు ఆక్టు ననుసరించి ఏర్పాటు చేయబడిన——పంచాయతీకిని మరియొక వైపున (ఇందునిటుతరువాత "కవులుదారు"అని చెప్పబడు ఈ మాటలలో సందర్భానుసారముగా అతని వారసులు, ఎగ్జిక్యూటర్లు అడ్మినిస్ట్రేటర్లు, చట్టసంబంధమైన ప్రతినిధులు, అనుమతింపబడిన అస్సైనులు చేరుదురు)————లో కాపురముండు———— వ్యాపారముచేయు——యొక్క కుమారుడైన ——కును మధ్య 19 వ సం॥ దినమున చేసికొనబడిన ఒడంబడిక.

ఇందుకు చేర్చబడిన మొదటి షెడ్యూలులో ఎక్కువ స్పష్టముగా వివరింపబడిన ఆస్తిని ఇందుకు తరువాత చెప్పబడియున్న కాల పరిమితి వరకును, అద్దె రేటు చొప్పునను షరతులు ఒడంబడికలకు లోబడియు కవులుకిచ్చునట్లు కవులుదారు కవులిచ్చుసంస్థను కోరినందునను, గుత్తకిచ్చు సంస్థ సదరు ఆస్తిని అందునిటుతర్వాత తెలుపబడిన విధమున కవులుకిచ్చుటకు సమ్మతించినందునను,

(————జిల్లా కలెక్టరు——తేదీ గల——నెంబరు వుత్తరువుద్వారా ఇందుకు జతచేయబడిన 2 వ షెడ్యూలులో నున్న ప్రత్యేక షరతులనుమీదను వాటికిలోబడియు ఆస్తిని కవులుకిచ్చునట్లు సాదరు చేసినందునను)

దానికి సంబంధించిన విధులయొక్క నిబంధనల ప్రకారము ఆస్తి కవులును గురించి క్రమమైన నోటీసు ఈయబడినందునను

ఇప్పుడు ఈ ఒడంబడిక పత్రము ఈ క్రింది విషయములకు సాక్షీభూతముగా నున్నది—

1 ఇందుమూలముగా నిష్కర్ష చేసికొనిన అద్దెయొక్క ఇందులోనున్న కవులుదారుచే చేసికొనబడిన ఒడంబడికలయొక్కయు ప్రతిఫలముగా $\frac{\text{రోడ్డుప్రక్క}}{\text{ఓధఅంచు}}$ యొక్క భాగముగా నుండునట్టియు ఇందుకు జతచేయబడిన షెడ్యూలులో ఎక్కువ స్పష్టముగా వివరింపబడినట్టియు భూభాగము నంతటిని 19 వ సం———దినము నుండి—————సం॥ ల———కాలపరిమితి వరకు అన్ని త్రోసివేతలు పోగా ప్రతి సంవత్సరము———రూపాయల అద్దెను ముందుగా దాని కొరకు చెల్లించుచు 19 వ సం॥ తేదీన అట్టి మొదటి చెల్లుబడిని చెసి కవులుకిచ్చు సంస్థ కవులుదారునకు కవులుకిచ్చుచున్నారు

8 కవులుదారు కవులిచ్చు సంస్థతో ఈ క్రిందివిధముగా ఒడంబడిక చేసికొనుచున్నారు—

(a) నిష్కర్ష చేసికొన్న అద్దెను ప్రతి సంవత్సరము నెల 1 వ తేదీన లేక అంతకు పూర్వము అడ్వాన్సుగాను పైన చెప్పిన విధముగాను చెల్లించవలెను

*అవసరమైననే యుంచుము

(b) కేంద్ర ప్రభుత్వము లేక మదరాసు ప్రభుత్వము తరఫున జిల్లా కలెక్టరువలన సదరు భూభాగము లేక ఖండము మీాద అప్పుడప్పుడు విధించగల రూపాయల నేల పన్ను లేక ఏ యితర మొత్తముతోనైన సహా కవులుకీయబడిన భూమికొరకు చెల్లించవలసిన యావత్తు ప్రస్తుతపు మరియు భావికాలపు పన్నులను చార్జీలను, అసెస్సుమెంట్లను, వ్యయములను భరించవలెను చెల్లించవలెను మరియు తీర్చవలెను

(c) కౌలుకీయబడిన భూమిని మంచిస్థితిలో నుంచవలెను

(d) కవులునిచ్చు సంస్థయొక్క లేక క్రమముగా అధికార మీాయబడిన దాని ఉద్యోగులయొక్క లిఖితపూర్వకమైన అనుమతిని ముందుగా పొందక కవులుకీయబడిక భూమిలో ఏ సందర్భములోగాని ఏమైన మార్పులను లేక దానికి జేర్పులను చేయకూడదు లేక చేయుటను అనుమతించకూడదు అయితే, కౌలునిచ్చు సంస్థ లేక క్రమముగా అధికార మీాయబడినదాని ఉద్యోగులవలన కౌలుదారు ఏ మార్పులనైన చేయుటకు అనుమతింపబడినప్పుడెల్లను దానికొరకు కౌలుదారు ఎట్టి నష్టపరిహారమునైన పొందుటకు హక్కు కలిగి యుండకూడదు

(e) ఒక దినము నోటీసును ముందుగా ఇచ్చినమీాదట పని మనుష్యులతోగాని పనిమనుష్యులు లేకుండగాని కౌలుఇచ్చు సంస్థ అధికారము పొందిన దాని ఉద్యోగులు లేక ఏజెంట్లను కౌలుకిచ్చిన భూమిలో ప్రవేశించి దానిపరిస్థితిని కనుగొనుటకు అనుమతించవలెను.

(f) కౌలుకీయబడిన భూమి ఏ ఉద్దేశముతో అట్లు ఈయబడినదో దానికొరకు మాత్రము సదరు భూమిని ఉపయోగించవలెను.

(g) కౌలుఇచ్చు సంస్థ లేక అధికారమును పొందిన దాని ఉద్యోగులయొక్క లిఖిత పూర్వకమైన అంగీకారమును పొందక కవులుకీయబడిన భూమిని లేక అందలి ఏభాగమునైన అస్సైను చేయకూడదు లేక మరియొకరికి గుత్తకీయకూడదు లేక దాని స్వాధీనమును వదలిపెట్టకూడదు

(h) ఇందుతోనున్న ఒడంబడికల ప్రకారము గుత్తకీయబడిన భూమిని మంచి స్థితిలో అప్పగించవలెను.

3. కవులుదారు ఇందుమూలముగా నిష్కర్ష చేసికొన్న అద్దెను చెల్లించుచు ఇందులోనున్న అతనియొక్క వివిధ ఒడంబడికలను షరతులను అనుసరించుచు నెరవేర్చినమీదట కవులుకిచ్చువ్యవస్థవలన లేక కవులుకిచ్చు వ్యవస్థక్రింద లేక వారిట్రస్టీగా న్యాయముగా హక్కు కోరు ఏ ఇతర మనిషివలనగాని ఎట్టి ఆటంకము లేకుండా సదరు కాలపరిమితిలో కవులుకిచ్చిన భూమిని శాంతియుతముగా కలిగియుండి అనుభవించవచ్చునని కవులుకిచ్చిన సంస్థ కవులుదారుతో ఒడంబడిక చేసుకొనుచున్నది

4 ప్రజాహితముకొరకు కవులుకిచ్చిన భూమిలో నిర్మించబడిన ఏ కట్టడమునైన తొలగించుట అవసరమని కవులు యిచ్చినసంస్థ లేక జిల్లా కలెక్టరు అభిప్రాయపడినయెడల కవులుదారుకు ఎట్టి నష్టపరిహార మునైన చెల్లించక కవులుయొక్క కాలపరిమితిలోపల ఏ సమయమం దైనను కవులును అంతమొందించవచ్చును

5 ఇందులోనున్న షరతు ప్రకారము నియతముగా కోర బడినను సరే కోరబడకపోయిననుసరే యిందుమూలముగా నిష్కర్ష చేసికొన్న అద్దెగాని అందలి ఏ భాగముగాని చెల్లింపబడని పక్షమున లేక యిందులోనున్న కవులుదారునియొక్క ఏ ఒడంబడికగాని నెర వేర్చబడని పక్షమున లేక అనుసరింపబడనిపక్షమున లేక యిందు మూలముగా తత్కాలమునకు సృష్టించబడిన గుత్తకాలపరిమితి ఎవరికి చెందియున్నదో అట్టి కవులుదారుగాని యితర మనిషిగాని దివాలాదారుడైనయెడల అప్పుడు మరియు సదరు సందర్భములలో దేనియందైనను పూర్తిభూమి పేరిట కవులుకీయబడిన భూమిలోగాని అందలి ఏ భాగమందుగాని కవులు యిచ్చిన సంస్థ లేక అధికారము పొందిన దాని ఉద్యోగులు తర్వాత ఏ కాలమందైనను తిరిగి ప్రవే శించుట చట్టసమ్మతమై యుండవలెను అందుమీదట యిందులో నున్న గుత్తదారుని ఒడంబడికలలో దేనినైనను ఉల్లంఘించినందుకు గుత్తయిచ్చిన సంస్థ చర్యతీసికొనుటకుగల అధికారమునకు భంగము కలుగకుండ ఈ కవులు పూర్తిగా ఆగిపోవలెను

6 కక్షిదారులలో ఎవరైనను ప్రస్తుతపు కవులును అంతమొం దింపగోరి అట్టి ఉద్దేశమునుగురించి మరియొక కక్షిదారునికి లిఖిత

పూర్వకమైన నోటీసును 3 నెలలకు పూర్వము యిచ్చినయెడల 3 క్యాలండరు నెలలు అంత్యమై వెంటనే ప్రస్తుతపు కవులును దాని లోనుండు అన్నియును అంత్యమై చెల్లకపోవలెను కాని ఏదైన పూర్వపు హక్కు లేక ఒడంబడికయొక్క వుల్లంఘన సందర్భములో ఏ కక్షిదారైనను మరియొక కక్షిదారు కోరగల పరిహారములకు ఇది భంగకరముగా నుండకూడదు

7 గుత్త జారీచేయబడిన కాలపరిమితి గడచిపోయినమీాదట కౌలుదారు, గుత్తను పునరుద్ధరించిననే తప్ప లేక 4 వ ఖండము క్రింద గుత్త అంత మొందింపబడినప్పుడు కౌలుకీయబడిన భూమిమీాద ఉండు కట్టడములన్నిటిని తొలగించుటకు కౌలుదారు బద్ధుడైయుండును గుత్త గడచిపోయిన తేదీనుండి 3 నెలల లోపల లేక 4 వ ఖండము క్రింద ఒక నోటీసు అందిన తేదీనుండి 3 నెలల లోపల ఈ రెండింటిలో ఏ తేదీ మొదటవచ్చునో అప్పుడు కవులుదారు నిర్మాణమును తీసివేయుటకు తప్పిపోయినపక్షమున కవులుదాలునకు నోటీసు ఇవ్వకయే గుత్తకిచ్చిన సంస్థ దానిని తొలగించునటులు చేయవచ్చును మరియు అట్లు తొలంగించినందుకైన ఖర్చులను భరించుటకు కవులుదారు ఇందుమూాలముగా బద్ధుడగును అట్లు తొలగింపబడిన కట్టడము కొరకు గాని అట్లు తొలగించుటవలన కలిగిన ఏదైన హాని లేక నష్టముకొరకు గాని కవులుదారు ఎట్టి పరిహారమునైన కోరకూడదు

8 ఇందుకు సాక్షీభూతముగా మొదట పైన వ్రాయబడిన సంవత్సరమందును, దినమందును కవులుకిచ్చు సంస్థయైన పంచాయతీయొక్క కామన్ సీలు ఇందుకు వేయబడెను కవులుదారు దీనిలో సంతకముచేసి తన సీలును వేసెను.

పైన చెప్పబడిన మొదటి షెడ్యూలు.

రిజిస్ట్రేషను జిల్లాలో రిజిస్ట్రేషను సబు జిల్లాలో గ్రామములో నున్నట్టియు, ఉత్తరమున దక్షిణమున పడమట తూర్పున ఎల్లలుగా కలిగినట్టియు సర్వే నెంబరు

ఇంటి నెంబరును కలిగినట్టియు, కొలువగా మొత్తము
మీంద దీనికి కొంత ఎక్కువగాని తక్కువగాని కలిగి
నట్టియు భూభాగము లేక ఖండము మరియు ఆవరణ

పైన చెప్పబడిన రెండవ షెడ్యూలు.

జిల్లాయొక్క కలెక్టరు విధించిన షరతులు,
సమక్షములో పంచాయతీయొక్క
కార్యనిర్వాహక అధికారి వలన సంతకము చేయబడినది.
సమక్షమున పంచాయతీయొక్క
కామన్ సీలు దీనికి వేయబడినది
సమక్షమున పైన పేర్కొనబడినవారిచే సంతకము
చేయబడి సీలువేయబడి అప్పగించబడినది

సెక్షను 112 (2) (XIV) క్రింద విధులు

I పనులకు కంట్రాక్టులను గురించి విధులు.

(జి ఒ నెం 677, ఎల్ ఎ తేదీ 2-4-1952)

విధులు

పంచాయతీ పనులకై టెండర్లను కోరుట మరియు అంగీకరించుట

1 కంట్రాక్టుపై నిర్వహింపబడవలసి నట్టియు కంట్రాక్టు మొత్తము 300 రూపాయలను మించునట్టియు ప్రతి పని విషయము లోను టెండర్లను రప్పించవలెను,

అయితే నిర్వహింపబడు నిమిత్తము హైవేస్ డిపార్టుమెంటు వారికి అప్పగింపబడిన ఏ పని విషయములోనైన పంచాయతీ టెండర్లను వదలివేయ వచ్చును

2 (1) 1 వ విధియొక్క నిబంధనల కధీనమై, పంచాయతీ యొక్క కార్యనిర్వాహకాధికారి సీలుచేయబడిన కవర్లలో టెండర్లను రప్పించవలెను వాటిని—

(a) జిల్లాయొక్క ముఖ్యభాష లేక భాషలయందొక నోటీసును పంచాయతీ కార్యాలయమందును, గ్రామ చావడివద్దను మరియు కార్యనిర్వాహకాధికారి యుక్తమని తలంచునట్టి యితర స్థలములవద్దను అంటించుటద్వారా , మరియు

(b) పనియొక్క విలువ 2,000 రూపాయలను మించు సందర్భమున, జిల్లాయందు ప్రచారములోనున్న ఒకటి లేక అంతకంటె ఎక్కువ వార్తాపత్రికలలో ప్రకటన చేయుటద్వారా సాధ్యమైనంత బహిరంగమైనట్టియు అందరకు తెలియునట్టియు రీతిని రప్పించవలెను

(2) (1) వ ఉపవిధి క్రింద ప్రకటించబడిన ప్రతి ప్రకటన లేక నోటీసు ఈ క్రిందివాటిని తెలుపవలెను —

(1) కంట్రాక్టు పత్రములు ఎప్పుడు మరియు ఎచ్చట పరిశీలింపబడును,

(11) టెండరు చేయుటకైన సరియగు నమూనా, అనగా, అది అంచనా రేట్లకు నిర్దిష్టగునట్టి తక్కువ లేక ఎక్కువ శాతముగ నుండవలెనా లేక అనుసూచియందు జేర్చబడిన పనియొక్క ప్రతి పద్దునకు ఖచ్చితమైన రేట్లను తెలుపవలెనా

(111) టెండర్లను ఎప్పుడు మరియు ఎవరికి దాఖలు చేయవలెను,

(1V) అవి ఎప్పుడు మరియు ఎక్కడ తెరువబడును,

(v) టెండరుతోబాటు పంపబడవలసిన ఎర్నెస్టు సొమ్ము మరియు టెండరు అంగీకరింపబడిన పక్షమున కోరబడు హామీయొక్క మొత్తము, స్వభావము, మరియు

(v1) పంచాయతికి అందిన టెండర్లన్నింటిని లేక అందు వేటినైన ఎట్టి కారణమునుగాని తెలుపకయే నిరాకరించు హక్కు పంచాయతీయే కలిగియుండును

3 (1) టెండరు చేయుటకైన సరియగు నమూనా అనగా అది అంచనా రేట్లకు నిర్దిష్టమగు తక్కువ లేక ఎక్కువ శాతముగ నుండవలెనా లేక సాదరు చేయుబడిన అంచనాలోఏర్పాటు చేయుబడిన రేట్లతో నిమిత్తము లేకుండ అనుసూచియందు జేర్చబడిన పనియొక్క ప్రతి పద్దునకు కచ్చితమైన రేట్లను తెలుపవలెనా యనునది, అంచనాను వ్యవహారరీత్యా సాదరుచేయుటకు హక్కుగల అధికారిచే ప్రతి సందర్భముయొక్క ఉన్నతాంశములను బట్టి నిశ్చయింపబడవలెను

(2) టెండర్ల శాతము పద్ధతిపై కోరబడిన పక్షమున, కంటాక్టర్ల సంగ్రహపు టంచనాలను మాత్రమే పరిశీలించుట కంగీక

రింపబడవచ్చును వస్తు సామాగ్రియొక్క నికరపు విలువను, అంచనా యదార్థముగా దేనిపై నాధారపడియున్నదో అట్టి లీడ్సు (మట్టిపని చేయవలసిన భాగముల) యొక్క దూరమును తెలియజేయు విషయ వివరణము వారికి చూపబడకూడదు లేక అది కంట్రాక్టు పత్రములందు ఒక భాగము కాకూడదు

4. కంట్రాక్టుపై పని నెరవేర్పబడుటకుగాను టెండర్లు రప్పించబడుటకు పూర్వము, పంచాయతీయొక్క కార్యనిర్వాహకాధికారి, అంచనాకు వ్యవహార రీత్యా సాదరు నొసంగుటకు హక్కుగల అధికారివద్దనుండి కంట్రాక్టు పత్రములను పొందవలెను వాటిలో ఈ క్రిందివాటిని చేర్చియుండవలెను —

(1) ఉద్దేశింపబడిన పనియొక్క సాధారణ కొలతలను చూపు పటముయొక్క పూర్తి వరుస మరియు అవుసరమగునంత వరకు వివిధ భాగముయొక్క వివరములు ,

(2) ఏదియు ప్రమాణమగు స్పష్టమైన మాదిరిని గూర్చి చెప్పబడునగు సందర్భమున తప్ప, చేయవలసిన పనియొక్కయు ఉపయోగించవలసిన సామగ్రియొక్కయు స్పష్టమైన పూర్తిమాదిరి

(3) పనిలో వివిధ రకములకు సంబంధించిన పరిమాణముల అనుసూచి ,

(4) టెండరు పంపు మనిషియొక్క టెండరు అంగీకరింపబడు పక్షమున, ఆయన అనుసరించబడిన 'కంట్రాక్టు షరతుల' జాబితా, మరియు

5 ఫుక్కు పని తాలూకు కంట్రాక్టు మొత్తము 5,000 రూపాయలను మించు ఏ పని విషయముననైన అట్టి ఉక్కు పనికిగాను టెండర్లకు విడిగా రప్పించవలెను ఇందు వలన ఉక్కు పనులు చేయు కర్మాగారములు అట్టిపనుల విషయములో పోటీ రేట్లతో టెండర్లను పంపవీలగును

వివరణము —ఈ విధియొక్క కార్యముల నిమిత్తముఉక్కు పనియొక్క విలువను లెక్కపెట్టుటలో రీఇన్‌ఫోర్సు చేయబడిన కాంక్రీటు పనియొక్క విలువను చేర్చగూడదు.

6. టెండరు నోటీసులో నిర్దిష్టము చేయబడిన ఎర్నెస్టు పైకముమ చేర్చి పంపిననే తప్ప సాధారణముగా ఏ టెండరునుగాని చెల్లదగినట్లు ఎంచకూడదు.

రిఫరెన్సు సౌకర్యమునకై ఎర్నెస్టు పైకముగా డిపాజిటు చేయబడిన మొత్తముల ప్రత్యేక జాబితా నొకదానిని వ్రాసియుంచవలెను పంచాయతీయొక్క కార్యనిర్వాహకాధికారి దీనిపై చేవ్రాలు చేయవలెను

7 డిపాజిటు చేయబడవలసిన ఎర్నెస్టుపైకము తగునంత పెద్ద మొత్తముగనుండవలెను ఇది ఆయా సంగతికి తగినట్లు టెండరును అంగీకరించిన తర్వాత నిర్ణయింపబడిన కాలములోపల కంట్రాక్టరు కోరబడిన హామీని ఇచ్చుటను తప్పిపోవుటవలన కలుగు నష్టమునకును లేక ఆయనకు బాకీవున్న మొత్తములు తగిన గ్యారంటీగా ఏర్పడు నంతవరకును, హామీగనుండును

8 కార్య నిర్వాహకాధికారి అందునిమిత్తము నిర్దిష్టము చేయబడిన కాలముననుు, స్థలమునందును, హాజరు కాగల టెండరుదార్ల లేక వారి అధికారముపొందిన ఏజెంట్ల సమక్షమున టెండర్లు గల సీలుచేయబడిన కవర్లను తెరువవలెను సీలు చేయబడిన కవర్లను తెరువబడునంతవరకు, వాటిని కార్యనిర్వాహకాధికారి తన స్వంత రక్షణలో నుండవలెను టెండర్లను తెరచిన మీదట ప్రతి టెండరు నందును టెండరుదారునిచే దిద్దబడి ఆయనచే ఋజువు సంతకముచేయబడియుండగల, దిద్దుబాట్లన్నింటికి కార్య నిర్వాహకాధికారి పొడి అక్షరములలో సంతకము చేయవలెను టెండరులో టెండరుదారునిచే ఋజువు సంతకము చేయబడని దిద్దుబాట్లేవైననున్న యెడల, టెండరును తెరచిన పిమ్మట దానిమీదనే అట్టిదిద్దుబాట్లకు గుర్తుపెట్టవలెను. అందిన టెండర్ల మొత్తము సంఖ్యను కార్యనిర్వాహకాధికారి టెండరు రిజిష్టర్లు ప్రతిపనికి ఎదురుగ నమూదుచేయవలెను

9. టెండర్లను తెరచిన మీదట వాటిని పట్టీవారీగా వ్రాసి టెండరు రిజిష్టరులో నమూదుచేయవలెను సదరు రిజిష్టరును, ఈ విధులకు అనుబంధముగా జేర్పబడిన నమూనాలో వ్రాసియుంచవలెను.

కార్య నిర్వాహకాధికారి రిజిస్టరులోని ఆ నమూదులను పరీక్షించి, ఆ పట్టీ అసలు టెండర్లనుబట్టి చూచినచో సరియైనదిగానున్నదని సర్టిఫై చేయవలెను టెండర్లను భద్రపరచి ఆడిటు కార్యముల నిమిత్తము సిద్ధముగానుంచవలెను టెండర్లతోపాటు టెండరు రిజిస్టరును పరిష్కారము నిమిత్తము పంచాయతీ ఎదుట వానియొక్క తరువాత సమావేశమందుంచవలెను

10 (1) సాధారణముగా అన్నిటికంటె తక్కువ టెండరును అంగీకరించవలెను అట్టి అన్నింటికంటె తక్కువ టెండరును అంగీకరించుట వాంఛనీయము కాదని భావింపబడినయెడల, పంచాయతీ విశదమైనట్టియు నచ్చ జెప్పునట్టియు కారణములను లిఖిత పూర్వకముగా రికార్డు చేయవలెను

(2) ఒక టెండరుదారుని పని సామర్థ్యము, సత్యశీలత తెలియనపుడు ఆయన టెండరును తప్పని సరిగ నిరాకరించ నవసరము లేదు పరిస్థితినిబట్టి అవసరమైనయెడల పంచాయతీ అవసరమని తలంచనట్లుగ కంట్రాక్టు మొత్తములో 10 శాతము మించని అదనపు హామీని టెండరుదారువద్దనుండి పొందవచ్చును

(3) అన్నింటికంటె తక్కువ టెండరు నిరాకరింపబడిన పక్షమున, దానికి పైనుండు తక్కువ మొత్తమును ఆలోచనలోనికి తీసికొనవలెను దానినికూడ అంగీకరించుట వాంఛనీయము కాదని భావింపబడిన యెడల, దానికిపైనున్న టెండరును ఆలోచనలోనికి తీసికొనవలెను ఈ ఉపవిధి క్రింది ఒక టెండరును నిరాకరించు ప్రతి సందర్భమునను, పంచాయతీ విశదమైనట్టియు, నచ్చచెప్పునట్టియు కారణములను లిఖిత పూర్వకముగా రికార్డు చేయవలెను

(4) ఏ సందర్భమునగాని ఆ టెండరునందు నిర్దిష్టము జేయబడిన వాటికంటె ఎక్కువ రేట్ల వొప్పున అంగీకరించకూడదు.

(5) టెండర్లను తెరచిన పిమ్మట వాటిని పరిష్కరించుట యందు నివార్యమగు ఆలస్యమేదియు జరుగకూడదు టెండర్లు తెరువబడిన తేదీనుండి ఏ సందర్భమునగాని ఆరు వారముల వరకవి పరిష్కారముగాకుండ నుండకూడదు

11. పై విధులలో నేదియున్నను దానితో నిమిత్తములేకుండ ఇన్ స్పెక్టరు తగిన కారణములను బట్టి, పంచాయతీ, ఏ ప్రత్యేక సందర్భము లేక సందర్భముల తరగతిలోనైన టెండర్లను త్రోసిపుచ్చుటకు లేక పై చెప్పబడిన విధులలోని నిబంధనలలో వేటినైన పాటింపక పోవుటను క్షమించుటకు అనుమతించవచ్చును

12 టెండర్లు రప్పింపబడనప్పుడు లేక త్రోసిపుచ్చబడినప్పుడున పంచాయతీయొక్క కార్య నిర్వాహకాధికారి ఆయన నిర్ణయించు కంట్రాక్టరు సాదరుచేయబడిన రేట్లను సాధారణముగా మించియుండని రేట్ల చొప్పున సదరు పనిని నెరవేర్చబడనట్లు చేయవలెను అత్యవసర పరిస్థితులందు లేక ప్రత్యేక కారణములబట్ట, సాదరుచేయబడిన రేట్లను మించిన రేట్లను అంగీకరించుట కుద్దేశింపబడినప్పుడు (హైవేస్) డివిజనల్ ఇంజనీరుయొక్క అనుమతిని ముందుగా పొందవలెను,

ఆనుబంధము

(9 వ విధిని చూడుడు)

టెండరు రిజిస్టరు

పని పేరు.

అంచనా వేయబడిన కంట్రాక్టు మొత్తము

అందిన టెండర్ల మొత్తము సంఖ్య

| వరుస సంఖ్య. | టెండరుదారుని పేరు | టెండరు సొమ్ము. | ఆమోదించిన తేదీ | పంచాయతీ వ్రాలు |
|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) |

II. వస్తువులు, సరకులు, మరియు పనచేయుటకు కంట్రాక్టులను గురించి విధులు

(జి. ఓ., నె. 125 ఎల్ ఏ. తేదీ 22–1–1953)

## విధులు.

## పంచాయతీలకు వస్తువులు సరుకులు మొదలైనవాటిని సరఫరా చేయుట.

1 పనులను చేయుటకొరకు వస్తువులు సరుకులు లేక సేవలను సరఫరాచేయు కాక ఇతరవస్తువులు, సరుకులు సేవలు సందర్భములో ఖర్చులో 300 రూపాయలకుమించని ఏ పరిమితివరకు టెండర్లను కోరక విడచిపెట్టవచ్చునో ఆ పరిమితిని పంచాయతీ నిర్ణయించవచ్చును టెండర్లు ఆహ్వానింపబడినపుడు కార్యనిర్వాహక అధికారి వాటిని తక్తా రూపములో వ్రాసి పరిశీలించవలెను. పిమ్మట ఉత్తరువుకొరకు అతని సిఫార్సులతో పంచాయితీ సమక్షమున ఉంచవలెను

2 సాధారణముగా చాల తక్కువగానుండు టెండర్లు అంగీకరించవలెను. చాల తక్కువగానుండు టెండర్లు అంగీకరించుట వాంఛనీయముకాదని తలంచబడినపుడు దానికిగల కారణములను స్పష్టముగా రికార్డుచేసి ఆడిటుకు వాటి అందచేయవలెను

షరా —ఒక వస్తువుకంటె ఎక్కువ వాటికొరకు ఉదాహరణముగా కాగితములు పెన్సిళ్ళు వగైరా కొరకు ఆహ్వానింపబడిన విషయమున చాల తక్కువయగు టెండరును అంగీకరింపబడునంతవరకు ప్రతి వస్తువుకు ప్రత్యేకముగాగాని అన్ని వస్తువులకు లేక వస్తువులయొక్క నిర్దిష్టమైన సమూహములకు ఒకటిగా తారతమ్యపు ధరలనుగురించి ఆలోచించవలెను అయితే ఈ మార్గములో దేనిలోనైన చాల తక్కువగానుండు టెండరును ఏరుకొనుటకు పంచాయతీ యొక్క ఉద్దేశము టెండరు నోటీసులో స్పష్టపరుపబడవలెను అన్ని వస్తువుల కొరకుగాని వస్తువుల సమూహాలకొరకుగాని టెండరును ఏకముగా ఆలోచించునపుడు ఆయా సందర్భమునకు తగినట్లు అన్ని వస్తువుల లేక ప్రతిసమూహములోని అన్ని వస్తువుల సందర్భములో కావలసియుండు వాటి ఖరీదు ప్రతి టెండరులో ఇయ్యబడిన రేట్ల ప్రకారము లెక్క పెట్టబడవలెను ఒకటిగా తీసికొనుటకు ఉద్దేశింపబడిన యావత్తు వస్తువులయొక్క మొత్తము ఖరీదు ఏ టెండరు

ప్రకారము లెక్కింపగా చాల తక్కువగానుండునో అదియే చాల తక్కువయైన టెండరుగానుండును

3 ఒక టెండరుచేయు మనిషియొక్క సరఫరాచేయు శక్తి యోగ్యత తెలియని విషయమున అతని టెండరును నిరాకరించ నవసరములేదు కాని పరిస్థితులనుబట్టి అదనపు హామీని తీసికొనుట యుక్తముగానున్న పక్షమున టెండరు యిచ్చు మనిషివద్దనుండి పంచాయతీ అవసరమని తలంచగల అదనపు హామీని తీసికొనవలెను.

4 చాల తక్కువగానుండు టెండరును నిరాకరించినపుడు అటు తరువాతి హెచ్చు టెండరును అంగీకరించవచ్చును అయితే ఆ టెండరునుకూడ నిరాకరించుటకు చాలినంత కారణములను రికార్డు చేయవలెను

5 ఎట్టి సందర్భములోగాని ఒక టెండరులో స్పష్టముగా తెలుపబడిన రేట్లుకాని ఇతర రేట్లు చొప్పున టెండరును అంగీకరించ కూడదు

6 టెండర్లను తెరచిన తరువాత వాటిని పరిష్కరించుటలో నివారింప తగిన ఎట్టి ఆలస్యముగాని చేయకూడదు

7 (1) టెండర్లు (ఇవి సీలుచేయబడిన కవర్లలో నుండవలెను ) టెండర్లు చాల బహిరంగముగాను జనసామాన్యమునకు తెలియునట్లుగాను కార్యనిర్వాహక అధికారి

(a) అన్ని సందర్భములలో, జిల్లా యొక్క భాష లేక భాషలలోని ఒక నోటీసును పంచాయతీయొక్క ఆఫీసులోను, కార్యనిర్వాహక అధికారి యుక్తమని తలంచు ఇతర స్థలములందును, అతికించుట ద్వారా

(b) వుద్దేశింపబడిన ఖర్చు రూ 500 లను మించనపుడు జిల్లాలో ప్రచారమందుండు కనీసము ఒక వార్తా పత్రికలో ప్రకటింపబడుటద్వారా

ఆహ్వానింపబడవలెను

(2) (1) వ ఉప విధిక్రింద ప్రకటింపబడిన ప్రతి నోటీసు లేక ప్రకటన ఇతర విషయములతో బాటు—

(a) వివిధరకములైన వస్తువుల యొక్క పరిమాణము లను గురించిన షెడ్యూలు యొక్క నకలు ఏ షరతుల ననుసరించి, ఏ ఉద్యోగినుండి ఏ ధరకు (ఈ విషయములను నోటీసులోగాని ప్రకటనలోగాని వివరముగా తెలుపుటకు సాధ్యములేని పక్షమున) పొంద వచ్చునను విషయములను,

(b) టెండరును నికరముగా తయారుచేయవలసిన నమూనాను గురించి అనగా వివిధ వస్తువులయొక్క ధరలను చెప్ప వలెనా లేక పరిమాణముల షెడ్యూలులో చెప్పబడిన ప్రతి వస్తువును బట్టి లేక అట్టి యావత్తు వస్తువులను ఒకటిగా లేక అట్టి వస్తువుల సమూహములను బట్టి టెండరుయొక్క తారతమ్యపు విలువ పరీక్షింప బడునా యని,

(c) పంచాయతీ ఆఫీసులో నోటీసు ప్రకటింపబడిన తేదీనుండి లేక (1) వ ఉపవిధి యొక్క (b) ఖండము క్రిందికివచ్చు సందర్భములలో వార్తాపత్రికలలో మొదట ప్రకటింపబడిన తేదీనుండి కనీసము 10 దినముల కాలపరిమితిని త్రోసివేసి టెండర్లను ఎప్పుడు, ఎచ్చట దాఖలు చేయవలెనని,

(d) టెండర్లు ఎపుడు, ఎచట తెరువబడునని,

(e) టెండరుతో పంపవలసిన బయానా మొత్తమును గురించియు టెండరు అంగీకరింపబడిన సందర్భములో కోరబడు హామీ మొత్తమును స్వభావమును గురించి,

(f) టెండరును అంగీకరించుటకు అర్హతగల అధి కారిని గురించి,

(g) టెండరును అంగీకరించుటకు అర్హతగల అధికారి, కారణములను తెలుపకయే అందిన టెండర్ల నన్నిటినిగాని, వాటిలో దేనినిగాని నిరాకరించుటకు అధికారమును ప్రత్యేకించి యుంచుకొందు రని, మరియు

(h) సరియైన కారణములు లేకుండ, టెండరును ఉపసంహరించుకొను టెండరు యిచ్చు మనిషి (టెండరును అంగీక రించుటకు అర్హతగల అధికారివలన నిర్ణయించ బడవలెను) ఇక

ముందు అతడు ఇచ్చిన టెండరులు వెంటనే నిరాకరింప బడ తగియుండునని

తెలుపవలెను

8 ఈ విధులలో నున్న దేదియు—

(i) ఇండియన్ స్టోర్సు డిపార్టుమెంటు ద్వారా కొనుగోలు జేయబడు స్టోరులను,

(ii) మాజీసైనికులను పునఃస్థాపితము చేయుటకు ప్రభుత్వము ప్రారంభించిన లోహపు, కలప కర్మాగారముల నుండియు, ఫ్యాక్టరీల నుండియు పొందబడు వస్తువులను,

(iii) పారిశుద్ధ్యము, యితర కార్యముల కొఱకు ఎడ్లను,

(iv) ప్రభుత్వము లేక వారి ఏజెంట్ల ఉత్తరువుల మీద జారీచేయబడిన ఒక పర్మిటుద్వారా కంట్రోలు రేట్ల చొప్పున కంట్రోలు చేయబడిన వస్తువులను,

(v) సెకండరీ పాఠశాలలలోని రెండుగా విభజింపబడిన విద్యాభాగమునకు చెందిన సిలబసులో పేర్కొనబడిన సరంజామ లోని వస్తువులను,

(vi) సెకండరీ పాఠశాలలలో మాన్యుయల్ ట్రెయినింగు సెక్షనులకు కావలసిన వస్తువులను,

(vii) పెట్రోలును పంపకము చేయుటకును సరఫరా చేయుటకును స్టాండర్డు ధరములనుండి లేక తత్కాలమందు అమలులోనున్న ధరలచొప్పున అధికారము పొందినవారి ఏజెంట్లనుండి పెట్రోలును

కొనుగోలు చేయుటకు వర్తించకూడదు.

9 పైన చెప్పిన విధులలో ఏదియున్నను దానితో నిమిత్తము లేకుండ, రీజనల్ ఇన్‌స్పెక్టరు, చాలినంత కారణముల కొఱకు, ఏ నిర్ణయమైన సందర్భములోగాని లేక సందర్భముల తరగతి విషయమునందుగాని పంచాయతీలు టెండరులు ఆహ్వానించవలసినది లేదని అనుమతించ వచ్చును లేక సదరు విధులలోని ఏ నిబంధనలనైన అనుసరించక పోవుటను క్షమించవచ్చును

పన్నుల వసూళ్లు గురించి, సెక్షను 112 (2) (xv) మరియు (xvii) క్రింద విధులు 369-387 పేజీలలో నున్నవి,

సెక్షను 112 (2) (xvi) క్రిందవిధులు392-393పేజీలలోనున్నవి

సెక్షను 112 (2) (xvii) క్రింద విధి, పన్నులుకాక యితర బకాయి సొమ్ములను వసూలుగురించి

(జి ఒ నెం 1333, లోకలు అడ్మినిస్ట్రేషను,
తేదీ 22-12-1955)

ఈ యాక్టు క్రిందగాని, లేక యితర చట్టములు, విధులు, లేక బైలాల క్రిందగాని, వాటి క్రింద జారీచేయబడిన విధుల క్రిందగాని, పంచాయతీకి, ఏవయిన, ముజరాలు, జరీమానాలు, రావలసిన బకాయిసొమ్ములు, రుసుములు, డామేజులు, నష్ట పరిహారములు, ఖర్చులు, అద్దెలు, చందాలు, విరాళములు (బడిజీతములు, మరియు పంచాయతీ కవులుకుయిచ్చిన యిండ్లకు, భూములకు శిస్తులుకాక), రావలసినయెడల, వాటిని రాబట్టుటకు యాక్టులో ప్రత్యేకవిధులు లేనియెడల, పన్నులు వసూలుచేయుటకు మద్రాసు గ్రామపంచాయతీయాక్టు, 1950 క్రింద విధించిన విధుల ప్రకారముగా, బిల్లులు తయారుచేసి, ఆ సంబంధమయిన వ్యక్తికిపంపి, అట్టి బాకీసొమ్ములను వసూలు చేయవలెను

సెక్షను 112 (2) (xviii) క్రింద విధులు, అనగా కార్టుస్టాండు రుసుముల గురించి 488-492 పేజీల చూడుడు

సెక్షను (xix) క్రిందవిధులు437-441 పేజీలముద్రింపబడియున్నవి.

సెక్షను 112 (2) (xx) క్రిందవిధులు

ఎగ్జిక్యూటివు అధికారి సమాచారమును రప్పించుటకు
అధికారములు

(జి ఓ నెం 520 లోకల్ అడ్మినిస్ట్రేషన్ తేదీ 24-3-1951)

విధులు

ఏ విషయము గురించియైనను సమాచారమును కోరుట
మొదలైన సందర్భములలో కార్యనిర్వాహక అధికారి
యొక్క అధికారము.

1 ఒక పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి, ఆక్టు యొక్క నిబంధనల క్రింద పన్ను విధింపుకు లేక తనిఖీ చేయుటకు, ఏ లైసెన్సునుగాని, అనుమతిగాని యిచ్చుటకు సంబంధించిన ఏ సందర్భములోనైన ఆయా సందర్భమునకు తగినట్లు సాక్ష్యము నిచ్చుటకు లేక దస్తావేజులను హాజరు పెట్టుటకు తన సమక్షమున హాజరగునట్లు ఏ మనిషికైనను సమను వచ్చును

2 1 వ విధిక్రింద కార్యనిర్వాహక అధికారిచే జారీచేయబడిన సమనుల ప్రకారము నడచుకొనుటకు తప్పిపోవు ఏ మనిషియైనను, పది రూపాయలవరకు వ్యాపించు జుల్మానాతో శిక్షింపబడ తగియుండవలెను,

సెక్షను 112 (2) (xxi) క్రింది విధులు
(జి ఓ నెం 520 లోకలు అడ్మినిస్ట్రేషను, తేదీ 24-3-1951)

విధులు

కార్యనిర్వాహక అధికారులయొక్క సంతకముల ముద్రలను ఉపయోగించుట,

1 కార్యనిర్వాహక అధికారియొక్క లేక పంచాయతీకి చెందిన ఏ ఉద్యోగియొక్కయైన సంతకమును కలిగియుండవలసినదిగా ఈ యాక్టువలన లేక దానిక్రింద చేయుబడిన ఏ విధి, ఉపవిధి లేక రెగ్యులేషనువలనగాని కోరబడిన ప్రతి లైసెన్సు, అనుమతి, నోటీసు, బిల్లు పెడ్యూలు, సమనులు లేక యితర దస్తావేజు ఆయా సందర్భమునకు తగినట్లు, కార్యనిర్వాహక అధికారియొక్క లేక అట్టి వుద్యోగియొక్క సంతకము తాలూకుముద్ర దానిమీాద వేయబడియున్న పక్షమున, క్రమముగా అది సంతకము చేయబడియున్నట్లు భావింపబడవలెను

2 1 వ విధిలో నున్నదేదియు, పంచాయతీ నిధులమీాద వ్రాయబడిన ఒక చెక్కును లేదా పంచాయతీచేసిన ఏ ఒడంబడిక పత్రమునకు వర్తించునట్లు భావింపబడకూడదు

సెక్షను 112 (2) (xxii) క్రింద విధులు
(జి ఒ నెం. 520 లోకలు అడ్మినిస్ట్రేషను తేదీ 24-3-1951)

## విధులు

## వ్యవహారములయొక్కయు, రికార్డులయొక్కయు నకళ్లను జారీచేయుట

**1.** ఒక పంచాయతీయొక్క వ్యవహారముల నకళ్ళను రికార్డుల ఎక్స్ట్రాక్టులను కోరు మనిషి పంచాయతీయొక్క కార్యనిర్వాహకధికారికి (అతని పూర్తిపేరు, పై విలాసము సాధ్యమైనంతవరకు వ్యవహారములు లేక రికార్డులయొక్క సరియైన వివరములను తెలుపుచు) ఒక దరఖాస్తును దాఖలు చేయవలెను దరఖాస్తు పెట్టుకొనబడిన వ్యవహారముల నకళ్ళు లేక రికార్డుల ఎక్స్ట్రాక్టులు ప్రస్తుతపు క్యాలెండరు సంవత్సరమునకు పూర్వపు ఏ సంవత్సరమునకైనను చెందిన పక్షమున క్రింద నిర్దేశింపబడిన రేటు ప్రకారము వెతకుటకైన రుసుమును, దరఖాస్తు అంగీకరింపబడిన వెంటనే పంచాయతీకి చెల్లించవలెను.

| | |
|---|---|
| (a) ఒక దస్తావేజు లేక పద్దు నిమిత్తము ఏ ఒక సంవత్సరముయొక్కయైన రికార్డులను వెదకుటకు | ఎనిమిది అణాలు |
| (b) ప్రతి అదనపు సంవత్సరముయొక్క రికార్డులను వెదకుటకు | నాలుగు అణాలు |

షరా —(1) ప్రతి ఒక వ్యవహారముయొక్క నకలు లేక రికార్డుయొక్క ఎక్స్ట్రాక్టు సందర్భములలో ప్రత్యేకముగ దరఖాస్తు పెట్టుకొన నవసరములేదు.

(2) ఎన్క్లోజర్లు, వుత్తరముల లెక్కలు లేక యితర దస్తావేజుల అనుబంధములు అవి ఏ దస్తావేజులకు అనుబంధముగా నుండునో వాటి భాగములుగా నుండవలెను వెతకుటకై వాటిని ప్రత్యేక దస్తావేజులుగ భావించకూడదు

2 రికార్డు కనుపించని పక్షమున చెల్లించబడిన రుసుము తిరిగి ఇచ్చివేయబడదు కాని దరఖాస్తు పెట్టుకొనిన దస్తావేజ కనబడలేదని తెలుపు ఒక సర్టిఫికేట్టు అతని కియ్యబడవలెను

3 (1) రికార్డు దొరకి కార్యనిర్వాహక అధికారి దాని నకళ్ళను లేక ఎక్స్ట్రాక్టులను ఇచ్చుటకు నిశ్చయించు పక్షమున ప్రతి

175 మాటలకు లేక అందలి భాగమునకు అ 3 లు రుసుమును రొక్కముగా దరఖాస్తుదారు డిపాజిటు చేయవలెను.

(2) అంకెలు వ్రాయవలసిన రిజిస్టర్లనుండి స్టేటుమెంట్లను లేక ఎక్స్ట్రాక్టులను తీయవలసిన సందర్భములో ఐదు అంకెలను ఒక మాటకు సమానముగా భావించబడవలెను

(3) పటముల లేక ప్లానుల సందర్భములో కార్యనిర్వాహక అధికారి, పంచాయతీ పనులమీద అధికారము కలిగిన ఇంజినీరింగు సిబ్బందిలో ఆలోచించిన మీదట న్యాయమైన రుసుమును నిర్ణయించవలెను

4 కార్యనిర్వాహక అధికారి వ్యవహారముయొక్క నకలుకు రికార్డుయొక్క ఎక్స్ట్రాక్టు చార్జీచేయబడు రుసుమును దరఖాస్తుదారునకు తెలియజేయవలెను రుసుము అందిన మీదట ఆయన నకళ్లను ఎక్స్ట్రాక్టులను లేక ట్రేసింగులను తయారుచేయించవలెను. పిమ్మట నకళ్ళను ఎక్స్ట్రాక్టులను ఆఫీసులో సరిచూచిన మీదట అవి వాస్తవమైన నకళ్లని ఆయన సర్టిఫై చేయవలెను దరఖాస్తుదారు వాటిని పుచ్చుకొనుటకు స్వయముగా హాజరైన పక్షమున అతనికి వాటిని ఇచ్చివేయవలెను, లేక ఆ కార్యము కొరకు అవసరమైన పోస్టేజి స్టాంపులను దరఖాస్తుదారు ఇచ్చియుండిన యెడల వానిని పోస్టుద్వారా పంపవలెను

5 కార్యనిర్వాహక అధికారిచే లేక ఈ విషయమున ఆయనే అధికార మీయబడిన ఏ మనిషి వలననైన సంతకము చేయబడిన ఒక రశీదు అట్టి వెతకుటకైన రుసుమును లేక కాపీచేయుటకైన రుసుమును చెల్లించిన ప్రతి మనిషికి ఇయ్యవలెను

6 ఏ వ్యవహారముయొక్క నకలుగాని రికార్డుయొక్క ఎక్స్ట్రాక్టుగాని ఇచ్చుట ఆక్షేపణ కరమైనది అని కార్యనిర్వాహక అధికారి తలంచు నెడల నిరాకరించుటకు గల కారణములను సంగ్రహముగా తెలుపుచు ఎండార్సుమెంటుద్వారా దరఖాస్తును ఆయన నిరాకరించవలెను

సెక్షను 112 (2) (xxiii) క్రింద విధులు. యిక తయారు చేయవలెను

సెక్షను 112 (2) (xxiv) క్రింద విధులు 441 463 పేజీలలో నున్నవి

సెక్షను 112 (2) (xxv) క్రింద విధి
(జి. ఒ నెం 520, ఎల్ ఏ తేదీ 24-3-1951 )

విధి.

ఖానిగీపాయిఖానాలను శుభ్రపరచుట.

ఒక పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారికి యుక్తమని అగపడువిధముగా అట్టి ఆవరణనుండి లేక దానికిచెందిన ఏ స్థలమునుండియైన చెత్తచెదారము, లేక మురికిని, లేక ఏదో ఒక నిర్దిష్టమైన రకమునకు చెందిన చెత్తచెదారము లేక మురికిని ఎన్నిసారులు, ఏ కాలపరిమితులలో తొలగించుట, మరియు ఇతర విషయముల గురించిన షరతులమీద, అట్టి సేవ కగు ఖర్చుకుగాను, పంచాయతీ విధించగల రేటువొప్పున రుసుమును చెల్లించినమీదట తొలగించుటకు, పంచాయతీయొక్క కార్యనిర్వాహక అధికారి ఏ ఆవరణయొక్కయైన స్వంతదారు లేక అనుభవదారుతో ఒడంబడిక చేసికొనవచ్చును.

సెక్షను 112 (2) (xxvi) క్రింద విధులు.
స్మశానములు
(జి ఒ నెం. 520 ఎల్ ఏ. తేది 24-3-1951)

విధులు

శవములనుపూడ్చు, కాల్చు స్థలములు, మొదలైనవాటిని ఏర్పాటుచేయుట

1 పంచాయతీ, శవములను పూడ్చుటకు లేక కాల్చుటకు స్థలములను లేక దహనస్థలమును, చాలినంత ఏర్పాటు లేనియెడల దాని ఖర్చుమీద ఏర్పాటుచేయవచ్చుచు వాటిని ఉపయోగించుటకు అద్దెలను లేక రుసుములను విధించవచ్చును.

2 (1) శవములను పూడ్చుటకు, కాల్చుటకు లేక ఇతర విధముగా పరిష్కారముచేయుటకైన స్థలముగా ఉపయోగింపబడు ఏ స్థలముయొక్కయైన ప్రతికామందు లేక అట్టి స్థలముమీద అధికారముగల మనిషి, అట్టిస్థలము 1950 వ సం॥పు మద్రాసు గ్రామ పంచాయతీల ఆక్టుక్రింద లేక 1920 వ సం॥పు మదరాసు జిల్లాబోర్డు ఆక్టుక్రింద అదివరకే రిజిష్టరై యుండని పక్షమున అట్టిస్థలమును రిజిష్టరు చేయుటకు పంచాయతీకి దరఖాస్తు పెట్టుకొనవలెను.

(2) అట్టి స్థలమునకు ఎట్టి ఖామందుగాని లేక దానిమీద అధికారము కలిగిన ఏ మనిషిగాని లేదని పంచాయతీకి తెలిసినపక్షమున, పంచాయతీకి అట్టి స్థలముమీద అధికారముపొంది దానిని రిజిష్టరుచేయవలెను, లేక రీజనల్ యిన్‌స్పెక్టరుయొక్క అనుమతితో దానిని మూసివేయవచ్చును

3. (1) శవములను పరిష్కారముచేయుట కొరకు ఎట్టి క్రొత్త స్థలముగాని, అది సర్కారుకు చెందినదైనను సరే ప్రయివేటు వ్యక్తులకు చెందినదైనను సరే దరఖాస్తు పెట్టుకొన్నమీదట పంచాయతీనుండి ఒక లైసెన్సును పొందిననేతప్ప, స్థాపింపబడకూడదు. యేర్పాటు చేయబడకూడదు నిర్మింపబడకూడదు, లేక వుపయోగింపబడకూడదు

(2) లైసెన్సుకై ధరఖాస్తుతో, లైసెన్సు కోరబడిన స్థలముయొక్క ప్లాను నొకదానిని పంపవలెను స్థలము, దాని ఎల్లలు, వ్యాప్తి దానిలో హక్కుగల కామందు లేక మనిషి లేక జాతియొక్క పేరు, నిర్వాహణపద్ధతి మరియు పంచాయతీ కోరగల ఇతర వివరములను ఆ ప్లానులో తెలుపవలెను

(3) దరఖాస్తు ఏ పంచాయతీకి పెట్టుకోబడినదో ఆ పంచాయతీ—

(a) లైసెన్సును ఇయ్యవచ్చును లేక నిరాకరించవచ్చును, లేక

(b) ఆ స్థలము విషయమున తెలుపబడిన ఆక్షేపణలను తొలగించువరకు, లేక కోరబడిన ఏ వివరములనయిన పంపునంతవరకు లైసెన్సును జారీచేయుటకు వాయిదా వేయవచ్చును

(4) (3) వ ఉపవిధి క్రింద పంచాయతీ జారీచేసిన ఏ ఉత్తరవు నయిన గ్రజనల్ యిన్‌స్పెక్టరు రద్దుచేయవచ్చును, లేక సవరించవచ్చును

4 (1) ప్రతిపంచాయతీ ఆఫీసులో ఒక పుస్తకమును ఉంచవలెను 1 నుండి 3 వరకు గల విధుల క్రింద ఏర్పాటుచేయబడిన, రిజిష్టరుచేయబడిన, లేక లైసెన్సునీయబడిన స్థలములను, మరియు ఈ ఆక్టు ప్రారంభమునకు పూర్వము ఏర్పాటుచేయబడిన, రిజిష్టరు చేయబడిన లేక లైసెన్సునీయబడిన స్థలముల నన్నిటిని అందులో వ్రాసియుంచవలెను.

(2) పైన చెప్పిన విధముగా అట్టి స్థలము ఏర్పాటు చేయబడినది రిజిష్టరు చేయబడినది, లేకలైసెన్సునీయబడినది అని ఇంగ్లీషు భాషలోను, గ్రామముయొక్క ప్రధాన భాషలోను ఒక నోటీసు శవములను పూడ్చు లేక కాల్చు స్థలముయొక్క లేక పైనచెప్పిన విధముగానుండు ఇతర స్థలముయొక్క ప్రవేశ స్థలమునకు దగ్గర లేక సమీపమున ప్రాముఖ్యమైన స్థలమునందు అతికించబడవలెను

5 పైన చెప్పిన విధముగా ఏర్పాటుచేయబడిన రిజిష్టరుచేయబడిన లేక లైసెన్సునీయబడిన స్థలముకానట్టి ఇతరస్థలములో, ఒక నివాస స్థలము లేక త్రాగుటకైన నీటి సరఫరా ఆధారమునకు నూరు గజములలోపల ఏ స్థలమందైనను ఎట్టి మనిషిగాని ఏ శవమునైన పూడ్చకూడదు, కాల్చకూడదు, లేక యితర విధముగా పరిష్కారము చేయగూడదు లేక పూడ్చునట్లు, కాల్చునట్లు లేక యితరవిధముగా పరిష్కరించునట్లు చేయకూడదు, లేక అట్లు అనుమతించగూడదు

6. శవములను పరిష్కారము చేయు స్థలముమీాద అధికారము కలిగిన మనిషి, పంచాయతీ నియమించిన ఏ మనిషికైనను ప్రతి శవమును, పూడ్చుట, కాల్చుట లేక ఇతర విధముగా పరిష్కరించుటను గురించి సమాచారమును తెలుపవలెను.

7 (1) పంచాయతీ—

(a) శవములను పరిష్కారము చేయుటకొరకు రిజిష్టరు చేయబడిన లేక లైసెన్సునీయబడిన ఏ స్థలముగాని దానికి సమీాప

మున నివసించుచుండు మనుష్యుల ఆరోగ్యమునకు అపాయకరమగు లేక బహుశహః అపాయకరముకాగల స్థితిలో లేక పరిస్థితిలో నున్న దని, లేక

(d) ఏ శ్మశానభూమియైనను సమాధులతో క్రిక్కిరిసి పోయియున్నదని.

తృప్తిపడిన పక్షమున,

మఱియు జనసామాన్యమునకు చెందిన పూడ్చు లేక కాల్చు స్థలము లేక పైన చెప్పిన విధముగా ఇతర స్థలము సందర్భములో శవ పరిష్కారముకొరకు క్రమముగా అధికారమివ్వబడిన మఱియొక అనుకూలమైన స్థలము, ఉన్నయెడల లేక అట్టి స్థలమును సామాన్యముగా ఉపయోగించు మనుష్యులనిమిత్తము ఏర్పాటుచేయబడినయెడల నోటీసులో తెలుపబడిన రెండు నెలలకంటె తక్కువకాని కాలపరిమితి గడచిపోయినతర్వాత అట్టి స్థలములో ఏ శవమునైన పూడ్చుట, కాల్చుట లేక ఇతరవిధముగా పరిష్కరించుట న్యాయముకాదని, రీజనల్ ఇనస్పెక్టరుయొక్క అంగీకారము ముందుగా పొందుగా పొంది అది నోటీసు నీయవచ్చును,

(2) (1) వ ఉపవిధిక్రింద ఇయ్యబడిన ప్రతి నోటీసు పంచాయతీ నోటీసు బోర్డులో అతికించుట మూలముగాను, గ్రామములో దండోరా వేయుటమూలముగాను ప్రకటింపబడవలెను

(3) ఏ మనిషిగాని (1) వ ఉపవిధిక్రింది ఏ నోటీసు కైనను విరుద్ధముగాను, అట్టి నోటీసులో పేర్కొనబడిన కాలపరిమితి గడచిపోయిన తర్వాతను, అట్టి స్థలములో ఏ శవమునుగాని పాతిబెట్టకూడదు, కాల్చకూడదు లేక ఇతరవిధముగా పరిష్కారముచేయగూడదు లేక పాతిపెట్టునట్లు, కాల్చునట్లు, ఇతర విధముగా పరిష్కరింపబడునట్లు చేయకూడదు లేక అనుమతించకూడదు,

(4) (1) వ ఉపవిధిక్రింద ఒక పంచాయతీ జారీచేసిన ఏ నోటీసునుగాని రీజనల్ ఇన్‌స్పెక్టరు రద్దుచేయవచ్చును, లేక సవరించవచ్చును

8. 2 (1) వ, 3 (1) వ, (5) వ (6) వ మరియు 7 (3) వ విధులయొక్క నిబంధనలలో దేనినైన ఉల్లఘించు ఏ

మనిషిగాని 100 రూపాయలవరకు వ్యాపించగల జుల్మానాలో శిక్షింపబడతగియుండవలెను

అయితే పంచాయతీ కార్యనిర్వాహక అధికారియొక్క లిఖిత పూర్వకమైన అనుమతి లేకుండ 5 వ విధియొక్క నిబంధనలను ఉల్లంఘించినందులకు ఎట్టి ఫిర్యాదు చర్యగాని దాఖలుచేయబడకూడదు

సెక్షను 112 (2) (XXVII) క్రింది విధులు,
పందులకు, కుక్కలకు లైసెన్సులు యిచ్చుటకు విధులు
(జి ఒ నెం 2256 హెల్తు, తేదీ 29—10—1958 )

1. (1) ఈ విధులను "పందులకు, కుక్కలకు లైసెన్సు లిచ్చు విధులు, "1958" అని పేర్కొనవచ్చును.

(2) అవి 1 వ నవంబరు 1958 వ తేదీన అమలులోనికి వచ్చును,

2. (1) ఏదయిన 1 వ తరగతి పంచాయతీ స్వయముగా గాని, మరియు ఇనస్పెక్టరుచేత నట్లు ఆదేశింపబడిన యెడలగాని లైసెన్సు లేని పందులు గాని కుక్కలుగాని, గ్రామ సరిహద్దులలో తిరుగుచున్నయెడల నవి చంపబడునని ప్రజలకు దండోరామూలముగా ప్రకటించి తెలియచేయవలెను

(2) అట్టి ప్రకటన అయిన తరువాత, ప్రతి పందియొక్క, కుక్కయొక్క యజమానిగాని లేక కాపరిగాని, 30 దినములలోగా, షెడ్యూలులో వివరింపబడిన రుసుము పంచాయతీ ఎగ్జిక్యూటివు అధికారికి చెల్లించి, లైసెన్సును, లైసెన్సుయొక్క సంఖ్య తెలుపు నొక బిళ్ళను తీసికొనవలెను

3, (1) 2 వ విధిక్రింద అట్లు ప్రకటనచేసిన అర్ధ సంవత్సరము తరువాత ప్రతి అర్ధ సంవత్సరము ప్రారంభమయిన 30 దినములలోగా ప్రతి పందియొక్క, కుక్కయొక్క యజమానిగాని, కాపరిగాని లైసెన్సు మంజూరు చేయుటకుగాని, పునరుద్ధరించుటకుగాని, ఎగ్జిక్యూటివు అధికారికి షెడ్యూలులో నిర్ణయించిన రుసుము చెల్లించి,లైసెన్సుకు, బిళ్ళకు దరఖాస్తు చేయవలెను.

(2) ఆ బిళ్ళను పందియొక్క, లేక కుక్కయొక్క మెడలో కట్టవలెను.

4 (1) గ్రామ సరిహద్దులలో, బహిరంగ ప్రదేశములో, 2 వ లేక 3 వ విధి క్రింద తీసికొనబడిన బిళ్ళలేకుండ ఏదైన పందిగాని, కుక్కగాని తిరుగుచున్న యెడల, ఎగ్జిక్యూటివు అధికారిచే అధికార మీయబడిన వ్యక్తిచేగాని, వ్యక్తులచేతగాని, వాటిని పట్టుకొని చంపించుటకు అవకాశముండును

(2) (1) వ యుపవిధిలో నుడివిన ప్రకారము పట్టుకొనబడిన పందిగాని, కుక్కగాని ఎగ్జిక్యూటివు అధికారిచే నిర్బంధింపబడి యుండును అట్టి నిర్బంధింపబడుట సాధారణముగా 48 గంటల వరకు యుండును కాని, ఎగ్జిక్యూటివు అధికారికి అవసరమని తోచిన యెడల యింక నెక్కువకాలము బంధింపవచ్చును

(3) ఒక పందిగాని, కుక్కగాని పట్టుకొనబడినపుడు, దాని యొక్క యజమానికి, అతనియొక్కగాని లేక ఆమె యొక్కగాని పేరు తెలిసియున్న యెడల, సాధ్యమయినంత త్వరలో, దానిని నిర్బంధించినట్లును, దానిని ఎంత కాలములోగా విడుదలచేసి తీసుకొనవలసినదియు, యిదివరకు లైసెన్సు రుసుము చెల్లింపబడని యెడల లైసెన్సు రుసుమున్ను, మరియు నిర్బంధములోనున్న ప్రతి 24 గంటలకు 25 నయాపైసల వంతున జరిమానాయున్ను చెల్లించవలెననియు, ఎగ్జిక్యూటివు అధికారి తెలుపవలెను

5 కుక్కలను, పందులను నిర్బంధములో నుంచుటకు బందిఖానా పంచాయతీ ఏర్పాటుచేసి, వాటికి నిర్బంధములో ఆహారము యిచ్చి, అందులకు అయిన ఖర్చును యజమానినుండిగాని, కాపరినుండిగాని రాబట్టవలెను

6 (1) 4, 5 వ విధులలో చెప్పబడిన లైసెన్సు రుసుములు, జరిమానాలు, లేక యితర కర్చులు చెల్లించిన పిదప ఎగ్జిక్యూటివు అధికారి ఆ పందినిగాని, కుక్కనుగాని, యజమానికిగాని, కాపరికిగాని లేక వారిచే నధికార మీయబడిన ఏజెంటుకుగాని తిరిగి యియ్యవలెను 4 వ విధియొక్క (2) వ యుపవిధిలో విధింపబడిన కాలములోగా

అట్లు చెల్లించని యెడల విరివిగా ప్రకటింపబడిన తర్వాత ఎగ్జిక్యూటివు అధికారి బహిరంగ వేలములో నాపందినిగాని, కుక్కనుగాని, అమ్మి, దానివల్ల వచ్చిన పైకమును పంచాయతీ ద్రవ్యమునకు జమచేయ వలెను

ఏ పందికిగాని, కుక్కకుగాని వేలములో ఖరీదు రాని యెడల, ఆ జంతువును ఎగ్జిక్యూటివు అధికారి వధచేయించి పరిష్కారము చేయును.

(2) కుక్కలయొక్కయు, పందులయొక్కయు వధ, విద్యుచ్ఛక్తిచేగాని, లేక వధ్య గదిలోగాని, లేక ప్రజారోగ్య అధికారులు అంగీకరించునట్టి యేదయిన యితర రీతిగాగాని నుండవలెను

(3) (1) వ యుపవిధి క్రింద సూచింపబడిన విధిని ప్రకటన యీా క్రింది విధముగా చేయబడవలెను

(a) నోటీసుయొక్క నకలును—

(i) పంచాయతీ ఆఫీసులోను

(ii) గ్రామ చావడిగాని, చావడీలుగాని వున్న యెడల వాటిలోను, ప్రధాన ప్రదేశములలో అంటింపు మూలము గాను

(b) గ్రామములో దండోరా మూలముగాను

7. 2 వ, లేక 3 వ విధి క్రింద మంజూరు చేయబడిన లేక పునరుద్ధరింపబడిన ప్రతి లైసెన్సుయున్ను, అందుకొరకు వుంచబడిన రిజిష్టరులో వ్రాయబడవలెను

మరియు నా రిజిష్టరులో, ఆ పందియొక్క, లేక కుక్కయొక్క యజమాని, లేక కాపరియొక్క పేరు, విలాసమున్ను, ఏదయిన పేరున్న యెడల, కుక్కయొక్క లేక పందియొక్క పేరును, యితర వివరములను, లైసెన్సుయొక్క నెంబరునున్ను, దానిని యిచ్చిన తేదీయును, లైసెన్సు రుసుమును, మరియు పైన చెప్పబడిన విధులలోని జరిమానాను, లేక యితర ఖర్చులకు వసూలుచేయబడిన సొమ్మును వ్రాయవలెను

8 ఎగ్జిక్యూటివు అధికారి, ప్రత్యేకముగా నొక రిజిష్టరునుంచి, అందులో, పట్టుకొనబడిన పంది లేక కుక్కయొక్క వర్ణన, పట్టుకొన

బడిన కాలము, దానియొక్క యజమానియొక్క లేక కాపరియొక్క పేరు, విలాసము, వసూలు చేయబడిన రుసుములు, జరిమానాలు, ఏమైనవున్న యెడల, అట్టి వసూళ్ళయొక్క తేది, ఆ పందినిగాని, కుక్కనుగాని, విడుదలచేసిన తేది, కాలము, మరియు, వాటిని వేలము వేసిన తేది, వేలమువల్ల వచ్చిన సొమ్ము, లేక వాటిని వధించిన తేదియు, వివరముగా చూపవలెను

9 ఆ అర్ధ సంవత్సరములో, ఒక వ్యక్తి, ఒక పందినిగాని, కుక్కనుగాని, ఆ జాతి జంతువుచేత మార్చిన యెడల, అట్టి మార్పు ఆ పందియొక్క లేక కుక్కయొక్క మరణమువల్ల అయినయెడల, మరియు వాటియొక్క మరణ కాలమునకు ఆ వ్యక్తికి మార్చిన పందిపై లేక కుక్కపై స్వాహక్కు, లేక భద్రత, లేక అధికారము వున్నయెడల, ఆ వ్యక్తి దానికొరకు ఒక్క రుసుము మాత్రమే చెల్లించవలసియుండును, మరియునట్టి రుసుము మొత్తము, చని పోయిన పందినిగాని, కుక్కనుగాని, మరియు మార్చబడిన పందినిగాని, కుక్కనుగాని ఆవ్యక్తి మొత్తము యెన్ని దినములు తనవద్ద నుంచు కొనెనో ఆ దినముల ననుసరించి, నిర్ణయింపబడును

## షెడ్యూలు

1. కుక్క–అర్ధ సంవత్సరమునకు 25 నయాపైసలు.
2. పంది–అర్ధ సంవత్సరమునకు 25 నయాపైసలు

సెక్షను 112 (2) (xxviii) క్రింద విధులింకను చేయవలసి యున్నవి

సెక్షను 112 (2) (xxix) మరియు (xxxi) క్రింద విధులు 466–475 పేజీలలోనున్నవి

సెక్షను 112 (2) (xxx) క్రింద విధులు 295–296 పేజీలలో నున్నవి

సెక్షను 112 (2) (xxxii) క్రింద విధులు 482–485 పేజీలలో నున్నవి

సెక్షను 112 (2) (xxxiii) (xxxiv) మరియు (xxxv) క్రింద విధులు యింకను చేయవలసి యున్నది.

## సెక్షను 112 (2) (xxxvi) క్రింద విధులు

### అపీళ్లకు కాలపరిమితి

(జి ఒ నెం. 520 ఎల్ ఏ తేదీ 24-3-51)

ఈ ఆక్టు లేక దాని క్రిందచేయుబడినవిధులలో స్పష్టముగా వేరేవిధముగా నిబంధింపబడిన తప్ప, ఈ ఆక్టు లేక అట్టి ఏవిధి క్రిందనైన పెట్టుకొనబడు ప్రతి అపీలు (1908 వ సం॥పు 9 వ సెంట్రలు ఆక్టుఅగు) 1908 వ సం॥పు ఇండియాదేశపు కాల దోషపు ఆక్టు (లిమిటేషను ఆక్టు) యొక్క 5 వ సెక్షనుయొక్క నిబంధనలకు లోబడి—

(a) సదరు అపీలు, ఒక లైసెన్సు లేక అనుమతిని జారీ చేయు నొక యుత్తరువు మీద పెట్టుకొనబడు విషయమున, ఆ వుత్తరువు పంచాయతీయొక్క నోటీసు బోర్డులో ప్రకటింపబడిన, తరువాత 30 దినములలోపల, మరియు

(b) ఇతర సందర్భములలో ఏ ఉత్తరవు లేక వ్యవహారము మీద అపీలు చేయుబడుచున్నదో అట్టి ఉత్తరవు లేక వ్యవహారము అందిన తేదీ తర్వాత ముప్పది దినములలోపల, ఇన్‌స్పెక్టరుకు పెట్టవలెను

సంపాదకుని సూచన —

ఈ విధి పన్నుల విషయమైన అపీళ్ళకు (వాటికిగాను ప్రత్యేక విధులున్నవి 375 పుటలో చూడుము), లేక ఎగ్జిక్యూటివు అధికారి లైసన్సులకు సవరణ, సస్పెండు లేక రద్దు చేయునట్టి యుత్తరువుల విషయమై చేసినఅపీళ్ళకు (యివి లైసెన్సునమూనా అందులోని అంశములకు చెందిన విధులలో మూడవ విధి ననుసరించి యుండుట చేత 437 పుటచూడుము), లేక ప్రజాసమూహములు పోవు స్థలముల ఆక్టు, 1888 క్రింద లైసెన్సుల విషయమైన అపీళ్ళకు వర్తించదు

సెక్షను 112 (2) (xxxvii) క్రింద విధులు 298-299 పుటలోనున్నవి

సెక్షను 112 (2) (xxxviii), (xxxix) మరియు (xl) క్రింద విధులు జారీచేయులేదు

సెక్షను 112 (2) (xli) క్రింద విధులు479-482 పుటలలోనున్నవి

సెక్షను 112 (2) (xlii) క్రింద విధులు 11 వ పుటలో నున్నవి

సెక్షను 112 (1) క్రింద విధులు వాటివాటి కనుకూలమైన సెక్షనుల క్రింద అచ్చువేయబడినవి

I పంచాయతీ వ్యయము చేయతగిన కోర్టు ఖర్చుల గురించి విధులు

(జి ఒ నెం 1547 ఎల్. ఎ తేదీ 6-8-1951)

విధి

బయటివారి అంగీకారము లేకుండ పంచాయతీలు భరించవలసిన న్యాయ సంబంధమైన ఖర్చులయొక్క పరిమితి

ఏ పంచాయతీగాని, జిల్లా పంచాయతీ ఆఫీసరుయొక్క అంగీకారమును ముందుగా పొందకుండా, ఏదైన ఒక దావా వ్యాజ్యము లేక న్యాయచర్య సందర్భములో మొత్తముమీద పది రూపాయలకు మించిన యెట్టి ఖర్చునుగాని చేయకూడదు

వివరణము —ఈ విధిలోనున్నదేదియు కోర్టుయొక్క యేదేని డిక్రీ లేక ఉత్తరువు ననుసరించి చెల్లించవలసి యే మొత్తము కొరకైనను పంచాయతీ ముందుగా అంగీకారమును పొందవలసినట్లు భావింపబడకూడదు

కవులుదార్లకు, కంట్రాక్టర్లకు శిస్తులో మినహాయింపులు (రెవిన్యూ రెమిషనులు) మంజూరు చేయుటగురించి విధులు

(జి ఒ నెం 1547 ఎల్ ఎ తేదీ 6-8-1951)

విధులు

కవులుదార్లకు కంట్రాక్టర్లకును రెవిన్యూ రెమిషనులను ఇచ్చుట

1 పంచాయతీ రెవిన్యూ కవులుదార్లందరను పంచాయతీతో కంట్రాక్టులు చేసికొన్న వ్యక్తులందరను, వారివారి కవుళ్ళు లేక కంట్రాక్టుల షరతులకు ఖండితముగా బద్ధమై యుండవలెను 2 మరియు 3 విధుల ప్రకారము తప్ప, వారికి ఎట్టి రిమిషనునుగాని యియ్యకూడదు

2 కవులుదార్లకును, కంట్రాక్టర్లకును యిచ్చు ముదరాలను యిచ్చుట ఈ క్రింది నిర్భంధములకు పైవిచారణకు అధీనమై యుండవలెను

(a) కవులుదారు లేక కంట్రాక్టరు, ముందుగా తెలిసికొనజాలనట్టి అసాధారణ బాహ్యకారణమునుబట్టి కవులును కంట్రాక్టును

జరుప లేకుండు — ఉదాహరణకు, అంటువ్యాధి ప్రబలుటవలన తోపు కవులుకు పుచ్చుకొనిన మార్కెటును తప్పనిసరిగ మూయుట— సందర్భములలో తప్ప ముదరాను ఇయ్యకూడదు

(b) యియ్యబడిన ముదరాయొక్క మొత్తము, కవులు దారు లేక కంట్రాక్టరు అట్టి అసాధారణ కారణమునుబట్టి కవుల యొక్క లేక కంట్రాక్టుయొక్క తన భాగమును నిర్వహించుటకు నివారింపబడినట్టి కాలపరిమితికి చెల్లించవలసిన నిష్పత్తి మొత్తమును మించకూడదు

(c) తగ్గించబడిన మొత్తము యేబది రూపాయలను మించు నప్పుడు, రీజినల్ యిన్‌స్పెక్టరుయొక్క అనుమతిని ముందుగా పొంద వలెను.

3 కవులులో లేక కంట్రాక్టులో నిబంధింపబడిన జరిమానా లను సదరు కవులుయొక్క కంట్రాక్టుయొక్క షరతుల ననుసరించి కచ్చితముగ అమలు జరుపవలెను కవులుక్రింద లేక కంట్రాక్టుక్రింద పంచాయతీకి చెల్లించవలసిన మొత్తమును ఆలస్యముగ చెల్లించి నందుకైన జరిమానాలను, బాకీయొక్క దఫాలవారీ చెల్లింపు తగు క్రమములో నున్నదని పంచాయతీ అభిప్రాయపడు సందర్భమునను మరియు కవులుక్రింద లేక కంట్రాక్టుక్రింద పంచాయతీకి బాకీగానున్న పూర్తి మొత్తము సదరు కవులు లేక కంట్రాక్టు చెందిన కాల పరిమితి పూర్తియగు లోపున చెల్లించిన సందర్భమునను తప్ప తగ్గించకూడదు

అయితే చెల్లించిన మొత్తము ప్రతి సందర్భమునను 50 రూపా యలను మించునెడల రీజినల్ యిన్‌స్పెక్టరుయొక్క అంగీకారమును ముందుగా పొందవలెను

పంచాయతీ న్యాయవాదిని నియమించుట, అతనికి రుసుము (ఫీజు) యిచ్చుట గురించి విధులు

(జి ఒ నెం, 125 ఎల్ ఏ. తేదీ 22-1-1953)

విధులు

కొన్ని సందర్భములలో అడ్వకేటును నియమించుట రుసుములను చెల్లించుట.

1 పంచాయతీ వశ మందుండు భూముల సర్వే సరిగానున్నదా యని ఆక్షేపించబడు ఒక సివిల్ వాజ్యములో ప్రభుత్వమువారు, పంచాయతీవారు ఇద్దరును పార్టీలుగానుండి ఇద్దరి హక్కులు ఒకే విధముగా నుండునపుడు ప్రభుత్వమువారి తరఫున కలెక్టరు నియమించిన ఎడ్వకేటును మాత్రమే పంచాయతీ దాని తరఫున నియమించుకోవలెను అట్టి సందర్భములో ఎడ్వకేటుకు చెల్లించుకోవలసిన రుసుము ప్రభుత్వమువారును పంచాయతీవారును క్రమముగా మూడింట రెండుపాళ్ళు మరియు మూడవపాలు దామాషా చొప్పున భరించవలెను

2 1 వ విధిలో చెప్పబడిన సివిలు వ్యాజ్యములుగాని యితర వ్యాజ్యములలో ప్రభుత్వమువారు, పంచాయతీవారు ఉభయులును పార్టీలుగానుండి వారి వాదములు ఒకేవిధముగానుండు విషయమున ప్రభుత్వము తరఫున నియమింపబడిన ఎడ్వకేటును మాత్రము పంచాయతీవారు తమ తరఫున నియమించుకోవలెను అట్టి సందర్భములలో ప్రభుత్వము తరఫునను, పంచాయతీ తరఫునను అడ్వకేటుకు చెల్లించవలసిన రుసుమును, యితర చిల్లరఖర్చులు, వ్యవహారములు అయిపోయిన తర్వాత తగులు యితర ఖర్చులు ఉమ్మడిగా నుండవలెను అట్లు ఉమ్మడిగా జరుపు వ్యవహారములు జరుపుట కగు ఖర్చును ప్రభుత్వమున్ను, పంచాయతీయున్ను సమాన వాటాలలో భరించ వలెను

3 ఈ విధులు, సివిలు కోర్టుల తీర్పులమీద పంచాయతీలు దాఖలు చేసిన అపీళ్ళకు వర్తించకూడదు

సె 113 (1) ఈ యాక్టు ననుసరించి ఎట్టి విధినిగాని చేయునప్పుడు దాని ఉల్లంఘన వంద రూపాయలవరకు వ్యాపించగల జరిమానాతోను లేదా ఎడతెగక జరుగుచుండునట్టి ఉల్లంఘన విషయములో మొదటి ఉల్లంఘనకు నేరస్థాపన చేయబడిన తర్వాత ఉల్లం

ఘన జరుగుచుండు ప్రతిదినమునకును పదునైదు రూపాయలకు మించ నట్టి జరిమానాతోను శిక్షింపబడ తగియుండవలెనని గవర్నమెంటు వారు నిబంధింపవచ్చును

(2) ఈ అక్టు ననుసరించి విధులను చేయుటకైన అధి కారము, దానిని మొదటిసారి చెలాయించునప్పుడు తప్ప, ముందుగా వాటిని ప్రకటించవలెనను షరతుకులోబడి యుండవలెను

(3) ఈ యాక్టు ననుసరించి చేయబడిన విధులన్నియు ఫోర్టుసెంటు జార్జి గెజెటులో ప్రకటింపబడవలెను మరిన్ని అట్లు ప్రకటింపబడిన మీదట ఈ ఆక్టులో అవి శాసించబడిన నెట్లో అట్లే అమలును కలిగియుండవలెను

ఉ ప వి ధు లు

సె 114 (1) ఈ ఆక్టుయొక్కయు, ఏ యితర చట్టముయొక్క యు నిబంధనలకును, నిర్ణయింపబడగలట్టి విధులకును లోబడి, ఒక పంచా యతీ, ఇన్స్పెక్టరుయొక్క అంగీకారముతో అది ఏ కార్యముల నిమిత్తము ఏర్పాటు చేయబడినదో అట్టి ఏ కార్యములనైన నెర వేర్చుటకుగాను ఉపవిధులను చేయవచ్చును

(2) ఒక ఉపవిధిని చేయునప్పుడు, దానిని ఉల్లంఘించు ఏ మనిషిగాని పదునైదు రూపాయలకు మించని పంచాయతీచే నిర్ణ యింపబడగల పైకపు మొత్తమును లేదా ఎడతెగక జరుగుచుండు ఉల్లంఘన విషయములో మొదటి ఉల్లంఘునకు శిక్ష విధింపబడిన తర్వాత ఉల్లంఘన జరుగుచుండు ప్రతిదినమునకును ఐదు రూపాయ లకు మించకుండా అపరాధము చెల్లింపబడ తగియుండవలెనని పంచా యతీ నిబంధింపవచ్చును,

(3) ఉపవిధులను చేయుటకైన చర్యాక్రమమునుగురించి, వాటిని ప్రకటించుటను గురించి మరిన్ని అవి యే తేదీనుండి అమలు లోనికి రావలెనో దానిని గురించి విధులను చేయుటకు గవర్నమెంటు వారు అధికారమును కలిగియుండవలెను

సెక్షను 114 క్రింద విధులు

(జి ఒ. నెం 1547, ఎల్ ఎ తేదీ 6-8-1551)

## విధులు

## పంచాయతీలు ఉపవిధులను చేయుట.

1 పంచాయతీ ఉపవిధులను చేయుటకు లేక మార్చుటకు పూర్వము చేయ నుద్దేశించిన ఆ ఉపవిధులయొక్క మసోదాను మసోదా ఏ తేదీన లేక ఏ తేదీ తర్వాత విచారణలోనికి తీసికొందురో ఆ తేదీని నిర్దిష్టము చేయు నోటీసుతోపాటు ప్రకటించవలెను మరియు పంచాయతీ ఆ ఉపవిధులను లేక మార్పులను చేయుటకు పూర్వము నిర్దిష్టమైన ఆ తేదీకి ముందుగ సదరు మసోదా విషయములో దానితో సంబంధముగల ఏ వ్యక్తియైన చేయు ఆక్షేపణను లేక సలహాను అందుకొని విచారించవలెను

ఈ విధిక్రింద నోటీసును 3 వ విధిలో తెలుపబడిన విధముగా ప్రచురించవలెను ఆక్షేపణలను లేక సలహాలను పుచ్చుకొనుటకై నిర్దిష్టము చేయబడిన కాలపరిమితి ముప్పది దినములకు తక్కువగ నుండకూడదు

2 ఏ ఉపవిధిగాని, ఉపవిధియొక్క రద్దు లేక మార్పుగాని అది సంబంధించిన రీజనలు ఇన్స్పెక్టరుచే అంగీకరింపబడి రూఢి చేయబడిననేతప్ప అమలు కలిగియుండకూడదు

3 ఏ ఉపవిధి లేక ఉపవిధియొక్క రద్దు లేక మార్పుగాని క్రమముగా రూఢిచేయబడినప్పుడు ఆ ప్రదేశముయొక్క ముఖ్య భాషలయందు వ్రాయవలెను, లేక తర్జుమా చేయవలెను. దానిని పంచాయతీ ఆఫీసులో వుంచవలెను మరియు దాని నకలును పంచాయతీ కార్యాలయములో ప్రధాన స్థలమునందును, మరియు పంచాయతీ ఆజ్ఞాపించగల ఇతర స్థలములందును అంటించవలెను అట్టి నకలు అట్లు అతికించబడినదనియు అసలుప్రతిని పంచాయతీ కార్యాలయములందు తనిఖీ చేయవచ్చుననియు, గ్రామమందందంతటను దండోరా వేయించుటద్వారా లేక ఇతర విధముగ బహిరంగముగా ప్రకటన చేయవలెను

4 ఏ ఉపవిధి లేక ఉపవిధియొక్క రద్దు లేక మార్పు అయి నను, అది 3 వ విధి క్రింద ప్రచురింపబడిన తేదీనుండి మూడు మాసములు గతించినపిమ్మదట అమలులోనికి రావలెను

శిక్షలు

సె 1)5 (1) (a) 1 వ షెడ్యూలులోని ఒకటవ, రెండవ గడులలో వివరింపబడిన ఈ యాక్టుయొక్క నిబంధనలలోని దేనిని గాని వుల్లంఘించు, లేదా

(b) అట్లు వివరింపబడిన నిబంధనలలో దేనినైన ననుసరించి చేయబడిన యేదేని విధిని లేదా ఉత్తరువును ఉల్లంఘించు లేదా

(c) సదరు నిబంధనలలో వేటినైన ననుసరించి చట్ట సమ్మతముగా అతనికి యివ్వబడిన ఎట్టి ఉత్తరువు ప్రకారము లేదా చట్ట సమ్మతముగా అతనికి యివ్వబడిన రిక్విజిషను (ఆజ్ఞ) ప్రకారము జరిగించుటకు తప్పిపోవు

ఏ మనిషిగాని సదరు షెడ్యూలులోని నాల్గవ గడిలో ఆ విషయమై పేర్కొనబడిన మొత్తమువరకు వ్యాపించగల జరిమానాతో శిక్షింపబడదగియుండవలెను

(2) (a) 2 వ షెడ్యూలులోని ఒకటవ, రెండవ గడులలో వివరింపబడిన ఈ ఆక్టుయొక్క నిబంధనలలో దేనినిగాని ఉల్లంఘించినందుకు, లేదా

(b) అట్లు వివరింపబడిన నిబంధనలలో దేనినిబట్టిగాని, చేయబడిన యేదేని విధిని లేదా ఉత్తరువును ఉల్లంఘించినందుకు, లేదా

(c) సదరు నిబంధనలలో దేనినైన అనుసరించి లేదా దేనిని బట్టిగాని చట్ట సమ్మతముగా అతనికి యివ్వబడిన యెట్టి ఉత్తరువు ప్రకారము లేదా చట్ట సమ్మతముగా అతనికి యివ్వబడిన రిక్విజిషన్ (ఆజ్ఞ) ప్రకారము జరిగించుటకు తప్పిపోయినందుకు నేరస్థాపన చేయబడినతర్వాత సదరు నిబంధనను లేదా సదరు విధిని లేదా ఉత్తరవును ఎడతెగక ఉల్లంఘించు లేదా సదరు ఉత్తరువు

లేదా ఆజ్ఞ ప్రకారము జరిగించుటకు ఎడతెగకుండ తప్పిపోవు ఏ మనిషిగాని, అట్లు నేరము జరుగుచున్న కాలములో తత్పూర్వపు నేరస్థాపన తేదికి తర్వాత ప్రతిదినమునకును సదరు షెడ్యూలులోని నాల్గవ గడిలో దాని విషయమై పేర్కొనబడిన మొత్తమువరకు వ్యాపించగల జరిమానాతో శిక్షింపబడవలెను

వివరణము —— 1 వ 2, వ షెడ్యూళ్లలో "విషయము" అను శీర్షిక క్రింద మూడవ గడిలోని నమూదులు, వాటి తాలూకు ఒకటవ రెండవ గడులలో నిర్దేశింపబడిన, నిబంధనలలో వివరింప బడిన నేరములకు నిర్వచనములుగాగాని లేక ఆ నిబంధనలయొక్క సంగ్రహములుగానైనను ఉంచునట్లు ఉద్దేశింపబడలేదు కాని అవి, వాటిలోని విషయమునకు సూచనలుగా మాత్రమే ఉంచబడినవి.

సె 116 (1) ఈ ఆక్టు ననుసరించి లేదా దీనిక్రింద చేయబడిన విధుల ననుసరించి ఒక పంచాయతీయొక్క మెంబరుగా ఉద్యోగమును కలిగియుండుటకు తనకు హక్కు లేదనిగాని, హక్కు నిలిచిపోయినదని గాని తెలిసియుండియు ఏ మనిషిగాని అతడు మెంబరుగా వ్యవహరించినయెడల అట్టి ప్రతి నేరమునకును ఆయన రెండు వందల రూపాయలకు మించని జరిమానాతో శిక్షింపబడతగియుండవలెను

(2) ఈ ఆక్టు ననుసరించి లేదా దీనిక్రింద చేయబడిన విధుల ననుసరించి ఒక పంచాయతీయొక్క ప్రెసిడెంటు, తాత్కాలికపు ప్రెసిడెంటు లేక వైసు-ప్రెసిడెంటుయొక్క ఉద్యోగమును కలిగియుండుటకు లేదా అట్టి పనులను చెలాయించుటకు తనకు హక్కు లేదనిగాని, హక్కు నిలిచిపోయినదనిగాని, తెలిసియుండియు ప్రెసిడెంటుగా, తాత్కాలికపు ప్రెసిడెంటుగా లేదా వైసు-ప్రెసిడెంటుగా వ్యవహరించునట్టి లేదా ఆయన కార్యనిర్వాహక అధికారిగాకూడ నుండు సందర్భములో అట్లు ఆయనయొక్క పనులు యేవైనను చెలాయించు ఏ మనిషిగాని అట్టి ప్రతి నేరమునకును వెయ్యి రూపాయలకు మించని జరిమానాతో శిక్షింపబడతగియుండవలెను.

(3) ఒక పంచాయతీయొక్క ప్రెసిడెంటుగా, తాత్కాలికపు ప్రెసిడెంటుగా లేదా వైసు-ప్రెసిడెంటుగా ఉండి తన స్వాధీనములో లేక అధికారములోనున్న లేదా తన స్వాధీనములోనికి లేదా అధికారములోనికి వచ్చిన పంచాయతీ వశమందుండు లేక పంచాయతీకి చెందినయెట్టి పత్రములనైన లేదా యెట్టి పైకములనైన లేదా యితర ఆస్తులనైన తన ఉద్యోగములోనికి తన తరువాత వచ్చినవారికి లేదా నిర్ణయింపబడిన యితర అధికారికి—

(a) ప్రతి సందర్భములోను అట్టి ప్రెసిడెంటుగా, తాత్కాలికపు ప్రెసిడెంటుగా లేదా వైసు-ప్రెసిడెంటుగా అతని ఉద్యోగ కాలపరిమితి అంతమైన వెంటనే, మరిన్ని

(b) వైసు - ప్రెసిడెంటుగా నుండిన విషయములో ప్రెసిడెంటుచే కోరబడినప్పుడు కూడ,

అప్పజెప్పుటకు తప్పిపోయిన ఏ మనిషిగాని అట్టి ప్రతి నేరమునకును వెయ్యి రూపాయలకు మించని జరిమానాతో శిక్షింపబడతగియుండవలెను.

యాక్టుయొక్క 116 (3) వ సెక్షను క్రింద "నిర్ణీతమయిన అధికారి"ని నిర్వచించు విధి

విధి

(జి ఒ నెం 520, ఎల్ ఏ తేదీ 24-3-1951).

యాక్టుయొక్క 116 (3) వ సెక్షనులోని విధుల కనువర్తించు నిర్ణీతమయిన అధికారి, పర్యవేక్షణగల జిల్లా పంచాయతీ ఆఫీసరుగాని లేక డిప్యూటీ పంచాయతీ ఆఫీసరుగాని అయివుండవలెను

సె 117 ఒక పంచాయతీయొక్క ఎట్టి ఉద్యోగిగాని లేదా నౌకరుగాని పంచాయతీతోగాని, దానిచేగాని, దాని తరఫునగాని చేసుకొనబడినట్టి ఏ కాంట్రాక్టులోనైనను, పనిలోనైనను, సొంతమునకు ఏ వాటానైనను లేక హక్కునైనను, తాను స్వయముగానైనను, ఒక భాగస్థుని ద్వారానైనను, యజమానిద్వారానైనను, నౌకరు ద్వారానైనను ప్రత్యక్షముగాగాని పరోక్షముగాగాని బుద్ధిపూర్వక

ముగా పొందినయెడల అతడు ఇండియన్ పీనలు కోడుయొక్క 168 వ సెక్షను ననుసరించి నేరము చేసినట్లు భావింపబడవలెను

అయితే ఏ మనిషిగాని ఏదేని కంపెనీయొక్క షేరుహూల్డరు (భాగస్థుడు) గాగాని మెంబరుగాగాని ఉన్న కారణమున అతడు అట్టి కంపెనీయొక్క డైరక్టరుగానున్ననే తప్ప, అట్టి కంపెనీయును పంచాయతీయును చేసికొనిన ఏదేని కాంట్రాక్టుతో హక్కు కలిగియున్నట్లు భావింపబడకూడదు

**మరియు**, ఇన్స్పెక్టరుయొక్క అనుమతితో పంచాయతీతో ఒక కాంట్రాక్టు చేసుకొను యేమనిషికిగాని ఈ సెక్షనులోనున్న దేదియు వర్తించకూడదు.

సె 1.8, కార్యనిర్వాహక అధికారిని లేదా కార్యనిర్వాహక అధికారి ఎట్టిస్థలము కట్టడము లేదా భూమి లోపలికైనను, దాని మీదకైనను ప్రవేశించుటకు తనకుగల అధికారములను చట్టసమ్మతముగా అప్పగించియుండు ఏ మనిషినిగాని అట్లుదానిమీద లేదా దానిలో ప్రవేశించుటకు అతనికి చట్టసమ్మతముగాగల అధికారమును చెలాయించుటను ఆటంకపెట్టు ఏ మనిషిగాని యిండియను పీనలు కోడుయొక్క 341 వ సెక్షను ననుసరించి నేరము చేసినట్లు భావింపబడవలెను

సె 119 ఒక పంచాయతీని, పంచాయతీయొక్క ప్రెసిడెంటును, కార్యనిర్వాహక అధికారిని, మెంబరును లేక దానిచే పనికి నియమింపబడిన ఏ మనిషినిగాని లేదా పంచాయతీచే లేదా దాని తరఫున ఒడంబడిక చేసికొనబడియున్న బాపతు ఏ మనిషినిగాని వారు చేయవలసిన పనిని జరిగించుటలో లేదా ఈ ఆక్టుకు లేదా దాని ననుసరించి చేయబడిని ఎట్టి విధిని, ఉపవిధిని, రెగ్యులేషనును లేదా ఉత్తరువును బట్టి లేదా దాని పర్యవసానముగా వారు చేయుటకు వారికి అధికారమియ్యబడిన లేదా కోరబడియుండు వారి పనిని లేక దేనినిగాని నెరవేర్చునప్పుడు ఆటంకపెట్టు లేదా ఉపద్రవముచేయు ఏమనిషిగాని, ఏబది రూపాయలవరకు వ్యాపెంచగల జరిమానాతో శిక్షింపబడవలెను.

సె. 120 పంచాయతీచే లేదా దాని కార్యనిర్వాహకఅధికారిచే లేదా దానియొక్క లేదా ఆయనయొక్క ఉత్తరువుల ననుసరించి, ప్రదర్శింపబడిన ఎట్టినోటీసునుగాని లేదా ఉంచబడిన చిహ్నమును గాని, గుర్తునుగాని ఆ విషయమున అధికారము పొందకుండ తీసివేయు, పాడుచేయు, తుడిచివేయు లేదా యితర విధముగా కనబడకుండచేయు ఏ మనిషినిగాని యేబది రూపాయలవరకు వ్యాపించగల జరిమానాతో శిక్షింపబడవలెను

సె 121 ఈ ఆక్టుచే లేదా దీని ననుసరించి జారీచేయబడిన ఎట్టినోటీసుచే లేదా యితర చర్యలచే యేదేని సమాచారమును తెలుపుటకు కోరబడి, అట్టి సమాచారమును తెలుపుటకు తప్పిపోవు లేదా బుద్ధిపూర్వకముగా అబద్ధపు సమాచారమును తెలియజేయు ఏమనిషిగాని నూరు రూపాయలకు మించని జరిమానాతో శిక్షింపబడ తగియుండవలెను

## VIII వ అధ్యాయము అదనపు ఏర్పాట్లు,

సెక్షను 122

క్రొత్త పంచాయతీల విషయములో ప్రత్యేక ఏర్పాట్లు -

(1) ఈ యాక్టులో నేమి వచింపబడియున్నప్పటికీ, మొట్టమొదట పంచాయతీ నిర్మింపబడినపుడు, ఆ పంచాయతీయొక్కయు, మరియు దానియొక్క అధ్యక్షునియొక్కయు అధికారములను చెలాయించుటకు పనులను చేయుటకు, విధులను నిర్వర్తించుటకు, ప్రభుత్వమొక స్పెషలు ఆఫీసరును (ప్రత్యేకోద్యోగిని) నియమింపవచ్చును

(2) పంచాయతీ నిర్మాణమునకు ఇన్‌స్పెక్టరు 3 వ సెక్షనుయొక్క (1) వ సబు సెక్షను క్రింద జారీచేసిన ప్రకటనలో పేర్కొనబడిన తేదీకి క్రొత్తగా ఎన్నికయిన సభ్యులు పదవీ స్వీకారము చేయుటకు అనుగుణ్యముగా, పంచాయతీ సభ్యుల ఎన్నికలకు స్పెషలు ఆఫీసర్లు యేర్పాట్లు చేయవలెను.

అయితే ఏ కారణములచే నయిన ఎన్నికలు సకాలనములో జరుపుటకు సాధ్యముః కానియెడల, అట్లు పేర్కొనబడిన తేదీని అవస

రాను సారముగా ముందుకు అప్పుడప్పుడు మార్చుటకు ఇన్స్పెక్ట రుకు అధికారము కలదు.

(3) స్పెషలు ఆఫీసరు యీ క్రింది వారియొక్క అధికార ములను వహించి, పనులనుచేసి, మరియు విధులకు నిర్వర్తించును —

(a) పంచాయతీ నిర్మాణము అగువరకు పంచాయతీ యొక్కయు ,

(b) పంచాయతీచే అధ్యక్షుడు ఎన్నుకొనబడు నంత వరకు, అధ్యక్షుని యొక్కయు , మరియు

(c) అధ్యక్షుడు ఎన్నుకొనబడునంతవరకుగాని, లేక ఎగ్జిక్యూటివు ఆఫీసరు నియమింపబడు నంతవరకుగాని, తదను గుణ్యా ముగా, ఎగ్జిక్యూటివు అధికారి యొక్కయు ,

(4) పంచాయతీ నిర్మాణము అయిన పిమ్మట, సాధ్య మయినంత త్వరలో, స్పెషలు ఆఫీసరుచే నిర్ణయింపబడిన తేదీని, కాలమున, అధ్యక్షుని ఎన్నుకొనుటకు సభ్యుల సమావేశము జరుప బడవలెను అట్టి సమావేశములో అధ్యక్షుని ఎన్నిక జరుగనిచో, స్పెషలు ఆఫీసరు మరల నిర్ణయించిన తేదీని, క్రొత్త ఎన్నిక జరుప బడ వలెను

(5) (2) వ సబుసెక్షను క్రింద యెన్నుకొనబడిన సభ్యుల యొక్కయు, లేదా వారి స్థానములలో, అకస్మాత్తు ఖాళీలలో నెన్ను కొనబడిన సభ్యుల యొక్కయు, యుద్యోగ కాలపరిమితి (సభ్యత్వ పరిమితి), యిన్స్పెక్టరు నిర్ణయించిన సంవత్సరమున, తేదీని అంత మగును అట్లు నిశ్చయింపబడిన సంవత్సరము, ఆ జిల్లాలోనే, ఏపంచా యతీకయిన రాబోవు సాధారణ ఎన్నికలు జరుగునట్టి సంవత్సరమున గాని, లేదా అట్టి సాధారణ ఎన్నికలు జరిగిన వెంటనే తరువాత తటస్థ మగు సాధారణ ఎన్నికలు జరుగు సంవత్సరముగాని, అయి వుండ వలెను అట్లు నిర్ణయింపబడిన తేదీ డిశంబరు 31 తేదీకి మించ రాదు

(6) ఈ యాక్టులో యితర విధముగా విధింపబడిననేతప్ప, (1), (2), (3), (4) మరియు (5) వ సబుసెక్షనులలోని విధులు,

అనుకూలమయినంతవరకు. పంచాయతీల పునర్నిర్మాణమునకు వర్తించును

సంపాదకుని సూచిక

పై సెక్షను క్రింద స్వేషలు ఆఫీసును నియమించు అధికారము ప్రభుత్వము యిన్‌స్పెక్టరు జనరలునకును, జిల్లా పంచాయతీ ఆఫీసర్లకును దత్తత చేసిరి

(జి ఒ నెం 471, ఎల్. ఎ, తేదీ 15-3-1956)

సె 123 ఒక పంచాయతీ వశమందుండు లేదా దానిచే పోషింపబడు యావత్తు రోడ్లును, మార్కెట్లను, బావులును, చెఱువులును, రిజర్వాయర్లును, నీటి ప్రవాహములును, జాతిమతముతో నిమిత్తము లేకుండ అందరును ఉపయోగించుటకును అనుభవించుటకును వీలుగా నుండవలెను

సె 124 ఈ ఆక్టు ననుసరించి లేదా దాని క్రింద చేయబడిన ఏదేనివిధిని, ఉపవిధిని లేదా రెగ్యులేషనును అనుసరించి పంచాయతీకి రావలసిన రుసుముల యొక్క వసూలునైనా పంచాయతీ యుక్తమని తలచు షరతుల మీద ఒకసారి మూడు సంవత్సరములకు మించని ఎట్టి కాలమునకైనను కౌలుకిచ్చుటకు పంచాయతీ అధికారమును కలిగియుండవలెను

సె 125 (1) ఇన్‌స్పెక్టరు, పంచాయతీ కోరినమీదటనైనను లేదా యితరవిధముగా నైనను ప్రకటనద్వారా, గ్రామమునకు లేదా అందులో నిర్దేశింపబడిన ఎట్టి ప్రదేశమునకైన 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టుయొక్క నిబంధనలలో ఏదియైనను లేదా దానిక్రింద చేయబడిన విధులలో ఏదియైనను వ్యాప్తిచెందవలెననియు, దానిలో అది అమలులో నుండవలెననియు ప్రసిద్ధపరుచవచ్చును

(2) అట్లు ప్రకటింపబడిన నిబంధనలను గ్రామమునకు లేదా అందులో నిర్దేశింపబడిన ప్రదేశమునకు వానిని అనుగుణముగా చేయు కార్యము నిమిత్తము అవసరముగా లేక క్రమముగా నుండగల విధముగా ముఖ్యాంశమును బాధించకుండు మార్పులతో అర్థము చేసికొనవలెను

(3) పైన చెప్పిన నిబంధనకు సామాన్యముగా భంగకర ముగా లేకుండ ఆయా సందర్భమునకు తగినట్లు ఒక మునిసిపలు కౌన్సిలు, లేక దాని చేర్మెను లేక కార్యనిర్వాహక అధికారికి చేయ బడిన సూచనలన్నియు పంచాయతీకి లేక దాని ప్రెసిడెంటుకు లేక కార్యనిర్వాహక అధికారికి చేయబడిన సూచనలుగాను, ఒక మునిసి పలు కౌన్సిలుయొక్క ఏ ఉద్యోగి లేక నౌకరుకైన చేసిన సూచన లన్నియు పంచాయతీలో వారి కనుగుణముగానుండు ఉద్యోగి లేక నౌకరుకు చేయబడిన సూచనలుగాను, మునిసిపలు సరిహద్దులకు చేయ బడిన సూచనలన్నియు గ్రామము లేక అందలి నిర్దిష్ట ప్రదేశము యొక్క సరిహద్దుకు చేయబడిన సూచనలుగాను అర్థము చేసికొన బడవలెను

సె 126 ఈ ఆక్టులో లేదా 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు బోర్డుల ఆక్టులో ఏమియున్నను దానితో నిమిత్తము లేకుండ గవర్నమెంటువారు ప్రకటన ద్వారాను దానిలో నిర్దేశింపబడగల నిర్బంధములకును షరతులకును, పై విచారణకును, రివిజనకును లోబడి ఎట్టి పంచాయతీ లేదా పంచాయతీల తరగతి విషయములో నైన ఆక్టుచే లేదా దీని ననుసరించి అట్టి పంచాయతీ లేదా పంచా యతీల తరగతికి సంక్రమింప జేయబడిన ఏ పనులు గాని డిస్ట్రిక్టు బోర్డుకు పరివర్తన చేయబడి దానిచే జరుపబడవలెనని ఆజ్ఞాపించ వచ్చును

## సెక్షను 126 క్రింద ప్రకటన

(జి ఒ నెం 640, ఎల్ ఏ , తేదీ 1-4-1951)

మద్రాసు గ్రామ పంచాయతీ ఆక్టు (1950 లో X వ మద్రాసు చట్టము) మద్రాసు గవర్నరు యీక్రిందంవిధమున ఉత్తరువు జారీ చేయుచున్నారు పంచాయతీ అధికార్లు మరియు నౌకర్ల ప్రోవిడెంటు ఫండు పోషించు, పంచాయతుల పైనున్న విద్యుక్తము సంబంధించిన జిల్లాబోర్డులకు మార్చబడి వారివలన, లోకలు బోర్డు ప్రోవిడెంటు ఫండు రూల్సు ప్రకారము చెలాయించబడవలెను

127 (1) గవర్నమెంటువారు ప్రకటనద్వారా ఏ స్థానిక ప్రదేశములోనైనను ఆ ప్రదేశములోని ఏ పంచాయతీ విషయము లోనైనను లేదా పంచాయతీల తరగతి విషయములోనైనను లేదా పంచాయతీలన్నిటి విషయములోను, విధులనుచేయుటకైన అధికారమును తప్ప, ఈ ఆక్టుచే వాటికి సంక్రమింప జేయబడిన అధికారములలో దేనినైన చెలాయించుటకు ఎట్టి అధికారికిగాని, ఉద్యోగికగాని, మనిషికిగాని అధికారమియ్యవచ్చును మరిన్ని అదే విధముగా అట్టి అధికారమును తీసివేయవచ్చును

(2) ఇన్‌స్పెక్టరు లేదా కలెక్టరు ప్రకటనద్వారా ఆయా సంగతికి తగినట్లు ఆ రాజ్యములోని లేదా రెవిన్యూ జిల్లాలోని ఏ స్థానిక ప్రదేశములోగాని ఆ ప్రదేశములోని ఏ పంచాయతీ విషయమునైన లేదా పంచాయతీల తరగతి విషయములోనైన లేదా పంచాయతీలన్నిటి విషయమున ఆయా సంగతికి తగినట్లు ఈ ఆక్టుచే ఇన్‌స్పెక్టరు లేదా కలెక్టరుకు సంక్రమింపజేయబడిన ఎట్టి అధికారములనైన చెలాయించుటకు ఎట్టి వుద్యోగి లేక మనిషికిగాని అధికార మియ్యవచ్చును మరిన్ని అదేసిధముగా అట్టి అధికారమును తీసివేయవచ్చును

(3) (1) వ లేదా (2) వ సబు సెక్షను ననుసరించి అప్పగింపబడిన ఎట్టి అధికారమునైన చెలాయించడము ప్రకటనలో నిర్ణయింపబడగలట్టి లేదా నిర్దేశింపబడగలట్టి నిర్బంధములకును షరతులకును లోబడియుండవలెను మరియు అప్పుడెప్పు అధికారియొక్క లేదా అట్టి అధికారి గవర్నమెంటువారుగా నున్నప్పుడు ఈ విషయమున గవర్నమెంటువారిచే అధికారమియ్యబడగల మనుష్యులయొక్క పై అధికారమునకును రివిజనుకునుకూడ లోబడి యుండవలెను అట్లు అధికారమియ్యబడిన ఎట్టి మనుష్యులయొక్క పనుల మీాద లేదా చర్యలమీాదనైన పై విచారణ చేయుటకును, వాటిని పునర్విమర్శ చేయుటకును కూడ గవర్నమెంటువారికి అధికారముండవలెను

(4) ఈ సెక్షనులోని (2) వ, (3) వ సబు సెక్షనులు చేరి ఈ ఆక్టుయొక్క నిబంధనలలో దేనివలనగాని యిన్‌స్పెక్షనుకు లేదా కలెక్టరుకు యియ్యబడిన ఎట్టి అధికారమునైన చెలాయించడము, అట్టి అధికారమును యిన్‌స్పెక్టరు చెలాయించినను, లేక కలెక్టరు స్వయముగా చెలాయించినను లేక (2) వ స ు సెక్షను క్రింది అది అప్పగించబడిన ఏ మనిషియైనను చెలాయించినను, నిర్ణయింపబడగల నిర్బంధములకును షరతులకును లోబడి యుండవలెను. మరిన్ని అది గవర్నమెంటువారియొక్క లేదా ఈ విషయమున వారిచే అధికారమియ్యబడగల మనిషియొక్క పై విచారణకు కూడ లోబడియుండవలెను, అట్లు అధికారమియ్యబడిన ఎట్టి మనుష్యులయొక్కయైన పనులమీద లేదా చర్యలమీద పై విచారణను చేయుటకుకూడ గవర్నమెంటువారికి అధికారముండవలెను

సంపాదనికు సూచిక ,

ప్రభుత్వముచే అధికారముల దత్తత ఆయా సంబంధమయిన సెక్షనులక్రింద వివరింపబడినవి

లోకల్ అడ్మిని స్ట్రేషనుయొక్క ఇన్‌స్పెక్టర్ జనరలుచే చేయబడిన దత్తతలకు అనుబంధము (ఎనెక్సర్) చూడుము

128 (1) ప్రభుత్వమువారు తమ ఇష్టానుసారము ఏ కాలమందైనను తమంతట తాము లేక దరఖాస్తు పెట్టుకొన్నమీదట-

(e) ఇన్‌స్పెక్టరుచే లేక కలెక్టరుచే లేక 127 వ సెక్షనుయొక్క (2) వ సబు సెక్షనుక్రింద యిన్‌స్పెక్టరు లేక కలెక్టరువలన అధికారమియ్యబడిన ఏ ఉద్యోగి లేక మనిషిచేనైన, లేక

( ) ఆ సెక్షనుయొక్క (1) వ సబు సెక్షనుక్రింద ప్రభుత్వమువారివలన అధికారమియ్యబడిన ఏ అధికారి, ఉద్యోగి లేక మనిషిచేనైన లేక ఆ సెక్షనుయొక్క (3) వ సబు సెక్షనుక్రింద వారిచే అధికారమియ్యబడిన ఏ మనిషిచేనైన, లేక

(c) ఏ ఇతర అధికారి, ఉద్యోగి లేక మనిషిచేనైన

ఈ ఆక్టుయొక్క నిబంధనల క్రింద జారీచేయబడిన ఏ ఉత్తరువుయొక్కయైన లేక వ్రాసియుంచబడిన వ్యవహారముయొక్కయైన

రికార్డును, అట్టి ఉత్తరుపు చట్టబద్ధముగా లేక సరిగానున్నదాయని లేక అట్టి వ్యవహారము క్రమముగానున్నదాయని వారు తృప్తిపడుటకు తెప్పించి పరీక్షించవచ్చును మరియు వారు యుక్తమని తలంచు విధముగా దాని విషయమున ఉత్తరువును జారీచేయవచ్చును,

(2) (1) వ సబు సెక్షనులో చెప్పబడిన స్వభావముగల అధికారములు ప్రభుత్వమువారు ఈ విషయమున అధికారమియ్యగల అధికారివలన, ఉద్యోగివలన లేక మనిషివలనకూడ చెలాయింపబడవచ్చును

సె 129, ఆక్టు ప్రారంభమగునప్పుడు రాజ్యములో అమలులోనున్న ఎట్టి చట్టములోనైన, విధిలోనైన, ఉపవిధిలోనైన రెగ్యులేషనులోనైన, ప్రకటనలోనైన ప్రణాళికలోనైన, నమూనాలోనైన లేదా ఉత్తరువులోనైన ఉండు ఒక పంచాయతీకైన ఎట్టి సూచనగాని ఈ ఆక్టు ననుసరించి పునర్నిర్మాణము చేయబడునట్లుండు లేదా ఏర్పాటు చేయబడినట్లుండు పంచాయతీకైన ఒక సూచనగా భావింపబడవలెను

సె 130 (1) ఈ ఆక్టుయొక్క లేక ఏ ఇతర ఆక్టుయొక్కనైన నిబంధనల ననుసరించి కలుగు ఏ విషయమును గురించియైనను ఒక పంచాయతీకిని ఒకటి లేక అంతకంటె యెక్కువ ఇతర స్థానిక అధికారివర్గములకును మధ్య ఒక వివాదముఉండి, సంబంధముగల పంచాయతీయును ఇతర స్థానిక అధికారవర్గములును వాటిలో తమలో తాము సమరసభావముతో పరిష్కారము చేసికొనజాలక యున్నట్లు గవర్నమెంటువారు అభిప్రాయపడునప్పుడు గవర్నమెంటువారు ఆ వివాదమును విచారణకు తీసికొని—

(a) వారే దాని విషయమున తీర్పు చేయవచ్చును, లేక

(b) దానిని విచారించి రిపోర్టు చేయుటగాను ఒక మధ్యవర్తికి లేక మధ్యవర్తుల బోర్డుకు లేక ఆ కార్యము నిమిత్తము 39వ సెక్షనుక్రింద ఏర్పాటుచేయబడిన ఒక జాయింటు కమిటీకి దానిని పంపవచ్చును

(2) (1) వ సబు సెక్షనుయొక్క (b) క్లాజులో చెప్పబడిన రిపోర్టు, గవర్నమెంటువారికి పంపవలెను. వారు ఆ వివాదమును యుక్తమని తలచువిధముగా తీర్పుచేయవలెను

(3) (1) వ సబు సెక్షనుయొక్క (a) క్లాజు ననుసరించి లేక (2) వ సబు సెక్షను ననుసరించి చెప్పబడు ఏ తీర్పుగాని అప్పుడప్పుడు గవర్నమెంటువారిచే, వారు యుక్తమని తలచువిధముగా సవరింపబడవచ్చును మరియు ఈ సబు సెక్షను ననుసరించి ఆ తీర్పులో ఏవైన సవరణలు చేయబడినయెడల వాటితోచేరి అట్టి ఏ తీర్పుగాని ఏ కాలమందుగాని గవర్నమెంటువారిచే రద్దుచేయబడవచ్చును

అట్టి ఏ తీర్పుగాని లేక దానిలోని ఏ సవరణగాని లేక దాని రద్దుగాని సంబంధముగల పంచాయతీని యితర స్థానిక అధికారవర్గములలో ప్రతియొక దానిని నిర్బంధించునట్టిదై యుండవలెను మరియు అది ఏ న్యాయస్థానమందుగాని ప్రశ్నింపబడ తగియుండకూడదు

(4) సంబంధముగల స్థానిక అధికారవర్గములలో ఒకటి కంటోన్మెంటు అధికారవర్గముగా లేక ఒక ముఖ్యమైన పోర్టు (రేవు) యొక్క పోర్టు అధికారవర్గముగానుండు సందర్భములో ఈ సెక్షను క్రింద గవర్నమెంటువారికిగల అధికారము సెంట్రల్ గవర్నమెంటు వారి అంగీకారముతో మాత్రమే చెలాయించబడతగియుండవలెను

సంపాదకుని సూచిక

130 వ సెక్షనుక్రింద అధికారములు లోకల్ అడ్మినిస్ట్రేషనుయొక్క యిన స్పెక్టరు జనరలును, రీజనల్ యిన్‌స్పెక్టర్లకును దత్తత చేయబడినవి (జి ఓ. నెం 1118, లోకలు అడ్మినిస్ట్రేషను, తేదీ 4-6-1951) అనుబంధమును చూడుము

సె 131 (1) ఈ ఆక్టు ప్రారంభమగునప్పుడు ఉండిన పంచాయతీల ఆక్టుయొక్క నిబంధనల ననుసరించి మొదట పునర్నిర్మాణము చేయు విషయములోను సదరు నిబంధనలను యితర విధముగా మొదట అమలు జరుపుటలోను వాటిని III వ షెడ్యూలులోని విధులకు అన్వయించుకొని చదువవలెను

(2) సదరు షెడ్యూలులోని విధులను ప్రకటనద్వారా సవరించుటకు వాటికి చేర్చుటకు లేదా వాటిని రద్దుచేయుటకు గవర్న మెంటువారు అధికారమును కలిగియుండవలెను

సె 132 (ఇందు నిముతర్వాత ఈ సెక్షనులో సదరు ఆక్టు అని చెప్పబడు) 1888 వ సం॥పు మదరాసు గ్రామ కోర్టుల ఆక్టులో, ఏదియున్నను దానితో నిమిత్తము లేకుండ—

(1) ఏ ప్రదేశమునకైనను ఈ ఆక్టుక్రింద నిర్మింప బడిన లేక నిర్మింపబడినట్లు భావింపబడిన ప్రతి పంచాయతీ సదరు ఆక్టుయొక్క 9 (1) వ సెక్షనుక్రింద ఆ ప్రదేశమునకైన పంచాయతీ కోర్టుగా భావింపబడవలెను, అట్టి పంచాయతీయొక్క సభ్యులు (ప్రెసిడెంటు మరియు వైసు ప్రెసిడెంటుతో సహా) అట్టి పంచాయతీ కోర్టుయొక్క ఉద్యోగరీత్యా మెంబర్లుగా భావింపబడ వలెను పైన చెప్పిన ప్రెసిడెంటు, వైసు-ప్రెసిడెంటు ఆ పంచా యతీ కోర్టుయొక్క క్రమముగా ఉద్యోగరీత్యా ప్రెసిడెంటు వైసు-ప్రెసిడెంటుగాకూడ భావింపబడవలెను

(2) ఒక పంచాయతీ, ఈ ఆక్టుయొక్క 48 (1) వ సెక్షను క్రింద అంత్యము కావించబడిన లేక రద్దు చేయబడిన విషయములో, పైన చెప్పిన పంచాయతీ కోర్టులో, సదరు పంచాయతీ తిరిగి నిర్మింప బడునంతవరకు ——

(a) ఆయా సందర్భమునకు తగినట్లు పంచాయతీ యొక్క ప్రెసిడెంటు లేక ఈ ఆక్టుయొక్క 48 (5) వ సెక్షను క్రింద నియమింపబడిన మనిషి ఉండవలెను వీరు ఆ పంచాయతీ కోర్టు యొక్క ప్రెసిడెంటుగను మెంబరుగాను ఉండవలెను

(b) పంచాయతీ మెంబర్లుగా ఎన్నుకొనబడుటకు అర్హతగల మనుష్యులనుండి ఇన్‌స్పెక్టరు నియమించిన ఇతర ముగ్గురు మెంబర్లు ఉండవలెను,

(3) ఈ ఆక్టుక్రింద నిర్మింపబడిన లేక నిర్మించబడినట్లు భావింపబడిన ఒక పంచాయతియొక్క విచారణాధికార ప్రదేశము లోని ఏ విస్తీర్ణమునందైన ఈ ఆక్టు ప్రారంభమునకు పూర్వము

సదరు ఆక్టు క్రింద స్థాపించబడిన ఏదైన గ్రామ లేక పంచాయతీ కోర్టు లేక కోర్టులు ఏదైన ఉన్నయెడల దాని విచారణాధికారము అంతయు కావలెను మరియు ఆ పంచాయతీ, సదరు ఆక్టుయొక్క 9–A మరియు 9–B సెక్షనుల అర్థములోను వాని కార్యముల నిమిత్తమును అట్టి కోర్టు లేక కోర్టులకు బదులుగా స్థాపించబడిన ఒక పంచాయతీ కోర్టుకుగా భావింపబడవలెను

(4) అట్టి ఏ పంచాయతీయొక్కయైన విచారణాధికారము లోనుండు ప్రదేశములో—

(a) సదరుఆక్టుయొక్క 6 నుండి 8 వరకు 9 (2) (3), (4), (5) (a) మరియు (7) సెక్షనులయొక్క నిబంధనలు వర్తించకూడదు

(b) ఇన్స్పెక్టరు ఏ పంచాయతీ కోర్టుయొక్కయైన ప్రెసిడెంటు, వైసు-ప్రెసిడెంటు లేక మెంబర్లను, వారు (1) వ క్లాజు, (2) వ క్లాజు క్రింద ఉద్యోగము కలిగియుండినప్పటికిని అసమర్థత, విధిని ఉపేక్షించుట, దుర్నడత లేక ఇతర న్యాయమైనట్టియు చాలినట్టియు కారణము నిమిత్తము ఉద్యోగమునుండి తొలగించవచ్చును ,

(c) సదరు ఆక్టుయొక్క, 9 (5) (b), (c) (d), మరియు (e) సెక్షనుయొక్క నిబంధనలు (2) వ క్లాజులో చెప్పబడిన సందర్భములో వర్తించకూడదు అట్టి సందర్భములో ఆ పంచాయతీ కోర్టుయొక్క ప్రెసిడెంటు దాని సమావేశములకు అధ్యక్షత వహించవలెను ఆయన ఏ సమావేశమునకైనను హాజరు కాని పక్షమున హాజరుగానుండు సభ్యులు ఆ సమావేశముయొక్క కార్యముల నిమిత్తము తమలోనుండి ఒకరిని ప్రెసిడెంటుగా ఎన్నుకొనవలెను ,

(d) సదరు ఆక్టుయొక్క 13 వ సెక్షనుయొక్క నిబంధనలు "ఏబది రూపాయల మొత్తము" అను మాటలకు బదులుగా "వందరూపాయల మొత్తము" అను మాటను ఉంచబడిననట్లు అట్లు అర్థము చేసికొనవలెను ,

(5) ప్రభుత్వమువారు ప్రకటనద్వారా, ఈ సెక్షను క్రింద స్థాపించబడిన ఏ పంచాయతీ కోర్టుకైన సదరు ఆక్టులో నిబంధింపబడని ఏ సివిలు లేక క్రిమినల్ విచారణాధికారమునైన ఇయ్యవచ్చును

సె 133 1908 వ సం॥పు ఇండియాదేశపు రిజిస్ట్రేషను ఆక్టులో, ఏదియున్నను దానితో నిమిత్తములేకుండ ఇన్‌స్పెక్టరు-జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషన్, గవర్నమెంటువారి పై అధికారమునకు లోబడి—

(a) స్టాంపు డ్యూటీ లేక రిజిస్ట్రేషను రుసుమునుండి మినహాయింపబడిన అన్ని లేక ఏదైనా దస్తావేజుల సందర్భములోను మరియు

(b) ఈ ఆక్టుకింద్ర చేయబడిన విధులచే అశాశ్వతమైన స్వభావముగల దస్తావేజులుగా విభజింపబడిన అన్ని లేక ఏ దస్తావేజుల సందర్భములోనైన,

ఆ యాక్టు క్రింద సబు రిజిస్ట్రారుయొక్క అధికారములను చెలాయించుటకు పనులను చేయుటకు ఏ పంచాయతీ విచారణాధికారములోపల ఆ యాక్టు కింద వ్యవహరించు సబు రిజిస్ట్రారు ఆఫీసు లేకుండునో అట్టి ఏ పంచాయతీయొక్కయైన కార్యనిర్వాహకోద్యోగికి ఉత్తరువుమూలముగా అధికారము నివ్వవచ్చును.

133 వ సెక్షను క్రింద విధులు
(జి ఒ నెం 520, ఎల్ ఎ తేదీ 24-3-1951)

విధి

అశాశ్వతమైన స్వభావముగల దస్తావేజులు

1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టుయొక్క 133 (b) వ సెక్షనయొక్క కార్యముల నిమిత్తము క్రింది షెడ్యూలులో నిర్దేశింపబడిన దస్తావేజులు అశాశ్వతమైన స్వభావముగల దస్తావేజులుగా ఇందుమూలముగా విభజింపబడినవి అయితే ఆయా సందర్భమునకు తగినట్లు దస్తావేజులో తెలుపబడిన ప్రతిఫలము లేక విలువ నూఱు రూపాయలకు మించకూడదు —

షెడ్యూలు

(i) పైకము లేక చరాస్తియొక్క చెల్లు చీటి లేక రసీదు.

(ii) అఫిడవిట్లు

(iii) చరాస్తిని తాకట్టు పెట్టుటకు లేక కుదువ బెట్టుటకు ఒడంబడిక

(iv) పద్దు౹లో చెప్పబడినవి కానట్టి ఇతర దస్తావేజులు

(v) వ్యవసాయ కార్యములకొరకు ఏ కాల పరిమితికైనను వ్రాయబడిన గుత్తలును ముచ్చిలికలును

(vi) 1883 వ సం॥పు భూమి అభివృద్ధి ఋణముల ఆక్టు క్రిందను, 1884 వ సం॥పు వ్యవసాయదారుల ఋణముల ఆక్టు క్రిందను సహకార సంఘముల లేక భూమి తనఖా బ్యాంకులవలన లేక పేరిట వ్రాసి ఈయబడిన బాండ్లు, తనఖాలు మరియు అదేవిధమైన ఇతర అయివేజులు,

(vii) పంటయొక్క తనఖా

(viii) ప్రామిసరీ నోటు

(ix) ఉద్యోగ ధర్మమును క్రమముగా నెరవేర్చుటకు లేక పైకమును సరిగా లెక్కచెప్పుటకు ప్రభుత్వ ఉద్యోగులు వ్రాసియిచ్చు సెక్యూరిటీ మార్టిగేజిలు

(x) (v) వ పద్దులో చెప్పబడిన గుత్తలను వదలుకొను లేక పరివర్తనచేయు పత్రములు

సె 134. 1933 వ సం॥పు మదరాసు వ్యాపారమున కనువగు ఫలసాయముల మార్కెటుల ఆక్టుయొక్క 11 వ సెక్షనులో (2) వ సబు సెక్షను తరువాత ఈ క్రింది సబు సెక్షనును చేర్చవలెను అదేదనగా —

"(3) 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టుయొక్క 2 వ సెక్షనులో నిర్వచించబడిన ఒక గ్రామముగానుండు ప్రకటించబడిన ప్రదేశము యొక్క ఏ భాగములోనైన క్రయవిక్రయము చేయబడువ్యాపారమున కనువగు ఫలసాయము లేక ఫలసాయములమీాద (1) వ సబు సెక్షనుక్రింద విధింపబడు రుసుమునుండి

నిర్ణయింపబడగల దామాషాను సంబంధించిన పంచాయతీకి మార్కెటు కమిటీ చెల్లించవలెను ''

సంపాదకుని సూచిక

మద్రాసు వ్యాపారపంటల యాక్టు 1933, యొక్క 11 (3) వ సెక్షను క్రింద విధులు యింకను చేయబడలేదు.

సె 135 1939 వ సం॥పు మదరాసు జనసామాన్యముయొక్క ఆరోగ్యమును గురించిన ఆక్టులో ఈ క్రింది పర్యవసానరూపమైన సవరణలను చేయవలెను, అవేవనగా —

(1) 3 వ సెక్షనుయొక్క (8) వ క్లాజులో "ప్రెసిడెంటు" అను మాట తర్వాత "కార్యనిర్వాహకోద్యోగి" అను మాటలనుంచవలెను "1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టు" అను అంకెలకును మాటలకు తర్వాత వచ్చు "లేదా" అను మాటను విడిచిపెట్టవలెను, మరిన్ని "అనుసరించి" అను మాటలకు పూర్వము "లేక 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టు" అను అంకెలను మాటలను ఉంచవలెను ,

(11) అదే సెక్షనుయొక్క (9) వ క్లాజులో ఆయా సందర్భమునకు తగినట్లు 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టు, లేక 1920 వ సం॥పు మదరాసు లోకలు బోర్డుల ఆక్టు" అను మాటలకును అంకెలకును బదులుగా "ఆయా సందర్భమునకు తగినట్లు, 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టు, 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు బోర్డుల ఆక్టు లేక 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టు" అను మాటలను అంకెలను ఉంచవలెను ,

(111) అదే సెక్షనుయొక్క (20) వ క్లాజులో, (c) సబు క్లాజులోని "ఒక పంచాయతీయొక్క" అను మాటలకు పూర్వము "1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టు ననుసరించి ఏర్పాటుచేయబడిన" అను అంకెలను మాటలను ఉంచవలెను , మరిన్ని (d) సబుక్లాజులోని "ఒక పంచాయతీ" అను మాటలకు బదులుగా "అట్టి పంచాయతీ" అను మాటల నుంచవలెను

(iv) 16 వ సెక్షనులో "1918వ సం॥పు మదరాసు కర్తీఆపుదల ఆక్టులోను," అను అంకెలకును మాటలకును పూర్వము "1950 వ సం॥పు మదరాసు గ్రామపంచాయతీల ఆక్టులోను" అను అంకెలను మాటలను ఉంచవలెను ,

(v) 133 వ సెక్షనులో (d) క్లాజు చివరనుండు "మరిన్ని" అనుమాటను విడిచిపెట్టవలెను , మరిన్ని (c) క్లాజు తరువాత ఈ క్రింది క్లాజును చేర్చవలెను, అదేదనగా —

"(d) స్థానిక అధికార వర్గము, 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టు ననుసరించి ఏర్పాటు చేయబడిన ఒక పంచాయతీగానుండు సందర్భములో, ఆ యాక్టుయొక్క 114 వ సెక్షను" ,

(vi) 140 వ సెక్షను, (2) సబు సెక్షను (b) క్లాజులో (iii) వ సబుక్లాజు తరువాత ఈ క్రింది సబుక్లాజు నుంచవలెను అదేదనగా —

"(iii–a) 1950 వ సం॥పు మదరాసు గ్రామపంచాయతీల ఆక్టుయొక్క 115 వ సెక్షనుతో దానికి చెందిన 1 వ, 2 వ షెడ్యూళ్ళతో చదువబడినట్లుండు ఆ ఆక్టుయొక్క 79, 81, 82, 84, 85, 87, 88, 90 నుండి 92 వరకు మరియు 123 వ సెక్షనులు "

సె 136 1920 వ సం॥పు మదరాసు లోకల్ బోర్డుల ఆక్టు iv వ షెడ్యూలులో తెలుపబడిన విధముగా సవరింపబడవలెను

సె 137 ఈ ఆక్టులోగాని, 1920 వ సం॥పు మదరాసు జిల్లా బోర్డుల ఆక్టులోగాని, ఇందుకు విరోధముగా ఒక ఉద్దేశము లేని సందర్భములోను, గవర్నమెంటు వారు ఇతరవిధముగా ఆజ్ఞాపించిననే తప్ప, ఈ ఆక్టు ప్రారంభమునందు ఈ రాజ్యములో, అమలునందున్న ఏదైన చట్టము లేక విధిలో, లోకల్ బోర్డులకు చేయబడిన ఏ సూచనయైనను, జిల్లాబోర్డులకు, పంచాయతీలకు చేయబడిన సూచనలుగా భావింపబడవలెను మరియు ఏ చట్టము లేక విధిలోనైన 1920 వ సం॥పు మదరాసు లోకల్ బోర్డు ఆక్టుకు చేయబడిన ఏ సూచనయైనను, 1920 వ సం॥పు మదరాసు జిల్లాబోర్డుల ఆక్టుకును,

1950 వ సం॥పు మదరాసు గ్రామపంచాయతీల ఆక్టుకును చేయబడిన సూచనగా భావించబడవలెను

సె 138 ఈ ఆక్టుయొక్క నిబంధనలను, మొదట అమలు జరుపుటలో లేక ఈ ఆక్టు ప్రారంభమునకు తరువాత ఏ పంచాయతీనైనను, మొదట పునర్నిర్మాణముచేయు, లేక నిర్మాణముచేయు సందర్భములో, ఏదైన చిక్కు కలిగిన పక్షమున, గవర్నమెంటు వారు, సందర్భానుసారముగా ఈ చిక్కును తొలగించు నిమిత్తము వారు అవసరమని తలంచగల దేనినైనను, ఉత్తరువుద్వారా చేయ వచ్చును.

## 1 వ షెడ్యూలు—సాధారణమైన అపరాధములు

[115 (1) వ సెక్షనును చూడుడు ]

| సెక్షను | సబు సెక్షను లేదా క్లాజు | విషయము | విధింపబడగల జుల్మానా |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| 79 | (a) | పబ్లికు రోడ్డులోగాని దానిమీద గాని చట్ట విరుద్ధముగా గోడను కట్టుట లేదా కంచె వగైరాను వేయుట, | వంద రూపాయలు |
| 79 | (b) | పబ్లికు రోడ్డులో లేదా రోడ్డుమీద చట్ట విరుద్ధముగా రంధ్రమును చేయుట లేదా పదార్థముంచుట, | యాభై రూపాయలు |
| 79 | (c) | పబ్లికురోడ్డు వగైరా సమీపమున ఎట్టి స్థలమందైన చట్ట విరుద్ధముగా రాళ్ళను త్రవ్వుట | డిటో |
| 79 | (d) | మురుగుకాలువమీద చట్టవిరుద్ధముగా కట్టడము కట్టుట | రెండు వందల రూపాయలు |
| 79 | (e) | పంచాయతీ వశమందుండు ఎట్టిపబ్లికు రోడ్డులోగాని ఇతర ఆస్తిలోగాని అనుమతి లేకుండ చెట్లను నాటుట | డిటో. |

| రూల్ | సబు సెక్షను లేదా క్లాజు. | విషయము. | విధింపబడగల జుల్మానా. |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| 79 | (f) | పంచాయతీ వశమందుండు పబ్లికు రోడ్లులో లేదా ఇతర ఆస్తిలో లేక 60 వ లేక 61 వ సెక్షను క్రింద దేని ఉపయోగము దానిచే క్రమ పరుచబడునో అట్టి పోరంబోకు లేక భూమిమీద పెరుగు చెట్లను అనుమతిలేక కొట్టుట మొదలైనది | రెండు వందల రూపాయలు |
| 81 | (1) | 81 వ సెక్షనుకు విరుద్ధముగా ఒక ఖానిగీ మార్కెటును తెరచుట లేదా తెరచియుంచుట | ఐదు వందల రూపాయలు |
| 82 | (3) | సర్టిఫికేటు లేకుండ ఖానిగీ మార్కెటులో రుసుములను విధించుట | వంద రూపాయలు |
| 84 | ,, | ఎట్టి జంతువునుగాని వస్తువునుగాని అనుమతిలేకుండా ఒక పబ్లికు లేదా ప్రైవేటు మార్కెటులో విక్రయము చేయుట లేదా విక్రయమునకు బహిరంగముగానుంచుట | ఇరువది రూపాయలు. |
| 85 | ,, | నిషేధింపబడిన తరువాతగాని లైసెన్సు లేకుండాగాని రెగ్యులేషనులకు వ్యతిరేకముగాగాని పబ్లికు రోడ్లలో లేదా స్థలములలో వస్తువులను విక్రయించుట వగైరా | పది రూపాయలు. |
| 87 | (b) | నిషేధింపబడిన దూరములో ఏదేని పబ్లికు స్థలమును లేక రోడ్డు ప్రక్క స్థలమును, దిగుమతి స్థలముగాగాని, నిలుచు స్థలముగాగాని బండ్ల స్థలముగాని ఉపయోగించుట | ఏబది రూపాయలు |
| 88 | (1) | లైసెన్సు లేకుండా లేదా లైసెన్సుకు విరుద్ధముగా ఒక క్రొత్త ప్రైవేటు బండ్ల స్థలమును తెరచుట లేదా ఒక ప్రైవేటు బండ్ల స్థలమును తెరచియుంచుటను జరిగించుచుండుట | రెండు వందల రూపాయలు |

| సెక్షను | సబు సెక్షను లేదా క్లాజు | విషయము | విధింపబడగల జుల్మానా |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| 90 | (a) | విధులకు వ్యతిరేకముగా పబ్లికు పశువధ శాలలకు వెలుపల జంతువులను వధించుట, ముక్కలుగా నరుకుట లేదా చర్మము తీయుట వగైరా | రెండు వందల రూపాయలు |
| 90 | (b) | లైసెన్సు లేకుండా లేదా లైసెన్సుకు విరుద్ధముగా విక్రయించుటకు జంతువులను వధించుట | ఇరువది రూపాయలు |
| 91 | ,, | లైసెన్సు లేకుండా లేదా లైసెన్సుకు విరుద్ధముగా ఒక స్థలమును నిర్ణయింపబడిన ఎట్టి కార్యముకు కొరకు గాని ఉపయోగించుట | వంద రూపాయలు |
| 92 | ,, | ఫ్యాక్టొరీ, వర్కు షాపు (కార్ఖానా) వగైరాను చట్ట విరుద్ధముగా నిర్మించుట | వేయి రూపాయలు |
| 95 | (2) | కట్టడములకు వేసియున్న అంకెలను అన్యాయముగా నాశనము చేయుట | ఐదు రూపాయలు |
| 95 | (3) | అంకెను తిరిగి వేయుట్లు కోరినపుడు అట్లు చేయుటకు తప్పిపోవుట | ఇరువది రూపాయలు |
| 123 | ,, | ఒక పబ్లికు రోడ్డు, మార్కెట్టు బావి, చెరువు వగైరాను ఉపయోగించుటలో లేదా అనుభవించుటలో ఒక మనిషిని ఆటంక పెట్టుట | వంద రూపాయలు |

2 వ షెడ్యూలు—విడువకుండజరుగు ఉల్లంఘనలకు శిక్షలు,

[115 (2) వ సెక్షనును చూడుడు ]

| | | | |
|---|---|---|---|
| 79 | (a) | పబ్లికు రోడ్డులోగాని దానిమీదగాని చట్ట విరుద్ధముగా గోడను కట్టుట లేదా కంచె వగైరాను నిర్మించుట | ఇరువది రూపాయలు |
| 79 | (b) | పబ్లికు రోడ్డులో లేదా రోడ్డమీద చట్ట విరుద్ధముగా రంధ్రములు చేయుట లేదా పదార్థము నుంచుట | పది రూపాయలు |

| | | | |
|---|---|---|---|
| 79 | (c) | పబ్లికు రోడ్డు వగైరా సమీపమున ఎట్టి స్థలమందైన చట్ట విరుద్ధముగా రాళ్ళను త్రవ్వుట. | పది రూపాయలు |
| 79 | (d) | మురుగు కాలువమీద చట్ట విరుద్ధముగా కట్టడమును కట్టుట | ఏబది రూపాయలు |
| 81 | (1) | 81 వ సెక్షనుకు విరుద్ధముగా ఒక ఖానిగీ మార్కెటును తెరచియుంచుట | వంద రూపాయలు. |
| 82 | (3) | సర్టిఫికేటు లేకుండా ఒక ఖానిగీ మార్కెటులో రుసుములను విధించుట | ఏబది రూపాయలు |
| 84 | ,, | ఎట్టి జంతువునుగాని వస్తువునుగాని అనుమతి లేకుండా ఒక పబ్లికు లేదా ప్రైవేటు మార్కెట్టులో విక్రయము చేయుట లేదా విక్రయమునకు బహిరంగ పరుచుట | పది రూపాయలు. |
| 88 | (1) | లైసెన్సు లేకుండా లేక లైసెన్సుకు విరుద్ధముగా ఒక ఖానిగీ బండ్ల స్థలమును తెరచియుండుట, | ఇరువది రూపాయలు |
| 91 | ,, | లైసెన్సు లేకుండా లేదా లైసెన్సుకు విరుద్ధముగా ఒక స్థలమును నిర్ణయింపబడిన ఎట్టి కార్యముకొరకుగాని ఉపయోగించుట | డిటో. |
| 92 | ,, | ఫ్యాక్టొరీ, వర్కుషాపు (ఖార్ఖానా) వగైరాను చట్ట విరుద్ధముగా నిర్మించుట | వంద రూపాయలు |

## (II) వ షెడ్యూలు—తాత్కాలికపు నిబంధనలు

### (131 వ సెక్షనును చూడుడు)

1. ఈ విధులలో "పాత ఆక్టు" అనగా 1920 వ సం॥పు మదరాసు లోకల్ బోర్డుల ఆక్టు అనియు, "పంచాయతీ" అనగా పాత ఆక్టు ననుసరించి ఏర్పాటు చేయబడినట్టిన్ని ఈ ఆక్టు ప్రారంభమగునప్పుడు ఉన్నట్టిన్ని పంచాయతీ అని అర్థము

2 ఈయాక్టు ప్రారంభమగునప్పుడు పాత ఆక్టు ననుసరించి ఒక గ్రామముగానుండు ప్రతిస్థానిక ప్రదేశమును, ఈయాక్టు ననుసరించి ఒక గ్రామముగా ప్రకటింపబడినట్లు భావింపబడవలెను,

మరిన్ని ప్రతి పంచాయతీయును ఈ యాక్టు ననుసరించి ఏర్పాటు చేయబడినట్లు భావింపబడవలెను,

'అయితే పాత ఆక్టుక్రింద ఒక గ్రామములో, అయిదు వందలు లేక ఎక్కువ జన సంఖ్యయుండి అట్టి రెవిన్యూగ్రామమును మినహాయించిన తరువాత గ్రామముయొక్క జ.సంఖ్య అయిదువందల కంటె తక్కువకాని ఏ రెవిన్యూ గ్రామమైన చేరియుండు విషయమున, ఇన్‌స్పెక్టరు ఈఆక్టుప్రారంభమైనతరువాత సాధ్యమైనంత త్వరలో, అట్టి రెవిన్యూ గ్రామమును ఆ గ్రామమునుండి మినహాయించవలెను మరియు గ్రామములోచేరియున్న రెవిన్యూ గ్రామములు సమీపములో నుండుటనుబట్టి అట్లుచేయుట యుక్తముకాదని ఆయన తలచిననేతప్ప, దాని 3 వ *సెక్షనుయొక్క నిబంధనలననుసరించి ఈ ఆక్టుయొక్క కార్యముల నిమిత్తము దాని నొక గ్రామముగా ప్రసిద్ధపరుచవలెను

3 పాత ఆక్టు క్రింద నిర్ణయింపబడి ఈ ఆక్టు ప్రారంభము నందు అమలులోనున్న పంచాయతీ సభ్యుల మొత్తము సంఖ్య ఈ ఆక్టుక్రింద దానియొక్క ఎన్నుకొనబడిన మెంబర్ల మొత్తముసంఖ్యగా భావింపబడవలెను,

అయితే పాత ఆక్టుక్రింద నిర్ణయింపబడిన పంచాయతీ మెంబర్ల మొత్తము సంఖ్య పదునైదుకు పైబడియున్న విషయమున ఈఆక్టుక్రింద దానియొక్క ఎన్నుకొనబడిన సభ్యుల మొత్తము సంఖ్య పదునైదుగ భావించబడవలెను

4 (1) ఈ ఆక్టుయొక్క ప్రారంభమునందు ఉద్యోగమును కలిగియున్న ఒక పంచాయతీ సభ్యుడు (దాని ప్రెశిడెంటు మరియు ఏ గ్రామాధికారిగాని, మినహాయించి తదితర) ఈ ఆక్టుక్రింద పంచాయతీయొక్క ఎన్నుకొనబడిన మెంబర్లుగా భావింపబడ వలెను అట్టి సభ్యులు ప్రభుత్వమువారు ప్రకటనల ద్వారా ఈ విషయమున నిర్ణయించగల తేదీవరకు లేక అట్టి ఏ తేదీనిగాని నిర్ణయించని సందర్భములో, ఈ ఆక్టు అమలులోనికి వచ్చియుండని యెడల వారి ఉద్యోగ కాలపరిమితి అంత్యమైపోయి యుండగల తేదీవరకు ఉద్యోగములో ఉండవలెను

---

* ఈ ప్రొవైసో, ఆంధ్ర ఆక్టు 18 వ శెక్షనుక్రింద తగ్గించబడినది

(2) ఈ ఆక్టు ప్రారంభమునందు ఒక పంచాయతీ ప్రెసిడెంటుగా నుండు దానియొక్క సభ్యుడు ఈ ఆక్టు క్రింద పంచాయతీ యొక్క ఉద్యోగ రీత్యా సభ్యుడుగా భావించబడవలెను

(3) ఈ ఆక్టు ప్రారంభమునందు పంచాయతీ సభ్యుడుగా నుండు ఒక గ్రామాధిపతి అట్టి సభ్యుడుగా ఉద్యోగమును కలిగి యుండకూడదు

5 (1) పాత ఆక్టు క్రింద షెడ్యూలు దాఖలా జాతులకు చెందినవారికి స్థానములు ప్రత్యేకింపబడి ఈ ఆక్టు ప్రారంభము నందు అమలులోనుండిన, ఈ ఆక్టు క్రింద ప్రత్యేకింపబడినట్లు భావింపబడవలెను

(2) పాత ఆక్టు క్రింద ఏ ఇతర జాతికైనను చెందిన మనుష్యులకు స్థానములను ప్రత్యేకించుట, ఈ ఆక్టు ప్రారంభము నుండి అమలు కలిగియుండకూడదు అయితే దీనిలోనున్నదేదియు, అట్లు ప్రత్యేకించబడిన ఒక స్థానమునకు ఎన్నుకొనబడి ఈ ఆక్టు ప్రారంభమునందు ఉద్యోగమును కలిగియుండు ఒక సభ్యుని ఉద్యోగ కాలపరిమితిని బాధించకూడదు

6 (1) పాత ఆక్టు క్రింద చేయబడి ఈ ఆక్టు ప్రారంభము నందు అమలులోనుండు బాపతు ఒక గ్రామమును వార్డులుగాచేయు ఏ విభజనముగాని ఈ ఆక్టు క్రింద చేయుబడినట్లు భావింపబడవలెను ,

అయితే అట్టివిభజన ఈ యాక్టుయొక్క 9 వ సెక్షనుయొక్క నిబంధనలకు అనుగుణముగాలేని విషయమున, ఇన్‌స్పెక్టరు, ఈ ఆక్టు ప్రారంభమైనతరువాత సాధ్యమైనంత త్వరలో, ఆ నిబంధనల కనుగుణముగా సదరు గ్రామమును మరల విభజించవలెను

(2) ఈ ఆక్టుయొక్క 9 వ సెక్షను తాలూకు నిబంధనల క్రింద ఒక గ్రామమును వార్డులుగా విభజింప వలసియుండి, ఈ ఆక్టు ప్రారంభమునకు పూర్వము అట్లు విభజింప బడనిపక్షమున ఇన్‌స్పెక్టరు అట్లు ప్రారంభమైన తర్వాత సాధ్యమైనంత త్వరలో ఆ నిబంధనల కనుగుణముగా ఆ గ్రామమును వార్డులుగా విభజించవలెను.

(3) ఇన్‌స్పెక్టరు ఈ యాక్టు ప్రారంభమైన తర్వాత సాధ్యమైనంత త్వరలో 4 వ విధి (1) వ ఉపవిధి క్రింద ఎన్నుకోనబడిన సభ్యులుగా భావింపబడిన వారిలో ప్రతి సభ్యుడు ఏ వార్డుకు ప్రతినిధిగా భావింపబడవలెనో దానిని నిర్ణయించవలెను

7 ఈ యాక్టు ప్రారంభమునందు ఉద్యోగము ప్రస్తుతము డు ప్రెసిడెంటు కలిగియున్న ఒక పంచాయతీయొక్క ప్రెసిడెంటును వైసు-ప్రెసిడెంటును, దానియొక్క నిబంధనలకు లోబడి, 4 వ విధి (1) వ ఉపవిధిలో చెప్పబడిన తేదీ వరకు అట్టి ప్రెసిడెంటుగా లేదా వైసు-ప్రెసిడెంటుగా ఉద్యోగమును కలిగియుండవలెను

8 (1) ఈ యాక్టు ప్రారంభమగునప్పుడు ఉన్నట్టి లేదా 4 వ విధి (1) వ ఉపవిధిలో చెప్పబడిన తేదీకి పూర్వము కలుగునట్టి ఒక పంచాయతీయొక్క ప్రెసిడెంటు లేదా వైసు-ప్రెసిడెంటు ఉద్యోగములో ఎట్టి ఖాళీగాని, ఈ ఆక్టుయొక్క నిబంధనల క్రింద ఎన్నిక మూలమున భర్తీచేయబడవలెను

(2) ఒక పంచాయతీయొక్క ఎన్నుకోనబడిన మెంబరు ఉద్యోగములో సంభవించిన అట్టి ఏఖాళీగాని ఈ యాక్టుయొక్క నిబంధనల ననుసరించే ఎన్నిక మూలమున భర్తీచేయబడవలెను

(3) (1) వ లేదా (2) వ ఉపవిధి ననుసరించి ఒక పంచాయతీయొక్క ప్రెసిడెంటుగా, వైసు-ప్రెసిడెంటుగా లేదా మెంబరుగా ఎన్ను కోనబడిన ఏ మనిషిగాని 4 విధియొక్క (1) వ ఉపవిధిలో చెప్పబడిన తేదీ వరకు మాత్రమే ఉద్యోగమును కలిగియుండవలెను

వివరణము — ఈ విధియొక్క కార్యము నిమిత్తము—

(1) ఈ ఆక్టుయొక్క ప్రారంభమునందు ఒక పంచాయతీయొక్క ఎన్నుకోనబడిన సభ్యుడుగా వుద్యోగమును కలిగియున్న ఒక మనిషి 4 వ విధియొక్క (2) వ ఉపవిధి క్రింద దానియొక్క వుద్యోగరీత్యా సభ్యుడైన పక్షమున, ఎన్నుకోనబడిన మెంబరుగా నుండు అతని స్థానము, పాత ఆక్టు క్రింద పంచాయతీకి నిర్ణయింపబడిన సభ్యుల మొత్తము సంఖ్య పదునైదుకు మించిన సంవత్సరములలోతప్ప ఈ ఆక్టు ప్రారంభమునందు ఖాళీయైనట్లు భావింపబడవలెను ,

(2) ఈ ఆక్టు ప్రారంభమునందు ఒక పంచాయతీ సభ్యుడుగా ఉద్యోగమును కలిగియున్న ఒక గ్రామాధికారియొక్క స్థానము అట్టి ప్రారంభమందు ఖాళీయైనట్లు భావింపబడవలెను

(3) ఈ ఆక్టు ప్రారంభమగుటకు పూర్వము ఏ కాలమందైన ఏ ఉద్యోగమునకు ఎట్టి మనిషిగాని ఎన్నుకొనబడలేదో అట్టి ఒక పంచాయతీ ప్రెసిడెంటుయొక్కయు వైసు-ప్రెసిడెంటుయొక్క లేదా మెంబరుయొక్క ఉద్యోగము. ఈ యాక్టు ప్రారంభమునందు ఖాళీగానున్నట్లు భావింపబడవలెను

9 పాత ఆక్టు ననుసరించి రద్దుచేయబడినట్టిన్ని లేదా నిలిపియుంచబడినట్టిన్ని ఈ యాక్టు ప్రారంభమగునప్పుడు పునర్నిర్మాణముకొరకు వేచియున్నట్టి ఏ పంచాయతీగాని, ఈ ఆక్టుయొక్క నిబంధనల ననుసరించి పునర్నిర్మాణము చేయబడవలెను

10 ఒక పంచాయతీ పాత ఆక్టు ననుసరించి మొదటిసారి ఏర్పాటుచేయబడి, ఆ యాక్టుయొక్క 240 సెక్షను ననుసరించి నియమింపబడిన ఒక స్పెషల్ ఆఫీసరు ఈ యాక్టు ప్రారంభమగునప్పుడు, అట్టి ఆఫీసరుగా ఉద్యోగమునందుండు సందర్భములో, సదరు పంచాయతీ ఈ యాక్టుయొక్క 132వ సెక్షను ననుసరించి పునర్నిర్మాణము చేయబడవలెను

11 (1) ఎట్టి పంచాయతీవలనగాని లేక దాని కొఱకుగాని ఉపయోగింపబడు, అనుభవింపబడు, లేదా కలిగియుండబడు యావత్తు ఆస్తియును, ఏ విధముగానైన నుండు అధికారములన్నియును, మరిన్ని దానికి సొంతముగానుండు, లేక దానివశమందుండు లేదా ట్రస్టుగా కలిగియుండు ఏ విధముగానైన నుండు హక్కులన్నియును, మరిన్ని చట్టసమ్మతముగా అమలులోనుండు దానిమీద గల యావత్తు బాధ్యతలును, ఈ యాక్టు ప్రారంభమగు తేదీనను మరిన్ని తేదీనుండిన్ని, ఈ విషయమున గవర్నమెంటువారు సామాన్య లేదా ప్రత్యేక ఉత్తరువు మూలముగా చేయగలట్టి ఆజ్ఞలకు లోబడిన్ని, ఈ యాక్టు ననుసరించి ఏర్పాటు చేయబడినట్లు భావించబడిన పంచాయతీకి చెందవలెను

(2) ఈ యాక్టుయొక్క ప్రారంభమందు ఒక పంచాయతీకి బాకీగా రావలసిన యావత్తు పన్నుల బాకీలును, లేదా ఒక పన్ను విషయములో రాజీ రూపముగానుండు, లేదా ఖర్చులకైన, లేదా పరిహార ద్రవ్యమునకైన, లేదా ఇతర విధముగానైనా, బాకీగా రావలసియుండు ఇతర చెల్లింపులు, ఈ యాక్టు ననుసరించి అవి ఏర్పడియున్నయెడల ఎట్లో అట్లే రాబట్టు కొనబడవచ్చును

(3) పాత ఆక్టు ననుసరించి ఎట్టి పంచాయతీచేగాని, దాని మీాదగాని, లేదా ఇతర అధికారవర్గముచేగాని దానిమీాదగాని తీసి కొనబడిన యావత్తు చర్యలు అవి ఈ యాక్టు విరుద్ధముగానుండునంత వరకు ఈ యాక్టు ననుసరించి అట్టి పంచాయతీచే లేదా అధికారవర్గ ముచే లేదా పంచాయతీ మీాదగాని అధికారవర్గముమీాదగాని ఇక ముందు కూడ జరుపబడవచ్చును

12 ఈ యాక్టుయొక్క ప్రారంభమందు ఎట్టి పంచాయతీచే గాని చట్టసమ్మతముగా విధింబడుచుండిన ఏ పన్నుగాని, సెస్సుగాని, రుసుముగాని ఈ యాక్టు ఏ సంవత్సరమున అమలులోనికి తేబడనో ఆ సంవత్సరమునకును, గవర్నమెంటువారు సామాన్య లేదా ప్రత్యేక ఉత్తరువుద్వారా ఇతర విధముగా ఆజ్ఞాపించిననేతప్ప మరిన్ని ఆజ్ఞా పించువరకు దరిమిలా సంవత్సరములకు గూడ సదరు పంచాయతీచే విధింపబడుచుండవలెను

13. ఈ యాక్టు ప్రారంభమగుటకు పూర్వము ఎట్టి అధికార వర్గముచేనైన తీసికొనబడిన ఏ చర్యగాని, అది ఈ యాక్టుకు అసం గతమైయున్న నేతప్ప, ఈ యాక్టు ననుసరించి అట్టిచర్య తీసికొనుటకు అర్హతగల అధికారవర్గము తీసికొనిన చర్యచే, సదరు అధికారవర్గము పాత ఆక్టు ననుసరించి అట్టి చర్యను తీసికొనుటకు అర్హతగల అధికార వర్గముగా నున్నను సరే లేకపోయినను సరే, రద్దు చేయబడిననేతప్ప మరిన్ని రద్దుచేయబడునంతవరకు, అట్టి అధికారవర్గముచే తీసికొనబడి నట్లు భావింపబడవలెను

## IV వ షెడ్యూలు

యిది మద్రాసు జిల్లాబోర్డుల యాక్టు, 1920, కు సంబంధించిన దగుటచేత దీనిని ముద్రించలేదు.

## సవరణయాక్టులకు తాత్కాలికపు విధాయకములు
## (నిబంధనలు)

### I మద్రాసు గ్రామ పంచాయతీల (ఆంధ్ర రెండవ సవరణ) యాక్టు, 1955

(ఆంధ్ర యాక్టు XXII ఆఫ్ 1955)

సె. 19 ప్రస్తుతమున్న గ్రామములు సక్రమముగా నిర్ణింపబడినట్లు భావించుట —

ప్రధాన యాక్టు చట్టము క్రింద, యీ యాక్టు అమలులోనికి రాకముందు, గ్రామముగా ప్రకటింపబడినట్టిగాని, లేక ప్రకటింపబడినట్లు పరిగణింపబడినట్టిగాని, ప్రతి గ్రామము యీ యాక్టుచే సవరణ చేయబడిన ప్రధాన యాక్టుక్రింద గ్రామముగా ప్రకటింపబడినట్లు పరిగణింపబడును

సె 20 పంచాయతీల నిర్మాణముగాని, పునర్నిర్మాణముగాని, యీ యాక్టుచే సవరణ చేయబడిన ప్రధానయాక్టు ననుసరించి యుండుట —

ఏదయిన నొక పంచాయతీ, యీ యాక్టు ప్రారంభము కాకముందు, ప్రధాన యాక్టుక్రింద—

(a) డిసాల్వు లేక సూపరుసీడు చేయబడినగాని, లేక

(b) ప్రప్రథమముగా నిర్మాణమయినపుడుగాని,

అట్టి ప్రారంభము నాటికి ఆ పంచాయతీ సభ్యులు పదవిలోనికి రానియెడల, అట్టి పంచాయతీ, ప్రధాన యాక్టుయొక్క 122 వ సెక్షను ప్రకారముగా, యీయాక్టుచే చేయబడిన సవరణ ననుసరించి నిర్మాణముగాని, పునర్నిర్మాణముగాని, సందర్భానుసారముగా, చేయబడవలెను

21 అప్పటికి పదవిలోనున్న అధ్యక్షుల పదవీకాలము —

(1) ఈ యాక్టు ప్రారంభము నాటికి పదవిలోనున్న అధ్యక్షుడు, యీ యాక్టుచేసిన సవరణలో*ప్రధాన యాక్టుయొక్క

---

*మద్రాసు గ్రామపంచాయతీల యాక్టు, 1950.

విధులను లోనయి, యీ యాక్టు అనుబంధములోనికి రానియెడల నే తేదీ వరకు అధ్యక్షుడుగానుండునో, నా తేదీవరకు అధ్యక్షత పదవిలో నుండును

(2) ఈ యాక్టు ప్రారంభమగు తేదీకి అధ్యక్షపదవి ఖాళీగానున్నట్టిగాని, లేక (1) వ సబు సెక్షనులో నుడువబడిన తేదీకి పూర్వము ఖాళీఅయినట్టిగాని, పంచాయతీలో, యీ యాక్టుచేసిన సవరణతో ప్రధానయాక్టుక్రింద విధాయకముల ననుసరించి ఎన్నికచే కాళీని నింపవలెను

(3) ఏ వ్యక్తి అయిన (2) వ సబు సెక్షనుక్రింద అధ్యక్షుడుగా ఎన్నిక అయినయెడల, (1) వ సబు సెక్షనులో నుడువబడిన తేదీవరకు మాత్రమే పదవిలోనుండును

(4) ఈ యాక్టు ప్రారంభముకాక పూర్వము, అధ్యక్షపదవి కెన్నడు నేవ్యక్తియు యెన్నుకొనబడనిచో, సబు సెక్షను (2) మరియు సబు సెక్షనుకు (3) లోని అవసరములకు, అధ్యక్షతపదవి ఖాళీగానున్నట్లు భావింపబడును

22 అంతరాయములను నివారించుటకు అధికారము —

ఈ యాక్టు ప్రారంభమయిన పిదప, ఏదైన పంచాయతీని పునర్నిర్మాణించుటలోగాని, లేక నిర్మాణించుటలోగాని, లేక ఇతర విధముగా నీ యాక్టులోని లేక యాక్టుచేత సవరణ చేయబడిన ప్రధాన యాక్టులోని విధులను అమలుచేయుటలోగాని, ఏదయిన అంతరాయముగాని లేక ఆటంకముగాని కలిగినయెడల, అట్టి అవకాశమునను అనుకూలముగ, రాష్ట్రప్రభుత్వము, తమ యుత్తరువు ద్వారానట్టి యాటంకమును నివృత్తిచేయుటకు అవసర చర్యతీసుకొనవచ్చును

## II మద్రాసు గ్రామపంచాయతీల (ఆంధ్ర సవరణ) యాక్టు 1956

(ఆంధ్రయాక్టు XXVII ఆఫ్ 1956)

3. కొన్ని యుత్తరవులు మొదలగువాటిని దృఢపర్చుట —

(1) ప్రధాన యాక్టులో నేదైన లోపమున్నప్పటికి లేక అందలి విధాయకములు చాలినంత మేరకు లేనప్పటికి 1-3-1956 తేదీకి, యీయాక్టు ప్రారంభమగు తేదీకి మధ్యకాలములో, ప్రభుత్వములోని హెల్తు మరియు లోకలు అడ్మినిస్ట్రేషను డిపార్టు మెంటువారు, మద్రాసు గ్రామపంచాయతీల (ఆంధ్ర రెండవ సవరణ) యాక్టు 1955 (ఆంధ్రయాక్టు XXII ఆఫ్ 1955) యొక్క 22 వ సెక్షనుక్రింద పంచాయతీ అధ్యక్షుడు సభ్యులలోనుండి ఎన్నుకొనబడుటకు అనుకూలమగునట్లు, ప్రధానయాక్టుయొక్క 6 వసెక్షను యొక్క (1) వ సెక్షనుక్రింద ప్రకటింపబడిన ప్రతిపంచాయతీ యొక్క సభ్యుల సంఖ్య ఒక్కనిచేత అధికముచేయునట్లును, మరియు ఆ పంచాయతీపై పర్యవేక్షణగల జిల్లా పంచాయతీ ఆఫీసరుగాని, లేక ఎడిషనలు జిల్లా పంచాయతీ ఆఫీసరుగాని, పై చెప్పబడిన యధిక స్థానమును తనకు యుక్తమని తోచిన వార్డునకు ప్రత్యేకించవలెననియు, ఆదేశించుచూ జారీచేసి ప్రకటించిన ఉత్తరువులు చట్టానుసారముగ నెల్లపుడును యుండునని భావింపవలయును,

(2) ప్రధాన యాక్టుయొక్క 9 వ సెక్షనులోగాని, లేక యాక్టుయొక్క యే యితర విధులలోనైన నేమి వచింపబడినప్పటికి, ఒక జిల్లా పంచాయతీ ఆఫీసరుగాని, లేక అడిషనలు జిల్లా పంచాయతీ ఆఫీసరుగాని, తనయొక్క అధికారావరణ క్రిందనున్న నేపంచాయతీ విషయములోనైన, (1) వ సబు సెక్షనులో నుడువబడిన ఆంధ్ర ప్రభుత్వ ఆదేశముల ననుసరించి, అదనపు స్థానమును ప్రత్యేకించుటయు, అట్టి ప్రత్యేకించు సందర్భములో జారీచేయబడిన ప్రతి ప్రకటనయు, మరియు అన్ని సందర్భములకొరకు, ప్రధాన యాక్టు క్రింద విధుల ననుసరించి సరియయిన అధికారిచే జారీచేయబడినట్లు పరిగణింపబడవలెను

సంపాదకుని సూచన —

అధ్యక్షుడు ఎన్నికదారులవల్ల (ఓటర్లవల్ల) ప్రత్యేకముగా కాక, పంచాయతీచే ఎన్నుకొనబడవలసినట్లు ఆంధ్ర యాక్టు (XXII) ఆఫ 1955 వలన నిర్దేశింపబడుటవల్ల,

అంగున కనుగుణ్యముగ ప్రతి పంచాయతీకి యీయబడిన అధిక సభ్యునిగూర్చి పైనుడువఁబడినది

ఆంధ్రయాక్టు (XXII) ఆఫ్ 1956 చే యాక్టుయొక్క 6 వ సెక్షనుకు చేయబడిన సవరణ పర్యవసానముగ, అదనపు స్థానము ప్రత్యేకించుటం అనవసర మయిపోయినది

# ఎనెక్సరు అనుబంధము

## 1 సెక్షను 127 (1) క్రింద లోకలు అడ్మినిస్ట్రేషను ఇనుస్పెక్టరు జనరలుకు దత్తత చేయబడిన అధికారములు.

| జి ఓ నెం రు తేది, | సెక్షను | దత్తతచేయబడిన అధికారములు |
|---|---|---|
| (1) | (2) | (3) |
| జి ఒ నెం 1118 ఎల్ ఎ' తేదీ 4—6—1951 | 5 (1) (a) | 1 వ తరగతిగా పంచాయతీలను నిర్ణయము |
| | 5 (2) | సె 5 (1) (a) క్రిందచేసిన పంచాయతీ తరగతిని మార్పుచేయుట |
| | 30 (a) | పంచాయతీ తీర్మానము న్యాయవిరుద్ధమైనదా, లేక పంచాయతీ హక్కులకు మించియున్నదా, లేక అమలు జరుపునెడల మనుష్య జీవితమునకు గాని, ఆరోగ్యమునకు లేక ప్రజాక్షేమమునకు ప్రమాదకరముగ నుండు నని, నిశ్చయించు నధికారము |
| ,, | 34 (4) | పంచాయతీ అధికారిని లేక నౌకరును (ఎగ్జిక్యూటివు ఆఫీసరుకాక) ఏదైన డిస్ట్రిక్టు బోర్డు లేక మునిసిపాలిటీ సర్వీసుకు మార్చుటకు |
| జి ఓ నెం 1118 ఎల్ ఎ, తేదీ 4-6-1951 | 48 (1) మరియు | పంచాయతీ డిసాల్వుచేసిన, పంచాయతీ హక్కు లెంతవరకూ ప్రెసిడెంటు చెలాయించవచ్చునో అని నిర్ధారణ |
| ,, | 48 (6) | డిసాల్వు, లేక సూపరుసీడు కాబడిన పంచాయతీలు పునర్నిర్మాణమున ఎన్నిక కొఱకు పంచాయతీ సభ్యుల సభ్యత్వ కాలపరిమితి నిర్ణయము. |
| ,, | 65 (5) | (1) పంచాయతీకి, పంచాయతీ కాని స్థానిక సంస్థకు, వృత్తిపన్ను విభజన |

| (1) | (2) | (3) |
|---|---|---|
| | | మరియు,<br>(ii) రెండు లేక మించిన రీజినలు ఇన్‌స్పెక్టర్ల యాజమాన్య ప్రదేశములనుండిన పంచాయతీలకు వృత్తి పన్ను విభజించుట |
| ,, | 78 | యాత్రిక స్థలములపై నధికార్లనుండి ఉత్సవ బందోబస్తునకగు ఖర్చులకుగాను విరాళము నిర్ణయించుట |
| ,, | ** 81 (2) | సె 81 (1) క్రింద ఏదైన ప్రయివేటు మార్కెటు వచ్చునా లేదా యను తీర్మానము |
| | 86 | పంచాయతీ గ్రామములో పబ్లికు లేక ప్రైవేటు మార్కెటులు, జిల్లా మార్కెట్లా పంచాయతీ మార్కెట్లా యని తీర్మానించుట, సదరు మార్కెట్లనుండి వచ్చు ఆదాయము జిల్లాబోర్డు పంచాయతీకు విభజించుట, లేక సదరు ఆదాయము నుండి విరాళ మొసంగు తీర్మానము. |
| జి ఒ నెం. 1113<br>ఎల్ ఎ<br>తేదీ 4-6-1951 | 93 (3) | సె 91 లేక సె 92 క్రింద చేసిన, లేక చేయకనున్న, చర్యవిషయమున, ఉత్తరవుల నొసంగుట |
| ,, | 106 | ప్రెసిడెంటు, లేక ఎక్జిక్యూటివు అధికారి, లేక సభ్యుని ప్రాసిక్యూషను మంజూరుచేయు నధికారము. |
| , | 130 | వివాద పరిష్కారము చేయుట—<br>(i) పంచాయతీకి, పంచాయతీ కానట్టి స్థానిక సంస్థకు గలిగిన వివాదములు; మరియు |

*ఆంధ్ర ఆక్టు XXII ఆఫ్ 1955 అమలులోనికి వచ్చిన తరువాత యీ ఐటమునకు విలువలేదు

**ఆంధ్ర ఆక్టు XXII ఆఫ్ 1955 అమలులోనికి వచ్చినప్పటి నుండి, యీ ఐటెము రద్దయినదని భావింపుడు.

